ఆధ్యాత్మిక గ్రంథ నిలయం
మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# మహా భాగవతం

## సమాజ కార్యక్రమ సమీక్ష :

భక్తి తత్త్వం ప్రబోధానికి తమ జీవితాన్ని అంకితం చేసుకున్న స్వామి కృష్ణదాస్‌జీ మ హరాజ్, తమ ఆశయ సిద్ధికి తోడ్పడే కొన్ని పవిత్ర గ్రంథాలను ప్రచురించ సంకల్పించుకున్నారు. ఆ సంకల్పంనుండి ఆవిర్భవించిందే, శ్రీమద్ భాగవత సేవా సమాజం.

శ్రీమద్ భాగవత సేవా సమాజం ద్వారా ప్రచురింపదలచిన గ్రంథాలను కూడా, స్వామిజీ, ముందుగానే నిర్ణయించారు వాటిలో...

1. శ్రీకృష్ణ లీలామృతం

2. ప్రతిపదార్థ వివరణసహితంగా
   శ్రీ విష్ణు సహస్రనామస్తోత్ర మహామంత్రం

3. నారాయణీయం
   అనే సంస్కృత గ్రంథానికి సరళ భావానువాదం

4. మహా భాగవతం

అనేవి, ప్రధానంగా ఉండాలని సూచించారు.

సమాజ ప్రచురణలన్నీ, సరళమైన భాషలో ఉండాలని, తక్కువైన ధరలకే విక్రయింపబడాలన్నదీ కూడా, స్వామిజీ నిర్ణయమే. ఆ ధ్యేయానికి కట్టుబడే, సమాజం, యింతవరకు, కార్యక్రమాన్ని కొనసాగిస్తూ ఆ నాలుగు గ్రంథాలనూ ముద్రించి ప్రచురించింది.

ముద్రిత గ్రంథాలలో, 'శ్రీకృష్ణలీలామృతం', 'విష్ణు సహస్రనామ స్తోత్రం', ప్రతులు అన్నీ ఖర్చయిపోయినై.

అది కారణంగానే, స్వామిజీ సూచనమీద, శ్రీకృష్ణ లీలామృత గ్రంథాన్ని, పూర్తిగా, మహా భాగవతంతో కలిపి, పునర్ముద్రించటం జరిగింది. కాబట్టి, యికముందు, ఆ గ్రంథాన్ని, విడిగా పునర్ముద్రణకు పంపనక్కరలేదన్నమాట; దాని మలిముద్రణ, మరో 3000 అయిందన్నమాట.

శ్రీకృష్ణ లీలామృతం, ఆ విధంగా తిరిగి ముద్రింపబడటంవల్ల వెంటనే, విష్ణు సహస్రనామస్తోత్ర మహా మంత్ర ... న్ని పున ... కు పంపాలనుకోవటం సహజం. కాని, మన ... ం, మరో ... నిర్ణయించింది.

వచ్చే శ్రావణమాసంతో, మన స్వా...కి 65 ఏళ్ళు నిండుతై. ఆ సందర్భంలో, వారి 66వ జయంతిని పురస్కరించుకుని, మహా భాగవతం మరో 6600 ప్రతులు ముద్రించి, తెలుగుతల్లికి సమర్పించుకోవాలని సంకల్పించుకుంది ఈ సత్సంకల్పానికి, స్వామిజీ ఆరాధ్యదేవత అయిన శ్రీ బాలకృష్ణ భగవానుని అనుగ్రహం పరిపూర్ణంగా లభిస్తుందనే విశ్వసిస్తున్నాం.

అలా జరిగినప్పుడే, స్వామిజీ, సంకల్పించినట్లుగా, మహా భాగవతం 10 వేల ప్రతులను ముద్రించి ప్రచురించటం, దాని ద్వారా, కనీసం లక్షమందికయినా, భక్తితత్వాన్ని ప్రబోధించటం, జరుగుతుంది. అలా జరిగేటట్టు చూడమని, మనం కూడా, భగవానుని ప్రార్థిస్తూ ఉందాం.

జై గురుదేవ్!

కె. జి. కె. రావు, బి.ఎ.,బి.ఎల్.,
గౌరవాధ్యక్షులు.

మంచాల మల్లేశం, బి.కాం.,
సమాజ గౌరవ కార్యదర్శి.

శ్రీః

# విషయసూచిక

శ్రీః

శ్రీకైవల్యపదంబు చేరుటకునై చింతించెదన్, లోక ర
క్షైకారంభకు, భక్తపాలన కళా సంరంభకున్, దానవో
ద్రేక స్తంభకు, గేళిలోలవిలస ద్దృగ్జాల సంభూత నా
నా కంజాత భవాండ కుంభకు, మహా నందాంగనా డింభకున్.

ఆదరమొప్ప మ్రొక్కెడుదు, నద్రిసుతాహృదయానురాగ సం
పాదికి, దోషభేదికి, ప్రపన్న వినోదికి, విఘ్నవల్లికా
చ్ఛేదికి, మంజువాదికి, నశేషజగజ్జన నందవేదికిన్,
మోదక ఖాదికిన్, సమద మూషకసాదికి, సుప్రసాదికిన్.

క్షోణితలంబునన్ నుదురు సోకగ మ్రొక్కి నుతింతు, సైకత
శ్రోణికి, జంచరీకచయ సుందరవేణికి, రక్షితామర
శ్రేణికి, దోయజాత భవ చిత్తవశీకరణైక వాణికిన్,
వాణికి, నక్షదామ శుక వారిజపుస్తక రమ్యపాణికిన్.

ప్రాంశు పయోదనీల తను భాసితు, నుజ్జ్వలదండధారు, బిం
గాంశు, జటాచ్ఛటాభరణు, నాగమపుంజపదార్థ తత్త్వ ని
స్సంశయకారు, గృష్ణమృగచర్మ కృతాంబర కృత్యు, భారతీ
వంశ వివర్ధనుం, ద్రిదశ వందితు, సాత్యవతేయు గొల్చెదన్.

ఓం

లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతా శోభితమున్, సువర్ణ సుమన స్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వల వృత్తంబు, మహాఫలంబు, విమల వ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్ద్విజ శ్రేయమై.

ఎయ్యది కర్మబంధములనెల్ల హరించు, విభూతికారణం
బెయ్యది, సన్మునీంద్రులకు నెల్ల గవిత్వ సమాశ్రయంబు ము
న్నెయ్యది, సర్వమంత్రముల నేలిన దెయ్యది, మోక్షలక్ష్మి రూ
పెయ్యది, దాని బల్కెద, సుహృద్యము, భాగవతాఖ్య మంత్రమున్.

భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు
శూలికైన, దమ్మిచూలికైన;
విబుధ జనుల వలన విన్నంత, గన్నంత,
దెలియవచ్చినంత దేటపఱతు.

ఓం

# మహా భాగవతం

వేద కల్పవృక్ష విగళితమై శుక
ముఖ సుధాద్రవమున మొనసియున్న
భాగవత పురాణ ఫల రసాస్వాదన
పదవి గనుడు రసిక భావవిదులు.

పరమేశ్వర సాక్షాత్కారానికి ప్రాణి పొందే ఆరాటమే, పరమ భక్తి అనిపించుకుంటుంది. ఆ భక్తి కి, ప్రతిఫలాపేక్ష అనేది ఉండదు. దాన్ని ఆశ్రయించిన ప్రాణి, ప్రాపంచిక విషయాలమీద ఆసక్తి చూపించదు. అంతేకాదు; ప్రపంచాధిపత్యం, అంతకు మించిన మహేంద్రపదవీ, తమకుతామై వరించివచ్చినా, అది లక్ష్యం చెయ్యదు.

పరమేశ్వరుని పొందటానికి, భక్తియోగ మొకటే మార్గం కాదు; జ్ఞాన కర్మ యోగాలు అనేవి కూడా ఉన్నై. అయినా, ఆ మూడింటిలోనూ, భక్తి యోగం అతిసులభమైన మార్గం.

ప్రపంచ వాసనలు పూర్తిగా వదలనివారూ, అయినా, వాటికి అధికమైన ప్రాధాన్యత నియ్యనివారూ, భక్తి యోగాభ్యాసానికి అర్హులవుతారు. ఆ విధమైన అర్హతను పొందటానికి, వయసుగాని, కులంగాని, స్థితిగాని అడ్డురావు. పరిపూర్ణమైన భక్తి కలవారు, ప్రాపంచిక విషయాలమధ్య ఉంటూకూడా, సర్వవేళలా, సర్వాంతర్యామిని స్మరిస్తూనే ఉంటారు. అలా తన్ను స్మరించేవారికి, ఆ పరాత్పరుడు, అన్ని సమయాల్లోనూ అండగా ఉండనే ఉంటాడు.

భక్తులు, తామసిక, రాజసిక, సాత్త్విక భక్తులని మూడు రకాలుగా ఉంటారు. మాయావిష్టులై, అహంభావపూరితులై, లోకాపకారకమైన కార్యాలను సాధించే నిమిత్తం కొందరూ, ఐహిక వాంఛలను సిద్ధింపచేసుకునే ఉద్దేశంతో ఇంకొందరూ, స్వర్గాది సౌఖ్యాలను ఆశించి మరికొందరూ, భగవంతుని ఆరాధిస్తారు. వారు, క్రమంగా, తామసిక, రాజసిక, సాత్త్విక భక్తు లనిపించుకుంటారు. ఆ మూడురకాల భక్తులకూ, ఏదో ఒకవిధమైన కోరిక ఉండనే ఉంటుంది. కాని, వారికి మించినవారు మరికొందరుంటారు. వారికి, ఏ కోరికా ఉండదు. పరమాత్ముని ప్రత్యక్షపరచుకోవటమే వారి పరమాశయంగా ఉంటుంది. వారినే పరమభక్తు లంటారు.

అచంచలమైన భగవద్భక్తి కలగటానికి, హృదయం పరిశుద్ధంగా ఉండాలి. హృదయ పారిశుధ్యానికి, కామక్రోధాది వాసనలు తొలగిపోవటం అవసరం. హరికథాశ్రవణం మీద ఆసక్తి ఉదయించినప్పుడే, ఆ వాసనలు తొలగిపోతై. అందుకనే, భగవద్భక్తి నభిలషించేవారు, ఎప్పుడూ, హరిలీలాభివర్ణనపట్ల అభిరుచి కలిగి ఉంటారు. అలా ఉన్నవారికి, సత్వగుణప్రధానమైన శాంతి లభిస్తుంది.

'హరి' అనే రెండక్షరాలనూ ఉచ్చరించినంతమాత్రంలోనే, పాతకాలన్నీ హరించిపోతై. హరినామ మాహాత్మ్యం అటువంటిది. అది గ్రహించటంవల్లనే, వివేకులైనవారు, హరిగుణాలను ప్రస్తుతిస్తూ ఉంటారు. హరిలీలలను అభివర్ణిస్తూ ఆకర్ణిస్తూ ఉంటారు. హరివైన శక్తి సామర్థ్యాలను ప్రశంసిస్తూ ఉంటారు. ఆవిధంగా, సర్వదా హరినే స్మరిస్తూ ఉండటంవల్ల, వారిలో సహజంగా ఉత్పన్నమైన భక్తి, దృఢతర మవుతుంది.

అటువంటి దృఢతరమైన భగవద్భక్తిని ప్రసాదించే సాధనలలో, పురాణేతిహాసాలు, ప్రముఖపాత్ర వహిస్తై. వాటిలో ప్రసిద్ధమైనదీ, ఉత్తమోత్తమ మైనదీ, శ్రీమద్భాగవతం.

### 1. హరికథా ప్రశంస :

శ్రీమద్భాగవతేతిహాసాన్ని ప్రవచించినది, భగవానుడైన వేద వ్యాస మహర్షి. ఆయన అసలు పేరు, శ్రీకృష్ణద్వైపాయనుడు. దాశరాజు పెంపుడుకూతురైన మత్స్యగంధికీ, వశిష్ఠ మహాముని పౌత్రుడైన పరాశరమహర్షికీ, ఆ మహనీయుడు జన్మించాడు.

ఒకసారి, కృష్ణద్వైపాయనుడు బదరికాశ్రమంలో ఉండగా, ప్రపంచం, ఆపైన, ఎలా ఉండేదీ, ఆయనకు, కళ్ళకు కట్టినట్టు కనిపించింది. అది, అసలు, ద్వాపరయుగాంతం. అందుకనే, ఆయన, కలియుగాన్ని గురించి ఆలోచించటం జరిగింది. కలియుగంలో, ధర్మసాంకర్యం సంభవిస్తుందనీ, మానవులు, నిస్సత్వులూ, ధైర్యశూన్యులూ, మందబుద్ధులూ, అల్పాయుష్కులూ, దుర్బలులూ అవుతారనీ, ఆయన గ్రహించాడు. అది, ఆయనలో, ఒక విధమైన ఆవేదనను రేకెత్తించింది. ఆ ఆవేదన ఫలితంగా, ఆయన, కలియుగంలోని మానవులకు, కల్యాణప్రదమైన ఏదో ఒక కార్యం చేయటానికి నిశ్చయించుకున్నాడు. ఆ నిశ్చితాభిప్రాయంతోనే, అంతవరకూ ఒకటిగా ఉన్న వేదాన్ని, నాలుగు భాగాలు చేశాడు. వాటికి, ఋగ్యజుస్సామాథర్వణాలని పేరుపెట్టాడు. అలా, వేదాలను విభజించటంవల్లనే, ఆయనకు, వేద వ్యాసుడు అన్న సార్థకనామం సిద్ధించింది.

ఆ తరువాత, ఆ నాలుగు వేదాలనూ, ఆయన, క్రమంగా, పైల, జైమిని, వైశంపాయన సుమంతు లనే శిష్యులకు బోధించాడు. పురాణేతిహాసాలన్నీ, పంచమవేదంగా పరిగణింపబడతాయని నిర్ధారించి, దాన్ని, రోమహర్షణుడనే శిష్యునకు ప్రసాదించాడు.

అప్పటికీ, వేదవ్యాసునకు, తన ఆశయం సిద్ధించినట్టు తోచలేదు. అందుకనే, వేదవచనాలను గ్రహించే అధికారం లేనివారిని ఉద్ధరించే నిమిత్తం, ఆయన, వేదసమ్మతమైన మహాభారతాన్ని రచించాడు.

ఆ మహా భారత రచనానంత రంకూడా, ఆ మహాత్ముని ఆత్మకు సంతుష్టి కలగలేదు. తను నిర్వర్తించవలసిన ధర్మం, మరేదో ఉండి ఉండాలన్న అభిప్రాయం, ఆయనను అరాటపరచ సాగింది.

అదికారణంగా కలిగిన ఆవేదనతో, ఆయన, ఒకరోజున, సరస్వతీనది ఒడ్డున కూర్చుని, తనలోతాను ఆత్మపరిశోధన కుపక్ర మించాడు. ఆ సందర్భంలోనే, ఆయన....

"నేను, నియమంతో, వేదాలన్నింటినీ చదివాను. వేదవిభాగం చేశాను. వేదార్థాన్ని మహా భారతేతిహాసరూపంలో వివరించాను. అగ్నుల నుపాసించాను. ఆర్యజన సమ్మతమైన కర్మ లన్నిటినీ ఆచరించాను. అయినా, నా ఆత్మ సంతృప్తిపడకుండాఉంది. నాకు శాంతి అనేది లేకుండాఉంది. దీనికి కారణం ఏమైఉంటుంది ?"

అని, తన్ను తాను ప్రశ్నించుకోవటం జరిగింది.

ఆయన, ఆ విధమైన జిజ్ఞాసలో ఉండగా, నారదమహర్షి, అను కోకుండా అక్కడికి వచ్చాడు. అలా వచ్చిన మహర్షి, వ్యాసుని చూసి, ఆయనలో ఏదో చెప్పరాని వేదన ఉన్నదని గ్రహించాడు. అందుకనే, ఆయన నుద్దేశించి...

'ధాతవు, భారతశ్రుతి విధాతవు, వేదపదార్థజాల వి
జ్ఞాతవు, కామముఖ్యరిపుషట్క విజేతవు, బ్రహ్మతత్త్వని
ర్ణేతవు, యోగినేతవు, వినీతుడ, నీవు చలించి, చెల్లరే,
కాతరుకైవడిన్ వగవ గారణ మేమి, పరాశరాత్మజా !'

అని అడిగాడు. అలా అడిగిన నారదునకు సమాధానంగా, వ్యాసుడు, అదే తనకు అగ్రాహ్యంగా ఉన్నదని విన్నవించుకున్నాడు. అంతేకాదు;

'నీ కెఱుగరాని ధర్మము
లోకములను లేదు, బహువిలోకివి, నీ వీ

నా కొఱత యెట్టి దంతయు
నాకున్ వివరింపుమయ్య నారద కరుణన్'

అని ప్రార్థించాడుకూడా.

అలా వ్యాసునిచేత ప్రార్థితుడై, నారదుడు, ఒక క్షణకాలం ఆలోచించాడు. ఆలోచించి, ఆయన అశాంతికి కారణమేమిటో అర్థం చేసుకున్నాడు. అందుకనే, ఆయన నుద్దేశించి...

'అంచితమైన ధర్మచయ మంతయు జెప్పితి, వందులోన నిం
చించుకగాని విష్ణుకథ లేర్పడ జెప్పవు; ధర్మముల్ ప్రపం
చించినమెచ్చునే, గుణవిశేషములెన్నినగాక; నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరి గోరి నుతింపమి నార్యపూజితా!'

అని ఉద్బోధించాడు. అంతేకాదు.

"భగవంతుని కీర్తిని, ఇంతవరకు, నువ్వు, ప్రధానంగా వర్ణించలేదు. అందుకనే, ఆయన, నీపట్ల సంతుష్టుడుకావటం జరగలేదు.

సర్వలోకారాధ్యుడైన సర్వేశ్వరుని సంతోషపరచలేని జ్ఞానం, జ్ఞానంకాదు. దానివల్ల కలిగే ప్రయోజనం కూడా ఏమీలేదు.

భగవద్భక్తి విరహితమైన జ్ఞానం వ్యర్థం. దానివల్ల, పామరుల పూజ లందుకోవటం సంభవంకావచ్చు; కాని, ప్రాజ్ఞుల ప్రశంసలకు పాత్రులుకావటం, పరమేశ్వరుని మెప్పించటం మాత్రం, అసంభవం.

మాధవుని గుణాలను స్తుతించడమే, మానవుల తపస్సుకూ, వేదాధ్యయనానికీ, యజ్ఞానుష్ఠానానికీ, సత్యవచనానికీ ఫలం. మాధవునిమీద మమకారాన్ని కలిగించుకోవటమే, మానవజీవితానికి పరమావధి.

ఆ విధమైన మమకారంతో, భక్తిరసామృతాన్ని, నువ్వు, లోకానికి పంచిపెట్టాలి. దానివల్ల, నీ ఆత్మకు శాంతీ, లోకానికి శ్రేయమూ లభిస్తై.

హరినామాన్ని స్తుతించనికావ్యం శ్రీకరం కాదు.
హరియశాన్ని కీర్తించే కావ్యం, అంచితఫలాన్ని ఇచ్చి
తీరుతుంది.

వాసుదేవుని లీలా విశేషాలను వర్ణించటంవల్లా,
ఆకర్ణించటంవల్లా, బంధవిమోచనం లభిస్తుంది. దేహాభి
మానులైనవారు, దేవదేవుని లీలావిశేషాలను వినటం
ద్వారా, ప్రాపంచిక విషయవాసనాదూరు లవుతారు.

అందుకనే, లోకకల్యాణప్రదమైన మరొక మహాకావ్య నిర్మాణానికి నువ్వు పూనుకోవాలని నేను కోరుతున్నాను.

నువ్వు మునికులంలో ప్రసిద్ధుడవు. నీవంటి మహనీయులు, విశ్వశ్రేయంకోసమే జీవిస్తారు. అందుకనే, ఆ మహాకావ్య నిర్మాణానికి నువ్వు అర్హుడవని నేను భావిస్తున్నాను.

హరిచరిత్రాలాపంవల్ల సర్వపాపాలూ హరించిపోతై.

అది గ్రహించటంవల్లనే, తపస్వులూ, సాధువులూ, హరిని భావిస్తూ, హరికీర్తిని గానంచేస్తూ, హరివైనదివ్యనామాలనుజపిస్తూ, హరిచరితల నాకర్ణిస్తూ జీవితాలు వెళ్ళదీసుకుంటారు; ధన్యులవుతారు. నువ్విప్పుడు, ఆ అవకాశాన్ని, మానవులందరకూ కలిగించాలి.

సంసారమనే సముద్రంలో మునిగితేలుతూ, కర్మ
వాంఛలమూలంగా వేదనపొందుతూ ఉండేవారికి, నారాయణ
నామకీర్తనం నావవంటిది.

యమ నియమాది యోగాలవల్ల ఆత్మను నిగ్రహించు
కోవటం సంభవమే; అయినా, కామం క్రోధం అనేవి,
అప్పుడప్పుడు, ప్రతివ్యక్తిలోనూ తలచూపుతూనే
ఉంటై. వాటివల్ల, ఆ వ్యక్తికి, అశాంతి కలుగుతూ
ఉంటుంది. ఆ అశాంతిని తొలగించుకోవటానికీ,
సుస్థిరమైన శాంతిని పొందటానికీ, వివేకులైనవారు,
శ్రీహరిచరణాలనాశ్రయిస్తారు;శ్రీహరిసేవకు తమజీవితాల
నంకితంచేసుకుంటారు.

ఆ విధమైనసేవకు మానవుల నుద్బోధించి, మానవలోకానికి శాంతిచేకూర్చేమార్గాన్నిచూపటమన్నది, మహర్షివైన నీ ధర్మం. ఆ ధర్మాన్ని నువ్వు పాలించుకోవాలనే నేను ఆశిస్తున్నాను"
అనికూడా, ఉపదేశపూర్వకంగా ఆదేశించాడు.

అదివిన్న వ్యాసునికి, అంతవరకూ తనమనసును ఆవరించిఉన్న అంధకారం తొలగిపోతున్నట్టు తోచింది. హృదయవేదన ఉపశమిస్తున్నదా అనిపించింది. అంతలో, నారదుడు, తిరిగి ఇలా అన్నాడు.

"అచ్యుతునిమీదిభక్తి అమృతంవంటిది. దాన్ని
చవిచూసినవారు త్యజించలేరు. దాన్ని త్రాగిన
కొద్దీ త్రాగాలనే అనిపిస్తూఉంటుంది. తనివిచెందట
మనేది, దానివిషయంలో, లేనేలేదు.

భగవంతునిసేవించేవారికి, భక్తిపరిపాకం లభిం
చకముందే మరణం సంభవించినా, మరుసటిజన్మలో
అయినా, అది, వారికి సిద్ధిస్తుంది."

అలా విశదపరచి, ఆ పలుకులను రుజువుపరచేనిమిత్తం,ఆయన, తన పూర్వజన్మవృత్తాంతాన్ని, ఇలా తెలియపరచాడు.

*శ్రీ నారదుని కృష్ణభక్తి :*

"నామటుకునేను, పూర్వజన్మలో, ఒక దాసీ స్త్రీకి పుట్టాను. మాతల్లి, వేదవాదులైన బ్రాహ్మణుల ఇంట్లో ఊడిగంచేస్తూ ఉండేది.

ఆరోజుల్లో, నేను, ఒకచోట, చాతుర్మాస్యదీక్షలో ఉన్న కొందరు యోగులకు సేవచేయటం జరిగింది. అప్పటికి నావయసు అయిదేళ్ళే. అయినా, ఏ విధమైన చాపల్యం లేకుండా, తోటిబాలురతో ఆట పాటలకు కూడా వెళ్ళకుండా, ఎటువంటి జంజాటం కలిగించుకోకుండా, ఆ యోగులనే, భక్తితో సేవిస్తూ ఉండేవాణ్ణి. వారి ఉచ్ఛిష్టం భుజించేవాణ్ణి. ఎండనూ వాననూ లెక్కచేయకుండా, ఎప్పుడూ, వారి సమక్షంలోనే తిరిగేవాణ్ణి. నియమప్రకారం, వారి ఆదేశాలను శిరసావహించి, వినయ విధేయతలతో వ్యవహరించేవాణ్ణి. ఆ సమయంలో...

వారల్ కృష్ణ చరిత్రముల్ నదువగా, వర్ణింపగా, బాడగా
నా రావంబు సుధారసప్రతిమమై యశ్రాంతమున్ వీనులం
దోరంబై పరిపూర్ణమైన, మది సంతోషించి, నే నంతటం
బ్రారంభించితి విష్ణుసేవ; కితరప్రారంభ దూరుండనై.

ఆవిధంగా నాకు విష్ణుసేవాభాగ్యం లభించింది. అది కారణంగా, నాలో భగవద్భక్తి జనించింది.

భగవద్భక్తి జనించగానే, మితభాషిత్వం వినయం
శ్రద్ధ ఇంద్రియనిగ్రహం అలవడతై. వాటిద్వారా,
పాపాలు, చాలావరకు క్షీణించిపోతై.

ఆ అదృష్టం, నాకుకూడా కలిగినట్టు, ఆ మహానుభావులు గ్రహించారు. గ్రహించి, వారికి సహజమైన వాత్సల్యంతో, ఈశ్వరరహస్యాన్ని నాకు ఉపదేశించారు. ఆ ఉపదేశప్రభావంవల్ల, నేను, వాసుదేవుని మాయా విశేషం తెలుసుకోగలిగాను. అది కారణంగానే...

'భగవదర్పణబుద్ధితో చేయబడే కర్మలు భక్తి యోగంతో కూడుకున్న జ్ఞానాన్ని ప్రసాదిస్తై. దాని మూలంగా, ఆధ్యాత్మికాది తాపత్రయం నిర్మూలమవుతుంది.

సంసారకారణమైన కర్మలను, భగవదర్పణబుద్ధితో నిర్వర్తిస్తే, హరిసేవ చేసిన ఫలం లభిస్తుంది; సంసార నివృత్తి కలుగుతుంది'

అన్న జ్ఞానం నాకు కలిగింది. దాని ద్వారా, నాలో, వైరాగ్యం జనించింది. కాని, దేశ కాల పరిస్థితులు తెలియని ఆ వయస్సులో, ఇల్లు వదలిపోవటం ఉచితం కాదని, నాలో నాకే అనిపించింది అదీ కాక, కంటిని రెప్పమాదిరి నన్ను కాపాడుతూఉన్న నా కన్నతల్లిని విడిచిపోవటం సమంజసం కాదన్న అభిప్రాయంకూడా, నా కప్పుడు కలిగింది. అది కారణంగానే, నేను, నలుగురి మధ్యా ఉంటూకూడా, ఏ విధమైన మోహానికీ కట్టుబడకుండా కాలం వెళ్ళదీసుకోవటం అభ్యసించసాగాను. అంతలో, నా తల్లి మరణించటం సంభవించింది. దాంతో, అంతవరకూ ఈ లోకంలో నాకున్న బంధం కాస్తా తెగిపోయినట్టనిపించింది. ఆ వెంటనే, నేను, ఇల్లు వదలి, దేశాలన్నీ తిరుగుతూ, ఉత్తరదిక్కుగా వెళ్ళాను. అలా వెళ్ళి వెళ్ళి, ఒక ఘోరారణ్యంలో ప్రవేశించాను. ఆ తరువాత, అక్కడ దొరికిన ఆకులూ అలాలూ తింటూ, ఏ సెలయేటి నీటితోనో దాహం తీర్చుకుంటూ, ఈ చెట్టుక్రిందా, ఆ పుట్ట ప్రక్కనా విశ్రమిస్తూ, దీనజన బాంధవుడే దిక్కుగా, సర్వేశ్వరుడే సర్వస్వంగా, కొంతకాలం గడిపాను.

ఆ సమయంలో, ఒక రోజున, నేనొక అశ్వత్థవృక్షం క్రింద కూర్చుని, పూర్వం, యోగులు ఉపదేశించినవిధంగా, పరమాత్మ ధ్యానం ప్రారంభించాను. అలా ధ్యానం చేసుకుంటూ ఉండగా, నా కళ్ళవెంట ఆనందాశ్రువులు రాలినై. నాఒళ్ళు పులకరించింది. నా మనసులో, శ్రీహరి

పొడగట్టాడు. అప్పుడు, నేను, అమితమైన ఆనందాన్ని అనుభవించాను. అంతలో, ఆ మనోహరమూర్తి అదృశ్యుడైనాడు. అది గ్రహించిన నాలో అంతులేని ఆవేదన కలిగింది. ఆయనను తిరిగి ఎలా చూస్తానా అన్న ఆతురత అధికమయింది. అంతే. తిరిగి ధ్యాననిష్ఠలో కూర్చున్నాను. అంతలో, నా కొక మృదు మధుర వాణి వినిపించింది. అది, నా శోకాన్ని ఉపశమంపచేయటానికీ, నాకు మనశ్శాంతిని కలిగించటానికీ, శ్రీహరి అందజేసిన సందేశంగా నేను భావించాను. ఆ వాణి, నన్నుద్దేశించి... "నాయనా! నువ్వు, న న్నీ జన్మలో తిరిగి చూడలేవు. నామీద నీకున్న భక్తి దృఢతరం కావటానికే నా రూపాన్ని నీకు చూపించాను.

> భక్తులకు, క్రమక్రమంగా, కామవాసనలన్నీ తొలగి
> పోతై. కామవాసనాదూరులైనవారు మాత్రమే
> అరిషడ్వర్గాలను జయించగలుగుతారు;కర్మ నిర్మూలనం
> చేసుకోగలుగుతారు.

వారే మహాయోగులు. వారికే,నేను,దర్శనీయుడ నవుతాను. నీమటుకు నువ్వు, నన్ను దర్శించుకోవటంవల్ల, దోషరహితుడవైనావు. వచ్చే జన్మలో, నువ్వు నా భక్తుడవై జన్మిస్తావు" అని పలికింది

ఆ పలుకులు నాకు అమితమైన సంతృప్తిని కలిగించినై. ఆ క్షణంనుంచీ, నేను, ఆయన చెప్పిన జన్మాంతరం కోసం ఎదురు చూడటం మొదలుపెట్టాను. దేనిమీదా మమకారం లేకుండా, నిర్మల చిత్తంతో ప్రవర్తించసాగాను. అది కారణంగా, నాకు, వాసుదేవుని అనంతనామాలను పదేపదే ఉచ్చరించటం, ఆయన లీలలను చింతించటం, ఆయన దివ్యమంగళ విగ్రహాన్ని మనసులో నిలుపుకుని పూజించటం అలవాటయిపోయింది. అలా కొంతకాలం గడిచిన మీదట, నేను, ఆ దాసీపుత్ర శరీరాన్ని విడిచి, శుద్ధ సత్వమయమైన భాగవత దేహంలో ప్రవేశించాను.

ఆ తరువాత, కొన్ని వేల యుగాలు గడిచినై. తిరిగి, సృష్టి

ప్రారంభమయింది. అప్పుడు, మరీచి ముఖ్యులైన మునులతోపాటు, నేను కూడా జన్మించాను. పరమేశ్వరానుగ్రహంవల్ల, కాలక్రమాన, నాకు, అఖండితమైన బ్రహ్మచర్య దీక్షాశక్తి కలిగింది. ఆ సమయంలోనే, ఈశ్వరుడు, నాకు, ఈ వీణను ప్రసాదించాడు. ఈ వీణలోనుంచి సప్తస్వరాలూ, వాటంతట అవే ఆవిర్భవిస్తూ ఉంటై. దీని సహాయంతో, నారాయణకథాగానం చేసుకుంటూ, ముల్లోకాలలోనూ సంచరించటం, అప్పటి నుంచీ, నా నిత్యకృత్యమయింది. దానివల్ల...

తీర్థపాదుడైన దేవుండు విష్ణుండు
తన చరిత్ర మేను దవిలి పాడ
జీరబడ్డవాని చెలువున నేతెంచి
ఘనుడు నా మనమున గానవచ్చు."

అలా వివరించి, నారదమహర్షి వెళ్ళిపోయినాడు.

ఆ విధంగా, నారదమహర్షి ద్వారా, ఆయన పూర్వజన్మ వృత్తాంతాన్ని విని, హరిలీలావిశేషాలను గానంచేసి ఆత్మశాంతి పొందవలసిందిగా ఆయనవల్ల ప్రోత్సహింపబడ్డ వ్యాసుడు, ఆ తరువాత, శమ్యాప్రాసమనే ఒక ఆశ్రమంలో ఉండి, మనసును స్థిరంచేసుకుని, భక్తిరస ప్రధానమైన శ్రీమద్భాగవతేతిహాసాన్ని రచించాడు.

శ్రీమద్భాగవతం విన్నవారికి, లోకశరణ్యుడైన
శ్రీహరి మీద, దృఢమైన భక్తి జనిస్తుంది. ఆవెంటనే,
వారిని ఆవరించిఉన్న శోక మోహ భయాదులన్నీ
హరించిపోతై.

ధీరులూ, నిరపేక్షులూ అయిన మునులు సయితం, శ్రీహరి మాహాత్మ్యాన్ని గానం చేస్తారు. ఆత్మారాముడైన శుకమహర్షి కూడా హరిలీలాభి వర్ణనం ప్రధానంగా ఉండే శ్రీమద్భాగవతాన్ని అభ్యసించటమే దానికి నిదర్శనం.

6. పరీక్షితుని జన్మవృత్తాంతం :

ముముక్షుజన కల్పద్రుమమైన మహాభాగవత పురాణాన్ని, వ్యాస మహర్షి కుమారుడైన శుకయోగి, ప్రాయోపవిష్టుడై ఉన్న పరీక్షిన్మహారాజుకు వినిపించటం జరిగింది. దాన్ని శ్రద్ధాభక్తులతో విన్న ఆ మహారాజు, సర్వేంద్రియాలనూ నియమించుకుని, ప్రాపంచికవాసన లన్నింటినీ పరిత్యజించి, చిత్తాన్ని శ్రీపతిమీద నిలుపుకుని, కాలక్రమాన, పరమపదం పొందాడు.

ఆ పరీక్షిన్మహారాజు, పాండవమధ్యముడైన అర్జునుని మనుమడు; ఉత్తరాభిమన్యుల కుమారుడు. ప్రపంచాన్ని అపాండవం చేయాలని అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మశిరోనామకాస్త్రంవల్ల దగ్ధుడైకూడా, మాధవుని దయవల్ల పునర్జీవితుడైన చిరంజీవి.

* * * * * * * * * *

పాండవులమీద అశ్వత్థామ పగపట్టడానికి, ప్రబలమైన కారణాలు అనేకం ఉన్నై. వాటిలో, అతని తండ్రి అయిన ద్రోణాచార్యుడు, అధర్మంగా సంహరింపబడటం ఒకటి.

కౌరవులకూ పాండవుకూలమధ్య జరిగిన మహాసంగ్రామంలో, కౌరవవీరు లెందరో మరణించారు. కురుపతి అయిన దుర్యోధనుడు కూడా, భీమసేనుని గదాఘాతంవల్ల కూలిపోయినాడు. అంతకుముందే, పూజ్యులైన భీష్మ ద్రోణులూ, సైంధవుడూ, మోసప్రవృత్తితో వధింపబడ్డారు. మహారథులైన కర్ణ భూరిశ్రవులు, అన్యాయంగా హతులైనారు. అదంతా గ్రహించిన అశ్వత్థామకు అమితమైన ఆగ్రహం కలిగింది. అది, క్రోధంగా పరిణమించి, అతణ్ణి అమానుషమైన చర్యకు పురిగొల్పింది.

అదలా ఉండగా, అతడు, దుర్యోధనుని ఉప్పుతిని జీవించినవాడు కావటంవల్ల, అతని అంతిమక్షణాలలో అయినా, అతనికి, ఏదో విధంగా సంతృప్తి కలిగించాలనుకున్నాడు. అది కారణంగానే, గాఢనిద్రలో మునిగిఉన్న ద్రౌపదేయులను నిర్దాక్షిణ్యంగా నరికేశాడు; ఆ వార్తను

దుర్యోధనునకు అందజేసి, అతనికి, కొంత శాంతి చేకూర్చాడు.

కన్నబిడ్డల దుర్మరణవార్త కర్ణపుటాల్లో పడగానే, ద్రౌపది అమితంగా దుఃఖించింది. అది గ్రహించిన అర్జునుడు, ఆమె దుఃఖాన్ని ఉపశమింపచేసే ఉద్దేశంతో......

'ధరణీజాత్మజ వీవు, నీకు వగవన్ ధర్మంబె, యా ద్రౌణి ని
ష్కరుణుండై విదళించె బాలకుల, మ ద్గాండీవ నిర్ముక్త భీ
కరబాణంబుల నేడు వాని శిరమున్ ఖండించి నేదెత్తు, ద
చ్ఛిరముంద్రొక్కి జలంబులాడు మిచటన్, శీతాంశుబింబాననా!'

అని, సాంత్వన పూర్వకంగా శపథంచేశాడు; ఆ వెంటనే, శ్రీకృష్ణునితో సహ రథమెక్కి, అశ్వత్థామను తరుముకుంటూ వెళ్లాడు.

అర్జునుని అల్లంత దూరంలో చూడగానే, అశ్వత్థామ అదలి పోయినాడు. అతనికి ప్రాణభీతి కలిగింది. అందుకనే, ఎలాగైనా, అర్జునుని కంటపడకుండా తప్పుకుపోవాలని, అత డెంతగానో ప్రయత్నించాడు. కాని, అది అతనికి సాధ్యంకాలేదు. అప్పటికే అమితంగా అలసిపోయిన అతని రథాశ్వాలు, ఆపైన ఒక అడుగు కూడా వేయలేవని అతడు తెల్సుకున్నాడు. అందుకనే, స్వప్రాణ రక్షణార్థం, తనవద్ద ఉన్న బ్రహ్మశిరోనామకాస్త్రాన్ని అర్జునుని మీద ప్రయోగించాడు.

అశ్వత్థామకు, ఆ అస్త్రాన్ని ప్రయోగించటం మాత్రమే తెలుసు. దానిని ఉపసంహరించుకోవటం అతనికి తెలియదు. అలా అతనిచేత విడువబడ్డ ఆ అస్త్రం, ప్రచండతేజంతో అర్జునుని మీదకు వెళ్ళింది. అది గ్రహించిన అర్జునుడు, తానుకూడా, తనవద్ద ఉన్న బ్రహ్మాస్త్రాన్ని ప్రయోగించాడు. దాంతో, ఆ రెండు దివ్యాస్త్రాల మధ్యా, భయంకరమైన సంఘర్షణ జరిగింది. అది కారణంగా, లోకాలన్నీ తల్లడిలి పోయినై. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆ బ్రహ్మాస్త్రాలను రెంటినీ ఉపసంహరించ వలసిందిగా అర్జునుని కోరాడు. అర్జునుడు ఆ సలహాను పాటించాడు.

బ్రహ్మాస్త్రాలను ఉపసంహరించిన వెంటనే, అర్జునుడు, తటాలున అశ్వత్థామపైకి ఉటికి, అతణ్ణి బంధించి, తమ శిబిరంవేపుగా ఈడ్చుకుంటూ పోయి, ద్రౌపది ముందు నిలబెట్టాడు.

అశ్వత్థామను చూడగానే, పాంచాలికి, ద్రోణాచార్యుడు స్ఫురణకు వచ్చాడు. ఆయన రూపాన్ని అశ్వత్థామలో చూసుకుని, ఆమె, అతనికి నమస్కరించింది. అతణ్ణి బంధించి తెచ్చిన అర్జునునీ, అతణ్ణి చూసి ఉగ్రుడైపోతున్న భీమసేనునీ ఉద్దేశించి, 'నాకు సంభవించిన పుత్రశోకం ద్రోణపత్నికి సంభవించకుండా చూడండి' అని, బ్రతిమాలుకుంది.

ఆ వెంటనే, అర్జునుడు, శ్రీకృష్ణుని సూచనమీద, అశ్వత్థామ శిరాన ఉన్న, అతని కేశాలతోపాటు పుట్టిన, దివ్యరత్నాన్ని కోసి తీసుకుని, ప్రసిద్ధుడైన అతణ్ణి అవమానించటమే హతమార్చటంగా భావించి, అతణ్ణి, శిబిరం బయటకు గెంటివేశాడు.

అలా ఔదార్యాన్ని ప్రదర్శించిన పాండవులపట్ల కృతజ్ఞుడై ఉండటానికి బదులు, అశ్వత్థామ, పాండవులమీద పగపట్టాడు. ప్రపంచం అపాండవమైతేనేగాని తనకు శాంతి లేదని, అతను నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయంప్రకారం, ఆ వెంటనే, అతడు, మరొక దివ్యాస్త్రాన్ని మంత్రించి, పాండవపత్నుల గర్భాలమీద ప్రయోగించాడు.

ఆ సమయంలో, అర్జునుని కోడలూ, అభిమన్యుని ధర్మపత్నీ అయిన ఉత్తర, గర్భిణిగా ఉంది. ఆమె ప్రసవించే రోజులు కూడా సమీపించినై. అశ్వత్థామ ప్రయోగించిన దివ్యాస్త్రతేజం, ఆమె గర్భంలో ఉన్న శిశువును అమితంగా పీడించసాగింది.

దుర్భర బాణానలంవల్ల తపించిపోతూ, ఆ శిశువు, మాతృ గర్భంలో ఉండే, ఆ పరమాత్మను ఉద్దేశించి, తన పరిస్థితినంతనూ అతిదీనంగా నివేదించుకున్నాడు. అంతేకాదు.

'రాడా చూడ, సమస్తభూతములలో రాజిల్లువా డిచ్చటన్
లేడా, పాఱుని చిచ్చరమ్ము దొలగన్ లీలాగతిన్ ద్రోచి, నా

కీడా నే దభయప్రదాన, మత దూహింపన్ నతత్రాత మున్
గాడా, యెందఱగావ, డీ యెడల మత్కర్మంబు దా నెట్టిదో !'

అనికూడా వాపోయినాడు. గర్భస్థ శిశువు పడుతున్న వేదనను గ్రహించిన ఉత్తర, ఆ వెంటనే, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'గర్భమందు గమల గర్భాండ శతములు
నిముడుకొన వహించు నీశ్వరేశ !
నీకు నొక్క మానినీగర్భరక్షణ
మెంత బరువు, నిర్వహింతుగాక !'

అని, అతిదీనంగా వేడుకుంది. ఆ దీనాలాపాలు చెవుల బడగానే...

మేఘంబుమీది గ్రొమ్మెఱుగు క్రైవడి, మేని
పై నున్న పచ్చని పటమువాడు
గండభాగంబుల, గాంచనమణిమయ
మకరకుండలకాంతి మలయువాడు
శరవహ్ని నడగించు సంరంభమునజేసి,
కన్నుల నునుగెంపు గలుగువాడు
బాలార్కమండల ప్రతిమాన రత్న హా
టక విరాజిత కిరీటంబువాడు

కంకణాంగద వనమాలికా విరాజ
మాను, దసమాను, దంగుష్ఠమాత్రదేహు,
డొక్కగద జేతదాల్చి, నేత్రోత్సవముగ
విష్ణు డావిర్భవించె నవ్వేళయందు.

అలా ఆవిర్భవించిన శ్రీ మహావిష్ణువు, తన గదను మండలాకారంగా, గిరగిరాత్రిప్పి, ఉత్తర గర్భంలో ఉన్న శిశువు తాపాన్ని శమింపచేశాడు. అలా తనకు శాంతిచేకూర్చిన దివ్య విగ్రహు డెవరా అని, ఆ శిశువు ఆలోచిస్తూ ఉండగానే, ఆయన, అంతర్ధానుడు కావటం జరిగింది.

### 7. కుంతీదేవి హృదయం :

ఆ విధంగా, ఉత్తరా గర్భస్థ శిశువుదైన ఆవేదనను హరించి, ఉత్తరకు శాంతి చేకూర్చిన శ్రీకృష్ణుని ఉద్దేశించి, కుంతీదేవి, ఇలా ప్రస్తుతించింది.

"కృష్ణా! నువ్వు, పరమ పురుషుడవు. మాయవల్ల కప్పబడి ఉండే మా బోటివారికి, నీ దివ్యరూప దర్శనం దుర్లభం. నువ్వు, అఖిల భూతాలలోనూ వర్తిస్తూ, ప్రపంచమంతటా వెలుగులు చిమ్ముతూ ఉంటావు. ఆత్మానాత్మ వివేకం కలవారూ, అరిషడ్వర్గాలను జయించినవారూ, నిర్మలాంతఃకరణం కలవారూ అయిన పరమహంసలకు మాత్రమే, నువ్వు, దర్శనీయుడ వవుతావు. నువ్వు, ప్రకృతికి పరుడవు- అవ్యయుడవు- పరమేశ్వరుడవు.

అందుకనే, నీకు, భక్తిపూర్వకంగా అంజలిస్తున్నాను.

నువ్వే, నాకూ నా బిడ్డలకూ శరణ్యం. మమ్మల్ని, ఇంతవరకూ, నువ్వే రక్షిస్తూ వచ్చావు. నిన్ను నమ్ముకునే, నేనూ, నా బిడ్డలూ, జీవితాలను వెళ్ళదీసుకుంటున్నాము.

తనయులతోడ, నే, దహ్యమానంబగు
జతుగృహంబున యందు జావకుండ,
గురురాజు వెట్టించు ఘోర విషంబున,
మారుత పుత్రుండు మడియకుండ,
ధార్తరాష్ట్రుడు, సముద్ధతి, జీర లొలువంగ
ద్రౌపది మానంబు దలగకుండ,
గాంగేయ కుంభజ కర్ణాది ఘనులచే,
నా బిడ్డ, లనిలోన నలగకుండ,

విరటు పుత్రిక కడుపులో వెలయు చూలు
ద్రోణనందను శరవహ్ని ద్రుంగకుండ,
మరియు రక్షించితివి పెక్కు మార్గములను,
నిన్ను నేమని వర్ణింతు, నీరజాక్ష !

తండ్రీ ! నువ్వు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవు.

ఉత్తమజన్మ పొందినవారూ, ఉన్నతాధికారం లభించినవారూ, విద్యా ధన సంపదలతో విలసిల్లేవారూ, మదాంధీభూతు లవుతూ ఉంటారు. వారికి, శ్రీమన్నారాయణుని చరణసేవ అంటేనే గిట్టదు. గోపాలుడు గుణ రహితుడనీ, కాలస్వరూపుడనీ, కైవల్యదాన సమర్థుడనీ, సర్వసముడనీ సామాన్యులు గ్రహించలేరు.

కాని, నేనూ నా బిడ్డలూ, నువ్వే గతివనీ, పతివనీ నమ్ముకున్నాం. నువ్వు, ఈ లోకంలో, ఎందుకు ఉద్భవించినా, మాకుమాత్రం, నీ దివ్యలీలలు చూపించావు ; మమ్మల్ని తరింప చేశావు.

నాయనా ! నువ్వు భగవంతుడవు. భక్తవత్సలుడవు. భక్తసులభుడవు. భక్తపరాధీనుడవు.

'భగవంతుని దివ్య నామాలను వింటూ, భగవంతుని గుణాలను అభివర్ణిస్తూ, భగవంతునికీర్తిగానం చేస్తూ ఉండే భక్తులు, సంసారసముద్రంనుంచి ఉద్ధరింపబడతారు. భగవంతుని పాదాలనే ఆశ్రయించినవారు భయరహితులవుతారు'

అన్నమాటలు, మా పట్ల, అక్షరాలా నిజమయినై. మా జీవితాలు ధన్యమయినై. ఇక...

శ్రీకృష్ణా ! యదు భూషణా ! నర సఖా ! శృంగారరత్నాకరా !
లోక ద్రోహి నరేంద్రవంశదహనా ! లోకేశ్వరా ! దేవతా !
నీక బ్రాహ్మణ గోగణార్తిహరణా ! నిర్వాణ సంధాయకా !
నీకున్ మ్రొక్కెద, త్రుంపవే భవలతల్; నిత్యానుకంపానిధీ !"

ఆ విధమైన కుంతీదేవి అభ్యర్థనను, శ్రీకృష్ణుడు, చిరునవ్వుతో స్వీకరించాడు. ఆయన, తనకోరికను తీరుస్తాడన్న దృఢవిశ్వాసంతో, ఆమెకూడా, శాంతివహించింది.

*8. భీష్మస్తవం :*

అంతలో, ఉత్తరాయణ పుణ్యకాలం సమీపించింది. కురుక్షేత్రంలో, అంపశయ్యమీద ఉన్న భీష్మాచార్యుడు, తనకు మరణకాలం ఆసన్నమయిందని తెలుసుకున్నాడు; ఆ వెంటనే, శ్రీకృష్ణుని, మనసారా స్మరించుకున్నాడు.

అక్కడ, హస్తినాపురంలో, ధర్మజు, డప్పుడు, అమితమైన మనోవేదన ననుభవిస్తున్నాడు. మహా భారత సంగ్రామంలో జరిగిన మారణహోమానికి, తన రాజ్యకాంక్ష మాత్రమే కారణమైనట్టూ, లోభత్వానికి పాల్పడి, తను, తన తండ్రులనూ, గురువులనూ, తమ్ములనూ, తదితర బంధుమిత్రులనూ సంహరించటం జరిగినట్టూ భావించి, ఆయన, శోక విహ్వలుడై ఉన్నాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆయనకు, కురు పితామహుడయిన భీష్మాచార్యుని ద్వారా, సర్వ ధర్మాలనూ వినిపించే నిమిత్తం, అక్కడకు తీసుకుపోవటం అవసర మనుకున్నాడు. ఆ వెంటనే, ఆయన, ధర్మజునీ, ఆయన తమ్ములనూ, వ్యాస ధౌమ్యాదులనూ తీసుకుని, భీష్ముని సమీపించాడు.

అలా, ఆయన, భీష్మాచార్యుని చేరుకునే సమయానికి, పర్వత నారద పరశురామ వశిష్ఠ విశ్వామిత్ర భరద్వాజ బృహస్పత్యేత్యాది మహర్షులందరూ,తమతమ శిష్యులతో,అక్కడికి వచ్చారు. గాంగేయుడు, వారందరికీ

సముచితంగా స్వాగతం చెప్పాడు. ఆ వెంటనే, తాను, తన ప్రాణాన్ని త్యజించటానికి నిశ్చయించుకుని, ధ్యానించినంతమాత్రంలోనే దర్శనమిచ్చిన దామోదరుని ఉద్దేశించి...

"కృష్ణా! నువ్వు, నీ ఏకాంత భక్తులమీద అమితమైన కరుణ కలిగి ఉంటావని నాకు తెలుసు. నువ్వు, నా కిలా దర్శన మీయటమే, దానికి ప్రత్యక్ష నిదర్శనం.

భక్తిపూరితమైన హృదయంతో భగవంతుని మన
సులో నిలుపుకుని, ఆయన దివ్య నామాలను కీర్తిస్తూ
కళేబరాన్ని త్యజించేవారికి, కైవల్యం ప్రాప్తిస్తుంది.

నేనుకూడా, దానినే ఆశిస్తున్నాను. అందుకనే, దేవదేవుడవైన నువ్వు, నే నీ కళేబరాన్ని త్యజించేవరకూ, నా సమక్షాన ఉండాలని కోరుతున్నాను. అంతేకాదు. జలధరదేహుడవూ, చతుర్బాహుడవూ, సరసీరుహాక్షుడవూ, విశాలవక్షుడవూ, శంఖ చక్ర గదా పద్మ విలసితుడవూ అయిన నువ్వు, కౌస్తుభమణితోనూ, శ్రీవత్సలాంఛనంతోనూ, వైడూర్యమణిమయాంచితమైన వర కిరీటంతోనూ, అన్నిటినీ మించిన మృదుమధుర మందహాసంతోనూ, నా మనసులో నిలిచి ఉండాలనికూడా నేను అర్థిస్తున్నాను" అన్నాడు. అది విన్న శ్రీకృష్ణుడు, ఆయనవంక, ఆదర పూర్వకంగా చూశాడు; చిరునవ్వునవ్వాడు.

ఆ తరువాత, భీష్మాచార్యుడు, శ్రీకృష్ణుని ఆదేశానుసారం, ధర్మజునికి, అనేకమైన ధర్మాలను బోధించటం జరిగింది. అది విన్న ధర్మజుని మనసు, చాలావరకు ఊరటపొందింది.

ఆ వెంటనే, గాంగేయుడు, తనకు ప్రత్యక్షగోచరుడయిన శ్రీకృష్ణుని ఉద్దేశించి, ఇలా ప్రార్థించాడు.

"ముల్లోకాలనూ మోహింపచేసే దివ్యమంగళ విగ్రహుడూ, పీతాంబరధారీ, అయిన ఆ మాధవునిమీద, నా మనసు లగ్నమై ఉండాలని కోరుతున్నాను.

రణరంగంలో, ధర్మజునిపక్షాన ఉండి, తన చూపు వేడిమి ద్వారా, అధర్మపరులయిన రాజుల ప్రాణాలను హరించిన ఆ కాల స్వరూపుడు, నన్ను అనుగ్రహించాలని ప్రార్థిస్తున్నాను.

మా అర్జునునకు సారథిగా ఉండి, అతనికి విజయాన్నిచేకూర్చే నిమిత్తం, అతనికి కర్మయోగాన్ని కరతలామలకం చేసిన ఆ యోగీశ్వరుడు నా హృదయపద్మంలో ఆసీనుడై ఉండాలని అభ్యర్థిస్తున్నాను.

ఆయుధం పట్టనని ప్రతిజ్ఞ చేసికూడా, ఆతతాయినయిన నన్ను వధించి, నాకు ముక్తి చేకూర్చే నిమిత్తం, నా వాడిబాణాలను తొలగ ద్రోసుకుంటూ, చక్రం ధరించి, నామీదికి ఉరికివచ్చిన ఆ భక్తవత్సలుని పాద పద్మాలమీద, నా భక్తి, సుస్థిరం కావాలని వాంఛిస్తున్నాను.

పలుకులతో, కులుకులతో, అలుకలతో, అవలోకనలతో గోపాంగనల మనసులు ముచ్చిలించిన ఆ గోపకిశోరుడు, నన్నావేశించాలని కోరుతున్నాను. అంతేకాదు ;

ఒక సూర్యుండు, సమస్తజీవులకు దా నొక్కొక్కడై తోచు పో
లిక, నే దేవుడు, సర్వకాలము, మహాలీలన్, నిజోత్పన్న జ
న్య కదంబంబుల, హృత్సరోరుహములన్, నానావిధానూన రూ
పకుడై యొప్పుచునుండు, నట్టి హరి, నే బ్రార్థింతు శుద్ధుండనై."

అలా నిర్ణయించుకుని, మౌనం వహించి, ఆత్మస్వరూపుడైన ఆ ముకుందుని దివ్యమంగళ విగ్రహాన్ని తనలో నిలుపుకుని, గాంగేయుడు, వాసుదేవ పరబ్రహ్మలో లీనమైపోయినాడు.

అలా పరమపదం పొందిన కురుపితామహునికి, యుధిష్ఠిరుడు, దైహిక సంస్కారాలన్నీ, విధ్యుక్తంగా జరిపించాడు; ఆ తరువాత, శ్రీకృష్ణ సహితుడై, హస్తినాపురానికి వెళ్ళాడు.

*9. శ్రీకృష్ణుని ద్వారకాపుర ప్రవేశం :*

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, హస్తినాపురంలో కొంతకాలం ఉండి,

యుధిష్ఠిరాదులవద్ద సెలవు తీసుకుని, ద్వారావతికి బయలుదేరాడు. అలా బయలుదేరిన శ్రీకృష్ణుని, పాండవులేకాదు, పుర ప్రజలుకూడా, వదలలేక పోయినారు. పరమానందస్వరూపుడూ, లీలామానుష విగ్రహుడూ అయిన శ్రీకృష్ణుని లక్షించి, వారు, యిలా ప్రస్తుతించారు.

"శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. ఈయన నిజ రూపాన్ని దర్శించే నిమిత్తమే, మహామునులు, ఎన్ని విధాలయిన యోగాలనో అభ్యసిస్తారు ; ఎంతగానో తపస్సు చేస్తారు. మన పూర్వపుణ్యావశంచేత, ఆ మాధవుడే, మానవ రూపంలో, ఇంతవరకూ, మనమధ్య ఉండటం తటస్థించింది.

ఈ మహానుభావుడు, యాదవులకు మాత్రమే రాజనుకోవటం, పొరబాటు. ఈయన పరమేశ్వరుడు. ప్రపంచ సృష్టి స్థితి లయాలకు ఈయనే మూలకారణం. ఈయన, లీలారతుడైన ఈశ్వరుడు. ఈయన్ని దర్శించటం వల్ల, మన జన్మలు తరించినై.

దుష్టశిక్షణకోసం, శిష్టరక్షణకోసం, ధర్మసంస్థాపనకోసం, ఈ పరమపురుషుడు, ప్రతియుగంలోనూ, వివిధావతారాలు ధరిస్తూ ఉంటాడని వేదాలు చెబుతున్నై. ఈయన జన్మించటంవల్లనే, మధురా నగరం, పరమ పావనమయింది. ఈయన విహరించిన స్థలం కావటంవల్లనే, బృందావనం శ్లాఘనీయమయింది. ఈయనను కన్నందువల్లనే, దేవకీ వసుదేవులు, పరమ పవిత్రులైనారు. ఈయనను దర్శించటం వల్లనే, మన జీవితాలన్నీ ధన్యత పొందినై.

ఏ జన్మలో, ఏ మహోత్తమమైన వ్రత స్నాన హోమాది విధులాచరించి, ఆ వ్రజాంగనలీ మధురమూర్తిని ఆరాధించే అదృష్టం పొందారో! ఏ పూర్వజన్మసుకృతంవల్ల, రుక్మిణీ సత్యభామాదులు, ఈ దివ్యమూర్తికి దేవేరులయినారో! ఏ పుణ్యలేశం వల్ల, మన, మీ మనోహరాకారుని, కన్నుల కఱవుదీరా చూసి, జీవితాలను సఫలం చేసుకోగలిగామో!"

అలా, వారిచేత ప్రశంసింపబడుతూ, శ్రీకృష్ణుడు, హస్తినాపురం వదలి, ద్వారావతి చేరుకున్నాడు. ద్వారావతి, కనుచూపు మేరలో ఉన్నదనగానే, తన ఆగమనాన్ని తన వారికి తెలియపరచే నిమిత్తం,ఆయన. పాంచజన్యం పూరించాడు.

ఆ శంఖారావం చెవులబడగానే, ద్వారావతీపురప్రజలు, ఒక్కసారిగా, ఆనందోత్సాహాలతో ఉప్పొంగిపోయినారు. ఆ వెంటనే, వారు, తమ ప్రభువైన ఆ దేవదేవుని సమీపించి, తండ్రిని పిల్లల మాదిరి, చుట్టుముట్టారు. అలా ఆయనచుట్టూ చేరి, గద్గదమైన కంఠాలతో......

''ప్రభూ! మేము నీ బిడ్డలం. సంసారదుఃఖ నివారకమైన నీ పాదపద్మాలకు మేము ప్రణామం చేస్తున్నాం. కాలాధీశుడవైన నీకు, కేలుమోడ్చి, మా హృదయాన్ని, సభక్తికంగా నివేదించు కుంటున్నాం,

ఉన్నారము సౌఖ్యంబున
విన్నారము నీ ప్రతాప విక్రమ కథలన్
మన్నారము ధనికులమై
కన్నారము తావకాంఘ్రి కమలములు హరీ !

తండ్రులకెల్ల దండ్రియగు ధాతకు తండ్రివి, దేవ, నీవు మా
తండ్రివి దల్లివిం బతివి దైవమవున్ సఖివిన్ గురుండవున్,
దండ్రులు నీ క్రియం బ్రజల ధన్యుల జేసిరె, వేల్పులైన, నో
తండ్రి, భవన్ముఖాంబుజము ధన్యత గానరు, మా విధంబునన్''

అని, ప్రస్తుతి పూర్వకంగా విన్నవించుకున్నారు. ఆ తరువాత...

'చెచ్చెర గరినగరికి నీ
విచ్చేసిన నిమిషమైన వేయేండ్లగు మా;
కెచ్చోటికి విచ్చేయక
మచ్చికతో నుండవయ్య మా నగరమునన్'

అనికూడా మనవిజేసుకున్నారు.

అలా ప్రస్తుతిస్తూ, అర్థిస్తూ ఉన్న ప్రజలను, ప్రేమపూర్వకంగా వీక్షిస్తూ, తనకు స్వాగతం చెప్పవచ్చిన ఉగ్రసేన అక్రూర బలభద్ర ప్రద్యుమ్నాది యదుశ్రేష్ఠులతో సముచితంగా సల్లాపాలు జరుపుతూ, శ్రీకృష్ణుడు, రాచనగరులో ప్రవేశించాడు.

శ్రీకృష్ణుడు, ధవళచ్ఛత్రంతో, చామరాలతో, పట్టుపుట్టాలతో, భూషామణులతో వెలుగొందుతూ, మంగళతూర్యనాదాలమధ్య. దివ్య రథాసీనుడై, రాజమార్గాన వెడుతూ ఉండగా, ఇరువంకలా బారులు తీరి నుంచున్న పురప్రజలు, ఆయనకు హారతు లిచ్చారు. ఫలపుష్పాదులు సమర్పించుకున్నారు వారందరికీ అభయమిస్తూ, ఆ మహానుభావుడు, సూటిగా, తన తల్లిదండ్రుల నివాసం చేరుకున్నాడు. వారికి, గౌరవ పురస్సరంగా పాదాభివందనలు చేశాడు. వారికి అమితానందం కలిగించి, వారి దివ్యాశీస్సులు పొందాడు.

ఆ తరువాత, అక్కడినుంచి బయలుదేరి, ఆయన, తన శుద్ధాంతానికి వెళ్ళాడు. ఆయన నాశ్రయించిన పదహారువేల నూట ఎనిమిది మంది దేవేరులూ అక్కడే ఉన్నారు ఏ దేవి భవనంలోకి ముందు వెడితే ఏ దేవికి కష్టం కలుగుతుందో అన్న అభిప్రాయంతోనూ, ఎవ్వరి మనసూ వికలం కాకూడదన్న ఉద్దేశంతోనూ, ఆ శ్రీనాథుడు, బహురూప వ్యక్తుడై, ఒకే ఒక సమయంలో, అందరి ఇండ్లలోనూ ప్రవేశించాడు. అది గ్రహించ లేక...

'పతి నా యింటికి మున్ను వచ్చె,' నిదె, నా ప్రాణేశు డస్మద్గృహా
గతుడయ్యెన్ మును, సేరెబో తొలుత, మత్కాంతుండు నాళాల; కే
నితరాలభ్య సుఖంబు గంటి, నని, తా, రింటింట నర్చించి ర
య్యతివల్, నూరు బదారువేలు నెనమం, ద్రవ్వేళ, నాత్మేశ్వరున్

అలా అర్చితుడయిన అచ్యుతుడు, ఒక్కొక్క దేవేరితో ఒక్కొక్క విధంగా మాట్లాడుతూ, ఒకర్తు ముఖాన తిలకం దిద్ది, వేరొకర్తు

జడలో పువ్వులు ముడిచి, మరొకర్తుకు ఆభరణాలు సవరించి, ఇంకొకర్తుకు ముంగురులు దువ్వి, అలాగే అందరనూ, తలకొకవిధంగా అలరింపసాగాడు.

శ్రీకృష్ణ భగవానుడలా, ద్వారావతిలో, అందరకూ ఆనందాన్ని కలిగిస్తూ ఉండగా, అక్కడ, హస్తినాపురంలో, ఒక శుభముహూర్తాన, ఉత్తర, ఒక మగశిశువును ప్రసవించింది.

ఆ శిశువు, విష్ణుమూర్తి అనుగ్రహంద్వారా పునర్జీవితుడు కావటంవల్ల, ధౌమ్య కృపాదులు, ఆ పిల్లవానికి, 'విష్ణురాతుడు' అని నామకరణం చేశారు. కాని, అతడు, తల్లి కడుపులో ఉన్నప్పుడు తను చూసిన పరమ పురుషుని, ప్రపంచమంతటా వీక్షిస్తూ ఉండటంవల్లా, పాండవ వంశమంతా పరిక్షీణమయిన తరువాత పుట్టినవాడు కావటంవల్లా, కాల క్రమాన, పరీక్షితుడనే పేరుతో ప్రసిద్ధికెక్కటం జరిగింది.

### 10. విదురోపదేశం:

మహాభారత యుద్ధానంతరం, ధర్మరాజాదులు, హస్తినాపురం రాజధానిగా, ముప్పైఆరేళ్ళు రాజ్యపాలనం చేశారు. ఆ సమయంలో, తను చేసిన జ్ఞాతివధకు ప్రాయశ్చిత్తంగా, ధర్మజుడు, మూడు అశ్వమేధాలు చేయటం జరిగింది.

అంతలో, తీర్థయాత్రకు వెళ్ళిన విదురుడు, తిరిగి, హస్తినాపురం చేరుకున్నాడు. అలా తిరిగి వచ్చిన విదురుడు, తన తీర్థయాత్రానుభవాలన్నింటినీ ధర్మరాజాదులకు విశదపరచాడు. ఆ తరువాత ఆయన, ధృతరాష్ట్రుని సమీపించి, ఇలా ఉపదేశించాడు.

"కాలగతికి ప్రతిక్రియ అంటూ లేదు. కాలం సమీ
పించినవారు, తమతమ ధనాదులనే కాదు, తమకు
ప్రియతమమైన ప్రాణాలను కూడా కోల్పోతారు.

ముసలితనం దాపురించింతరువాతకూడా, తమతమ
దార పుత్రాదులమీదా, ధన కనక వస్తు వాహనాల

మీదా, గృహారామాల మీదా, భోగాలమీదా, ఆసక్తి కలిగి ఉండటం, మూఢలక్షణం. జరాజీర్ణమైన శరీరం నశించితీరుతుందన్న జ్ఞానంకూడా లేనివారు, పశు ప్రాయులనే చెప్పాలి.

వృద్ధులయినవారు, అభిమానాన్ని త్యజించాలి. తమకు సహజంగా అలవడిన విజ్ఞానంచేతగాని, ఇత రుల ఉపదేశంవల్ల లభించిన విజ్ఞానంవల్లగాని, దేహ గేహాదులపట్ల విరక్తి పొందాలి. ఆత్మవంతులుకావాలి. హృదయంలో శ్రీహరిని నిలుపుకుని, ఇల్లు వదలి,సన్య సించాలి. అలా సన్యసించినవారే, ఉత్తము లనిపించు కుంటారు.

నువ్వు, అసలే పుట్టుగ్రుడ్డివి. నీ కిక అనుభవించవలసిన భోగాలుకూడా ఏమీ లేవు. వృద్ధుడవైనావు. నీ కన్నబిడ్డలూ, నిన్ను ప్రేమించే బంధుమిత్రులూ, అందరూ నశించారు. అలా అయికూడా, నువ్వూ, నీ భార్యా, జ్ఞాతుల దయాధర్మాలమీద ఆధారపడి జీవితాన్ని వెళ్ళదీసుకోవటం ఎంతమాత్రం సమంజసంగా లేదు. మిమ్మిప్పుడు పోషించే జ్ఞాతులయినా, ఇంతకుముందు మీ ప్రేమనుపొందినవారు కారు. మీచేతా, మీ బిడ్డలచేతా పడరాని పాట్లు పడ్డవారు. అటువంటివారి అండన జీవితాశతో ఉండేకంటె, దేహం అనిత్యమని తెలుసుకుని, మోహాన్ని త్రెంచుకుని, మునివర్తనులై, ముక్తిమార్గాన్వేషకులుకావటం మీవంటివారికి ఉచితమైన కార్యం."

అలా బోధించిన విదురుని మాటలు విని, గాంధారీ ధృత రాష్ట్రులు విజ్ఞానవంతులైనారు. ఆ వెంటనే, వారు, సంసారాన్ని విడిచి, విదురునితోసహా, ఉత్తరాభిముఖులై వెళ్ళిపోయినారు.

### *11. పరీక్షితుని ధర్మనిరతి :*

గాంధారీ ధృతరాష్ట్రుల మహాభినిష్క్రమణం, ధర్మజునకు,

అమిత బాధాకరమయింది. అది గ్రహించిన నారదమహర్షి, ఒకసారి, ఆయనను కలుసుకుని...

"ప్రాణులకు సంయోగవియోగా లనేవి సహజంగా సంభవిస్తూనే ఉంటై. అవి, పరమేశ్వరుని ఇచ్ఛాధీనాలు ప్రియవియోగ విచారానికి, మోహజనితమైన స్నేహమే కారణం. మనోవ్యాకులతకు అజ్ఞానమే మూలం. ప్రపంచంలో మృత్యుగ్రస్తం కాని దేదీ లేదు.

అసలు, ఈ ప్రపంచమంతా భగవన్మయమే. ఆయన ఒక్కడే; కాని, తన మాయా ప్రభావంద్వారా, వివిధ రూపాలలో మనకు గోచరిస్తూ ఉంటాడు. ఆయన లీలా విలాసాన్ని మనం గ్రహించవలసిందేగాని, ప్రశ్నించ టానికి వీల్లేదు"

అని ఉపదేశించాడు. అలా ఉపదేశింపబడ్డ ధర్మజునకు కొంత మనశ్శాంతి కలిగింది.

అంతలో, కలియుగం ప్రారంభమయింది. కలియుగం ప్రారంభం కాగానే, క్రౌర్యం హింస, అసత్యం, కౌటిల్యం, దంభం మొదలయిన అధర్మగుణాలు, ప్రతిజీవిలోనూ ప్రవేశించినై. అది గ్రహించిన ధర్మరాజు, సర్వవిధాలా తనకు సముడైన పరీక్షితుని, మహారాజుగా అభిషేకించి, తన తమ్ములతోనూ, ద్రౌపదితోనూ మహాప్రస్థానయాత్రకు బయలుదేరాడు.

అనంతరకాలంలో, మహారాజైన పరీక్షితుడు, ధనుర్ధరులలో అర్జునునితోనూ, వితరణగుణాలంకారులలో శిబిచక్రవర్తితోనూ, సత్య ప్రతిజ్ఞులలో శ్రీరామచంద్రునితోనూ, భక్తులలో ప్రహ్లాదునితోనూ సముడని పించుకున్నాడు. అతడు, ఇక్ష్వాకుని మాదిరి, ప్రజలను పాలించాడు. సూర్యుని మాదిరి, ప్రతాపవంతుడై ప్రస్తుతి కెక్కాడు.

ఆ మహారాజు, కాలక్రమాన, ఉత్తరుని కూతురయిన ఇరావతిని

పెండ్లిచేసుకున్నాడు. ఆ ఇరావతీ పరీక్షితులకు, జనమేజయాదులు, నలుగురు కుమారులు జనించారు.

పరీక్షిన్మహారాజు రాజ్యపాలనంచేస్తున్న రోజుల్లో, ఒకసారి, ఆయన, ఒకేఒక పాదంమీద, వృషభరూపంలో నుంచునిఉన్న ధర్మ దేవతనూ, ఆయన ప్రక్కనే, కన్నీటి కాలువగా, గోరూపంలో ఉన్న భూదేవినీ, కలుసుకోవటం జరిగింది. మహారాజు, వారిని కలుసుకునే సమయంలో, ధర్మ దేవత, భూదేవిని ఉద్దేశించి....

"నయనాంభఃకణజాల మేల విడువఁ, నా తల్లి. నీ మేను సా
మయమై యున్నది, మోమువాడినది, నీ మన్నించు చుట్టాలకున్
భయ దుఃఖంబులు నేడు వొందవుగదా, బంధించి శూద్రుల్, పద
త్రయ హీనున్ నను, బట్టవత్తురనియో, తాపంబు నీ కేటికిన్"

అని అంటున్నాడు. అంతేకాదు...

"అమ్మా ! నీ మనోవ్యథకు కారణమేమిటో నాకు తెలియకుండా ఉంది. లోకానికి ఏదో అపాయం కలుగబోతోందనీ, అందుకే నువ్వు విచార పడుతున్నావనీ మాత్రం, నాకు అనిపిస్తోంది.

ఇకముందు, సకాల వర్షాలు కురవకపోవటంవల్ల ప్రజలు బాధ పడతారనికానీ, భర్తలు భార్యలనూ, తల్లిదండ్రులు తమ బిడ్డలనూ రక్షించరనికానీ, ప్రాణులు, తమవైన దేహ వ్యాపారాలలోనే ఆసక్తులై ఉండి, పరమార్థచింతను పరిత్యజిస్తారనికానీ, బ్రాహ్మణులై పుట్టి, సరస్వతీ కటాక్షానికి పాత్రులయినవారుకూడా, తమ విద్యను, నింద్యకర్మలకు ఉపయోగిస్తారనికానీ, నువ్వు మనోవ్యథనందుతూ ఉండవచ్చు. బలవత్తర మైన కాలం, నీ సౌభాగ్యాన్ని హరించిందని, నువ్వు, విచారపడుతున్నట్టు కూడా నేను భావిస్తున్నాను. ఇంతకూ, నీ మనోవ్యథకు కారణమేమిటి ?" అనికూడా అడిగాడు. అలా, ఆదరపూర్వకంగా అడిగిన ధర్మమూర్తికి, భూదేవి, ఇలా సమాధాన మిచ్చింది.

"అయ్యా ! నీకు తెలియని దేమీ లేదు. అయినా, అడిగావు కాబట్టి చెబుతున్నాను.

నావిచారం, నన్ను గురించి మాత్రమే కాదు. నేను, నిన్ను గురించి, దేవ ఋషి పితృ సాధుజనులను గురించి కూడా బాధపడు తున్నాను.

సత్య శౌచదయా శాంతి త్యాగాలూ, సంతోషం, ఋజుత్వం, మనోనిగ్రహం, సమత్వం, జ్ఞానం, క్రియానైపుణ్యం, ధైర్యం, వినయం, శీలం, ఆస్తికత్వం, కీర్తి మొదలయిన గుణాలూ, పూర్వం, శ్రీకృష్ణునిపట్ల నిత్యమై ఉండేవి. ఆయన ఇప్పుడు లేడు. ఆయన స్థానంలో, కలి ప్రవేశించాడు. అతని ప్రేరణ వల్ల, ప్రపంచమంతటా పాపం వ్యాపించింది. ఆ పాపపీడవల్ల, ప్రజలు, అమితంగా బాధపడుతున్నారు.

ఈ లోకంబున, బూర్వము,
నాలుగు పాదముల నీవు నడతువు, నే, డా
శ్రీలలనేశుడు లేమిని,
గాలముచే, నీకు నొంటికాలయ్యెగదే."

భూదేవి, తన విచారకారణాన్ని అలా విశదపరుస్తూ ఉండగా, రాజ వేషధారి అయిన ఒక శూద్రుడు, అక్కడికి వచ్చి, అకారణమైన క్రోధంతో, వాటి రెంటినీ, కాలెత్తి తన్నాడు. ఆ బాధను భరించలేక,వృషభ రాజూ గోమూర్తీ కూడా, అమితంగా రోదించడం జరిగింది. అది గ్రహించిన పరీక్షితునకు, ఆ రాజవేషధారిపైన ఆగ్రహం కలిగింది. అందుకనే, ఆయన, అతణ్ణి సమీపించి...

"నిన్నుం గొమ్ముల జిమ్మెనో, కదిసెనో, నిర్భీతివై గోవులం
దన్నం గారణ మేమి, మ ద్భుజ సనాథక్షోణి నే వేళలం
దు న్నేరంబులు సేయరా దెరుగవా, ధూర్తత్వమున్, భూమిభృ
త్సన్నాహంబు నొనర్చె, దెవ్వడవు, నిన్ శాసించెదన్ దుర్మతీ"

అని గర్జించాడు. అంతేకాదు ;

'గాండీవియు చక్రియు భూ
మండలి బెడబాసి చనిన, మదమత్తుడవై,
దండింపదగనివారల
దండించెదు, నీవ తగుదు దండనమునకున్!'

అనికూడా హుంకరించాడు.

మదోన్మత్తుడయిన ఆ రాజు నలా శాసించి, పరీక్షిన్మహారాజు, గోమాత నుద్దేశించి...

'సాధువులగు జంతువులకు
బాధలు గావించు ఖలుల భంజింపని రా
జాధము నాయు స్స్వర్గ
శ్రీ ధనములు వీటిబోవు, సిద్ధము; తల్లీ !
దుష్టజన నిగ్రహంబును
శిష్టజనానుగ్రహంబు జేయగ నృపులన్
స్రష్ట విధించె, బురాణ
ద్రష్టలు సెప్పుదురు, పరమ ధర్మము, సాధ్వీ !'

అని, తన ధర్మనిరతిని ప్రకటించుకున్నాడు. ఆ వెంటనే,ఆయన, ధర్మ దేవుని దిక్కై... "అయ్యా ! పూర్వం, నువ్వు, కృతయుగంలో, తప శ్శౌచ దయా సత్యాలనే నాలుగు పాదాలమీదా నడిచేవాడవు. ప్రస్తుతం, సత్యధర్మమనే పాదం ఒక్కటే, నీకు మిగిలి ఉంది. ఈ ఒక్కపాదాన్నీ కూడా, అధర్మమే ప్రధానంగా ఉన్న ఈ కలి, హరించాలని చూస్తున్నాడు. దానికి...

జాలి బడనేల, నా శర
జాలంబుల పాలుసేసి చంపెద వీనిన్,
భూలోకంబున, నిపుడే,
నాలుగు పాదముల నిన్ను నడిపింతు జుమీ !"

అని, సాంత్వనపూర్వకంగా వాగ్దానం చేశాడు.

వృషభమూర్తిరూపంలో ఉన్న ధర్మదేవు డది విని, ఆయనతో ఇలా అన్నాడు :

"మహారాజా ! నీ ధర్మదీక్షా, అభయశీలతా ప్రశంసా పాత్రంగా ఉన్నై. అయినా, మా కిప్పుడు కలిగిన కష్టానికి, ఇతరులను దూషించటం మాత్రం భావ్యం కాదు.

కొందరు, తమ దుఃఖాలకు కారణం, తామే అనుకుంటారు. మరికొందరు, ఆ కారణాన్ని, గ్రహ దేవతాదులకు అంటగడతారు. ఇంకా కొందరున్నారు; వారు, ఎవరి కష్టసుఖాలకు వారి వారి స్వభావాలే కారణమని తలుస్తారు. వా రందరూకూడా అజ్ఞానులే. అసలు కష్టసుఖాలను కల్పించేది, ఆ పరమేశ్వరుడే కాని, పరులెవ్వరూ కారు.

నువ్వు, పరమ పావనులయిన పాండవుల పౌత్రుడవు కాబట్టి, వారి అడుగుజాడలలోనే నడుస్తూ, మాబోటి దీనుల కభయదాన మిస్తున్నావు."

ధర్మదేవుని మాటలు విన్న పరీక్షిన్మహారాజు, ఆ తరువాత, ధర్మదేవునీ, భూదేవినీ ఓదార్చాడు. అది చూసిన కలిపురుషుడు, కంపించిపోయినాడు. ఆ మహారాజువల్ల తన కేవిధమైన కీడు మూడుతుందో అని, అతడు, అమితంగా వ్యాకులపడ్డాడు. అందుకనే, ఆ మహారాజును సమీపించి, శరణు కోరాడు. అలా శరణుజొచ్చిన కలిని చూసి, పరీక్షిన్మహారాజు...

'అర్జున కీర్తి సమేతుం,
దర్జున పౌత్రుండు, భయరసావృత జనులన్
నిర్జించి చంపదలపడు,
దుర్జన భావంబు విడిచి తొలగు దురాత్మా !'

అని శాసించాడు. అలా శాసించటం వల్ల, అప్రమత్తులకూ ధీరులకూ అతనివల్ల ఏ విధమైన ఆపదా కలుగదన్న అభిప్రాయం ఆయనలో జనించింది.

అప్పుడు, కలిరాజుకు, తా నెక్కడికి పోవటమా అన్న ఆలోచన కలిగింది. అది గ్రహించిన పరీక్షిత్తు, అనృతానికి ఆస్పదమయిన ద్యూతం, మదానికి మూలమైన పానం, సంగమదోషానికి ఆకరమైన అంగనలూ, క్రౌర్యానికి ఉనికిపట్టయిన హింస, అనే నాలుగు స్థానాలనూ అతనికి చూపించాడు. ఆ నాలుగూ చాలవన్నట్టుగా, కలి, మరో ప్రదేశం కూడా నిర్దేశించవలసిందని ప్రార్థించాడు. దానిమీద, పరీక్షిత్తు, ఆ నాలుగింటికీ ఆకరమైన సువర్ణాన్ని ప్రసాదించాడు. సువర్ణం ఉన్నచోట, అనృతం, మదం, కామం, వైరం, అనే నాలుగు ప్రవృత్తులూ ఉండటం వల్ల, కలికి, అది తగిన తావు అని ఆయన నిర్ణయించటం జరిగింది.

ఆ విధంగా, కలికి, ఐదు నివాసస్థానాలు నిర్దేశించి, వృషభ రాజుకు, తిరిగి, తపస్సు శౌచం దయ అనే మూడు పాదాలనూ ప్రసాదించి, పరీక్షిన్మహారాజు, భూదేవికి సంతోషం కలిగించాడు. ఆ తరువాత, పరీక్షిత్తు రాజ్యపాలనం చేస్తున్నంతకాలం, కలి, తన ప్రభావాన్ని అంతగా ప్రదర్శించలేకపోయినాడు.

## *12. పరీక్షితుని విరక్తి కారణం :*

అలా కలిని నిగ్రహించిన అనంతరం, ఒకసారి, పరీక్షిన్మహారాజు, మృగయావినోదార్థం అడవికి వెళ్ళటం జరిగింది. అక్కడ, ఆయన, చాలాసేపు, మృగాలను వేటాడాడు. ఆ సమయంలో, ఆయనకు, అమితమైన దాహం వేసింది. మంచినీటికోసం, ఆయనా ఆయన అనుచరులూ, ఆ ప్రదేశమంతా గాలించారు. కాని, వారి ప్రయత్నమేదీ ఫలప్రదం కాలేదు. అంతలో, ఆ మహారాజుకు, శమీకమహాముని ఆశ్రమం కనిపించింది.

పరీక్షిన్మహారాజు, ఆ ఆశ్రమం చేరుకునే సమయానికి, శమీక

మహర్షి, సమాధినిష్ఠలో ఉన్నాడు. ఆయన ఇంద్రియాలేవీ, అప్పుడు, పనిచేయటం లేదు. హరి పాదాబ్జాలు తప్ప, మరొకటి ఏదీ, ఆయన, కా సమయంలో, గోచరం కావటం లేదు.

పరీక్షిన్మహారాజు, అమితమైన బడలికతో, ఆయనను సమీపించాడు. దాహంతో పీడింపబడుతూ ఉండటంవల్ల, కాసిని మంచినీళ్ళు కావాలని ఆయన్ని అడిగాడు. కాని, ఆయనకు, ఆ మహర్షినుంచి, సమాధానం లభించలేదు. అది కారణంగా, ఆ మహారాజుకు, తీవ్రమయిన వేదన కలిగింది. ఆయన, పిపాసాపీడితుడై ఉండటంవల్ల, పూర్వం ఎన్నడూ ఎరుగని క్రోధ మాత్సర్యాలకు, ఆయన వశుడైనాడు. ఆ వెంటనే, ఆయనకు సహజమైన వివేచనాశక్తి హరించిపోయింది. ఆయన, ఏమి చేయటానికీ తోచక, నలువంకలా చూశాడు. అంతలో, ఆయనకు, ఆ పరిసరప్రాంతంలో, ఒక మృతసర్ప శరీరం కనిపించింది. వెంటనే, ఆయన, దాన్ని తీసుకువచ్చి, ఆ మునీశ్వరుని మెళ్ళో వేశాడు. అలా చేయటంలో ఆయన అభిప్రాయం, అసలు, శమీకుడు, ఒళ్ళు తెలియని స్థితిలో ఉన్నదీ, లేక, తన్ను నిర్లక్ష్యం చేస్తున్నదీ తెలుసుకోవటమేగాని, వేరు కాదు. ఏ దేమైనా, ఆ విధంగా తన క్రోధాన్ని ఉపశమింప చేసుకుని, పరీక్షిన్మహారాజు, గృహోన్ముఖుడై వెళ్ళాడు.

అదంతా, ఆ చుట్టుప్రక్కల ఉన్న కొందరు మునికుమారులు చూశారు. ఆ వెంటనే, వారు, పరుగెత్తుకుపోయి, అక్కడికి అనతి దూరంలోనే ఉన్న శమీకుని కుమారుడయిన శృంగికి, ఆశ్రమంవద్ద జరిగిందంతా తెలియపరిచారు.

ఆ వార్త వినగానే, శృంగికి, అమితమైన ఆశ్చర్యం కలిగింది. ఆ మహారాజు, అంతటి దుర్మార్గానికి పాల్పడటం అసమంజసమని అతను భావించాడు. ఆ వెంటనే, అతనిలో, కోపం జనించింది. పరీక్షిన్మహారాజే ధర్మమర్యాద నుల్లంఘించటంవల్ల, ప్రపంచం, ధర్మ దూరం కాగలదన్న అభిప్రాయం అతనికి కలిగింది. అందుకనే, అతను, ఆలోచనలో పడ్డాడు.

తన తండ్రిని గురించీ, తమ మహారాజును గురించీ, ఆనాటి ప్రపంచ పరిస్థితిని గురించీ కూడా, అత డప్పుడు విచారించాడు. ఆ సందర్భంలోనే....

"ఆడడు తన్ను దూషణము, లాశ్రమవాసులగాని వైరులం
గూడడు, కందమూలములు కూడుగ దించు సమాధినిష్ఠుడై
వీడడు లోనిచూడ్కులను, విష్ణునిదక్క బరప్రపంచముం
జూడడు మద్గురుండు; ఫణి జుట్టగ నేటికి, రాచవానికిన్?

పోము, హిరణ్యదానములు పుచ్చుకొనంగ, ధనంబు లేమియుం
దేము సవంచనంబులుగ, దీవనలిచ్చుచు వేసరింపగా
రాము, వనంబులం, గృహవిరాములమై నివసింప, జెల్లరే,
పామును వైవగా దగునె, బ్రహ్మమునీంద్రు భుజాగ్రశంబునన్!

పుడమిగల జనులు వొగడగ
గుడుతురు కట్టుదురుగాక, కువలయపతులై,
యడవుల నిడుమల బడియెడి
బడుగుల మెడ నిడగదగునె, పన్నగశవమున్?

భగవంతుడు, గోవిందుడు,
జగతిం బెడబాసి చనిన, శాసింపంగా
దగువారు లేమి, దుర్జను,
లెగసి, మహా సాధుజనుల నేచెద రకటా!"

అని, సాధుజన జీవనాన్నీ, వారికి సంభవించే ఉపద్రవాలనూకూడా ఒకసారి సమీక్షించుకున్నాడు. ఆ వెంటనే, కౌశికీనదికి వెళ్ళి, ఆచమనం చేసి...

'ఓడక, వింటికోపున, మృతోరగమున్ గొనివచ్చి, మారుమా
టాడకయున్న మ జ్జనకు నంసతలంబున బెట్టి, దుర్మద
క్రీడ జరించు రాజు, హర కేశవు లొడ్డిననైన, జచ్చుటో
యేదవనాడు, తక్షకఫణీంద్ర విషానలహేతి సంహతిన్'

అని శపించాడు.

అలా పరీక్షిన్మహారాజును శపించి, శృంగి, ఆశ్రమం చేరుకున్నాడు; తండ్రి మెడలో ఉన్న పామును తీసివేశాడు.

అప్పటికి, శమీకునకు స్పృహ కలిగింది. ఆయన, తన ఎదుట, ఉద్రేకపూరితుడై ఉన్న తన కుమారునీ, ప్రక్కనే పడిఉన్న సర్ప కళేబరాన్నీ చూశాడు. చూసి, తన దివ్యదృష్టిద్వారా, అంతకుమునుపు అక్కడ జరిగిన వృత్తాంతమంతా గ్రహించాడు. తన కుమారునిచేత శపింపబడ్డ మహారాజు పరీక్షితుడని తెలుసుకోగానే, ఆయనకు అమితమైన ఆవేదన కలిగింది. ఆ వెంటనే, ఆయన, కుమారుని ఉద్దేశించి...

"కాపరిలేని గొఱ్ఱియల క్రైవడి, గంటక చోరకోటిచే
నేపఱి యున్న దీ భువన, మీశుడు కృష్ణుడు లేమి; నిట్టిచో,
భూపరిపాలనంబు సమబుద్ధి నితం డొనరింప, జెల్లరే,
యీ పరిపాటి ద్రోహమున కిట్లు శపింపగనేల బాలకా!

భారత వంశజున్, బరమ భాగవతున్, హయమేధయాజి, నా
చారపరున్, మహా నయవిశారదు, రాజకులైక భూషణున్,
నీరము గోరి నేడు మన నేలకు వచ్చిన యర్థి, భక్తి స
త్కారము సేసి పంపజనుగాక, శపింపగ నీకు ధర్మమే?"

అని మందలించాడు. అంతేకాదు.

'భగవద్భక్తులైనవారు, ఇతరులు తమకు చేసిన
అపకారానికి, ప్రతీకారం చేయరు.

పరీక్షిన్మహారాజు, పరమ భాగవతోత్తముడు కావటంవల్ల, తన పట్ల జరిగిన అపచారానికి ప్రతి చేయలేదు. అతడే ఆగ్రహించిన పక్షంలో, శృంగిని, ప్రతిశాపంతో శిక్షించి ఉండేవాడు'
అని కూడా ఆయన నిర్ణయించుకున్నాడు. అందుకనే...

'భూపతికి, నిరపరాధము,
శాపము దా నిచ్చె, బుద్ధిచాపలమున, మా
పాపడు, ఏ డొనరించిన
పాపము దొలగింపు కృష్ణ! పరమేశ! హరీ!'

అని వాసుదేవుని ప్రార్థించాడు.

ఇక్కడ ఇలా ఉండగా, అక్కడ, పరీక్షిన్మహారాజు, శమీకుని పట్ల తను చేసిన అపచారాన్ని గ్రహించి, అమితంగా బాధపడసాగాడు. అంతలో, శమీకమహాముని ఆదేశానుసారం, కొందరు మునికుమారులాయన్ని సమీపించి, ఆయనకు వాటిల్లబోయే అపాయాన్ని గురించి ఆయనకు వివరించారు. అది విన్న పరీక్షితుని ఆవేదనకు అంతులేకపోయింది. తను చేసిన పాపకృత్యానికి తగిన ప్రాయశ్చిత్తం అనుభవనీయం కాబోతున్నదని ఆయన భావించాడు. విషయాసక్తితో ప్రవర్తించే తనకు, ఆ శాపం, విరక్తి కారణం కాబోతున్నదని కూడా అనుకున్నాడు. అది కారణంగానే, భూలోక స్వర్గలోక భోగాలన్నీ హేయాలని నిర్ణయించుకుని, రాజ్యాన్ని త్యజించి, నిరశన దీక్షకు పూనుకుని, శ్రీకృష్ణ సేవకు మించిన పురుషార్థం మరొకటిలేదని నిశ్చయించుకుని, పవిత్ర గంగా సాగరంలో ప్రవేశించాడు. ఆ వెంటనే...

చిత్తము గోవింద పదా
యత్తము గావించి, మౌనియై, తనలో నే
తత్తరము లేక, భూవర
సత్తముడు వసించె, ముక్త సంగత్వమునన్.

ఆ విధంగా, విష్ణుపదసంభూత అయిన గంగానదిలో, పరీక్షితుడు, ప్రాయోపవిష్టుడై ఉన్నాడనివినగానే, మహానుభావులయిన అత్రీ, వసిష్ఠుడూ, పరాశరుడూ, విశ్వామిత్రుడూ, పరశురాముడూ, భరద్వాజుడూ, గౌతముడూ, మైత్రేయుడూ, అగస్త్యుడూ, నారదుడూ మొదలయిన మహర్షులందరూ, తమతమ శిష్య ప్రశిష్యులతో, అక్కడికి చేరుకున్నారు.

## 13. పరీక్షితుని మోక్షాసక్తి :

ఆలా విచ్చేసిన మునులను, పరీక్షితుడు, యథోచితంగా పూజించాడు. పూజాదికాలు పూర్తికాగానే...

'ఓపికలేక, చచ్చిన మహోరగముం గొనివచ్చి, కోపినై,
తాపసు మూపుపై నిడిన దారుణ చిత్తుడ, మత్తుడన్, మహా
పాపుడ, మీరు పాపతృణ పావకు, లుత్తము, లయ్యలార, నా
పాపమువాయు మార్గము, గృపాపరులార, విధించి చెప్పరే !'

అని, వారిని ప్రార్థించాడు. అంతేకాదు ;

'ఉరగాధీశు విషానలంబునకు మే నొప్పింతు, శంకింప, నీ
శ్వర సంకల్పము నేడు మానదు, భవిష్యజ్జన్మజన్మంబులన్
హరిచింతారతియున్, హరి ప్రణుతి, భాషా కర్ణనాసక్తియున్,
హరి పాదాంబుజ సేవయుం గలుగ, మీ రర్థిం బ్రసాదింపరే'

అనికూడా వేడుకున్నాడు. ఆ వెంటనే, తన కుమారుడయిన జనమేజయునకు రాజ్యభారా న్నంతనీ ఒప్పగించాడు. ఆ పైన, మునీశ్వరుల నుద్దేశించి...

'ఏడు దినంబుల, ముక్తిం
గూడగ నే రీతి వచ్చు? గురు సంసార
క్రీడన మే క్రియ నెడతెగు?
జూడుడు, మా తండ్రులార, శ్రుతివచనంబుల్'

అనికూడా వారిని అర్థించాడు.

ఆ ప్రార్థన నాలకించిన, మునులు, మహారాజుకు చెప్పవలసిన సమాధానాన్ని గురించి చర్చించుకుంటూ ఉన్న సమయంలో, వ్యాసర్షి పుత్రుడయిన శుకయోగి, అవధూత రూపంలో, అక్కడికి వచ్చారు. అతని రాకవల్ల, పరీక్షిన్మహారాజుకూ, మునీశ్వరులకూ కూడా, అపరిమితానందం కలిగింది. వారందరూ, ఆయన్ని పూజించారు.

అర్చనాదికాలు పూర్తికాగానే, పరీక్షిన్మహారాజు, ఆ యోగీశ్వరుని అనేకవిధాల ప్రస్తుతించాడు. ఆసన్నమరణుడైనవాడు ఏం చేయాలో వివరించవలసిందని ప్రార్థించాడు.

శుకమహర్షి దర్శనం, యోగీశ్వరులకే దుర్లభం. ఆయన గృహస్థుల ఇళ్ళలో, ఆవును పిదికినంతటి కాలంకంటె అధికంగా ఆగి ఉండడు. అటువంటి మహానుభావుడూ, అవధూతా, అయిన ఆయన, తన అదృష్ట వశాత్తు, తనకు తానై దర్శన మిచ్చాడు. అందుకనే, పరీక్షిన్మహారాజు, ఆయనను చూడగానే, తన కోరిక ఫలించితీరుతుందని విశ్వసించాడు. తనకు, ఆ మహనీయుడు, మోక్షప్రాప్తి మార్గాన్ని చూపితీరుతాడని నిశ్చయించుకున్నాడు. అందుకనే ఆయన్ని అలా ప్రార్థించాడు.

## *14. ఆసన్నమరణుల కర్తవ్యం :*

భక్తి వినయ బంధురంగా పరీక్షిన్మహారాజు అడిగిన ప్రశ్నకు, అఖిల ధర్మజ్ఞుడైన శుకయోగీంద్రుడు, అమితంగా ఆనందించాడు ; అతని వంక సాదరపూర్వకంగా చూశాడు. చూసి, ఇలా అన్నాడు :

"రాజా ! మీ రడిగిన ప్రశ్న, లోకాలకు మేలు చేకూర్చేదిగానూ, బ్రహ్మవిదులు మెచ్చుకునేదిగానూ ఉంది. మీరు కోరిన సమాధానం, ముక్తి కాములందరూ వినితీరవలసిందికూడా అయి ఉంది.

పుట్టిన ప్రతి జీవీ గిట్టడ మన్నది సహజం. జీవితంలో ఉన్న మిధ్యాత్వానికి అది తార్కాణం. ప్రతివ్యక్తీ, తన కళ్ళఎదుటజరిగే ఆ పనిని చూస్తూనే ఉంటాడు. తన తాత ముత్తాతలూ, తలిదండ్రులూ, చివరకు, తను కన్నబిడ్డలూ కూడా, తనతో ఏమీ సంబంధం లేనట్టుగా, వచ్చినదారినే వెళ్ళిపోతూ ఉండటం గ్రహిస్తూ ఉంటాడు. అయినా, ఆ విధమయిన

నిష్క్రమణ, నేడు కాకపోయినా, మరొకనాడైనా, తనజీవితానికికూడా ఉన్నదేనని మాత్రం భావించటం జరగదు. ఆ భావన లేకపోవటం వల్లనే, అతను, భార్యాబిడ్డలనీ, బంధువులనీ, లేనిపోని సంబంధాలు కల్పించుకుని, వారి విషయంలో మమకారం పెంచుకుని, తన ఆత్మాశ్వతత్వాన్ని మరచిపోయి ప్రవర్తిస్తూ ఉంటాడు.

కాని, మోక్షాన్ని అపేక్షించే ఉత్తములు కూడా కొందరు ఉంటారు. వారు, భగవంతుడయిన ఈశ్వరుని ఆశ్రయించి జీవిస్తారు. హరికథల నాకర్ణిస్తూ ఉంటారు. హరినామ సంకీర్తనం చేస్తూ ఉంటారు. సర్వవిధ బంధాలనూ తొలగించుకుంటారు.

సామాన్యంగా, సంసార బంధంలో చిక్కుకున్నవారి జీవితం, సగపాలు, రాత్రులందు గడచిపోతుంది. మిగిలినసగం, ఎందుకూ పనికి రాకుండా, వ్యర్థప్రసంగాలతోనూ, కామోపభోగలాలసత్వంలోనూ గతించిపోతుంది. కాని, వివేకులయినవారు, తమకు లభించిన కాలాన్నంతనీ, హరినామస్మరణలోనే గడుపుకుంటారు. అటువంటి వారికే, ముక్తి, కరతలామలక మవుతుంది.

నరజన్మకు ఫలం నారాయణ స్మరణం. అందుకనే, విధి నిషేధాలను త్యజించిన మునులు కూడా, హరిగుణ కీర్తనంపట్ల ఆసక్తి కలిగి

ఉంటారు. అది ముక్తిదాయకమైనది కావడమే అందుకు మూలం.

భగవద్గుణాభివర్ణనం, భగవన్నామకీర్తనం, ప్రధానంగాఉండే గ్రంథం, భాగవతమొక్కటే. ఆ భాగవత రహస్యాన్ని గ్రహించటం భక్తుల కర్తవ్యం. దాన్ని గ్రహించినవారికి అచిర కాలంలోనే భగవద్భక్తి కలుగుతుంది. అది, వారికి, కామితార్థాలను ప్రసాదిస్తుంది; మోక్ష సాధన మవుతుంది.

గడచిన జీవితం వ్యర్థమైపోయిందనీ, మరణం ఆసన్నమవుతున్నదనీ, గ్రహించటం, ఒక విశేషం. ఇక, మిగిలిఉన్న కాలాన్ని అయినా సద్వినియోగం చేసుకోవాలన్న ఆలోచన కల గటం, అంతకుమించిన విశేషం. ఆ కాలాన్ని శ్రీహరి సేవలో వినియోగించుకోవటం, ఉత్త మోత్తమమైన విశేషం.

ఆ విశేష గుణాలన్నీ, నీకు సంక్రమించినై. ఇప్పుడు నువ్వు ఉన్న పరిస్థితిలోనే, పూర్వం, ఖట్వాంగు డనే ఒక మహారాజు ఉండటం తట స్థించింది.

ఖట్వాంగు డొక మహర్షి. దేవ దానవుల మధ్య జరిగిన ఒక యుద్ధంలో, ఆయన, దేవతలకు సహాయం చేసి, దానవులను జయించి, దేవ తల ప్రేమకు పాత్రుడయినాడు. దేవత లతనికి, ఏదో ఒక వర మివ్వాలను కున్నారు; కాని, ఆయన యే వరం అపేక్షించలేదు. తన జీవితకాలం ఇంకా ఎంత ఉన్నదీ చెబితేచాలుననిమాత్రం, ఆయన, వారితో అన్నాడు.

దానిమీద, వారు, ఆపైన అత డొక ముహూ ర్తం మాత్రమే జీవించి ఉంటా డని చెప్పారు.

ఆ యథార్థాన్ని తెలుసుకున్న ఖట్వాంగుడు, అమితంగా సంతో షించాడు. వెంటనే, గగనమార్గాన, తన రాజ్యం చేరుకున్నాడు. అలా చేరు కుని, తన సర్వసంపదలనూ, భార్యాపుత్రులనూ, బంధుమిత్రులనూ, అంద రినీ వర్జించి, వై రాగ్యంతో, గోవిందనామసంకీ ర్తనం చేసుకుంటూ, రెండు గడియలలోనే కై వల్యం పొందాడు.

అలా, రెండు గడియలలోనే ఆయన ము క్తిని పొందినప్పుడు, ఏడు రోజుల్లో నువ్వు సాధించలేనిదేముంటుంది ? ఏమీ ఉండదు.

## 15 ము క్తిమార్గం :

కాలం సమీపించిందని గ్రహించిన పురు షుడు, ముందుగా, సంసార భయశూన్యుడు కావాలి. దేహం మీదా, దాన్ని ఆశ్రయించిన దార పుత్రాదులమీదా, ఉండే మమకారాన్ని, త్యజించాలి. ఆ వెంటనే, ఇల్లు వదలి, ఏదో ఒక ఏకాంతప్రదేశానికి వెళ్ళిపోవాలి. అక్కడ, ఒక శుభ్రమైన ప్రదేశాన్ని ఏర్పరచుకుని, విధి పూర్వకంగా ఒక ఆసనం కల్పించుకుని, మన సులో, బ్రహ్మాక్షరమయిన శుద్ధ ప్రణవాన్ని మననం చేసుకోవాలి ; తద్వారా, మనసును నిగ్రహించుకోవాలి. అలా, ప్రణవాన్ని మననం చేసుకోవటంవల్ల, సర్వేంద్రియ వి జ య ం సమకూరుతుంది. మనసు, విషయవాసనాదూర మవుతుంది. అప్పు డా మనసులో, భగవ ద్రూపాన్ని నిలుపుకుని, ధ్యానంచేయాలి. అలా

ధ్యానంచేయటమే, ధారణ అనిపించుకుం టుంది. ఆ ధారణా సమయంలో, ఏ పదా ర్థంమీద మనసు లగ్నమౌతుందో, ఏ పదార్థ దర్శనంవల్ల మనసుకు శాంతి లభిస్తుందో, అదే, విష్ణుదేవుని పరమపదం. ధారణాశ్రయుడైన హరిని అపరోక్షంగా చూడగలిగిన యోగికి, భక్తియోగం, శీఘ్రంగా అలవడుతుంది.

ధారణాయోగంలో, భగవంతుడైన హరి, విరాడ్రూపుడై ప్రత్యక్షమవుతాడు. ఆ విరా డ్రూపంమీదనే మనసును లగ్నంచేసుకోవాలి. ఆ విరాట్పురుషుడే ధారణ కాశ్రయం.

విరాడ్విగ్రహంలో, భూతభవిష్యద్వర్తమాన ప్రపంచమంతా గోచరిస్తుంది. ఆ సమయంలో, విశ్వమంతా హరిమయంగానూ, హరి, విశ్వ మయుడుగానూ, కనిపించటం జరుగుతుంది. దాంతో,హరివినా, ఏ పరమాణువూకూడాలేదని, తేటతెల్ల మవుతుంది. ఆ విరాడ్రూపంమీద, మనసు, దృఢంగా నిలిచింతరువాత, ఆ యోగికి, వేరు కర్తవ్యమే కనిపించదు.

ఈ ధారణాయోగమహిమ, ఇంతా అంతా అని చెప్పటానికి వీల్లేదు. ధారణాయోగంమూలంగానే, బ్రహ్మదేవుడు ప్రపంచనిర్మాణ ప్రభావాన్ని పొందటం జరిగింది.

మనుష్యులకు, స్వర్గాది విషయాలమీద వాంఛ కలిగించటానికే, కర్మకాండ ఏర్పాట యింది. కర్మమార్గం, మాయతో కూడు కున్నది. ఆ మాయలో తగులుకున్నవారు,

వాస్తవమైనవిషయాన్ని గ్రహించలేరు. అందు కనే, ప్రాజ్ఞులైనవారు, ఆ మాయలో చిక్కు పడకుండా, దేహయాత్రకు కావలసినంత మాత్రమే భోగ్యవస్తువులను స్వీకరిస్తూఉంటారు. అవి లేకపోయినా దేహయాత్ర సాగేపక్షంలో, వారు, వాటివేపుకు పోవటంకూడా జరగదు. ఏ కారణంవల్లనయినా, వాటిని అనుభవించటం సంభవించినా, వారు, వాటిమీద మమకారాన్ని మాత్రం పెంచుకోరు. వాటినిపొందటానికి, ధనమదాంధుల నాశ్రయించరు. వా రెప్పుడూ, రక్షకులులేనివారిని రక్షించే ఆ రాజ చంద్రుని సేవలోనే తమ జీవితాన్ని వెచ్చిస్తూ ఉంటారు. ఆ విధంగా వారు ప్రవర్తిస్తూ ఉండటంవల్ల, అఖిల సంసారానర్థాలకూ మూలమయిన అవిద్య నిర్మూలమైపోతుంది. ఆవెంటనే, వారికి, మోక్షప్రాప్తి కలుగు తుంది.

కొందరు, తమ హృదయాకాశంలో ఉండే పరమపురుషుని, ధారణాయోగంద్వారా ఆరాధి స్తారు. వారు ఆరాధించే ఆ దివ్యమూర్తి, చతు ర్బాహుడూ, శంఖచక్రగదాధరుడూ అయిఉం టాడు. ఆయన, ప్రసన్నవదనంతోనూ, పద్మ పత్రాలవంటి నయనాలతోనూ, పట్టు పుట్టంతోనూ, రత్న ఖచిత సువర్ణ కేయూ రాలతోనూ, రత్నాంగుళీకాలతోనూ, మణినూ పురకంకణాదులతోనూ, తేజరిల్లుతూ ఉంటాడు.

ధ్యానానికి దిగేముందు, ఆ విరాట్పురుషుని మూ_ర్తిని స్థూలంగా భావించుకోవటం జరగాలి. ఆ తరువాత, ఆయన అవయవాలను, పాదాలనుంచి శిరస్సువరకూ, వేరువేరుగా, ఏ అవయవానికి ఆ అవయవాన్ని ధ్యానించుకోవాలి. ఏ అంగాన్ని ధ్యానించటానికి ఉపక్రమించినా, ఆ అంగంమీద మనసు నిశ్చలంగా లగ్నమయేవరకూ ధ్యానిస్తూనే ఉండాలి. ఆ నిశ్చలత్వం కుదిరింతరువాత, ఆ అంగాన్ని వదలి, మరొక అంగాన్ని ధ్యానించుకోవటం జరగాలి. ఆ పరమపురుషునిమీద భ_క్తి సంపూర్ణంగా లభించే వరకూ, ఆ విధమైన ధ్యానం సాగిస్తూనే ఉండాలి. ఇదే ఆసన్నమరణుల క_ర్తవ్యం.

భ_క్తియోగంలో పరిపూర్ణత్వం లభించిం తరువాత, తనుత్యాగం చేయాలన్న తలపు కలిగిన పక్షంలో, ఆ యోగి, తన మనసును విషయస_క్తం కాకుండా నిగ్రహించుకుని, ప్రాణాయామంద్వారా ఉచ్ఛ్వాస నిశ్వాసలను నిరోధించుకుని, బుద్ధిని క్షేత్రజ్ఞునితోచేర్చి, ఆ క్షేత్రజ్ఞుని ఆత్మలోనూ, ఆత్మను పరబ్రహ్మలోనూ చేర్చి, ఏకీభావం కల్పించుకుని, శాంతిని పొందటం జరుగుతుంది. అలా, పరబ్రహ్మతో తాదాత్మ్యాన్ని పొందిన అనంతరం, యోగ మార్గాన, బ్రహ్మరంధ్రాన్ని భేదించి, దేహేంద్రియాలను విసర్జించటం సంభవిస్తుంది. దీన్నే, సద్యోము_క్తి అంటారు.

ముక్తిమార్గాలు ఎన్నో ఉన్నై. వాటి అన్నింటిలోనూ సులభమైనది, భక్తిమార్గం. దాన్ని, నిష్కాములైనవారే ఆశ్రయిస్తారు.

సర్వకాములుగానీ, మోక్షకాములుగానీ, పురుషోత్తముని పూజించే పక్షంలో, వారు, సర్వార్థాలనూ పొందటం జరుగుతుంది. ఆ పరమపురుషుని సేవిస్తూ, ఆయన గుణాలను కీర్తిస్తూ, ఆయన నామసంకీర్తనంచేస్తూ కాలం గడుపుకునేవారి జీవితాలు మినహాగా, ఇతరుల జీవితాలన్నీ, వ్యర్థమైనవే.

ఎంతోకాలం జీవిస్తామనీ, ఐహిక భోగాలన్నీ అనుభవిస్తామనీ, కలలుకంటూ, పరమేశ్వరుని ధ్యానించటానికికూడా విముఖులై ఉండేవారూ, భార్యాపుత్రాదులమీదా, గృహారామవిత్తాదుల మీదా మమకారం పెంచుకుని, కాలంవ్యర్థపుచ్చుకునేవారూ, తుది గడియల్లో, చాలా బాధపడతారు. యమకింకరులు సమీపించినప్పుడు, వారు పెట్టే బాధలు పడలేక, అమితమైన,ఆవేదన పొందుతారు. వ్యర్థమైపోయిన జీవితాన్ని గురించి వాపోతారు. అయినా, దానివల్ల ప్రయోజనం మాత్రం ఏమీ ఉండదు.

పరమేశ్వరుని గుణవిశేషాల నాకర్ణించటానికి కూడా, కొందరు, విముఖులై ఉంటారు. వారికి పరమేశ్వరధ్యాన మంటేనే పడదు. అసలు, పరమేశ్వరు డనేవా డొక డున్నాడని కూడా, వా రనుకోరు. అటువంటివారికీ, పశు

వులకూ, ఏ విధమైన భేదం లేదు. విష్ణుపాదాల నాశ్రయించినవారికి, ధర్మార్థ కామ మోక్షాలన్నీ లభిస్తై. కుతర్కం చేసేవారూ, నిరీశ్వర వాదులూ, విష్ణుపాదాల నాశ్రయించలేరు. విష్ణు సేవాతత్పరులైనవారి మనస్సులలో, విష్ణువు, స్థిరంగా నిలిచిఉంటాడు. ఆయన పాదాల నాశ్రయించేవరకే, ఏ ప్రాణికైనా, ధనంమీదా, బంధు మిత్రులమీదా, మమకారం ఉంటుంది. తనకు ప్రియమైన ధనంగాని, బంధు మిత్రులు గాని, పోవటం జరిగితే, ఆ ప్రాణి, అమితంగా శోకిస్తుంది. శాశ్వతమైన పరమాత్మ తత్త్వాన్ని గ్రహించినవారికి ఆ విధమైన మమకారం ఉండదు. శోక భయాదు లుండవు. వారికి, వారి వారి దేహాలమీదనే అభిమానం లేకుండా పోతుంది.

భాగవత సేవ, సకల వ్యసనాలనూ నిర్మూలిస్తుంది. భాగవత సేవాసక్తి లభించటానికి, అమితమయిన కృషికూడా అవసరం లేదు.

మితిలేని మూఢత్వంవల్ల, దేహ గేహాదులే శాశ్వతమనుకునేవారికీ, పారమార్థిక చింతలో పరిణతి పొందినవారికీ, కష్టమనేదేకనిపించదు. సుఖ దుఃఖాలు రెండూ అనుభవిస్తూ, ఇటు ప్రపంచాన్నిగాని, అటు పరమాత్మునిగాని, పూర్తిగా వదలలేనివారికే, కష్టాలు కలుగుతూ ఉంటై.

విష్ణుకథామృతాన్ని సేవించటంవల్ల, భక్తి పెరుగుతుంది. భక్తి పెరగడంద్వారా, అంతః

కరణశుద్ధి ఏర్పడుతుంది. అంతఃకరణశుద్ధి
ఏర్పడగానే, వైరాగ్యంతో కూడుకున్న జ్ఞానం
అలవడుతుంది. ఆ జ్ఞానంద్వారా, విష్ణుపద
ప్రాప్తి లభిస్తుంది.

నువ్వు, శ్రీకృష్ణునకు పరమభక్తుడవు కావటంవల్ల, భాగవత కథాశ్రవణంపట్ల ఆశక్తి కనబరుస్తున్నావు. నీ కోరికను తీర్చటానికి, నా మనసుకూడా, ఉబలాటపడుతోంది."

## 16. భక్తియోగ ప్రభావం :

ఆ విధంగా శుకయోగీంద్రుడు చేసిన బోధవల్లా, భాగవత కథను విశదపరచటానికి ఆయన ఉద్యుక్తుడు కావటంవల్లా, పరీక్షిన్మహారాజు, పరమానందం పొందాడు. అంతేకాదు.

'నారాయణుని దివ్య నామాక్షరములపై
　　గరగని మనములు కఠిన శిలలు
మురవైరి కథలకు ముదితాశ్రు రోమాంచ
　　మిళితమైయుండని మేను మొద్దు
చక్రికి మ్రొక్కని జడుని యౌదల నున్న
　　కనక కిరీటంబు కట్టెమోపు
మాధవార్పితముగా మనని మానవు సిరి
　　వనదుర్గ చంద్రికా వైభవంబు
కైటభారి భజన గలిగియుండనివాడు
గాలిలోన నుండి కదలు శవము
కమలనాభు పదము గననివాని బ్రదుకు
పసిడికాయలోని ప్రాణి బ్రదుకు'

అనికూడా నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయంతోనే...

సుతుల హితుల విడిచి, చుట్టాల విడిచి, యి
ల్లాలి విడిచి, బహుబలాళి విడిచి,
రాజు, హృదయ మిడియె రాజీవనయనుపై,
ధనము విడిచి, జడ్డుదనము విడిచి.

ఆ విధంగా, మృత్యుభయాన్ని నిరసించి, ధర్మార్థకామాలను సన్యసించి, శ్రీమన్నారాయణుని మీదనే చిత్తాన్ని నిలుపుకున్న పరీక్షిన్మహారాజు, ఆ తరువాత, శుకయోగి ద్వారా, మహా భాగవత పురాణాన్ని సాకల్యంగా వినటం జరిగింది.

ఈ మహా భాగవతాన్ని, శ్రీ మహావిష్ణువు, ప్రప్రథమంలో, బ్రహ్మకు బోధించాడు. ఆయన, దానిని, సనత్కుమారునకు తెలియపరచాడు. దాన్ని, ఆ మహర్షి, సాంఖ్యాయనునకు వివరించటం జరిగింది. ఆ తరువాత, అది, సాంఖ్యాయనుని ద్వారా, పరాశర బృహస్పతులకూ, పరాశరుని ద్వారా శుకమహర్షికీ లభించింది.

## 17. సృష్టిక్రమం :

సృష్టికి పూర్వం, ప్రపంచానికి, నామ రూపాలు లేవు. అది, శూన్యంగా, కేవల పరబ్రహ్మంగా, ఉండేది. పరిశుద్ధంగానూ, గుణరహితంగానూ, నిరాకారంగానూ ఉండే ఆ పరబ్రహ్మంలో, 'మూల ప్రకృతి' అనే ఒక మాయ ఉంది. అది, అవిద్యాశక్తి, మాయాశక్తి, విక్షేపశక్తి, అని, మూడు రూపాలలో ఉంటుంది.

సత్వగుణ ప్రధానమైనది మాయాశక్తి. ఆ మాయాశక్తితో జనించిన వాడే పరమేశ్వరుడు. ఆయనే, ప్రపంచంలోని చరాచర జీవరాశి నంతనూ సృష్టిస్తూ, పోషిస్తూ, సంహరిస్తూఉంటాడు. సృష్టికార్యం నిర్వహించే సమయంలో బ్రహ్మ అనీ, పోషించేటప్పుడు విష్ణువనీ, లయింపచేసేటప్పుడు మహేశ్వరుడనీ, ఆయన వ్యవహరింపబడుతూ ఉంటాడు. ఆ విధమయిన సృష్టి స్థితి లయాలకు ఆ పరమపురుషుని చిద్విలాసమే కారణం.

నిర్గుణుడయిన ఆ పరమేశ్వరుడు, ప్రపంచ సృష్టి స్థితి లయ కార్యాలను నిర్వహించే నిమిత్తం, మాయాసగుణు డవుతూ ఉంటాడు. ఆయన్ని 'భగవంతుడు' అనటం జరుగుతోంది.

సృష్టి ప్రారంభంలో, బ్రహ్మాండాన్ని భేదించి వెలువడ్డ ఆ భగవంతుడు, ప్రప్రథమంగా, పరిశుద్ధ మైన జలాన్ని సృజించాడు. ఆ జలంలోనే, వేయి సంవత్సరాలు వసించాడు. పరమపురుషుడయిన నరునివల్ల సృజింపబడటంవల్ల, జలానికి, 'నారములు' అన్న పేరు వచ్చింది. ఆ 'నారము'ల నాశ్రయించినవాడు కావటంవల్ల, ఆయనకు 'నారాయణుడు' అన్న నామం సార్థకమయింది.

నారాయణుని నాభీకమలం నుంచి, బ్రహ్మ ఉదయించాడు. దేవతలలో, తొలిగా జనించినవాడు ఆయనే. అందుకనే, ఆయన్ని, 'ఆదిజుడు' అంటారు. శ్రీ మహావిష్ణువుదైన ప్రేరణవల్ల, ఆయన ప్రసాదించిన శక్తి ద్వారా, బ్రహ్మ, ప్రపంచ సృష్టికి పూనుకున్నాడు.

సృష్టికి, ఆది అంటూ లేదు. ప్రపంచం, ఇంతకు పూర్వం, ఎన్నిసార్లో సృష్టింపబడటం, లయం పొందటం, జరిగింది.

బ్రహ్మదేవుడు, ప్రప్రథమంగా, మునులను సృజించాడు. ఆ తరువాత, ఆయనలో సగభాగం పురుషుడుగానూ, సగభాగం స్త్రీగానూ, రూపొందటం జరిగింది. అలా రూపొందిన ప్రథమ పురుషుని పేరు, స్వాయంభువ మనువు ; స్త్రీ పేరు శతరూప. ఆ శతరూపా స్వాయంభువులకు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే ఇద్దరు కుమారులూ, ఆకూతి, దేవహూతి, ప్రసూతి, అనే, ముగ్గురు కుమార్తెలూ జనించారు. కాలక్రమాన, ఆకూతిని రుచి అనే వానికి, దేవహూతిని కర్దమునకూ, ప్రసూతిని దక్షునకూ యిచ్చి, మనువు, వివాహం చేశాడు.

అలా, మనువును సృజించిన హిరణ్యగర్భుడు, అతనిని, మహారాజుగా నియమించాడు; యజ్ఞాలనూ యజ్ఞపురుషునీ ఆరాధించటం, ప్రజా

వృద్ధి చేయటం, అన్నవి, అతని ధర్మాలుగా ఏర్పరచాడు. ఆ ధర్మాల నను సరించి చరించిన మనువు సంతానమే 'మానవులు' అన్న సార్థకనామంతో వ్యవహరింపబడుతున్నారు.

### 18. విరాడ్రూపం :

ఆ మనువునూ, ఆయనను సృజించిన హిరణ్యగర్భునీ సృష్టించిన ఆదిపురుషుని విరాడ్రూపం, అత్యద్భుతంగా ఉంటుంది. ఆ మహనీయుని పాదమూలం పాతాళంగానూ, గుదికాలూ ముంగాలూ రసాతలంగానూ, చీలమండలు మహాతలంగానూ, పిక్కలు తలాతలంగానూ, మోకాళ్ళు సుతలంగానూ, తొడలు వితలాతలాలుగానూ, మొల భూతలంగానూ, నాభి ఆకాశంగానూ, వక్షస్థలం నక్షత్రమండలంగానూ, కంఠం మహర్లోకంగానూ, ముఖం జనలోకంగానూ, నుదురు తపోలోకంగానూ, సహస్ర శిరస్సులు సత్యలోకంగానూ, బాహువులు ఇంద్రాది దేవతలుగానూ, కర్ణస్థానం దిగ్దేవతలుగానూ, చెవులు శబ్దంగానూ, ముక్కు అశ్వినులుగానూ, ఘ్రాణేంద్రియం గంధంగానూ, ముఖం అగ్నిదేవుడుగానూ, నేత్రస్థానం అంతరిక్షంగానూ, నేత్రాలు సూర్యుడుగానూ, కనురెప్పలు అహోరాత్రాలుగానూ, బ్రహ్మరంధ్రం వేదాలుగానూ, కోరలు యముడుగానూ, దంతాలు పుత్రాది స్నేహకళలుగానూ, చిరునవ్వు మాయగానూ, కటాక్ష వీక్షణం సృష్టిగానూ, మీది పెదవి లజ్జగానూ, క్రిందిపెదవి లోభంగానూ, స్తనాలు ధర్మంగానూ, పృష్ఠం అధర్మంగానూ, కుక్షి సముద్రాలుగానూ, ఎముకలు పర్వతాలుగానూ, నాడులు నదులుగానూ, రోమాలు వృక్షాలుగానూ, నిశ్వాసం వాయువుగానూ, గమనం కాలంగానూ, క్రియ ప్రాణికోట్ల సంసారంగానూ, కేశాలు మేఘాలుగానూ, వస్త్రం సంధ్యగానూ, మనసు చంద్రుడుగానూ, విజ్ఞానశక్తి మహత్తత్త్వంగానూ, అహంకారం రుద్రుడుగానూ, గోళ్ళు గుఱ్ఱాలూ ఏనుగులూ మొదలయినవిగానూ, బుద్ధి పక్షులుగానూ ఉంటాయని, యోగీశ్వరులు వర్ణిస్తారు. అలా వర్ణింపబడే విరాడ్రూపమే, పరమేశ్వరుని ప్రథమావతారం.

ఆ ఆదిపురుషుడు, ప్రతి కల్పంలోనూ, తన్ను తాను సృజించు

కుంటూ, పాలించుకుంటూ, ఉపసంహరించుకుంటూ ఉంటాడు. ఆయన తత్త్వం, మనోవాగగోచరం. మునీశ్వరులు మాత్రమే, ఆయన తత్త్వాన్ని గ్రహించగలుగుతారు.

### 19. శ్రీమన్నారాయణుడు :

ఆ ఆదిపురుషుడయిన నారాయణుడు, అనంత నామాలతో వ్యవహరింపబడుతూ ఉంటాడు. ఆ మహనీయుని ముఖోద్గతమయినవే, ఋగ్యజుస్సామాథర్వణ వేదాలు. అవి, ఆయన తత్త్వాన్ని బోధిస్తై. స్వర్గాది లోకాలు, నారాయణుని ఆనందాంశలనీ, దేవతలు, నారాయణుని వివిధాంగాల నుంచీ ఉద్భవించారనీ, యజ్ఞాలు, నారాయణ తత్త్వజ్ఞానానికి సాధనలనీ, ప్రాణాయామాది యోగాలు, నారాయణుని ఆరాధన విశేషాలనీ, యోగ సాధనవల్ల మాత్రమే సాధ్యమయే చిత్తైకాగ్రతారూపమయిన తపస్సు, నారాయణునకు మాత్రమే గోచరమవుతుందనీ, ఆ తపస్సువల్ల సాధింపబడే జ్ఞానం, నారాయణపరమయినదిగా ఉంటుందనీ, తపఃఫలమైన సిద్ధికూడా నారాయణ పరమయినదే అనీ, వేదాలు తెలుపుతున్నై.

సామాన్యులెవరూ నారాయణుడయిన భగవంతుని మాయను, గ్రహించలేరు. దాన్ని గ్రహించగలవారూ, అధిగమించగలవారూ భగవద్భక్తులు మాత్రమే. కపట ప్రవృత్తి లేకుండా ఉండటంవల్ల, సర్వదా హరి చరణాలనే ఆశ్రయించి ఉండటంవల్ల, వారి కది సాధ్యమవుతుంది.

ఆ భగవంతుని నివాసం వైకుంఠం. దాన్నే, పరమపదం అంటారు. ఆ పరమ పదాన్ని పొందటానికే, ఆత్మజ్ఞానం కలవారు, అహర్నిశలు యత్నిస్తూ ఉంటారు.

శ్రీ వైకుంఠం సర్వోత్తమమైన పదం. రాగద్వేషాలకూ, క్లేశ మోహ భయాలకూ అక్కడ స్థానం ఉండదు. సత్త్వగుణ ప్రధానులయిన వారికే అది లభిస్తుంది. సారూప్యముక్తి పొందిన భగవద్భక్తులు, అక్కడ, దివ్య విమానాలలో విహరిస్తూ ఉంటారు. అక్కడ నివసించే విష్ణువును శ్రీదేవి సేవిస్తూ ఉంటుంది.

భగవంతుడు, జ్ఞానులకు మాత్రమే గోచరిస్తాడు. అందుకనే, వివేకులయినవారు, ఆ జ్ఞానాన్ని సముపార్జించుకునే నిమిత్తం, సర్వకాల సర్వావస్థలలోనూ, హరిని స్మరిస్తూ ఉంటారు. హరికథ లాకర్ణిస్తూఉంటారు. హరినామ సంకీర్తనం చేస్తూ ఉంటారు. సంసారంలో ఉండి కూడా ముక్తి కోరేవా-కి, భక్తియోగాన్ని మించిన మరొక ఉత్తమ మార్గం లేకపోవటమే దానికి కారణం.

భగవద్భక్తులకు, విష్ణుపదం, సులభంగా ప్రాప్తిస్తుంది. అలా విష్ణుపదాన్ని సాధించుకున్న భక్తులకు, పునరావృత్తి అనేదే ఉండదు.

## 20. *యజ్ఞవరాహావతారం :*

భక్తసులభుడయిన భగవంతుని లీలావతారాలు అనంతంగా ఉంటై. వాటిని లెక్కించటం కూడా, ఎవరికీ సాధ్యం కాదు.

ప్రపంచంలో దుర్మార్గం పెచ్చుపెరిగినప్పుడూ, అధర్మం ప్రబలమై, ధర్మహాని కలిగినప్పుడూ, నారాయణుడు, ఏదో ఒక సద్వంశంలో జనించి, దుష్టశిక్షణకూ, శిష్ట రక్షణకూ, ధర్మప్రతిష్ఠాపనకూ పూనుకుంటూ ఉంటాడు. అలా సంభవించిన రూపాలలో కొన్ని, ఆయన అంశలుగానూ, మరికొన్ని, ఆయన అంశాంశలుగానూ ఉంటై. వాటినే లీలావతారాలంటారు. వాటిలో మొట్టమొదటిది విరాట్ పురుష రూపం. అది, అనంతమైన శిరములు కలదీ, నేత్రములు కలదీ, పాదములు కలదీ అయిఉంటుంది. విరాట్ పురుష రూపం తరువాతది, యజ్ఞవరాహరూపం.

సనకాదులు బ్రహ్మమానస పుత్రులు. వారు, సర్వంకషమైన శేముషీవిచక్షణులు. వా రొకసారి, భువన విహారం చేస్తూ...

చనిచని కాంచి రంత బుధసత్తము, లంచిత నిత్యదివ్య శో
భన విభవాభిరామము, ప్రపన్నజన స్తవనీయ నామమున్,
జననవిరామ, మార్యజన సన్నుత భూమము, భక్తలోక పా
లన గుణధామముం, బురలలామము, జారు వికుంఠధామమున్.

అప్పుడు వారికి, శ్రీ మహావిష్ణువును సందర్శించుకోవాలన్న అభిలాష కలి గింది. సాధారణంగా...

> హరి విముఖాత్ము, లన్యవిషయ స్పృహచిత్తులు, బాపవర్తులు,
> న్నిరయ నిపాతహేతువును నింద్యచరిత్రము నైన దుష్కథా
> నిరతి జరించు వారలును, నేరరు పొందగ, నిందిరా మనో
> హర చరణారవింద భజనాత్మకు లుండెడు గొంది నారయన్.

కాని, సనక సనందనాదులు మహానుభావులు కావటంవల్ల, అక్కడికి వెళ్ళ గలిగారు ; వెళ్ళి, ఆరు కక్ష్యలు దాట గలిగారు. ఏడవ కక్ష్యలో ప్రవే శించబోతూ ఉండగా, అక్కడి ద్వారపాలకులు, జయ విజయు లనేవారు, వారిని, ముందుకు పోకుండా వారించారు.

ఆ విధంగా, తాము కాంక్షించిన భగవద్దర్శనానికి భంగం కల గటంవల్ల, సనక సనందనాదులు కోపగించుకున్నారు. అది కారణంగానే, వారు, ఆ ద్వారపాలకుల నుద్దేశించి...

"ఎంతగానో భగవత్సేవ చేసి, మీ రీ లోకం సాధించుకున్నారు; కాని, యిప్పుడు, మీ పదవికి తగనివిధంగా ప్రవర్తించారు; భగవద్దర్శనాభి లాషతో వచ్చిన మా పట్ల అవమానకరంగా వ్యవహరించారు. కాబట్టి, యిక, మీరు, యిక్కడ ఉండటానికి వీల్లేదు. కామ క్రోధ లోభాదులకు నెలవైన అధోలోకాలకు వెళ్ళిపోవలసిందే" అని శపించారు.

అది విన్న జయ విజయులు అదలిపోయినారు. అహంభావంతో తా మాచరించిన అకార్యానికి, వారు, యెంతగానో పశ్చాత్తాప పడ్డారు. మహర్షుల వచనానికి మారు లేదని తెలిసినవారు కావటంవల్ల, ఆ వెంటనే, వారు, ఆ మహనీయుల పాదాలమీద పడి, 'ఆర్యుల నవమానించినదానికి ఫలంగా, అధోలోకాలకు పోతాం. కాని, అక్కడఉన్నా, మాకు, హరి నామ స్మరణ మరపురాకుండా అనుగ్రహించవలసింది' అని, ప్రార్థించారు. వా రలా ప్రార్థిస్తూ ఉండగానే...

హరి, సర్వేశు, డనంతు, డా కలకలం బాలించి, పద్మాలయా
సరసాలాప వినోద సౌఖ్య రచనల్ సాలించి, శుద్ధాంత మం
దిర మాణిక్య కవాటముల్ గడచి యేతెంచెం, బ్రపన్నార్తి సం
హరుడై, నిత్యవిభూతి శోభనకరుండై, మానితాకారుడై.

అలా వచ్చిన శ్రీహరి ననుసరించి, శ్రీదేవి కూడా విచ్చేసింది. ప్రసన్నవదనంతోనూ, కృపామృతం వర్షించే లోచనాలతోనూ, కౌస్తుభ మణితోనూ, వైజయంతీమాలతోనూ, మకర కుండలాలతోనూ, మణిమయ కిరీటంతోనూ, పీతాంబరంతోనూ, నేత్రోత్సవకరంగా దర్శన మిచ్చిన ఆ పర మేశ్వరుని చూడగానే, బ్రహ్మానందానుభవపరులై సుఖాదుల నెరుగని సన కాదులు కూడా, హర్ష పులకిత శరీరులయినారు. ఎంతసేపు చూసినా తనివి తీరని ఆ శ్రీనాథుని దివ్యసుందర విగ్రహం, వారిని, ముగ్ధులనుగా చేసింది. వారు, ఆ తరువాత, తేజోనిధి అయిన ఆయనను తమ మనసులో నిలుపు కుని, ఇలా ప్రార్థించారు.

"మహానుభావా! నీ దివ్యమంగళవిగ్రహాన్ని, మా తండ్రి అయిన హిరణ్యగర్భుడు వర్ణించగా, పూర్వం, విని ఆనందించాం; ఈనాడు, దర్శించుకుని కృతార్థులమైనాం.

నువ్వు సర్వహృదయాంతర్యామివి. అలా అయికూడా, దుర్జనులూ, అనాత్ములూ అయిన వారికి దర్శనీయుడవు కాకుండా, ఆశ్రితులు అర్థించినప్పుడల్లా గోచరుడవౌతూ, ఆనందాన్ని ప్రసాదిస్తూ ఉంటావు. నీ చరణాబ్జాలనే ఆశ్ర యించి, నీ ప్రవిమల కీర్తి నభివర్ణిస్తూ, శ్రవణ కీర్తనాదులయిన భక్తి యోగ మార్గాల ద్వారా ని న్నుపాసించేవారికీ, నీ దయకు పాత్రు లయినవారికీ, మోక్షం కూడా త్యాజ్యమే అవు తుంది. మోక్షమే త్యాజ్యమైనప్పుడు, స్వర్గాది

సుఖాలమాట చెప్పేదేముంది! స్వర్గాది సుఖాలనూ మోక్షాన్నీ కూడా కించపరచే మహ దైశ్వర్యాన్ని, నీ దర్శనం ద్వారా, మా, కీనాడు, నువ్వు కలిగించావు.

తండ్రీ ! తీవ్రతపశ్చర్యద్వారా, మేము, మా పాపాలన్నింటినీ తొలగించుకున్నాం. కాని, ఈ రోజున, అనుకోకుండా, ఒక ఘోర మైన పాపానికి పాల్పడ్డాం. నీ పదాశ్రితులైన ఈ ద్వారపాలురను శపించటమే, ఇప్పుడు మేము చేసిన దోషం. అది, ధర్మవిరుద్ధమైన కార్య మని, మాకు యిప్పుడు అర్థమయింది. ఆ తప్పిదాన్ని క్షమించవల సింది."

ఆ విధంగా, సనక సనందనాదులు, భక్తియుక్తులై విన్నవించు కున్న మీదట, వైకుంఠ నిలయుడు, వారి నుద్దేశించి...

"మహర్షులైన మీరు, మంచిపనే చేశారు. ఈ జయ విజయులు, నా ద్వారపాలకులయి ఉండి కూడా, నా ఆజ్ఞను అతిక్రమించి, పూజ్యులయిన మీపట్ల అపచారం చేశారు. ఆ అపచారానికి తగిన శిక్ష, వారికి, అనుభవనీయం అయితీరుతుంది. దానికి మీరు విచారపడవలసిన పనేమీ లేదు. కాకపోతే, వీరు పశ్చాత్తప్తు లైనారు కాబట్టి, అచిరకాలంలోనే, తిరిగి నా వద్దకు వస్తారు."

అలా అంటూనే, జగన్నాథుడు, జయ విజయుల దిక్కై, 'మహ ర్షుల వచనానికి మారుపలకటం అసంభవం. ఇక, మీరు, భూలోకంలో, రాక్షసులై పుట్టి, నాతో విరోధం పెంచుకుని, ఎప్పుడూ నన్నే తలచు కుంటూ, నాచేత సంహరింపబడి, తిరిగి, వెంటనే నన్ను చేరుకుంటారు. అదే, ఈ మహర్షుల అనుమతిమీద, మీకు నేను చేయగల సహాయం' అన్నాడు.

ఆ తరువాత, శ్రీదేవివద్దా, శ్రీమన్నారాయణునివద్దా, సెలవు తీసుకుని, సనక సనందనాదులు, తమదారిన తాము వెళ్లారు. శ్రీహరి కూడా, రమాసహితుడై, తిరిగి, నిజధామానికి వెళ్ళిపోయినాడు. ఆ వెంటనే, శాపగ్రస్తులైన జయ విజయులు, తేజోవిహీనులై కూలిపోయినారు.

అలా కూలిపోయిన జయ విజయులు, ఆ తరువాత నూరేళ్ళకు, దాక్షాయణి అయిన దితికీ కశ్యప ప్రజాపతికీ, కుమారులై పుట్టారు. వారే ఆదిదైత్యులు. వారికి, కశ్యపుడు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులనే పేర్లు పెట్టాడు.

హిరణ్యాక్ష హిరణ్యకశిపులు పుట్టగానే, లోకమంతటా, అనేకమైన ఉత్పాతాలు కనిపించినై. భూమి కంపించింది. కుల పర్వతాలు కదిలినై. సముద్రాలు పొంగినై. నక్షత్రాలు రాలినై. అది గ్రహించిన జీవకోటి అంతా, ప్రళయం సంభవించబోతోందని భయపడటం జరిగింది.

అలా జనించిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులు, అమిత తేజోవంతులై, వృద్ధిపొందసాగారు. వారిలో, హిరణ్యకశిపుడు, ఘోరమైన తపస్సు చేసి, బ్రహ్మదేవుని మెప్పించి, తనకు, సామాన్యులెవరిచేతా చావు లేకుండా వరం పొందాడు. ఆ వరబలంతోనే, అతను, ముల్లోకాలనూ జయించాడు. అతని తమ్ముడయిన హిరణ్యాక్షుడు, తన్ను గెలిచేవా రెవరూ లేరనే గర్వంతో చరించటం మొదలుపెట్టాడు. అతణ్ణి చూసినవారందరూ, అదలిపోయేవారు.

ఒకసారి, హిరణ్యాక్షుడు, గద ధరించి, దేవలోకానికి వెళ్ళటం సంభవించింది. అలా వెళ్ళిన ఆ అసురుని చూసి, ఆదిత్యు లందరూ, ప్రాణభీతితో పారిపోయినారు. అది గ్రహించిన హిరణ్యాక్షుడు, వారిని పిరికి పందలుగా భావించాడు. అందుకనే, వారిని ఒదిలిపెట్టి, అక్కడి నుంచి బయలుదేరి, సముద్రంలో ప్రవేశించాడు.

హిరణ్యాక్షుని చూడగానే, అక్కడఉన్న వరుణుని సైన్యమంతా చెల్లాచెదరైపోయింది. అది గ్రహించిన హిరణ్యాక్షుడు, విజయ గర్వంతో, అనేక సంవత్సరాలు అక్కడే ఉండిపోయినాడు. ఆ సమయంలో, ఒకసారి, అతను, పాతాళాధిపతి అయిన వరుణుని కలుసుకుని, పరిహాసపూర్వకంగా ఆయనకు గౌరవం చూపి, 'రాజా! నువ్వు యాదోగణానికి అధిపతివి. అసురలోక పాలకుడవు. నువ్వు, లోకపాలకు

లందరిలోనూ బలాధికుడవని పేరుపొందావు, అటువంటి నీతో పోట్లాడా లనీ, నీ భుజశక్తినీ, ప్రాభవాన్నీ హరించాలనీ నాకు బుద్ధిపుట్టింది. ఒక్క సారి, న న్నెదిరించి, నా మదాన్ని అణచగలిగితే, నీ కీర్తి చిరస్థాయిగా నిలిచిపోతుంది' అన్నాడు.

మదోన్మత్తుడూ తేజోనిధీ అయిన హిరణ్యాక్షుని మాటలు విన్న వరుణుడు, ఆ సమయంలో అతణ్ణి జయించటం అసంభవమని భావించాడు. అందుకనే, తనలో పెల్లుబికి వస్తున్న రోషాన్ని తన లోనే అణచుకుంటూ, అతనితో ఇలా అన్నాడు.

'హిరణ్యాక్షా! ప్రస్తుతం, నేను, శాంతిని కోరుతున్నాను. సంగర రంగంలో దిగటం, నా నియమానికి విరుద్ధమౌతుంది. నిజానికి, నీవంటి వీరాధివీరునితో పోరాడగలవారు, నాకు యెవరూ కనబడటం లేదు. కాని, వికుంఠపురాధీశుడైన ముకుందుడున్నాడు. అతడు నీకు సముడు కాగలడేమో ననిపిస్తోంది. ఇంతకుపూర్వం, ఆయన, రాక్షసు లెందరినో సంహరించాడనీ, మహాశక్తివంతుడనీ, ప్రజలు ప్రస్తుతించటం విన్నాను. నువ్వు, ఆ అసురాంతకుని కలుసుకుంటే, నీ ఆశయం సిద్ధి స్తుంది; నీ జన్మ ఫలప్రదమవుతుంది. ఆయనతో పోరాడటం వల్ల, నీ శక్తిసామర్థ్యాలు, ప్రపంచానికి వెల్లడికావటంకూడా జరుగుతుంది.'

అది విన్న హిరణ్యాక్షుడు ఆ వెంటనే, వికుంఠపురం వేపుగా వెళ్ళాడు. అలా వెడుతున్న ఆ మదోన్మాదికి, మార్గమధ్యంలో, నారదమహర్షి కనిపించి, 'దనుజేశ్వరులు, యేదో మరొక దారుణకర్మకు పూను కున్నట్టున్నారు' అని, పలుకరించాడు. ఆ మహర్షికి సమాధానంగా, హిర ణ్యాక్షుడు, 'ఔను; అసురవిరోధి అయిన అచ్యుతుని హతమార్చటానికీ, అసుర వర్గానికి ఆనందం చేకూర్చటానికీ నిశ్చయించుకున్నాను. అందుకనే, వైకుంఠానికి వెడుతున్నాను' అన్నాడు.

హిరణ్యాక్షుని అభిప్రాయం తెలుసుకున్న నారదమహర్షి, అతని నుద్దేశించి...

'గురుభుజు దమ్మహాత్ముడు వికుంఠపురంబున నేడు లేడు; భూ
భరము వహింప, నాదికిటి భావము దాల్చి, రసాతలంబునం
దిరవుగ నున్నవా, డచటికేగగనోపుదువేని నేగు, మం
దరయగ గల్గు నీకు, నసురాంతకుతోడి రణం బవశ్యమున్'

అని వివదపరిచాడు.

ఆ విధంగా, దానవాంతకుని జాడ తెలుసుకుని, హిరణ్యాక్షుడు, ఆ వెంటనే, రసాతలానికి ప్రయాణమై వెళ్ళాడు. అలా వెళ్ళిన అతనికి, తన దంష్ట్రాగ్రాన, భూమిని యెత్తిపట్టుకుని, సూకరాకారంలో ఉన్న శ్రీహరి, కనిపించాడు. మాయావరాహ రూపంలో ఉన్న ఆ మహానుభావుడు, ఆ సమయంలో, కులశైలాలను అటూ ఇటూ చిమ్ముతూ, బ్రహ్మాండమంతా చిల్లులు పడేటట్టు కుమ్ముతూ, సప్తసముద్రాలూ కల్లోలితమయేవిధంగా కొమ్ములతో తాటిస్తూ, సూర్యచంద్రులు ఒక మూలకు పోయేటట్టు తన పొట్టితోకను త్రిప్పుతూ, కుప్పిస్తూ, లంఘిస్తూ, విచిత్రమార్గాన చరిస్తూ ఉన్నాడు. అది చూసిన హిరణ్యాక్షుని గుండె జారిపోయింది. కాని, అతడు, మదోన్మాది కావటంవల్ల, ఆ ఉరుభీకరమూర్తి నుద్దేశించి, 'ఇది పాతాళవాసులమైన మా సొమ్ము. నువ్వు, దీన్ని దొంగిలించుకుపోవాలని చూస్తున్నావు. నీకు పౌరుషమనేదే ఉన్నపక్షంలో, నాతో పోట్లాడి, నన్ను జయించి, దీన్ని తీసుకుపోవటం ఉచితం' అని గర్జించాడు.

హిరణ్యాక్షు డలా గర్జించగానే, సూకరదంష్ట్రాగ్రాన ఉన్న భూమి, గజగజలాడింది. అది గ్రహించిన వరాహమూర్తి, ఆ ధరిత్రిని ఒక ప్రక్కగా ఉంచి, భయపడి పారిపోవటానికి ప్రయత్నిస్తున్నవానిమాదిరి నటించాడు. దైత్యాంతకుని మాయను అర్థం చేసుకోలేని ఆ దైత్యశ్రేష్ఠుడు, ఆ వెంటనే, ఆయన నుద్దేశించి...

'నిందకు రోయక, లజ్జం
జెందక, వంచనను, రణము సేసి జయంబుం
బొందెద నని తలచుచు, నిటు
పందగతిం బార బంటుపంతమె నీకున్'

అని, అతినీచంగా ఆక్షేపించాడు. అది విన్న అచ్యుతునికి, అమితమైన ఆగ్రహం కలిగింది. కాని, ఆయన, ఆ ఆగ్రహాన్ని వెలువరించకుండా, మందహాసం చేస్తూ, అతనితో ఇలా అన్నాడు.

"మేము వన్యమృగాల మనేది గ్రహించి అయినా, నీబోటి గ్రామ సింహాలు, ప్రల్లదాలు పలకటం మానుకోవాలి. నిజంగా నువ్వు శక్తి కల వాడవే అయితే, ఇలా వ్యర్థప్రలాపాలకు పూనుకోవు. యుద్ధనిపుణులయిన వారు, ఆత్మస్తుతి చేసుకోరు. నువ్వు, మృత్యుపాశబద్ధుడవు కాబట్టే, నన్ను యిలా అధిక్షేపించటం జరుగుతోంది.

రసాతలవాసుల సంపదను హరించటానికే నేను నిశ్చయించుకున్నాను. నీతో పోరాడటానికీ, నిన్ను నిర్జించటానికీ కూడా, నేను నిర్ణయించుకున్నాను. నన్ను ప్రతిఘటించగల బల శౌర్య పరాక్రమాలే నీకు ఉన్నపక్షంలో, పోరాటానికి సిద్ధం కావలసింది."

హరి పలుకుల నాకర్ణించిన హిరణ్యాక్షుడు ఉగ్రుడయినాడు. ఆ వెంటనే, అతడు, గద నెత్తి శ్రీహరిని మోదాడు. కాని, ఆ గదా ప్రహారానికి గురికాకుండా, శ్రీహరి, తప్పించుకున్నాడు తప్పించుకోవటమే కాదు; ఆ గదను చేజిక్కించుకుని, గిరగిర త్రిప్పి, తిరిగి అతనిమీదికి విసరివేశాడు. ఆ తాకిడికి మూర్ఛితుడయిన హిరణ్యాక్షుడు, అనతికాలంలోనే తెలివితెచ్చుకుని, తిరిగి ఆయన మీదికి ఉరికాడు. అప్పుడు, హరి హిరణ్యాక్షుల మధ్య, ఘోరమైన గదాయుద్ధం జరిగింది. పరస్పరజయకాంక్షతో, ఆ యిద్దరూ, చాలాసేపు పోరాడారు. వారి అన్యోన్య గదాప్రహారాలవల్ల, ఆ ఉభయుల శరీరాలూ, నెత్తుటేఱులయినై. అయినా, వారు, తమతమ గదాయుద్ధ ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తూ, అత్యుత్సాహంతో క్రీడిస్తూనే ఉన్నారు.

అంతలో, చతుర్ముఖుడు, ఋషులతోకూడా అక్కడికి వచ్చి, యజ్ఞవరాహరూపంలో ఉన్న నారాయణుని ఉద్దేశించి...

'అంచిత దివ్యమూర్తి, పరమాత్మక, యీ కలుషాత్ముడైన న
క్తంచరు డస్మదీయ వరగర్వమునన్ భువనంబులెల్ల గా

రించు, మదించి; యిట్టి విపరీత చరిత్రుని ద్రుంప కి ట్లుపే
క్షించుట గాదు, వీని బలిసేయు, వసుంధరకున్ శుభంబగున్'

అని విన్నవించుకున్నాడు. అంతేకాదు.

"స్వామీ! ఇతడు ఉట్టి మాయావి. అదీకాక, నిరంకుశుడు. సర్వభూతాలకూ విరోధి అయిన యితడు వధ్యుడుగాని, ఏ విధంగానూ క్షంతవ్యుడు కాడు. ఇతనితో మీ రిలా క్రీడించటం సమంజసంగా లేదు.

అదీకాక, ఇది అభిజిత్సమయం. ఈ సమయం కడచిపోయిన పక్షంలో, సంధ్యాసమయాన, ఇతని శక్తి ఇనుమడిస్తుంది. మాయాబలశాలి అయిన ఇతణి, ఆ సమయంలో వధించటం, కష్టసాధ్యమవుతుంది.

ఇంతకూ, యితడు, తనకు మృత్యువయిన మిమ్ము వెతుక్కుంటూ ఇంతదూరం వచ్చాడు. ఇతణ్ణి, వెంటనే తెగటార్చటం, లోకాలకు మేలు చేకూర్చటం, మీ ధర్మం"

అనికూడా మనవిచేసుకున్నాడు.

హిరణ్యాక్షుని పలుకులు విని, నారాయణుడు, మందహాసం చేశాడు. అది గ్రహించిన మహర్షులు, మహదానంద పొందారు. అసురుని ప్రాణాలు అనతికాలంలోనే హరింపబడతాయన్న విశ్వాసం, అప్పుడు, వారికి కలిగింది.

అంతలో, శ్రీమహావిష్ణువు, కౌమోదకి అనే తన గద నెత్తి, హిర ణ్యాక్షుని మోదాడు; కాని, ఆ దెబ్బను, హిరణ్యాక్షుడు తప్పించుకున్నాడు. అంతేకాదు. తన గదతో, హరిదైన గదను, దూరంగా విసరివేశాడు. అది చూసిన చతుర్ముఖాదులు, ఆశ్చర్యచకితులయినారు.

అలా నిరాయుధుడయిన హరితో, సాయుధుడయిన తను పోరా డటం ధర్మం కాదని భావించి, హిరణ్యాక్షుడు, అలాగే నిలబడిపోయినాడు. దానవుడయిన అతని ధర్మబుద్ధి, దానవాంతకుడయిన హరికి కూడా ఆనందం

కలిగించింది. ఆ వెంటనే, ఆయన, రాక్షసకులాంతకమైన తన సుదర్శన చక్రాన్ని, ఒక్కసారి స్మరించుకున్నాడు.

ఆయన తలచుకోవటమే తడవుగా, ఆ సుదర్శన చక్రం, ఆయన చేతి నలంకరించింది. అది గ్రహించిన హిరణ్యగర్భాదులు, జయజయ ధ్వానాలు చేశారు. హిరణ్యాక్షుడు మాత్రం, అమిత క్రోధంతో, శ్రీహరిని హతమార్చే నిమిత్తం, తన గద నెత్తి, తీవ్రంగా మోదాడు. వాయువేగంతో తనమీద పడబోయే ఆ గదను, శ్రీమన్నారాయణుడు, తన ఎడమకాలితో క్రిందికిత్రోశాడు. హిరణ్యాక్షుడు, ఆ గదను తిరిగి తీసుకుని, హరిమీదికి విసిరాడు. శ్రీహరి, దాన్ని, అనాయాసంగా గుప్పిట చిక్కించుకుని, హిరణ్యాక్షునకు అందించబోయినాడు. కాని, తనకు పరమ శత్రువైన శ్రీహరి అందించే గదను, తనకు సహాయంగా తీసుకోవటం హిరణ్యాక్షుడు అవమానకరంగా భావించాడు. అందుకనే, అతడు, దాన్ని నిరాకరించి, కాలానలం వంటి ఒక శూలాన్ని, ఆ యజ్ఞవరాహమూర్తిమీదికి విసిరాడు. అది చూసిన ఆదిదేవుడు, ఆ వెంటనే, తన సుదర్శనంతో, దాన్ని, మార్గమధ్యంలోనే ఖండించాడు.

అప్పటికీ, మాయావరాహమూర్తి తన కజేయుడన్న అభిప్రాయం, హిరణ్యాక్షునికి కలుగలేదు. అది కారణంగానే, అతను, మాయా యుద్ధానికి పూనుకున్నాడు. ఒక్కసారిగా, అతను, హరి మీదికి ఉఱికి, ఆయన వక్షోభాగాన తన పిడికిలితో గ్రుద్ది, అదృశ్యుడయినాడు. అసురుని ముష్టిఘాతం, ఆదినారాయణుని చలింపచేయలేకపోయింది. అంతలో, హిరణ్యాక్షుడు, తన మాయాప్రభావంవల్ల, చీకట్లు కల్పించాడు. ఝంఝామారుతాన్ని సృజించాడు. పాషాణ వర్షం కురిపించాడు. ఆకాశంనుంచి వివిధాయుధాలను విసిరాడు. యోగ మాయకు ఈశ్వరుడయిన హరి, అప్పుడు, ఆ రాక్షసమాయ నంతనూ, తన చక్రంతో నిర్మూలించటం జరిగింది.

తన శక్తి అంతా అలా నిర్వీర్యమైపోయినా, హిరణ్యాక్షుడు,

తన మూర్ఖత్వాన్ని వదలలేదు. అతడు, శ్రీహరితో, ముష్టి యుద్ధానికి తలపడ్డాడు. అది గ్రహించిన శ్రీహరి, ఆపైన ఉపేక్షించటం అనుచిత మని నిర్ణయించుకుని, అతని కణతలమీద, ఒక్క చఱపు చఱిచాడు. ఆ కరాఘాతంవల్ల, హిరణ్యాక్షుని కనుగ్రుడ్లు మీదికి వచ్చినై. అతని అవయవపటుత్వమంతా హరించిపోయింది. అతడు, తెలివితప్పి, గిర గిర తిరుగుతూ ఒరిగిపోయినాడు. అలా ఒరిగిపోయికూడా, ఆ ఆది రాక్ష సుడు, ప్రాణంపోయేవరకూ, ఆదినారాయణుని చూసి, పండ్లు పటపట లాడిస్తూనే ఉన్నాడు; క్రింది పెదిమను కొరుకుతూనే ఉన్నాడు.

ఆ విధంగా కూలిపోయిన హిరణ్యాక్షుని చూసి, బ్రహ్మాదులు అమితాశ్చర్యం పొందారు. మహర్షులకు కూడా, మనోవీధిలోమాత్రమే దర్శనీయుడయే మాధవుని ప్రత్యక్షంగా చూస్తూ, అతని కర స్పర్శ ద్వారా కాయాన్ని త్యజించిన హిరణ్యాక్షుని అదృష్టాన్ని, వారు, వేనోళ్ళ ప్రస్తుతించారు. ఆ మాయావరాహమూర్తిని అమితంగా స్తుతించారు. ఆ స్తుతి వచనాలను స్వీకరిస్తూ, శ్రీమన్నారాయణుడు, ఆపైన, అంతవరకు పాతాళ గతమై ఉన్న భూమిని ఉద్ధరించటం, నిజావాసానికి విజయంచేయటం జరిగింది.

## 21. కపిలావతారం :

కృతయుగంలో, హిరణ్యగర్భుడు, ప్రజాసృష్టి చేయవలసిందిగా, మునీశ్వరుడైన కరముని నియోగించాడు. అలా నియుక్తుడైన కర్దముడు, సరస్వతీనది ప్రాంతంలోఉన్న బిందుసరం అనేచోట, పదివేల సంవత్సరాలపాటు, తీవ్రమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి, భక్తవరదుడయిన శ్రీమన్నారాయణుడు, అతని ఎదుట సాక్షాత్క రించాడు.

ఆ విధంగా సాక్షాత్కరించిన జ్ఞానైకవేద్యునికి, సాష్టాంగ దండప్రణామా లాచరించి, కర్దముడు ఇలా స్తుతించాడు.

"మాధవా! నువ్వు సర్వభూతాంతరాత్ముడవు. సమగ్రమైన సత్త్వస్వరూపుడవు. అనేకజన్మల సుకృత ఫలమైన భక్తియోగాభ్యాసంవల్ల మాత్రమే, యోగీశ్వరులు, నిన్ను దర్శించగలుగుతారు. అటువంటి నిన్ను ప్రత్యక్షపరచుకుని, నాజన్మ ధన్యత పొందింది. కళ్యాణ ప్రదుడవైన నిన్ను, సంసార సాగరాన్ని తరింపచేసే నిన్ను, తుచ్ఛమైన కామభోగాలను కాంక్షించి సేవించేవారుకూడా ఉన్నారు. నువ్వు, వారిని కూడా ఏవగించుకోకుండా, కరుణారస వీక్షణలతో కటాక్షిస్తున్నావు. వారికోర్కెలనుకూడా యీడేరుస్తున్నావు. అది, నీ సమ్యగ్దృష్టికి తార్కాణమని, నేను భావిస్తున్నాను.

సకాములను ప్రాజ్ఞులందరూ నిరసిస్తారు. నా మటుకు నేనుకూడా, ఇంతవరకూ, అలాగే వ్యవహరించేవాణ్ణి కాని, నీ మాయకు కట్టుబడి, నేనే, ఇప్పుడు, కామమోహితుడనైనాను. నాలో, వివాహాపేక్ష జనించింది. ఆ దురాశయాన్ని సఫలం చేసుకునే నిమిత్తమే నేను నిన్ను సేవించాను.

నువ్వు ఒక్కడవైకూడా, ఇతర సహాయ సంపత్తి ఏమీ లేకపోయినా, యోగ మాయా ప్రభావంవల్ల, ఈ విశ్వాన్ని, సృజిస్తూ పాలిస్తూ సంహరిస్తూ ఉంటావు. అది, నీ లీలామహిమ. అది తెలిసికూడా, నేను, ప్రజాసృష్టికి పూనుకున్నాను. నన్ననుగ్రహించవలసింది."

అలా ప్రార్థించిన కర్దముని, శ్రీమన్నారాయణుడు, ప్రేమపూర్వ కంగా చూశాడు. చూసి, 'మహర్షీ! భక్తితో నన్ను ఆరాధించినవారు, వ్యర్థ శ్రములు కావటమంటూ ఉండదు. ఆత్మనియమంతో, నువ్వు, నన్ను అర్చించిన దానికి ఫలంగా, నీ మనోరథం, అచిరకాలంలోనే సిద్ధించి తీరుతుంది' అని చెప్పి, ఆయన చూస్తూ ఉండగానే, అంతర్హితుడయినాడు. ఆ విధమైన అనుభూతివల్ల, కర్దముడు, ఆత్మశాంతి పొంది, ఆ రోజంతా, పరమానందంతో గడిపాడు.

ఆ మర్నాడు ఉదయాన, బ్రహ్మమానసపుత్రుడూ, సప్తసాగర పరీతమైన భూమండలానికి సమ్రాట్టూ, అయిన స్వాయంభువమనువు, భార్యతోనూ, కుమార్తెతోనూ, కర్దముని ఆశ్రమానికి రావటం జరిగింది. అలా వచ్చిన ఆదిరాజు, భగవంతుని దర్శించి, ఆయన మృదుమధుర వచనాలను వినటంవల్ల కలిగిన ఆనందంతో, అమిత తేజశ్శాలి అయిన ఆయనకు గౌరవపూర్వకంగా ప్రణామం చేశాడు.

కర్దముడుకూడా, ఆదిరాజయిన స్వాయంభువును, అర్ఘ్యపాద్యాదులతో ఆనందపరచి, ఆయననూ, ఆయనతో వచ్చినవారినీ, ఉచితాసనాల మీద ఉపవిష్టులనుగా చేసి, ఇలా అన్నాడు.

"మహారాజా! మీరు, సాక్షాత్తు హరి అంశతో జనించిన మహనీయులు. దుష్టశిక్షణకోసం, శిష్టరక్షణకోసం, మీరు, అప్పుడప్పుడు, యిలా పర్యటిస్తూ ఉంటారు. మీరు, యిలా పర్యటిస్తూ ఉండటంవల్లనే, లోకంలో వర్ణాశ్రమ ధర్మాలు వర్ధిల్లటం జరుగుతోంది. ఇంతకూ, మీరు, యిలా రావటానికి గల కారణ మేమిటో చెప్పవలసింది."

అలా అడిగిన కర్దమునకు, ఆ మహారాజు, ఇలా సమాధాన మిచ్చాడు.

"మహర్షీ! తపో జ్ఞాన యోగయుక్తులూ, విరక్తులూ, అయిన మిమ్మల్ని, వేద విస్తరణకోసం, హిరణ్యగర్భుడు సృజించాడు. మిమ్ము రక్షించే నిమిత్తం, ఆ మహానుభావుడే, మమ్ముకూడా పుట్టించాడు. అందుకనే

బ్రహ్మ క్షత్రియులకు, పరస్పర రక్షణం, కర్తవ్య మయింది. ఆ విధ మైన సంబంధాన్ని దృఢతరం చేసుకునే ఉద్దేశంతోనే, నేను, యిక్కడికి రావటం జరిగింది'' అన్నాడు; అంతేకాదు...

''వరయోగీశ్వర, దేవహూతి యను యీ వామాక్షి, మత్పుత్రి, దా,
వర లావణ్య గుణాఢ్యులన్ వినియు నెవ్వారిన్ మదింగోర, కా
తురయై, నారదు పంపునన్, మిము వరింతున్నంచు నేతెంచె, నీ
తరుణీ భిక్ష బరిగ్రహింపుము, శుభోదాత్త క్రియాలోలతన్''

అని ప్రార్థనా పూర్వకంగా నివేదించుకున్నాడు కూడా.

ఎంతటి విరక్తులకైనా, అయాచితంగా సమ
కూరే సౌఖ్యాలను ఆదరించకపోవటం, అను
చిత మవుతుంది.

అది గ్రహించిన కర్దముడు, తన అభిమతాన్నీ, భగవంతుని ఆశీర్వాదాన్నీ, స్మరించుకుని, స్వాయంభువు నుద్దేశించి, ఇలా అన్నాడు. ''మహారాజా ! ప్రపంచంలో, ప్రథమంగా మీరు జరుప దలచిన ఈ వివాహానికి, ఈశ్వ రేశ్వరుని ఈప్సితమే కారణం. అది, నెరవేరి తీరుతుంది.

పూర్వం, విశ్వావసుడనే గంధర్వుడు, గగన విహారంచేస్తూ, మీ కుమార్తెను చూడటం తటస్థించిందనీ, ఆమె సౌందర్యానికి ముగ్ధుడై, అతడు, మేను మరచి, తన విమానంనుంచి పడిపోవటం జరిగిందనీ, నేను విన్నాను. ఈ దేవహూతి లావణ్యాతిశయానికి, అదే తార్కాణం. శ్రీదేవిని సేవించే వారికి కూడా, ఈమెను దర్శించటం దుర్ఘటమని, నేను గ్రహించాను. అటువంటి ఈమె, తనకు తానై వరించి వచ్చినప్పుడు నిరాకరించేవాడు, పురుషుడు కానే కాడు.

కాని, ఈమె పాణిగ్రహణానికి నేను సమ్మతించే ముందు, నాదైన ఒకే ఒక నియమాన్ని, మీరు, మన్నించవలసి ఉంటుంది. ఈమెకు పుత్రో దయం అయేవరకూ మాత్రమే, నేను, గృహస్థ ధర్మాన్ని పాటించటం జరుగు తుంది. ఆపైన, నాకు, భగవదాదేశానుసారం, సన్యాసం అనుష్ఠేయ మవు తుంది. భగవంతుని ఆజ్ఞోల్లంఘనం పాపహేతువు కావటమే, దానికి మూలం.''

ఆ విధంగా తన అభిప్రాయాన్ని వ్యక్తపరచిన కర్దముని, మనువు, అమితంగా అభినందించాడు. కర్దముని నియమానికి, తన భార్య అయిన శతరూపా, కుమార్తె అయిన దేవహూతీ కూడా, ఆనందంతో అంగీకరించటంవల్ల, ఆ వెంటనే, ఆయన, దేవహూతీ కర్దములకు, విధ్యుక్తంగా వివాహం చేయించాడు. ఆ తరువాత, దేవహూతిని ఆ ఆశ్రమంలోనే వదలి, భార్యతోనూ, పరివారంతోనూ, తన రాజధాని అయిన బర్హిష్మతీపురానికి వెళ్ళిపోయినాడు.

అలా రాజధానికి చేరుకున్న స్వాయంభువ మనువు, కుమార్తెను వదలివచ్చిన తాపాన్ని ఉపశమింప చేసుకునే నిమిత్తం, భగవద్భక్తిని పెంపొందించుకుని, హరికథాకర్ణనం చేస్తూ, ధర్మమార్గాన రాజ్యపాలనం చేయసాగాడు.

మంగళప్రదమైన మాధవుని కథలు వింటూ, ఆయననే మనసులో నిలుపుకుని ఆరాధిస్తూ ఉన్న ఆ మహారాజుకు, దివ్య మానుష భౌతిక వ్యథలనేవి యేవీ సంభవించలేదు. ఆ విధంగా, ఆనందమయుడై, ఆ ఆది రాజు, డెబ్బదియుగాలు రాజ్యపాలనం చేసి, అనంతరం, మోక్షం పొందటం జరిగింది.

అక్కడ, దేవహూతి, పరమపతివ్రత అని ప్రసిద్ధి పొందింది. ఆమె, తన భర్త అయిన కర్దముని భగవంతునిగాభావిస్తూ,ఆయన చిత్తవృత్తిని గ్రహించి, అణకువతోనూ, భక్తి తాత్పర్యాలతోనూ వ్యవహరించసాగింది. కామాన్ని త్యజించి, ద్వేష లోభాలకు తనలో తావులేకుండా ప్రవర్తించటం వల్లా, ఆత్మశుద్ధి నలవరచుకుని, పతి శుశ్రూషాపరాయణ అయి ఉండటం వల్లా, ఆమె తేజం, అమితంగా వృద్ధిపొందింది.

అలా ఉన్న దేవహూతిని ఆనందపరచే నిమిత్తం, కర్దముడు, తన యోగశక్తిద్వారా, కామగమనం కలిగిన ఒక అద్భుత విమానాన్ని సృజించి, ఆమెతో, అందులో విహరించసాగాడు. ఆ సమయంలో, ఆ దంపతులు, ఇంద్రాదుల విహారస్థలమైన మేరు పర్వత ప్రాంతాలలోనూ,

నందనం మొదలయిన దేవోద్యానాలలోనూ కూడా, యథేచ్ఛగా, నూరు సంవత్సరాలు, చరించటం జరిగింది.

ఆ సమయంలో, ఆ దంపతులకు, కల అనసూయ శ్రద్ధ హవిర్భువు గతి క్రియ ఖ్యాతి అరుంధతి శాంతి అనే తొమ్మండుగురు కుమార్తెలూ, కపిలు డనే కుమారుడూ జనించారు. కర్దముడు, ఆ కన్య లను, క్రమంగా, మరీచి అత్రి అంగిరసుడు పులస్త్యుడు పులహుడు క్రతువు భృగుడు వసిష్ఠుడు అథర్వుడు అనే ప్రజాపతుల కిచ్చి వివాహం చేశాడు. కపిలుడై జనించిన ఆయోగీశ్వరేశ్వరుడు, కాలక్రమాన, సాంఖ్యాచార్యుడై ప్రసిద్ధిపొందటం జరిగింది.

కపిలుడు జనించగానే, అతనిని దర్శించే నిమిత్తం, చతుర్ము ఖుడు, మునిగణ సమేతుడై వచ్చాడు. వచ్చి, కపిలుని దర్శించి, కర్దమునీ దేవహూతినీ ఉద్దేశించి, ఇలా అన్నాడు.

''మీరు కేవలమైన భక్తితో, కపటం లేకుండా, ఆ కంజదళా క్షుని అర్చించారు. మీ అర్చనలు ఫలించినై. ఆ ఆదిదేవుడే, మీకూ, మీద్వారా ముల్లోకాలకూ, మేలు చేకూర్చే నిమిత్తం, మీకు కుమారుడై జన్మించాడు. మీరు సకాములై కూడా, అనుపమభక్తితో ఆ మాధవుని ఆరాధించటంవల్ల, కృతార్థులైనారు.''

ఆ తరువాత, కొంతకాలానికి, కర్దముడు, భగవంతుడూ, తన కుమారుడూ అయిన కపిలుని, ఏకాంత స్థలంలో కలుసుకుని, ఇలా విన్న వించుకున్నాడు.

''నాయనా! పూర్వం చేసిన పాపాలవల్ల, సంసారచక్రంలో పడి తిరుగుతూఉండేవారికి, చాలాకాలానికిగాని దేవతలు ప్రసన్నులు కారు. మా పుణ్యకర్మలు ఫలించటంవల్ల, నువ్వు, మా కడుపున పుట్టి, మమ్మల్ని తరింపచేశావు.

చతుర్భుజుడవై, శంఖ చక్ర గదా పద్మాదులతో ఉండటం, నీకు సహజం. కాని, అది అలౌకికమని గ్రహించి, ఆశ్రితజన సంరక్షణార్థం,

మానవరూపం ధరించి, మాకు ఆనందాన్ని కలిగిస్తున్నావు. ఇది, నీ లీలా విలాసంగాని, వేరు కాదు.

హిరణ్యగర్భుడు నియోగించిన కార్యాన్ని, నేను, యింతవరకూ సక్రమంగా నెరవేర్చటం జరిగిందనే భావిస్తున్నాను. ఇక, భగవదాదేశాన్ని పాటించటమే నా కర్తవ్యం. అందుకనే, నిన్ను మనసులో నిలుపుకుని, నిశ్చింతతో సన్యసించి, భక్తిమార్గాన, మోక్షాన్ని సాధించాలని నేను కోరుతున్నాను."

ఆ విధంగా, వినయ విధేయతలతో విన్నవించుకున్న కర్దముని చూసి, కపిలుడు, ఇలా అన్నాడు.

"తండ్రీ! నేను, మునివేషం ధరించటం, నా కోసం కాదు; లోకం కోసం మాత్రమే. మునులకు పరతత్త్వబోధ చేయటానికే, నే నీ దేహాన్ని స్వీకరించాను.

ఆత్మతత్త్వం అర్థం చేసుకోవటం అతికష్టం. అందుకనే, సామాన్యంగా, ఎవరూ దాన్ని ఆశ్రయించరు. అది కారణంగానే, ఇటీవల, అది క్షీణించిపోవటం జరిగింది. తిరిగి దానికి పుష్టి చేకూర్చే నిమిత్తమే, నే నిలా ఉద్భవించవలసి వచ్చింది.

ఇక నువ్వు, సకలేంద్రియార్థాలనూ, సకల కర్మలనూ, సన్యసించి, మోహపాశాలను త్రెంచుకుని, ఏదో ఒక వివిక్త ప్రదేశంలో ఉండి, ఆద్యుడూ, ఆద్యంతశూన్యుడూ, అనంతుడూ, అనఘుడూ, అజుడూ, పరంజ్యోతి స్వరూపుడూ అయిన పరమేశ్వరుని, హృదయంలో నిలుపుకుని, భక్తి యోగంద్వారా, మోక్షాన్ని పొందవలసింది."

అలా కపిలుని సెలవు పొంది, కర్దముడు, మునిగణ సేవితమైన ఒక వనానికి వెళ్ళి, అక్కడ, మౌనంవహించి, నిరహంకారుడుగానూ, అసంగుడుగానూ ఉంటూ, దృఢభక్తితో, భగవంతుని మీద మనసును నిలుపుకుని, సర్వభూతాలలోనూ ఆ భగవంతుని దర్శిస్తూ, భక్తియోగ

ప్రభావంవల్ల, భాగవతులకు పరమగతి అయిన ముక్తిని పొందాడు.

## 22. కపిలోపదేశం :

కర్దముడు, సన్యసించి, వనాలకు వెళ్ళిం తరువాత, దేవహూతి, ఒకసారి, కపిలుని కలుసుకుని, ఇలా విన్నవించుకుంది.

"నాయనా ! నే నింతవరకూ, అశాశ్వతమైన విషయాలమీద అపేక్ష పెంచుకుని, గాఢాంధకారంలో తిరుగుతూ ఉన్నాను. ఆ అంధకారం నుంచి బయటపడే మార్గం, నాకు, కనపడకుండా ఉంది.

నువ్వు, జ్ఞానభాస్కరుడవు. సాక్షాత్తు భగవంతుడవు. నువ్వు, నా కడుపున పుట్టడంవల్ల, నా కిక పునర్జన్మ అనేదే లేదని నేను భావిస్తున్నాను. నన్ను ఆవరించి ఉన్న అహంకార మమకారాలను తొలగించటానికి, నువ్వే అర్హుడవని కూడా, నేను విశ్వసిస్తున్నాను. నీ నుంచి విజ్ఞానం పొందాలనీ, నీ ఉపదేశంద్వారా, ముక్తిని సముపార్జించుకోవాలనీ, నే నిప్పుడు కోరుతున్నాను. తల్లినైన నా కోరికను, నువ్వు, తప్పక తీరుస్తావనికూడా భావిస్తున్నాను."

అలా అభ్యర్థించిన దేవహూతికి, కపిలాచార్యుడు, భక్తి యోగాన్ని ఇలా బోధించాడు.

"బ్రహ్మసిద్ధి పొందే విషయంలో, భక్తి యోగానికి మించిన మార్గం, మరొకటి లేదు. భక్తియోగంలో పరిణతి పొందినవారు, భగవత్సేవకే తమ జీవితాన్ని అంకితంచేసుకుంటారు. విశుద్ధమైన హృదయంతో, సదా విశ్వేశ్వరునే ధ్యానిస్తూ, కీర్తిస్తూ ఉంటారు. అలా ఆ పరమాత్మని ఆరాధించేవారు, కర్మకాండకు ఏవిధమైన ప్రాధాన్యతనూ ఇవ్వరు. అసలు, వారు, కర్మ త్యాగం చేస్తారు. బంధు మిత్రులను

కూడా త్యజిస్తారు. దేహాభిమానాన్ని వదులుకుంటారు. వారే సాధువులు. అటువంటి సాధువులతో కలిగిన సంబంధం, సర్వ దోషాలనూ హరిస్తుంది; మోక్షమార్గాన్ని చూపిస్తుంది.

సాధువులయినవారు సమావేశమైనచోట, తప్పకుండా, హరికథాలాపం జరుగుతూ ఉంటుంది. అది కారణంగా, అక్కడి వారికి, శ్రీహరిపట్ల శ్రద్ధ జనిస్తుంది. ఆ విధమైన శ్రద్ధ మూలంగా, ఆయనమీద ఆసక్తి కలుగుతుంది. ఆ ఆసక్తి భక్తిగా పరిణమిస్తుంది.

అలా లభించిన భక్తియోగం ద్వారా, విషయవాసనలు దూరం కావటం, ఐహికాముష్మిక భోగాలపట్ల విరక్తి కలగటం, జరుగుతుంది. దానినే, వైరాగ్యమంటారు. ఆ వైరాగ్యంవల్ల జనించే జ్ఞానాన్ని, పరమేశ్వరార్పణం చేయటంద్వారా, పరమపదం లభిస్తుంది.

పరమపురుషుడయిన భగవంతుని కాదని, అన్యులను సేవించేవారు, భవబంధంలో చిక్కుకుంటారు. మృత్యురూపమైన సంసారంలో పడి, దిక్కుతోచక, పరిభ్రమిస్తూ ఉంటారు. ముక్తిదాత అయిన ముకుందుని గుర్తించేవరకూ, వారికి, కష్టాలు కలుగుతూనే ఉంటై.

విషయవాసనలను దూరం చేసుకుని, మాధవునిమీద మనసును నిలుపుకోవటమే,

'భక్తి' అనిపించుకుంటుంది. అది, తామస, రాజస సాత్వికాలని, మూడు రకాలుగా ఉంటుంది.

హింసా ప్రవృత్తితోనూ, దంభప్రక్రియతోనూ, మాత్సర్యపూరితంగానూ, చేసే భక్తి, తామస భక్తి అనీ, విషయభోగాలనుగానీ, మహదైశ్వర్యాన్ని గానీ, సద్యశాన్నిగానీ, వాంఛించి చేసే భక్తి, రాజస భక్తి అనీ, పూర్వం చేసిన పాపాలను నిర్మూలించుకునే ఉద్దేశంతోనూ, పరమేశ్వరుని ప్రసన్నుని చేసుకునే అభిప్రాయంతోనూ, శాస్త్రచోదిత మార్గాన్ని అనుసరించాలనే మనసుతోనూ, చేసే భక్తి, సాత్త్వికభక్తి అనీ పిలువబడుతుంది. ఇవన్నీ సగుణభక్తికి రూపాలు. వీటికి మించిన ఉత్తమోత్తమమైన భక్తి, మరొకటి ఉంది. దాన్ని నిర్గుణ భక్తి అంటారు. పరమాత్మని గుణాలను వినగానే, ఆయనమీద మనసు నిలబడిపోవటం, ఏ విధమైన ఫలాపేక్షా లేకుండా వ్యవహరించటం, నిర్గుణభక్తి యోగానికి లక్షణాలు. ఆ నిర్గుణభక్తి నవలంబించినవారు, భగవత్సేవనే, పరమావధిగా భావిస్తారు.

భగవంతుడు సర్వభూతమయుడు. అది గ్రహించలేనివారే, పరులను ద్వేషిస్తారు. ఆ విధమైన ద్వేషబుద్ధి కలవారికి, మనశ్శాంతి అనేది లభించదు. 'నేను' 'వారు' అనే భేద

బుద్ధితో ప్రవర్తించేవారిని, పరమేశ్వరుడు, మృత్యుస్వరూపుడై పీడిస్తాడు. అందుకనే, భక్తులైనవారు, సర్వభూతాలనూ సమబుద్ధితో చూస్తారు. అలా చూడగలగటమే 'అభేదదర్శన' మనిపించుకుంటుంది. అది పరమేశ్వరోపాసకుల ప్రథమ కర్తవ్యం.

సర్వకర్మలనూ, వాటి ఫలాలనూ, పరమాత్మునికే అర్పించినవారు, పరమేశ్వరుని ప్రీతికి పాత్రులవుతారు. కర్తృత్వాభిమానం లేకుండా, సమదర్శనులై చరించేవారు, భగవద్భక్తులలో శ్రేష్ఠతము లనిపించుకుంటారు. వారికే ముక్తి కరతలామలక మవుతుంది."

ఆ విధంగా, దేవహూతికి, జ్ఞానోపదేశం చేసిన అనంతరం, కపిలుడు, ఆమెవద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, దేవహూతి, కపిలుని ఉపదేశానుసారం, యోగ సాధనకు పూనుకుని, పుత్ర రూపంలో తనకు ధన్యత చేకూర్చిన ఆ పరాత్పరుని, హృదయంలో నిలుపుకుని, వివిధ విచారాలనూ దూరం చేసుకుని, సమాధి నిష్ఠలో ఉండి, కాలక్రమాన, జీవన్ముక్తి పొందింది.

దేవహూతికి జీవన్ముక్తి లభించిన ఆ స్థలాన్ని, 'సిద్ధిపదం' అంటారు. ఆ ప్రదేశం, అనంతరకాలంలో, పరమ పావనమైన క్షేత్రంగా ప్రసిద్ధి కెక్కింది.

జీవన్ముక్తి లభించుం
గావున నేమరక తలపుగైకొని దీనిన్
వావిరి నొల్లనివారికి
దావల మగు మృత్యు భయము, దవ్వగు సుఖమున్.

## 23. కర్దమ దుహితృ వంశం :

దేవహూతి సోదరి అయిన ఆకూతిని, శతరూపా స్వాయంభువులు, 'రుచి' అనే ప్రజాపతికిచ్చి, వివాహంచేశారు. ఆ ఆకూతీ రుచులకు, యజ్ఞుడూ, దక్షిణా, అనే జంట జనించారు. ఆ జంటకు, కాలక్రమాన, పన్నెండుగురు కుమారులు కలిగారు. వారినే తుషితు లంటారు.

కర్దముని తొమ్మండుగురు కుమార్తెలూ, తొమ్మిదిమంది బ్రహ్మర్షులకు, భార్యలైనారు. వారిలో, మరీచి భార్య అయిన కళ, కశ్యపునీ, పూర్ణిమునీ కన్నది. పూర్ణిమునకు, విరజుడూ విశ్వగుడూ అనే ఇద్దరు కుమారులూ, దేవకుల్య అనే కూతురూ జన్మించారు. ఆ దేవకుల్య, జన్మాంతరాన జాహ్నవి కావటం జరిగింది.

అత్రి మహాముని భార్య అయిన అనసూయకు, హరి హర బ్రహ్మాంశలైన, దత్త దుర్వాస సోములు, క్రమంగా పుట్టారు.

అంగిరసుడనే మునికి, శ్రద్ధయందు, సినీవాలి, కుహూవు, రాక, అనుమతి, అనే నలుగురు కుమార్తెలూ, ఉచథ్యుడు, బృహస్పతి, అనే ఇద్దరు కుమారులూ కలిగారు.

పులస్త్యునికి, హవిర్భుగయందు, అగస్త్యుడూ, విశ్రవసుడూ జన్మించారు. ఆ విశ్రవసునికి, ఇలబిల అనే భార్యయందు కుబేరుడూ, కైకసి అనే భార్యయందు రావణ కుంభకర్ణ విభీషణులూ పుట్టారు.

పులహునకు, గతి, పత్ని అయింది. గతీ పులహులకు, ముగ్గురు కుమారులు కలిగారు. అలాగే, క్రతువునకు క్రియ అనే భార్యయందు, వాలఖిల్యు లుదయించారు. వసిష్ఠునకు, ఊర్జ అనే పత్నియందు, సప్తఋషులూ, మరొక భార్యయందు, శక్తి ప్రభృతులూ జనించారు. అథర్వపత్ని అయిన చిత్తి, ఒకే ఒక కుమారుని కన్నది. భృగుపత్ని అయిన ఖ్యాతికి, ధాత, విధాత అనే ఇద్దరు కుమారులూ, శ్రీదేవి అనే కూతురూ కలిగారు. భృగునకు, మరొక భార్యవల్ల, శుక్రు డుదయించాడు. ఆ తరువాత, ధాతకు,

మృకండుడు జనించాడు. మృకండునకు, మార్కండేయుడు పుట్టాడు. ఇది, కర్దముని పుత్రికలదైన సంతాన క్రమం.

## 24. నర నారాయణులు :

స్వాయంభువమనువు కూతురయిన ప్రసూతికీ, బ్రహ్మమానస పుత్రుడయిన దక్షునికీ, పదహారుగురు కుమార్తెలు కలిగారు. దక్షుడు, ఆ పదహారుగురిలోనూ, పదముగ్గురిని, ధర్మున కిచ్చి వివాహం చేశాడు. ఆ పదముగ్గురిలోనూ ఒకర్తు అయిన మూర్తియందు, ధర్మునకు, నర నారాయణులనే ఋషు లిద్దరు జన్మించారు.

నర నారాయణులు జన్మించగానే, బ్రహ్మాది దేవతలు, వారిని దర్శించి, ఎంతగానో స్తుతించారు. ఆ సమయంలో, పుష్పవర్షం కురిసింది. దేవదుందుభులు మ్రోసినై. అప్సరస లాడారు. గంధర్వులు గానం చేశారు. ప్రపంచ మంతా, ఎంతగానో ఆనందించింది. అదంతా గ్రహించిన నర నారాయణులు, ఆ వెంటనే, తపస్సు చేసుకునే నిమిత్తం, గంధమాదన పర్వతానికి వెళ్ళారు.

నర నారాయణుల శరీరకాంతి, భూమ్యాకాశాలను వెలిగిస్తూ ఉండేది. వారి బలపరాక్రమాలు, అమోఘమైనవిగా ఉండేవి.

వా రొకసారి, దేవేంద్రుని అభ్యర్థనమీద, సురాసుర యుద్ధంలో, సురల పక్షం వహించి, అసురు లందరినీ హతమార్చటం జరిగింది.

నరుడు ప్రత్యేకంగా, పౌలోములనే రాక్షసులను, వేలసంఖ్యలో వధించాడు. జంభు డనే ఘోరరాక్షసుని, ఒకేఒక బాణంతో కూల్చేశాడు. సముద్రంలో ఉన్న నివాతకవచు లనే రాక్షసులను, అరవైవేలమందిని, ఒక్కడే సంహరించాడు. ఒకసారి, అగ్నిదేవుని తృప్తిపరచే నిమిత్తం, వేలకొలది దేవతలతో ఉన్న మహేంద్రునికూడా, పరాజితుని చేశాడు. అలా చరిస్తూ, నర నారాయణులు, ముల్లోకాలలోనూ, అజేయు లనిపించు కున్నారు.

పూర్వం, దంభోద్భవుడనే ఒక మహారాజు, తన భుజబల పరాక్రమాలవల్ల, భూమండలాన్నంతనూ వశం చేసుకుని, కనపడ్డ వా రందరితోనూ కయ్యానికి దిగుతూ ఉండేవాడు. బలపరాక్రమాలలో, తనకంటె అధికుడు లేకపోయినా, తనంతవా డయినా లేకపోవటం, అతనికి గర్వకారణంగా ఉండేది. అటువంటి గర్విష్టి, కొందరు మహర్షుల సూచనమీద, ఒకసారి, గంధమాదనపర్వతానికి వెళ్ళి, అక్కడ, తపోనిష్ఠలో ఉన్న నరనారాయణులను చూశాడు. చూసి, వారికి, భక్తి తాత్పర్యాలతో ప్రణామాదికాలు చేశాడు. వారుకూడా, అతనిని సత్కరించి, యోగ క్షేమా లడిగి తెలుసుకుని, అతను వచ్చిన పని తెలియపరచవలసిందని కోరారు. 'నీకోరిక ఎటువంటిదైనాసరే తీరుస్తాం' అనికూడా, ముందుగానే, వారు అతనికి వాగ్దానం చేశారు.

ఐశ్వర్యగర్వంవల్లా, బలమదంవల్లా, కళ్ళు కప్పబడి ఉన్న దంభోద్భవుడు, ఆ మహర్షుల నుద్దేశించి, 'నేను, నా బాహుబలంద్వారా, భూమండలాన్నంతనూ జయించాను. శత్రువు అనేవాడు లేకుండా చేసుకున్నాను. 'ఈ మహారాజు మానవాతీతుడు', అన్న ప్రసిద్ధిపొందాను. కాని, నాతో పోరాడదగ్గ వీరుడు లేడే అన్న విచారం మాత్రం, నన్ను పీడిస్తోంది.

మీరు, మహర్షి శ్రేష్ఠులనీ, మానవలోకంలో ఉన్న మదోన్మాదులను నిర్మూలించటానికే అవతరించారనీ, నేను విన్నాను. అందుకనే, మీతో యుద్ధం చేయాలనీ, మిమ్మల్నికూడా జయించాలనీ, నేను కోరుతున్నాను. ధర్మస్వరూపులయిన మీరు, మీ వాగ్దానాన్ని నిలుపుకుని, నా వాంఛితాన్ని ఈడేరుస్తారని విశ్వసిస్తున్నాను,' అని విన్నవించుకున్నాడు.

అది విన్న నర నారాయణులు, అతని అజ్ఞానానికి అమితాశ్చర్యంపొందారు. అందుకనే, వారు, 'మేము ఆశ్రమవాసులం. క్రోధ లోభాలకు, మాలో, తావు లేనేలేదు. సమర భావమే మాకు లేనప్పుడు, మాకు, శస్త్రాస్త్రసంపత్తి ఎలా లభిస్తుంది ? శస్త్రాస్త్రాలులేకుండా సమరం చేయటం ఎలా సంభవిస్తుంది ?' అన్నారు.

ఆ విధంగా, వారు, సహనం చూపినా, ఆ మహారాజు, వారి మాహాత్మ్యన్ని గ్రహించలేకపోయినాడు. అది కారణంగానే, వారిని ఉద్రేకపరచేమాట లెన్నో అన్నాడు. 'మీకు శక్తి అనేదే ఉంటే, నాతో పోరాడవలసింది', అని, వారిని, పదేపదే, సమరానికి ఆహ్వానించసాగాడు.

దంభోద్భవుని మూర్ఖత్వం, నరునకు కోపకారణ మయింది. ఆ వెంటనే, ఆయన, పిడికెడు దర్భలు తీసుకుని, వాటిని మంత్రించి, అతని మీదకు విసిరాడు. ఆ దర్భలు, అనేకాక్షౌహిణుల సంఖ్యలో, అస్త్రాలుగా మారి, ఆ మహారాజునూ, అతని సైన్యాన్నీ, కలవరపరచినై. మహర్షిదయిన మంత్రశక్తివల్ల, ఒక దివ్యతేజం ఉద్భవించి, ప్రత్యర్థులకు అంధత్వం కలిగించింది. అది గ్రహించిన మహారాజు, ఆ వెంటనే, నరుని పాదాలమీద పడి, తన తప్పిదాన్ని క్షమించవలసిందనీ, తన్నూ తన సైన్యాన్నీ రక్షించవలసిందనీ, ప్రార్థించాడు.

అలా శరణాగతుడయిన దంభోద్భవునిమీద దయ తలచి, ఆ మహర్షి, తన అస్త్రాలను ఉపసంహరించుకున్నాడు ; మదోన్మాదంవల్ల సాధించే దేమీ ఉండదనీ, దురుసుతనం దోషమనీ, అల్పులనుగానీ, అధికులనుగానీ, ఆక్షేపించటం శ్రేయస్కరం కాదనీ, బోధించి, అతడు తిరిగి పోవటానికి అనుజ్ఞ నిచ్చాడు.

ఆ విధంగా పరాభవం పొందిన దంభోద్భవుడు, ఆ తరువాత, నర నారాయణుల శక్తిని గ్రహించి, తన దర్పాన్ని తొలగించుకుని, ధర్మమార్గాన రాజ్యపాలనం చేశాడు. ఆ నర నారాయణులే, ఆ తరువాత, కృష్ణార్జునులుగా జన్మించి, మహాభారతయుద్ధంలో, మదోన్మాదులయిన క్షత్రియు లందరినీ సంహరించటం జరిగింది.

**25.** *శివద్రోహ ఫలం :*

దక్షప్రజాపతి, తన పదహారుమంది కుమార్తెలలోనూ, సతి అనే కన్యను, పరమేష్ఠి ప్రోద్బలంమీద, పరమశివున కిచ్చి వివాహం చేశాడు. కాని, ఆయనపట్ల, అతనికి, మొదటినుంచీకూడా, అభిమాన గౌరవాలు లేవు.

పరమశివుడు, భూత ప్రేత పరివృతుడై ఉంటాడనీ, విభూతి పూసుకుని, అస్థిభూషణాలు ధరించి, ఉన్మత్తుని మాదిరి, దిగంబరుడై, స్మశానాలలో తిరుగుతూ ఉంటాడనీ, మాన మర్యాదలు లేనివాడనీ, తామస గుణ ప్రథానులయిన ప్రమథులకు నాధుడనీ, ఉగ్రుడనీ, అశుచి అనీ, దక్షుడు భావిస్తూ ఉండేవాడు. అది కారణంగానే, అతనికి, ఆ పరమశివుని పట్ల, అదోవిధమైన నిరాదరణ జనించింది. అదంతా గ్రహించికూడా, పరమేశ్వరుడు, తన భార్య అయిన సతికి ఎక్కడ కష్టం కలుగుతుందో అని, మామ అయిన దక్షుని, మన్నిస్తూ వచ్చాడు.

సతి, మహాపతివ్రత. అనన్యచిత్తంతో, ఆమె, శివుని సేవించేది. ఆయన, సర్వసమర్థుడనీ, మంగళకరుడనీ, ఆమె భావించేది. అందుకనే, ఆయనను యెవ రే విధంగా అవమానపరచినా, ఆమె సహించేది కాదు. అయినా, తన తండ్రిదైన శివ తిరస్కారభావాన్ని మాత్రం, అమితమయిన బాధతో, సహిస్తూ ఉండేది.

అలా ఉండగా, ఒకసారి, ప్రజాపతు లందరూ, ఒక సత్రం నిర్వహించటం జరిగింది. ఆ యాగాన్ని దర్శించే నిమిత్తం, దేవతలూ, ఋషులూ, చాలామంది వచ్చారు. పరమశివుడు కూడా, ఆ సమయంలో, అక్కడే ఉన్నాడు. అంతలో, అమిత తేజశ్శాలి అయిన దక్షుడు, అక్కడికి వచ్చాడు. అలా వచ్చిన దక్షప్రజాపతిని చూసి, పరమేష్ఠి పరమశివుడూ తప్ప, మిగిలినవా రందరూ, లేచి నుంచున్నారు ; గౌరవం చూపారు.

అది గ్రహించిన దక్షుడు, బ్రహ్మతోపాటు శివుడు కూడా కూర్చుని ఉండటం, సహించలేకపోయినాడు. అంతేకాదు. తనకు అల్లుడయిన శివుడు, తనపట్ల అవమానకరంగా ప్రవర్తించాడనికూడాభావించాడు. అందుకనే, కళ్ళతో నిప్పులు క్రక్కుతూ, సదస్యుల నుద్దేశించి ఇలా అన్నాడు.

''క్రియాశూన్యుడయిన ఈ శివుడు, పెద్దల ఆచారాన్ని ధిక్కరించాడు. మామనైన నన్ను పరాభవించాడు. దీనికి ఫలితంగా, నా శాపం

వల్ల, ఇతనికి, దేవయజ్ఞాలలో, ఇంద్రోపేంద్రాదులతో సమంగా హవిర్భాగం పొందే అర్హత, లేకుండా పోతుంది."

అలా శపింపబడి కూడా, శంకరుడు, ఏమీ అనలేదు. కాని, ఆ వెంటనే, అక్కడనుంచి వెళ్ళిపోయినాడు.

అదంతా చూసిన పూజ్యులు కొందరు, దక్షుని అనుచితచర్యను విమర్శించారు. అంతలో, ప్రమథ ముఖ్యుడయిన నందీశ్వరుడు, లేచి, ఇలా అన్నాడు.

"దేహాభిమానంతో, శంకరునకు ద్రోహంచేసిన దక్షుడు, తత్త్వ విముఖుడూ, కర్మతంత్ర ప్రచారకుడూ, భోగలాలసుడూ, పశుప్రాయుడూ, అవుతాడు. అంతేకాదు; అతడు, మేషముఖుడు కావటం కూడా జరుగుతుంది. ఈ దక్షుని అనుసరించి ప్రవర్తించేవా రందరూ, జనన మరణ రూపకమైన సంసారచక్రంలో పడి, నలిగిపోతూ ఉండటం కూడా సంభవిస్తుంది."

అలా, దక్షునీ, దక్షుని అనుయాయులనూ, శపించిన నందీశ్వరుని పట్ల, భృగుమహర్షికి అమితమైన కోపం వచ్చింది. అందుకనే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, 'శివభక్తు లందరూ, పాషండులూ, శుచిహీనులూ, మూర్ఖులూ, జటాభస్మాస్థిధారులూ అవుతారు' అని ప్రతి శాప మిచ్చాడు.

అప్పటినుంచీ, దక్షునకూ శివునకూమధ్య, క్రోధ ద్వేషాలు అమితంగా పెరిగిపోయినై. అదలా ఉండగా, బ్రహ్మదేవుడు, దక్షుని, ప్రజాపతులకు పతిగా అభిషేకించటం జరిగింది. ఆ పదవి పొందిన దక్షుని గర్వం, ఇనుమడించింది. అది కారణంగా, ఆయన, యజ్ఞ ప్రధానుడయిన రుద్రుడు లేకుండానే, 'వాజపేయం' అనే యాగం చేశాడు. ఆ తరువాత, 'బృహస్పతి యజ్ఞం' చేయటానికి పూనుకున్నాడు.

ఆ బృహస్పతిసవనాన్ని చూసే నిమిత్తం, ప్రజాపతులూ, మహర్షులూ, దేవతలూ, ఎందరో వెళ్ళారు. అలా వెడుతున్న ఖేచరుల

మూలంగా మాత్రమే, సతి, తన తండ్రి తలపెట్టిన యజ్ఞాన్నిగురించి తెలుసుకోగలిగింది.

తన తండ్రి. యజ్ఞమహోత్సవం సంకల్పించటం, ఆ యజ్ఞాన్ని చూడటానికి, ఏ సంబంధం లేని, సిద్ధగంధర్వవిద్యాధర స్త్రీలు ఎంతోమంది, తమతమ భర్తలతో వెడుతూ ఉండటం, గ్రహించిన సతికి, తనుకూడా వెళ్ళాలన్న కోరిక కలిగింది. కాని, ఆమెకు, తన తండ్రిలో ఉన్న శివ ద్వేషం, బాగా తెలుసు. పరమశివునకు ఆహ్వానం రాకపోవటానికి, దక్షుని శివ ద్వేషమే కారణమని కూడా, ఆమె, గ్రహించకపోలేదు. అయినా, పుట్టింటిమీద స్త్రీలకు సహజంగా ఉండే అభిమానంతో, ఆమె, శంకరుని సమీపించి, 'మీ మామ అయిన దక్ష ప్రజాపతి, బృహస్పతి సవనం చేస్తున్నారనీ, విబుధు లెందరో ఆ యాగ సందర్శనార్థం వెడుతున్నారనీ తెలుస్తోంది. మనంకూడా వెడితే బాగుంటుంది. అలా వెళ్ళటంవల్ల, ఆ మహోత్సవం చూడటం, నన్ను కని పెంచిన తలిదండ్రులనూ, ఈసందర్భంలో అక్కడకు వచ్చే అక్కచెల్లెండ్రనూ, బాల్య స్నేహితురాండ్రనూ, బంధువులనూ కలుసుకోవటం జరుగుతుంది,' అని విన్నవించుకుంది. అంతే కాదు. 'మీకు ఆహ్వానం రాలేదని నాకూ తెలుసు. పిలువని పేరంటానికి వెళ్ళటం ఉచితం కాదని కూడా, నే నెరుగున్నాను. అయినా...

పెనిమిటి వద్దకూ, పుట్టింటికీ, స్నేహితుల
యింటికీ, పూజ్యుల ఇళ్ళకూ, పిలువకపోయినా
వెళ్ళవచ్చునని పెద్దలు చెబుతారు.

ఆ అభిప్రాయంతోనే, మిమ్మల్ని యిలా అర్థిస్తున్నాను,' అనికూడా నివేదించుకుంది.

ప్రియురాలి మాటలు విన్న పరమేశ్వరుడు, మందహాసం చేశాడు. కాని, పూర్వం, దక్షుడు తన్ను పరాభవించిన విషయం గుర్తుకు తెచ్చుకుని, ఆమెతో ఇలా అన్నాడు.

"పిలువకపోయినా, ఆత్మ బంధువుల
యిళ్లకు పోవటం అసమంజసంకాదు. కాని,
దురభిమానులూ, విద్యా వయో రూప విత్త
సంపదలవల్లా, కులాధిక్యతవల్లా గర్వించిన
వారూ, దుష్టులైనవారూ, ఆత్మబంధువులే
అయినా, త్యాజ్యులే అవుతారు. కుటిలాత్ము
లైనవారు, పూజ్యులను అనాదరంతో చూస్తారు.
వారి చూపులూ మాటలూ, అదో విధంగాఉంటై.
వాటిని భరించటం చాలా కష్టం.

నువ్వు మీ తండ్రికి ముద్దులబిడ్డవని నాకు తెలుసు. అయినా, నువ్వు నన్ను పెళ్లిచేసుకోవటంవల్ల, ఆయన ద్వేషానికి పాత్రురాల వైనావు. అందుకనే, నువ్వు ప్రేమతో వెళ్లినా, ఆయన నిన్ను పరాభ వించి తీరుతాడు. ఇంతకూ, మీ నాయన, ఉట్టి మూర్ఖుడు. అసలు...

అభ్యుత్థానాభి వందనలు, పూజలు, అన్నవి,
అంతర్యామి అయినపరమపురుషునికి జరుగుతై
కాని, దేహానికికాదు.

ఆ పరమపురుషునికి, నేను, అనుక్షణం, మనసులో నమస్క రిస్తూనే ఉంటాను దక్షుడు, అది గ్రహించలేకుండా ఉన్నాడు. అందుకనే, నీకు తండ్రి అయినా, దర్శనీయుడు కాడని నేను భావిస్తున్నాను. నా మాట విన్నపక్షంలో, నీ కే బాధా ఉండదు. అలా కాకపోతే, అవమానంపాలు కావటం తప్పదు."

అలా పలికిన పరమేశ్వరుని హృదయం, పార్వతికి, అర్థం కాక పోలేదు కాని, తన అక్కచెల్లెండ్రతోపాటు, తనుకూడా, తన తండ్రి చేస్తున్న మహోత్సవంలో పాల్గొనాలన్న ఔత్సుక్యం ఆమెలో అధికం కావటం

వల్ల, ఆమె, ఆయనను తిరిగి బ్రతిమాలుకుంది. తనకు అర్ధశరీరాన్నిచ్చి ఆదరిస్తున్న ప్రేమమూర్తి, తన కోరికను ఈ విషయంలో తీర్చకపోవటం, తనకు, తలవంపులుగా భావించింది. తాను, ఆ ఉత్సవసమయంలో అక్కడ లేకపోవడంవల్ల, పరులు, పరిపరివిధాల, తన్ను విమర్శించటం జరుగుతుందనీ, ఆ విధమైన విమర్శలకు పాల్పడేకంటె, అక్కడికి వెళ్ళి, తన తండ్రి వల్ల కాకపోయినా, తల్లివల్లా, పినతల్లులవల్లా, తోబుట్టువులవల్లా ఆదరింపబడటం సమంజసంగా ఉండవచ్చుననీ, ఆమె, అతి దీనంగా, భర్తకు నివేదించుకుంది.

అలా ప్రార్థించిన దాక్షాయణి కోరికను, మహేశ్వరుడు, కాదనలేకపోయినాడు; కాని, తన అభిప్రాయాన్ని మాత్రం, ఆమెకు తిరిగి విశదపరచాడు. మర్యాద నియ్యని మామ యింటికి వెళ్ళటానికి తన మనసు అంగీకరించటంలేదనీ, ఆమె వెళ్ళదలచుకుంటే, తన కే విధమైన అభ్యంతరం లేదనీ కూడా, ఆయన ఆమెకు తెలియపరచాడు.

అయినా, మణిమంతుడు మొదలయిన శివపార్షదులతోనూ, ఇతరులయిన రుద్రానుచరులతోనూ, కొందరు యక్షులతోనూ, శర్వాణి, శంఖ దుందుభిధ్వానాలమధ్య, వృషభేంద్ర వాహనమెక్కి, దక్షుని వీటికి బయలుదేరింది. అలా బయలుదేరి....

మనమున మోదమందుచు, నుమా రమణీమణి గాంచె, దారు, మృత్
కనక, కుశా-జినా-యస నికాయ వినిర్మిత పాత్రసీమమున్,
అనుపమ వేద ఘోష సుమహ త్పశుబంధన కర్మభూమమున్,
ముని విబుధాభిరామము, సముజ్జ్వలహోమము, యజ్ఞధామమున్.

దాక్షాయణి, యజ్ఞశాలలో ప్రవేశించటం చూసికూడా, అక్కడ సమావేశమైన పెద్దలూ, బంధుమిత్రాదులూ, ఆమెను పలుకరించలేదు. ఆమెను పలుకరించాలని ఉన్నా, దక్షు డే మనుకుంటాడో అని, వారందరూ భయపడ్డారు. కాని, దక్షుని భార్యా, ఆమె కుమార్తెలూ, దక్షుని మరదళ్ళూ

మాత్రం, ఆమెను సమీపించి, ఆదరపూర్వకంగా స్వాగతం చెప్పారు. ప్రేమతో కౌగిలించుకున్నారు. కుశల ప్రశ్నలు వేశారు.

అంతలో, అక్కడ సమావేశమైన భూతగణం, యజ్ఞ వాటిక నలువంకలా చూడటం జరిగింది. అది చూడగానే, సహజమైన రుద్ర భాగం, అక్కడ కల్పింపబడకపోవటం, వారికి కోపకారణమయింది. అది గ్రహించిన దాక్షాయణి, తనవంకకూడా చూడని తండ్రిని సమీపించి, కొంచెం పరుషంగానే, ఇలా అన్నది.

'దేహు లందరికీ, శంకరు డొక్కడే ప్రియు డైనవాడు. ఆయన సర్వాత్ముడు. ఆయన, ఈ లోకంలోఉన్న అందరినీ, సమంగానే చూస్తాడు. ఒకరు ఎక్కువ అనీ, మరొకరు తక్కువ అనీ, ఆయన భావించడు. మాత్సర్య రహితుడైన ఆ మహేశ్వరునిపట్ల ద్వేషం వహించటం, శ్రేయఃకాములైనవారికి యెవ రికీ సమంజసంకాదు.

ఇతరులలో దోషాలున్నా, సాధువులైనవారు సహిస్తారు. కాని, నువ్వు, గుణాధికుడూ దోషరహితుడూ అయిన ఆ పరమేశ్వరుని, అకారణంగా ద్వేషిస్తున్నావు.

శివనామోచ్చారణ వల్ల, ఎటువంటి పాపా లయినా క్షయమైపోతై. అటువంటి శివుని నిందించటం అనుచితం. అనుచితమే కాదు; అమంగళకరంకూడాను.

శివుని సేవించేవారికి, బ్రహ్మానందం సిద్ధి స్తుంది. శివుడు, తన భక్తులైనవారికి, సర్వా ర్థాలనూ సమకూరుస్తాడు. అటువంటి లోక బాంధవుని దూషించటం, సాధులక్షణం కాదు.

దుష్టాత్ములుమాత్రమే ఈశ్వరుని దూషి
స్తారు. ఈశ్వరదూషణ జరిగే సమయంలో,
శక్తిహీనులైన పక్షంలో, చెవులు మూసుకుని
వెళ్లిపోవటం, శక్తివంతులయినపక్షంలో, ఆ
నిందకుని నాలుకను కోసివేయటం, లేదా,
తనుత్యాగం చేయటం, అన్నవి, ధర్మాలు.

నామటుకు నేను, శివేతరుడవైన నీ కుమార్తెనని చెప్పుకోవటానికికూడా సిగ్గుపడుతున్నాను. శివదూషకుడవైన నీవల్ల పొందిన ఈ దేహాన్ని ధరించిఉండేకంటె, త్యజించటం మేలనుకుంటున్నాను."

అలా అని, మహేశ్వరుని పాదపద్మాలనే మనసులో నిలుపుకుని, యోగ సమాధిలో కూర్చుని, దానివల్ల జనించిన అగ్నిద్వారా, ఆ వెంటనే, ఆమె, దగ్ధమైపోయింది.

సతీదేవి, ఆ విధంగా దగ్ధంకావటం చూసి, సదస్యులందరూ హాహాకారాలు చేశారు. దక్షుని దౌర్జన్యాన్ని, పలువిధాల విమర్శించారు. అంతలో, శివపార్షదులు, తమ తమ ఆయుధాలతో, దక్షుని మీద పడ్డారు. అది చూసిన భృగుమహర్షి, యజ్ఞ విఘ్నాన్ని హరించే మంత్రాలు పఠిస్తూ, హోమం చేశాడు. ఆ వెంటనే, సోమలోకంలో ఉండే, ఋభవులనే దేవతలు, కొన్ని వేలమంది ఉద్భవించి, ప్రమథ గణాలతో తలపడ్డారు. అప్పుడు జరిగిన పోరాటంలో, రుద్రపార్షదులు పరాజితులు కావటం జరిగింది.

భవాని, తన తండ్రివల్ల పరాభవింపబడటం, భృగుమహర్షి, తన మంత్రబలంద్వారా సృజించిన ఋభవులు శివపార్షదులను పరాజితులనుగా చేయటం, నారదుని ద్వారా గ్రహించిన శివుడు, ఉగ్రుడైనాడు. ఆయనకు, అంతులేని క్రోధం కలిగింది. ఆ వెంటనే, ఆయన, వికటాట్టహాసం చేశాడు. తన శిఖలోనుంచి, ఒక జటను పెరికి, క్రింద పడేశాడు.

అలా క్రిందపడ్డ జటలోనుంచి, వేయి చేతులతోనూ, మూడు నేత్రాలతోనూ, అగ్ని జ్వాలలవంటి కేశాలతోనూ, కరాళదంష్ట్రల తోనూ, కపాలమాలికలతోనూ, వివిధాయుధాలతోనూ, ఒక భీకరమూర్తి ఉద్భవించాడు. అతడే వీరభద్రుడు.

అలా, పరమతేజోమూర్తిగా ఉద్భవించిన వీరభద్రుని చూసి....

'గురుభుజ శౌర్య, భూరి రణ కోవిద, మద్భటకోటికెల్ల నీ
వరయ వరూథినీవరుడవై చని, యజ్ఞముగూడ దక్షునిం
బరువడి ద్రుంపు మీ, వచట బ్రాహ్మణతేజ మజేయమంటివే
నరిది, మదంశ సంభవుడవై తగు నీకు నసాధ్యమెయ్యెడన్'

అని, శివుడు, కుపితచిత్తంతో ఆజ్ఞాపించాడు.

సదాశివుని ఆజ్ఞను శిరసావహించి, వీరభద్రుడు, ఆ వెంటనే, ఒక శూలం తీసుకుని, భీషణంగా అరుస్తూ, రుద్రపార్షద గణాలతో సహా, దక్షుని యజ్ఞవాటికకు వెళ్లాడు. అలా అతడు యజ్ఞ వాటికలో ప్రవేశించగానే, అక్కడ ఉన్నవా రందరూ, అదలిపోయినారు. దక్షుడు, నిరపరాధిని అయిన సతీదేవిని అవమానించటం కారణంగా, మహే శ్వరు డలిగిఉంటాడనీ, రుద్రుని క్రోధాగ్నికి, దక్షునితో సహా, తాముకూడా భస్మంకావటం తథ్యమనీ, వారు భావించారు. అంతలో, రుద్రానుచరులు, యజ్ఞశాల నాక్రమించుకుని, అటూ యిటూ పరుగులు తీస్తూ, సర్వ విధ్వంసనానికి పూనుకున్నారు. అప్పుడువారు, అగ్నులను చల్లార్చారు. అగ్నికుండాలను అపవిత్రం చేశారు. కనిపించిన యజ్ఞ సంభారా లన్నింటినీ కాలితోతన్నారు. సదస్యులందరినీ చావమోదారు. వీర భద్రుడు, దక్షుని మీదికి ఉఱికి, అతని హృదయాన, అనేకమైన శస్త్రా స్త్రాలు గ్రుచ్చాడు. కరవాలంతో, అతని గుండెను చీల్చాడు. యజ్ఞ పశువును వధించినట్టుగా, అతని మెడ నులిమి, శిరస్సును ఛేదించి దక్షిణాగ్నిలో వ్రేల్చి, భీకరాట్టహాసం చేశాడు. ఆ వెంటనే, అక్కడినుంచి

బయలుదేరి, విజయోత్సాహంతో, కైలాసానికి వెళ్ళాడు.

ఆ సమయంలో, రుద్రభటులవల్ల అంగభంగం పొందిన దేవతలూ మునులూ, అందరూ కలిసి ఆలోచించి, ప్రళయం కల్పించిన ఆ పరమేశ్వరుని శాంతింపచేయటానికీ, ఆయన దయను పొంది, దక్షుడు ప్రారంభించిన యజ్ఞాన్ని కొనసాగించటానికీ, నిశ్చయించుకున్నారు. ఆ వెంటనే, వారు, పద్మసంభవుని ముందుంచుకుని, కైలాసాభిముఖులై వెళ్ళారు. అలా వెళ్ళి వెళ్ళి...

భాసుర లీల, గాంచిరి, సుపర్వులు, భక్తజనైక మాన సో
ల్లాసము, గిన్నరీజన విలాసము, నిత్య విభూతి మంగళా
వాసము, సిద్ధ గుహ్యక నివాసము, జారువిరాజమాన కై
లాసము, గాంతి నిర్జిత పలక్షితిభృత్సుమహద్విభాసమున్.

అక్కడ, కైలాసంలో, వారు, సౌగంధికోద్యానం దాటారు. అలకనంద నధిగమించారు. ఒక వటవృక్షాన్ని సమీపించారు. ఆ వటవృక్షం క్రింద, సునందాది సిద్ధులూ, కుబేరాది మిత్రులూ, సేవిస్తూ ఉండగా, భస్మ దండ జటాజినాలు ధరించి, శిరస్సున చంద్రరేఖతో ఒప్పారుతూ, వీరాసనాన్నాశ్రయించి ఉన్న పరమేశ్వరుని, చూశారు. ఆ సమయంలో, పరమేశ్వరుడు, పరమ శాంతచిత్తంతో, నారదునకు బ్రహ్మవిద్య నుపదేశిస్తున్నాడు. అలా ఉన్న మహేశ్వరుని సమీపించి, బ్రహ్మాదులు, ప్రణామం చేశారు. రుద్రానుచరులయిన సిద్ధులందరూ, బ్రహ్మాదులకు నమస్కరించారు. ఆ తరువాత, పద్మసంభవుడు, పరమేశ్వరునితో ఇలా అన్నాడు.

"ఈశ్వరా ! సృష్టికంతటికీ మూలకారణం
నువ్వు. నువ్వు పరబ్రహ్మవు. శివభక్తులకు
నువ్వే అధినేతవు. శుభకర్మలు చేసేవారికి
స్వర్గాపవర్గాలనూ, దుష్కర్మాచరణులకు నర
కాన్నీ, ప్రసాదించే మహానుభావుడవు నువ్వు.

కర్మానుగుణమైన ఫలాల నిచ్చే పరమ పురు
షుడవని తెలిసికూడా, కొందరు అవివేకులు,
నీ పట్ల అత్యాచారానికి పూనుకుంటారు నీ చర
ణాల పైన చిత్తాన్ని నిలిపి, సర్వభూతాల
లోనూ నిన్ను దర్శిస్తూ ఉండే మహాత్ములకు,
రోషాహంకారాలు జనించవు. కాని, దైవోప
హతు లయిన కొందరు, భేదదర్శనులూ కర్మ
పరులూ అవుతారు. వారు, నీ మాహాత్మ్యాన్ని
నిందిస్తారు.

అయినా, వారిని సంహరించటం, నీవంటివానికి ఉచితంకాదు.

విష్ణుమాయ నతిక్రమించటం, ఎంతటివారి
కైనా దుర్ఘటమే అవుతుంది. మాయామోహితు
లైనవారు, కర్మ పరాయణులు కావటం
కూడా సహజమే.

అయినా, సర్వజ్ఞుడవైన నువ్వు, వారినికూడా రక్షించటం సమంజసం.

నువ్వు, యజ్ఞమయుడవు. యజ్ఞఫలప్రదుడవు. యజ్ఞ భాగార్హుడవైన నీకు, నీ భాగాన్ని సమర్పించక పోవటంవల్ల, నీకు, దక్షునిమీద ఆగ్రహం కలిగింది. అది కారణంగా, నువ్వు కల్పించిన యజ్ఞాన్ని నువ్వే విధ్వస్తం చేశావు. అది, సాధుగుణం కాదేమో అని, మేము భావిస్తున్నాం. అందుకనే, విధ్వస్తమైన దక్షాధ్వరాన్ని ఉద్ధరించవలసిందనీ, దక్షుని, పునర్జీవితుని చేయవలసిందనీ, భగ్నాంగులయిన దేవతలనూ, ఋత్విక్కులనూ, తదితరులనూ కరుణించి, వారికి, పరిపూర్ణారోగ్యాన్ని ప్రసాదించవలసిందనీ, యజ్ఞశేషాన్ని, నీ భాగంగా, స్వీకరించవలసిందనీ ప్రార్థిస్తున్నాం."

బ్రహ్మాదుల ప్రార్థన నాలకించిన శంకరుడు, సంతృప్తితో, మందహాసం చేశాడు. ఆ వెంటనే, ఆయన, చతుర్ముఖునితోనూ దేవతలతోనూ

ఋషులతోనూ బయలుదేరి, దక్షుని యజ్ఞశాలకు వెళ్ళాడు. అలా వెళ్ళిన శంకరుని అధ్వర్యాన, ఆ యజ్ఞం, తిరిగి ప్రారంభమైంది. అంతలో, ఆయన ఆదేశం ప్రకారం, ప్రమథులు, ఒక యజ్ఞపశువు శిరస్సును తెచ్చి, దక్షుని మెడకు తగిలించారు. అలా వికృతంగా, మేక తలతో ఉన్న దక్షుని కళే బరం వంక, మహేశ్వరుడు, అదోవిధంగా చూశాడు. ఆ మహానుభావుని అనుగ్రహ వీక్షణ ప్రసారంవల్ల, దక్షుడు, మరుక్షణంలోనే, పునర్జీవితు డయినాడు. అంతకుపూర్వం, శివపార్షదుల మూలంగా భగ్నాంగులయిన దేవతలూ, ఋషులూకూడా, యథాపూర్వకంగా, ఆరోగ్యవంతులయినారు.

ఆ విధంగా పునర్జీవితుడయిన దక్షుడు, శంకరుని ఉద్దేశించి, "అభవా ! నేను నీపట్ల అత్యంతమైన అపచారం చేశాను. నువ్వు నాకు వేసిన శిక్ష, శిక్ష కానే కాదు. శివ విరోధినైన నన్ను శిక్షించటంద్వారా, నువ్వు, నన్ను రక్షించావు," అని, తన పశ్చాత్తాపాన్నీ, కృతజ్ఞతనూ తెలియపరచుకున్నాడు తన అపచారం మూలంగా, తన కుమార్తె అయిన సతి, తనుత్యాగం చేయవలసివచ్చినందుకు కూడా, అతడు, ఎంతగానో విచారపడ్డాడు. అంతలో, శ్రీమహావిష్ణువు, తన దివ్యతేజాన్ని నలువంకలా ప్రసరింపచేస్తూ, గరుడవాహనంమీద అక్కడికి వచ్చాడు. అలా ప్రత్యక్ష మైన సర్వేశ్వరునికి, బ్రహ్మరుద్రేంద్రాదులందరూ, భక్తిపూర్వకంగా ప్రణామం చేశారు. ఆ వెంటనే, దక్షుడు, ఆయనను విధ్యుక్తంగా అర్చించి, ఇలా అన్నాడు.

"యజ్ఞేశ్వరా ! నువ్వు అద్వితీయుడవు.
నువ్వు, మాయను తిరస్కరించినవాడవైకూడా,
మాయను అనుసరించి, మాయా మానుష
రూపంలో, మానవులకు దర్శనమిస్తూఉంటావు.
నువ్వు, స్వతంత్రుడవైకూడా, పరతంత్రుని
మాదిరి గోచరిస్తూ ఉంటావు. అందుకనే, నువ్వు
ఒకడవే ముల్లోకాలకూ ఈశ్వరుడవనీ, నీ

మాయావిభూతు లయిన బ్రహ్మ రుద్రాదులూ,
దిక్పాలురూ, నీకు అన్యులనీ, మాయా మోహి
తులమైన మేము, భావించటం జరుగుతుంది.
యథార్థానికి, సకల చరాచర జంతుసంతానం
కూడా నువ్వే కాని, అన్యం కాదు.

అది గ్రహించలేకపోవటం పాపహేతువని నాకు తెలుసు. భేద బుద్ధి, దోషమనికూడా, నే నెరుగున్నాను. ఐనా, దురాగ్రహంవల్ల, పొర బడ్డాను. నన్ను క్షమించవలసింది; రక్షించవలసింది.''

దక్షు డా విధంగా విన్నవించుకున్న తరువాత, మహర్షులూ, సదస్యులూ, బ్రహ్మ రుద్రామరేంద్రాదులూ, శ్రీమహావిష్ణువును, యిలా ప్రస్తు తించారు.

"కర్మతంత్రంపట్ల అభిమానం కలవారు,
కమలాపతివైన నీ తత్త్వాన్ని గ్రహించలేరు.
నిష్కాములయినవారుమాత్రమే, అత్యాదరంతో
ని న్నాశ్రయించి, నీ పాదాలను అర్చించి, నీ
నిజతత్వాన్ని అవగతం చేసుకోగలుగుతారు.
పాంచభౌతికమైన దేహాలలో యిమిడిఉండటమే
నీ మాయా విలాసం. నీ మాయద్వారా, నువ్వే
ఆత్మభేదం కల్పిస్తూ ఉంటావు. ఆ మాయకు
లోబడనివా రంటూ లేరు. నువ్వు, సర్వాంత
ర్యామివి. విశ్వాత్ముడవు. అది గ్రహించి,
నీ పట్ల, ఆత్మాభేదంతో ప్రవర్తించేవారే, నీ
ప్రేమకు పాత్రు లవుతారు.

నువ్వు సత్వగుణాశ్రయుడవు. ధర్మ ప్రేర
కుడవు. యజ్ఞస్వరూపుడవు. మరీచి ప్రభృ
తులూ, బ్రహ్మరుద్రేంద్రాదులూ నీ అంశాంశలు.

ఈ ప్రపంచమంతా నీకు క్రీడారంగం.
నీ మాయవల్ల, పుట్టి, పెరిగి, అశాశ్వతమైన
విషయాలపట్ల ఆసక్తి పెంచుకుని, మానవులు,
నానావిధమైన బాధలూ అనుభవిస్తూ ఉంటారు.
వారికి, నీ కథామృతాన్ని సేవించేయోగ్యత కలి
గించి, వారిని, నువ్వు, సంసారసాగరంనుంచి
తరింపచేస్తూ ఉంటావు.

అటువంటి నువ్వు, మాకు దర్శన మిచ్చి, మమ్మల్ని ఉద్ధరించావు. అందు కనే, నీకు ప్రణామం చేస్తున్నాము."

ఆ విధంగా ప్రస్తుతించిన మహనీయుల మాటలకు సంతోషించి, భగవంతుడు, దక్షుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"దక్షా! స్వయంప్రకాశుడనైన నేను,
ఆత్మమాయద్వారా, ప్రపంచాన్ని సృష్టిస్తూ,
పాలిస్తూ, సంహరిస్తూ, ఉంటాను. ఏపని చేసే
టప్పుడు ఆ పనికి అనుగుణమైన పేరుతో
వ్యవహరింపబడుతూ ఉంటాను. అందుకనే,
నాకూ బ్రహ్మకూ రుద్రునికీ భేదమనేది లేదు.
అజ్ఞానులు మాత్రమే మమ్మల్ని విభిన్నులనుగా
చూస్తూ ఉంటారు. శరీరం వేరూ, కరచరణా
దులు వేరూ కానట్టే, నేనూ భూతజాలం కూడా
వేరు కాదు. అందుకనే, వివేకులయినవారు,
మా ముగ్గురినీ, వేరువేరుగా చూడటం సంభవిం
చదు. అటువంటివారే శాంతాత్ములవుతారు;
కృతార్థులనిపించుకుంటారు.

ఇది గ్రహించి, నువ్వుకూడా, ఇకమీద, సుస్థిరమైన ధర్మబుద్ధితో ప్రవర్తించవలసింది."

అలా ఉపదేశించి, అక్కడివారి పూజ లందుకుని, శ్రీమహా విష్ణువు, వైకుంఠానికి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, దేవతలూ మునులూ తమతమ నివాసాలకు వెళ్ళారు. దక్షుడు, యజ్ఞసమాప్తి చేసుకుని, ఋత్విజులతో కలసి అవభృథస్నానం చేసి, కృతార్థుడయినాడు.

దక్షయజ్ఞ సమయంలో తనుత్యాగం చేసిన కాత్యాయని, ఆ తరువాత, మేనకా హిమవంతులకు కూతురై పుట్టి, తిరిగి రుద్రుని వరించి, ఆయన సాహచర్య భాగ్యాన్ని పొందటం జరిగింది.

## *26.* బాలభక్తుడు ; ధ్రువుడు:

శతరూపా స్వాయంభువమనువులకు, ప్రియవ్రతుడు, ఉత్తానపాదుడు అనే కుమారు లుండేవారు. వారిలో రెండవవాడైన ఉత్తానపాదునకు, సునీతి, సురుచి, అనే ఇద్దరు, భార్యలైనారు. కాలక్రమాన, సునీతికి ధ్రువుడు, సురుచికి ఉత్తముడు, జనించారు.

ఉత్తానపాదుడు, ఉత్తముని తల్లి అయిన సురుచిపట్ల, ప్రేమాతిశయంతో వ్యవహరించేవాడు. కుమారు లిద్దరిలోనూ, ఉత్తమునే, అధికమైన ఆదరాభిమానాలతో చూసుకునేవాడు.

ఒకనాడు, ఉత్తానపాదుడు, ఉత్తముని ఒడిలో కూర్చోపెట్టుకుని ముద్దాడుతూ ఉన్న సమయంలో, ధ్రువుడు, అక్కడికి వెళ్ళటం సంభవించింది. ఉత్తముడు, తన తండ్రి ఒడిలో ఉండటం చూసిన ధ్రువునకు, తను కూడా, అతని ప్రక్కన కూర్చోవాలన్న కోరిక కలిగింది. ఆ కోరికతోనే, అతను, తన తండ్రిని సమీపించాడు. కాని, ఆ మహారాజు, అతణ్ణి వారించటం జరిగింది. అది చూసిన సురుచి, తన కుమారునిమీద తన భర్తకున్న ప్రేమను గ్రహించి, ఆనందించింది ; అమితంగా గర్వించింది. ఆ గర్వంతోనే, ఆమె, ధ్రువుని దిక్కై...

''నాయనా ! నువ్వు రాజపుత్రుడవే అయినా, మహారాజుల అభిమానానికి పాత్రుడవు కాలేకపోయినావు. మహారాజుల అనురాగానికి పాత్రు

డయిన కుమారుడే, ఆయన అనంతరం, సింహాసనా న్నధిష్టించటానికి కూడా అర్హుడవుతాడు. అది నీకు తెలియపరచటానికే, మీ తండ్రి, నే, డిలా వ్యవహరించటం జరిగింది. నిజానికి, రాజసింహాసన మధిష్టించే అదృష్టమే నీకు ఉన్నట్టయితే, నువ్వు, నా కడుపుననే పుట్టేవాడివి''

అన్నది. ఆ పలుకులు, ధ్రువుని లేత మనసులో, ములుకులై గుచ్చుకున్నై.

సురుచి అలా మాట్లాడుతున్నా, ధ్రువుడు బాధపడుతున్నట్టు కనిపించినా, ఆ మహారాజు యేమీ అనలేదు. అది గ్రహించిన ధ్రువుడు, ఆ వెంటనే, అమితమైన రోషంతో, తన తల్లివద్దకు వెళ్ళాడు. వెళ్ళి, తనకు జరిగిన పరాభవాన్ని గురించి ఆమెకు నివేదించుకున్నాడు.

బాలుడైన తన కొడుకు మాటలు విన్న సునీతి, కన్నీరు మున్నీరుగా రోదించింది. తన సవతి, తన కొడుకును అన్న మాటలకంటె, తన భర్తదైన ఉపేక్షాభావం, ఆమె హృదయాన్ని అమితంగా గాయపర చింది. అందుకనే, ఆమె, తన కుమారుని ఉద్దేశించి ఇలా అన్నది.

''నాయనా ! పూర్వజన్మలో ఇతరులకు కలి గించిన దుఃఖాన్నే, మన మీ జన్మలో అనుభ విస్తూ ఉంటాం. ఈనాడు మన మనుభవించే దుఃఖానికి, ఇతరులు కారకులనుకోవటం పొర పాటు.

నేను నిర్భాగ్యురాలిని. ఆ మహారాజు, నన్ను, భార్యగా కాకపోయినా, దాసిగా అయినా పరిగణించటం లేదు. అటువంటి నా కడుపున నువ్వు జన్మించావు. మన కిప్పుడు, ఆ హరి ఒక్కడే ఆధారం. ఆయన సర్వ శర ణ్యుడు. ఆయన చరణాల నాశ్రయించిన వారికి, తీరని కోరికలంటూ ఉండవు. ఆయనను సేవించటంవల్లనే, చతుర్ముఖుడు, బ్రహ్మపదంపొందాడు; మీ తాత అయిన మనువు, ఐహికాముష్మిక సుఖా లన్నింటినీ అనుభ వించాడు. ముముక్షువు లందరూకూడా, భక్తవత్సలుడయిన ఆ శ్రీమన్నారా

యణుని చరణాలనే సేవిస్తూ ఉంటారు. అనన్యభావంతో ఆయనను ఆరాధించినవారికి, అందరాని ఫలం అంటూ ఉండదు. ఈ ప్రపంచంలో, దుఃఖ నివారకుడయినవాడు ఆ మాధవు డొక్కడే. ఇతరులు, ఎన్నోవిధాల యత్నించి, చూడాలని కోరే ఆ లక్ష్మీదేవికూడా, ఆ దేవదేవుని పాదాలనే ఆశ్రయించి సేవిస్తూ ఉంటుందని మనం గ్రహించిన పక్షంలో, ఆ హరి దైన మాహాత్మ్యం ఎటువంటిదో మనకు అవగతమవుతుంది. అందుకనే, నువ్వు, నీ కోరికను నెరవేర్చుకోవటానికి, ఆర్తజనశరణ్యుడైన ఆ హరిని అనన్యభక్తితో ఆరాధించటమే ఉచితమని నేను భావిస్తున్నాను.''

ఆ విధంగా, పరమార్థ ప్రాప్తి హేతుకమైన తల్లి ఉపదేశాన్ని గ్రహించి, ధ్రువుడు, తన మనస్సును దృఢపరచుకుని, ఇల్లు వదలి, వనాంతరాలకు వెళ్లాడు.

తపశ్చర్యద్వారా హరిని సాక్షాత్కరింపచేసుకునే ఉద్దేశంతో వనాలకు వెళ్ళే సమయానికి, ధ్రువుని వయస్సు ఐదేళ్ళు మాత్రమే. పసి బాలుడయిన అతడు, పరిపూర్ణ విశ్వాసంతో, అలా తపశ్చర్యకు బయలుదేరటం, నారద మహర్షి, తన దివ్యదృష్టిద్వారా గ్రహించాడు. ధ్రువుని మనో నిశ్చయం ఆయనకుకూడా అమితాశ్చర్యం కలిగించింది. అదికారణంగానే, ఆయన అతనికి ప్రత్యక్షమై, అతని దృఢవ్రతాన్ని గ్రహించే నిమిత్తం, 'నాయనా! సకల సంపదలతోనూ తులతూగుతూ ఉండే స్వగృహాన్ని వదలి, స్వజనాన్ని త్యజించి, దుర్ఘటమైన తపశ్చర్యకు పూనుకుంటున్నావా ?' అని పలుకరించాడు. ధ్రువుడు నారదమహర్షికి నమస్కరించి, ఆయనకు సమాధానంగా, 'స్వామీ! ఇప్పుడు, నా శరీరం, పరాభవ దవానలంతో దహించుకు పోతూ ఉంది. నే నిప్పుడు అమితమైన దుఃఖంలో ఉన్నాను. దుఃఖ నివృత్తికోసం, నేను, సర్వశరణ్యుడయిన ఆ ఈశ్వరునే ఆశ్రయించాను. ఆయనను దర్శించే నిమిత్తమే, ఇలా, వనాంతరాలకు వెడుతున్నాను. నా ఆశయసిద్ధికి మీ అమోఘాశీర్వాదాన్ని అభ్యర్థిస్తున్నాను,' అన్నాడు.

ధ్రువుని పలుకులు, మహర్షికి, మహదానందం కలిగించినై. కాని, బాలుడయిన ధ్రువుడు, భక్తియోగాభ్యాసానికి అర్హుడు కాడేమో అన్న సందేహంతో, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, తిరిగి ఇలా అన్నాడు.

"నాయనా! నువ్వు బాలుడవు. నీ కిది, ఆటపాటలతో విహరించవలసిన సమయం. ఈ సమయంలో, మానావమానాలను గణించే వివేకం నీకు లేదేమో అని, నేను భావిస్తున్నాను.

దుఃఖ మనేది, ఎటువంటివారికైనా, నిజ కర్మబలంవల్ల సంభవిస్తూ ఉంటుంది. దుఃఖ నివృత్తికి ప్రయత్నించటం, ప్రతిజీవికీ సహజమే. అయినా, ఈశ్వరానుగ్రహం లేకపోతే, ఆ ప్రయత్నాలుకూడా ఫలించవు.

ఈశ్వరానుగ్రహం పొందటానికి, ఆయన నారాధించటం అవసరమే; కాని, అది, దుష్కరమైన కార్యం. నిస్సంగులై, తీవ్రతపశ్చర్యకు పూనుకున్న మహామహులకు కూడా, అది, అరుదుగాగాని లభించదు.

దైవనిర్ణయం ప్రకారం సమకూరే సుఖ దుఃఖాలను సమభావంతో అనుభవించటం, తన కంటె అధికులయినవారిని చూసి సంతోషించటం, అల్పులపట్ల కరుణ వహించటం, అన్నవి, సంసారమోక్షానికి కారణాలవుతై.

ప్రస్తుతానికి, నువ్వు, ఆ విధమైన మనస్థితి నలవరచుకుని, తాపాన్ని ఉపశమింప చేసుకుని, బాల్యావస్థ నధిగమించిన తరువాత, పరమేశ్వరారాధనకు పూనుకోవటం సమంజసంగా ఉంటుంది."

అలా శాంతి మార్గాన్ని ఉపదేశించిన నారదమహర్షికి, ధ్రువుడు, తన కృతజ్ఞతను తెలియపరచుకున్నాడు. కాని, అతడు, సుక్షత్రియ

వంశసంభూతుడు కావటంవల్ల, పౌరుషమే ప్రధానంగా భావించి, "మహర్షీ ! నా తల్లిదండ్రులే నన్ను పరాభవించారు. రాజ్యపాలనాధి కారం నాకు లేదన్నారు. నే నిప్పుడు, మా తండ్రిదైన రాజ్యాధిపత్యాన్నే కాదు, త్రిభువనోత్కృష్టం, అనన్యాధిష్ఠితం అయిన ఉత్తమపదాన్ని కూడా పొందటానికి నిశ్చయించుకున్నాను. ఆ నా కోరిక నెరవేరటానికి, నిర పాయమైన ఉపాయ మేదైనా ఉంటే బోధించవలసింది", అని ప్రార్థిం చాడు. ధ్రువుని దృఢచిత్తాన్ని గ్రహించిన నారదమహర్షి, అమితమైన సంతుష్టిచెందాడు. అందుకనే, అతని నుద్దేశించి...

"చిరంజీవీ...

భగవంతుడైన వాసుదేవుని, ఆశ్రయించ టమే, మానవ జీవితానికి ఫలం. ఆయనను సేవించటం ద్వారా, మానవులకు ధర్మ అర్థ కామ మోక్షాలు సిద్ధిస్తై.

వాసుదేవుని కృపావిశేషంవల్ల కాక, మరే ఇతర మార్గానా, మానవులకు, మోక్షాసక్తి కలుగదు. మోక్షాసక్తి కలిగినవారు, ఆయన పాదాలనే ఆశ్రయించి, అనన్యచిత్తంతో, ఆయన నుపాసిస్తారు. వారు ఉపాసించే వాసు దేవుడు, ప్రసన్న వదనుడూ శ్రీవత్సాంకుడూ వనమాలా శోభితుడూ శంఖచక్రగదాపద్మ విల సితుడూ దివ్యాభరణ భూషితుడూ పీతాంబర ధరుడూ అయి ఉంటాడు. హృదయగతుడైన ఆ మహానుభావుని ఏకాగ్రతతో చింతించే వారికే, పరమనివృత్తి లభిస్తుంది. ఆ దివ్య మంగళ విగ్రహునిమీద మనసు నిలిచిన వారికి, ఇతర ప్రపంచ మేమీ కనిపించదు. ఆ పైన, వారికి, పతనమనేది సంభవించదు.

శ్రీ హరిని సేవించటానికి ప్రశస్తమైన స్థలం, యమునాతటంలో ఉన్న మధువనం. ఆ ప్రదేశంలో, శ్రీహరి, నిత్యసన్నిహితుడై ఉంటాడు. నీవు అక్కడకు పోవలసింది"

అని బోధించాడు. ఆ పైన, అతనికి, యోగమార్గాన్నీ, ద్వాదశాక్షరి మహామంత్రాన్నీ ఉపదేశించాడు. ఆ విధంగా నారదుని ద్వారా ఉపదేశం పొందిన ధ్రువుడు, ఆ మహర్షికి ప్రదక్షిణం చేసి, సాష్టాంగపూర్వకంగా నమస్కరించాడు. ఆయనవద్ద సెలవు తీసుకుని, మధువనానికి బయలు దేరి వెళ్ళాడు.

ఆ తరువాత, ధ్రువుడు, మధువనం చేరుకున్నాడు. కాళిందీ నదిలో స్నానం చేశాడు. ఆ రాత్రి ఉపవసించి, నారదమహర్షి ఉపదేశించిన ప్రకారం, యోగాభ్యాసానికి ఉపక్రమించాడు. ఆ సమయంలో ఆ బాలుడు, మొదట, మూడేసి రోజుల కొకసారి ఫలహారం చేస్తూ, ఒక నెల గడిపాడు. రెండవనెలలో, ఆరు రోజుల కొకమారు, జీర్ణ పర్ణాదులు భుజిస్తూ గడిపాడు. మూడవ నెలలో, తొమ్మిదిరోజుల కొకతూరి, మంచినీరు త్రాగి కాలం వెళ్ళదీసుకున్నాడు. నాలుగోనెలలో, పన్నెండు దినాలకోసారి, వాయుభక్షణ జరిపేవాడు. ఐదోనెలలో, అదికూడామానేసి, ఏకపాదంమీద నిలబడి, నిశ్చలమైన మనస్సుతో, భగవంతుని మంగళ రూపాన్ని చింతిస్తూ ఉండిపోయినాడు.

ఆ విధంగా, ధ్రువుడు, ఏకపాదస్థితుడై, తీవ్రతరంగా తపస్సు చేస్తూ ఉండటంవల్ల, అతని బొటనవ్రేలి త్రొక్కుడు పడి, భూమి క్రుంగి పోయింది. ముల్లోకాలూ చలించినై. అతను, హరిని మనస్సులో నిలుపుకుని తన ప్రాణాన్ని నియమించుకోవటంవల్ల, లోకంలో, ఉచ్ఛ్వాస నిశ్వాసలు నిలిచిపోయినై. అది కారణంగా, దేవతలు, లోకపాలురను ముందుంచుకుని, శ్రీ మహావిష్ణువును సమీపించారు. సమీపించి...

'హరి. పరమాత్మ, కేశవ, చరాచర భూత శరీరధారివై
పరగుదు వీవు, నిట్టులుగ ప్రాణ నిరోధము నెందు మున్ను నే

మెఱుగ, మనాధనాథ, జగదీశ్వర, సర్వశరణ్య, నీ పదాం
బు రుహము లర్థిమై శరణు వొందెద ; మా ర్తి హరించి, కావవే !'

అని ప్రార్థించారు.

అలా ప్రార్థించిన దేవతల వేదనను ఉపశమింప చేయటానికి పరమేశ్వరుడు నిశ్చయించుకున్నాడు. అదే వారికి తెలియపరచి, ఆ వెంటనే, ఆయన, గరుత్మంతుని అధిరోహించి, తన భక్తుడైన ధ్రువుడు తనకోసం తపస్సు చేస్తున్న మధువనానికి వెళ్ళాడు.

మాధవుడు ఆ విధంగా మధువనం చేరగానే, ధ్రువుడు, తన హృదయాకాశంలో ఉన్న శ్రీమహావిష్ణువు తిరోహితుడైనట్టుగా భావించాడు; అందుకనే, తటాలున కళ్ళు తెరిచాడు.

ధ్రువుడు అలా కళ్ళు తెరవగానే, వైకుంఠు డతని ఎదుట ప్రత్యక్షమైనాడు. అలా ప్రత్యక్షమైన వైకుంఠుని, ధ్రువుడు, అమితానందంతో చూశాడు. చూసి, ఆయనకు, సాష్టాంగ దండప్రణామా లాచరించాడు. ఆ వెంటనే, శ్రీమహావిష్ణువును స్తుతించాలన్న కోరిక అతనికి కలిగింది. కాని, బాలుడు కావటంవల్ల, అతని కది అసాధ్య మనిపించింది. అది కారణంగా, అతను, అపరిమితమైన ఆవేదనపడ్డాడు. అది గ్రహించిన శ్రీహరి, తన చేతిలోని వేదమయశంఖంతో, అతని చెక్కిలిని స్పృశించాడు. దాని ప్రభావంవల్ల, ధ్రువునకు, జీవేశ్వర నిర్ణయజ్ఞానం కలిగింది. ఆ వెంటనే, అతడు, భక్తిభావంతో, ఆ పరాత్పరుని ఇలా ప్రస్తుతించాడు.

''మాధవా ! నా పూర్వజన్మసుకృతంవల్ల నువ్వు నాకు ప్రత్యక్షగోచరుడవైనావు. నీ దర్శనంవల్ల నా జన్మ ధన్యతపొందింది. నీ పాదమూలం, భక్తులపాలిటి కల్పవృక్షం. నీ ఆరాధనం, సంసార ధ్వంస కారణం. నీ భక్తులైనవారికి, ఏ విధమైన విషయేచ్ఛా ఉండదు. నీ చరణారవిందాలను సేవించటంవల్లా, నీ దివ్యగాథల నాకర్ణించటంవల్లా, లభించే పరమసుఖం, మోక్షప్రాప్తివల్లకూడా కలుగదు. నీ భక్తుల సాంగత్యం లభించినవారు,

అశాశ్వతమైన ఈ శరీరాన్నిగాని, దాన్ని అనుసరించి ఉండే దారపుత్రాదులనుగాని, గృహారామాలనుగాని, సంపదలనుగాని, లక్ష్యం చేయరు. నీ మాహాత్మ్యం అటువంటిది.

సర్వేశ కల్పాంత సమయంబునందు నీ
యఖిల ప్రపంచంబు నాహరించి
యనయంబు శేష సహాయుండవై శేష
పర్యంకతలమున బవ్వళించి
యోగనిద్రారతి నుండి నాభీ సింధు
జ స్వర్ణలోక కంజాతకర్ణి
కందు జతుర్ముఖు నమర బుట్టించుచు
రుచి నొప్పు బ్రహ్మస్వరూపివైన
నీకు మ్రొక్కెద నత్యంత నియమ మొప్ప
భవ్య చారిత్ర పంకజపత్రనేత్ర
చిర శుభాకార నిత్య లక్ష్మీ విహార
యవ్యయానంద గోవింద హరి ముకుంద"

అలా, వినయ విధేయతలతో ప్రస్తుతించిన ధ్రువునిపట్ల ప్రసన్నుడై, శ్రీహరి, అతనితో ఇలా అన్నాడు.

"చిరంజీవీ! నీ మనోరథ మేమిటో నాకు తెలుసు. ఇంతకు పూర్వం, ఎవ్వరూ అధిష్ఠించని ఉత్తమస్థానాన్ని నువ్వు అపేక్షిస్తున్నావు. నీ భక్తి, నన్ను పరవశుణ్ణి చేసింది. నీ కోరికను తీర్చటానికే నేను నిశ్చయించుకున్నాను.

కాని, నువ్వు బాలుడవు. నువ్వు, ఈ లోకంలో అనుభవించవలసినవి ఎన్నో ఉన్నై. నువ్వు, మహారాజువై, ఇరవై ఆరు వేల యేళ్ళు ప్రజాపాలనం చేసిన అనంతరం, సర్వలోకాలకూ పూజనీయమైనదీ, సప్తర్షి మండలానికి కూడా ఉన్నతమైనదీ అయిన పరమపదం పొందగలుగుతావు."

ఆ విధంగా వర మిచ్చి, ధ్రువుని మనోరథాన్ని సిద్ధింపచేసి, అతని కృతజ్ఞతభివందనలను స్వీకరించి, శ్రీమన్నారాయణుడు, తన నిజ ధామానికి వెళ్ళిపోయినాడు. దాంతో, దేవతల వేదనకూడా ఉపశమించింది.

జన్మజన్మాంతరాల తపఃఫలంగాగాని లభించని పరమపదాన్ని, ఒకేఒక జన్మలో, అందులోనూ, అచిరకాలంలో, ఆర్జించుకుని కూడా, ధ్రువుడు, అశాంతితోనే గృహోన్ముఖుడు కావటం జరిగింది. శ్రీహరిని సాక్షాత్కరింపచేసుకుని కూడా, ముక్తిని కోరలేదే అన్న వ్యథతో, అతని మనసు కుమిలిపోసాగింది. అది, తన దురదృష్టంగా, అతడు భావించాడు.

అక్కడ ఉత్తానపాదుడు, నారదుని వల్ల, తన కుమారుని ప్రభావాతిశయం విని, పరమానందం పొందాడు. తను, అంతకుపూర్వం, తన కుమారునిపట్ల చూపిన ఉపేక్షను తలచుకుని, అమితంగా లజ్జించాడు. తన అకార్యానికి ప్రాయశ్చిత్తంగా, ఆ చిరంజీవి ఆగమనానికి ఎదురుచూస్తూ, దిన మొక యుగంగా వేగింప సాగాడు.

అంతలో, ధ్రువుని ఆగమనవార్త ఆయన కందింది. ఆ వెంటనే, ఆయన, ఆ శుభవర్తమానాన్ని, నగరమంతటా చాటించాడు. తన భార్యలనూ, అమాత్యులనూ, పరివారాన్నీ తీసుకుని, మంగళతూర్యనాదాలతో, కుమారునికి స్వాగతం చెప్పే నిమిత్తం, ఎదురు వెళ్ళాడు.

అలా తన్ను సమీపించిన తండ్రికి, ధ్రువుడు, పాదాభివందనం చేశాడు. ఆ మహారాజు కూడా, ప్రేమవిహ్వాల చిత్తంతో, హరి కరస్పర్శ వల్ల పవిత్రీభూతుడయిన తన కుమారుని గాఢాలింగనం చేసుకున్నాడు; ఆనందాశ్రులతో అతని శరీరాన్నంతనీ తడిపివేశాడు.

ఆ వెంటనే, ధ్రువుడు, తన తల్లులకు సాష్టాంగనమస్కారం చేశాడు. అతని కన్నతల్లి అయిన సునీతి, అతణ్ణి చూసి, అమితానందం పొందింది. అతణ్ణి ప్రేమపూర్వకంగా కౌగిలించుకుంది; ఆశీర్వదించింది. విష్ణుభక్తులు పరమ పవిత్రులనీ, వారితో విరోధించటం శ్రేయస్కరం కాదనీ

గ్రహించిన సురుచి కూడా, అతణ్ణి హృదయపూర్వకంగా దీవించింది. ఉత్తముడు, ధ్రువుని ఆలింగనం చేసుకుని, పులకాంకితుడయినాడు. ఆ తరువాత, ఆ మహారాజు, ధ్రువుని, తన కనకరథం మీద కూర్చోపెట్టుకుని, ఊరేగుతూ, నగరంలో ప్రవేశించాడు. అలా, వారు, నగరంలో ప్రవేశిస్తూ ఉండగా...

హరి మధ్యల్, పురకామినీజనులు, సౌధాగ్రంబులందుండి, భా
స్వర సిద్ధార్థ ఫలాక్షత ప్రసవ దూర్వావ్రాత దధ్యంబువుల్
గరవల్లీ మణిహేమ కంకణ ఝణత్కారంబు శోభిల్ల జ
ల్లిరి ; యా భాగవతోత్తమోత్తమునిపై, లీలా ప్రమేయంబుగన్.

అలా పురప్రవేశం చేసిన ధ్రువుడు, వివిధోపభోగాలు అనుభవిస్తూ, తనవారి ప్రేమకూ తన ప్రజల అభిమానానికీ పాత్రుడవుతూ, కొంతకాలం గడిపాడు.

అంతలో, ఉత్తానపాదునకు, రాజ్యపాలనం మీద విరక్తి జనించింది. ఆ వెంటనే, ఆ మహారాజు, సర్వసద్గుణ సంపన్నుడూ, ఉచిత వయస్కుడూ అయిన ధ్రువునకు, శింశుమారు డనే రాజు కుమార్తెను, భ్రమి అనే కన్యను తెచ్చి వివాహం చేశాడు. ఆ తరువాత, అతనికి రాజ్యాన్ని అప్పగించి, తపస్సు చేసుకునే ఉద్దేశంతో, తను, వనానికి వెళ్ళిపోయినాడు.

కాలక్రమాన, భ్రమికి, కల్పుడు వత్సరుడు అనే ఇద్దరు కొడుకులు కలిగారు. ఆమె సవతి అయిన ఇలకు, ఒక కొడుకూ ఒక కూతురూ జనించారు.

వారలా ఉండగా, ఉత్తముడు, పెండ్లికాకముందే, ఒకసారి, మృగయావినోదార్థం అడవికి వెళ్ళటం జరిగింది. ఆ సమయంలో, హిమవత్పర్వతప్రాంతాన అతను విహరిస్తూ ఉండగా, ఒక యక్షుడు, అతణ్ణి సంహరించాడు. పుత్రవియోగ దుఃఖంతో, అతని తల్లి అయిన సురుచి, అగ్ని ప్రవేశం చేసి, ప్రాణాలు వదిలింది.

యక్షుడు, అకారణంగా తన తమ్ముని చంపినందుకు, ధ్రువుడు, కోపగించుకున్నాడు. ఆ కోపంతోనే, అతను, తన సైన్యాన్నంతనీ తీసుకుని, భూతగణాలూ గుహ్యకులూ రక్షిస్తూ ఉన్న అలకాపురం మీదికి దాడి వెళ్ళాడు. అప్పు డక్కడ, యక్షభటులకూ ధ్రువుని సైన్యానికీ మధ్య ఘోరమైన పోరాటం జరిగింది. ఆ పోరాటంలో, ధ్రువుడు, అనేకమంది యక్షులను అనాయాసంగా సంహరించాడు. అతని ధాక కాగలేక, చాలా మంది పారిపోయినారు. కాని, కొందరు రాక్షసులు, అతని నెదిరించి, మాయాయుద్ధం ప్రారంభించారు అది కారణంగా, అతని కళ్ళ ఎదుట, అంతా చిమ్మచీకటైపోయింది. నలుదిక్కులా ధూళి క్రమ్ముకుంది. పాషాణ వర్షం కురిసింది. కోటానుకోట్లుగా మాయా సైనికులు ఉద్భవించి, అతని సైనికులతో తలపడ్డారు. అదంతా అసుర మాయగా గ్రహించిన ధ్రువుడు, ఆ వెంటనే, భక్తజనార్తిహరుడయిన భగవంతుడు ప్రసాదించిన నారాయణాస్త్రాన్ని ప్రయోగించి, ఆ మాయనంతనీ ఛేదించాడు. అనంతరం, కొన్ని తీవ్రబాణాలను వదలి, తన ప్రత్యర్థు లందరినీ చెల్లాచెదరు చేశాడు. ఆ సమయంలో, నిరపరాధులయిన గుహ్యకు లెందరో వికలాంగులు కావటంకూడా జరిగింది.

అది గ్రహించిన అతని పితామహుడు, స్వాయంభువుడు, అతణ్ణి సమీపించి, ఇలా బోధించాడు.

''నాయనా !

అత్యంతమైన రోషం నరకంవంటిది.

నీ తమ్ముని ఎవరో చంపారని, నిరపరాధులయిన ఈ గుహ్యకు లందరినీ వధించటం, నీవంటివానికి ఉచితం కాదు. ఈ విధమైన చర్య, మన వంశానికే కళంకాన్ని ఆపాదిస్తుంది.

హృషీకేశానువర్తులయినవారికి, హింసా
ప్రవృత్తి, ఏ మాత్రంగానూ పనికిరాదు.

నువ్వు, అతి బాల్యంలోనే, ఆ వాసుదేవునిమీద భక్తి కుదుర్చుకుని

ఆయనను సంతృప్తిపరచి, అనన్య దుర్లభమైన పరమపదం సాధించు కున్నావు. అలా అయికూడా, దేహాభిమానంతో, క్రోధాన్ని ఆశ్రయించి, హింసాకాండకు పూనుకున్నావు. ఇది, సాధుజనసమ్మతమైన కార్యం కాదు.

సహనం, సర్వసమత్వం, కనికరం, స్నేహభావం, అనే సద్గుణాలవల్లనే, సర్వేశ్వ రుని ప్రసన్నుని చేసుకోవటం జరుగుతుంది. భగవంతుని, అలా ప్రసన్నుని చేసుకున్న వారికే, బ్రహ్మానందం లభిస్తుంది.

సర్వభూతాలకూ సంబంధించిన సృష్టి స్థితి లయాలకు, ఆ పరమేశ్వరుని లీలా విలాసమే కారణం. ఆ పరమేశ్వరునిశక్తి, అగ్రాహ్యంగా ఉంటుంది. ఆయన, సర్వ నియంత. ఆయన ఇచ్ఛామాత్రంవల్లనే, ప్రాణికోటికి, సుఖ దుఃఖాలు సంభవిస్తూ ఉంటై.

అఖిల శక్తి సంపన్నుడూ, ఆనంద మయుడూ, అయిన భగవంతుని మీద, దృఢ మైన భక్తి కలిగినప్పుడు, 'నేను' 'నాది' అనే భావం తొలగిపోతుంది.

కాని, ఆ భావం, యింకా నీలో ఉండటంవల్లనే, నీ తమ్ము డయిన ఉత్తముని, యక్షు డెవడో వధించాడని, నువ్వు, క్రోధం వహించటం జరిగింది. ఆ క్రోధంవల్లనే, ను వ్విప్పుడు, యక్ష గుహ్యకు లందరినీ పీడించి, ఈశ్వర సఖుడయిన కుబేరునిపట్ల అపచారం చేయటం సంభ వించింది.

మహాత్ములపట్ల అపచారం సలపటం శ్రేయ స్కరం కాదు

ఇకనైనా, నువ్వు, నీ రోషాన్ని త్యజించి, అలకాపతి అయిన కుబేరునితో చెలిమి చేసుకోవటం ఉచితం.''

అలా హితబోధచేసి, స్వాయంభువుడు, తన నిజనివాసానికి వెళ్ళి పోయినాడు. ఆ వెంటనే, ధ్రువుడు, తన క్రోధాన్ని దిగమ్రింగుకున్నాడు ; అంతకుముందు తనవల్ల జరిగిన అత్యాచారానికి, పశ్చాత్తాపపడ్డాడు.

మనువు మనుమడయిన ధ్రువుడు, తన నగరంమీదికి దండెత్తి వచ్చాడనీ, అలా వచ్చి, యక్ష గుహ్యకాదుల నెదిరించి, వారిని, చాలావరకు పరాజితులను చేశాడనీ, ఆ తరువాత, మనూపదేశాన్ని శిరసావహించి, క్రోధాన్ని దిగమ్రింగుకుని, యుద్ధాన్ని విరమించాడనీ విని, కుబేరుడు, తన అనుచరవర్గంతో, ధ్రువుని సమీపించాడు. అలావచ్చిన యక్షేశ్వరునికి, ధ్రువుడు, గౌరవం చూపాడు. దానికి సంతుష్టుడైన కుబేరుడు, అతణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు.

''నాయనా... !

క్రోధాన్ని జయించటం ఎంతటివారికైనా దుర్ఘటమే. అయినా, నువ్వాపని చేశావు. అందుకు, నేను, నిన్ను అభినందిస్తున్నాను.

భూతాల ఉత్పత్తి వినాశాలకు, కాలమే కారణం.

ఆ కాలమే, నీ తమ్ముని హరించింది. దానికి, నువ్వు, విచారపడటంగాని, రోషం వహించటంగాని ఉచితం కాదు. నీ పితామహుని ఉపదేశంవల్ల, ఆ యథార్థాన్ని నువ్వు గ్రహించగలిగావు. అది, నాకు, ఆనందదాయకమైన విషయం. ఇక, నీకు, మేలు జరిగితీరుతుంది.''

అలా ఆదరపూర్వకంగా మాట్లాడి, యక్షేశ్వరుడు, ధ్రువునకు, హరిస్మరణం అచంచలంగా ఉండేటట్టు వరం ప్రసాదించాడు ; ఆ వెంటనే, అంతర్థానుడైనాడు.

ఆ తరువాత, ధ్రువుడు, తన నగరానికి వెళ్ళి, నిష్కంటకంగా రాజ్యపాలనం చేయసాగాడు. అతని పాలనలో, ప్రజలు, దీనవత్సలుడైన

అతణ్ణి, తమ తండ్రిగా భావించుకునేవారు. ఆయన రాజ్యపాలనం చేసిన సమయంలో, దేశమంతటా, భక్తిభావం వృద్ధిపొందింది. అనేకమైన యజ్ఞయాగాదులు జరిగినై. లోకం సుభిక్షమయింది.

ఆ విధంగా, ఇరవైఆరువేల యేళ్ళు రాజ్యపాలనం చేసి, తన కుమారుడయిన ఉత్కలునికి పట్టం కట్టి, ధ్రువుడు, ప్రపంచంయొక్క అశాశ్వతత్వాన్ని గ్రహించి, విరక్తచిత్తుడై, బదరికాశ్రమానికి వెళ్ళిపోయినాడు.

ఆ విధంగా బదరీవనం చేరిన ధ్రువుడు, మందాకినీ నదిలో స్నానం చేసి, అక్కడే ఒక ఉచితాసనాన్ని ఏర్పరచుకుని, సర్వేంద్రియాలనూ నిగ్రహించుకుని, మాధవుని మీద మనసును లగ్నంచేసుకుని, సమాధి నిష్ఠుడైనాడు. అలా సమాధినిష్ఠలో ఉన్న ధ్రువుడు, తన్ను తాను మరచి ఉన్న సమయంలో, అంతరిక్షంనుంచి ఒక దివ్యవిమానం వచ్చింది. ఆ విమానంలో వచ్చిన సునంద నందులనే భగవత్కింకరులు, ధ్రువుని ఉద్దేశించి, 'అయ్యా! మేము దేవదేవుని భటులం. మాధవపదానికి నిన్ను తీసుకు రావలసిందిగా ఆయన మాకు ఆదేశించారు ; నీ కోసమే ఈ విమానాన్ని కూడా పంపారు' అని విన్నవించుకున్నారు.

సునంద నందుల మృదుమధుర వచనాలు విని, ధ్రువుడు, పరమానందం పొందాడు. ఆ వెంటనే, ఆయన, అక్కడ ఉన్న మునుల వద్ద సెలవు తీసుకుని, భక్తిపూర్వకంగా ఆ దివ్య విమానానికి ప్రదక్షిణం చేసి, శ్రీహరి పార్షదులయిన సునంద నందులకు ప్రణామం చేసి, మాధవుని రూపాన్ని మనసులో నిలుపుకుని, ఆ విమానాన్ని అధిరోహించాడు.

విమానాధిరోహణం చేయగానే, ధ్రువుడు, జ్యోతిర్మయమైన దివ్యరూపం ధరించాడు. ఆ సమయంలో, కుసుమవర్షం కురిసింది. దేవదుందుభులు మ్రోగినై. గంధర్వగానం వినిపించింది.

విమానాన్ని అధిరోహించేముందు, ధ్రువునకు, అతని తల్లి అయిన సునీతి స్ఫురణకు వచ్చింది. 'అమెను విడిచి వెళ్ళటమా !' అన్న

ఆలోచన ఆయనకు కలిగింది. అది గ్రహించిన సునంద నందులు, తమకు ముందున్న విమానాన్నీ, అందులో సుఖాసీనురాలై ఉన్న సునీతినీ అతనికి చూపించారు. అది చూడగానే, ధ్రువుని మనసు సంతుష్టి చెందింది.

అనంతరం, ధ్రువునితో బయలుదేరిన విమానం, పోయిపోయి, గ్రహమండలం దాటి, ముల్లోకాలనూ అధిగమించి, సప్తర్షి మండలాన్ని ఉత్తరించి, ఆ పైన ఉన్న పరమపదం చేరుకుంది. ఆ పరమపదాన్ని అధిష్టించిన ధ్రువుడు, ముల్లోకాలకూ పూజనీయుడయినాడు ; నారదాది దేవర్షులకు కూడా కీర్తనీయుడయినాడు.

## 27. వేన రాజు :

ధ్రువుని కుమారుడయిన ఉత్కలుడు, సహజంగానే శాంతి పరుడు. అతనికి, బాల్యంలోనే, నిస్సంగత్వం, సర్వభూత సమత్వం అల వడినై. కాలక్రమాన, అతడు, కర్మవాసనారహితుడూ, భక్తియోగాభ్యాస పరుడూ, అయినాడు.

అలా ఆత్మనిష్ఠుడైన ఉత్కలుడు, లోకమంతలోనూ తన్ను చూసుకుంటూ, తనలో లోకాన్నంతనూ వీక్షిస్తూ, చూపరులకు, మూర్ఖుని మాదిరి, ఉన్మత్తుని మాదిరి, బధిరుని మాదిరి, కనిపించసాగాడు.

ఉత్కలుని కులవృద్ధులూ, అమాత్యులూ, అతణ్ణి గురించి చాలా ఆలోచించారు. అతని మనసు, ఐహిక విషయాలమీద ప్రసరించకపోవటం గ్రహించిన ఆ పెద్దలందరూ, అతడు, రాజ్యపాలనకు అనర్హు డని నిర్ణ యించుకున్నారు. అది కారణంగానే, అతని తమ్ముడయిన వత్సరునికి పట్టాభిషేకం చేశారు.

వత్సరుని భార్య పేరు సర్వర్ధి. సర్వర్ధీ వత్సరులకు, పుష్పా ర్ణుడు, చంద్రకేతుడు, ఇషుడు, ఊర్జుడు, వసుడు, జయుడు అనే ఆరుగురు కుమారులు కలిగారు. వారిలో, పుష్పార్ణుడు ప్రభ, దోష, అనే ఇద్దరు కన్య

లను వివాహమాడాడు. వారివల్ల, ఆరుగురు పుత్రులను పొందాడు. వారిలో ఒకడైన వ్యుష్టికి, పుష్కరిణి అనే భార్య ద్వారా, సర్వతేజుడుఅనే కొడుకు పుట్టాడు. ఆ సర్వతేజునికి, ఆకూతి, భార్య అయింది. ఆకూతీ సర్వతేజులకు, చక్షువు అనే మనువు జన్మించాడు. అతను, నడ్వల అనే కన్యను వివాహమై, శిబి ఉల్ముక ప్రభృతులను, పన్నెండుమంది కుమారులను పొందాడు. ఉల్ముకునికి, పుష్కరిణి అనే భార్యవల్ల, అంగుడు మొదలయిన ఆరుగురు పుత్రులు కలిగారు.

ఉల్ముకుని జ్యేష్ఠపుత్రుడయిన అంగుడు ఒక రాజర్షి. అతని భార్యపేరు సునీథ. ఆ దంపతులకు, చాలాకాలంవరకూ, సంతానం కలుగలేదు. అది కారణంగా, వారు, సంతానాన్ని అర్థించి, విధ్యుక్తంగా, పుత్రకామేష్టి నిర్వహించారు. దాని ఫలితంగా, వారికి, వేనుడు అనే ఒక కుమారుడు కలిగాడు.

వేనుడు మృత్యువుకు దౌహిత్రుడు. అతడు, బాల్యమాదిగా, దుష్టభావనుడై పెరిగాడు. అతణ్ణి చూసినవా రందరూ, అతడు, మూర్తి దాల్చిన అధర్మ మనుకునే వారు. అతడు, ఉట్టి అసాధువై, నిష్కారణంగానే సాధుహింస చేసేవాడు. తన తోటిబాలురను పట్టుకుని, నిర్దాక్షిణ్యంగా, వారి గొంతులు నులిమి చంపేవాడు.

అది గ్రహించిన అంగుడు, అమితంగా వ్యాకులపడ్డాడు. కుమారుని దుశ్చేష్టితాలు, ఆయనకు, మనశ్శాంతి లేకుండా చేసినై. అందుకనే....

అనయము నిట్టి కుపుత్రుని
గని పరితాపంబు బొందుకంటెను, ధరణిన్
అనపత్యుం డగు టొప్పును,
వనజాక్షు భజించునట్టివాడగు, వాడున్;

అని భావించాడు. అంతేకాదు.

"దుష్పుత్రుల మూలంగా తండ్రికి అపకీర్తి
కలుగుతుంది. సర్వజన విరోధం సంభవిస్తుంది;
మనోవ్యధ ప్రాప్తిస్తుంది.
దుష్టులైన పిల్లలు ఉన్న ఇల్లు, దోషభూయిష్ట
మవుతుంది ; దుఃఖభాజన మవుతుంది.

అయినా, సుపుత్రునికంటె, కుపుత్రుడే తండ్రికి మేలు చేసినవా డవుతాడు. సుపుత్రుని కన్నతండ్రి, అతనిమీద అమితమైన మోహాన్ని పెంచుకుని, అతడే తన సర్వస్వంగా భావించి, గృహాసక్తుడై ఉంటాడు. కుపుత్రుని తండ్రికి, సంసారం మీద విరక్తి, అనాయాసంగా లభిస్తుంది. అలా జనించిన వైరాగ్యభావంతో అయినా, అతడు, ఇల్లు విడిచి, ఆనంద మయుడయిన ఆ హరి నారాధించే నిమిత్తం అడవులకు వెడతాడు. అది అతనికి ఆత్మజ్ఞానాన్ని కలిగిస్తుంది;"

అని తలపోశాడు. ఆ వెంటనే, మహదైశ్వర్యాన్నీ, ఇంటినీ, ఇల్లాలినీ వదలి, రాజ్యాన్నీ ప్రజలనూ పరిత్యజించి, ఆ రాత్రికి రాత్రి, ఆ మహారాజు, అడవులకు వెళ్ళిపోయినాడు.

అలా సర్వసంగపరిత్యాగం చేసి వెళ్ళిపోయిన అంగ మహారాజు కోసం, ఆయన బంధుమిత్రులూ, మంత్రులూ, యెంతగానో వెతికారు. కాని, ఆయన జాడ, వారికి ఏమాత్రంగానూ తెలియరాలేదు. అది కారణంగా, వారు, ఆయన నన్వేషించటం మానుకుని, నగరానికి తిరిగివచ్చి, ఆ విషయాన్నంతనూ, భృగ్వాది మహర్షులకు నివేదించుకున్నారు.

అంగనృపాలుని రాజ్యత్యాగాన్ని గురించి విన్న మహర్షులు, దండించే రాజు లేని పక్షంలో, ప్రజలు, పశుప్రాయు లవుతారన్న అభిప్రాయంతో, ఆ వెంటనే, అంగుని భార్య అయిన సునీథతో సంప్రదించి, వేనుడు, ప్రజాకంటకుడని తెలిసికూడా, అతణ్ణి రాజుగా అభిషేకించారు.

అలా రాజైన వేనుడు, ఉగ్రశాసనుడూ, నిరంకుశుడూ అయి ప్రవర్తించసాగాడు. అతని గర్వానికి అంతనేది లేకుండాపోయింది. అతడు,

తొలగించుకోవాలి. అలా కానిపక్షంలో, మీకు, ఇహపరాలు రెండూ లభించవు.''

అలా విపరీతంగా పలికిన వేనునిపట్ల, మహర్షులకు, అమితమైన క్రోధం కలిగింది. అతడు పాపాత్ముడనీ, అందుకనే, భగవంతుని తిరస్కరిస్తున్నాడనీ, అత డాపైన బ్రతికి ఉండటం లోకానికి క్షేమకరం కాదనీ, వారు నిర్ణయించుకున్నారు. ఆ వెంటనే, తమ తపోబలాన్ని వినియోగించి, పరమేశ్వర తిరస్కారంవల్ల అప్పటికే తేజోహీనుడై ఉన్న వేనుని, అనాయాసంగా సంహరించారు; అతని కుమారుడయిన పృథువును, మహారాజుగా అభిషేకించారు.

## 28. పృథు చక్రవర్తి :

పృథువు నారాయణాంశ సంభూతుడు. అతడు, దక్షిణ హస్తంలో, విష్ణుచిహ్నమైన చక్రరేఖతోనూ, చరణాలలో, అరవింద లాంఛనాలతోనూ, జన్మించాడు. అతడు జనించగానే, పుష్పవర్షం కురిసింది. దివ్యమంగళ గీతాలు వినిపించినై. ప్రపంచమంతా ఆనంద తాండవం చేసింది.

ఆ పృథుమహారాజు, లక్ష్మీదేవి అంశతో పుట్టిన అర్చిస్సు అనే కన్యను, ధర్మపత్నిగా స్వీకరించాడు. ఆ అర్చిస్సువల్ల, ఆయనకు, విజితాశ్వుడూ, ధూమ్రకేశుడూ, హర్యశ్వుడూ, ద్రవిణుడూ, నృకుడూ, అనే అయిదుగురు కుమారులు కలిగారు.

పృథువుకు పట్టాభిషేకం జరిగిన సమయంలో, త్రిమూర్తులూ, లోకపాలురూ, తదితర దేవతలూ ఆ మహోత్సవ దర్శనార్థం వచ్చి, ఆయనకు, దివ్యమైన వస్తువు లెన్నో బహూకరించారు; ఆయన్ని ఆశీర్వదించారు.

ఆ విధంగా దేవతల మన్నన లందిన పృథు మహారాజును, సూత మాగధ వంది జనులు స్తోత్రం చేయటం జరిగింది. అది విన్న

పృథువు, వారితో ఇలా అన్నాడు.

"ప్రశస్తమైన కార్యాలు చేసిన మహాత్ములను ప్రస్తుతించటం సమంజసం నేను, ఆ మహాత్ముల శ్రేణికి చెందినవాణ్ణి కాగలనో లేనో నాకే తెలియదు. ఇంతవరకూ, నేను సాధించిన మహత్కార్యాలుకూడా ఏమీ లేవు. ఇతరులలోలేని సద్గుణాలు నాలో ఉన్నవనే అభిప్రాయంకూడా నాకు లేదు.

సర్వసద్గుణ సమన్వితుడూ, సర్వశక్తి సంపన్నుడూ, సర్వజ్ఞుడూ అయినవాడు, ఒకే ఒకడు ఉన్నాడు. ఆయనే భగవంతుడు. ఆయన కీర్తిని గానం చేయటం మన కర్తవ్యం.

సామాన్యులను స్తోత్రం చేయటం నింద్యం. వారిని స్తుతించటం, వారిలో లేని గుణాలను ఎత్తి చూపటంగానూ, వారిని అపహసించటంగానూ ఉంటుంది. అందుకనే, వివేకవంతులైనవారు, ప్రఖ్యాతులై ఉండి కూడా, ఇతరులు చేసే స్తుతిని ఏవగించుకుంటారు."

ప్రభువైకూడా అలా పలికిన పృథువును, మహర్షులందరూ ప్రశంసించారు. ఆయన, ఉత్తమోత్తముడు కావాలని కోరారు; దానికి, అనుగుణంగానే ఆశీర్వదించారు.

ఆ విధంగా, దేవతలవల్లా, దివ్యర్షులవల్లా అమోఘాశీర్వాదాలు పొందిన పృథుమహారాజు, రాజ్యపాలనం చేస్తూ ఉన్న సమయంలో, ఒకసారి, దేశం, దుర్భిక్షం కావటం సంభవించింది. ప్రజలు, ఆహారంలేక అటమటించిపోసాగారు. అది గ్రహించిన ఆ మహారాజు, భూదేవి మీద అలిగి, తన వింటికి బాణాన్ని సంధించి, ఆమెను శిక్షించటానికి ఉద్యుక్తుడై బయలుదేరాడు.

అలా తన్ను శిక్షించేనిమిత్తం వస్తున్న పృథుమహారాజుకు, గోరూపధారిణి అయిన భూదేవి ప్రత్యక్షమై, ఇలా అన్నది.

''మహారాజా ! నేను, భూతకోటి కంతటికీ ఆధారభూతమైన భూదేవిని. నువ్వు, చరాచరాత్మకమైన ఈ సృష్టి కంతటికీ సంరక్షకుడవు. అటువంటి నువ్వే, నన్ను తెగటార్చాలని చూడటం, అన్యాయం.

భూతకోటి కంతటికీ ఆహారాన్ని ప్రసాదించే శక్తి, నాలో ఉంది. ఆ శక్తిని, నేను, మఱుగుపరచటమంటూ లేదు. కాని, ప్రాజ్ఞులైనవారు, వారి వారి వాంఛితార్థాలు సిద్ధింపచేసుకునేనిమిత్తం, వివిధ ప్రయోగాలనూ విని యోగించటం అవసరం. తత్వదర్శనులైన పురాణమునులు, మానవుల శ్రేయాన్ని మనసులో ఉంచుకుని, ఇహంలోనూ పరంలోనూ వారికి మేలు చేకూర్చే ఉద్దేశంతో, వివిధ యోగాలను విశదపరచటం జరిగింది. పూజ్యు లయిన వారు చూపిన ఆ ఉపాయాలను గ్రహించటం, వాటిని, శ్రద్ధాభక్తులతో అనుసరించి కృతార్థులు కావటం, అన్నవి, మానవుల కర్తవ్యాలు. ఆ కర్త వ్యాలను నిర్లక్ష్యం చేసి, జ్ఞానహీనులయినవారు, తమ బుద్ధికి తోచినట్టు వ్యవహరిస్తూ ఉంటారు. దానివల్ల, వారు తల పెట్టిన కార్యాలన్నీ విఫల మవుతూ ఉంటై. మహారాజువయిన నువ్వు, నీ ప్రజలను సుశిక్షితులను చేసి, ఎవరి కర్మలను వారు చేసేటట్టు చూడటం సమంజసం. ఆ భారాన్ని నువ్వు వహించే పక్షంలో, నేను, నా శక్తివంచన లేకుండా, ఎవరికి అవసరమైన ఆహారాన్ని వారికి అందచేసితీరుతాను. దానివల్ల, నాకూ, నీకూ, నీ ప్రజకూ కూడా మేలు చేకూరుతుంది ''

అలా విన్నవించుకున్న భూదేవిని, పృథుమహారాజు, ఆద రాభిమానాలతో చూశాడు. ఆ వెంటనే, ఆయన, మనువును దూడగా చేసి, తన అరచేతిని పాత్రగా ఉంచుకుని, పాల రూపంలో, సకలోషధు లనూ పితుకటం జరిగింది. ఆయన ననుసరించి, ఇతరులు కూడా, ఎవరి కోరిక ప్రకారం వారు, తమ తమ ప్రధానులను వత్సలనుగా కల్పించుకుని, పాలు పిండుకున్నారు. ఆ విధంగా, ఋషులకు వేదాలూ,

దేవతలకు ఓజోబల సంపత్తీ, దైత్య దానవులకు సురాసవం, గంధర్వాప్సరోగణాలకు దివ్య గాంధర్వం, సిద్ధ విద్యాధరులకు అణిమాద్యష్టసిద్ధులూ, కింపురుషాదులకు మాయ, యక్ష రక్షో భూత పిశాచాదులకు రుధిరాసవం, సర్పాదులకు విషం, పశువులకు తృణాదులు, విహంగాలకు కీటక ఫలాదులూ, గిరులకు నానాధాతువులూ సమృద్ధిగా లభించినై.

ఆ విధంగా, అందరి కోరికలనూ తీర్చిన భూదేవిని, పృథు మహారాజు, తన పుత్రికగా స్వీకరించాడు. అది కారణంగా, ఆమెకు, పృథ్వీ అన్న పేరు సార్థకమయింది.

లోకాన్ని సుభిక్షంచేసిన పృథుమహారాజు, అనంతరకాలంలో, అనేకాశ్వమేధాలు నిర్వహించాడు ; శతక్రతుడనే ప్రసిద్ధి పొందాలని ఆశించాడు.

పృథుచక్రవర్తి శతక్రతుడైనపక్షంలో, తన పదవికి భంగం కలుగుతుందన్న అభిప్రాయం, మహేంద్రునిలో జనించింది. అది కారణంగానే, ఆ మహారాజు, నూరవక్రతువును ప్రారంభించిన సమయంలో, అసూయాపరుడయిన ఇంద్రుడు, అదృశ్యుడై యజ్ఞశాలలో ప్రవేశించి, మేధాశ్వాన్ని అపహరించాడు. అది గ్రహించిన అత్రిమహర్షి, పృథుకుమారుడయిన నముచికి అతణ్ణి చూపించి, ఆ మేధాశ్వాన్ని వశపరచుకోవలసిందిగా ఆదేశించాడు.

అత్రి మహర్షి ఆదేశం ప్రకారం, నముచి, ధనుర్బాణాలు తీసుకుని, ఇంద్రుని వెన్నంటివెళ్ళాడు. అది చూసిన ఇంద్రుడు, ఆ అశ్వాన్ని అక్కడే వదలి, తన మాయాబలం ద్వారా, జటలు ధరించి, భస్మలిప్తమైన శరీరంతోనూ, కపాలమాలికలతోనూ, తొలగి నిలబడ్డాడు.

అలా, మూర్తీభవించిన ధర్మం మాదిరి కనిపించిన ఇంద్రుని మీద బాణప్రయోగం చేయటానికి, నముచికి మనస్కరించలేదు.

న, అతను, అశ్వాన్ని తీసుకుని, తిరిగి యజ్ఞశాలలో ప్రవేశించాడు. గోపథంగా యజ్ఞాశ్వాన్ని ఇంద్రుని వద్దనుంచి తీసుకువచ్చిన నముచికి, అక్కడి మహర్షులు, విజితాశ్వుడు అని నామకరణం చేశారు.

తన కుమారుని మహాద్భుత కార్యం ద్వారా, అపహృతమైన యజ్ఞాశ్వాన్ని పొందిన పృథు చక్రవర్తి, తిరిగి, యజ్ఞం ప్రారంభించాడు. అది గ్రహించిన ఇంద్రునకు, అమితమైన రోషం కలిగింది. ఈమారు, ఎలాగైనా ఆ యజ్ఞాన్ని భగ్నం చేయాలని ఆయన సంకల్పించుకున్నాడు. అందుకనే, తిరిగి, తన మాయాబలంద్వారా, ఆ యజ్ఞసీమ అంతటా చిమ్మ చీకట్లు కల్పించాడు. ఆ చీకట్లో, యజ్ఞశాలలో ప్రవేశించి, అక్కడ, పైడి గొలుసుతో కట్టబడి ఉన్న అశ్వాన్ని తిరిగి అపహరించి, ఆకాశమార్గాన వెళ్ళసాగాడు.

ఇంద్రుడు అలా వెడుతూ ఉండటం, తిరిగి, అత్రిమహర్షి గ్రహించాడు. గ్రహించి, ఆ విషయం విజితాశ్వునకు తెలియపరచాడు. ఆ వెంటనే, విజితాశ్వుడు, బాణ బాణాసనాలు తీసుకుని, ఇంద్రుని వెన్నంటి వెళ్లాడు. ఆయన నీమారు వధించటానికే నిశ్చయించుకుని, వింటికి బాణాన్ని సంధించాడు. అది చూసిన మహేంద్రుడు, అదలి పోయి, ఆ అశ్వాన్ని అక్కడే వదలి, అదృశ్యుడైనాడు.

అలా అదృశ్యుడయిన ఇంద్రుని, నముచి అయితే భీరువుగా భావించాడు; కాని, పృథుచక్రవర్తి మాత్రం, పాషండునిగా భావించి, అతణ్ణి వధించటానికి పూనుకున్నాడు. అది గ్రహించిన మహర్షులు, ఆయన నుద్దేశించి, యజ్ఞదీక్షితులయినవారు, మేధ్యపశు హింస తప్ప మరొకవిధమైన హింస చేయటం సమంజసం కాదనీ, ఇంద్రవధ కప్పుడు పూనుకోవటం పాపహేతువౌతుందనీ, ఉపదేశించారు. అంతేకాదు. 'వీర్యవంతమయిన మంత్రాల ద్వారా, అగ్నిలో, ఉచితమైన ఆహుతులు వ్రేల్చిన పక్షంలో, ఆ మహేంద్రుడే ఇక్కడికి వస్తాడు. అలా వచ్చిన అతణ్ణి, మా మంత్రబలం

ద్వారా, మేమే బలిచేసి, నీ వాంఛితాన్ని ఈడేరుస్తాం,' అని కూడా తెలియ పరచారు. ఆ వెంటనే, ఆయన అనుమతి మీద, విధ్యుక్తంగా హోమం చేయసాగారు.

మహేంద్రుని బలిచేయటానికి మహర్షులు పూనుకోవటం, చతుర్ముఖుడు గ్రహించాడు. అందుకనే, ఆయన, ఆ మహర్షుల ఎదుట ప్రత్యక్షమై, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"భగవత్ప్రీతికోసం యజ్ఞంచేస్తూ, యజ్ఞనాముడూ, భగవదంశ సంభవుడూ అయిన ఇంద్రుని, సంహరించాలనుకోవటం సమంజసం కాదు. అదీకాక, ఇంద్రుడు అవధ్యుడు. ఆయన ధర్మదూరుడై వ్యవహరించినా, మహర్షులు మాత్రం ధర్మబాహ్యులు కావటం ఉచితం కాదు."

మహర్షులకు అలా ఉపదేశించి, చతుర్ముఖుడు, మహారాజుతో ఇలా అన్నాడు.

"మహారాజా! నువ్వు యింతవరకూ, తొంబదితొమ్మిది యజ్ఞాలు సక్రమంగా నిర్వహించావు. నువ్వు శతమఖుడవు కావటం మహేంద్రునకు ఇష్టం లేదు. అదీకాక, నువ్వు, మోక్షాన్ని అభిలషిస్తున్నావు. మోక్ష ధర్మావలంబు లయినవారికి, శతమఖానుష్ఠాన ఫలం అపేక్షితం కాదు.

నువ్వూ మహేంద్రుడూ కూడా, హర్యంశతో పుట్టినవారే. మీలో మీరు విరోధం పెంచుకోవటం భావ్యం కాదు. ఈ యజ్ఞమే, నీకూ మహేంద్రునకూ మధ్య విరోధ కారణంగా ఉంది. ఈ యజ్ఞాన్ని నువ్వు చాలించిన పక్షంలో, నీకు కలిగే లోపమేదీ లేకపోగా, మీ ఉభయుల మధ్యా మైత్రి ఏర్పడుతుంది. అది, మీకూ లోకాలకూ కూడా శ్రేయోదాయక మవుతుంది."

ఆ విధంగా చతుర్ముఖునివల్ల బోధింపబడి, పృథుచక్రవర్తి, ఇంద్రునిమీద తనకు కలిగిన కోపాన్ని త్యజించి, యజ్ఞాన్ని అంతటితో పూర్తిచేసి, ఆయనతో సంధిచేసుకున్నాడు. ఆ తరువాత, ఇంద్రునితో అక్కడికి వచ్చిన శ్రీమహావిష్ణువు, ఆ మహారాజుకు ఇలా హితబోధ చేశాడు.

"వివేకవంతులయినవారికి, అవిద్యా కారణమైన దేహంమీద, ఆసక్తి ఏమాత్రంగానూ ఉండదు. దేహం మీదనే ఆసక్తి లేనివారికి, ఆ దేహాన్ని ఆశ్రయించి ఉండే భార్యాపుత్రుల మీదా, గృహారామ విత్తాదులమీదా మమకారం ఉండటం అసంభవం.

దేహం అనేకమైన దోషాలకు ఆకరమై ఉంటుంది. దానికీ, ఆత్మకూ, ఏ విధమైన సంబంధం లేదు. ఆత్మదై ఉండే భగవంతుడు, నిర్గుణుడూ, సర్వవ్యాపీ, సర్వసాక్షీ, స్వయం జ్యోతీ అయిఉంటాడు. ఆ ఆత్మని గ్రహించిన వారే ధన్యులు.

ఫలాపేక్షలేకుండా, నన్నే మనసులోనిలుపుకుని ఎవరైతే హృదయపూర్వకంగా ఆరాధిస్తారో, వారికి, పరమానందం లభిస్తుంది. నా సేవకే జీవితాన్ని అంకితం చేసుకున్న వారికీ, నా ఆరాధనలోనే ఆనందంపొందేవారికీ, అన్య చింత అంటూ ఉండదు. వారు, అచిరకాలంలోనే ప్రసన్నమానసులూ సమ్యగ్దర్శనులూ అవుతారు. అటువంటివారికే కైవల్యం సిద్ధిస్తుంది.

ఆత్ముడు సర్వస్వతంత్రుడు. దేహ జ్ఞాన కర్మేంద్రియ మానసాలకు ఆత్ముడే అధిపతిఅని గ్రహించినవారు బంధవిముక్తి పొందుతారు. వారికి, దేహం మాత్రమే జనన మరణాలకు కట్టుబడి ఉంటుందనీ, ఆత్మ ఒక్కడే శాశ్వత

మైనదనీ, అవగత మవుతుంది. అటువంటివారికి విచార మనేదే ఉండదు.

విజ్ఞానులయినవారు సుఖానికి పొంగిపోరు; దుఃఖానికి కృంగిపోరు. వారు, సర్వభూతాల లోనూ, నన్నే దర్శించుకుంటూ ఉంటారు.

యజ్ఞ యాగాదులు చేసే వారూ, కర్మ కాండలో మునిగితేలుతూ ఉండేవారూ, తపస్సు చేసేవారూ, నన్ను, సులభంగా దర్శించలేరు. సర్వభూతహితులయినవారే నన్ను సులభంగా దర్శించుకోగలుగుతారు.''

భగవంతుని పలుకులను శిరసావహించిన పృథువు, ఆ వెంటనే, ఆయన పాదాలమీద పడి, ఇలా ప్రార్థించాడు.

''మాధవా! నీ దర్శనంవల్ల, నాలో ఉన్న అజ్ఞానాంధకారం తొలగి పోయింది. జన్మజన్మాంతరాల పుణ్యఫలమైన నీ ఆదరం నాకు లభించింది. ఇక, నా కీ ప్రపంచంలో, వాంఛనీయమైన దేదీ లేదు. కాని, నేను నిన్ను ఒకే ఒక వర మర్థిస్తున్నాను. ఇంతవరకూ, మహాత్ముల ద్వారా, నీ విమల యశాన్ని నే నెంతగానో విన్నాను. అది, నాకు, అనిర్వచనీయానందాన్ని సమకూర్చింది. అయినా, 'ఇక చాలు' అన్న, సంతృప్తిమాత్రం కలుగలేదు. ఇక ముందుకూడా, మహాత్ములద్వారా, నీ దివ్యకథామృతాన్ని సేవిస్తూ ఉండాలనే కోరుతున్నాను. అలా సేవించటానికి, పదివేలచెవులున్నా చాలదా అనిపిస్తోంది. అందుకనే, అనవరతం, నీ దివ్యకథ లాకర్ణిస్తూ ఉండే అదృష్టాన్ని నాకు కలిగించాలని మాత్రం, నేను నిన్ను కోరుతున్నాను.''

అలా ప్రార్థించిన పృథుమహారాజు కోరికను మన్నించి, భక్త వత్సలుడయిన శ్రీమన్నారాయణుడు, ఇలా అన్నాడు.

''రాజా! నాపట్ల నీకు దృఢతరమైన భక్తి కలుగుతుంది. ఆ భక్తి

ద్వారా, నువ్వు, నా మాయను జయించి తీరుతావు. నా ఆదేశానువర్తివయే నీకు, సర్వశుభాలూ లభిస్తై."

ఆ విధంగా ప్రసన్నుడయిన హరిని, పృథుచక్రవర్తి, అపూర్వంగా పూజించాడు. అతని పూజ లందుకున్న అనంతరం, శ్రీమహావిష్ణువు, అమిత సంతుష్టితో ఆయన నను గ్రహించి, నిజధామానికి వెళ్ళిపోయినాడు.

ఆ తరువాత, పృథుమహారాజు, తిరిగి తన నగరులో ప్రవేశించి, ప్రారబ్ధ కర్మను క్షయింపచేసుకునే నిమిత్తం, అఖిల పుణ్యఫలాలనూ అనుభవిస్తూ, అప్రతిహతమైన తన శాసనాన్ని ప్రపంచమంతటా ప్రవర్తింపచేస్తూ, కొంతకాలం గడిపాడు. ఆ సమయంలో, ఒకసారి, బ్రహ్మర్షులూ, దేవర్షులూ, ఒకచోట సమావేశం కావటం జరిగింది. ఆ సమావేశానికి, పృథుచక్రవర్తి కూడా వెళ్ళాడు. అలా వెళ్ళిన మహారాజు, వారి సముఖాన, తన ధర్మశాసనాన్ని ఇలా విశదపరచాడు.

"ప్రపంచాతీతుడూ నిత్యసత్తాకుడూ అయిన భగవంతు డొక డున్నాడు. ఆయన, ఈ ప్రపంచ నిర్మాణాని కంతటికీ మూల కారకుడు. ఆ యథార్థాన్ని, మహాత్ము లెందరో సిద్ధాంతీకరించారు.

ఎవరికి ఉచితమైన కర్మను వారు చేయటం ధర్మం.

ఆ ధర్మమార్గాన ప్రజలను ప్రవర్తింప చేయటమే, రాజునైన నా కర్తవ్యం.

ఎవ రే కర్మానుష్ఠానానికి పూనుకున్నా, వారు, దాన్ని, పరమేశ్వరార్పణ బుద్ధితో చేయాలి. అలా చేయటంవల్ల, వారు, ముక్త సంగు లవుతారు. అసలు, ఈశ్వరారాధన

చేయాలన్న సంకల్పం కలుగగానే, ప్రాణి, కొంతవరకు పవిత్రుడు కావటం, పూర్వజన్మలలో చేసుకున్న పాపాలనుంచి విముక్తి పొందటం జరుగుతుంది. ఆ విధంగా పవిత్రమానసుడైనవాడు, వైరాగ్య విజ్ఞానాన్ని సముపార్జించుకునే అర్హత నార్జించుకుంటాడు. ఆ విజ్ఞానం ద్వారా, అతడు, బంధ విమోచన పొంది, ఆత్మజ్ఞానాన్ని సముపార్జించుకుని, మృత్యువును జయించగలుగుతాడు; మోక్షాన్ని పొందగలుగుతాడు.

అందుకనే, ప్రజ లందరూ, ఎవరి ధర్మాలను వారు అనుసరించాలనీ, మనోవాక్కాయ కర్మలద్వారా మాధవుని ధ్యానించి, స్తుతించి, సేవించాలనీ నేను శాసిస్తున్నాను. అంతేకాదు,

నారాయణుండు జగదా
ధారుండగు నీశ్వరుండు, దలప నతనికిన్
లే రెందు సములు, నధికులు,
ధీరోత్తము డతడు, అద్వితీయుం డగుటన్.

నారాయణుని పాదాల నాశ్రయించిన వారిని, సంసారజనిత క్లేశా లేవీ బాధించవు.

అందుకనే, నా ప్రజ లందరూ, ఆ విధమైన బాధా నివృత్తికి కృషి చేయాలని నేను అర్థిస్తున్నాను. అంతేకాదు. పుణ్యకర్మలు చేసిన వారికి యే ఫలం లభిస్తుందో, ఆ ఫలం, వారి నలా శాసించిన వారికికూడా సిద్ధిస్తుంది. ఆ పుణ్యఫలసిద్ధిని నేను కూడా వాంఛిస్తున్నాను."

ఆ విధంగా తన హృదయాన్ని విశదపరుస్తున్న పృథు చక్రవర్తి వద్దకు, అంతరిక్షం నుంచి, సనకాదులయిన సిద్ధులు నలుగురు దిగి

వచ్చారు. అలా వచ్చిన వారికి, పృథు మహారాజు, స్వాగతం చెప్పాడు.

సనకాదుల దర్శనం, సామాన్యంగా ఎవరికీ లభించదు. వారు, పరమ పావనమూర్తులు. వారు, భానుతేజంతో ప్రకాశిస్తూ ఉంటారు. అటు వంటి సిద్ధులు, అయాచితంగానే తనకు దర్శనమివ్వటంవల్ల, పృథుచక్రవర్తి, తాను ధన్యుడైనట్టు భావించాడు.

ఎవరిపట్ల, విప్రులూ, మహేశ్వరుడూ,
విష్ణువూ, భగవద్భక్తులూ ప్రసన్నులై ఉంటారో,
వారికి, సాధ్యంకాని పను లేవీ ఉండవు.

అది గ్రహించిన మహారాజు, వారిని యథావిధిగా అర్చించి, వారి పాదోదకాన్ని శిరస్సున చల్లుకుని, వారిని స్వర్ణాసనాలమీద ఉపవిష్టులనుగా చేసి, వినయవిధేయతలతో, వారి కిలా విన్నవించుకున్నాడు.

"మహాత్ములయిన మీ దర్శనంవల్ల, నా జన్మ ధన్యతచెందింది. మీ పాదస్పర్శవల్ల, నా గృహం పావన మయింది.

ఏ గృహస్థుల ఇళ్ళలో మహాత్ములు పూజింపబడుతారో, ఏ గృహస్థుని ఆతిథ్యాన్ని పొంది, మహాత్ములు ప్రసన్నులవుతారో, ఆ గృహస్థు, దరిద్రుడై కూడా ధన్యుడే అవు తాడు. ఏ గృహమేధి ఇంట్లో మహాత్ములు అడుగు పెట్టరో, ఆ గృహమేధి ఇల్లు, సర్వ సంపత్సమృద్ధమై కూడా, ఉరగ సంతానానికి ఆకరమైన వృక్షం మాదిరి ఉంటుంది.

మీరు, బాలురై కూడా, శ్రద్ధాసమన్వితులై, ముముక్షువులై, ఎన్నో వ్రతా లాచరించారు. పరమ పావను లయినారు. మీరు, మావంటి వారికి ఆదర్శప్రాయులు. ఇంద్రియార్థాలనే పురుషార్థాలుగా భావించి, వ్యసనార్ణవమయిన సంసారంలో పడి తన్నుకులాడే మాకు, మీబోటి పవిత్ర

మూర్తుల సేవనమే తరణోపాయం. భక్తుల ననుగ్రహించే నిమిత్తం, ఈశ్వరుడే, అప్పుడప్పుడు, మీవంటి సిద్ధుల రూపంలో దర్శనీయు డవుతూ ఉంటాడు.

మీరు ఆత్మారాములు. మీరు ఎప్పుడూ కుశలురే. సుఖ దుఃఖాలనేవి, మాబోటి సంసారులకేకాని మీకు కావు.

మీరు మహానుభావులని నేను విశ్వసిస్తున్నాను. మీకు తెలియని విషయమంటూ ఉండదని కూడా, నేను భావిస్తున్నాను. అందుకనే, ఈ సంసారార్ణవాన్ని తరించే మార్గం, మీ ద్వారా గ్రహించాలని కోరుతున్నాను."

ఆ విధంగా విన్నవించుకున్న పృథు మహారాజుపట్ల ఆ మహర్షులకు అమితమయిన వాత్సల్యం కలిగింది. అది కారణంగానే, వారు, ప్రసన్నులై, ఆయనకు ఆత్మతత్త్వాన్ని బోధించారు.

ఆత్మతత్త్వాన్ని గ్రహించటం, దాని మూలంగా అద్వైతాపరోక్ష జ్ఞానాన్ని సముపార్జించుకోవటం, దుర్ఘటమనీ, అందుకనే, పరమ పురుషార్థమైన మోక్షాన్ని పొందే నిమిత్తం, వివేకులయినవారు, భక్తి యోగాన్ని అవలంబిస్తారనీ, వా రాయనకు తెలియపరచారు. అంతేకాదు.

"వాసుదేవుడు భక్తి సులభుడు. సంసార
సాగరాన్ని తరించాలనుకునేవారికి, వాసుదేవ
భక్తి అనే నావ, చక్కగా ఉపయోగిస్తుంది.

నువ్వు కూడా, ఆ మార్గాన్నే అనుసరించటం ఉత్తమం" అని కూడా బోధించారు.

అలా బోధించి, ఆయన అర్చన లందుకుని, సనత్కుమారాదులు అంతరిక్ష మార్గాన వెళ్ళిపోయినారు. ఆ తరువాత, ఆది సమ్రాట్టయిన పృథువు, ఆత్మనిష్ఠుడైఉండి, వేదవిహితమైన కర్మ లాచరిస్తూ, దాన ధర్మాలు చేస్తూ, పురుషోత్తముని ఆరాధిస్తూ, కొంతకాలం గడిపాడు. కాల

క్రమాన, ఆ మహారాజుకు, అనన్యమైన భక్తి కలిగింది. ఆ భక్తి, వైరాగ్యాన్ని ప్రసాదించింది. ఆ వెంటనే,ఆయన,తన భార్యతో కూడా తపోవనానికి వెళ్ళి, కొంతకాలం ఉగ్రతపం చేసి, మాయోపాధిని త్యజించి, పరమపదం పొందాడు.

ఆ విధంగా పృథుమహారాజు దేహత్యాగం చేసిన అనంతరం, ఆయన భార్య అయిన అర్చి, ఆయన కళేబరానికి అంత్యక్రియలు జరిపించి, అక్కడే తానుకూడా అగ్నిప్రవేశం చేసింది, ఆయన ననుగమించింది. అది గ్రహించిన దేవతలు...

''పతివ్రతలకు అసాధ్యమైన దేదీలేదు. హరి
భక్తియుతులయినవారికి పొందరాని ఇహ పర
సౌఖ్యా లంటూ ఉండవు"

అని, ఆ దంపతులను అమితంగా ప్రశంసించారు.

## 29. ప్రచేతసులు :

పృథుచక్రవర్తి అనంతరం, ఆయన కుమారుడైన విజితాశ్వుడు సార్వభౌముడయినాడు. ఆ విజితాశ్వునకు, అంతర్ధాను డనే మరొక పేరు కూడా ఉంది.

విజితాశ్వునకు, శిఖండి, నభస్వతి అనే ఇద్దరుభార్య లున్నారు. వారివల్ల అతనికి తొమ్మిదిమంది పుత్రులు కలిగారు. వారిలో బహిర్మంతు డనే వాడు అనేక యజ్ఞాలు చేశాడు. అతను, ప్రాచీనబర్హి అని వ్యవహరింపబడేవాడు.

ప్రాచీనబర్హి భార్య శతధృతి. ఆమె లోకోత్తరమైన సౌందర్యవతి. ఆ దంపతులకు ప్రచేతసు లనే పదిమంది కుమారులు జన్మించారు.

ప్రచేతసులు, తమ తండ్రి అయిన ప్రాచీనబర్హి ఆదేశాన్ని శిరసావహించి, తపస్సు చేసుకునే నిమిత్తం, పశ్చిమానికి వెళ్ళటం జరిగింది.

అలా వెడుతున్న వారికి, ఒక దివ్యపురుషుడు సాక్షాత్కరించి, వారి పూజ లందుకుని...

> "నూరు జన్మలలో, నిష్ఠతో స్వధర్మాన్ని ఆచరించిన వాడు, బ్రహ్మత్వాన్ని పొందుతాడు. అంతకు మించిన ధర్మానుష్ఠానపరుడు, మహేశ్వరుని చేరుకుంటాడు. భగవద్భక్తులైనవారికి విష్ణుపదం ప్రాప్తిస్తుంది.
>
> బ్రహ్మగాని, మహేశ్వరుడుగాని, అధికారాంతాన రూపుమాసిపోతారు. కాని, విష్ణుపదప్రాప్తి పొందినవారు మాత్రం ప్రపంచాతీతమైన ఆ స్థానంలో అచంచలంగా ఉండిపోతారు.

అందుకనే మీరు ఆ వాసుదేవుని ఆశ్రయించాలని నేను కోరుతున్నాను," అని చెప్పి, వారికి, నారాయణపరమయిన స్తోత్రాన్ని ఉపదేశించాడు. అలా ఉపదేశించిన తరువాత, వారిని ఉద్దేశించి, ఇలా అన్నాడు.

> "భగవంతుడు భక్తి కలవారికి మాత్రమే సులభుడవుతాడు. ఆయన పాదాల నాశ్రయించినవారికి, స్వర్గాది ఫలాలు కూడా రుచించవు.
>
> భగవద్భక్తులైన వారికి, బాహ్య విషయేచ్ఛ తొలగిపోతుంది. అంతశ్శుద్ధి లభిస్తుంది. పరిశుద్ధమైన శీలం అలవడుతుంది. అది కారణంగా, వారికి, ఈశ్వరతత్త్వం గ్రాహ్యమవుతుంది. ఈశ్వరతత్త్వం గ్రహించినవారికి విష్ణుపద ప్రాప్తి కలుగుతుంది."

అలా బోధించిన దివ్యపురుషుడు, ఆ తరువాత, వారి కోరిక మీద, తన నిజరూపాన్ని ప్రదర్శించాడు. అది చూసిన ప్రచేతసులు, తమకు ప్రత్యక్షమైనవాడు మహేశ్వరుడేనని అప్పుడు గ్రహించారు. ఆ వెంటనే, వా రాయనను విధ్యుక్తంగా పూజించారు. వారి పూజలు పొందిన మహేశ్వరుడు, అమితంగా సంతుష్టి చెంది, ఆ వెంటనే అంతర్హితుడయి నాడు.

ఆ విధంగా ప్రసన్నుడై పరమోపదేశం చేసిన మహేశ్వరుని ప్రశంసిస్తూ, ప్రచేతసులు, ఆ తరువాత పదివేల సంవత్సరాలు, తీవ్రమైన తపస్సు చేశారు. అలా తపస్సు చేసుకుంటూ ఉండగా, కనకకుండల కిరీటాది భూషలతోనూ, వనమాలతోనూ అలంకృతుడైన శ్రీమహావిష్ణువు, ఎనిమిది చేతులలోనూ ఎనిమిది ఆయుధాలు ధరించి, వారి ఎదుట సాక్షాత్కరించాడు.

అలా సాక్షాత్కరించిన శ్రీమన్నారాయణుని ఉద్దేశించి, ప్రచేతసులు...

"సర్వశరణ్యా! నువ్వు భవబంధవిమోచనుడవు. నిన్ను భజించే వారికి ఏవిధమైన క్లేశాలూ ఉండవు. భక్తుల మనోరథాల నీడేర్చటంలో నువ్వు చూపే ఔదార్యం వర్ణనాతీతం.

నువ్వు లీలామానుష విగ్రహుడవు. పరమ శాంతుడవు. సర్వాంతర్యామివి. సర్వభూతహితుడవు.

మా అదృష్టవశాన నీ దర్శనభాగ్యం మాకు కలిగింది. దాని మూలంగా మాకు ధన్యత లభించింది.

నిన్ను స్మరించినంతమాత్రంచేతనే, సర్వభూతాలకూ శాంతి సమకూరుతుంది. ఆ విధమైన శాంతి సమకూరినవారు, నిన్ను కోరదగిన వరం మాత్రం ఏముంటుంది ? మా మటుకు మేము, నువ్వు ప్రసన్నుడవు కావటమే పరమ వరమివ్వటంగా భావిస్తున్నాం. కాని, మాదైన కోరికనుమాత్రం నీకు మనవిచేసుకుంటున్నాం. మే మికముందు ఎన్ని జన్మల నెత్తవలసి

ఉన్నా, అన్ని జన్మలలోనూ, మాకు, భగవద్భక్తుల సంగమం లభించాలని వాంఛిస్తున్నాం. అదే మా కోరిక.

> భగవద్భక్తు లున్నచోట, నీవిశుద్ధ చరిత్ర కీర్తింపబడుతూ ఉంటుంది. నీ లీలలు అభి వర్ణింపబడుతూ ఉంటై. నీ ధ్యానం కనిపిస్తూ ఉంటుంది. అటువంటి భాగవతులు మెట్టిన స్థలం, పావన తీర్థ మవుతుంది.

ఆ తీర్థ సేవనఫలం కూడా మేం అభిలషిస్తున్నాం. ఆ వరాన్ని మాకు ప్రసాదించి మమ్మల్ని తరింపచేయవలసింది."

అలా ప్రార్థించిన ప్రచేతసుల భక్తికి, పరమేశ్వరు డమితంగా సంతోషించాడు. అందుకనే వారితో ఇలా అన్నాడు.

"మీ భక్తి నన్ను లోబరచుకుంది. మీరు పఠించే రుద్రగీత మీ పట్ల నాకు ప్రేమాదరాలను కలిగించింది; మీరు కోరిన వరా లివ్వటానికి నన్ను పురిగొల్పింది. మీ రికముందు, వేయి దివ్య వత్సరాలు అనుపమభోగా లనుభవించి, ఆ పైన, భక్తియోగంద్వారా విరక్తులై, నన్ను చేరు కుంటారు. మీరు గృహస్థులై ఉండి, సర్వ దివ్యభోగాలను అనుభవిస్తూ కూడా, నా లీలాభివర్ణనంలోనే కాలం గడుపుకుంటూ ఉండటంవల్ల, మీ గృహాలు మీకు బంధకారణాలు కావు. మీకు శ్రేయం లభించి తీరుతుంది."

ఆ విధంగా ప్రచేతసులను సంతుష్టిపరచి, శ్రీమన్నారాయణుడు అంతర్హితుడయినాడు. ఆ వెంటనే, ప్రచేతసులు, తపస్సు చాలించి, ఆయ ననే ధ్యానించుకుంటూ, గృహోన్ముఖులైనారు.

కాలక్రమాన, ప్రచేతసులు పదిమందీ, కండుమునికీ, ప్రమ్లోచ అనే అప్సరకూ పుట్టి, సోమరాజు వద్ద పెరిగిన మారిష అనే కన్యను, విష్ణుదేవుని ఆదేశం ప్రకారం, పెళ్ళి చేసుకున్నారు. ఆ మారిషకు, దక్షుడు

జన్మించాడు. బ్రహ్మదేవుడు, అతణ్ణి, ప్రజాసర్గరక్షణార్థం నియోగించటం జరిగింది.

పుత్రజననానంతరం, ప్రచేతసులు, తమ భార్యను తమ కుమారుని వద్ద వదలి, సన్యసించి, జాబాలిముని ఆశ్రమానికి వెళ్ళారు. అలా వెళ్ళిన ప్రచేతసులు, ఓసారి, నారదమహర్షిని సందర్శించటం జరిగింది. ఆ సందర్భంలో, వారు, ఆ మహర్షి నుద్దేశించి, తా మంతవరకూ గృహస్థాశ్రమంలో ఉండటంవల్ల, పూర్వం, శివకేశవులు ఉపదేశించిన అధ్యాత్మ తత్త్వం మరచిపోవటం జరిగిందనీ, దాని సారాన్ని తిరిగి బోధించవలసిందనీ, ప్రార్థించారు. వారి ప్రార్థన నంగీకరించి, నారదమహర్షి, వారికి, తిరిగి, ఆత్మ తత్త్వాన్ని బోధించాడు. అలా నారదునిచేత తిరిగి బోధింపబడి, ప్రచేతసులు, కలిదోషహరమైన హరికీర్తిని మననంచేసుకుంటూ, హరినే ధ్యానించుకుంటూ, కాలక్రమాన, విష్ణుపదప్రాప్తి పొందారు.

## *30. పురంజనోపాఖ్యానం :*

ప్రచేతసుల తండ్రి అయిన ప్రాచీనబర్హి ఉట్టి కర్మిష్ఠి. కాలక్రమాన, ఆయన, పారమార్థికచింత అనేదే లేకుండా, భోగలాలసుడు కావటం జరిగింది. అది గ్రహించిన నారదమహర్షి, ఓసారి ఆయనను కలుసుకుని, ఇలా బోధించాడు.

''మహారాజా! నువ్వుచేసే కర్మలద్వారా, నువ్వు, దేనినాశిస్తున్నావో నాకు తెలియకుండా ఉంది. ఈ కర్మలవల్ల, దుఃఖ నాశనం గాని, సుఖ ప్రాప్తిగాని కలుగదు. అంతేకాదు. కర్మాచరణపరాయణు లయినవారు, పరమశ్రేయోమార్గాన్ని కూడా విస్మరించినవా రవుతారు.

యాగ సమయాలలో నీచేత వధింపబడే పశువులకు లెక్క లేకుండా ఉంది. అది చాలా అన్యాయం. వాటిపట్ల నువ్వు చేస్తున్న అపచారాన్ని, అవి, ఏనాటికీ మరచిపోవు. నువ్వీ దేహాన్ని త్యజించి, పరలోకా

నికి వెళ్ళినా, అవి, నిన్ను వదలిపెట్టవు; ఉక్కు కొమ్ములతో, పొడిచి పొడిచి పీడిస్తూనే ఉంటై.

అదీకాక, నువ్విప్పుడు, ఉట్టి భోగలాలసుడవుగా కూడా వ్యవహరిస్తున్నావు. ఈ విధమైన జీవితంలో నువ్వు సాధించే దేమిటో, నాకు అనూహ్యంగా ఉంది.

ప్రాపంచిక వాసనలు ఏమాత్రం ఉన్నా
పరమశాంతి లభించదు.

దానికి సంబంధించిన ఒక ఇతిహాసం కూడా ఉంది. అది నీకు చెప్పదలచాను.

పూర్వం, పురంజను డనే ఒక మహారాజు ఉండేవాడు. ఆయనకు ప్రాణస్నేహితు డొక డుండేవాడు. కాని, ఆ ప్రాణస్నేహితుని పేరుగాని, ఆయన చేసే పనిగాని, ఎవ్వరికీ తెలియదు.

పురంజనుడు, ఉట్టి భోగప్రియుడు. సర్వవిధభోగాలనూ అనుభవించటానికే అతను నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయంతోనే, అతను, అందుకు తగిన స్థలాన్ని వెతుక్కుంటూ, ప్రపంచమంతటా తిరిగాడు;కాని, అటువంటి స్థలం, అతనికి ఎక్కడా కనిపించలేదు. అయినా, అతను, తన ప్రయత్నాన్ని విరమించుకోకుండా, తిరుగుతూనే ఉన్నాడు. అలా, విసుగూ విరామం లేకుండా, తిరుగుతూ ఉన్న సమయంలో, హిమవత్పర్వతానికి దక్షిణంగా ఉన్న భారతవర్షం అతనికి కనిపించింది. ఆ మహానగరం చూడగానే, అతనికి, అమితమైన ఆనందం కలిగింది. అది, భోగవతీపుర మేమోనని కూడా అతను భ్రమపడ్డాడు.

ఆ మహానగరానికి, తొమ్మిది ద్వారాలున్నై. దాని ఉన్నత ప్రాకారాలూ, రథ్యలూ, క్రీడాస్థలాలూ, సరోవరాలూ, ఆ మహారాజు మనసును ఆకర్షించినై. అందుకనే, అది తనకు తగిన ప్రదేశమని అతను నిర్ణయించుకున్నాడు; అందులో ప్రవేశించాడు.

అలా, ఆ నగరంలో ప్రవేశించిన మహారాజుకు, ఓసారి, ఒకా నొక ఉద్యానవనంలో, ఒక మనోహరాంగి కనిపించింది. ఆ వయసుగత్తె ననుసరించి, శతనాయకులయిన పదిమంది భృత్యు లున్నారు. పంచశీర్ష పన్నగ ప్రతీహారి ఒకడు, ఆమె మనోభిప్రాయాలను గ్రహిస్తూ, ఆమె నాశ్రయించి ఉన్నాడు. ఆమె అందచందాలూ, అవయవ సౌష్టవం, మృదు మధుర మందహాసం, మదపుటేనుగు నడకవంటి నడకా, ఓరచూపులూ, ఆ మహారాజు హృదయాన్ని ఆకర్షించినై. ఆ వెంటనే, అతను, మోహ పరవశుడై నాడు. ఆ పరవశత్వంలోనే, అతడు, ఆమెను సమీపించి, ఏ విధ మైన సంకోచం లేకుండా, ఆమెను పలుకరించాడు. 'నువ్వెవరవు?' 'నీ పే రేమిటి?''నీ తలిదండ్రు లెవరు?' నీతో ఉన్న వీరందరూ యెవరు?' 'అసలు నువ్విక్కడ యెందుకు ఉన్నావు?' అని కూడా అడిగాడు. అంతేకాదు.

"నువ్వు భవుని అన్వేషిస్తున్న భవానివో, బ్రహ్మదేవుని వెదుకు తున్న భారతివో, విష్ణుని కోరి తిరిగే ఇందిరవో కూడా నాకు తెలియకుండా ఉంది. కాని, నువ్విలా భూలోకంలో కనిపించటంవల్ల శ్రీదేవివిగాని, శార దవుగాని, శివవుగాని కావనీ, తగిన వరుని అన్వేషిస్తూ సంచరించే ఎవరో ఒక దివ్యాంగనవై ఉంటావనీ, నేను భావిస్తున్నాను.

ఏదేమైనా, నేను నిన్ను మోహించాను. నన్ను వరించవలసింది; నాతో దివ్యభోగా లనుభవించవలసింది''

అనికూడా, ప్రస్తుతి పూర్వకంగా బ్రతిమాలుకున్నాడు.

పురంజనుని వేడికోలు విని, ఆ పడుచు, చిరునవ్వుతో అతనికి స్వాగతం చెప్పింది. ఆ తరువాత, అతనిని ఉద్దేశించి ఇలా అన్నది.

''మహారాజా! మే మెవరి బిడ్డలమో మాకు తెలియదు. మాకు పుటుకనిచ్చి, కులగోత్రనామాదులు కల్పించిన మహానుభావుని, ఊహించటం కూడా మాచేతకాదు. యథార్థానికి, నీ పరిస్థితికూడా అంతే అను కుంటాను.

ఈ పదిమంది భటులూ, పడగొండవవాడైన బృహద్బలుడూ నా స్నేహితులు. ఈ పంచశీర్ష పన్నగం, మేము నిద్రించేటప్పుడు తాను మేలుకుని ఉండి, ఈ పురాన్ని రక్షిస్తూ ఉంటుంది.

నువ్వు వీరాధివీరుడవని నా కనిపిస్తోంది. ఈ పురాన్ని నీపాలన క్రింద ఉంచటం కూడా అసమంజసం కాదని నాకు తోస్తోంది. నువ్వు, మా భాగ్యవశాన మా పురానికి వచ్చావు. నీకు మేము స్వాగతం చెబుతున్నాము.

నువ్వు దివ్యభోగాలను కోరుతున్నావు. నీ కోరిక నెరవేరుతుంది. నూరేళ్ళపాటు, నువ్విక్కడ యథేచ్ఛగా వ్యవహరించవచ్చు. దానికి మేమంగీకరిస్తున్నాం. ఇక. నీతో గృహస్థాశ్రమధర్మాన్ని నిర్వహించటానికి, నేను కూడా ఉత్సహిస్తున్నాను "

అలా పలికిన ఆ పడుచును స్వీకరించి, ఆ మహారాజు, ఆ తరువాత నూరేళ్ళు. అనుపమ భోగా లనుభవించాడు. ఆ కాలంలో, అతను పొందని సుఖ మంటూ లేదు.

కామ పరతంత్రుడైన పురంజనుడు, తన భార్యను, తన ప్రాణానికి ప్రాణంగా చూసుకునేవాడు. ఆమె ఆనందమే తన ఆనందంగా, ఆమె దుఃఖమే తన దుఃఖంగా, ఆమె కోరికలే తనవిగా అతడు వ్యవహరిస్తూ ఉండేవాడు. అది కారణంగా అతని స్వాతంత్ర్యం పూర్తిగా నశించిపోయింది. అతడు ఆమె చేతులో కీలుబొమ్మ అయిపోయినాడు.

ఆ విధంగా, ఆ మహారాజు, తాను వాంఛించిన భోగా లన్నింటినీ పొందుతూ ఉన్నా, అతనికి మాత్రం, ఏదో ఒక అనిర్వచనీయమైన విచారం, అశాంతి, ఉంటూనే ఉండేది. అతడు కోరిన శాశ్వతానందం, అతనికి, దుర్లభంగా తోచేది.

కాలక్రమాన అతనికి లెక్కలేనంతమంది కుమారులూ, కుమార్తెలూ కలిగారు. వా రందరికీ అతను తగిన సంబంధాలు చూసి, వివాహాలు

చేశాడు. ఆ తరువాత, ఘోరమైన క్రతువు లెన్నో ఆచరించాడు. వాటి ద్వారా, భూసురులనూ, సురలనూ, పితృదేవతలనూ సంతృప్తి పరచాడు. అంతలో వృద్ధాప్యం సమీపించింది.

స్త్రీలోలుడూ, క్రతుప్రియుడూ అయిన ఆ మహారాజు, సర్వ ప్రపంచాన్నీ విస్మరించి ప్రవర్తిస్తూ ఉండటం గ్రహించిన చండవేగు డనే ఒక గంధర్వరాజు, సమయం కనిపెట్టి, పురంజన పురాన్ని ముట్టడించాడు. ఆ పురంలో ప్రవేశించటానికి అత డెంతగానో ప్రయత్నించాడు. కాని, అక్కడ ఉన్న పంచశీర్షపన్నగం, అతణ్ణి, తీవ్రంగా వారిస్తూ వచ్చింది. అయినా, కాలక్రమాన, దాని శక్తి కూడా క్షీణించిపోవటంవల్ల, పురంజనుడు, తన పరివారం తెచ్చియిచ్చే ఆహారం తీసుకుంటూ కాలం వెళ్ళదీసుకో సాగాడు.

అంతలో, యవనేశ్వరుడయిన భయనామునితమ్ముడు, ప్రజ్వారు డనేవాడు సహాయంగా, కాలకన్యక, అమితమైన సైన్యంతో, పురంజన పురంలో ప్రవేశించటం జరిగింది. ఆమె అనుచరుల పీడవల్ల, పురంజనుడు నష్టప్రజ్ఞుడై చాలా బాధలుపడ్డాడు. అలా బాధలు అనుభవిస్తూ కూడా, అతడు, తనభార్యాపుత్రవిత్తాదులమీద మమకారాన్ని వదలుకోలేకపోయినాడు. తన అనంతరం తన భార్యాపుత్రులు తన కోసం దుఃఖించి కృశించిపోతారనీ, పోషించే దక్షుడు లేక అగచాట్లపాలవుతారనీ అతడు భావించసాగాడు.

ఆ సమయం కనిపెట్టి, భయనాముడు అతణ్ణి బంధించి, కాలకన్యకకు ఒప్పగించాడు. అది కారణంగా, పురంజనుడు, అంగశైథిల్యం పొందాడు. ఆ స్థితిలోకూడా అతనికి తన ప్రియురాలిమీద మమకారం వదల లేదు; పూర్వ స్నేహితుడయిన అవిజ్ఞాతునిమీదికి దృష్టిపోలేదు. ఆ పరిస్థితులలోనే, అతణ్ణి, భయనాముని భటులు బలవంతంగా బయటకు ఈడ్చుకుపోవటం జరిగింది. అలా లోకాంతరగతుడయిన పురంజనుని, అత డంతకు పూర్వం వధించిన యజ్ఞపశువులు, అమిత క్రోధంతో హింసించినై.

పురంజనుడు, తుది ఘడియలలోకూడా తన ప్రియురాలినే తలచుకుంటూ ఉండటంవల్ల, ఆ తరువాతి జన్మలో, అతడు, విదర్భరాజుకు కూతురై పుట్టాడు. ఆ విదర్భేశ్వరుని కుమార్తెను, పాండ్యుడయిన మలయ ధ్వజుడు వివాహం చేసుకున్నాడు.

ఆ దంపతులకు, కాలక్రమాన, ఒక కూతురూ, ఏడుగురు కొడుకులూ జన్మించారు. వారు, తమ కుమార్తెను, అగస్త్యునికి ఇచ్చి వివాహం చేశారు.

అనంతరం, మలయధ్వజుడు, రాజ్యాధికారాన్ని తన కొడుకులకు ఒప్పగించి, తపస్సు చేసుకునే నిమిత్తం, భార్యతోసహా వనానికివెళ్ళాడు; అక్కడే దేహత్యాగం చేశాడు.

అలా పరమపదం పొందిన మలయధ్వజుని స్మరించుకుంటూ, సహగమనం చేయటానికి ఉద్యుక్తురాలై ఉన్న వైదర్భిని, అవిజ్ఞాతుడు సమీపించి, ఇలా అన్నాడు.

"వైదర్భీ! నేను నీ స్నేహితుణ్ణి. ఐహికభోగా లనుభవించే ఉద్దేశంతో, పూర్వం, నువ్వు, నన్ను వదలి వెళ్ళిపోయినావు. అలా వెళ్ళిన నువ్వు, పంచారామ, నవద్వారసమేత మయిన ఒక కామినీ నిర్మితపురంలో ప్రవేశించి, అక్కడ, భోగలాలసత్వంలో పూర్వజ్ఞానాన్నంతనూ విస్మరించి, దుర్గతిపాలైనావు.

నిజానికి నువ్వు వైదర్భివీ కావు, పురంజన పురాధిపతివీ కావు. నువ్విప్పుడు స్త్రీవనీ, పూర్వజన్మలో పురుషుడవనీ అనుకోవటం అజ్ఞానం. అదంతా నా మాయవల్ల జరిగిందేకాని మరొకటి కాదు. నువ్వే నేను. నేనే నువ్వు. మన కిద్దరికీ ఏ విధమైన భేదం లేదు. మనిద్దరం మానసరాజ హంసలం. అది గ్రహిస్తే నీ కీ విచారం తొలగిపోతుంది."

ఆ విధంగా బోధించిన అవిజ్ఞాతుని విని వైదర్భి, తన శోకాన్ని త్యజించటం జరిగింది.

నారదునివల్ల పురంజనోపాఖ్యానాన్ని విని, ప్రాచీనబర్హి, దాని అంతరార్థాన్ని వివరించవలసిందిగా కోరాడు. అతని కోరికమీద, నారద మహర్షి, ఇలా విశదపరచాడు.

"పై ఇతిహాసంలో తెలుపబడ్డ పురంజనుడు పురుషుడు. అతడే ఆత్మ. అతని స్నేహితుడయిన అవిజ్ఞాతుడు, పరమాత్ముడు. అతణ్ణి ఎవరూ గ్రహించలేకపోవటంవల్ల, అతడు, అవిజ్ఞాతుడని వ్యవహరింపబడ్డాడు.

పురంజనుడు, తను కోరిన భోగాలకు అనువైన స్థలంకోసం ఎన్నో పురాలు తిరిగాడని చెప్పటం జరిగింది. అతడు తిరిగిన పురాలన్నీ, అన్ని దేహాలు. ఆ దేహా లన్నింటిలోనూ, సర్వకామాలనూ తీర్చగలది మానవదేహం. ఆ పురాన్నే పురంజనుడు వరించాడు.

ఆ మానవదేహమే, కళ్లు, చెవులు, ముక్కు, నోరు, మొదలయిన నవద్వారాలు కల పురంజనపురం. అందులో ఉన్న పంచారామాలు శబ్దాది పంచ విషయాలు. 'నేను', 'నాది' అనే అహంకారమే, ఆ పురంజనుని వశపరచుకున్న స్త్రీమూర్తి ఆ అహంభావంతోనే, పురుషుడు, ప్రాపంచికభోగాలన్నింటినీ అనుభవిస్తాడు. దాని ఫలితంగానే, జీవుడు మోహితుడు కావటం, అజ్ఞానావృతుడు కావటం జరుగుతుంది.

కాలకన్యకగా పేర్కొనబడ్డది జర. అది మృత్యువుకు చెలికత్తె. అలాగే, మనస్సు బృహద్బలుడనీ, భయనామకుడయిన యవనేశ్వరుడు మృత్యువనీ, అతని సైనికులే ఆధి వ్యాధులనీ, భూత పీడ కుపక్రమించే జ్వరమే ప్రజ్వారుడనీ, పంచవృత్తి అయిన ప్రాణమే పంచశీర్షపన్నగమనీ గ్రహించాలి.

'నేను', 'నాది' అనే భావంవల్లనే, పురుషుడు, అజ్ఞానావృతుడు కావటం, దేహేంద్రియాదులవల్లా, భూతాలవల్లా సంభవించే దుఃఖాన్ని అనుభవిస్తూ ఉండటం జరుగుతుంది.

పురుషుడు ఏవిధమైన కర్మ చేస్తే ఆ
విధమైన ఫలాన్ని అనుభవిస్తాడు. అతడు చేసిన
కర్మల ననుసరించే అతని జన్మ ఉంటుంది.

ఆ కర్మలుకూడా, సాత్త్విక, రాజసిక,
తామసిక కర్మలని మూడు రకాలుగాఉంటై.
సాత్త్విక కర్మ లాచరించినవారు ప్రకాశవంత
మయిన లోకాలలోనూ, రాజసకర్మలు చేసిన
వారు సుఖ దుఃఖాత్మకమైన లోకాలలోనూ,
జన్మిస్తారు. తామసకర్మాచరణులు, దుఃఖ
భూయిష్టమైన పుట్టువు పొందుతారు. కర్మ
ఫలానుసారంగా, స్త్రీ పురుష నపుంసక జన్మలు
గానీ, దేవమనుష్యతిర్యగ్రూపాలుగానీ, లభిస్తూ
ఉంటై; సుఖ దుఃఖాలు ప్రాప్తిస్తూ ఉంటై.

కామ పరతంత్రుడై జీవించేవాడు, ఉచ్చనీచా లనుభవిస్తూ, జనన మరణాత్మకమైన సంసారచక్రంలో తిరుగుతూ ఉంటాడు. అతని కేనాటికీ, దుఃఖ విచ్ఛేద మనేది కలుగదు.

ఆ విధమైన జీవితం దుఃఖభాజనమైనదేకాని మరొకటి కాదు. ఏదైనా బరువు మోసేవాడు, ఆ బరువును, కొంత సేపు తలమీదా, మరి కొంత సేపు భుజంమీదా మోపుకుంటూ ఉంటాడు. అలా అతను స్థలం మార్చినా అతని భారంమాత్రం తొలగటమంటూ ఉండదు. అదేవిధంగా, జీవుడు, తన పూర్వకర్మ అనే దుఃఖభారాన్ని జీవిత మంతా మోస్తూనే ఉంటాడు. మమకారంతోనూ స్వార్థంతోనూ చేసే కర్మలకు అజ్ఞానమే మూలం. ఆత్మజ్ఞానం పొందనంతవరకూ జీవి అజ్ఞానంలోనే ఉంటాడు. ఆత్మజ్ఞానాన్ని పొందినవారికే శాశ్వతమైన పరమానందానుభూతి సిద్ధిస్తుంది.

విరక్తినీ, జ్ఞానాన్నీ పొందటానికి అనన్య
మయిన భగవద్భక్తి అవసరం. భగవద్భక్తి

అనేది, భగవద్గుణ వర్ణన శ్రవణాదుల ద్వారా లభిస్తుంది. భగవద్భక్తిపరులయినవారు, ముల్లో కాలనూ జయించగలుగుతారు.

భగవంతుడు కరుణామయుడు. ఆయనను ఏవిధంగా ఆరాధించినా ఆయన ఆనందిస్తాడు. ఆయనను ఆనందపరచటమే మానవ జీవిత పరమావధి.

భగవత్పరంగా చేసే పనిమాత్రమే 'కర్మ' అనిపించుకుంటుంది. భగవత్పరమైన బుద్ధిని కలిగించేది 'విద్య' అనిపించుకుంటుంది. భగవంతుడు దేహధారులకుఆత్మ్మ దనీ, శరణ్యుడనీ, గ్రహించినవారు 'జ్ఞాను'లనిపించుకుంటారు; 'భగవత్స్వరూపు' లనిపించుకుంటారు.

మానవజీవితం అత్యల్పమైనది. మానవులు, తమ వయసులో పెరిగిన ప్రతిక్షణాన్నీ, తమ జీవితకాలంలో తరిగిన క్షణంగా భావించాలి. అలా భావించినవారు, భౌతికసుఖాలను వాంఛించరు. వారు, సర్వశరణ్యుడయిన ఆ పరాత్పరునే ఆశ్రయిస్తారు. ఆయననే భక్తితో ఆరాధిస్తారు. దాని మూలంగా, వారిని అంతవరకూ ఆవరించి ఉన్న అవిద్య తొలగిపోతుంది.

నీకుకూడా ఆ ఉత్తమస్థితి లభించాలని నేను కోరుతున్నాను.''

అలా ఉపదేశించిన నారదునకు, ప్రాచీనబర్హి, తన కృతజ్ఞతను తెలియపరచుకున్నాడు.

ఆ వెంటనే, నారదుడు, సిద్ధలోకానికి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, ప్రాచీనబర్హి, తన రాజ్యాన్ని తన కుమారులకు ఒప్పగించి, తపస్సు చేసుకునే నిమిత్తం కపిలాశ్రమానికి వెళ్ళాడు.

ఆ విధంగా కపిలాశ్రమం చేరుకున్న ప్రాచీనబర్హి, ఏకాగ్రచిత్తంతో హరిచరణాలనే ఆశ్రయించి, అనంతరకాలంలో, హరి భావం పొందటం జరిగింది.

## 31. ప్రియవ్రతుడు :

హరిచరణాంబుజ మకరం
ద రసావేశిత మనః ప్రధానుం డగు స
త్పురుషు డొకవేళ విఘ్నము
బొరసిన దన పూర్వమార్గమును విడువ డిలన్.

దానికి, మనుపుత్రుడయిన ప్రియవ్రతుడే తార్కాణం. అతడు, నారదుని ఆశ్రయించి, ఆయన ద్వారా ఆత్మతత్త్వాన్ని గ్రహించి, విజితేంద్రియుడూ భగవద్భక్తిపరాయణుడూ అయి, సర్వసంగ పరిత్యాగం చేయటానికి నిర్ణయించుకున్నాడు. అది, అతని తండ్రికి నచ్చలేదు. రాజ్యభార నిర్వహణకు సమర్థుడూ, సద్గుణ సమన్వితుడూ అయిన అతనిని రాజుగా చేయాలని ఆయన ఆశించాడు. కాని, ఐహికభోగాలు అశాశ్వతాలని గ్రహించిన ప్రియవ్రతుడు, అందుకు అంగీకరించలేకపోయినాడు.

ప్రియవ్రతుని అభిప్రాయం, చతుర్ముఖునకు కూడా సమంజసంగా తోచలేదు. అందుకనే, ఆయన, నారదమహర్షివద్ద ఉన్న అతణ్ణి కలుసుకుని, ఇలా ఉపదేశించాడు.

"పరమేశ్వరుని ఆజ్ఞను పాలించటం ప్రతి
జీవికీ పరమ ధర్మమై ఉంది. తపోయోగ బలా
ధికులయినవారికికూడా, ఆ ఆజ్ఞను తిరస్క

> రించటం, సంభవం కాదు. ఆయన, సృష్టికంతటికీ అధినేత. జననమరణాలు, సుఖదుఃఖాలు, జ్ఞానాజ్ఞానాలు, శోకమోహాలు, అనేవి, ఆయన, ఇచ్ఛాధీనాలు. అందుకనే, ఏ విషయంలోనూ ఎవరికీ స్వాతంత్ర్య మనేది లేదు. అందరూ కర్మాధీనులయినవారే.

ఇతరుల మాట దేనికి? నేనూ, నువ్వూ, నీ తండ్రి అయిన మనువూ, ఈ నారదమహర్షి కూడా, ఆ పరమేశ్వరుని ఆజ్ఞప్రకారం వర్తించవలసినవారమే. నే నిప్పుడు నీకు తెలుపబోతున్నవికూడా, ఆ పరమేశ్వరుని పలుకులే.

> గృహస్థులైనవారికి, మోక్షం పొందటం దుర్లభం కావచ్చు. అలా అని, వనాలకు వెళ్ళినంతలో మోక్షం సిద్ధించదు. ఏ జీవి అయినా, తనలో ఉన్న కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాలనే శత్రువులను జయించేవరకూ ముక్తి పొందలేడు. ఆ శత్రువులను జయించినవాడు, మోక్షం కోసం వనాలకు పోవలసిన పనిలేదు. అతడు గృహస్థాశ్రమంలో ఉండి కూడా తన ఆశయాన్ని సిద్ధింపచేసుకోవచ్చు. అయినా, ఆ అంతశ్శత్రువులను నిర్జించటానికి, హరి చరణాల నాశ్రయించక తప్పదు.

నువ్వు, హరిభక్తిద్వారా, అదివరకే, అంతశ్శత్రువులను జయించావు. ఇక నువ్వు చేయవలసిందల్లా, ఆయన ఆజ్ఞను పాలించటంమాత్రమే. నువ్వు, ముక్తసంగుడవై భోగాలను అనుభవించాలనీ, ఆ భోగాలకు మూలమైన రాజ్యాధిపత్యాన్ని స్వీకరించాలనీ, ఆయన నిర్ణయించాడు. ఆ నిర్ణయాన్ని శిరసావహించటం నీ ధర్మం.''

బ్రహ్మదేవుని ఆ దేశం, ప్రియవ్రతునకు, అతిక్రమింపరాని దయింది. అందుకనే, అతను, తన తండ్రి కోరిక ననుసరించి, రాజ్యాధికారాన్ని స్వీకరించాడు. ఆ తరువాత...

ధరణీవల్లభు డా ప్రియవ్రతుడు మోదంబందుచున్ ఏల నీ
శ్వర వాక్యంబున గర్మతంత్రపరుడై సంగంబులంబాపు శ్రీ
హరి పాదాంబుజ చింతనం దగిలి, నిత్యానందముం బొంది, దు
ర్భర రాగాదుల బారద్రోలి, ప్రజలం బాలించె నత్యున్నతిన్.

అలా రాజ్యపాలనం చేస్తున్న ప్రియవ్రతుడు, కాలక్రమాన, విశ్వకర్మ కూతురయిన బర్హిష్మతిని భార్యగా స్వీకరించాడు. ఆమెవల్ల పది మంది కుమారులనూ ఒక కుమార్తెనూ పొందాడు. మరొక భార్యవల్ల అతనికి ముగ్గురు కుమారులు కలిగారు. కాని, వారిలో, కవీ, మహావీరుడూ, సవనుడూ అనే ముగ్గురు, అతి బాల్యంలోనే ఆత్మవిద్య నభ్యసించి, సంసారాన్ని త్యజించి, నిరంతరభక్తి యోగంద్వారా, ఈశ్వరతాదాత్మ్యం పొందటం జరిగింది.

రాజ్యపాలనం చేస్తున్న సమయంలో, ప్రియవ్రతుడు పొందని భోగమంటూ లేదు. భోగాల ననుభవిస్తూ, ఆయన, ఏకాదశార్బుదవత్సరాలు గడిపాడు. అది కారణంగా, ఆయనదైన పూర్వవిజ్ఞానం, తాత్కాలికంగా, మఱుగుపడిపోవటం జరిగింది ; ఆయన, తన్ను తాను మఱచిపోవటంకూడా సంభవించింది.

కాలక్రమాన, ప్రియవ్రతుడు, భూమిని, ఏడు ద్వీపాలుగా విభజించి, తన ఏడుగురు కొడుకులనూ ఆ ఏడు ద్వీపాలకూ అధిపతులనుగా చేశాడు. ఆ విధంగా, జంబూ, ప్లక్ష, శాల్మలీ, కుశ, క్రౌంచ, శాక, పుష్కరా లనే సప్తద్వీపాలు ఏర్పడటం, వాటికి, క్షారోద, ఇక్షురసోద, సురోద, ఘృతోద, క్షీరోద, దధి, మంథోద, శుద్ధోద సింధువు లనే సప్త సముద్రాలు అగడ్తలుగా అమరటం జరిగింది.

ప్రియవ్రతుని కుమార్తె అయిన ఊర్జస్వతి శుక్రుని ధర్మపత్ని అయింది. ఆ దంపతులకు దేవయాని జనించింది.

బ్రహ్మదేవుని ఆదేశానుసారం, రాజ్యభోగా లనుభవిస్తూ, పృథ్వీ చక్రాన్ని పరిపాలించి, ఉత్తమసంతానాన్ని పొందిన ఆ ప్రియవ్రతునికి, అకస్మికంగా, ఒకసారి, జ్ఞానోదయమయింది. ఆ వెంటనే, ఆయన నంత వరకూ ఆవరించి ఉన్న అజ్ఞానావరణం తొలగిపోయింది. భార్యా పుత్రాదుల మీదా, సంపదలమీదా, రాజ్యాధికారంమీదా, చివరకు, నింద్యమైన తనశరీరం మీదా కూడా ఆయనకు విరక్తి కలిగింది. అది కారణంగానే, ఆయన, చిత్తంలో శ్రీనివాసుని నిలుపుకున్నాడు. సర్వసంగపరిత్యాగం చేశాడు. జ్ఞానమార్గాన కైవల్యాన్ని పొందాడు.

## 32. నాభి దంపతులు :

ప్రియవ్రతుని కుమారుడూ, జంబూద్వీపాధిపతీ అయిన ఆగ్నీ ధ్రుడు, పూర్వచిత్తి అనే ఒక అప్సరను పెళ్ళి చేసుకుని, నాభి ప్రభృతు లను, తొమ్మిదిమంది కుమారులను పొందాడు. ఆ నాభి భార్య మేరుదేవి. ఆ దంపతులకు, చాలాకాలంవరకూ సంతానం కలుగలేదు. అందుకని, వారు, అమితమైన శ్రద్ధాభక్తులతో, యజ్ఞపురుషుని ఆరాధింపసాగారు.

యజ్ఞయాగాదులవల్లా, క్రతువులవల్లా తపస్సువల్లా సాధార ణంగా లభ్యుడుకాని శ్రీమహావిష్ణువు, పరమభక్తులైన ఆ నాభి దంపతులకు కాలక్రమాన, ప్రత్యక్షమైనాడు. శ్రీవత్సలాంఛనంతోనూ, శంఖ చక్ర గదాదులతోనూ, దివ్యవనమాలతోనూ, కర్ణకుండలాలతోనూ, కటిసూత్రం తోనూ, కేయూరాది భూషలతోనూ మనోనయనానందకరంగా ప్రత్యక్షమైన ఆ పరమేశ్వరుని, అక్కడ ఉన్న పరమపావనులయిన ఋత్విక్కులతో పాటు, ఆ దంపతులుకూడ, ఇలా ప్రస్తుతించారు.

"సర్వేశ్వరా ! నిన్ను స్మరించినంతమాత్రంలోనే పాపాలన్నీ పటాపంచలవుతాయని పెద్దలు చెబుతారు. అటువంటి నిన్ను, మేము,

ప్రత్యక్షంగా చూడగలుగుతున్నాము. అది, నువ్వు మాకు ప్రసాదించిన అదృష్టం కాక మరొకటి కాదు.

పరమేశ్వరా ! నువ్వు పరిపూర్ణుడవు. నీకు కొఱత అనేదే లేదు. అయినా, నీ బిడ్డలమైన మేము, నిన్ను, మాకుతోచినట్టుగా అర్చిస్తున్నాము. ఆ అర్చనల నందుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాము.

తండ్రీ ! నువ్వు నిర్గుణుడవు. అయినా, అజ్ఞానులమయిన మేము, నీకు గుణాలను కల్పించి కీర్తిస్తున్నాము. అది దోషమయిన పక్షంలో, నువ్వు, మమ్మల్ని క్షమించవలసింది.

నాయనా ! నువ్వు, మనోవాగగోచరుడవు. కాని, భక్తసులభుడవు. నిన్ను దృఢభక్తితో సేవించేవారికి, నీ దివ్యసుందర విగ్రహాన్ని సాక్షాత్కరింపచేస్తావు.

అర్చన అనేది నీ కనవసరం. అయినా, భక్తులను సంతోషపరచటానికి, ఆ అర్చనలను, నువ్వు అందుకుంటావు. అలా అందుకుని, భక్తుల కోరికలను ఈడేరుస్తావు.

మేము నిన్ను స్తుతించటంలో విశేష మేమీలేదు. ఆత్మారాములూ, జ్ఞానమూర్తులూ అయిన మునులే, నిన్ను, నిరంతర ధ్యానం ద్వారా సేవిస్తారు.

మేము కర్మాధీనులం. అజ్ఞానులం. మమ్మల్ని నువ్వు ఉద్ధరించాలి. దానికి, సర్వపాపనిరసనమయిన నీ దివ్యనామాన్ని స్మరించే శక్తిని మాకు ప్రసాదించాలి. తద్వారా, నీ మాయను గెలిచే బలాన్ని మాకు దయ చేయాలి."

అలా స్తుతించిన నాభి ప్రభృతులపట్ల ప్రసన్నుడయిన హరి, వారి మనోగతాభిప్రాయాన్ని గ్రహించి, వారు కోరిన వరాలతో పాటు, ఆ మహారాజుకు, తన అంశతో ఒక కుమారుడు కలిగేటట్టు కూడా వరం ప్రసాదించి, అంతర్హితుడయినాడు.

ఆ విధమైన శ్రీహరివరప్రసాదంవల్ల జనించినవాడే ఋషభుడు. అతడు, సర్వశుభలక్షణాలతోనూ జన్మించాడు. అతని పాదాద్యవయవాలలో, వజ్రాంకుశాది భగవల్లాంఛనాలు గోచరించినై. అతడు, కాలక్రమాన, మహాధీరుడూ, శమ దమాది గుణ విరాజితుడూ, అద్వితీయ బలపరాక్రమ సంపన్నుడూ, ప్రజానురంజకుడూ, వైరాగ్యయుతుడూ, సర్వభూతసముడూ, కావటం జరిగింది. అది గ్రహించిన మహారాజు, అతనికి పట్టాభిషేకం చేసి, తను, మేరుదేవితో సహా బదరికాశ్రమానికి వెళ్ళి, నర నారాయణ రూపాలు ధరించిన ఆ వాసుదేవుని ఉపాసించి, కాలక్రమాన, ఆయనలో ఐక్యమైనాడు.

ఋషభుడు, ముక్తసంగుడయిన మనీషి. పరమ పవిత్రుడు. అందుకనే, ఆయన, తన దేశాన్ని కర్మభూమిగా గ్రహించి, ప్రజలలో కర్మకాండను అమితంగా ప్రోత్సహించాడు. తాను, స్వయంగా, గురుకులంలో, వేదాధ్యయనం చేశాడు. గృహస్థ ధర్మాలను ప్రజలకు బోధించే నిమిత్తం, ఇంద్రుని కుమార్తె అయిన జయంతి అనే కన్యను వివాహం చేసుకుని, శ్రౌత స్మార్త కర్మలన్నింటినీ విధ్యుక్తంగా అనుష్ఠించి చూపాడు. సర్వేంద్రియ నిగ్రహుడూ, సర్వసముడూ, అయి వ్యవహరించాడు. అలా, ఆదర్శప్రాయుడై చరించిన ఆ మహారాజు రాజ్యంలో, దుర్భిక్షమన్నది లేనేలేదు. సర్వసమృద్ధి, అతని సక్రమపాలనకు చిహ్నంగా విలసిల్లింది

ఆ మహారాజు, కాలక్రమాన, జయంతీసతివల్ల, నూర్గురు కుమారులను పొందాడు. వారిలో జ్యేష్ఠుడయిన భరతుడు, ప్రఖ్యాతుడు. ఆయన వల్లనే, అంతవరకూ యజనాభవర్షమని వ్యవహరింపబడే ఈ భూమికి, భారతవర్ష మన్న పేరు వచ్చింది.

ఆ భరతుని తమ్ములలో, ఆర్యావర్తాదులు తొమ్మిదిమంది మహా భాగవతులూ, మిగిలినవారు కర్మనిష్ఠులూ, కావటం జరిగింది.

## 33. ఋషభుని ధర్మోపదేశం :

ధర్మమూర్తి అయిన ఋషభుడు, కొంతకాలం, నీతిమార్గాన ప్రజాపాలనం చేసి, తన ప్రజలకు, క్రతువైశిష్ట్యాన్ని బోధించే ఉద్దేశంతో, అనేక క్రతువులు స్వయంగా నిర్వహించాడు. ఆ తరువాత, తన రాజ్యాన్ని కొడుకులకు అప్పగించి, ధర్మప్రవర్తన నలిపేనిమిత్తం, పర్యటన కుపక్రమించాడు.

అలా పర్యటిస్తూ ఉన్న కాలంలో, ఆ మహనీయుడు, ఒకసారి, బ్రహ్మావర్తంలో ప్రవేశించటం జరిగింది. అప్పుడు అనేకమంది మహర్షులు అక్కడ సమావేశమై ఉన్నారు. అది అవకాశంగా తీసుకుని, ఆ పుణ్యమూర్తి, వారికి, ధర్మాన్ని ప్రబోధించేనిమిత్తం, తన కుమారుల నుద్దేశించి, ఇలా ఉపదేశించాడు.

''తనయులార వినుడు ధరలోన బుట్టిన
పురుషులకును శునకములకు లేని
కష్టములనుదెచ్చుగాన కామంబుల
వాన బుద్ధి సేయవలదు మీరు.

నరులకు నే తపంబున ననంత సుఖంబులు గల్గుచుండు శ్రీ
కరమతి నా తపంబు దగ గైకొని చేసిన బ్రహ్మసౌఖ్యమున్
దిరముగ గల్గు, వృద్ధులను దీనుల బ్రోవుడు, దుష్టవర్తనన్
జరుగుచునుండు కాముకుల సంగతి బోకుడు, మీద మేలగున్.

జన్మ లన్నిటిలోకీ నరజన్మ ఉత్తమోత్తమ
మైనది. ఆ నరజన్మ లభించటమే దుర్లభం.
దుర్లభమయిన నరజన్మ లభించినప్పుడు,
దాన్ని సద్వినియోగం చేసుకోవటం సమం
జసం అంతేకాని, దుఃఖమూలమయిన విషయా
సక్తితో దాన్ని వ్యర్థం చేసుకోవటం, ఎంత
మాత్రం ఉచితంకాదు.

విషయేంద్రియభోగా లనేవి, పశుప్రవృత్తికి సంబంధించినవి. నీచ జన్మలయిన పశుపక్ష్యాదులకు మాత్రమే అవి భోగ్యాలు. వాటిని వాంఛించిన మానవులు, నరజన్మను కించపరచినవా రవుతారు.

మానవులకు, భగవదారాధనారూపమైన తపశ్చర్య, ప్రధాన కర్తవ్యం. తపశ్చర్యద్వారా చిత్తశుద్ధి లభిస్తుంది. చిత్తశుద్ధివల్ల బ్రహ్మానందం ప్రాప్తిస్తుంది.

పరమ పవిత్రుల సహవాసం, సేవ, అనేవి, పరమాత్ముని నివాసానికి తీసుకుపోతై. అపవిత్రుల సాహచర్యం, అధఃపతనానికి దారి తీసుంది.

సర్వభూతసములూ, ప్రశాంత చిత్తులూ, విషయేచ్ఛా విరహితులూ అయినవారు, ధర్మానుష్ఠానంకోసమే దేహాన్ని ధరిస్తారు. ఆ దేహాన్ని అయినా, దైవారాధనకొరకే వినియోగిస్తారు. దేహధారణకు ఏది అవసరమో అదే వారికి స్వీకారయోగ్యమవుతుంది. అది మినహాగా ఉన్న ప్రపంచమంతా, వారికి, త్యాజ్యమే అవుతుంది. అలా వ్యవహరించేవారే, మహాత్ములనిపించుకుంటారు.

ప్రాపంచిక విషయానందాన్ని వాంఛించేవారు, భ్రమ ప్రమాదాలకు లోనవుతూ ఉంటారు. పాపకర్మాచరణం, వారికి అవసరమవుతుంది. పరమాత్మ స్వరూపుడయిన మాన

పుడు, పాపకర్మాచరణకు పాల్పడటం, పతన హేతువే కాని అన్యం కాదు. పాపమూలమైన కామాన్ని పరిత్యజించటానికీ, దుఃఖాన్నీ మృత్యువునూ జయించటానికీ, మానవుడు, విజ్ఞాని కావాలి. ఆ విజ్ఞానం, భగవదారాధన మూలంగా మాత్రమే లభిస్తుంది.

భగవదారాధనాపరులయినవారికే. దేహ బంధ విచ్ఛేదం కలుగుతుంది. అది కలిగే, వరకూ వారు, గృహారామ విత్తాదులపట్లా, పుత్ర కళత్ర మిత్ర బాంధవాదులపట్లా, అహంతా మమతలు పెంచుకుంటూ ఉంటారు ; బాధలు పడుతూ ఉంటారు.

పవిత్రకర్మలను ఆదరించటం ద్వారా, పర మోత్కృష్టమైన భావాలు కలుగుతై. పర మోత్కృష్టభావాలకు పరమావధి, పరమాత్మ సాక్షాత్కారం. దాన్ని పొందటానికి, ప్రతి జీవీ ప్రయత్నించాలి; అలా ప్రయత్నించ టానికే, సోదర ప్రాణులను కూడా ప్రోత్స హించాలి.

మృత్యురూపమైన సంసారంలో చిక్కుకుని బాధలుపడేవారికి, భక్తిమార్గాన్ని ఉపదేశిం చటం, జ్ఞానులయినవారి ధర్మం. ఆ ధర్మాన్ని అనుసరించనివారు, జ్ఞానులై కూడా, అజ్ఞానులు గానే పరిగణింపబడతారు.

ఇతరులకు మార్గదర్శకులు కావటానికి ముందు, ఎవరికి వారు, అనన్యభక్తితో, గురు

శుశ్రూష చేయాలి. స్వార్థాన్ని త్యజించాలి.
సుఖ దుఃఖాలను సమభావంతో స్వీకరించటం
అలవరచుకోవాలి. సర్వభూతహితులు కావాలి.
పవిత్ర కార్యాచరణాసక్తితో వ్యవహరించాలి
పరమపవిత్రులతో కలసి మెలసి చరించాలి.
పరమాత్ముని పాదపద్మాలనే ఆశ్రయించాలి.
'నేను, నాది' అనే భావాన్ని త్యజించి, సర్వ
సంగ పరిత్యాగం చేసి, మౌనవ్రతం అవలం
బించి, పరమాత్ముని మీది పరిపూర్ణ విశ్వా
సంతో, పట్టుదలతో, సహనంతో ఆయన నారా
ధించి, ఆత్మజ్ఞానాన్ని పొందాలి. అలా ఆత్మ
జ్ఞానాన్ని సాధించుకున్న వారికి, అసాధ్యమైనదేదీ
ఉండదు. వారు, మృత్యువునుకూడా జయించ
గలుగుతారు; మోక్షాన్ని పొందగలుగుతారు."

లోక శిక్షణార్థం, ఆ విధంగా తన కుమారులకు ఉపదేశించిన ఋషభుడు, ఆ వెంటనే, తన జ్యేష్ఠకుమారుడైన భరతునకు పట్టాభిషేకం చేసి, మహర్షులకు పరమహంసధర్మాన్ని బోధించే నిమిత్తం, అవధూతగా మారి, వనాలకు వెళ్ళిపోయినాడు.

అలా వెళ్ళిన ఋషభుడు, అనేక దేశాలు తిరిగాడు ఆత్మారాముడై వ్యవహరించాడు. ఆ సమయంలో అనేకమైన యోగశక్తులు ఆయన్ని ఆశ్రయించినై. కాని, మనసు చంచలమైనదనీ, ఆ విధమైన శక్తులు ఏనాటికైనా తన మనసును హరించగలవనీ విశ్వసించినవాడు కావటంవల్ల, ఆయన, వాటినన్నింటినీ నిరాకరించాడు. యోగశక్తులను కూడా నిరాకరించిన ఆ మహానుభావుడు, మౌనం వహించి, జటలు ధరించి, మానావమానాలను త్యజించి, దిగంబరుడై, ఉన్మత్తుని మాదిరి ప్రవర్తించ సాగాడు. అలా ఉన్న సమయంలో, ఒకసారి, ఆయన సంచరిస్తున్న వన

మంతటా మంటలు లేవటం జరిగింది. అదికూడా గ్రహించేస్థితిలోలేని ఆ మహానుభావుని దేహం, ఆ వెంటనే ఆ అగ్నికి ఆహుతి అయిపోయింది.

## 34. భరతుడు-లేడిపిల్ల :

ఋషభుని అనంతరం రాజైన భరతుడు, మహాభాగవతుడు. ఆయన భార్య, విశ్వరూపుని కూతురయిన పంచజని. ఆ పంచజనీ భరతులకు, రాష్ట్రభృత్తు మొదలయిన ఐదుగురు కుమారులు కలిగారు.

భరతుడు, తన తండ్రి తాతల మాదిరిగానే, తన ప్రజలను, కన్నతండ్రిమాదిరి పాలించాడు. ఆయన ఎప్పుడు ఏపని చేసినా, అది, భగవత్కార్యంగా భావించి చేసేవాడు. అలా చేయటంవల్ల, ఆయన, రాగద్వేషాలకు దూరుడై, సర్వభూతాలలోనూ ఆ భగవంతునే దర్శిస్తూ ఉండటం జరిగింది. ఆ విధంగా, ఆయన, యాభైలక్షలవేల యేళ్ళ రాజ్యపాలనం చేసి, తన సంపదలన్నింటినీ కుమారులకు పంచియిచ్చి, భగవంతుని ధ్యానించుకునే నిమిత్తం, పులహాశ్రమానికి వెళ్ళాడు.

అలా పులహాశ్రమం చేరిన భరతుడు, ఒంటరిగా ఉండి, అక్కడ లభించిన తులసీదళాలతో పరమేశ్వరుని అర్చించేవాడు. కందమూల ఫలాలను ఆయనకు ఆరగింపు చేసేవాడు. ఆ విధంగా పరమభక్తితో, హరి చరణాలనే ధ్యానిస్తూ సేవిస్తూ ఆయన పొందే ఆనందం వర్ణనాతీతంగా ఉండేది. ఆ సమయంలో, ఆయన, తన్ను తాను మఱచిపోయేవాడు. 'నేను శ్రీహరిని సేవిస్తున్నాను' అనే విషయంకూడా, అప్పుడు, ఆయన మనసులో ఉండేది కాదు.

ఆ విధంగా భగవద్ర్వతపరాయణుడై ఉన్న భరతుడు, ఒకసారి, గండకీనదిలో స్నానంచేసి, నిత్యకృత్యాలు తీర్చుకుని, ప్రణవం జపిస్తూ ఉన్న సమయంలో, ఒక చూడిలేడి అక్కడికి రావటం జరిగింది. అది నదిలో దిగి నీరు త్రాగుతూ ఉండగా, ఆ పరిసర ప్రాంతాలలో నే

ఉన్న ఒక సింహం, గర్జించింది. అది విన్న ఆ లేడి, బెదరిపోయి, బెంగున, ఆవలి ఒడ్డుకు ఒక గంతువేసింది; ఆ వెంటనే ప్రాణం వదిలింది. అలా గంతువేయటంమూలంగా అది వెంటనే ప్రసవించటం, అప్పుడు దానికి కలిగిన బిడ్డ, ఆ నదిలోపడి, ప్రవాహవేగాన కొట్టుకుపోతూ ఉండటం భరతుడు చూశాడు; చూసి, జాలిపడి, దాన్ని పట్టుకుని తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

అలా ఆశ్రమంచేరిన లేడిపిల్లమీద, ఆ మహర్షికి, ఆనాటి కానాడు, ప్రేమానురాగాలు పెరుగసాగినై. దానికికావలసిన లేతచిగుళ్ళనూ, గడ్డిపరకలనూ, ఆయనే స్వయంగా తీసుకువచ్చి తినిపించేవాడు. సమయం కనిపెట్టి, దానికి మంచినీళ్ళు పట్టేవాడు. ప్రతి రోజూ, తను స్నానంచేసేటప్పుడు, దానికి నీళ్లు పోసేవాడు. దాని ఒళ్లు, చక్కగా తుడిచి ఆరబెట్టేవాడు. దాన్ని ఆడించేవాడు; దాంతో ఆడుకునేవాడు. ఆ విధంగా, రాజ్యాధికారాన్నీ భోగాలనూ భార్యాబిడ్డలనూవదలి సర్వసంగపరిత్యాగం చేసిన ఆ మహారాజు, కర్మ వశాన, ఆ లేడిపిల్లమీద, ఛేదింపరాని మమతను పెంచుకున్నాడు. ఆ హరిణ పోతంమీద మమత పెరిగినకొద్దీ, ఆయనకు, హరిధ్యానం మీది ధ్యాస తరగిపోసాగింది.హరిణపోతాన్ని లాలించటంలో, ఆయన, హరిసేవనుకూడా మరచిపోవటంజరిగింది. అది ఏ ఒక ముహూర్తకాలమైనా కనబడకపోతే, ఆయన, దానికోసం, అమితంగా ఆరాటపడే స్థితి ఏర్పడ్డది. కాలక్రమాన, ఆయన, ఆ హరిణశాబకమే తన సర్వస్వంగా భావించటం, హరిపూజా పరిచర్యాదులనుకూడా విస్మరించటం, సంభవించింది.

అలా ఉండగా, ఒకరోజున, ఆ లేడిపిల్ల, ఆశ్రమానికి దూరంగా యెక్కడికో పోయింది. అది గ్రహించిన భరతుడు, అమితంగా వ్యాకులపడ్డాడు. అంతేకాదు.

'తల్లి చచ్చిన హరిణపోతంబు వచ్చి
పుణ్యహీనుండనగు నన్ను బొంది పాసె;

నేమి సేయుదు, నే నింక నెట్లుగందు,
జేరి యేరీతి గాంచి రక్షించుకొందు'

అని దుఃఖించాడు. అది ఏ మృగేంద్రునికీ చిక్కకుండా క్షేమంగా తిరిగి తన్ను చేరుకునేటట్టుచేయవలసిందని, భగవంతుని ఎంతగానో ప్రార్థించాడు. దానిమీద తనకున్న ఆసక్తినీ, అది తనపట్ల చూపుతూవచ్చిన అభిమానాన్నీ తలచుకుని, కన్నీరు మున్నీరుగా రోదించసాగాడు. అంతలో, ఆ మృగ శాబకం, తిరిగి ఆశ్రమానికి వచ్చింది. దాన్ని చూసిన భరతుడు, అంతులేని ఆనందాన్ననుభవించాడు. దాన్ని, పూర్వంకంటె అధికమయిన ప్రేమతో పోషించుకోసాగాడు. అలా ఉండగా...

భరతుం డల్లన యంత్యకాలము వెసం బ్రాపింపగా నప్పు డా
హరిణంబుం గడుభక్తి బుత్రునిగతి న్నాలించి వీక్షించుచున్
హరిణంబుం దన యాత్మలో నిలిపి దేహం బంతటం బాసి తా
హరిణీ గర్భమునన్ జనించి హరిణంబై యొప్పె బూర్వస్మృతిన్.

అలా హరిణమై పుట్టిన భరతుడు, పూర్వజన్మలో రాజుగా తను చేసిన పుణ్యకర్మలఫలంవల్లా, భగవదారాధనమూలంగా గడించుకున్న సామర్థ్యంవల్లా, తన మృగజన్మకు కారణ మేమిటో తెలుసుకోగలిగాడు. అందుకనే...

'రాజులు ప్రస్తుతింప సురరాజసమానుడనై తనూజులన్
రాజుల జేసి తాపసులు రాజ ఋషీంద్రుడటంచు బల్కగా
దేజము నొంది యీ హరిణదేహమునందలి ప్రీతిజేసి నా
యోజ సెడంగ నే జెడితి యోగి జనంబులలోన బేలనై'

అని అమితంగా పశ్చాత్తాపపడ్డాడు. ఆ విధమైన పశ్చాత్తాపం కలుగగానే, ఆయన, తిరిగి పులహాశ్రమానికి వెళ్ళి, ఎండిపోయిన ఆకులూ అలాలూ భుజిస్తూ, గండకీనదిజలంతో కడుపు నింపుకుంటూ, ఏ జీవితోనూ ఏ విధమైన సంబంధం కల్పించుకోకుండా కాలం వెళ్ళతీసుకుని, మృగ శరీరాన్ని త్యజించటం జరిగింది.

## 35. జడభరతుడు :

ఆ విధంగా మృగశరీరాన్ని విడిచిన భరతుడు, ఆ తరువాత, శమ దమాది సద్గుణ సంపన్నుడూ, స్వాధ్యాయపరుడూ అయిన ఒక బ్రాహ్మణుని కుమారుడై జన్మించాడు. ఈ జన్మలో కూడా, ఆయనకు తన పూర్వజన్మల వృత్తాంతమంతా తెలియవచ్చింది. అది తెలియగానే, ఆయనకు ఒక విధమైన విరక్తిభావం కలిగింది. ప్రాపంచిక విషయాలు, పారమార్థిక చింతను భగ్నం చేస్తాయన్న అభిప్రాయం, ఆయనకు, బాల్యంలోనే జనించింది. అందుకనే, ఆయన, ఎవరితోనూ ఏ విధమైన సంబంధం కల్పించుకోకుండా, మూర్ఖునిమాదిరి ప్రవర్తించసాగాడు. కళ్ళఎదుట ఉన్న విషయాన్ని కూడా, ఆయన, చూసేవాడు కాదు. చెవులకు వినిపించేదాన్ని కూడా, విననట్టే ఉండేవాడు. సర్వజ్ఞుడైకూడా, ఏమీ తెలియనట్టే చరించేవాడు. మంచిచెడ్డలు చెప్పగలవాడై కూడా, మాట్లాడేవాడుకాదు. అది కారణంగా, అందరూ, ఆయన్ని "ఉట్టి జడుడు, అని భావించేవారు. అందుకనే, ఆయనకు, 'జడభరతుడు' అన్న పేరు వచ్చింది.

జడభరతుని మనస్సు, సర్వకాలసర్వావస్థలలోనూ, ఆ సర్వాంతర్యామి మీదనే ఉండేది. ఆయన మౌనంవహించి ఉండేవాడు. ప్రతిపనినీ భగవత్సేవగా భావించి చేసేవాడు. కంటికి కనిపించే ప్రతిజీవిలోనూ ఆ సర్వాత్ముని సాక్షాత్కరింప చేసుకునేవాడు. ప్రారబ్ధకర్మను క్షీణింప చేసుకునే ఉద్దేశంతోనే జీవించేవాడు.

ఆ విధంగా ఆయన జడునిమాదిరి ఉన్నా, ఆయన తండ్రి మాత్రం, ఆయనకు, ఉపనయనం జరిపించాడు. గాయత్రీ మంత్రోపదేశం కావించాడు. సర్వవిధ సంస్కారాలూ చేయించాడు.

ఆ తరువాత కొంతకాలానికి, ఆ బ్రాహ్మణుడు చనిపోవటం, ఆయన భార్య, ఆయనతో సహగమనం చేయటం, జరిగింది. ఆ పరి

స్థితిలో, జడభరతుని పోషణభారం, అతని సవతి అన్నలమీద పడ్డది. వారు, అతనిచేత ఇంటిపనులన్నీ చేయించుకునేవారు. అతణ్ణి, అతి నీచంగా, ఉన్మత్త బధిర జడ నామాలతో పిలిచేవారు. అలా హీనంగా చూడబడుతూకూడా, ఆ మహనీయుడు, ఏ విధమైన వికారం పొందే వాడు కాదు. వారు ఏది పెడితే అది తినేవాడు. ఏది ఇస్తే అది కట్టుకునే వాడు. ఏంచెపితే అది చేసేవాడు. ఎప్పుడూ ఆత్మారాముడై ఉండే వాడు.

శరీరసంస్కారం ఏ మాత్రం లేకపోయినా, అతని ముఖాన, బ్రహ్మ వర్చస్సు తాండవమాడుతూ ఉండేది. అది గ్రహించలేనివారు, అతణ్ణి, ఒక ద్విపాదపశువుగా మాత్రం భావించేవారు.

ఆ కాలంలో అక్కడ, ఒక దొంగలనాయకుడుండేవాడు. అతడు, సంతానంకోసం, భద్రకాళికి నరబలి ఇవ్వాలని, ఒకసారి నిశ్చయించు కున్నాడు. అది గ్రహించిన అతని అనుచరులు, ఆ వెంటనే, పురుష పశువు నన్వేషిస్తూ, దేశం అంతటా గాలించారు. కాని, అటువంటివాడు ఎవడూ వారికి కనిపించకపోవటంవల్ల, నిరాశతో, గృహోన్ముఖులయి నారు. ఆ సమయంలో, వారికి, జడభరతుడు కనిపించాడు. అతణ్ణి చూడగానే, వారికి అమితానందం కలిగింది. 'పురుషపశువు' అన్నపదం, అతనిపట్ల మాత్రమే సార్థకమవుతుందని, వారు నిర్ణయించుకున్నారు. అందుకనే, అతణ్ణి బంధించి, సరాసరి, చండికాలయానికి తీసుకువెళ్ళారు. అలా తీసుకువెళ్ళి, అతనికి విధ్యుక్తంగా తలంటిపోశారు. క్రొత్తబట్టలు కట్టారు. ఆపైన షడ్రసోపేతంగా భోజనం పెట్టారు. గంధపుష్పాదులతో అలంకరించారు. ఆ తరువాత అతణ్ణి మంగళ వాద్యాలతో కాళికా దేవి సముఖానికి తీసుకు వెళ్ళి, అక్కడే ఉన్న తమ నాయకునికి అప్ప గించారు.

ఆ ఏకైక పురుషపశువును చూడగానే, దొంగల నాయకునికి అమితమయిన ఆశ్చర్యం కలిగింది. తన కోరిక తీర్చే నిమిత్తం, కాళీమాత,

అంతకుపూర్వమే అతణ్ణి సృజించి ఉండటం మహాద్భుతమని, అతనికి అని పించింది. ఆ పురుషపశువు రక్తంతో, భద్రకాళిని సంతుష్టిపరచటం సంభవ మని అతడు భావించాడు. అందుకనే, మంత్రపూతమయిన తన కరాళ ఖడ్గాన్ని ఎత్తి, అతని శిరాన్ని ఖండించటానికి ఉద్యుక్తుడయినాడు. ఆ సమయంలోకూడా, జడభరతుడు చలించలేదు. తను తను త్యాగం చేయటం వల్ల ఇతరులకు మేలు కలిగేపక్షంలో, తాను సంకోచించటం అసమంజస మని అతడు భావించాడు.

అదంతా గ్రహిస్తూఉన్న భద్రకాళి, మహానుభావుడైన భరతునకు వాటిల్లనున్న ఉపద్రవాన్ని వారించాలనుకుంది. ఆ వెంటనే, అమిత క్రోధంతో హుంకరించింది. వికటాట్టహాసం చేసింది. ఆ దొంగల నాయకుని మీదకూ అతని అనుచరుల మీదకూ ఒక్కసారిగా ఉఱికింది. వారి తలలు నఱికివేసింది. ఆ పైన భీకరతాండవం చేయసాగింది.

ఆ విధంగా మారణహోమం ముగిసిం తరువాత, జడభరతుడు, అక్కడనుంచి బయలుదేరి, తిరిగి యథాస్థానానికి వెళ్ళిపోయినాడు.

ఆ తరువాత, కొంతకాలానికి, మరొక విచిత్ర సంఘటన జరి గింది. సింధు భూపతి అయిన రహూగణు డొకసారి, ఇక్షుమతీతీరాన ఉన్న కపిలమహామునిని దర్శించి తత్త్వవిజ్ఞానం పొందే నిమిత్తం, పల్లకీ యెక్కి, రాజమార్గాన పోతూ ఉన్నాడు. ఆయన అలావెడుతూ ఉన్న సమయంలో, జడభరతుడు, అక్కడ ఒకచెట్టుక్రింద కూర్చుని ఉండటం సంభవించింది. మహారాజును చూసికూడా అతడు లేవ లేదన్న అభిప్రాయం, కొందరు రాజోద్యోగులకు కలిగింది. ఆ వెంటనే వారు, తమ భటు లను పంపించి, అతణ్ణి, తమవద్దకు తీసుకురావలసిందిగా ఆదేశించారు.

మఱుక్షణంలోనే, రహూగణుని భటులు, బలిష్ఠుడూ యౌవ నుడూ అయిన జడభరతుని, రాజోద్యోగుల సమక్షాన ఉంచారు. ఆ ఉద్యో గులు, అతణ్ణి శిక్షించే ఉద్దేశంతో, అతణ్ణి, పల్లకీ మోయటానికి నియోగించారు. జడభరతుడు, మారుమాట లేకుండా, శిబికావాహకత్వానికి పూనుకున్నాడు.

## 36. జడభరతుని ఆత్మజ్ఞానోపదేశం :

జడభరతుడు పల్లకీ మోయటం ప్రారంభించినప్పటినుంచీ, శిబికాగమనం, అతి విషమంగా తయారయింది. అతడు, తాను వేయబోయే ప్రతి అడుగు మేరా పరిశీలనగా చూసుకుంటూ ఉండటం, తన పాదంక్రింద, చివరకు యే చీమ కూడా లేదని నిర్ధారించుకుని మరీ అడుగు వేస్తూ ఉండటం, తోటిబోయీలకు అమిత బాధాకరమయింది. అది గ్రహించిన ఆ మహారాజు, అతణ్ణి ఉద్దేశించి, అతి నిష్ఠురంగా మాట్లాడాడు. అంతేకాదు. అతణ్ణి అమితంగా తూలనాడాడు; అవమానపరచాడు.

అలా తన్ను అధిక్షేపించినా, అవమానపరచినా, బ్రహ్మ భూతుడూ, సర్వభూతహితుడూ అయిన జడభరతుడు కోపగించుకోలేదు. కోపగించుకొనకపోవటమే కాదు; రాజుననే దుర్మదంతో, యోగివర్తన తెలియకుండా వ్యవహరిస్తున్న ఆ రహూగణునకు, జ్ఞానోపదేశం చేయాలని కూడా అనుకున్నాడు. అందుకనే, పల్లకీదించి, పుట్టినప్పటినుంచీ పాలించు కుంటూ ఉన్న తన మౌనవ్రతాన్ని తొలిసారిగా త్యజించి, ఆయనకు అనేకవిషయాలు బోధించాడు. ఆ సందర్భంలోనే...

"ఆత్మజ్ఞానాన్ని సముపార్జించుకోవటమే విద్యోపార్జనకు అర్థం. అశాశ్వతమైన ఈ ప్రపంచంలో, సౌఖ్యం పొందాలని ప్రయత్నిస్తూ ఉన్నంతవరకూ ఆత్మజ్ఞానంఅలవడదు.

పూజ్యులయినవారు, సర్వవేళలా, భగవత్కథలను అభివర్ణిస్తూ ఉంటారు. వారిని అనుదినం సేవించటంవల్ల, వారిపలుకులు కర్ణపుటాలలో పడటం, భగవద్భక్తి జనించటం, సంభవిస్తుంది. ఆ భగవద్భక్తి ద్వారా, హరికీర్తనం పట్ల ఆసక్తి జనిస్తుంది. హరినామసంకీర్తనాసక్తు

లయిన వారు, అనాయాసంగా మోహబంధాలను త్రెంచుకోగలుగుతారు ; సంసారసాగరాన్ని తరించగలుగుతారు; విష్ణుపదాన్ని పొంద గలుగుతారు.

ఆత్మజ్ఞానం కలిగేవరకూ, మానవులు, సంసార చక్రంలో తిరుగుతూనే ఉంటారు. మనో విజయాన్ని సాధించేవరకూ, వారు ముక్త సంగులు కాలేరు.

సుఖ దుఃఖాలకూ, భ్రమ ప్రమాదాలకూ, రాగద్వేషాలకూ, కామ క్రోధాదులకూ అన్నిటికీ మనస్సే ప్రధానాశ్రయం. ఆ మనస్సును నియమించుకోవటానికి విజ్ఞానం అవసరం. ఆ విధమైన విజ్ఞాన సముపార్జనకు భగవద్భక్తి మూలం.

వేదాధ్యయనంవల్లగానీ, తపశ్చర్యవల్లగానీ, పుణ్యకర్మాచరణమూలంగా గానీ ఆ విజ్ఞానం అలవడదు. మహాత్ముల పాద సేవ వల్లనే అది అలవడుతుంది. మహాత్ములను సేవించాలనే బుద్ధికూడా, అందరికీ కలుగదు; పవిత్రహృదయులకు మాత్రమే కలుగుతుంది.

సంసార మనేది, దారీ తెన్నూ లేని మహారణ్యం వంటిది. భార్యా బిడ్డలూ బంధు మిత్రులూ అనేవా రందరూ, అందులో ఉండే క్రూరమృగాలవంటివారు. వి వి ధే ంద్రి యాలనూ, ఆ అరణ్యంలో ఉండే దొంగలకు పోల్చ

వచ్చు. దొంగలు మన ఆస్తిని హరిస్తారు; ఈ ఇంద్రియాలు, మనలో ఉన్న దైవత్వాన్ని హరిస్తై. అజ్ఞానులయినవారు ఆ మహాటవినే గంధర్వనగరంగా భావించి, దిక్కుతోచక తిరుగుతూకూడా, అదోవిధమైన ఆనందాన్ని అనుభవిస్తూ ఉంటారు.

అగ్నిని కోరినవాడు అడవిలోని కొఱవి దయ్యాన్ని చూసి దానివెంట వెళ్ళినట్టుగా, బంగారాన్ని ఆశించినవాడు, కలవారి ఇళ్ళ చుట్టూ తిరుగుతూ ఉంటాడు.

బహుకుటుంబీకుడయినవాడు, అమిత ధనాపేక్షవల్ల, ఎండమావులనుచూసి, మృగం పరుగెత్తినట్టుగా, నిలుకడ లేకుండా చరిస్తూ ఉంటాడు.

ప్రపంచంలో, వాంఛనీయమైన దేదీ లేదని, అప్పుడప్పుడు మనం అనుకుంటూనే ఉంటాం. కాని, ఆ యథార్థాన్ని అప్పుడే మఱచిపోయి, ఈ సంసారమహాటవిలో పరిభ్రమిస్తూ, ఏ మహానుభావుడో దయతలచి దారిచూపేవరకూ, అలాగే కాలం గడుపుకుంటూ ఉంటాం.

నీ మటుకు నువ్వుకూడా, ప్రపంచమనే ఈ అడవిలో చిక్కుపడి, దారీ తెన్నూ తోచక తిరుగుతున్నావు. ఇకనైనా, నువ్వు, ముక్తసంగుడవు కావాలి. సర్వసమత్వాన్ని అలవఱచుకోవాలి. భగవద్భక్తిని ఆశ్రయించి, అజ్ఞానావరణాన్ని ఛేదించుకోవాలి''

అని ఉపదేశించాడు. అది విన్న రహూగణుడు, ఆ అవధూతకు సాష్టాంగ

ప్రణామం చేసి, అంతకుపూర్వం తనవల్ల జరిగిన తప్పిదాన్ని క్షమించవలసిందని, పదేపదే వేడుకున్నాడు. ఆయన ప్రసాదించిన ఉపదేశామృతాన్ని ఆస్వాదించటంవల్ల, అహంకార సర్పదష్టుడయిన తనకు పునర్జన్మ లభించిందనీ, ఆయన చరణాంబుజ సంస్పర్శవల్ల, తన పాపాలన్నీ నిర్మూలమైనాయనీ, తనలో ఉన్న హరిభక్తి అతిశయించిందనీ, విన్నవించుకున్నాడు

ఆ తరువాత, ఆయన పూజ లందుకుని, జడభరతుడు, తనదారిన తాను వెళ్ళిపోయినాడు. కాలక్రమాన రహూగణుడు కూడా, తత్త్వజ్ఞానసంపన్నుడై, దేహాత్మ భ్రమ వదలి వ్యవహరించసాగాడు.

### 37 భారతవర్షం :

ప్రపంచంలో ఉన్న తొమ్మిది ఖండాలలోనూ ఉత్తమోత్తమమయినది భారతవర్షం. ఇక్కడ, భగవంతుడు, పదేపదే అవతరిస్తూ, తత్త్వోపదేశంద్వారా జీవకోటిని తరింపచేస్తూ ఉంటాడు. అందుకనే, స్వర్గాది భోగాలకు అర్హులయినవారుకూడా, భారతదేశంలోనే ఉండి, భక్తియోగం ద్వారా హరి పదాన్ని సాధించుకోవాలని కోరుకుంటూ ఉంటారు.

భారతదేశంలో పుట్టినవారికి, అసాధ్యమైన దేదీలేదు. వారు, హరినామస్మరణం ద్వారా, సకల దురితాలనూ తొలగించుకోగలుగుతారు. అనన్యభక్తిద్వారా హరిపదాన్ని సాధించుకోగలుగుతారు. అందుకనే, ఇది, పరమపవిత్రమైన సీమగా భావింపబడుతోంది.

శ్రీమన్నారాయణుడు, తన భక్తులు ఏది
కోరితే అది, ప్రసాదిస్తూ ఉంటాడు. ఏదీ కోర
కుండా, నిష్కాములై తన్ను సేవించేవారికి,
పరమార్థాన్ని ప్రసాదిస్తూ ఉంటాడు.

భారతవర్షంలో, మలయ, మైనాక, ఋష్య
మూక. శ్రీశైల, వేంకట, చిత్రకూట, వింధ్యా

దులైన ప్రసిద్ధ పర్వతాలూ, తామ్రపర్ణి, కావేరి, తుంగభద్ర, కృష్ణవేణి, గోదావరి. నర్మద, సింధు, మందాకిని. యమున, సరస్వతి మొదలైన మహానదులూ, ఎన్నో ఉన్నై. అవన్నీ పరమపవిత్రమైనవి. వాటిని సేవించు కున్న వారు, పరమపావనులవుతారు.

## 38. పాపాత్ములు—నరకయాతనలు :

ముల్లోకాలకూ లోపల, భూమికి క్రిందిభాగంలో, నానా యాతనా స్థానాలయిన ఇరవై ఎనిమిది నరకాలున్నై. ఈ లోకాలకు, పితృపతి అయిన వైవస్వతయముడు అధిపతి. ఆయన, తన దూతలు తీసుకువచ్చిన మృతులకు, వారివారి కర్మానుగుణమైన శిక్షలు విధిస్తూ ఉంటాడు. పాప కర్మలు చేసినవారు, తమతమ పాపాలకు తగిన దుఃఖాన్ని, నరకంలో అనుభవిస్తూ ఉంటారు.

యమకింకరులవల్ల కలిగే యాతనలు, ఈ క్రిందివిధంగా ఉంటై.

పరస్త్రీలనూ, పరధనాన్నీ, అపహరించిన వారిని, కొండలమీదినుంచి క్రిందికి త్రోసి, కట్టె లతో మోదుతారు. వారికి ఆహారం పెట్ట కుండా మాడుస్తారు.

'నేను' 'నాది' అనే ఆత్మాభిమానంతో, ఇత రులకు ద్రోహం చేసినవారిమీదికి, వారివల్ల ద్రోహం పొందిన భూతాలను, క్రూరమృగాల రూపంలో వదులుతారు. అవి, ఆ పాపాత్మ లను, నానావిధాల హింసిస్తూ ఉంటై; వారిని చీల్చి, వారి మాంసాన్ని పీక్కు తింటూ ఉంటై.

పశువులనూ పక్షులనూ పీడించి బ్రతికేవారిని, సలసల కాగే నూనెలో పడేస్తారు.

తల్లిదండ్రులకూ పూజ్యులకూ ద్రోహం చేసినవారిని, అగ్నిజ్వాలలమీద నిలబెడతారు; త్రాగటానికి నీళ్ళుగాని, తినటానికి తిండిగాని లేకుండా చేస్తారు.

వేదమార్గ విరుద్ధంగా ప్రవర్తించే పాషండులను, ముళ్ళకంచెలలోకి త్రోసి, ఏడిపిస్తారు; అమిత వేదన లనుభవింపచేస్తారు.

అతిథులకూ అభ్యాగతులకూ పెట్టకుండా, తాముమాత్రం సుఖంగా భుజించేవారిని, పురుగులకు ఆహారంగా పడేస్తారు.

చౌర్యవృత్తితో జీవించేవారిని, ఎఱ్ఱగా కాలిన ఇనుపకొఱ్ఱులతో పొడుస్తారు.

పరపురుషుని ప్రేమించి, అతనితో వ్యభిచరించిన స్త్రీని, ఎఱ్ఱగా కాలిన లోహమయ పురుష ప్రతిమను కౌగిలించుకునేటట్టు చేస్తారు. పరస్త్రీని కోరి పొందిన పురుషుని, అటువంటిదే అయిన స్త్రీ ప్రతిమను కౌగిలించుకునేటట్టు చేస్తారు.

ఇళ్ళకు నిప్పుపెట్టినవారినీ, విషప్రయోగం ద్వారా ఇతరులను పీడించినవారినీ, వజ్రకఠోరమైన కోఱలతో ఉండే కుక్కలకు వదలిపెడతారు. అవి, వారిని కఱచి, గాయపఱచి, పీక్కుతినటం జరుగుతుంది.

కూటసాక్ష్యాలు చెప్పినవారినీ, వ్యాపా
రంలో ఇతరులను మోసంచేసినవారినీ, గిరి
శిఖరాలమీదినుంచి, నీరుమాదిరికనిపించే పాషా
ణాలమీదకు, తలక్రిందులుగాత్రోసి, తల చితుక
కొడతారు.

కల్లుత్రాగిన బ్రాహ్మణునినోట్లో, సీసం కర
గించి పోస్తారు; అతని గుండెలమీద, కాలితో
తన్నుతూ ఉంటారు.

అమాయకులను మోసగించిన వారినీ,
హింసించినవారినీ, కొఱ్ఱులకు గుచ్చి నిలబెడ
తారు. అలాఉన్నవారిని, పదునయినముక్కులు
గల పక్షులు పొడిచిపొడిచి పీడిస్తూ ఉంటై.

ధనమదాంధులూ, లోభులూ అయినవారిని,
శ్రీమంతులై కూడా దీనులకు సాయపడకుండా
తప్పించుకుతిరిగేవారిని, తమకున్న ధనంతో,
తామైనా సుఖపడకుండా, దాన్ని దాచి,పిశాచం
మాదిరి కాపలాకాస్తూ ఉండేవారిని, కాకులకూ,
గ్రద్దలకూ, కొంగలకూ వదలిపెడతారు; అవి
వారిని పొడిచి పొడిచి పీడిస్తై; వారి కళ్ళు పీకి,
వారికి అంధత్వం కలిగిస్తై.

ఈ విధంగా, ఎవ రే విధమైన పాపంచేసినా, దానికి అనుగుణ
మయిన నరకయాతన ఉండనే ఉంది. దాన్ని తప్పించుకోవటం ఎవరికీ
సాధ్యం కాదు.

## 39. శ్రీకృష్ణ సేవా ప్రాశస్త్యం :

మానవులు, మనోవాక్కాయకర్మలకు సంబంధించిన అనేక

పాపాలు చేస్తూఉంటారు. ప్రతి ఒక్క పాపానికీ, ప్రాయశ్చిత్తం ఉండనే ఉంది. ఆచరించిన పాపానికి అనుగుణమైన ప్రాయశ్చిత్తం చేసుకోనివారు, ఆ పాపఫలాన్ని, నరకలోకంలో, తీవ్రయాతనల రూపాన అనుభవించ వలసి ఉంటుంది. అందుకనే....

తపమున బ్రహ్మచర్యమున దానమునన్ శమ సద్దమంబులన్
జపమున సత్య శౌచముల సన్నియమాది యమంబులం గృపా
నిపుణులు ధర్మవర్తనులు నిక్కము హృత్తనువాక్యజంపు పా
పపుగుది ద్రుంతు; రగ్ని శత పర్వవనంబుల నేర్చుకైవడిన్.

కాని, బ్రహ్మచర్యాదులవల్ల హరించిన పాపాలు, తిరిగి తల చూపటం సంభవం. అలా అవి తిరిగి తలచూపకుండా ఉండటానికి, వాటిని నిర్మూలించుకోవటం అవసరం. పాప నిర్మూలన మన్నది, శ్రీకృష్ణుని పాదాలను ఆశ్రయించటంద్వారా, ఆయన సేవకు ప్రాణాన్ని అర్పించటం ద్వారా మాత్రమే సంభవమవుతుంది. అందుకనే ...

హరిభక్తిచేత గొందఱు
పరిమార్తురు మొదలుముట్ట బాపంబుల; ని
ష్ఠురతర కరముల సూర్యుం
డరుదుగ బెనుమంచు బించ మడచినభంగిన్.

హరికి నర్థముః బ్రాణ మర్పితంబుగజేయు
వాని కైవల్య మెవ్వనికి లేదు.
వనజలోచను భక్తవరుల సేవించిన
వాని కైవల్య మెవ్వనికి లేదు.
వైకుంఠ నిర్మలవ్రతపరుండైనట్టి
వాని కైవల్య మెవ్వనికి లేదు.
సరసిజోదరు కథాశ్రవణలోలుండైన
వాని కైవల్య మెవ్వనికి లేదు.

లేదు తపముల బ్రహ్మచర్యాదినియతి
శమ దమాదుల సత్య శౌచముల దాన
ధర్మ మఖముల సుస్థిరస్థానమైన
వైష్ణవజ్ఞానజనిత నిర్వాణపదము.

ందహాసం
ఖున

హరిభక్తి నాశ్రయించనివారూ, భక్తి ధర్మాన్ని పాటించనివారూ, ఎన్ని పుణ్యనదులలో స్నానంచేసినా, ఎన్ని పవిత్రశైలాలకు ప్రదక్షిణం చేసినా, ప్రయోజనంలేదు. భగవద్గుణాదులను గ్రహించినవారికీ, భగవచ్చరణాలను ఏ ఒక్కసారి అయినా మనసులోనిలుపుకుని ధ్యానించినవారికీ, యమకింకరులు, కలలో కూడా కనిపించరు. పొరపాటున కనిపించినా, వారివల్ల కలిగే బాధ, ఏమీ ఉండదు.

## 40 అజామిళుడు-హరినామస్మరణ :

కన్యాకుబ్జ మనే దేశంలో, పూర్వం, అజామిళ డనే ఒక బ్రాహ్మణు డుండేవాడు. అతడు, బాల్యంలో ఎంత ధర్మపరుడో, ఆపైన అంత అధర్మశీలుడైనాడు. ఆ కాలంలో, అతడు, కులాచారాలను గమనించకుండా వ్యవహరించేవాడు. ఎప్పుడూ జూదమాడుతూ ఉండేవాడు. ఏవో వాదోపవాదాలు జరుపుతూ, కాలం వ్యర్థంచేసుకునేవాడు. దుష్టసాంగత్యం వల్ల కలిగే దోషాన్ని గ్రహించికూడా, అదోవిధమయిన అంధకారంలోపడి, తన్నుకులాడుతూ ఉండేవాడు.

అటువంటి అజామిళునికి, కర్మవశాన, ఒక దాసీ పుత్రికతో సంబంధం కుదిరింది. ఆమెను అతడు భార్యగా స్వీకరించి, ఆమెతో వివిధ భోగాలు అనుభవిస్తూ, మోహజలధిలో మునిగితేలుతూ ఉండేవాడు.

అలాఉన్న అతనికి, కాలక్రమాన, పదిమంది కొడుకులుపుట్టారు. చేస్తూఉ ంలో చివరివానిపేరు నారాయణుడు. అతడంటే ఆ తండ్రికి చాలా ఇష్టం. ఆయన, అతణ్ణి, ఒక్క క్షణంకూడా విడిచి ఉండలేకపోయేవాడు; అతడే తన ప్రాణమని భావిస్తూ ఉండేవాడు.

అలా ఉండగా, భ్రష్టుడైన ఆ అజామిళునికి, అంత్యదశ సమీపించింది. అతణ్ణి తీసుకుపోవటానికి, యమకింకరులు వచ్చారు. వారి భయంకరాకారాలు చూడగానే, అతని గుండె చెదరిపోయింది. భయంతో కంపించిపోతున్న అతనికి, తన ముద్దుల కొడుకును చివరిసారిగా చూడాలన్న కోరిక కలిగింది. అందుకనే, అమితమైన ఆవేదనతో, ఉన్న శక్తినంతనూ ఉపయోగించుకుని, "నారాయణా ! నారాయణా !! నారాయణా !!!" అని, ముమ్మారు, ఎలుగెత్తి అఱచాడు.

ఆ శబ్దం అతని నోటివెంట రావటమే తడవుగా, శ్రీమన్నారాయణుడు, తన దూతల నక్కడికి పంపించాడు. అలా అజామిళుని సమీపించిన విష్ణుదూతలు, అప్పటికే అతని ప్రాణాలను పాశాలతో బంధించిన యమకింకరులను చూసి, అదలించారు; ఆ ప్రాణాన్ని అక్కడే వదలిపోవలసిందిగా ఆజ్ఞాపించారు.

తమ్ము అలా అదలించి ఆజ్ఞాపించేది ఎవరో, యమకింకరులకు అర్థంకాలేదు. కాని, ధర్మరాజు శాసనాన్నే ధిక్కరిస్తున్న ఆ దివ్యపురుషులు, దేవతలో, సిద్ధులో, సాధ్యులో అయిఉంటారనిమాత్రం వా రనుకున్నారు. పద్మపత్రాలవంటి కళ్ళు కలవారూ, పీతాంబరాలు ధరించినవారూ, కిరీటకుండలాది దివ్యాభరణాలతో శోభిల్లేవారూ, చతుర్భుజులూ, శంఖం చక్రం గద మొదలయిన దివ్యాయుధాలుగలవారూ, యౌవనులూ, సుందరాకారులూ, ప్రశాంతవదనులూ అయిన ఆ దూతలపట్ల, వారికి, గౌరవంకూడా కలిగింది. అందుకనే, 'మేముయమకింకరులం. మా ధర్మాన్ని నెరవేర్చుకోవటానికే మేమిక్కడ ఉన్నాం. మమ్మల్ని నిషేధించటంలో మీ అభిప్రాయమేమిటో మాకు అవగతం కావటం లేదు' అని, వారికి విన్నవించుకున్నారు.

యమకింకరుల పలుకులు విన్న విష్ణుదూతలు మందహాసం చేశారు. ఆ పైన, వారిని ఉద్దేశించి, 'మీరు యముని ఆజ్ఞానువర్తులే అయిన పక్షంలో, ఇత డెలా దండనార్హుడైనాడో మాకు తెలుపవలసింది' అని అడిగారు. దానిమీద, యమకింకరు లిలా చెప్పారు.

"వేదచోదితమైనది ఏదైతే ఉందో, అదే ధర్మం. దానికి వ్యతిరేకమయినది అధర్మం. సూర్యచంద్రులూ, పంచభూతాలూ, గోవులూ, అహోరాత్రాలూ, సంధ్యలూ, ఏ దేహి అయినా ఆచరించే ధర్మాధర్మాలకు సాక్షులు.ఆసాక్షులు ఆధారంగా నిర్ణయింపబడిన అధర్మం, దండ నకు మూలమవుతుంది. ఆ అధర్మ మార్గావలం బులు దండనార్హులవుతారు.

ప్రతిజీవీ, పుణ్యమో పాపమో, ఏదో ఒకటి చేస్తూనే ఉంటాడు. కర్మాచరణులుకానివా రంటూ ఉండరు. ఈ లోకంలో, ఎవరు ఏ కర్మను ఆచరిస్తే ఆ కర్మకు అనుగుణమైన ఫలం, వారికి, పరలోకంలో అనుభవనీయ మవుతూ ఉంటుంది.

ఈ అజామిళుడు బ్రాహ్మణకులంలో పుట్టాడు. మొదట్లో, ధర్మ శీలుడుగానే వ్యవహరించాడు. వేదాభ్యసనంచేశాడు. ఆత్మనిగ్రహాన్ని అలవరచుకున్నాడు. సత్యసంధుడూ, సర్వభూతహితుడూ పరిశుద్ధుడూ అయి వ్యవహరించాడు. కాని, యౌవనంతోపాటు, ఇతనిలో, మదమాత్స ర్యాలు ప్రవేశించినై. కామ క్రోధాదు లితణ్ణి బానిసగా చేసుకున్నై. దాని ఫలితంగానే, ఇతడు, ఒక దాసీ పుత్రికతో సంబంధం కలిగించుకోవటం, నిజభార్యాపుత్రులను త్యజించటం, ఆ దాసీపుత్రికనూ, దానివల్ల కలిగిన

(11)

సంతానాన్ని, పోషించే నిమిత్తం, చేయరాని దుష్కార్యాలెన్నో చేయటం, జరిగింది. ఆ సమయంలో, ఇతడు...

బంధుల దిట్టి, సజ్జనుల బాధలబెట్టి, యనాథకోటి బెం
బందెలు సుట్టి, యీరములవట్టి పథంబులుగొట్టి దిట్టయై,
నిందలకోర్చి, సాధులకు నిందితుడై, గడియించు విత్త మా
సుందరి కిచ్చి, మచ్చికలు సొంపెదగూర్చి వసించె దత్కృపన్.

ఆ విధంగా ఇతడు శాస్త్రమర్యాదను పాటించకుండా, యథేచ్ఛా విహారం చేసి, చాలకాలం పాపజీవనం గడపటంవల్ల, 'ఇతడు పరమపాపి' అని నిర్ణయించటం జరిగింది. అందుకనే, ఇతణ్ణి శిక్షించే నిమిత్తం, దండ పాణి దగ్గరకు తీసుకుపోవటానికి మే మిలా వచ్చాం."

అదంతా విన్న విష్ణుదూతలు ఆశ్చర్యపోయినారు. ధర్ముని సభ లోనే అధర్మం జరుగుతోందే అనీ, పవిత్రునికూడా పాపిగా భావించటం సంభవిస్తోందేఅనీ, భావించి, వారు నిర్విణ్ణులయినారు. అందుకనే, ఆ యమ కింకరుల నుద్దేశించి వా రిలా అన్నారు.

"అయ్యా ! మీరు చెప్పిందంతా నిజమే కావచ్చు. కాని, ఇతడు దండనార్హుడుమాత్రం కాడు. మీరు పేర్కొన్న పాపాలన్నీ ఇతడు చేసి ఉండవచ్చు. అయినా, వాటి నన్నిటినీ నిర్మూలించే పనికూడా ఇతడు చేశాడు. దాన్ని మీరు గ్రహించ లేకపోయినారు.

ఇతడు, జన్మ పొడుగునా ఆచరిస్తూ వచ్చిన పాపాలన్నీ, తుది ఘడియలో, ఇతడు, భగవంతుని స్మరించటంద్వారా, నిర్మూలమైపోయినై. భగవన్నామస్మరణవల్ల, ఇతడు, పరమపవిత్రుడై నాడు ; భగవద్భక్తులలో ఒకడుగా పరిగణింపబడుతున్నాడు. భగవద్భక్తులవంక చూసే అధికారం కూడా మీకు లేదు. హరినామ ప్రభావం అటువంటిది.

బ్రహ్మహత్యానేక పాపాటవుల కగ్ని
కీలలు హరినామ కీర్తనములు

గురుతల్ప కల్మష క్రూరసర్పములకు
గేకులు హరినామ కీర్తనములు

తపనీయ చౌర్యాఘ తమసంబునకు సూర్య
కిరణముల్ హరినామ కీర్తనములు

మధుపాన కిల్బిష మదనాగసమితికి
గేసరుల్ హరినామ కీర్తనములు

మహితయోగోగ్రనిత్య సమాధివిధుల
నలరు బ్రహ్మాదిసురలకు నందరాని
భూతి నిర్వాణ సామ్రాజ్య భోగభాగ్య
ఖేలనంబులు హరినామ కీర్తనములు.

అంతేకాదు.

ఏది జపియింప నమృతమై యెసగుచుండు
నేది సద్ధర్మపథమని యెఱుగదగిన
దదియె సద్భక్తియోగంబు నలవరించు
మూర్తిమంతము ; దా హరికీర్తనంబు.

అటువంటి హరి కీర్తన చేసేవారే ధన్యులు. అజామిళుడు, వివశుడై ఉన్న పరిస్థితిలో అయినా, ఆ హరినామాన్ని ఉచ్చరించాడు.

'నారాయణా' అన్న నాలుగక్షరాలలోనూ, కోటానుకోట్ల జన్మలలో చేసిన పాపాలను పరిహరింప గల శక్తి ఉంది. పాపనివృత్తికి, హరినామోచ్చారణను మించిన ప్రాయశ్చిత్తం మరొకటి లేనేలేదు.

హరినామాన్ని, ఏ పరిస్థితిలో ఎలా ఉచ్చ
రించినా, పాపం క్షయమై తీరుతుంది.

బిడ్డపేరువెట్టి పిలుచుట, విశ్రామ
కేలినైన, మిగుల గేలినయిన,
పద్య గద్య గీత భావార్థములనైన,
గమలనయను దలప గలుషహరము.

అంతేకాదు...

కూలినచోట, గొట్టుపడి కుందినచోట, మహాజ్వరాదులం
బ్రేలినచోట, సర్పముఖపీడల నందినచోట, నార్తులై
తూలినచోట, విష్ణు భవదూరుని బేర్కొనిరేని, మీద, న
క్కాలుని యాతనావితతి గానరు, పూనరు దుఃఖభారముల్.

ఈ యథార్థాన్ని గ్రహించి, మీరు, మీ నిజావాసానికి వెళ్ళిపోవటం మంచిది."

ఆ విధమైన, విష్ణుదూతల ఆదేశాన్ని శిరసావహించి, యమకింకరులు అదృశ్యులయినారు. అలా అదృశ్యులయిన కింకరులు, ఆ వెంటనే, సంయమనీపురం చేరుకుని, యమధర్మరాజును సమీపించి, అంతకుముందు జరిగిందంతా ఆయనకు నివేదించుకున్నారు.

## *41. భాగవతులు ; యముని వివరణ :*

కింకరుల పలుకులు విన్న ధర్మరాజు, మందహాసంచేస్తూ, హరిచరణారవిందాలను స్మరించుకుంటూ, వారితో ఇలా అన్నాడు.

"మీకు కనిపించినవారూ, మీ ధర్మనిర్వహణకు అడ్డుతగిలినవారూ, ఆ అజామిళునకు అండగా నిలబడ్డవారూ సామాన్యులు కారు ; నాకూ, బ్రహ్మదేవునకూ, స్థావరజంగమాత్మకమయిన సర్వప్రపంచానికీ, అధిపతి అయిన ఆ భగవంతుని దూతలు. వారు, మనోహరమైన తమ

రూపాలతో ప్రపంచమంతటా పర్యటిస్తూ, భగవద్ భక్తులకు ఏవిధమయిన భయం కలుగకుండా కాపాడుతూ ఉంటారు.

హరినామ మాహాత్మ్యాన్ని అందరూ గ్రహించలేరు. దాన్ని గ్రహించటానికి, అనంత కోటి జన్మల పుణ్య పరిపాకం అవసరం.

యథార్థానికి, హరి నామోచ్చారణ ద్వారా, హరినామసంకీర్తనంద్వారా, భగవద్భక్తిని అలవరచుకోవటమే, మానవుల పరమధర్మం. ఆ ధర్మాన్ని పాటించినవారే, భాగవతు లనిపించుకుంటారు.

శ్రుత్యంతవిశ్రాంత మత్యను క్రమణీయ
భగవత్ప్రసంగతుల్ భాగవతులు
సనకాది మునియోగిజనసదానందైక
పరమ భాగ్యోదయుల్ భాగవతులు
కృష్ణపదధ్యాన కేవలామృతపాన
పరిణామయుతులు శ్రీభాగవతులు
బహుపాతకానీక పరిభవ ప్రక్రియా
పరుషోగ్రమూర్తులు భాగవతులు
భావతత్త్వార్థవేదులు భాగవతులు
బ్రహ్మవాదానువాదులు భాగవతులు
సిరులు దొలకంగ నెన్నడు జేటులేని
పదవి నొప్పారువారువో భాగవతులు.

అటువంటి భాగవతులను మీరు సమీపించరాదు. అలా సమీపించటం వారి పట్ల సలిపిన అపచారమవుతుంది. అది గ్రహించి, మీరు, యికమీద...

గోరనివారల కెల్లను
దూరము మోక్షాప్తి యెన్ని త్రోవలనైనన్'

అన్న జ్ఞానోదయముయింది. అది కారణంగా, అతడు ఆ గంగాద్వారంలోనే ఉండి, నిశ్చలమైన బుద్ధితో శ్రీహరిని ఆరాధింపసాగాడు. సర్వేంద్రియాలనూ నిగ్రహించుకున్నాడు. తనలోని ఆత్మని, పరమాత్మునితో సంధించి, కాల క్రమాన, తన కళేబరాన్ని అక్కడేవదలి, తనకోసం వచ్చిన హరిపార్షదులతో విష్ణులోకానికి వెళ్ళిపోయినాడు.

## 43. అంగిరసుని ఆత్మబోధ :

పూర్వం, చిత్రకేతు డనేరాజు, శూరసేనదేశానికి అధిపతిగా ఉండేవాడు. ఆయనకు అనేకమంది భార్య లుండేవారు. అయినా, ఏ ఒకరి వల్లకూడా, ఆయనకు, చాలాకాలంవరకూ సంతానం కలుగలేదు. అదే ఆయనకు తొలగని మనోవ్యధగా ఉండేది.

సమ్రాట్టూ, సర్వభోగాన్వితుడూ అయికూడా, సంతానహీనుడు కావటంవల్ల, సర్వదా సంతాపపడుతూ ఉండే ఆ చిత్రకేతునిపట్ల దయతలచి, అంగిరసమహాముని, ఆయనచేత పుత్రకామేష్టి చేయించి, యజ్ఞశేషాన్ని ఆయన పట్టమహిషి అయిన కృతద్యుతి కిప్పించాడు. దాని ఫలితంగా, ఆమెకు, ఒక కుమారుడు కలిగాడు. కాని, ఆమె సపత్నులు, తమకులేని సుఖం తమ సవతికి లభించటం సహించలేక, ఆ కుఱ్ఱవానికి విషం పెట్టి చంపారు.

ఏకైకపుత్రుని అకాలమరణం, చిత్రకేతు మహారాజును దుఃఖ సాగరంలో ముంచేసింది. అది గ్రహించిన అంగిరసుడు, తిరిగి ఆయన్ని కలుసుకుని, ఆయనకు జ్ఞానోపదేశం చేసే ఉద్దేశంతో ఇలా అన్నాడు.

"నువ్వు, ప్రేమమూర్తి అయిన ఆ పరమేశ్వరుని ఆశ్రయించిన భాగవతుడవు. భాగవతులయినవారు, ఏ పరిస్థితిలోనూకూడా విచార పడరు.

నిత్యమైన దేదీ ఈ ప్రపంచంలో లేదు. అసలు, జీవితమే అనిత్యం. దానికి సంబంధించిన భార్యాపుత్రాదులూ, ఐశ్వర్యం, భోగాలూ అన్నీ అశాశ్వతమైనవే. అవన్నీ, అలా వచ్చి పోయే ఒక కల వంటివి. అయినా, ప్రాణికోటి, వాటిమీద అదోవిధమైన అభిమానాన్నీ, మమతనూ కలిగించుకుంటుంది; పెంచుకుంటుంది. దాని కంతటికీ మూలమైనది విష్ణుమాయ. ఆ మాయను సామాన్యు లెవరూ జయించలేరు. అదికారణంగానే ప్రతిప్రాణికీ సుఖదుఃఖాలనేవి కలుగుతూ ఉంటై. ఆ సుఖదుఃఖాలుకూడా అనిత్యమైనవే.

కాని, నిత్యమైనది, ఒక టేఉంది. అదే ఆత్మ. దానినే జీవుడనికూడా అంటారు. ఆ జీవుడు, ఎంతవరకు దేహంలో ఉంటాడో అంతవరకూ మాత్రమే అతనికి మమతాభిమానాలు ఉంటై. దేహాన్ని త్యజించిన తరువాత, ఆ దేహం మీదగాని, అంతవరకూ దాన్ని అనుసరించి ఉన్న ఇతర విషయాలమీదగాని, ఆ జీవునకు ఏవిధమయిన అభిమానం ఉండదు. జనన మరణాదులు లేనివాడూ, సర్వాశ్రయుడయిన వాడూ, స్వప్రకాశుడూ అయిన జీవునకూ, పరమాత్మునకూ భేదంలేదు. అతను, ఆత్మమాయా గుణంద్వారా, విశ్వాన్ని సృష్టిస్తూ ఉంటాడు. ఈ విశ్వాన్నిసృష్టించి, పోషించి, సంహరించే ఆ పరమాత్ముని,ఏకాగ్రచిత్తంతోధ్యానించేవారికి,

ఏవిధమైన విచారం ఉండదు. వారికి, పరమ
శాంతి లభిస్తుంది."

ఆ విధంగా, అంగిరసునిద్వారా ఉపదేశంపొంది, చిత్రకేతుడు, తన అజ్ఞానాన్ని తొలగించుకున్నాడు; దుఃఖాన్ని త్యజించాడు.

ఆ తరువాత, నారదమహర్షి, ఆ మహారాజుకు, నారాయణ కవచం ఉపదేశించటం జరిగింది. చిత్రకేతుడు, ఆ మహామంత్రాన్ని, ఏడు రోజులపాటు దీక్షగా పురశ్చరణచేసి, విద్యాధరపతిత్వం పొందాడు.

ఆ పదవిపొందిన చిత్రకేతుడు, అమితమయిన భక్తితాత్పర్యాలతో, ఆ తరువాత, శ్రీహరిని ఆరాధించాడు ; ఆయన ప్రసాదించిన ఒక దివ్య విమానంలో ఎక్కి, యథేచ్ఛావిహారం చేయసాగాడు.

అలా విహరిస్తూ ఉన్న సమయంలో, చిత్రకేతుడు, ఒకసారి కైలాసానికి వెళ్ళటం, అక్కడ ఉమాసహితుడై ఉన్న మహేశ్వరుని హేళనచేయటం జరిగింది. అది కారణంగా, పార్వతి, ఆ చిత్రకేతునిచూసి, 'నువ్వు రాక్షసుడవై పుట్టవలసింది' అని శపించింది. ఆ విధంగా శాప గ్రస్తుడయిన చిత్రకేతుడే, కాలక్రమాన, త్వష్టప్రజాపతి కుమారుడయిన వృత్రాసురుడుగా జన్మించాడు.

## *44.* వృత్రాసురుడు-విష్ణుభక్తి :

వృత్రాసురుని అగ్రజుడు విశ్వరూపుడు. అతణ్ణి, మహేంద్రుడు అధర్మంగా వధించటం జరిగింది. మహేంద్రుడు తన అన్నను అధర్మంగా సంహరించాడన్న కోపంతో, వృత్రుడు, ఆయన నెలాగయినా పదవీభ్రష్టుని చేయాలని నిశ్చయించుకున్నాడు ; దేవతలమీద యుద్ధాన్ని ప్రకటించాడు.

భయంకరాకారుడూ భీషణకర్ముడూ అయిన వృత్రుని జయించే ఉద్దేశంతో, దేవత లందరూ, తమతమ దివ్యాస్త్రాలను తీసుకుని అతణ్ణి ఎదిరించారు. కాని, వారు ప్రయోగించిన దివ్యాస్త్రాలన్నింటినీ ఆ అసురుడు

అవలీలగా మ్రింగేసి, వారికి ఆశ్చర్యాన్నీ భయాన్నీ కలిగించాడు. అది కారణంగా, దేవతలు, సర్వేశరణ్యుడయిన శ్రీమహావిష్ణువును, మనసారా స్మరించుకున్నారు. ఆ వెంటనే...

తగు శంఖ చక్ర గదాధరుండగువాని
శ్రీవత్సకౌస్తుభశ్రీలవాని,
గమనీయ మాణిక్యఘనకిరీటమువాని
దివ్య విభూషణదీప్తివాని,
మండితకోటీర కుండలంబులవాని
సిరి యురఃస్థలమున జెలగువాని,
దనుబోలు సేవకతండంబు గలవాని
జిలుగైన పచ్చని వలువవాని,
దెల్ల దమ్మివిరుల దెగడు కన్నులవాని
నవసుధాద్రవంపు నవ్వువాని
గనియె వేల్పుపిండు కప్పురపాటుతో
గన్నులందునున్న కలవుదీఱ.

అలా ప్రత్యక్షమైన జగన్మోహనాకారునికి, దేవతలందరూ, సాష్టాంగప్రణామం చేశారు ; చేసి యిలా విన్నవించుకున్నారు.

"దేవాధిదేవా! వృత్రాసురుని క్రోధాగ్నికి, దేవతలూ, ఖేచరులూ, సాధ్యులూ, పన్నగులూ, యక్షులూ అందరూ చిందరవందరై పోయినారు. మేముమాత్రం, ఇప్పటికి, బ్రతికి బయటపడటం జరిగింది. దయఉంచి, మమ్మల్నయినా రక్షించవలసింది. మా మొఱ ఆలించి, ఆ వృత్రుని సంహరించవలసింది. యథార్థానికి...

నీదిక్కు గానివానికి
యే దిక్కును లేదు వెదుక ; నిహపరములకున్

మోదింపదలచువారికి
నీదిక్కే దిక్కుసుమ్ము ; నీరజనాభా !"

అలా, దీనంగా, భక్తిప్రపత్తులతో విన్నవించుకున్న దేవతానీకాన్ని వీక్షించి, శ్రీమహావిష్ణువు, మందహాసంచేస్తూ, అభయమిచ్చాడు ; ఇలా అన్నాడు.

"మీ భక్తిద్వారా, మీరు, నాకు సంతోషం కలిగించారు. అది కారణంగా, మీకు దుర్లభమయిన దేదీలేకుండా చేసుకోవటం జరిగింది. ఇక, మీకు, శుభం కలిగితీరుతుంది. కాని, మీ రొకపనిచేయాలి.

దధీచి అనే ఒకమహనీయు డున్నాడు. అతడు, నాకు పరమ భక్తుడు; అమిత వదాన్యుడు. ఆత్మజ్ఞానంపొందిన అతని శరీరం, ఇప్పుడు, అమిత తేజోవంతమైనదిగా ఉంది. మీ రతణ్ణి యాచించి, అతడి అంగాలను తీసుకోవాలి. ఆ పవిత్రాంగాలద్వారా, విశ్వకర్మనుండి, ఒక ఖడ్గాన్ని తయారుచేయించుకోవాలి. ఆ ఆయుధంతోమాత్రమే, వృత్రుని శిరస్సు ఛేదింపబడటం జరుగుతుంది. అది కారణంగానే, మీకు శాంతి లభిస్తుంది."

ఆ విధంగా, వృత్రవధోపాయం గ్రహించి, దేవతలు, దధీచి మహర్షిని సమీపించారు. సమీపించి...

"దేహి సుఖముగోరి దేహంబు ఘటియించు,
దేహి విడువలేడు దేహ మెపుడు,
దేహి ! యస్మదీయ దేహంబుకొఅకునై
దేహ మీగదయ్య దేవతలకు"

అని ప్రార్థించారు. అలా ప్రార్థించిన దేవతల నుద్దేశించి, దధీచి ఇలా అన్నాడు.

"ఈ దేహం అనిత్యమైనదని నాకు తెలుసు. ఇది, ఏనాడైనా నన్ను వదలిపోయేదేకాని, నన్ను అంటి పెట్టుకుని ఉండే దికాదు. అందుకనే, దీన్ని త్యజించటానికి, నా కేవిధమైన బాధాలేదు.

అదీకాక, అనిత్యమైన ఈ దేహాన్ని త్యజించటంద్వారా, ధర్మం, కీర్తి, లభించేపక్షంలో, దాన్ని కాదని, దేహాభిమానం చూపే వారి జీవితం శోచనీయమవుతుంది. నా జీవితాన్ని అలా చేసుకో వటం నాకు ఇష్టం లేదు. ప్రపంచంలో, కోటానుకోట్ల దేహాలుండగా, దేవతలయిన మీరు, నా శరీరాన్ని మాత్రమే కోరటం, నా అదృష్టంగా నేను భావిస్తున్నాను."

దేవతలకు ఆ విధంగా తన హృదయాన్ని విశదపరచుకుని, దధీచిమహర్షి, యోగమార్గాన శరీరాన్ని త్యజించాడు. అలా త్యజింప బడ్డ దేహంలోని శల్యాల నేరుకుని, మహేంద్రుడు, వాటిద్వారా, వజ్రాయుధాన్ని తయారుచేయించుకుని, వృత్రాసురుని మీదికి వెళ్ళాడు.

అప్పుడు జరిగిన యుద్ధంలో, అశ్వినీదేవతలూ, విశ్వేదేవతలూ, పితృ దేవతలూ, వరుణ వాయు కుబేరాదులూ, ఇంద్రుని పక్షాన పోరా డారు. శంబర వృషభ హయగ్రీవ శంకుశిరప్రభృతులయిన యక్ష రాక్షసాదులందరూ, వృత్రునకు సహాయపడ్డారు. ఆ ఇరుపక్షాలకూ మధ్య జరిగిన సంగ్రామం, ఒకనాటితో తీరిపోలేదు; కృతయుగంలో ప్రారంభమయింది; త్రేతాయుగంలో ముగిసింది.

ఆ యుద్ధ ప్రారంభంలో, మహేంద్రునకు ఉత్సాహం కలిగినా, చివరచివరకు, అది క్షీణించిపోసాగింది. ఆ సమయంలో, వృత్రుడు, మహేంద్రుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"మహేంద్రా ! నువ్వు ఉట్టి పాపాత్ముడవు. నాకు అన్నగారూ, నీకు సద్గురుడూ అయిన విశ్వరూపుని, అన్యాయంగా వధించావు. దానికి ప్రతీకారంగా, నే నిప్పుడు, నిన్ను సంహరించటానికి నిర్ణ యించుకున్నాను. నీకు సహాయులుగా ఉన్నవారినికూడా ముక్కలు ముక్కలుచేసి, కాకులకూ గ్రద్దలకూ ఆహారంగా వేయదలచుకున్నాను. కాని, శ్రీమన్నారాయణుని తేజంతోనూ, దధీచి విద్యాతిశయంతోనూ,

ప్రజ్వలిస్తూ, ప్రస్తుతం నీకు లభించిన వజ్రాయుధం కారణంగా, అది, అసంభవమయినా కావచ్చు. అయినా, నేను విచారపడవలసిన పనేమీ లేదు.

శ్రీమన్నారాయణుడు ఏ పక్షానఉన్నాడో
ఆ పక్షానికి విజయం లభించితీరుతుంది.

అది నాకు తెలుసు. అంతేకాదు. నీ అధీనంలో ఉన్న వజ్రాయుధం వల్లనే నేను మరణించటం సంభవించినపక్షంలో, అది నా అదృష్టమని కూడా నేను భావిస్తాను.

ఆ విధంగా మహేంద్రునకు తెలియపరచి, వృత్రుడు, ఆ వెంటనే, శ్రీహరిని తన మనస్సులో నిలుపుకున్నాడు. ఆయన్ని ఇలా ప్రార్థించాడు.

తండ్రీ! నేను నీ దాసానుదాసుణ్ణి. నువ్వు నా ప్రాణానికి ప్రాణమైనవాడవు. నేను నీ నుంచి ఒకేఒక వరం కోరుతున్నాను. నిరంతరం, నీ గుణాలను తలచుకుంటూ ఉండే మనస్సునూ, నీ లీలా విశేషాలను కీర్తించుకుంటూ ఉండే వాక్కునూ, నీ పరిచర్యకే వినియోగింపబడుతూ ఉండే శరీరాన్నీ మాత్రం నాకు ప్రసాదించవలసింది అంతకు మించి నేను నిన్ను కోరేది యేమీ లేదు. దృఢతరమైన భక్తిముందు ధ్రువపదం గాని, బ్రహ్మపదంగాని, మోక్షంగాని వాంఛనీయమైనవి కానే కావు.

రెక్కలురాని పక్షులూ, ఆకలిగొన్న క్రేపులూ, తమతల్లి కోసం తహతహపడేటట్టుగా, నామనసు నీకోసం ఆరాటపడుతోంది. ఆ ఆరాటాన్ని తీర్చవలసింది. ఇక పైన...

నాకును సఖ్యము పుణ్య
శ్లోకులతోగాని, తత్త్వశూన్యులు సంసా
రైక విమోహుల తోడం
గాకుండ నొనర్పుమయ్య, కంజదళాక్షా !

ఆ విధంగా శ్రీహరిని ప్రార్థించి, శూలాయుధుడైన వృత్రుడు, సురేశ్వరునిమీదికి ఉరికాడు. సురేశ్వరు దది గ్రహించి, తన వజ్రాయుధంతో అతని శూలాన్ని తుత్తునియలుచేశాడు; అతని దక్షిణహస్తాన్ని ఖండించాడు.

అయినా, వృత్రుడు భయపడలేదు. ఏకహస్తుడై ఉండికూడా, అతడు భీకరంగా హుంకరిస్తూ, మరొక ఆయుధాన్ని తీసుకున్నాడు; దాంతో ఇంద్రుని వాహనమయిన ఐరావతాన్ని కూల్చేశాడు.

ఆ సందర్భంలో, ఇంద్రునిచేతిలోఉన్న వజ్రాయుధం క్రిందపడి పోయింది. అది గ్రహించిన వృత్రుడు, యుద్ధధర్మాన్ని పాటించి, మరొక ఆయుధాన్ని ఆయనమీద ప్రయోగింపబోతూకూడా, ఆగాడు. ఆగి, ఆయ నతో ఇలా అన్నాడు.

"మహేంద్రా ! ఖడ్గజీవులకు, విజయ మనేది ఎప్పుడో ఒకప్పుడు సంభవిస్తుందిగాని, ఎల్లప్పుడూ సంభవించదు. సర్వలోకాలలోనూ, సర్వ విధాలా సర్వజయం పొందటమనేది సర్వజ్ఞుడూ, సృష్టి స్థితి లయాలకు కారణభూతుడూ అయిన ఆ సర్వేశ్వరునకు మాత్రమే చెల్లుతుంది. అందు కనే, వివేకవంతులయినవారు, కీర్త్యపకీర్తులకూ, జయాపజయాలకూ, సుఖ దుఃఖాలు పొందరు. ఇక నువ్వు నీ వజ్రాయుధాన్ని తిరిగి తీసుకోవలసింది. నీ విరోధిని వధించటానికి ప్రయత్నించవలసింది."

అలా బోధిస్తూ, తనపైకి లంఘిస్తున్న వృత్రుని చూసి, మహేం ద్రుడు విస్మితుడయినాడు. అది కారణంగానే...

"ఓ దానవేంద్ర ! నీ మది,
వేదాంతముబోలె దత్త్వవిజ్ఞాన కళా
మోదము ; నీ వతిభక్తుడ
వాదిమపురుషునకు, బతికి, నబ్జాక్షునకున్"

అని ప్రస్తుతించాడు.

అలా ప్రశంసిస్తున్న మహేంద్రునిమీదికి, వృత్రుడు, తిరిగి తన గదతో ఉఱికాడు. మహేంద్రు దదిచూసి, తన వజ్రాయుధంతో, ఆ గదనూ, అతని రెండవచేయినీకూడా ఖండించాడు. ఆ వెంటనే, వృత్రుడు, ఆకాశం మాదిరి ఉన్న తన నోరు తెఱచి, సురనాధుని కబళించాడు.

అది గ్రహించిన ప్రపంచమంతా కంపించిపోయింది. కాని, ఆ మరుక్షణంలోనే, మహేంద్రుడు, నారాయణకవచ ప్రభావంవల్ల, వృత్రుని శిరాన్ని ఛేదించి బయటకురావటం జరిగింది. అంతలో, మహా భక్తుడయిన వృత్రుని శరీరంనుంచి, ఒక దివ్యతేజం బయటకు వచ్చింది. మహాద్భుతంగా ప్రపంచమంతనూఆవరించుకుంది. ఆపైన, శ్రీమహావిష్ణువులో ఐక్యమైపోయింది.

*45. హిరణ్యకశిపుడు :*

చిత్రంబులు త్రైలోక్య ప
విత్రంబులు భవలతాలవిత్రంబులు స
న్మిత్రంబులు మునిజన వన
చైత్రంబులు విష్ణుదేవు చారిత్రంబుల్.

హరిభక్తులయిన సనకాదుల శాపంవల్ల దితిగర్భాన జనించిన హిరణ్యాక్ష హిరణ్యకశిపులలో, హిరణ్యాక్షుని, శ్రీమహావిష్ణువు, వరాహ రూపం ధరించి వధించటం జరిగింది. అది హిరణ్యకశిపునకు క్రోధ కారణ మయింది. అందుకనే, అతడు, ఎలాగైనా శ్రీమహావిష్ణువును సాధించితీరాలని నిర్ణయించుకున్నాడు.

హిరణ్య కశిపుడు దైత్యేశ్వరుడు. అతని బల పరాక్రమాలు అసామాన్యమైనవి. అదీకాక, త్రిమూర్ధుడు, త్రిలోచనుడు, శకుని, శంబరుడు, శతబాహుడు, నముచి, హయగ్రీవుడు, పులోముడు, విప్రచిత్తి అనే ప్రముఖ దానవులు అతని అనుచరవర్గంగా ఉన్నారు. అందుకనే, అతడు,

తనకు అసాధ్యమైన దేదీ లేదన్న అభిప్రాయంతో వ్యవహరించసాగాడు. ఆ సమయంలో, అత డొకసారి, తన అనుచరవర్గాన్ని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"హరి సర్వసముడు. అయినా, అతడు, మీ చెలికాడూ, నా సోదరుడూ అయిన హిరణ్యాక్షుని, అన్యాయంగా సంహరించాడు. అందుకనే, నేను, అతణ్ణి నిర్జించటానికి నిర్ణయించుకున్నాను.

భగవంతుడయిన ఆ శ్రీహరి జాడ గ్రహించటం చాలా కష్టం. అది నాకు తెలుసు. అయినా, అతడు, సామాన్యంగా, యజ్ఞయాగాదులూ, వేదాధ్యయనాదులూ జరిగేచోటా, గోవులూ భూసురలూ గౌరవింపబడేచోటా, దానధర్మాదులు ప్రవర్తిల్లేచోటా, వర్ణాశ్రమధర్మాలు పాటింపబడేచోటా ఉండితీరుతాడు. అందుకనే, మీరిక, మీ మీ అనుచరులతో ఆయాచోట్లకు పోయి, యజ్ఞయాగాదులు ధ్వంసంచేసి, గో భూసురాదులను చిత్రవధ పాల్జేసి, దానధర్మాలు జరుగకుండా చూసి, వర్ణాశ్రమధర్మాదులను భంగ పరచి రావాలి. అలా జరిగితే, ఆయన బయటపడిపోతాడు. అప్పుడు, నేను, ఆ మాయలమారి, నాకు భయపడి సముద్రంలో దాక్కున్నా, పాతాళానికి పారిపోయినా, గత్యంతరంలేక ఎదిరించినా, బంధించి, వధించితీరుతాను. ఆయన రక్తంతో నా తమ్మునికి తర్పణం అర్పించుకుంటాను."

ఆ విధంగా తన అనుచరవర్గానికి తన హృదయాన్ని విశద పరచుకుని, హిరణ్యకశిపుడు, ఆపైన, తన తల్లి అయిన దితినీ, మరద లయిన వృషద్భానువునూ, ఆమె బిడ్డలయిన శకుని, శంబర ప్రభృతులనూ ఊరార్చే నిమిత్తం వారిని సమావేశపరచాడు; వారితో ఇలా అన్నాడు.

'హిరణ్యాక్షుడు వీరస్వర్గం పొందాడు. అతని కోసం విచార పడటం అసమంజసం.

భూతకోటి, దైవయోగాన ఒక చోట
కూడుతూ ఉంటుంది. కర్మవశాన విడిపోతూ

ఉంటుంది. సంయోగ వియోగాలనేవి సాధా రణ ప్రాకృత విషయాలు. అవి, ఆ శ్రీమన్నా రాయణుని ఇచ్ఛాధీనాలు. వాటినిగురించి విచా రించటంకూడా అవివేకమే.

ప్రతిప్రాణీకూడా, పుట్టకముందు ఎక్కడ ఉండేదో, అక్కడికే, పుట్టి పెరిగిన తరువాత వెళ్ళిపోతుంది. అది సహజం. అది గ్రహించ లేని వారే, సుఖ దుఃఖా లనుభవిస్తూ ఉంటారు.

ఈ విశ్వమంతా ఈశ్వరుని క్రీడారంగం. ఆ ఈశ్వరుడు, నిగ్రహానుగ్రహ సమర్థుడు. ఆయన రక్షణపొందినప్రాణి, అరణ్యంలో అయినా సుఖంగా ఉండటం జరుగుతుంది. ఆయన ఆగ్రహానికి గురిఅయిన ప్రాణి, పాతా ళంలో దాక్కున్నా బాధలపాలుకావటం, నశిం చటం సంభవిస్తుంది. అలా సుఖించేదీ నశించేదీ ఈ దేహమేకాని, ఆత్మమాత్రంకాదు. ఆ ఆత్మ శాశ్వతంగా ఉంటుంది. నిత్యమైన ఆత్మకోసం విచారపడవలసిన అవసరం లేదు. అనిత్యమైన దేహం కోసం విచారపడి లాభం లేదు. ఆత్మా నాత్మవివేకం కలిగితే, అసలు, ఆ విచార మూల మయిన అజ్ఞానంకాస్తా తొలగిపోతుంది. అంతే కాదు.

చెలులుం దల్లులు దండ్రు లాత్మజులు సంసేవ్యుల్ సతుల్ చారు ని
ర్మలగేహంబు లటంచు గూర్తురు మహామాయాగుణభ్రాంతులై ;
కలలో దోచిన యోగముల్ నిజములే ? కర్మానుబంధంబులం
గలుగున్ సంగము, లేక మాను బిదపం, గర్మాంతకాలంబునన్."

ఆ విధంగా వారికి బోధించి, తనకు, అజరామరత్వం, అజేయత్వం, అప్రతిపక్షత్వం, త్రిజగద్రాజ్యాధిపత్యం, కావాలని కోరి, తీవ్ర తప మాచరించే నిమిత్తం, అతను, మందరగిరి ప్రాంతాలకు వెళ్ళాడు.

అలా వెళ్ళిన హిరణ్యకశిపుడు, కాలిబొటనవ్రేలిమీద నిలబడి, చేతులు పైకెత్తి, ఆకాశంవంకచూస్తూ, అన్నపానాదులు వర్జించి, నూరేళ్ళపాటు, పరమ దారుణమయిన తపస్సు చేశాడు. ఆ సమయంలో అతనివంక చూడటానికికూడా ఎవరూ సాహసించేవారు కాదు.

హిరణ్యకశిపుని తపోవహ్నికి, లోకాలన్నీ కలవరపడిపోయినై. సప్తసముద్రాలూ ఇంకిపోయినై. పర్వతాలన్నీ కంపించిపోయినై. అది గ్రహించిన దేవతలు, బ్రహ్మదేవుని వద్దకు వెళ్ళి, ఆయనకు యిలా విన్నవించు కున్నారు.

"దేవదేవా ! దానవేశ్వరుడయిన హిరణ్యకశిపుని దుస్సహ తపోవహ్నికి, సర్వలోకాలూ సంతప్తమైపోతున్నై. నువ్వు, నీ తపోబలం ద్వారా జగన్నిర్మాణం చేశావు. కాని, అతడు, తన తపశ్శక్తిద్వారా, దాన్ని హింసించాలనీ, తనకు నిత్యత్వాన్ని సముపార్జించుకోవాలనీ చూస్తున్నాడు.

భవదీయంబగు నున్నతోన్నత మహాబ్రహ్మైక పీఠంబు సం
స్తవనీయంబగు భూతియున్ విజయమున్ సౌఖ్యంబుసంతోషమున్
భువనశ్రేణికి నిచ్చు ; దైత్యుని తపస్స్ఫూర్తిన్ నివారించి యో
భువనాధీశ్వర కావవే భువనముల్, పూర్ణప్రసాదంబునన్"

అలా విన్నవించుకున్న దేవతలపట్ల చతుర్ముఖుడు, ప్రసన్నుడయినాడు. ఆ వెంటనే, ఆయన, వారికోరికను తీర్చేనిమిత్తం, హిరణ్యకశిపుని కలుసుకునే ఉద్దేశంతో, భృగు దక్షాదులతో, మందరపర్వతానికి వెళ్ళాడు.

చతుర్ముఖాదులు సమీపించే సమయానికి, హిరణ్యకశిపుడు, శల్యమాత్రావశిష్టుడై ఉన్నాడు. ఆ కంకాళమూర్తిపైన ఒక పెద్ద పుట్ట

పెరిగిఉంది. అలాఉన్న దానవేశ్వరునిచూసి, చతుర్ముఖుడు కూడ భయపడి పోయినాడు. అందుకనే, అతణ్ణి ఉద్దేశించి, 'నాయనా! నువ్వు అపూర్వమైన నీ ఉగ్రతపాన్ని చాలించవలసింది. నీకోరిక ఏమిటో నాకు తెలుపవలసింది; నావల్ల సఫలమనోరథుడవు కావలసింది' అన్నాడు. అంటూనే, తన కమండలోదకాన్ని అతనిమీద చల్లాడు.

ఆ నిర్మలోదకం శరీరంమీద పడగానే, హిరణ్యకశిపుడు, తన పూర్వరూపం పొందాడు. కళ్లు తెరిచాడు. ఆ వెంటనే...

దివిజానీకవిరోధి మ్రొక్కె, గని, వాగ్దేవీ మనోనేతకున్,
సవిశేషోత్సవ సంవిధాతకు, నమత్సంత్రాతకున్, సత్తపో
నివహాభీష్ట వరప్రదాతకు, జగన్నిర్మాతకున్, ధాతకున్,
వివిధప్రాణిలలాటలేఖన మహావిద్యానుసంధాతకున్.

అలా మ్రొక్కి, ఆకాశమార్గాన, తన కట్టెదుట, హంసవాహనారూఢుడై ఉన్న ఆ మహానుభావుని ఉద్దేశించి, ఇలాప్రస్తుతించాడు.

"తండ్రీ ! నువ్వు ఆదిపురుషుడవు సృష్టిస్థితిలయాలకుకారణభూతుడవు. స్వయంజ్యోతివి. సచ్చిదానందమయుడవు.

నాయనా ! నువ్వు, మనోబుద్ధి చిత్తేంద్రియాలకుఅధీశ్వరుడవు. మహాభూతగణాలన్నింటికీ ఆధారభూతుడవు. పరమాత్ముడవు. నువ్వుకానిది ఏదీ లేనేలేదు.

నువ్వు, ఆత్మనిష్ఠాగరిష్ఠులకు ధ్యేయమైన ఆత్మవు. సర్వార్థసాధకులకు సాధనీయుడవు.

అర్థిజనుల కోరికలు తీర్చటంలో నీకు నువ్వే సాటి. నువ్వు కరుణారస సాగరుడవు.

అటువంటి నువ్వే నాకు సాక్షాత్కరించావు; నాజన్మను సఫలం చేశావు. ఇప్పుడు, నేను నా తపస్సును విరమించటమే నీ అభీప్సితమయిన పక్షంలో...

గాలిం గుంభిని నగ్ని నంబువుల నాకాశస్థలిన్ దిక్కులన్
రేలన్ ఘస్రములం దమఃప్రభల భూరిగ్రాహరక్షోమృగ
వ్యాళాదిత్య నరాది జంతు కలహవ్యాప్తిన్ సమస్తాస్త్ర శ
స్త్రాళిన్ మృత్యువు లేని జీవనము లోకాధీశ యిప్పింపవే!"

ఆ విధంగా, స్తుతించి, అర్థించి, ఆయన్ని సంతృప్తి పరచి, ఆ పైన, లోకపాలకుల నతిక్రమించే మహిమాతిశయాన్నీ, భువనత్రయ విజయాన్నీ కూడా ఆయననుంచి కోరి, వరంగాపొందాడు.

అమోఘమయిన వరాలన్నీ పొందిన హిరణ్యకశిపుడు, ఆ మీదట, అమితమయిన గర్వంతోనూ, దుర్మదంతోనూ ప్రవర్తించసాగాడు. అది కారణంగా, అతనిలో ఉన్న విష్ణుద్వేషం ఆరోజుకారోజు వృద్ధిపొందటం జరిగింది. ఆ సమయంలో, అతను, తనదైన దుస్సహతేజంతో, యక్ష కిన్నర ఖచర సిద్ధ సాధ్య విద్యాధరాదులను చాలా మందిని సంహరించాడు. దిక్పాలురను బంధించాడు. వారి పట్టణాలను వశపరచుకున్నాడు. వారి సంపదలను హరించాడు. చివరకు, మహేంద్రుని భవనంలో ప్రవేశించి, ఆయన సింహాసనాన్ని కూడా ఆక్రమించుకున్నాడు.

ఆ విధంగా లోకత్రయాధిపత్యం వహించిన హిరణ్యకశిపుని చూసి భయపడని ప్రాణి అంటూ అప్పుడు లేకుండాపోయింది. ఇంద్రాదులూ, నారదాదిమునులూకూడా అతణ్ణి ఆనందపరచి కాలం వెళ్ళదీసుకుంటూ ఉండటం సంభవించింది.

అలా కొంతకాలం గడిచింది. ఆ సమయంలో, ఒకసారి, దేవతలూ, కిన్నర సిద్ధ సాధ్య ముని నాయకులూ, అందరూ ఒకచోట సమావేశమై, శ్రీమహావిష్ణువును స్మరించుకుని...

'ఎక్కడ నున్నవాడు జగదీశ్వరు డాత్మమయుండు మాధవుం
డెక్కడ కేగి శాంతులు మునీశులు భిక్షులు రారు క్రమ్మఱం
దిక్కుల నెల్ల నెక్కుడు తుదిం జొర దిక్కగునట్టి దిక్కు కై
మ్రొక్కెదమేము హస్తయుగముల్ ముకుళించి మదీయరక్షకున్'

అని, ఆయన ఆశ్రయభిక్ష నర్థించారు. అంతలో, శ్రీహరిదైన గంభీరస్వనం వారికి ఈ విధంగా వినిపించింది.

"భయముంజెందకుడయ్య నిర్జరవరుల్, భద్రంబు మీ కయ్యెడున్,
జయముల్ లాభము భూత సంతతికి మత్సందర్శన ప్రాప్తి న
వ్యయమై చేరు, నెఱుంగుదున్ దితిసుతవ్యాపారదుర్భాషా విప
ర్యయముల్, కాలముకూడ జంపెద, జనుం డుండాగ మీ చేతోవలన్."

ఆ పలుకులు విన్న దేవతలు, శ్రీమన్నారాయణునకు మ్రొక్కి, మనశ్శాంతితో, ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయినారు; శ్రీమన్నారాయణుడు సూచించిన శుభదినం ఎప్పుడు వస్తుందా అని వేచి ఉన్నారు.

వారలా ఉండగా, కాలక్రమాన, హిరణ్యకశిపునకు, నలుగురు కుమారులు కలిగారు. వారిలో ప్రహ్లాదుడు ప్రథముడు.

ప్రహ్లాదుడు పరమభక్తుడు. అతని సద్గుణాలను వర్ణించటానికి ఆదిశేషునకుకూడా అలవికాదేమో అనిపిస్తుంది. అతను, పెద్దలపట్ల భృత్యుని మాదిరి ప్రవర్తించేవాడు. సర్వభూతాలనూ సమంగా చూసుకునే వాడు. దీనులయినవారిని తల్లిదండ్రులమాదిరి పోషించేవాడు. తనకు సములయిన వారిని సోదరులుగానూ, గురువులను దైవతములు గానూ భావించేవాడు. ఆటపాటలలో అయినా అబద్ధమాడేవాడు కాదు. అందరిపట్లా మర్యాదగా వ్యవహరించేవాడు.

అంతేకాదు. ఉత్తమకులంలో పుట్టి, విద్యా ధన రూప సంపదలలో ఉత్తమోత్తముడై ఉండికూడా, అతడు, ఏవిధంగానూ గర్వపడేవాడు కాదు. ఏదివిన్నా, ఏది చూసినా, అదోవిధమైన విరక్తిభావంతో ఉండేవాడు.

అసురభావం ఏమాత్రం లేకుండా, నిత్యశాంతితో వ్యవహరించేవాడు. సర్వ వేళలా శ్రీమన్నారాయణుని మీదనే మనసును నిలుపుకుని, ఆయన నామాన్నే స్మరించుకుంటూ, ఆయన గుణగణాలనే అభివర్ణించుకుంటూ, ఆయనకీర్తినే గానంచేస్తూ, ఉండేవాడు. ఆ భగవద్భక్తిపారవశ్యంలో, అతడు, అతివిచిత్రంగా వ్యవహరించేవాడు. తన తల్లి దండ్రులనుగాని తోటివారిని గాని, అన్న పానాదులను గాని, విహార నిద్రాదులను గాని తలచుకునేవాడుకాదు. ఒక్కొకప్పుడు తన్ను తానే మఱచి ఉండేవాడు; జడుని మాదిరి ప్రవర్తించేవాడు.

వైకుంఠచింతా వివర్జిత చేష్టుడై
యొక్కడు నేడుచు నొక్కచోట
నశ్రాంత హరిభావనారూఢచిత్తుడై
యుద్ధతుడై పాడు నొక్కచోట
విష్ణు డింతియకాని వేఱొండులేదని
యొత్తిలి నగుచుండు నొక్కచోట
నలినాక్షుడను నిధానముగంటి నేనని
యుబ్బి గంతులువైచు నొక్క చోట

బలుకు నొక్కచోట బరమేశు కేశవు
బ్రణయహర్ష జనిత బాష్పసలిల
మిళిత పులకుడై నిమీలితనేత్రుడై
యొక్కచోట నిలిచి యూరకుండు.

అదంతా గ్రహిస్తున్న హిరణ్యకశిపుడు, తన కుమారుడు అలా తయారుకావటానికి, అతడు, తగిన విద్య నభ్యసించక పోవటమే కారణ మనుకున్నాడు. అందుకనే, ఓనాడు, ప్రహ్లాదుని ఉద్దేశించి...

'చదువనివా డజ్ఞుండగు
జదివిన సదసద్వివేక చతురత గలుగుం

జదువగ వలయును జనులకు
జదివించెద నార్యులొద్ద జదువుము తండ్రీ !'

అని ఉపదేశించాడు. ఆ వెంటనే, శుక్రాచార్యుని కుమారులూ, అసుర పురోహితులూ అయిన చండుడు అమర్కుడు అనేవారిని రప్పించి, వారిని సత్కరించి...

'అంధప్రక్రియ నున్నవాడు పలుకం దస్మత్ప్రతాపక్రియా
గంధం బించుక లేదు మీరు గురువుల్ గారుణ్యచిత్తుల్ మనో
బంధుల్ మాన్యులు మాకు బెద్దలు మముం బాటించి యీ బాలకున్
గ్రంథంబుల్ సదివించి నీతికుశలుం గావించి రక్షింపరే !'

అని ప్రార్థించి. ప్రహ్లాదుని వారికి అప్పగించాడు.

చండామర్కులు, ప్రహ్లాదుని తమతో తీసుకువెళ్ళి, అతనికి సవయస్కులయిన కొందరు బాలురతో అతణ్ణి చేర్చి, దండనీతి మొదలయిన శాస్త్రాలు అతనిచేత చదివించారు. ప్రహ్లాదుడుకూడా, గురువులు చెప్పిందంతా చదివేవాడు; కాని, ఆ చదువులమీద ఏమాత్రంగానూ లక్ష్యం ఉంచేవాడు కాదు.

అలా కొంతకాలం గడిచింది. ఓసారి, మహారాజు, అతణ్ణి దగ్గరకు తీసుకుని, 'నాయనా ! నువ్వు గురువులదగ్గర చాలాకాలంగా ఉన్నావు. అక్కడ నువ్వు నేర్చుకున్న వాటిలో, నీకు నచ్చిన ఏదో ఒకవిషయం నాకు వినిపించవలసింది' అని కోరాడు. ఆ వెంటనే, ప్రహ్లాదుడు...

'ఎల్ల శరీరధారులకు నిల్లను చీకటినూతి లోపలం
ద్రెళ్ళక మీరు మేమను మతిభ్రమణంబున భిన్నులై ప్రవ
ర్తిల్లక సర్వము న్నతని దివ్యకళామయమంచు విష్ణునం
దుల్లముజేర్చి తా రడవి నుండుట మేలు నిశాచరాగ్రణీ !'

అని, విన్నవించుకున్నాడు.

అది విన్న హిరణ్యకశిపుడు ఆశ్చర్యపోయినాడు. శత్రుపక్షానికి చెందిన పిల్లలెవరో అతని మనసును అలా మార్చిఉంటారని అనుకున్నాడు. అందుకనే, అతణ్ణి ఉద్దేశించి...

'నాకుం జూడగ జోద్యమయ్యెడిగదా నా తండ్రి, యీ బుద్ధి దా
నీకున్ లోపల దోచెనో, పరులు దుర్నీతుల్ పఠింపించిరో,
యేకాంతంబున భార్గవుల్ పలికిరో, యీ దానవశ్రేణికిన్
వైకుంఠుండు గృతాపరాధు. డతనిన్ వర్ణింప నీకేటికిన్.

సురలం దోలుటయో, సురాధిపతులన్ స్రుక్కించుటో, సిద్ధులం
బరివేధించుటయో, మునిప్రవరులన్ బాధించుటో, యక్ష కి
న్నర గంధర్వ విహంగ నాగపతులన్ నాశంబు నొందించుటో,
హరియంచున్ గిరియంచు నేల చెడ, మోహాంధుండవై పుత్రకా!'

అని, తన ఆగ్రహాన్ని తనలోనే అణచుకుంటూ, మెల్లగా మందలించాడు. అది విన్న చండా మర్కులు, ప్రహ్లాదుని బుజ్జగిస్తూ, 'నాయనా ! నీ కీ విధంగా బోధించిందెవరో నిజం చెప్పవలసింది' అని అడిగారు. వారికి సమాధానంగా, ప్రహ్లాదుడు, ఇలా అన్నాడు.

"నాకు ఇతరులు బోధించిందేదీలేదు. గురువులందరికీ గురుడయిన ఆ పరమాత్ముడే నా కీవిధమైన జ్ఞానాన్ని ప్రసాదించాడు. దైవయోగం వల్ల, నా మనసు, ఆయన పాదాల నాశ్రయించింది. ఆయన్ని తలచుకుంటేనే నా హృదయం ద్రవించిపోతుంది. ఈ పరిస్థితిలో, నాకు, ఆ పరమేశ్వరుడు ప్రసాదించిన జ్ఞానానికి భిన్నమైన దేదీ రుచించదనికూడా రూఢిగా తేలిపోయింది. యథార్థానికి....

మందార మకరంద మాధుర్యమునదేలు
మధుపంబు వోవునే మదనములకు

నిర్మల మందాకినీ వీచికలదూగు
రాయంచ సనునె తరంగిణులకు
లలితరసాలపల్లవఖాదియైచొక్కు
కోయిల సేరునే కుటజములకు
బూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు

అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబు జేరనేర్చు
వినుత గుణశీల మాటలు వేయునేల !"

అలా పలికిన సుకుమారునిచూసి, హిరణ్యకశిపుడు అమితంగా ఆగ్రహించుకున్నాడు. ఆ వెంటనే, చండా మర్కుల దిక్కై, ఆతణ్ణి సర్వ విధాల దండించి అయినా తన మార్గానికి తీసుకురావలసిందని ఆదేశించాడు.

చండా మర్కులు, దానవేశ్వరుని ఆగ్రహావేశాన్ని అర్థంచేసుకుని, అమితంగా అదలిపోయినారు. అందుకనే, ఆయన నుద్దేశించి...

'ఈ పాపని జదివింతుము
నీ పాదములాన యింక నిపుణతతోడం
గోపింతుము దండింతుము
కోపింపకుమయ్య దనుజకుంజరనాథా !'

అని నివేదించుకున్నారు; ఆ వెంటనే, ప్రహ్లాదుని, అక్కడినుంచి తీసుకు వెళ్లారు.

అలా తీసుకువెళ్ళి, వారతనికి, వర్గత్రయం బోధించారు. దండ నీతికి సంబంధించిన విషయాలన్నీ ఉపదేశించారు; నీతికోవిదుడు కావటానికి అవసరమయిన శాస్త్రాలన్నీ అతనిచేత చదివించారు.

ఆ విధంగా కొంతకాలం గడిచింది. ఆ సమయంలో, ఓసారి, ప్రహ్లాదుని, తిరిగి మహారాజువద్దకు తీసుకుపోవాలనీ, అతనికి తాము బోధించిన విద్యను ఆయనముందు ప్రదర్శింపచేయాలనీ, చండామర్కులనుకున్నారు. ఆ వెంటనే, ఒకరోజున, ప్రహ్లాదునితోసహ హిరణ్యకశిపుని సమీపించారు. సమీపించి...

'శిక్షించితి, మన్యములగు
పక్షంబులుమాని నీతి పారగుడయ్యెన్,
రక్షోవంశాధీశ్వర !
వీక్షింపుము నీ కుమారు విద్యాబలమున్'

అని, విన్నవించుకున్నారు.

శుక్రకుమారుల పలుకులువిన్న హిరణ్యకశిపుడు అమితానందం పొందాడు. ఆ వెంటనే, ప్రహ్లాదుని, దగ్గరకు తీసుకున్నాడు. ఒళ్లో కూర్చోపెట్టుకున్నాడు; ముద్దాడాడు. ఆ పైన...

'చోద్యం బయ్యెడి, నింతకాలమరిగెన్, శోధించి యేమేమి సం
వేద్యాంశంబులు సెప్పిరో గురువు, లే వెంటం బఠింపించిరో,
విద్యాసార మెఱుంగ గోరెద, భవద్విజ్ఞాత శాస్త్రంబులో
బద్యం బొక్కటి సెప్పి సార్థముగ, దాత్పర్యంబు భాషింపుమా!'

అని, ప్రేమపురస్సరంగా అడిగాడు. ఆయనకు సమాధానంగా, ప్రహ్లాదుడిలా అన్నాడు.

"నాయనా! గురువులు నాచేత సర్వశాస్త్రాలూచదివించారు. వారి దయ వల్ల, నాకు, చదువులలో ఉన్న మర్మమంతా అవగతమయింది.

ఎన్ని చదువులు చదివినా, హరిభక్తి అనేది
లేకపోతే ప్రయోజనంలేదు. ఆ హరిభక్తిని
వరచుకోవటానికి అనేక మార్గా లున్నై.
వాటిలో, సర్వవేళలా శ్రీ హరివైన దివ్య

గాథలను వింటూ ఉండటం, ఆయన లీలలను కీర్తిస్తూ ఉండటం, ఆయనను స్మరించుకుంటూ ఉండటం, సేవిస్తూఉండటం, అర్చిస్తూ ఉండటం, ఆయనకునమస్కరిస్తూ ఉండటం, ఆయన భక్తులైనవారితో చెలిమి చేసుకోవటం, ఆయనకే ఆత్మను సమర్పించుకోవటం అనేవి ప్రధానమైనవి. అలా చేసినవారికి సర్వశ్రేయాలూ సమకూరుతై. యథార్థానికి...

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకుని జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరి దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని ప్రకటించు చదువు చదువు
కుంభినీధవు జెప్పెడి గురుడు గురుడు
తండ్రి ! హరి జేరుమనియెడి తండ్రి తండ్రి.

సర్వేశ్వరుని సేవకు అంకితం కాని శరీరం, జగన్నాథుని చింత లేనిజన్మం,భగవద్భక్తి లేని పాండిత్యం ముమ్మాటికీ వ్యర్థమే. పరాత్పరుని పాదాల నాశ్రయించని ప్రాణి, ద్విపాద పశువుగా మాత్రమే పరిగణింపబడటం జరుగుతుంది.

ఇంతకూ....

సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక,
తాపత్రయాభీల దావాగ్ను లారునే
విష్ణుసేవామృత వృష్టి లేక
సర్వంకషా ఘౌఘ జలరాశు లింకునే
హరిమనీషాబడబాగ్ని లేక,
ఘనవిపద్గాఢాంధకారంబు లడగునే
పద్మాక్షు నుతి రవి ప్రభలు లేక,
నిరుపమా పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధి గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక
తామరసగర్భునకునైన దానవేంద్ర !"

అలా మృదుమధురంగా తన దృఢాభిప్రాయాలను వెలువరించిన ప్రహ్లాదునిపట్ల హిరణ్యకశిపునకు అమితమైన కోపం కలిగింది. కుమారుని పలుకులు అతని చెవులకు ములుకులమాదిరి తోచినై. అందుకనే, ఆయన, చండామర్కుల దిక్కై, "మీరు గురుపుత్రులుకదా అని, నా ప్రియపుత్రుణ్ణి మీకు ఒప్పగించాను. మీరు, అతణ్ణి నాకు కాకుండా చేశారు. అంతేకాదు. అతణి. నాకు ఆగర్భశత్రువైన హరికి దాసునిగా మార్చివేశారుకూడా. దీనికి తగిన ఫలం మీరు అనుభవింపకపోరు" అన్నాడు.

హిరణ్యకశిపుని పలుకులు విన్న గురుపుత్రులు అమితంగా వ్యాకులపడ్డారు. ఆయనవల్ల తమ కే అపకారం కలుగుతుందో అనికూడా వారు అదలిపోయినారు. అందుకనే, ఆయన నుద్దేశించి...

'తప్పులు లేవు మావలన దానవనాథ ! విరోధిశాస్త్రముల్
సెప్పము, క్రూరులై పరులు జెప్పరు, మీ చరణంబులాన సు,

మ్మెప్పుడు మీ కుమారునకు నింతయు నైజమనీష, యెవ్వరుం
జెప్పెడి పాటిగాదు, ప్రతిచిం... పుంపుము నేర్పుకైవడిన్'

అని నివేదించుకున్నారు. వారి పలుకులమీది విశ్వాసంతో, హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని ఉద్దేశించి, 'నీ గురువులు చెప్పనిబుద్ధి నీ కెలా కలిగింది? నీ కీ విధంగా ఉపదేశించిం దెవరు?' అని పట్టరానికోపంతో ప్రశ్నించాడు. ఆయనకు సమాధానంగా, ప్రహ్లాదుడు...

'అచ్చపు చీకటింబడి గృహవ్రతులై విషయప్రవిష్టులై
చచ్చుచు బుట్టుచున్ మరల జర్విత చర్వణు లైనవారికిం
జెచ్చెర బుట్టునే పరులు సెప్పిననైన నిజేచ్ఛనైన నే
మిచ్చిననైన గానలకు నేగిననైన హరి ప్రబోధముల్'

అని, సవినయంగా ప్రశ్నించాడు. అంతేకాదు.

'కాననివాని నూతగొని కాననివాడు విశిష్టవస్తువుల్
కాననిభంగి గర్మములు గైకొని కొందఱు కర్మబద్ధులై
కానరు విష్ణు గొందఱట గందు రకించన వైష్ణవాంఘ్రి సం
స్థాన రజోభిషిక్తులగు సంహృతకర్ములు దానవేశ్వరా!'

అనికూడా తెలుపుకున్నాడు. అలా నిర్భయంగా పలికిన కుమారుని, ఆ తండ్రి, తన తొడమీదినుంచి క్రిందకు త్రోసివేశాడు. ఆ వెంటనే, తన భటుల నుద్దేశించి..

'పంచాబ్దంబులవాడు తండ్రినగు నా పక్షంబు నిందించి య
త్కించిద్భీతియులేక విష్ణు నహితున్ గీర్తించుచున్నాడు, వ
ల్దంచుం జెప్పిన మాన, డంగమున బుత్రాకారతన్ వ్యాధి జ
న్మించెన్ వీని వధించిరండు దనుజుల్ మీ మీ పటుత్వంబులన్'

అని ఆదేశించాడు.

దానవేశ్వరుని ఆజ్ఞానుసారం, రక్కసులు, ప్రహ్లాదుని అక్కడి నుంచి తీసుకుపోయినారు. అతడు బాలుడనికాని, సాధువనికాని విచా

రించకుండా, అమితంగా హింసించారు.వా రెంతగా హింసించినా, ప్రహ్లాదుడు, ఏమాత్రంగానూ చలించలేదు. ఉద్రేకపడలేదు. చివరకు, బాధపడటంకూడా జరుగలేదు.

రక్కసులు, అతణ్ణి, శూలాలతో పొడిచారు. అయినా, అతని శరీరం గాయపడలేదు. అతడు కంపించలేదు. అతని కంటివెంట నీరు రాలేదు. భటులు బాధించేది తన్నుకాదన్నట్టుగానే, అతడు వ్యవహరించాడు. చివరకు, వా రతణ్ణి, పాములచేత కఱపించారు. ఏనుగుల పాదాలక్రింద పడేసి త్రొక్కించారు. కొండలమీదనుంచి క్రిందికి పడేశారు. అయినా, అతనికి యే విధమైన అపాయం కలుగలేదు. అతని మనసు మారలేదు. దానవేశ్వరుని భటులు తన్ను అంతగా హింసిస్తున్నా, అతడు, వారిని దూషించలేదు. ఎంతటి విపత్కరపరిస్థితిలో ఉన్నా, తనతల్లినిగాని బంధువులనుగాని సహచరులనుగాని హితవర్గాన్నిగాని, ఎవ్వరినీ తలచుకోలేదు. వారిని ఆశ్రయించాలనుకోలేదు.అప్పుడు, కూడా, అతడు ఆశ్రితమందారుడూ, ఆపదోద్ధారకుడూ అయిన ఆ శ్రీమన్నారాయణునే ఆశ్రయించుకుని ఉన్నాడు. ఆయననే స్మరించుకుంటూ, ఆయన దివ్యనామాలనే జపించుకుంటూ, ప్రశాంత చిత్తంతో ఉండిపోయినాడు.

ప్రహ్లాదుడు ఆ విధంగా ఉండటం, హిరణ్యకశిపునకు ఆశ్చర్యం కలిగించింది. అందుకనే, ఆయన...

'శూలములన్ నిశాచరులు స్రుక్కక దేహము నిగ్రహింపగా
బాలుడు నేలపై బడడు పొఱడు చావడు తండ్రినైన నా
పాలికివచ్చి చక్రధరుపక్షము మానితినంచు బాదముల్
ఫాలముసోక మ్రొక్క దనపాయతనొందుట కేమి హేతువో !'

అని ఆలోచింపసాగాడు. అలా ఆలోచిస్తూ ఉండగా, తనకు గోచరించని ఏదో ఒక ప్రభావం తన కుమారునిలో ఉండి ఉంటుందన్న అభిప్రాయం ఆయనకు కలిగింది. అది కారణంగానే...

'ఎఱుగడు జీవనౌషధము, లెవ్వరు భర్తలు లేరు, బాధలం
దరలడు, నైజతేజమున దథ్యము జాడ్యములేదు, మిక్కిలిన్
మెఱయుచునున్నవా, డొకనిమేషము దైన్యము నొంద, డింక నే
తెఱగున ద్రుంతు, వేసరితి, దివ్యము వీని ప్రభావమెట్టిదో !'

అనుకుని, విస్మితుడయినాడు. ఆ వెంటనే, ఆయనకు, ప్రహ్లాదునిపట్ల ఆదో విధమైన భీతికూడా జనించింది. ప్రహ్లాదుడు భాగవతోత్తముడనీ, అతనిపట్ల అపచారం సలపటం ఆపదల నాహ్వానించుకోవటం కావచ్చుననీ, అప్పు డతనికి అనిపించింది.

ఆ విధమైన అభిప్రాయంతోనే, హిరణ్యకశిపుడు ఖిన్నుడైనాడు. అది గ్రహించిన చండా మర్కులు ఆయనకు ఉపశమనం కలిగించే నిమిత్తం ఇలా అన్నారు.

"మహారాజా! నువ్వు, ముల్లోకాలనూ జయించి, ఏకైకవీరుడ వనిపించుకున్నావు. అటువంటి నువ్వు, ఈ చిరంజీవి విషయంలో ఇంతగా చింతించటం భావ్యంకాదు.

పిల్లలు. గుణ దోషాలు తెలుసుకోలేరు. గుణ దోష జ్ఞానం లేని పిన్నవారి ప్రవర్తనకు ప్రాధాన్యత కల్పించటం, దాని మూలంగా బాధ పడటం, నీవంటివానికి ఉచితం కాదు."

గురుపుత్రులు అలా పలికిన మీదట, హిరణ్యకశిపుడు, ప్రహ్లాదుని, తిరిగి వారికి అప్పగించి, గృహస్థులయిన రాజులకు ఉపదేశింపదగ్గ ధర్మార్థ కామ విషయాలను అతనికి బోధింపవలసిందిగా ఆజ్ఞాపించాడు.

భార్గవులు, దానవేశ్వరుని ఆజ్ఞానుసారం, ప్రహ్లాదునకు బోధించి చూశారు; కాని, అవేవీ అతని మనసు కెక్కలేదు. పైగా, అతడు, అవన్నీ అజ్ఞానజనితమయిన ఉపదేశాలుగా భావించాడు. అంతేకాదు. వాటివల్ల తనకుగాని, తన తోటివిద్యార్థులకుగాని ఏవిధమైన ప్రయోజనం ఉండదని

కూడా నిర్ణయించుకున్నాడు. అది కారణంగానే, ఒకసారి, తన తోటిబాలు రందరినీ సమావేశపరచి, వారి నుద్దేశించి...

'గురువులు, మనకు శ్రేయమేదో అదిమాత్రం చెప్పకుండా, ఇతర మైన చదువులన్నీ చెబుతున్నారు. మనకు, వాటివల్ల, అజ్ఞానం పెఱుగు తుందికాని విజ్ఞానం కలుగదు. ఇక మనం, ఆ చదువులు చదువటం మంచిది కాదు. మనకు మేలుచేకూర్చే చదువేదో అది నేను గ్రహించాను. దాన్ని, నేను, మీకుకూడా చెప్పదలచాను'

అని, వారిలో ఒకవిధమైన ఉత్సాహాన్ని కల్పించాడు. ఆ తరువాత, వారికి యిలా బోధించాడు.

"మనతో విద్యాభ్యాసం ప్రారంభించిన వారు, కొందరు, యిప్పుడు మనమధ్య లేరు. వారు,చనిపోవటం జరిగింది. అంటే, మృత్యువు వారిని కబళించిందన్నమాట. వారిని కబళించిన మృత్యువే, మనల్నికూడా, ఈనాడు కాక పోయినా మరొకనాడయినా, కబళించి తీరు తుంది. అది దాని స్వభావం. ఆ యథార్థాన్ని మనం మఱచిపోరాదు.

జన్మలన్నిటిలోనూ మానవజన్మ ఉత్తమ మైనది. అది శతవర్ష పరిమితమైఉంటుంది. ఆ నూరు సంవత్సరా లయినా, మానవులు జీవించి ఉంటారనుకోవటం భ్రమ. మృత్యు వన్నది, ఏ క్షణాన వచ్చినా రావచ్చు. దాన్ని నిరోధించే శక్తి యేప్రాణికీ లేదు.

ఆ జీవితకాలంలో కూడా, సగపాలు, నిద్రలో వ్యర్థమై పోతుంది. మిగిలిన సగం

లోనూ, చాలాకాలం, అజ్ఞానంతో కూడుకున్న బాల్య కౌమార దశలలో గడచిపోతుంది. ఆ తరువాత ప్రాప్తించే యౌవనదశలో, మానవులు, ఇంద్రియాలకు వశులై, కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యాది పాశాలకు కట్టుబడి, సంసారసాగరంలో మునిగి తేలుతూ, బాధ లనుభవిస్తూ ఉండటం జరుగుతుంది ఆ సమయంలో, విరక్తిమార్గం లభించటం దుర్ఘటం. ఆ విధంగా, మరికొంత ఆయువు క్షీణించిపోతుంది. యౌవనదశలో, ఇంద్రియభోగాలకు వశులై చరించినవారికి, వృద్ధాప్యం తొందరగా ప్రాప్తిస్తుంది. అప్పుడు అనుభవించే యాతనలకు అంతనేది కనిపించదు. ఆవిధంగా ఆయుర్వ్యయం చేసుకోవటం అన్యాయం.

మానవులై పుట్టినందుకు, మోక్షాన్ని సిద్ధింపచేసుకోవాలి. మోక్షాన్ని సిద్ధింపచేసుకోవటానికి, హరిచరణాల నాశ్రయించాలి.

హరి సర్వభూతప్రియుడు. ఆయనను భజించటంవల్ల సర్వశ్రేయాలూలభిస్తై. అది గ్రహించలేనివారు, గృహాసక్తివల్ల, స్నేహ పాశాలకు బద్ధులై,అనిత్యమైనభోగాల నాశించి, అర్థ సముపార్జనకు అనేకమయిన అనుచిత కార్యా లాచరిస్తారు. వాటి మూలంగా, ఈ లోకంలో రాజదండనకూ, పరలోకంలో నరక యాతనలకూ పాల్పడతారు. ఆ విధమైన

మూఢ జీవితానికి అలవాటుపడ్డవారు, మోక్షో
పాయాల నర్థం చేసుకోలేరు.

అనుసరణీయమైన ఆ మోక్షమార్గాన్ని మనకు చూపించకుండా, మన గురువులు, మన జీవితాలను వ్యర్థంచేస్తున్నారు. దాన్ని, మనం, నిరసించాలి. మన కేదిమేలో దాన్ని మనం గ్రహించాలి. దాన్నే ఆశ్రయించాలి "

అది విన్న దనుజకుమారులకు అప్పు డొక సందేహం కలిగింది. అంతవరకూ తమ గురువులు తమకు యెన్నో శాస్త్రాలు బోధించారు. ప్రహ్లాదుడుకూడా, తమతోపాటు, వాటిని మాత్రమే అభ్యసించాడు. కాని, అత డీరోజున చెప్పిన విషయాలు ఏవీకూడా,అంతవరకు తాము విన్నవికావు. అతడు వాటిని యెవరివద్ద నేర్చుకున్నాడో తమకు తెలియకుండా ఉంది. అలా ఆలోచించి, వారు, తమ సందేహాన్ని తీర్చవలసిందిగా ప్రహ్లాదుణ్ణే అడిగారు. వారికి సమాధానంగా, ప్రహ్లాదుడు, యిలా తెలియ పరచాడు.

'పూర్వం, మా తండ్రి, తపస్సు చేసుకునే నిమిత్తం. మందరాచలానికి వెళ్ళటం జరిగింది. అక్కడ, ఆయన, తపస్సు చేసుకుంటూఉన్న సమయంలో, దేవతలు, మహేంద్రుని నాయకత్వాన, రాక్షసులమీద దాడిచేసి, వారిని అమితంగా చికాకు పరచారు. అసురులు, సురల తాకిడికి తట్టుకోలేక, తమ సర్వస్వాన్ని త్యజించి, ప్రాణభీతితో పారిపోయినారు. ఆ సమయంలో, మహేంద్రుడు, మా తల్లిని చెఱపట్టి, అమరావతికి తీసుకుపోతూ ఉండగా, దారిలో, నారదమహర్షి కనిపించి, 'సురేశ్వరా! ఏమిటీ అన్యాయం? పతివ్రతా, గర్భిణీ అయిన ఈమెను బంధించటమా?' అంటూ పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, ఇంద్రుడు. 'మహర్షీ! ఈమె మరొక అసురుని ప్రసవించబోతోంది. ఈమె ప్రసవించిన తరువాత, ఆ కుఱ్ఱవాణ్ణి సంహరించి ఈమెను విడిచిపెడతాను' అన్నాడు.

ఇంద్రుని పలుకులు విన్న నారదుడు విస్మితుడయినాడు. అందుకనే, 'సురేశ్వరా! ఈమె ప్రసవించబోయేది పాపాత్ముడైన అసురుని

కాదు; ఒకానొక భాగవతోత్తముణ్ణి. అది గ్రహించలేకపోవటంవల్లనే, నువ్వీ అత్యాచారానికి పూనుకున్నావు' అని తెలియపరచాడు.

నారదుని పలుకులువిన్న మహేంద్రుడు అమితంగా లజ్జించాడు. అది కారణంగానే, ఆయన, ఆ వెంటనే, మా అమ్మను అక్కడే వదలి, వెళ్ళి పోయినాడు. ఆ తరువాత, నారదమహర్షి, మా అమ్మమీద పుత్రికాభావం వహించి, ఆమెను తన ఆశ్రమానికి తీసుకుపోయి, 'అమ్మా! నీ భర్త తన తపోమహిమవల్ల కృతార్థుడై రాబోతున్నాడు. అందాకా నువ్వు ఇక్కడే ఉండవలసింది' అని చెప్పి, ఆమె నందుకు సమ్మతింప చేశాడు. కాలక్రమాన, ఆమె గర్భంలో ఉన్న నన్నుద్దేశించి, ఆధ్యాత్మికమైన అనేక విషయాలు ఆమెకు బోధించాడు.

వాటిని విని చాలాకాలం కావటంవల్లా, అందులోనూ, ఆడుది అవటంచేతా, ఆ ఉపదేశాన్ని మాతల్లి మఱచిపోయింది. కాని, ఆ దేవర్షి దయవల్ల, నాకుమాత్రం అవి మఱపుకు రాలేదు. సర్వ శ్రేయోదాయకమైన వాటినే, నేను, మీకు బోధించా లనుకుంటున్నాను."

ఆ విధంగా విశదపరచిన అతనిని అనుసరించటానికి, దానవ కుమారులందరూ అంగీకరించారు. అది గ్రహించిన ప్రహ్లాదుడు, వారి కిలా బోధించాడు.

"ప్రపంచంలో, సాధారణంగా మనం చేసే పనులన్నిటికీ,అజ్ఞానమే మూలంగా ఉంటుంది. దాన్ని దగ్ధం చేసుకోవటానికి మనందరం ప్రయత్నించాలి. అది మనధర్మం. ఆ ధర్మాను ష్ఠానానికి, అనేక మార్గాలున్నై. వాటిలో, భగవ ద్భక్తి అనేది ఉత్తమోత్తమమైన మార్గం.

గురు శుశ్రూష చేయటం, లభించినదాన్ని భగవంతున కర్పించటం, సాధుజనులతో కలసి

మెలసి ఉండటం,పరమేశ్వరుని ఆరాధించటం, హరివైనగాథలు వినటానికీ, ఆయన గుణకర్మలను కీర్తించటానికీ, ఆయనమూర్తినిదర్శించి పూజన వందనాదులు చేయాటానికీ ఆసక్తిని పెంపొందించుకోవటం, సర్వభూతాలలోనూ ఈశ్వరుని దర్శించటం మొదలయినధర్మాలను అనుష్ఠించటంద్వారా, ప్రాణులు కామక్రోధాది అరిషడ్వర్గాలను జయించటం జరుగుతుంది. అది కారణంగా, వారికి ఇంద్రియ విజయం సిద్ధిస్తుంది. ఇంద్రియ విజయం సిద్ధించినవారికి అనన్యభక్తి ప్రాప్తిస్తుంది.

భక్తిప్రభావం ఇంతా అంతా అని చెప్పటానికి వీల్లేదు. పరమ భక్తులయినవారు, శ్రీహరి నామం చెపులపడగానే పులకిస్తారు. వారి కళ్ల వెంట ఎప్పుడూ హర్షాశ్రులు రాలుతూ ఉంటై. వారు, అనవరతం, శ్రీమన్నారాయణుని ఉద్దేశించి, 'గోవిందా!' 'గోపాలా!' 'కృష్ణా!' శ్రీ హరీ, అని, గద్గద స్వరంతో పలుకుతూ ఉంటారు. ఆ దేవదేవుని లీలావిశేషాలనే పాడుతూ ఉంటారు; ఆక్రోశిస్తూ ఉంటారు. చింతనం చేస్తూ ఉంటారు. ఆయన్ని తలచుకుని నమస్కరిస్తూ ఉంటారు. తమలోతాము ఏమేమో మాట్లాడుకుంటూ, దేవతలు ఆవేశించినవారిమాదిరి చరిస్తూ ఉంటారు. ఆ విధంగా ఉండటంవల్ల, వారి అజ్ఞానం తొలగిపోవటం, భవబంధాలు తెగి

పోవటం జరుగుతుంది. అది కారణంగానే వారికి విష్ణుపదం ప్రాప్తిస్తుంది.

భార్య, బిడ్డలు, బంధుమిత్రులు, గృహారామాది సంపదలు మొదలైన అర్థ కామాలన్నీ అశాశ్వతమైనవే. అయినా, వాటివల్ల, క్షణికమైన సుఖం లభించటం మాత్రం సహజం. అదే విధంగా, యజ్ఞ యాగాది క్రతువులద్వారా లభించే స్వర్గాది భోగాలు కూడా అనిత్యమైనవే. నిత్యమైనది విష్ణుపదమొక్కటే. ఆ విష్ణుపదాన్ని పొందటానికి, దేవతలూ, దైత్యులూ, మానవులూ అందరూకూడా అర్హులే.

హరిని మెప్పించినవారందరూ విష్ణుపదాన్ని పొందగలుగుతారు. ఆ హరి, వ్రత క్రతు దాన ధర్మాదులవల్లగాని, శౌచ, శీల తపాదులవల్లగాని సంతుష్టి చెందడు. ఆయనను సంతోషపరచగలది నిర్మలమైన భక్తి ఒక్కటే. భక్తివల్ల మెప్పించినట్లుగా, భూదేవత్వంవల్లగాని, దేవత్వంవల్లగాని, శాంతత్వం వల్లగాని ఆయన్ని మెప్పించటం అసంభవం.

జగమంతా విష్ణుమయమని విశ్వసించిన వారు, ఎంతటి పాపజీవనులయినా, ముక్తిని పొందితీరుతారు.

ఆ ముక్తిపథానికి మాత్రం దారిచూపకుండా, మన గురువులు, మనకు, చీకటిదారులెన్నో చూపిస్తున్నారు. వాటివల్ల, మనం, వారికి లోబడి ఉండటం మాత్రమే జరుగుతుంది. దాన్ని, మనం, నిరసించి తీరాలి.

తెం డెల్ల పుస్తకంబుల
నిం డాచార్యునకు మరల నేకతమునఁ గాన్
రండు విశేషము సెప్పెద
భొం డొల్లనివారు కర్మపుంజముపాలై.

ఆడుదము పనము హరిరతి
బాడుద మేప్రొద్దు విష్ణు భద్రయశంబుల్
వీడుదము దనుజసంగతి
గూడుదము ముకుందభక్తకోటిఁ సూటిఁ.

విత్తము సంసృతిపటలము
వ్రత్తము కామాది వైరి వర్గంబుల నే
డిత్తము చిత్తము హరికిని
జొత్తము నిర్వాణపదము శుభమగు మనకుఁ"

ప్రహ్లాదుడు ఆ విధంగా బోధించినమీదట, రాక్షసబాలురందరూ, గురువులు చెప్పే చదువులన్నీ వదలి, హరిభక్తిపారవశ్యంతో మెలగటం మొదలుపెట్టారు. అదిగ్రహించిన చండామర్కులు, అమితంగా భయపడి పోయినారు. అప్పుడు తాముచేయగలదేమీలేక, వారు, ఆ వెంటనే, మహారాజైన హిరణ్యకశిపునివద్దకు వెళ్ళారు. వెళ్లి...

"రక్షోబాలురనెల్ల నీ కొడుకు సేరంజీరి లోలోన మా
శిక్షామార్గములెల్ల గల్లలని యాక్షేపించి తా నందఱఁ
మోక్షాయత్తుల జేసినాడు మనకుఁ మోసంబువాటిల్లె నీ
దక్షత్వంబున జక్కజేయవలయుఁ దైతేయవంశాగ్రణీ"

అని, అక్కడి పరిస్థితినంతనూ విన్నవించుకున్నారు. ఆ పలుకులువిన్న హిరణ్యకశిపుడు ఉగ్రుడైనాడు. ఆ ఆగ్రహావేశంలో, అతనికి ఉచితానుచితాలు తోచలేదు. కుమారుడు బాలుడనీ, శాంతగుణప్రధానుడనీ సంశుద్ధచిత్తుడనీ, జ్ఞానమూర్తి అనీ, పరమ భక్తాగ్రేసరుడనీ, దండనకు

అనర్హుడనీ అతడు ఆలోచించలేదు. అతణ్ణి తీవ్రంగా శిక్షించటం, తద్వారా తన మార్గానికి త్రిప్పుకోవటం అన్నవే తనలక్ష్యాలుగా ఆయన భావించాడు. ఆ అహంకారంతోనే, ఆయన, ప్రహ్లాదునిదిక్కైగా ఇలా అన్నాడు.

"కులనాశకుడా! నీకు మరణకాలం ఆసన్నమయినట్టుంది. సూర్య చంద్రాదులూ, వాయువూ, అగ్ని భట్టారకుడూ, యముడూ, ఇంద్రాది దేవతలూ, యక్షకిన్నర గంధర్వ విద్యాధరాదులూ, వీరు వారని లేకుండా అందరూ, నా ఆదేశానికి భిన్నంగా వ్యవహరించటానికి భయపడ తారు. అది తెలిసికూడా నువ్వు,నా ఆజ్ఞను ధిక్కరించి, నాకు ఆజన్మ విరోధి అయిన వైకుంఠుని పాదాల నాశ్రయించావు. మనవంశాచారాలను మన్నుపాలు చేశావు. కులద్రోహివి నిపించుకున్నావు. ఇక, నిన్ను సంహరించి, నా కుల గౌరవాన్ని నిలువుకోవటమే నాకు శరణ్యం మనిపిస్తోంది.

నేను, నా భుజబలంతో, దిక్కులన్నిటినీ గెలిచాను. దిక్పతుల నందరినీ దాసానుదాసులను చేసుకున్నాను. వారందరూ కూడా, వేరు దిక్కులేదని నిర్ణయించుకుని, 'నువ్వే మాకు దిక్కు' అని, నన్ను కొలు స్తున్నారు. కాని, నీకు దిక్కెవరో నాకు తెలియకుండా ఉంది. నువ్వు, ఎవరి బలం అండగా చూసుకుని నన్ను తిరస్కరిస్తున్నావో, నాకు అర్థంకాకుండా ఉంది."

ఆ విధమైన అహంకారంతో పలికిన హిరణ్యకశిపునకు సమా ధానంగా, ప్రహ్లాదుడు యిలా నివేదించుకున్నాడు.

"బలయుతులకు దుర్బలులకు,
బలమెవ్వడు, నీకు నాకు బ్రహ్మాదులకున్
బలమెవ్వడు, ప్రాణులకును
బలమెవ్వం, డట్టి విభుడు బల మసురేంద్రా!

దిక్కులు గాలముతో నే
దిక్కన లేకుండు కలుగు దిక్కుల మొదలై
దిక్కుగల లేనివారికి
దిక్కయ్యేడువాడు నాకు దిక్కు మహాత్మా!

లోకము లన్నియున్ గడియలోన జయించినవాడ, వింద్రియా
నీకము జిత్తముఁ గెలువనేరవు, నిన్ను నిబద్ధుజేయు నీ
భీకరశత్రు లార్వుర ప్రభిన్నులజేసిన, ప్రాణికోటిలో
నీకు విరోధి లే డొకడు, నేర్పునజూడుము, దానవేశ్వరా !

పాలింపుము శేముషి, ను
న్మూలింపుము కర్మబంధముల, సమదృష్టిం
జాలింపుము సంసారము,
గీలింపుము హృదయమందు గేశవభక్తిఁ!"

అలా నిర్భయంగా తనకు ఉపదేశించిన ప్రహ్లాదునిపట్ల హిరణ్య కశిపునకు, పట్టరానికోపం వచ్చింది. దానవేశ్వరుడయిన తనకు కుమారుడై జన్మించి, తనకు భయపడి దాక్కున్నవాడూ, దానవాంతకుడని పేరుపొందిన వాడూ అయిన నారాయణుని ఆశ్రయించటంద్వారా, ప్రహ్లాదుడు దండ నార్హుడై నాడని, ఆయన నిర్ణయించుకున్నాడు. అందుకనే, అమితమైన రోషంతో...

"నాతోడం బ్రతిభాషలాడెదు జగన్నాధుండ నాకంటె నీ
భూతశ్రేణికి రాజులేడొకడు సంపూర్ణ ప్రభావుండు, మ
ద్భ్రాతం జంపిన మున్ను నే వెదకితిం బల్మారు నారాయణుం
డే తద్విశ్వములోన లేడు మరి వా డెందుండురా దుర్మతీ !"

అని, భీకరంగా గర్జించాడు. అంతేకాదు.

'ఎక్కడగల డే క్రియ నే
చక్కటి వర్తించు నెట్టి జాడను వచ్చుం

ఒక్కఁడతు నిన్ను విష్ణుని
బెక్కులు ప్రేలెదవు వాని భృత్యుని పగిదిన్'

అనికూడా హుంకరించాడు.

ఆ పలుకులు విన్న ప్రహ్లాదుని శరీరం పులకితమయింది. ఆ వెంటనే, అతడు, శ్రీహరిని స్మరించుకున్నాడు. నమస్కరించాడు. ఆనంద పారవశ్యం పొందాడు. ఆ పైన, తనతండ్రిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"కల డంభోధి గలండు గాలి గల డాకాశంబునం గుంభినిం
గల డగ్నిన్ దిశలం బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం
గల డోంకారమునం ద్రిమూర్తుల ద్రిలింగ వ్యక్తులం దంతటం
గల డీశుండు గలండు తండ్రి వెదుకంగా నేల యీయాయెడన్ !

ఇందుగల డందులేడను
సందేహము వలదు చక్రి సర్వోపగతుం
డెందెందు వెదకి చూచిన
నందందే గలడు దానవాగ్రణి వింటే !"

అలా నిస్సంకోచంగా పలికిన ప్రహ్లాదునిచూసి, హిరణ్యకశిపుడు ఆగ్రహావేశ పరవశుడయినాడు. ఆ పరిస్థితిలో, అతను ఏమిచేసినా చేయ వచ్చునన్న అభిప్రాయంతో, సభాసదులందరూ గజగజలాడిపోయినారు. అది గ్రహించిన శ్రీహరి, ప్రహ్లాదుని పలుకులు వమ్ముకాకుండా చూసే ఉద్దేశంతో, తనకు పరమ భక్తుడైన అతణ్ణి కాపాడుకునే అభిప్రాయంతో, ఆ సభాస్థల మందంతటా, ప్రత్యణువులోనూ, నరసింహాకృతితో నిండి, నిగూఢంగా ఉండిపోయినాడు. అది తెలియలేని అసురాధిపతి, ప్రహ్లాదుని దిక్కై...

'డింభక సర్వస్థలముల
నంభోరుహనేత్రు డుండుననుచు మిగుల సం
రంభంబున బలికెద వీ
స్తంభంబున జూపగలవె చక్రిన్ గ్రిక్రిన్ !'

అని, సూటిగా ప్రశ్నించాడు. ఆయనకు సమాధానంగా, ప్రహ్లాదుడు...

'అంభోజాసనుడాదిగాగ దృణపర్యంతంబు విశ్వాత్ముడై
సంభావంబున నుండు ప్రోడ విపుల స్తంభంబునందుండడే,
స్తంభాంతర్గతుడయ్యు నుండుటకు నే సందేహముల్ లేదు,ని
ర్దంభత్వంబున నేడు గాసబడు బ్రత్యక్ష స్వరూపంబునన్'

అని విన్నవించుకున్నాడు. ఆ వెంటనే, హిరణ్యకశిపుడు, తన గద్దెమీదినుంచి క్రిందికి దూకి, ఒరలోని ఖడ్గాన్ని పెఱికి, దానితో, తన ఎదుటఉన్న స్తంభాన్ని అదిచాడు.

ఆ కత్తివేటు సోకగానే, ఆ స్తంభం, భీషణనాదంచేస్తూ, కన్నులు మిఱుమిట్లుకొలిపే వెలుగులుచిమ్ముతూ, బీటలువాఱిపోయింది. ఆ వెలుగులోనుంచి, శ్రీ మన్నారాయణుడు, పూర్తిగా నరమూర్తి కాకుండా, కేవలం హరిమూర్తి కాకుండా, నరహరిరూపంలో వెలుపలికి ఉఱికాడు.

అలా ఉఱికిన నరసింహాకృతిని చూసి, హిరణ్యకశిపుడు, అమితాశ్చర్యం పొందాడు 'హరి ఉట్టి మాయావి'అన్న తన అభిప్రాయాన్ని దృఢపరచుకున్నాడు. తనకు, మరణ సన్నమైన దని తేల్చుకున్నాడు. అప్పటికైనా, ఆ రూపంలో అయినా, తన ఎదుటపడ్డ ఆ హరిని ప్రతి ఘటించి నిర్జించటం ద్వారా, తన ఆశయాన్ని సిద్ధింప చేసుకోవాలను కున్నాడు. అందుకనే, గదను తీసుకుని, ఆ భీకరమూర్తితో తలపడ్డాడు. అప్పుడు జరిగిన పోరులో...

పంచాననోద్ధూత పావకజ్వాలలు
భూనభోంతరమెల్ల బూరితముగ
దంష్ట్రాంకురాభీల ధగధగాయితదీప్తి
నసురేంద్రు నేత్రము లంధములుగ

గంటకసన్నిభోత్కట కేసరాహతి
నభ్రసంఘము భిన్నమై చలింప
బ్రళయార్క చంచల ప్రతిమ భాస్వరములై
ఖరనఖ రోచులు గ్రమ్ముదేర

సటలు జళిపించి గర్జించి సంభ్రమించి
దృష్టిసారించి బొమలు బంధించి కెరలి
జిహ్వ యాడించి లంఘించి చేత నొడిసి
పట్టె నరసింహు డా దితిపట్టి నపుడు.

అలా పట్టుకుని, అతణ్ణి తన తొడలమీదపడుకో పెట్టుకుని, అతని శరీరాన్ని గోళ్ళతో చీల్చాడు. రక్తాన్ని వర్షించాడు. కండరాలను ముక్కలు ముక్కలుచేస్తూ, ప్రేవులను మాలలుగా ధరిస్తూ అతి భీకరంగా గర్జింప సాగాడు.

ఆ విధంగా రాక్షసేశ్వరుని సంహరించి, అతని అనుచరవర్గాన్ని హతమార్చి, మహాభయంకరుడై ఉన్న శ్రీనృసింహునివంక తేరిచూడటానికి కూడా అప్పుడు ఎవరూ సాహసించలేకపోయినారు. అంతలో, బ్రహ్మ రుద్రేంద్రాదులూ, మహర్షులూ, యక్ష కిన్నర కింపురుష గంధర్వాదులూ, దివ్యవిమానాలమీద, అక్కడికి వచ్చారు. వచ్చి, నరకేసరి రూపంలో, ఉగ్రుడై ఉన్న శ్రీమన్నారాయణుని, పలువిధాల ప్రస్తుతించారు. ధర్మ దూరుడయిన దానవేశ్వరుని వధించి, ముల్లోకాలకూ శాంతి చేకూర్చినందుకు, ఆయనకు పదేపదే ప్రణామాలర్పించుకున్నారు. ఆపైన, వారందరు కలసి, అప్పుడు ఆయన్ని శాంతింపచేసే మార్గంకోసం యెంతగానో ఆలోచించారు. కాని, అది ఫలించలేదు. ఆ సమయంలో ఆయన్ని సమీపించటానికి చివరకు, లక్ష్మీదేవికూడా భయపడ్డది. అది గ్రహించిన చతుర్ముఖుడు, ప్రహ్లాదుని, దగ్గరకు తీసుకుని, 'నాయనా ! లోకకంటకుడయిన నీ తండ్రిని సంహరించటానికే శ్రీమన్నారాయణుడు యిలా అవతరించవలసివచ్చింది.

ఆయన ఇప్పుడు ఉగ్రుడై ఉన్నాడు. ఆయన్ని శాంతింపచేయగలశక్తి, పరమభాగవతుడవైన నీకు తప్ప మా కెవ్వరికీ లేదు. నువ్వు, ఆయన్ని సమీపించి, ఆ ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకునేటట్టు చూడవలసింది' అని ప్రతిమాలుకున్నాడు.

ఆ వెంటనే, ప్రహ్లాదుడు, శ్రీనృసింహునకు సాష్టాంగప్రణామం చేశాడు. అది గ్రహించి...

ప్రాభవమొప్ప నుత్కట కృపామతియై కదియంగజీరి సం
శోభిత దృష్టిసంఘముల జూచుచు బాలుని మౌళియందు లో
కాభినుతుండు వెట్టె నసురాంతకు దుద్భట కాలసర్పభీ
తాభయదాన శస్తము ననర్ఘళమంగళ హేతు హస్తమున్.

ఆ విధంగా హరికరస్పర్శనందిన ప్రహ్లాదుని శరీరం ఒక్కసారిగా పులకించింది. అంతవరకు అతనిలో ఉన్న భయంకాస్తా హరించిపోయింది. అతనికి బ్రహ్మజ్ఞానం కలిగింది. ఆ వెంటనే, అతను, శ్రీనృసింహుని సమీపించి, ఆయన చరణకమలాలను తన హృదయంలో నిలుపుకుని, కేల్మోడ్చి, ఇలా వినుతించాడు.

"పరమేశ్వరా ! జ్ఞానసంపన్నులయిన మహర్షులూ, సత్త్వగుణ ప్రధానులయిన బ్రహ్మాది దేవతలూ కూడా నీ మాహాత్మ్యాన్ని సంపూర్ణంగా గ్రహించలేరు. నిన్ను సమగ్రంగా స్తుతించలేరు ; నిన్ను ప్రసన్నుని చేసుకోలేరు.

తపో దాన విజ్ఞాన యజ్ఞాదులవల్లగాని, వ్రత నియమాదుల మూలంగా గాని, అధికార బల పౌరుషాదులద్వారాగాని నిన్ను సంతుష్టి పరచటం అసంభవం; నీ ప్రేమకు పాత్రులు కావటం దుర్ఘటం. అయినా, నువ్వు, భక్తివినా అన్యగుణంలేని నన్ను అనుగ్రహించావు. అందుకు, నేను నీకు సర్వదా కృతజ్ఞుణి.

శ్రీ మహిళామహేశ ! సరసీరుహగర్భులకైన నీ మహో
ద్దామకరంబుచే నభయదానము సేయవు, నేను బాలుడం,

దామసవంశ సంభవుఁడ. దైత్యుఁడ, నుగ్రరజోగుణుండ, ని
స్సీమదయం గరాంబుజము శీర్షము జేర్చుట చోద్యమీశ్వరా !

మాధవా! నీ సుందర లీలావతారాలు, నీ భక్తులకు ఆత్మ సుఖాన్ని చేకూర్చేవిగా ఉండాలిగాని, భీతావహమైనవిగా ఉండరాదని భావిస్తున్నాను. కాని, ప్రస్తుతం, నువ్వుపొందిన నరకేసరి రూపం, నీ సేవకులమైన మమ్మేకాదు; నీ అర్ధాంగి అయిన శ్రీమహాలక్ష్మినికూడా భయపరచేదిగా ఉంది. నిర్మలాత్ముడవైన నీకు అది ఉచితం కాదేమో అనుకుంటున్నాను.

లోకభీకరుడయిన రాక్షసేశ్వరుని సంహరించే నిమిత్తం నువ్విలా అవతరించావని నేను విశ్వసిస్తున్నాను. నువ్వు సంకల్పించిన కార్యం నెరవేరిందనికూడా నేను భావిస్తున్నాను. ఇక నువ్వు శాంతించి, నీ భక్తులమైన మా భయాన్ని తొలగించాలి; మాకు ఆనందాన్ని సమకూర్చాలి.

భక్తవత్సలా ! నేను నిన్నే నమ్ముకున్నాను. నీ అనుగ్రహాన్నే అర్థిస్తున్నాను. తండ్రీ !

ఖరదంష్ట్రి భ్రుకుటీ సటానఖయు నుగ్రధ్వానయున్ రక్తకే
సరయున్ దీర్ఘవరాంత్రమాలికయు భాస్వన్నేత్రయునైన నీ
నరసింహాకృతి జూచి నే వెఱవ; ఘూర్ణ క్రూర దుర్వార దు
ర్భర సంసార దవాగ్నికిన్ వెఱతు, నీ పాదాశ్రయుం జేయవే !

దేవాదిదేవా ! నన్ను నీ భృత్యకోటిలో చేర్చుకోవలసింది. నాకు అనన్యమైన భక్తిని అనుగ్రహించవలసింది; నిరంతరం నిన్ను సేవించుకుంటూ ఉండే భాగ్యాన్ని ప్రసాదించ వలసింది.

కామహర్షాది సంఘటితమై చిత్తంబు
భవదీయ చింతనపదవి సొరదు
మధురాది రసములమరగి చొక్కుచు జిహ్వ
నీ వర్ణనమునకు నిగుడనీదు

సుందరీ ముఖముల జూడ గోరెడి చూడ్కి
　　తావకాకృతులపై దగులువడదు
వివిధ దుర్భాషలు వినగోరు వీనులు
　　వినవు యుష్మత్కథావిరచనములు
ఘ్రాణ మురవడి దిరుగు దుర్గంధములకు
దనివిగొలుపదు వైష్ణవ ధర్మములకు
నడగియుండవు కర్మేంద్రియములు, పురుష
గలచు సవతులు గృహమేధి గలచునట్లు.

ఈ విధంగా ఇంద్రియాలకు చిక్కుపడి, కష్ట సుఖా లనుభవిస్తూ, జనన మరణ రూపమైన సంసారచక్రంలో పరిభ్రమించే ప్రపంచాన్ని ఉద్ధరింపగలశక్తి, నీ ఒక్కనికే ఉంది. అందుకే, నేను, నిన్ను ఆశ్రయించాను. నాయనా!

నీ గృహాంగణభూమి నిటలంబు మోవంగ
　　మోదించి నిత్యంబు మ్రొక్కదేని
నీ మంగళస్తవ నికరవర్ణంబులు
　　పలుమారు నాలుక బలుకదేని
నీ యధీనములుగా నిఖిలకృత్యంబులు
　　ప్రియభావమున సమర్పింపదేని
నీ పదాంబుజముల నిర్మలహృదయుడై
　　చింతించి మక్కువ జిక్కదేని

నిన్ను జెవులార వినదేని నీకు సేవ
సేయరాదేని, బ్రహ్మంబు జెందగలడె,
యోగియైన, దపోవ్రత యోగియైన,
వేదియైన, మహాతత్త్వ వేదియైన.

తండ్రీ ! అది కారణంగానే, నీ దాస్యయోగాన్ని నాకు ప్రసాదించవలసిం దనీ, నన్ను ధన్యుని చేయవలసిందనీ ప్రార్థిస్తున్నాను."

అలా ప్రార్థించిన ప్రహ్లాదుని, భక్తవరదుడు అనుగ్రహించాడు. ఆ వెంటనే, అతణ్ణి ఉద్దేశించి...

'సంతోషించితి నీ చరిత్రమునకున్ సద్భద్రమౌగాక నీ
యంతర్వాంఛితలాభమెల్ల గరుణాయత్తుండనై యిచ్చెదం,
జింతంజెందకు భక్తకామదుడ నే సిద్ధంబు దుర్లోక్యడన్
జంతుశ్రేణికి నన్ను జూచిన బునర్జన్మంబు లే దర్భకా !'

అన్నాడు. అంతేకాదు. "నాయనా ! అఖిలశ్రేయాలకూ ప్రభుడనైన నన్ను, సాధులూ విద్వాంసులూ కూడా, వివిధమైన కోర్కులుకోరుతూ ఉంటారు; సఫలులవుతూ ఉంటారు. నువ్వుకూడా, నీ కిష్టమైన కోరిక యేదో ఒకటి కోరుకోవలసింది," అని, అతని మనఃప్రవృత్తిని పూర్తిగా తెలుసుకునే నిమిత్తం, అన్నాడు.

ప్రహ్లాదుడు నిష్కాముడు. పరమ భక్తుడు. అందుకనే, ఆయ నకు, ఇలా విన్నవించుకున్నాడు.

"స్వామీ ! కామమనేది సంసారానికి బీజంవంటిది. హృదయానికి బంధనంవంటిది. అందుకనే, నేను, ముముక్షుడనై నిన్ను ఆశ్రయించాను. నా హృదయాన్ని గ్రహించవలసింది. కామమనేది నాలో లేకుండా చేయ వలసింది."

అది విన్న శ్రీమన్నారాయణుడు అమితానందం పొందాడు. అది కారణంగానే...

"నీ యట్టి సుజ్ఞాన నిపుణు లేకాంతులు
కోర్కులు నాయందు గోరనొల్ల

రటుగాన బ్రహ్లాద యసురేంద్ర భర్తవై
సాగి మన్వంతర సమయమెల్ల

నిఖిలభోగంబులు నీవు భోగింపుము
కళ్యాణ బుద్ధి నా కథలు వినుము

సకలభూతములందు సంపూర్ణుడగు నన్ను
యజ్ఞేశు నీశ్వరు నాత్మ నిలిపి

కర్మచయములెల్ల ఖండించి పూజన
మాచరింపు మీశ్వరార్పణముగ
భోగముల నశించు పుణ్యంబు; వ్రతముల
బాప సంచయములు పాయు నిన్ను.

అలా చేయటంవల్ల నువ్వు ముక్తబంధుడవౌతావు. ముల్లోకాలకూ పూజనీయుడవౌతావు. నీ కీర్తి స్థిరతరమవుతుంది. కాలక్రమాన, నువ్వు, యీ కళేబరాన్ని త్యజించి, నన్ను చేరుకుంటావు."

ఆ విధంగా ప్రసన్నుడై పలికిన శ్రీహరి నుద్దేశించి, ప్రహ్లాదుడు, తిరిగి ఇలా విన్నవించుకున్నాడు.

"వరప్రదాతా ! నువ్వు, మా పినతండ్రి అయిన హిరణ్యాక్షుని సంహరించిన కారణాన, మా తండ్రి, నీమీద పగబట్టి, నీపట్ల అపచారం చేశాడు. ఆయన, రోషనిమగ్నుడు కావటంవల్ల, సర్వలోకేశ్వరుడవైన నిన్ను గాని, నీ తేజాన్నిగాని గ్రహించలేకపోయినాడు. నీ భక్తుడనైన నన్ను విరోధభావంతో చూసి, అనేకమైన ఇడుమలపాల్జేశాడు. దురంత దురితాల పాలయినాడు. ఆయనను ఆ పాపసంచయంనుంచి తొలగించి, ఆయనకు పావనత్వం చేకూర్చవలసింది."

ప్రహ్లాదుని సాధుభావాన్ని గ్రహించిన శ్రీహరి, అతనితో ఇలా అన్నాడు.

"నాయనా! నీవంటి భక్తాగ్రేసరుని కుమారునిగా పొందటంవల్లనే, నీ తండ్రి, పవిత్రుడయినాడు. నీ మూలంగా, అతడే కాదు; అతనిపూర్వులు కూడా పరమపావనులయినారు."

సత్పుత్రులను కన్నవారికి ఉత్తమ లోకాలు
ప్రాప్తించితీరుతై.

అదే, నీ పూర్వులకుకూడా సంప్రాప్తమయింది. ఇక నువ్వు, నిస్సంకోచంగా, నీ తండ్రికి, ప్రేతకార్యాలు నిర్వర్తించవలసింది; నా భక్తులకు, ఆదర్శప్రాయుడవై జీవించవలసింది."

అలా పరమశాంతచిత్తంతోపలికిన శ్రీహరిని, బ్రహ్మాదిదేవతలు, బహుధా ప్రస్తుతించారు. ఆ వెంటనే, శ్రీ నృసింహుడు, తిరోహితుడయినాడు; బ్రహ్మ రుద్రాదులుకూడా, ఎవరి నివాసాలకు వారు వెళ్ళిపోయినారు.

ఆ విధంగా, సనకాదులవల్ల శపింపబడ్డ జయ విజయులు, హిరణ్యాక్ష హిరణ్యకశిపులై పుట్టి, శ్రీహరిచేతిలో మరణించటం జరిగింది. అనంతరం, ప్రహ్లాదుడు, భూసురోత్తములచేత అభిషిక్తుడై, శ్రీమన్నారాయణుని ఆదేశానుసారం, అనేక వత్సరాలు రాజ్యపాలనం చేశాడు; కాలక్రమాన, విష్ణుపద మధిరోహించాడు.

## *46. భక్తి యోగం :*

మానవజీవితానికి పరమలక్ష్యం మాధవుని ప్రసన్నుని చేసుకోవటం. దానికి అనేకమార్గాలున్నై. కాని, వాటి అన్నిటిలోకీ, భక్తియోగం సులభమైన మార్గం.

బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రు లందరూ
కూడా, భక్తియోగాభ్యాసానికి అర్హులే. ఏ ఆశ్ర
మానికి చెందినవారైనా, ఆ పరమేశ్వరుని ఆరా
ధించవచ్చు; ఆయన ప్రేమకు పాత్రు లు
కావచ్చు.

మానవకోటికంతటికీ ఆచరణీయాలయిన కొన్ని ధర్మాలున్నై. ఎల్లప్పుడూ సత్యవచనాన్నే పలకటం, సర్వభూతాలపట్లా సమభావంతో మెలగటం, వివేచనాజ్ఞానంతో వ్యవహరించటం, అరిషడ్వర్గాలను జయించటం, అహింసా వ్రతాన్ని అవలంబించటం, ఇతర ప్రాణులపట్ల దయతో మెలగటం, దాన ధర్మాలు చేయటం, గురువులకు భక్తిగౌరవాలు చూపటం, సహన బుద్ధిని పెంపొందించుకోవటం, సంతుష్టితో జీవించటం, సర్వేశ్వరుని ఆరాధించటం మొదలయినవి, సర్వసాధారణమైన ధర్మాలు. వాటిని అనుష్టించటంద్వారా, ఇహ పరాలను రెంటినీ సాధించటం జరుగుతుంది.

అశాశ్వతమైన ఐహికభోగాలమీద ఆసక్తిని దూరం చేసుకుని, అంతర్దృష్టితో వ్యవహరించే వారికి, పరమశాంతి లభించితీరుతుంది. తుచ్ఛ భోగలాలసులయినవారికి, క్షణికసుఖాన్ని ఆసించి చరించేవారికి, శాశ్వతమైన దుఃఖం ప్రాప్తించి తీరుతుంది

అసంతుష్టిఅనేది అశాంతికి మూలం.సంతుష్టి లేని జీవితం దుఃఖభాజనంకాకతప్పదు. ఆ ప్రాణి కష్టించి పొందిన విద్యా, కీర్తీ, అన్నీ వ్యర్థమే అవుతై. అందుకనే, వివేకులయినవారు, దుఃఖ మూలమైన అసంతుష్టిని, ముందుగా త్యజిస్తారు. దానివల్ల, వారిలో, దురాశకు తావు లేకుండాపోతుంది. అది కారణంగా, వారు,

క్రోధదూరులు కావటం జరుగుతుంది. క్రోధాన్ని జయించటంవల్ల, వారు, నిర్భయులై చరించ గలుగుతారు.

ధ్యాననిష్ఠావలంబులు, మనస్సునూ, వాక్కునూ నియమించుకోవటం అవసరం. అలా నియమించుకున్నవారికి అన్యచింత ఉండదు. అది ఆధారంగా, వారు, భగవంతుని లోనే బ్రతుకటం సంభవిస్తుంది.

గార్హస్థ్యధర్మాన్ని అవలంబిస్తూకూడా, భగ వంతునిలో బ్రతుకటం సంభవమే. ఎప్పుడు యే కర్మ నాచరించినా, దానిని, దైవకార్యంగా భావించటం, ఎప్పటికి యేది లభిస్తే అది, దైవదత్తమనుకుని, దాన్ని, సంతుష్టితో అను భవించటం, అవకాశం ఉన్నంతవరకు, గురువు లనూ, అతిథులనూ అర్చించటం, విరామ సమయాల్లో, హరికథా శ్రవణం, హరినామ చింతనం చేయటం, భాగవతులను గౌరవిం చటం, వారి గోష్ఠినాసించటం, వారి అను భూతులు గ్రహించటం, మొదలయిన కార్యాలు, గృహస్థులందరకూ ఆచరణయోగ్యమైనవే. వాటివల్ల, ఒక విధమైన శాంతి లభిస్తుంది. అది ఆత్మజ్ఞానోపార్జనకు అనువైన మానసిక వాతావరణాన్ని కల్పిస్తుంది. దాన్ని పొందినప్రాణి, సక్రమమైన సాధనద్వారా, కాల క్రమాన, ముక్తిని సాధించటం జరుగుతుంది.

## 47. గజేంద్ర మోక్షణం :

ఏ కథలయందు బుణ్య
శ్లోకుడు హరి సెప్పబడును సూరిజనముచే,
నా కథలు పుణ్యకథలని
యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్.

అటువంటి పుణ్యకథలలో, గజేంద్రమోక్షణ మనే కథ ఒకటి.

పూర్వం, ఇంద్రద్యుమ్ను డనే ఒక రాజు ఉండేవాడు. ఆయన పరమభాగవతుడు. ఒకసారి, ఆయన, ధ్యానస్థితిలో ఉన్నప్పుడు, అగస్త్య మహర్షి, అక్కడకు రావటం జరిగింది.

మహారాజు, అది గ్రహించలేదు. అది కారణంగా, ఆ మహర్షికి, అతిథిసత్కారాలేవీ జరుగలేదు. అది, ఆయనకు, ఆగ్రహకారణమయింది. ఆ వెంటనే, ఆయన, ఆ మహారాజును ఉద్దేశించి, 'గజం మాదిరి స్తబ్ధుడవై ఉన్న నువ్వు, గజ జన్మ నెత్తవలసింది' అని శపించాడు.

ఆ శాపంమూలంగా, ఇంద్రద్యుమ్నుడు, కరీంద్రుడై జన్మించాడు. ఆయన భటులందరూ, కరిణీసంఘమై ఉద్భవించారు.

ఆ గజేంద్రుడు, ఒకసారి, క్షీరసాగరమధ్యంలోఉన్న త్రికూటగిరి ప్రాంతంలో విహరిస్తూ, అక్కడేఉన్న ఋతుమంతం అనే వరుణోద్యానంలో ప్రవేశించి, జలక్రీడార్థం, ఒక కొలనుకు వెళ్ళాడు. ఆ కొలనులో ఒక మొసలి ఉంది. అదికూడా సామాన్యమైనది కాదు.

పూర్వం, హూహూనామక గంధర్వు డొక డుండేవాడు. అత డొకసారి, ఒక కొలనులో, తన స్త్రీజనంతో జలక్రీడ సలుపుతూ ఉండగా, దేవలుడనే ఒక ముని అక్కడకు వచ్చి, స్నానార్థం అందులో ప్రవేశించాడు. అది చూసిన గంధర్వుడు, సవిలాసంగా నీటిలో మునిగి, ఆయన కాలు పట్టుకుని లాగాడు. అదిగ్రహించిన ఆ ముని, కోపగించుకుని, 'నువ్వు

మొసలివి కావలసింది' అని శపించాడు. అది కారణంగా, ఆ గంధర్వుడు మొసలి అయిపోయినాడు.

గజేంద్రుడు, కొలనులోదిగి, కరిణీసంఘంతో క్రీడిస్తూఉండగా, ఆ మొసలి, అతనికాలు పట్టుకుంది. దాని నుంచి తప్పించుకోవటానికి, గజేంద్రుడు యెంతగానో ప్రయత్నించాడు. కాని, లాభం లేకపోయింది. ఆ మొసలికూడా, తన శక్తినంతనూ వినియోగించి, ఆ గజేంద్రుని, లోపలికి ఈడ్చుకుపోజొచ్చింది. అది గ్రహించిన కరిణీసంఘం, చేయగలదేమీలేక, ఆక్రోశింపసాగింది.

ఆ సమయంలో, ఆ మొసలికీ గజేంద్రునికీ మధ్య, ఘోరమైన పెనుగులాట జరిగింది. అందులో, కరి మకరికిగాని, మకరి కరికిగాని ఏవిధంగానూ తీసిపోలేదు. అలా వేయేండ్లు గతించిపోయినై.

అప్పటికి, గజేంద్రుని శక్తి, చాలవరకు క్షీణించిపోయింది. మకరిబారినుండి తప్పించుకుని, బతికిబయటపడటం అసంభవమన్న అభిప్రాయం కూడా అతనికి కలిగింది. ఆ సమయంలో, పూర్వజన్మలో అతడు చేసిన హరిసేవమూలంగా, అతడిలో, ఒకవిధమైన దివ్యజ్ఞానం పొడచూపింది. అది కారణంగా, అతనికి, ఆపద్బాంధవుడయిన భగవంతుడు స్ఫురణకువచ్చాడు. ఆ వెంటనే, అతడు...

ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందు బరమేశ్వరు డెవ్వడు మూలకారణం
బెవ్వ డనాది మధ్య లయు డెవ్వడు సర్వము దానయైనవా
డెవ్వడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్'

అని నిశ్చయించుకున్నాడు; ఆ పైన యిలా ప్రార్థించాడు.

"ప్రభూ ! నేను నీ దాసానుదాసుణ్ణి. నీ మాయను గ్రహించేశక్తి నాకు లేదు. నువ్వు పరమపురుషుడవు. లోకాలను సృజిస్తూ

ఉంటావు; లయింపచేస్తూ ఉంటావు. అదంతా నీ లీల. నీ లీలను గ్రహించటంగాని, నీ వర్తనను అవగాహన చేసుకోవటంగాని, బ్రహ్మాదులకుకూడా అసంభవమే.

నువ్వు మహానటుడవు. వివిధరూపాలు ధరిస్తూ ఉంటావు. అఖిల లోకాలూ, లోకపాలురూ, లోకస్థులూ సమసిపోయిన తరువాత కూడా, నువ్వు ప్రకాశిస్తూనే ఉంటావు. నీ మంగళపదాన్ని వీక్షించే నిమిత్తం, ముక్తసంగులయిన మునులుకూడా అనితరదుర్లభమయిన వ్రతాల నవలంబిస్తూ ఉంటారు; అయినా, నిష్ఫలులవుతూనే ఉంటారు. నువ్వు నామ రూప రహితుడవు. నిన్ను గుర్తించటం, నీ అనంతశక్తిని గ్రహించటం, నావంటి పశువులకు సంభవం కాదు.

తండ్రీ ! నువ్వు దీనరక్షకుడవు. సర్వాంతర్యామివి. సర్వశక్తి సంపన్నుడవు. సర్వజ్ఞుడవు. నా స్థితినిగురించి, నీకు నేను ప్రత్యేకంగా వివరించుకోవలసిం దేమీ లేదు. అయినా, నా ధర్మంప్రకారం విన్నవించుకుంటున్నాను.

లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యె బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను మూర్ఛవచ్చె దనువున్ డస్సెన్ శ్రమంబయ్యెడిన్
నీవేతప్ప నితః పరంబెఱుగ మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర కావవే వరద సంరక్షింపు భద్రాత్మకా !"

అలా ప్రార్థించిన గజేంద్రుని దీనాలాపాలు, ఆ వైకుంఠపురంలో

ఆ దివ్యనగరిలో, ఆ మూలసౌధంలో శ్రీదేవితో వినోదిస్తున్న ఆపన్న ప్రపన్నుని చెవిసోకినదై. ఆ వెంటనే, ఆయన, ఆమెతో పల్లెత్తుమాటైనా పలుక కుండా, సల్లాపసమయంలో పట్టుకునిఉన్న ఆమె పైటకొంగునయినా వదల కుండా, శంఖ చక్రాదులను తీసుకోకుండా, పరివారాన్నయినా పిలువకుండా, అమాంతంగా అక్కడినుంచి బయలుదేరాడు. అది చూసిన లక్ష్మీదేవీ, ఆమెవెంట పరివారం, వారివెనుక పక్షీంద్రుడూ, అతని ననుసరించి శంఖ చక్రాలూ, నారదమహర్షీ, వీరు వారని లేకుండా, వైకుంఠపురంలో ఉన్న వారు, ఆబాలగోపాలం, ఆయన్ని అనుగమించాడు. అస లా సమయంలో, తనభర్త, ఆ విధంగా అలా మనోవేగంతో పరుగుతీయటానికి కారణ మేమిటో శ్రీదేవికూడా ఊహించుకోలేకపోయింది. అయినా...

'తన వెంచేయుపదంబు బేర్కొన డనాథస్త్రీజనాలాపముల్
వినెనో మ్రుచ్చులు మ్రుచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్
దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో భక్తులం
గని చక్రాయుధు డేడి చూపుడని ధిక్కారించిరో దుర్జనుల్'

అనిమాత్రం, తనలో తను తర్కించుకోసాగింది. ఆ దివ్యదృశ్యాన్ని వీక్షించిన దేవతలందరూ, 'ఓమ్ నమో నారాయణాయ' అని, ఏకకంఠంతో నినాదాలుచేశారు.

దేవతల నమస్కారపూర్వకమయిన నినాదాలు వింటూకూడా, శ్రీహరి, వారివంక చూడలేదు. వారిని ఏవిధంగానూ ఆదరించలేదు. మనసు నంతనూ, ఆ మకరికి చిక్కిన మత్తగజేంద్రునిమీదనే ఉంచుకుని, అతనిని రక్షించే ఉద్దేశంతో, చరచరా అటు వెళ్ళసాగాడు. అలా వెళ్ళివెళ్ళి. అత డున్న సరోవరం చేరుకున్నాడు. ఆ వెంటనే...

కరుణాసింధుడు శౌరి వారిచరమున్ ఖండింపగా బంపె స
త్వరితాకంపిత భూమిచక్రము మహోద్యద్విస్ఫులింగచ్ఛటా
పరిభూతాంబర శుక్రమున్ బహువిధ బ్రహ్మాండభాండచ్ఛటాం
తర నిర్వక్రము బాలితాఖిల సుధాంధశ్చక్రముం జక్రమున్.

అలా వెళ్ళిన సుదర్శనచక్రం, సరాసరి, సరోవరమధ్యంలో ఉన్న మకరిని సమీపించింది. మరుక్షణంలోనే దాన్ని నఱికివేసింది; ఆ సరోవర జలాన్నంతనూ రక్తపూరితం చేసింది.

సుదర్శనచక్రంద్వారా ప్రాణాలు వదలిన ఆ మకరిలోనుంచి, ఒక దివ్యతేజం బయటకువచ్చింది. అలా వచ్చిన తేజం, ఆ వెంటనే, ఒక గంధర్వుని రూపం ధరించటం, శ్రీహరికి మ్రొక్కి, ఆయన్ని బహుధా కీర్తించి, నిజలోకానికి వెళ్ళిపోవటం జరిగింది.

అనంతరం, శ్రీమహావిష్ణువు, కరీంద్రుని సమీపించి, అతని ఒళ్ళు నిమిరాడు. ఆ కరస్పర్శమూలంగా, గజేంద్రుని బడలిక అంతా తీరిపోయింది. అతనికి అపూర్వమైన శక్తి లభించింది. అతడు, జ్ఞానస్వరూపపూర్ణుడయినాడు; విష్ణురూపుడై వెలుగసాగాడు. అదంతా ప్రత్యక్షంగా వీక్షించిన శ్రీదేవి, శ్రీమన్నారాయణుని ఉద్దేశించి...

‘దీనుల కుయ్యాలింపను
దీనుల రక్షింప మేలు దీవనబొందన్
దీనావన నీ కొప్పును
దీనపరాధీన దేవదేవ మహేశా !’

అని ప్రస్తుతించింది. అది విన్న శ్రీహరి, మందహాసంచేశాడు. ఆమెను దగ్గరకు తీసుకున్నాడు. తన పరివారాన్ని పలుకరించాడు. ఆపైన, గరుడ వాహనారూఢుడై, తిరిగి తన నిజావాసానికి వెళ్ళిపోయినాడు.

### *48. క్షీరసాగర మథనం :*

దుర్వాసమహర్షి, ఒకసారి, ఐరావత మెక్కి వెడుతూఉన్న మహేంద్రుని చూసి, తన వద్ద ఉన్న పూలదండను, ఆయనకు సమర్పించుకున్నాడు. ఐశ్వర్యమదోన్మత్తుడైన మహేంద్రుడు, దాన్ని, నిర్లక్ష్యంగా, ఐరావతకుంభస్థలంమీద వేశాడు.

ఐరావతం, దాన్ని క్రిందపడేసి, కాలితో రాచ్చి కవ్వంగాచేసి, చిన దుర్వాసుడు, మహేంద్రుని దిక్కై, 'నువ్వు నిశ్రీకుడవుగాత, వాసుకి అని, అమితక్రోధంతో శపించాడు. ఆ శాపం కారణంగా, మహేనుక నిల తేజం తఱిగిపోయింది. వాసుకి

కాలక్రమాన, దేవతలుకూడా నిస్తేజులయినారు. ముల్లోకాలూ తమ శక్తిని కోల్పోయినై. ఆ సమయంలో జరిగిన దేవాసురయుద్ధంలో, దేవతలు పరాజితులయినారు. అదంతా గ్రహించిన మహేంద్రుడు, అమితమైన వేదన ననుభవించాడు. అప్పు డాయన, తన వేదనను తొలగించుకునే మార్గం, తన వారికి పూర్వవైభవాన్ని సమకూర్చే మార్గం, యేమిటా అని ఆలోచించసాగాడు. ఎంతగా ఆలోచించినా, ఆ మార్గమేమిటో ఆయనకు అంతుపట్టలేదు. అది కారణంగానే, ఆయన, కొందరు దేవతాప్రముఖులను తోడుతీసుకుని, చతుర్ముఖునితోసహా, వైకుంఠుని దర్శనార్థం వెళ్ళాడు. అలా వెళ్ళిన చతుర్ముఖాదులు, శ్రీమన్నారాయణుని అమితంగా స్తుతించారు. తమ పరిస్థితినంతనూ ఆయనకు నివేదించుకున్నారు; దేవతానీకానికి శ్రేయం కలిగించవలసిందిగా ఆయన్ని వేడుకున్నారు.

బ్రహ్మాదుల ప్రార్థన విన్న శ్రీమన్నారాయణుడు, వారిని, ప్రేమపూర్వకంగా చూశాడు. ఆపైన, వారికి అమృతత్వాన్ని సిద్ధింపజేసే ఉద్దేశంతో...

'అమృతోత్పాదన యత్నము
విమృష్టమతి సేయుటొప్పు వేల్పులు వినుడీ
యమృతంబుద్రావి జంతువు
లమృతగతిన్ బ్రతుకుచుండు నాయుర్వృద్ధిన్'

అని తెలియపరచాడు. అంతేకాదు.

'పాలమున్నీటిలోపల సర్వ తృణలతౌ
షధములు దెప్పించి చాలవైచి

అలార శైలంబు మంథానముగజేసి
మకరిని సపి̒ తనర వాసుకి దరి[త్రాడు సేసి
జలా న̒ నా సహాయంబున నలి నిందరును మీరు
తరువుడు వేగ మతం[దులగుచు

ఫలము మీదయ్యేడి బహుళ దుఃఖంబుల
బడుదురు దైత్యులు పాపమతులు

అలసదేమిలేక యఖిలార్థములు గల్గు
విషధిలోన నొక్క విషము పుట్టు
గలగి వెఱవవలదు కామ రోషంబులు
వస్తుచయమునందు వలదుచేయ'

అనికూడా బోధించాడు.

ఆ వెంటనే, దేవతలందరూ, దేవద్వేషి అయిన బలిని సమీపించి, క్షీరసాగరమథనానికి సాయపడవలసిందిగా అతణ్ణి అభ్యర్థించారు. అతికష్టం మీద ఆ పనికి అతణ్ణి ఒప్పించారు.

ఆ తరువాత, దేవ దానవులందరూ కలసి, మందరపర్వతాన్ని తీసుకువస్తూ ఉండగా, అదొకచోట పడిపోయింది. దాని[కిందపడి, సురాసురులెందరో హతులయినారు. మిగిలినవారు, తమ శక్తికి మించిన కార్యాన్ని తలపెట్టినందుకు తమ్ము తాము నిందించుకున్నారు. అక్కడినుంచి దాన్ని కదలించే శక్తి తమకు లేదని నిర్ధారించుకుని, శ్రీహరిని స్మరించుకుంటూ కూర్చున్నారు.

అంతలో, గరుడ వాహనారూఢుడూ, గదాధరుడూ అయిన శ్రీమన్నారాయణుడు, వారి యెదుట [ప్రత్యక్షమై, వారికి అభయ[ప్రదానం చేశాడు. మందరాచలాన్ని అవలీలగా ఎత్తి, గరుడుని మీద ఉంచి, వారందరితోనూ కలసి, క్షీరసాగరానికి వెళ్ళాడు; ఆ పర్వతాన్ని అందులో దించాడు.

అలా క్షీరసాగరం చేరిన మందరపర్వతాన్ని కవ్వంగాచేసి, దేవతలు, వాసుకిని దానికి తాడుగా ఏర్పరిచారు. ఆ తరువాత, వాసుకి ముఖభాగాన్ని శ్రీహరి గ్రహించటం, దేవతలందరూ, ఆయన వెనుక నిలబడి, దాన్ని పట్టుకోవటం జరిగింది. అది చూసిన దైత్యులు, ఆ వాసుకి ముఖభాగాన్ని దేవతలు పట్టుకోవటం, పుచ్ఛభాగాన్ని తమకు వదలటం, తమకు అవమానకరంగా భావించారు. అందుకనే, ఆ ముఖభాగం తమకు కావాలని పట్టుపట్టారు. అది చూసిన శ్రీహరి, ఉచిత వచనాలతో వారిని శాంతపరచి, వారు కోరినవిధంగా, ముఖభాగాన్ని వారికేవదలి, తను, తన వారితో, పుచ్ఛభాగానికి వెళ్ళాడు.

ఆ వెంటనే, సముద్ర మథనం ప్రారంభమయింది. కాని, ఆ మందరగిరికి ఆధారం ఏమీలేకపోవటంవల్ల, అది, నీటిలో మునిగిపోసాగింది. అది గ్రహించిన శ్రీహరి, తాను తలపెట్టిన కార్యం నిర్విఘ్నంగా కొనసాగాలన్న ఉద్దేశంతో, కూర్మరూపం ధరించి, ఆ జలరాశిలో మునిగి, ఆ పర్వతాన్ని తన వీపుమీద నిలువుకుని లేవనెత్తాడు. తిరిగి, దేవ దానవులు, సముద్రాన్ని మథించటం ప్రారంభించారు.

అలా చిలుకబడుతూఉన్న పాలవెల్లి నుంచి, కొంత సేపటికి, బ్రహ్మాండాన్ని బ్రద్దలుచేసే ఒక భయంకర శబ్దం బయలుదేరింది. అది విన్న అసురుల గుండెలు అవిసిపోయినై. అదలాఉండగా, ఫణిరాజైన వాసుకి, తన వేయి ముఖాలనుంచీ వదిలే శ్వాసానల ధూమం వల్ల, రాక్షసుల తేజం క్షీణించిపోసాగింది. ఆ వేడి, దేవతలకుకూడ కొద్దిగా సోకినా, వారు, భగవదనుగ్రహానికి పాత్రులు కావటంవల్ల, మేఘాలు వారిమీద వర్షించటం, వారికి ఏవిధమైన అపాయం కలుగకుండా చేయటం, జరిగింది.

ఆ పైన, ప్రప్రథమంగా, ఆ మహాసాగరంనుంచి, హాలాహలమనే విషం ఉద్భవించింది. ఆ విషాగ్ని, ముల్లోకాలనూ ఆవరించింది. అది చూసిన దేవ దానవులు, ఆ ఆపదనుంచి తమ్ము ఉద్ధరింపగల మహానుభావుడు

ఆ పరమశివుడొక్కడే అని నిశ్చయించుకున్నారు. అందుకనే, వారందరూ కలసి, కైలాసగిరిమీద ఉన్న పరమశివునివద్దకు వెళ్లారు; వెళ్లి, ఆయన్ని యిలా స్తుతించారు

"మహేశ్వరా! శరణాగతులమయిన మమ్మల్ని రక్షించవలసింది. విషాగ్నినుంచి మమ్మ కాపాడవలసింది.

మహాదేవా ! నువ్వు ముల్లోకాలకూ ఈశ్వరుడవు. ముల్లోకాలలోని బంధ మోక్షాలకు ప్రభుడవుకూడా నువ్వే. నువ్వు, సృష్టి స్థితి సంహార కర్తవై, క్రమంగా, బ్రహ్మవనీ, విష్ణుడవనీ, రుద్రుడవనీ పేర్కొనబడుతూ ఉంటావు.

నువ్వు సర్వశక్తిమయుడవు. సర్వభూతాలూ నీనుంచి జనిస్తై. నీలో వసిస్తై. నీలోనే లయం పొందుతై. నీ ఉదరమే వాటికి నిలయం. కాని, నిన్ను గుర్తించటం మాత్రం, ఎవరికీ శక్యం కాదు.

లంపటము నివారింపను
సంపద గృపసేసి జయము సంపాదింపన్
జంపెడివార్ని హరింపను
సొంపారగ నీక చెల్లు సోమార్ధధరా!

నీకంటె నొండెరుంగము
నీకంటెం బరులు గావ నేరరు జగముల్
నీకంటె నొడయ డెవ్వడు
లోకంబులకెల్ల నిఖిలలోకస్తుత్యా!"

ఆ విధంగా స్తుతించిన వారి నాలకించి, మహేశ్వరుడు, వారి వంక ఆదరపూర్వకంగా చూశాడు. ఆ పైన, తన ప్రాణేశ్వరి దిక్కై, ఇలా అన్నాడు.

"భవానీ ! వీరు, ఆర్తులై మనవద్దకు వచ్చారు. ఆర్తులైనవారి బాధలు నివారించటం సాధుపురుషుల ధర్మం. పరహితం కోరి చరించే

వారిని, పరమపురుషుడు రక్షించితీరుతాడు.

దేవ దానవులు అమృతాన్నాసించి, పాల్కడలిని మథింపసాగారు. కాని, అందులోనుంచి, హాలాహలం ఆవిర్భవించింది. అదిప్పుడు, ముల్లో కాలనూ కబళించేదిగా ఉంది. దాన్ని వారించి, లోకత్రయ రక్షణ చేయటం ద్వారా, శ్రీహరి సంతోషించటం జరుగుతుంది. ఆయన ఆనందిస్తే, ముల్లో కాలూ ఆనందిస్తై. అందుకనే, నేను, ఆ పనికి పూనుకోదలచాను."

సాధుజన సంతోషకరమయిన ఆ పలుకులు విన్న పరమేశ్వరి, పరమానందభరితురాలయింది. తనభర్త, హాలాహలాన్ని కబళించటానికే ఉద్యుక్తుడవుతున్నాడని ఆమెకు తెలుసు. హాలాహలాన్ని మింగటం అపాయకరమన్న విషయం ఆమెకు తెలియకపోలేదు. అయినా, ఆయన, ప్రజాక్షేమాన్ని ఆసించి, ఆ పని చేయబోతున్నాడు. అదీకాక, ఆయన, ఏపని చేయటానికయినా సమర్థుడు. ఆ అభిప్రాయంతోనే, ఆమె, తన మంగళ సూత్రప్రభావంమీది సంపూర్ణవిశ్వాసంతో, ఆయన నాపనికి ప్రోత్సహించింది కూడా. ఆ వెంటనే...

తనచుట్టున్ సురసంఘముల్ జయజయ ధ్వానంబులన్ బొబ్బిడఁ
ఘన గంభీర రవంబుతో శివుడు 'లోకద్రోహి, హుం, పోకు ర'
మ్మని కెంగేల దెమల్చి కూర్చి కడిగా నంకించి జంబూఫలం
బని సర్వంకషమున్ మహావిషము నాహారించె హేలాగతిన్

అలా స్వీకరించి...

ఉదరము లోకంబులకును
సదనంబగుటెఱిఁగి శివుడు చటుల విషాగ్నిం
గుదురుకొన గంఠబిలమున
బదిలంబుగ నిలిపె సూక్ష్మఫలరసముక్రియన్.

మహాదేవుడు హాలాహలాన్ని అలా గ్రహించటం చూసిన దేవ

దానవులందరూ అదలిపోయినారు. అయినా, ఆ మహానుభావునికి సంబం ధించినంతవరకు...

కదలంబాఱవు పాపపేరు లొడలన్ ఘర్మాంబు జాలంబు వు
ట్టదు నేత్రంబుల కెఱ్ఱ రాదు నిజజూటార్ధేందుడుం గందడున్
వదనాంభోజము వాడ దా విషము నాహ్వానించుచో డాయుచో
బదిలుండై కడిసేయుచో దిగుచుచో భక్షించుచో మ్రింగుచోన్.

అది గ్రహించిన శ్రీహరీ, చతుర్ముఖుడూ, మహేంద్రుడూ, మహా దేవుని అమితంగా ప్రశంసించారు. గరళాన్ని కంఠంలో నిలుపుకున్నవాడు కావటంవల్ల, అప్పటినుంచీ, మహేశ్వరుడు, గరళకంఠుడని వ్యవహరింప బడుతూ వచ్చాడు.

శంకరుడు హాలాహలాన్ని హరించినతరువాత, దేవాసురులు, తిరిగి సముద్రమథనానికి ఉపక్రమించారు. అలా వారు మథించగా మథించగా...

తెల్లని మేనును నమృతము
జిల్లున జల్లించు పొదుగు శితశృంగములుం
బెల్లుగ నర్థుల కోర్కులు
వెల్లికొలువు మొదవు పాలవెల్లిం బుట్టెన్.

అలా పుట్టిన కామధేనువును, దేవమునులు తీసుకున్నారు. ఆ తరువాత...

సచ్చంద్ర పాండురంబై
యుచ్చైశ్శ్రవమనగ దురగ మొగి జనియించెం
బుచ్చికొనియె బలిదైత్యుం
డిచ్ఛ్గగొనండయ్యె నింద్రు డీశ్వరశిక్షన్.

ఉచ్చైశ్శ్రవం తరువాత, ఆ పాలవెల్లినుంచి, నాలుగుదంతాలతో ఉండే, ఐరావతమనే ఏనుగు జనించింది. మహేంద్రుడు, దాన్ని, కోరి స్వీక రించాడు. ఆ పైన...

గుండలి వ్రజంబు గుండలముల నిచ్చె
శ్రుతులు భద్రమైన నుతులు సేసె
నెల్ల లోకములకు నేలికసానివై
బ్రదికెదనుచు దిశలు వలికె 'ప్రీతి'.

అలా సర్వవిధ బహుమానాలనూపొంది, సురలమధ్య దేదీప్యమానంగా ప్రకాశిస్తున్న ఆ శ్రీదేవిని చూసి, శ్రీహరి తప్ప మిగిలినవారందరూ చలించారు.

ఆ విధంగా తనచుట్టూఉన్న యక్ష రాక్షస సిద్ధ సాధ్యాదులనూ, గరుడ గంధర్వాదులనూ, దివిజులనూ, ఒక్కసారి పరిశీలనగా చూసి, వారి వారి వర్తనాదికాలను అవగాహన చేసుకుని...

'ఐదువనై యుండ నలవడ దొకచోట
నొకచోట సవతితో నోర్వరాదు
తగ నొకచోట సంతతవైభవంబుగా
దొకచోట వేడిమి నుండబోల
దొకచోట గరుణ లే దొక్కింత వెదకిన
నొకచోట దగ్గటి యుంట చెట్ట
నెమయంగ నొకచోట నిలుకడ సాలదు
చర్చింప నొకచోట జడత గలదు
కొన్నిచోట్లు కామగుణ గరిష్ఠంబులు
క్రోధ సంయుతములు కొన్నియెడలు
కొన్ని మోహ లోభ కుంఠితంబులు కొన్ని
ప్రమద మత్సరాను భావుకములు'

అని భావించి, శ్రీదేవి, ఆయా స్థలాలను పరిహరించింది. ఆ వెంటనే...

'అమర ముత్తైదువనై యుండవచ్చును
వరునకు సవతు లెవ్వరును లేరు

వెలయంగ నక్రాంత విభవ మీతని యిల్లు
శృంగార చందన శీతలుండు
కలగ డెన్నడు శుద్ధ కారుణ్యమయమూర్తి
విమలుండు గదిసి సేవింపవచ్చు
నెఱినాడి తిరుగడు నిలుకడ గలవాడు
సకల కార్యములందు జడత లేదు
సాధురక్షకుండు, షడ్వర్గ రహితుండు,
నాథుడయ్యేనేని నడపనోపు
నితడె భర్త యనుచు నింతి సరోజాక్షు
బుష్పదామకమున బూజసేసె.

అలా పూజించి, తన నివాసానికి ఆయనదైన వక్షోభాగం తగినస్థలమని భావించి, లజ్జతో, అటే ఓరగా చూడసాగింది. అది గ్రహించిన శ్రీమన్నారాయణుడు, అమితానందంతో, ఆమెను, సముచితంగా ఆహ్వానించి, తన వక్షస్థలాన నిలుపుకున్నాడు. ఆ సమయంలో ...

మ్రోసెన్ శంఖ మృదంగ వేణు రవముల్ మున్నాడి పెంజీకటుల్
వాసెన్ నర్తన గానలీలలు సురల్ భాసిల్లి రార్యుల్ జగ
ద్వ్యాసుల్ విష్ణుని బ్రహ్మ రుద్రముఖరుల్ దల్లింగమంత్రంబులం
బ్రాసక్తిన్ వినుతించి రుల్లసిత పుష్పశ్రేణి వర్షించుచున్.

ఆ విధంగా నారాయణుని చేరిన శ్రీదేవిని చూసి, సురలందరూ సంతోషించారు. ఆమె కరుణాకటాక్షవీక్షణలు ప్రసరించిన ప్రదేశమంతా ఆనందమయమైపోయింది. ఆమె చూపు సోకని రక్కసులు మాత్రం, అమితంగా వ్యాకులపడసాగారు.

సిరి పుట్టిన అనంతరం, ఆ పాలకడలినుంచి, వారుణి అనే ఒక కన్య ఉద్భవించింది. ఆమెను, వాసుదేవుని అనుమతిమీద, అసురులు స్వీకరించారు.

వారుణి తరువాత, నిఖిల వైద్యశాస్త్ర నిపుణుడయిన ధన్వం తరి, అమృతకలశంతో, పాల్కడలినుంచి బయటకువచ్చాడు. ఆ కల శాన్ని చూడగానే, అసురులకు అంతులేని ఆస పుట్టింది. ఆ వెంటనే, వారు, ధన్వంతరి చేతులోనుంచి, దాన్ని, బలాత్కారంగా తీసుకుని, దూరంగా వెళ్ళి పోయినారు. చావులేని మందు దొరికిందని అసురులు సంతోషిస్తూ ఉండగా, దేవతలు, శ్రీహరిని సమీపించి, తమ ప్రయత్నమంతా విఫలమై పోయిందని మొఱపెట్టుకోసాగారు. వారి దీనాలాపాలు విన్న శ్రీహరి, తన మాయాబలంద్వారా, దైత్య దానవులలో కలతలు కలిగించాడు. అది కారణంగా, వారిలోవారికి పోరాటం ప్రారంభమయింది. వారిలో దుర్బలు లయినవారు, బలవంతులయినవారిని చూసి, 'మీరు సురలకు అన్యాయం చేస్తున్నారు. వారికికూడా ఇందులో భాగం కల్పించటం న్యాయం' అని, సురల పక్షం వహించి వాదించ సాగారు. ఆ విధంగా, వారికి, సురల సానుభూతి లభించింది. అప్పుడు ప్రారంభమైన కలహంలో....

ఒకనిచేత నుండ నొకడు బలిష్ఠుడై
పుచ్చుకొనిన వాని బొదుగ బట్టి
యంతకంటె నధికు దమృతకుంభము నెత్తి
కొంచు బారె బరులు కుయ్యిడంగ.

అది అదనుగా తీసుకుని, శ్రీమహావిష్ణువు, అసురాధిపుల ఆర్భాటాన్ని అరికట్టే ఉద్దేశంతో, జగన్మోహనమయిన ఒక స్త్రీరూపం ధరించి, వారికి అనతిదూరంలో సాక్షాత్కరించాడు. ఆ మోహినీ రూపాన్ని చూడగానే, దైత్యవీరులలో, ఒకవిధమైన వికారం బయలు దేరింది. వా రామెను సమీపించి, ఆమె అభిమానాన్ని పొందే ఉద్దేశంతో, తమ తగవును గుఱించి ఆమెకు నివేదించుకున్నారు. జ్ఞాతులయిన తమ మధ్య సంభవించిన స్పర్థను తొలగించి, తమకు లభించిన అమృతాన్ని తమకందరికీ సమంగా పంచిపెట్టవలసిందని కోరారు.

వారి మాటలు విన్న ఆ మాయామోహిని, తన తళుకుబెళుకులతో వారిని వశపరచుకుంటూ, చిరునవ్వుతో ఇలా అన్నది.

"మీరు కశ్యప ప్రజాపతి సంతతివారు. మీరుకూడా, నావంటి స్వైరిణిపట్ల విశ్వాసంతో ప్రవర్తించటం ఉచితంగా లేదు. అయినా, మీరు, నన్ను అభిమానించి పెద్దగా భావించినందుకు, నేను గర్వపడుతున్నాను. మీరు కోరినట్టు, న్యాయంగా అమృతాన్ని పంచిపెట్టటానికి, నాకే విధమైన అభ్యంతరం లేదు. అయినా, ఆ పనిని, నేను, నాకు తోచినట్టుగామాత్రమే చేయటం జరుగుతుంది. ఆ సమయంలో, మీరు, 'ఇది న్యాయం, అది అన్యాయం' అని, నాకు చెప్పటం మాత్రం పనికిరాదు. అందుకు మీరు ఇష్టపడిన పక్షంలో, నే నా కలశాన్ని తీసుకుంటాను."

అలా మోమోటమి లేకుండా, మృదుమధురంగా పలికిన ఆ పడుచు మీద, దైత్య దానవులందరికీ, అమితమైన అనురాగం కలిగింది. ఆ వెంటనే, వారు, ఆమె ఏర్పఱచిన నియమాన్ని అంగీకరించి, ఆ అమృతకలశాన్ని ఆమె కందించారు.

ఆ తరువాత, సురాసురులందరూ, స్నానాలుచేసి, హోమాదులాచరించి, దానధర్మాలు పూర్తిచేసుకుని, దుకూలాలు ధరించి, బారులు తీరి కలసికూర్చున్నారు. అది చూసిన మాయామోహిని, అసురులమీద ప్రత్యేకాభిమానం కలదానిమాదిరిగా, వారిని, దేవతలనుంచి వేరుచేసి, ఒక ప్రక్క, ప్రత్యేకంగా కూర్చోబెట్టింది. వారందరినీ మంచిమాటలతో సంతోషపరుస్తూ, వారి వరుస లేర్పరచుకుని పలుకరిస్తూ, కులికిస్తూ, ఓరచూపులతో వారని తన్మయులనుగా చేస్తూ, అమృతాన్ని పంచిపెట్టడం సురలపంక్తితో ప్రారంభించింది. అలా ఆమె దాన్ని, ప్రప్రథమంగా సురలకు పోయటం, అసురులకు, కష్టంగాతోచింది. అయినా, ఆమె తమకు అన్యాయం చేయదన్న విశ్వాసంతోనూ, ముందుగా ఆమె కిచ్చిన వాగ్దానంవల్లనూ, వా రామె నేమీ అనలేకపోయినారు. కాని, రాహువు మాత్రం, ఆమె ననుమానించాడు. అందు

కనే, అతడు, దేవరూపం ధరించి, దేవతల పంక్తిలోచేరటం, ఆమె పోసిన అమృతాన్ని త్రావటానికి ఉద్యుక్తుడుకావటం జరిగింది.అది, సూర్య చంద్రులు గమనించారు; శ్రీహరికి, సైగద్వారా తెలియపరచారు. ఆ వెంటనే, శ్రీహరి, తన చక్రాయుధాన్ని రాహువుమీదకు పంపాడు. అది సూటిగా పోయి, రాహువు తలను నరికేసింది. అలా నరుకబడిన రాహువుతలమాత్రం అమృతస్పర్శవల్ల, అమరత్వంపొందింది; సూర్య చంద్రాదులమాదిరిగా, అది కూడా, ఒక గ్రహమై నిలచిపోయింది.

ఆ విధంగా, సుర లందరిచేతా అమృతాన్ని త్రాగించి, శ్రీహరి, ఆ వెంటనే, నిజరూపం ధరించాడు. అలా నిజరూపంలో ప్రత్యక్షమైన శ్రీహరిని చూసి, అసురులు విస్మితులయినారు. అంతలోనే, ఆయన, మంద హాసం చేస్తూ, గరుడుని అధిరోహించి, వైకుంఠానికి వెళ్ళిపోయినాడు.

దానవు లమృతము ద్రావం
బూని పయోరాశి ద్రచ్చి పొగిలిన మాడ్కిన్
శ్రీనాథ పరాఙ్ముఖులగు
హీనులు వొందంగజాల రిష్టార్థంబుల్.

అది గ్రహించలేని అసురులు, అమితమైన ఈర్ష్యాసూయలు పెంచుకుని, సురలతో పోరాటానికి తలపడ్డారు. ఆ పోరు, ఒక మహాసంగ్రామంగా తయారయింది. ఆ సమరంలో, వైరోచనుడయిన బలి, అసురపక్షానికి నాయకత్వం వహించాడు; సురలకు, మహేంద్రుడు నాయకుడైనాడు. ఆ సమయంలో...

భేరీ భాంకారంబులు
వారణ ఘీంకారములును వరహరి హేషల్
భూరి రథనేమి రవములు
ఘోరములై పెల్లగించె గులశైలములన్.

అలా సాగిన సంగ్రామంలో, బలిచక్రవర్తి సేనలకు సురసైన్యం బలి అవుతుందేమోనన్న భయం కూడా, ఒక సందర్భంలో కలిగింది. అతని మాయాయుద్ధాన్ని చూసి, సురానీకం, అమితంగా అదలిపోయింది. మహేంద్రుడు వదిలిన వజ్రాయుధంకూడా, బలిని, ఏమీచేయలేకపోవటం జరిగింది. అది గ్రహించిన దేవతలు, గత్యంతరంతోచక, శ్రీమన్నారాయణుని ప్రార్థించారు. వారి ప్రార్థనను ఆలకించి...

విహగేంద్రాశ్వ నిరూఢుడై మణిరమా విభ్రాజితోరస్కుడై
బహుశస్త్రాస్త్ర మహాభుజాకలితుడై భాస్వత్కిరీటాది దు
స్సహుడై నవ్యపిశంగ వస్త్రధరుడై సంఫుల్ల పద్మాక్షుడై
విహితాలంకృతితోడ మాధవుడు దా వేంచేసె నచ్చోటికిన్.

శ్రీమహావిష్ణువు అలా సన్నిధిచేయగానే, అసురుల మాయ అంతా హరించిపోయింది. సురలందరూ నూతనోత్తేజంతో, తిరిగి యుద్ధానికి సన్నద్ధులయినారు. అప్పుడు జరిగిన యుద్ధంలో, మహేంద్రుడు, బలిని, క్రిందపడేశాడు. ఆవెంటనే, బలిచక్రవర్తి స్నేహితుడయిన జంభుడు, సింహవాహనుడై వచ్చి, ఇంద్రునితో తలపడ్డాడు; కాని, అతడు, ఇంద్రుని వజ్రాయుధానికి బలి అయిపోవటం జరిగింది.

జంభుడు సంహరింపబడగానే, అతని జ్ఞాతులైన, నముచి, బల, పాకు లనేవారు, మహేంద్రుని మీదకు వెళ్ళి, తమ తీవ్రబాణాలతో, సురసేననంతనూ కప్పేశారు. కాని, మహేంద్రుడు, బల పాకులను, తన వజ్రంతోనూ నముచిని, సముద్రంమీది నురుగుతో తయారైన ఒక విచిత్రాయుధంతోనూ హతమార్చాడు.

అంతలో, బ్రహ్మదేవుని పంపున అక్కడికివచ్చిన నారదుడు, అసురప్రముఖులను కలుసుకుని, ఆ పైన యుద్ధం సాగించటంవల్ల, అనవసరంగా దానవక్షయమవుతుందని బోధించి, అంతటితో, ఆ సమరాన్ని ఆపుచేయించాడు. ఆ వెంటనే, సురలు, మహేంద్రునితోసహ స్వర్గలోకానికి,

అసురులు, బలితోసహా అ స్తగిరికి వెళ్ళిపోయినారు. తలలు తెగినవారినితప్ప ఇతరావయవాలు తెగిన దైత్యులనూ, దానవులనూ, శుక్రుడు, తన సంజీవనీ ప్రభావంవల్ల బ్రతికించి, ఎవరిస్థానాలకు వారిని పంపించాడు.

## 49. వి ష్ణు మా య :

ఆ తరువాత, ఒకసారి, శ్రీమహావిష్ణువు ధరించిన మోహినీ రూపాన్ని దర్శించాలన్న కుతూహలం, మహేశ్వరునకు కలిగింది. ఆవెంటనే, ఆయన, పార్వతితోనూ, భూతసంఘాలతోనూ వైకుంఠానికి వెళ్ళి, శ్రీమన్నారాయణుని ఉచితరీతిని స్తుతించి,

'ఘనతన్ నీ మగపోడుముల్ పలుమఱుం గన్నారమున్ వేమఱున్
నిను విన్నారము జూడ మెన్నడును మున్ నీయాడుజందంబు మో
హినివై దైత్యుల గన్నుబ్రామి యమృతం బింద్రాది దేవాళి కి
చ్చిన నీ రూపము జూపుమా కుతుకముం జిత్తంబునం బుట్టెడిన్'

అని వేడుకున్నాడు. అది విన్న శ్రీమన్నారాయణుడు మందహాసంచేశాడు; ఆ వెంటనే అంతర్హితుడయినాడు.

మాట్లాడుతూనే మాయమైన శ్రీహరిని, నలుదిక్కులా వెతుక్కుంటూ, ఉమాసహితుడయిన పరమేశ్వరుడు, ఒక వనంలో ప్రవేశించాడు. అక్కడ, ఆయనకు, ఒక సుందరాంగి కనిపించింది. ఆమె రూపురేఖావిలాసాదులు చూడగానే, మహేశ్వరుని మనసు చలించిపోయింది. సౌందర్యరాశి అయిన ఆ పడుచును పలుకరించే నిమిత్తం, ఆయన, పార్వతిని అక్కడే వదలి, భూతగణాలమాటనే మఱచిపోయి, ఆమెను చేరబోయినాడు. అది గ్రహించిన ఆ పడుచు, అతనికి దూరంగా వెళ్ళటానికి ప్రయత్నించింది. కాని, మహేశ్వరుడు ఆమె వెన్నంటివెళ్ళి, ఆమెను కలుసుకున్నాడు. తన బాహుపంజరంలో ఆమెను బంధించాడు. అలా బంధించి, ఆమెమీద తనకున్న అనురాగాన్ని వ్యక్తపరచుకోబోతున్న

సమయంలో, ఆ మగువ మాధవుడుగా మారిపోయింది. అది చూసిన మహేశ్వరుడు, తనలోతా నెంతగానో లజ్జించి, తలవంచుకున్నాడు. అది గ్రహించిన భూతగణం...

"కాము గెలువవచ్చు గాలారి కావచ్చు
మృత్యు జయముగలిగి మెఱయవచ్చు
నాడువారి చూపు టంపర గెలువంగ
వశముకాదు త్రిపుర వైరికైన"

అని, తమలోతామనుకుంటూ, తమతమ స్థానాలకు వెళ్ళిపోయినారు.

## *50.* వామనావతారం :

క్షీరసాగరమథన సందర్భంలో జరిగిన దేవ దానవ యుద్ధానంతరం, అసురగురువులయిన భార్గవులు, బలిచేత, విశ్వజిద్యాగం చేయించారు. ఆ యాగప్రభావంవల్ల, బలికి, ఒక కాంచనరథం ఉచ్చైశ్రవం వంటి కొన్ని అశ్వాలూ, ఒక సింహధ్వజం, అక్షయతూణీరాలూ, ఒక దివ్యధనువూ లభించినై. ప్రహ్లాదుడు ఒక పద్మమాలనూ, శుక్రుడు ఒక శంఖాన్నీ, అతనికి, ఆ సమయంలో ఇచ్చారు. వాటిమూలంగా, అతడు, దివ్యతేజంతో ప్రకాశించటం జరిగింది.

ఆ విధంగా ప్రకాశమానుడయిన బలి, ఒకసారి, దేవేంద్రుని నగరంమీదకు దాడివెళ్ళి, దాన్ని ముట్టడించి, దేవతలకు అమితమైన భయం కలిగించాడు. అది గ్రహించిన మహేంద్రుడు, ఆ వెంటనే, దేవగురుడయిన బృహస్పతితో సంప్రదించి, భార్గవుల కరుణమూలంగా, బలి, ఆ సమయంలో మహా తేజశ్శాలి అయివున్నాడనీ, అతణ్ణి అప్పుడు జయించటం దుర్ఘటమనీ తేల్చుకుని, అతని తేజం తఱగేవరకూ, స్వర్గాన్నివదలిపోవటం శ్రేయస్కరమని నిర్ణయించుకున్నాడు; అదే తనవారికి తెలియపరచి, వారందరూ, కామరూపంలో, తమతమ నిజావాసాలు వదలి పోయేటట్టుకూడా చూశాడు.

అసురులు, దేవతలందరూ స్వర్గం విడిచిపోవటంవల్ల, అనాయాసంగానే అది ఇతరావశమయింది. అది కారణంగా, బలి, మహేంద్రపదవి నధిష్ఠించి, ప్రభావాలలోనూ తన శాసనాన్ని అమలు జరిపించాడు. అలా విశ్వవిజయిన బలిచేత, భార్గవులు, నూరు హయమేధాలు చేయించారు. దాని ఫలంగా, అతను, మరింత తేజస్సంపన్నుడు కావటం జరిగింది. ఆ సమయంలో...

అర్థుల్ వేడరు దాతలుం జెడరు సర్వారంభముల్ పండు ప్ర
త్యర్థుల్ లేరు మహోత్సవంబులను దేవాగారముల్ వొల్చు బూ
జ్యార్థుల్ విప్రులు వర్షముల్ గురియు గాలార్థంబులై ధాత్రికిన్
సార్థంబయ్యె వసుంధరాత్వ మసురేంద్రాధీశు రాజ్యంబునన్.

అయినా, తన కుమారులు, తన సవతిబిడ్డలకు భయపడి, అదృశ్యులు కావటం, అదితి భరించలేకపోయింది. అది కారణంగానే, ఆమె, ఒకసారి, తన పెనిమిటిని సమీపించి, ఆయన, సమాధినుంచి లేచిన సమయం కనిపెట్టి, ఆయనకు, తన విచార కారణాన్ని, అతి దీనంగా విన్నవించుకుంది. ఆ సందర్భంలోనే...

"ఎండ కన్నెఱుగని ఇంద్రుని యిల్లాలు
పలుపంచలను జాలి బడియె నేడు

త్రిభువన సామ్రాజ్య విభవంబు గోల్పోయి
దేవేంద్రు డడవుల దిరుగు నేడు

కలిమి గారాబు బిడ్డలు జయంతాదులు
శబరార్భకులవెంట జనిరి నేడు

అమరుల కాధారమగు అమరావతి
యసురుల కాటపట్టయ్యె నేడు

బలి జగములనెల్ల బలియుచు నున్నాడు
వాని గెలువరాదు వానవునకు
యాగభాగ మెల్ల నత డాహరించును
కడగి సురల కొక్క కడియు నీడు"

అనికూడా విశదపరచింది. అంతేకాదు,

'మహాత్మా ! నువ్వు ప్రజాధ్యక్షుడవు. నీకు నీ బిడ్డ లందరూ సములే. అయినా, వారిలో దుర్మార్గులయినవారిని నువ్వు శిక్షించకుండా ఉపేక్షించటంమాత్రం పాడికాదు. నా బిడ్డలు, ఇళ్ళూ, వాకిళ్ళూ వదలి, సర్వ సంపదలనూ కోల్పోయి అడవులపాలై ఉండటం నేను సహించలేకుండా ఉన్నాను. నువ్వు వారిని కరుణించవలసింది. నాకు మనశ్శాంతిని కల్పించ వలసింది' అనికూడా ప్రాధేయపడ్డది.

అది విన్న కశ్యపబ్రహ్మ, ఒకక్షణకాలం ఆలోచించాడు. తన దివ్యదృష్టిద్వారా, భవిష్యత్తులో జరుగబోయేదంతా గ్రహించాడు. అందు కనే, ఆమె నుద్దేశించి...

'జనకుం డెవ్వఁడు జాతు డెవ్వఁడు జనిస్థానంబు లెచ్చోటు, సం
జననం బెయ్యది మేను లేకొలది సంసారంబు లే రూపముల్
వినుమా యింతయు విష్ణుమాయ దలపన్ వే ఱేమియున్ లేదు మో
హనిబంధంబు విధాన మింతటికి జాయా విన్నబో నేటికిన్'

అని బోధించాడు. అయినా, దానివల్ల ఆమె మనసుకు శాంతి లభించదని గ్రహించి, కాలోచితంగా ఇలా ఉపదేశించాడు.

"భగవంతుం బరముం జనార్దను గృపాపారీణు సర్వాత్మకున్
జగదీశున్ హరి సేవసేయు మతఁడుజ్ఞ సాంగత్యముం బొంది నీ
కగు నిష్టార్థము లెల్ల నిచ్చు నిఖిలార్థావాప్తి సేకూరెడిన్
భగవత్సేవల బొందరాదె బహు సౌభాగ్యంబులం బ్రేయసీ !"

ఆ విధంగా హరిసేవకు ప్రోత్సహింపబడ్డ అదితి, ఆ తరువాత, తన భర్త ఆదేశానుసారం, పయోభక్షణ మనే ఒక వ్రతాన్ని, దీక్షతో ఆచరించింది. అది కారణంగా. ఆమెకు, పీతాంబరధారీ, చతుర్బాహుడూ, శంఖ చక్ర గదాద్యాయుధాలంకృతుడూ అయిన శ్రీమన్నారాయణుడు ప్రత్యక్షమయినాడు. అలా ప్రత్యక్షమయిన లక్ష్మీనాథుని, కన్నుల కఱవు దీర చూస్తూ, ఆమె, ఆయన్ని ఇలా ప్రస్తుతించింది.

"యజ్ఞేశ విశ్వంభరాచ్యుత శ్రవణ మం
గళనామధేయ లోకస్వరూప
యాపన్నభక్తజనార్తివిఖండన
దీనలోకాధార తీర్థపాద
విశ్వోద్భవస్థితి విలయకారణభూత
సంతతానంద శశ్వద్విలాస
యాయువు దేహంబు ననుపమ లక్ష్మియు
వసుధయు దినము త్రివర్గములును
వైదికజ్ఞానమును ముక్తి వైరిజయము
నిన్ను గొలువని నరులకు నెఱయ గలదె
వినుత మందార గుణహార వేదసార
ప్రణతవత్సల పద్మాక్ష పరమపురుష !"

అలా ప్రస్తుతించి, 'నాయనా ! అసురులు సురరాజ్యాధిపత్యాన్ని వహించారు. సురలను కన్నతల్లినికాబట్టి నే నది సహించలేకుండా ఉన్నాను. నాకు మనశ్శాంతిని ప్రసాదించవలసింది' అని బ్రతిమాలుకుంది.

పరమేశ్వరుడు, అదితి ప్రార్థనను, సావధానంగా ఆలకించాడు. ఆ పైన, ఆమె నుద్దేశించి ఇలా అన్నాడు.

"అమ్మా ! నీ భక్తికి సంతోషించాను. నువ్వు కోరినట్టుగా, నీకు మనశ్శాంతిని కలిగించితీరుతాను. కాని, నువ్వు మరికొంతకాలం, ఇలాగే ఓపికపట్టి ఉండాలి.

రాక్షసులను బలవంతంగా చంపటం అంతభావ్యంకాదు. వారిని, ఏదో ఒక ఉపాయంద్వారా సంహరించాలి. ఆ పని చేయటానికి నేను నిశ్చయించుకున్నాను. అందుకనే...

"నీ కోడంద్రును నీ కుమారవరులున్ నీ నాథుడున్ నీవు సం
శ్లోకింపన్ సతులుం బతుల్ మిగుల సమ్మోదింప రాత్రించరుల్
శోకింపన్ భవదీయ గర్భమున దేజోమూర్తి జన్మించెదన్
నాకున్ వేడుకపుట్టు నీ సుతుడనై నర్తించి వర్తింపగాన్"

అనికూడా ఆమెకు తెలియపరచాడు.

ఆ విధంగా అదితికి కొంత ఊఱట కలిగించి, పురాణపురుషుడు తిరోహితుడయినాడు. ఆ తరువాత, కాలక్రమాన, అదితి, ఒకానొక భాద్రపద శుక్ల ద్వాదశినాడు, శ్రవణ నక్షత్రాన, అభిజిన్ముహూర్తంలో, ఒక వామనమూర్తిని ప్రసవించింది. ఆ సమయాన...

చింతం బాసిరి యక్ష తార్క్ష్య సుమన స్సిద్ధోరగాధీశ్వరుల్
సంతోషించిరి సాధ్య చారణ మునీశ బ్రహ్మవిద్యాధరుల్
కాంతిం జెందిరి భాను చంద్రములు రంగద్గీతవాద్యంబులన్
గంతుల్వైచిరి మింట గింపురుషులున్ గంధర్వులుం గిన్నరుల్.

అలా అవతరించిన వామనునకు, మహర్షులు, జాతకర్మాదులు నిర్వర్తించారు. ఉపనయనం చేశారు. అతణ్ణి చూసి, అదితీ కశ్యపుడూ కూడా ఎంతో మురిసిపోసాగారు.

అలా ఉండగా, బలిచక్రవర్తి అశ్వమేధయాగ మాచరిస్తున్నాడనీ, అక్కడ, అత డిచ్చే దానాలకు అంతులేకుండా ఉన్నదనీ, ఒకసారి, వామనునకు తెలియవచ్చింది. ఆ వెంటనే, ఆయన, కొందరు విప్రులతోకలసి భృగువత్సం అనేచోట జరిగే ఆ యాగాన్ని సందర్శించే నిమిత్తం వెళ్ళాడు. వెళ్ళి, యాగశాలను సమీపించగానే...

'శంభుండో హరియో పయోజభవుడో చండాంశుడో వహ్నియో
దంభాకారత వచ్చెగాక ధరణిన్ ధాత్రీసురుం డెవ్వ డీ
శుంభద్యోతను డీ మనోజ్ఞ తను' డంచున్ విస్మయభ్రాంతులై
సంభాషించిరి బ్రహ్మచారి గని తత్సభ్యుల్ రహస్యంబుగన్.

ఆ విధంగా సభాసదులు గుజగుజలుపోతూ ఉన్న సమయంలో...

చవులుగా జెవులకు సామగానంబులు
సదువు నుద్గాతల చదువు వినుచు
మంత్ర తంత్రార్థ సంబంధభావములు పే
ర్కొను యా యజ్ఞాకుల గూడికొనుచు
హోమకుండంబులందున్న త్రేతాగ్నుల
వెలిగించు యాజకవితతి గనుచు
దక్షులై బహువిధాధ్వర విధానంబులు
సెప్పెడు సభ్యుల జేరజనుచు
బెట్టు గోరెడు వేడుక పట్టుపఱుప
నదితిపుట్టువు లచ్చికి నాటవట్టు
గోరి చరియించె సభలోన గొంతతడవు
పుట్టు వెన్నడు నెఱుగని పొట్టివడుగు.

అలా చరిస్తూ, కొందరితో చర్చలు జరిపాడు. కొందరితో జటలు చెప్పాడు. కొందరితో తర్కంలోకి దిగాడు. మరికొందరితో ముచ్చటించాడు. అదంతా చూస్తూఉన్న సభికులు అమితాశ్చర్యం పొందారు. అంతలోనే, అతడు, బలిచక్రవర్తిని సమీపించాడు. సమీపించి...

'స్వస్తి జగత్త్రయీభువన శాసనకర్తకు హాసమాత్ర వి
ధ్వస్త నిలింపభర్తకు నుదారపద వ్యవహర్తకున్ మునీం
ద్రస్తుత మంగళాధ్వర విధాన విహర్తకు నిర్జరీ గళ
న్యస్త సువర్ణసూత్ర పరిహర్తకు దానవలోకభర్తకున్'

అని దీవించాడు. అలా దీవించిన వామనుని చూసి, భార్గవులూ, బలిచక్రవర్తీ కూడా విస్మితులయినారు. ఆ మాయావటునితేజం, భార్గవులను, సమ్మోహితులనుగా చేసింది. ఆవెంటనే, వారు, అతనికి నమస్కారించారు. ఉచితాసనాన్నిచ్చారు. అంతలో, బలిచక్రవర్తి, తన ధర్మపత్ని అయిన వింధ్యావళి తెచ్చిన పవిత్రోదకంతో, ఆ వామనుని పాదాలు కడిగి, ఆ పాదోదకాన్ని తన శిరస్సున చల్లుకున్నాడు. ఆపైన, అతని నుద్దేశించి...

"వడుగా యెవ్వరివాడ వెవ్వడవు సంవాసస్థలం బెయ్యది
య్యేదకున్ నీ వరుదెంచుటన్ సఫలమయ్యెన్ వంశమున్ జన్మముం
గడు ధన్యాత్ముడనైతి నీ మఖము యోగ్యంబయ్యె నా కోరికల్
కడతేఱెన్ సుహుతంబులయ్యె శిఖులుం గల్యాణ మిక్కాలమున్.

వరచేలంబులొ మాడలో ఫలములో వన్యంబులో గోవులో
హరులో రత్నములో రథంబులొ విశిష్టాన్నంబులో కన్యలో
కరులో కాంచనమో నికేతనములో గ్రామంబులో భూములో
ధరణీ ఖండమొ కాక యే మడిగెదో ధాత్రీసురేంద్రోత్తమా!"

అని, వినయపూర్వకంగా అన్నాడు. ఆ పలుకులువిన్న వామనుడు, ఆ మహారాజుకు ఇలా సమాధాన మిచ్చాడు.

"ఇది నాకు నెలవని యేరీతి బలుకుదు
నొకచో టనక యెందు నుండనేర్తు

నెవ్వనివాడనం చేమని నుడువుదు
నాయంతవాడనై నడవనేర్తు

నీ నడవడియని యెట్లు వక్కాణింతు
బూని ముప్పోకల బోవనేర్తు

నదినేర్తు నిదినేర్తు ననియేల చెప్పంగ
నేరుపు లన్నియు నేన నేర్తు

నొరులు గారు నాకు నొరులకునేనొదు
నొంటివాడ జుట్ట మొకడు లేడు
సిరియు దొల్లి గలదు చెప్పెద నా లెంకి
సుజనులందు దఱచు సొచ్చియుందు.

మహారాజా ! అంతకుమించి నీకు నేను చెప్పుకోతగిన స్వవిషయ మేమీ లేదు. నువ్వు, మహానుభావుడయిన ప్రహ్లాదుని మనుమడవు. భార్గవులకు శిష్యుడవు. యాచకుల పాలిటి కల్పవృక్షానివి. అందుకనే, వరప్రదాత వయిన నీనుంచి, మూడడుగులకు సరిపోయే భూమినిమాత్రం యాచించి పొందాలని నే నిలావచ్చాను. అంతకుమించినదేదీకూడా నాకు అవసరం లేదు.

నిజానికి, ముల్లోకాలకూ నాథుడవైన నిన్ను, ఇంతటి అల్పాతి అల్పమైన కోరికతో సమీపించటం అసమంజసమని నాకు తెలుసు అయినా, నేను, విప్రుణ్ణి కావటంవల్ల, నాకు ఎంతఅవసరమో అంతే అడుగుతున్నాను. అంతకుమించి అడగటానికిగాని, పొందటానికిగాని, నాకు అర్హతలేదు.

అదీకాక, నేను బ్రహ్మచారిని. నా ఆశ్రమానికి ఉచితంకానివి నేను వాంఛించటంకూడా దోసమే అవుతుంది. గొడుగుకాని, జందెంకాని, కమండలువుకాని, దండంకాని, అటువంటిదే మరింకొకటికాని నేను అడగవచ్చు;పొందవచ్చు. అంతేకాని, గృహారామాదులనూ, కాంచనభూషణాలనూ, కన్యలనూ, నువ్వు ఔదార్యంతో ఇచ్చినా, స్వీకరించటం నాకు ఉచితం కాదు. మరొక విషయంకూడా ఉంది.

ఆశకు అంతనేది లేదు. అనవసరమైన ఆశలు పెంచుకోవటం అసంతృప్తికి మూలమవుతుంది. సంతుష్టి అనేది లేనివారికి, సప్త ద్వీపాలూ హస్తగతమైనా, శాంతి అనేది లభించదు. అందుకనే, వివేకులయినవారు, ఎప్పటికి యేది లభిస్తే అదే పదివేలనుకుని, సంతోషంతో

దాన్ని అనుభవిస్తారు. దానివల్ల, సుఖం శాంతీ
వారికి సిద్ధిస్తై. అలా సుఖంగానూ, శాంతి
తోనూ జీవించటం, ముక్తికి కారణమవుతుంది.

సంతుష్టహృదయుల తేజం, అంతకంతకు
వృద్ధిపొందుతుంది. అసంతుష్టులతేజం, క్షణ
క్షణం క్షీణించిపోతూ ఉంటుంది. సంతుష్టు
డయినవాడు, ముల్లోకాలలోనూ పూజ్యు డవు
తాడు. నిత్యసంతోషికి దుఃఖమనేదేకనిపించదు.

అందుకనే, నేను, నాకు అవసరమైన పదత్రయాన్నిమాత్రమే అర్థిస్తున్నాను. అది లభిస్తే, సర్వప్రపంచం స్వాధీనమైనంతగా సంతోషిస్తాను."

వామనుని ధర్మబుద్ధిని గ్రహించి, బలిచక్రవర్తి అమితానందం పొందాడు. అది కారణంగానే, అతడు కోరిన మూడడుగుల భూమినీ అతనికి దానంచేయటానికి నిశ్చయించుకున్నాడు.

అదంతా గ్రహిస్తూ ఉన్న శుక్రాచార్యుడు, వామనుడు, సామాన్య వటుడై ఉండడనీ, సాక్షాద్విష్ణుదేవుడే, ఏదో దేవకార్యాన్ని సాధించేనిమిత్తం అలా వచ్చి ఉంటాడనీ, భావించాడు. ఆ అభిప్రాయంతోనే, బలి నుద్దేశించి ఇలా అన్నాడు.

"మహారాజా ! ఇతని ఉద్దేశాన్ని అవగాహన చేసుకోకుండా, నువ్వు, నీ వాగ్దానాన్ని నెరవేర్చుకోవటానికి పూనుకుంటున్నావు. దీనివల్ల, దైత్యసంతతి నశించిపోవటం తథ్యం. తాము చేసే దానంవల్ల తమకు నాశం సంభవించేపక్షంలో, అది, దాన మనిపించుకోదు. తన్నుమాలిన ధర్మం ఎంతటివారికయినా మంచిదికాదు. అది కారణంగా, నువ్వు, నీ వాగ్దానాన్ని ఉపసంహరించుకోవటం, నీకు శ్రేయస్కరమని నేను భావిస్తున్నాను. ఇటువంటి సమయాల్లో, అనృతదోషానికి భయపడవలసినపనేమీ లేదు.

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణ విత్త మాన భంగమందు
జకిత గోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు; దాన బొంద దఘము.

అందుకనే, నామాట వినవలసిందనీ, నిన్ను నీవు రక్షించుకుని, నీవారిని రక్షించవలసిందనీ కోరుతున్నాను."

అసురగురుడు బోధించిన ఆ గృహస్థధర్మం తనకు వర్తించదని, బలిచక్రవర్తి నిర్ణయించుకున్నాడు. అందుకనే, అర్థలోభంతో అనృత దోషానికి పాల్పడటానికి అతడు అంగీకరించలేకపోయినాడు. శుక్రాచార్యుడు భావించినట్టుగా, తన సమక్షాన, వామనరూపంలో ఉన్నది శ్రీమహావిష్ణువే అయినపక్షంలో, తన దానం చరితార్థత పొందుతుందనీ, తద్వారా తనకు అమరత్వం సిద్ధించితీరుతుందనీ అతడు తల పోశాడు; అంతకు మించిన మహద్భాగ్యం తనకు మరొకటి ఉండదని కూడా నిశ్చయించుకున్నాడు. అందుకనే, అతడు, శుక్రాచార్యుని ఉద్దేశించి...

"నిరయంబైన నిబంధమైన ధరణీ నిర్మూలనంబైన దు
ర్మరణంబైన గులాంతమైన నిజమున్ రానిమ్ము కానిమ్ము పో
హరియైనన్ హరుడైన నీరజభవుం డభ్యాగతుండైన నౌ
దిరుగన్ నేరదు నాదు జిహ్వ వినుమా ధీవర్య వేయేటికిన్"

అని, తన నిశ్చితాభిప్రాయాన్ని ఆయనకు విశదపరచుకున్నాడు. అంతే కాదు. దాన మహిమను గురించి తన అభిప్రాయాన్ని వ్యక్తపరుస్తూ...

కారే రాజులు రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిం బొందరే
వా రేరీ సిరి మూటగట్టుకొని పోవంజాలిరే భూమిపై
బే రైనం గలదే శిబి ప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా !

అనికూడా అన్నాడు. అంతకుమించిన అభిప్రాయ మొకటి, అంతలోనే అతనికి కలిగింది. అది కారణంగానే...

"ఉడుగని క్రతువుల దపముల
దొడగనజననట్టి పొడవు పొడవున గుఱుచై
యడిగెడినట నసుటోటికి
నిడరాదె మహానుభావ యిష్టార్థంబుల్!'

అదీకాక...

ఆదిన్ శ్రీసతి కొప్పుపై దనువుపై నంసోత్తరీయంబుపై
బాదాబ్జంబులపై గపోలతటిపై బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు గ్రిందగుట మీదై నా కరంబుంట మే
ల్గాదే రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే!"

అనికూడా పలికాడు. ఆ పైన, తన వాగ్దానాన్ని గురించి విశదపరచుకుంటూ...

'మేరువు దలక్రిందైనను
బారావారంబు లింకబాఱిన లోలో
ధారుణి రజమై పోయిన
ధారాధ్వము బద్ధమైన దప్పక యిత్తున్.'

అని శపథం కూడా చేశాడు. అత డలా శపథంచేయటం అతని గర్వానికి తార్కాణమని అసురగురు డనుకుంటాడేమోనన్న అభిప్రాయంతో....

'ఎన్నడుం బరు వేడబోడట యేకలుండట కన్నవా
రన్నదమ్ములునైన లేరట యన్నివిద్యల మూలగో
ష్ఠి న్నెఱింగిన ప్రోడగుజ్జట చేతులొగ్గి వసింప నీ
చిన్నిపాపని ద్రోసిపుచ్చగ జిత్తమెత్తదు సత్తమా!'

అని తన హృదయాన్ని విశదపరచుకున్నాడు.

ఆ విధంగా, తన సత్యసంధత్వాన్నీ, దానపరాక్రమాన్నీ, కీర్తి కాముకత్వాన్నీ, అర్థిజనవాత్సల్యాన్నీ స్పష్టీకరించుకున్న బలిచక్రవర్తికి, శుక్రాచార్యుడు ఎదురుచెప్పలేకపోయినాడు. తన మాటను తన శిష్యుడు పాటించటంలేదే అన్న కించ ఓ ప్రక్కన ఉన్నా...

'బ్రతుకవచ్చుగాక బహుబంధనములైన
వచ్చుగాక లేమి వచ్చుగాక
జీవధనములైన జెడుగాక పడుగాక
మాట దిరుగలేరు మానధనులు'

అని తనలోతాను అనుకున్నాడు; తన మహారాజుకు స్థిరతరమయిన కీర్తి ప్రాప్తించాలని హృదయపూర్వకంగా ఆశీర్వదించాడు.

అంతలో, వింధ్యావళీదేవి, హేమకలశంతో జలం తీసుకు వచ్చింది. ఆ వెంటనే...

సురలోక సముద్ధరణము
నిరతశ్రీకరణ మఖిల నిగమాంతాలం
కరణము భవసంహరణము
హరిచరణము నీటగడిగె నసురోత్తముడున్.

అలా ఆ మాయావటుని దివ్యచరణాలు కడిగి, ఆ జలం శిరస్సున చల్లుకుని...

'విప్రాయ ప్రకటవ్రతాయ భవతే విష్ణుస్వరూపాయ వే
ద ప్రామాణ్యవిదే త్రిపాదధరణిం దాస్యామి' యంచుం గ్రియా
క్షిప్తుండై దనుజేశ్వరుండు వడుగుం జేసాచిపూజించి బ్ర
హ్మ ప్రీతమ్మని ధారవోసె భువనం బాశ్చర్యముం బొందగన్.

అది గ్రహించిన ముల్లోకాలూ హర్షపులకితమైనై. ఆ వెంటనే, అక్కడ, పుష్పవర్షం కురిసింది. దేవతూర్యకోటి మొరసింది. అంతలో, ఆ మాయా

వటుడు, తన విశ్వరూపాన్ని ప్రదర్శించి, భూమ్యాకాశాలనూ, దిక్కులనూ, ఆవరించుకున్నాడు. అప్పుడు, ఆయనలో, ముల్లోకాలూ కనిపించినై. ప్రజా పతులూ, దనుజులూ, దేవతలూ, సూర్య చంద్రాదులూ, అనిలానల ప్రభృతులూ, దేవర్షిగణాలూ, సప్త సముద్రాలూ, కులగిరులూ, ఇదీ అదీ అని లేకుండా, సర్వం, ఆ మహామూర్తిలో గోచరించినై. అది గ్రహించి...

యోగమార్గంబున నూహించి బహువిధ
పుష్పదామంబుల బూజ సేసి
దివ్యగంధంబులు దెచ్చి సమర్పించి
ధూప దీపముల దోడ్తోడ నిచ్చి
భూరిలాజాక్షతంబులు సల్లి ఫలములు
గానిక లిచ్చి రాగమున బొంది
శంఖాది రవములు జయఘోషములు జేసి
కరుణాంబునిధి త్రివిక్రమ యటంచు
బ్రహ్మ మొదలు లోకపాలురు గొనియాడి
రెల్లదిశల వనచరేశ్వరుండు
జాంబవంతు డరిగి చాటె భేరీధ్వని
వెలయజేసి విష్ణువిజయమనుచు.

ఆ సమయంలో...

అన్ని జగంబులు దానై
యున్న జగన్నాథుజూడ నొగి భావింపం
గన్నందక మనమందక
సన్నుతులం జేసి 'రచటి' సభ్యులు బలియున్.

అదంతా చూసిన రాక్షసవీరులు, శ్రీమహావిష్ణువే కపట వామన రూపంలో వచ్చి, తమ మహారాజును వంచించాడని తేల్చుకున్నారు. అది

కారణంగానే, వారు, తమతమ ఆయుధాలు తీసుకుని, వటువును నిర్జించే నిమిత్తం ముందుకు ఉరికారు. అది గ్రహించిన బలిచక్రవర్తి, వారిని ఉద్దేశించి, అది రాక్షసుల కనుకూలమయినకాలం కాదనీ, దానవులకు అసమయంలో దైవబలం వ్యతిరేకంగా ఉన్నదనీ విశదపరచి, వారి ప్రయత్నాన్ని వారించాడు; వారిని రసాతలానికి పంపేశాడు.

ఆ తరువాత తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకున్న శ్రీహరి, బలిని ఉద్దేశించి, 'మహారాజా ! నువ్వు నాకు మూడడుగులమేర ఇస్తానని వాగ్దానం చేశావు. నా కిప్పుడు రెండడుగులభూమిమాత్రమే లభించింది. ఒక అడుగుతో భూమ్యాకాశాలూ, రెండవ అడుగుతో స్వర్గలోకం, నిండిపోయినై. మూడవ అడుగు ఎక్కడ మోపాలో నాకు తెలియకుండా ఉంది. ఆ చోటుకూడా చూపించి, నీ మాటను నిలబెట్టుకోవలసింది" అన్నాడు. అది విన్న బలి, అత్యాశ్చర్యంతో అతనివంక చూస్తూ...

'సూనృతంబుగాని సుడియదు నా జిహ్వ
బొంకజాల నాకు బొంకులేదు
నీ తృతీయ పదము నిజము నా శిరమున
నెలవు సేసిపెట్టు నిర్మలాత్మ !'

అని, తన తలను వంచాడు. ఆపైన ఇలా నివేదించుకున్నాడు.

"మహానుభావా !

అర్థులకు ఇస్తానని వాగ్దానంచేసి, ఇవ్వని వాని మనోరథం, వ్యర్థమవుతుంది. దానివల్ల, అతడు, స్వర్గదూరుడవుతాడు; నరకయాతనలనుభవిస్తాడు.

తల్లిదండ్రులచేతా, అన్నదమ్ములచేతా, స్నేహితులచేతా విధింపబడే శిక్ష మూలంగా కలిగే కొఱత ఏమీలేదు. దానివల్ల, చివరకు మేలే సంభవించి తీరుతుంది.

కపట సంసారాన్ని శాశ్వతంగా భావించినవారు మాత్రమే సత్యాన్నీ, దానాన్నీ, కరుణనూ, ధర్మాన్నీ త్యజించి వ్యవహరిస్తారు. దాని మూలంగా వారికి అనేకవిధాలయిన బాధలు కలుగుతూఉంటై. చుట్టాలు దొంగలనీ, సుతులు ఋణస్థులనీ, కాంతలు సంసార కారణాలనీ, ధన మస్థిరమయినదనీ, తనువు అతిచంచలమైనదనీ, ఆయువు అశాశ్వతమైనదనీ గ్రహించి, నీ పాదాలనే ఆశ్రయించి, మృతిలేని బ్రతుకుపొందిన ప్రహ్లాదుని వంశంలో పుట్టిన నేను, పదవీచ్యుతికిగాని, అర్థభంగానికిగాని, భయపడట మంటూలేదు. నేను, అనృతదోషానికిమాత్రమే భయపడతాను. అంతే.

సర్వాత్ముడవూ, జగన్నాథుడవూ అయిన నువ్వు అర్థివై నా సముఖానికి వచ్చావు. నీ కోరిక తీర్చటానికి నేను నిశ్చయించుకున్నాను. అది నా పుణ్యఫలం. ఇంతకు మించిన మహద్భాగ్యం నాకీ జన్మలో మరొకటి ఉండదు. అందుకనే, నేను, చేసిన వాగ్దానాన్ని నిలుపుకోవటానికి ఉబలాటపడుతున్నాను. నన్ను అనుగ్రహించవలసింది. నా పుట్టుపును సార్థకపరచవలసింది."

బలిచక్రవర్తి అలా నివేదించుకుంటూ ఉన్న సమయంలో, అతని తాత అయిన ప్రహ్లాదుడు అక్కడికివచ్చాడు. వచ్చి, వామనరూపంలో ఉన్న శ్రీహరికి ప్రణామంచేసి, బలిదైన గర్వాన్ని హరించి, అతనికి మేలు చేసిన ఆ భగవానునకు, తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

అంతలో, బలిచక్రవర్తి భార్య అయిన వింధ్యావళి, శ్రీమన్నారాయణుని సమీపించి, తనకు పతిభిక్ష పెట్టవలసిందిగా అర్థించింది. అదే సమయంలో, చతుర్ముఖుడు, ఆయన నుద్దేశించి, 'దేవదేవా ! ఈ మహారాజు, తన కున్నదంతా నీకు సమర్పించుకున్నాడు. భక్తియుక్తుడయిన ఇతడు, నీ అనుగ్రహానికి పాత్రుడు కాని, అన్యుడు కాడు' అని విన్నవించుకోవటం జరిగింది. వారి పలుకులు విన్న వాసుదేవుడు, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"ఈ మహారాజు పరమపూజ్యుడు. ఇతడు అసురనాథుడైనా, సత్యవ్రతుడై ఉండటం నాకు సంతోషదాయకమయింది.

ధనమదాంధీభూతులైనవారు, లోకాలనూ నన్నూ అవమానిస్తూ ఉంటారు. అందుకనే, నేను అనుగ్రహించదలచినవారిని, ముందుగా ధనహీనులను కావిస్తూ ఉంటాను.

జన్మలన్నిటిలోకీ ఉత్తమోత్తమమైనది పురుషజన్మ. సామాన్యంగా, పురుషులు, తమకు ప్రాప్తించిన వయో రూప విద్యా బలైశ్వర్యాదులవల్లా, జన్మ కర్మలవల్లా మదించిఉంటారు. అది కారణంగా, వారు, జనన మరణ రూపకమైన సంసారంలో చిక్కుకుని, దుఃఖాలను అనుభవిస్తూ ఉండటం సంభవిస్తుంది. ఎప్పుడయితే ఆ మదం ఉడిగిపోతుందో, అప్పుడు వారు, విమలులవుతారు. అలా విమలులయిన వారే, నాచేత రక్షింపబడతారు.

ఈ మహారాజు నిర్మలుడు కావటంవల్లనే, నా ప్రేమకు పాత్రుడయినాడు. అందుకనే, అమరులకు సైతం అందరాని విష్ణుపదాన్ని, నే నితనికి ప్రసాదిస్తున్నాను. సావర్ణిమన్వంతరాన, ఇతడు, మహేంద్రపదవినధిష్టిస్తాడు. అంతవరకూ, విశ్వకర్మ నిర్మితమయిన సుతలంలో ఉండి, తన పితామహుడయిన ప్రహ్లాదునితోపాటు సర్వభోగాలనూ అనుభవిస్తూ, ఉంటాడు. అక్కడే, నే నితనికి నిత్యసన్నిహితుడనై, సర్వరక్షకుడనై, వ్యవహరిస్తూ ఉంటాను."

శ్రీహరి పలుకులు విన్న బలి, అమితానందం పొందాడు. అది కారణంగానే, అతడు, ఆ పరమపురుషుని ఉద్దేశించి...

'ఎన్నడు లోకపాలకుల నీ కృపజూడని నీవు నేడు న
న్నున్నతుజేసి నా బ్రతుకు నోజయు నానతియిచ్చి కాచి తీ
మన్నన లీ దయారసము మాటల బెద్దరికంబు జాలవే
పన్నగతల్ప ని న్నెఱిగి పట్టిన నాపద గల్గనేర్చునే !'

అని, తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు. ఆ వెంటనే, ప్రహ్లాదునితోసహా సుతలానికి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, శ్రీమన్నారాయణుడు, అప్పటికి శేషించి ఉన్న రాక్షసేశ్వరుని యజ్ఞాన్ని శుక్రాచార్యునిద్వారా పరిసమాప్తి చేయించి, చతుర్ముఖాదులతో నిజావాసానికి వెళ్ళటం జరిగింది.

## 51. మత్స్యావతారం :

శ్రీమన్నారాయణుడు, గో భూసుర సుర సాధు సంఘాలనూ, ధర్మార్థాలనూ రక్షించేనిమిత్తం, అప్పుడప్పుడు, వివిధరూపాలలో అవతరిస్తూ ఉంటాడు. అలా అవతరించిన రూపాలలో, మీనావతారం ఒకటి.

పూర్వం, సత్యవ్రతుడనే రాజు, ద్రవిడదేశాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆయన, నారాయణపరుడై, చాలాకాలం తపస్సుచేశాడు. ఆ సమయంలో, ఓసారి, ఆయన, కృతమాలిక అనే నదిలో జల తర్పణ చేస్తూ ఉండగా, ఆయన దోసిట్లో ఒక చేపపిల్ల కనిపించింది. దాన్నిచూసి, ఆ మహారాజు, చేతులో ఉన్న నీటిని, ఏటిలో వదలబోయినాడు. అది గ్రహించిన ఆ చేపపిల్ల, ఆయన నుద్దేశించి ఇలా అన్నది.

"మహారాజా ! నువ్వు పరమకారుణికుడవు. నేను, ఘాతుకులయిన నా జ్ఞాతులకు భయపడి, నీ శరణుజొచ్చాను. నువ్వు, నన్ను రక్షించటానికి బదులు, తిరిగి నట్టేట ముంచటానికి పూనుకున్నావు. నీవంటి దీనవత్సలుల కిది భావ్యం కాదు."

అలా పలికిన చేపపిల్లను, ఆ మహారాజు, సానుభూతితో చూశాడు. దానిని రక్షించటానికే నిశ్చయించుకున్నాడు. ఆ వెంటనే, దాన్ని

తన కమండలోదకంలో ఉంచి, తన ఆశ్రమానికి తీసుకువెళ్ళాడు.

అలా ఆశ్రమంచేరిన చేపపిల్ల, ఆ మరుసటి ఉదయానికల్లా, కమండలువు నిండిపోయింది. అందులో, సుఖంగాఉండలేకపోయింది. అందుకనే, ఆ మహారాజు నుద్దేశించి, 'నన్ను, మరొక విశాల ప్రదేశంలో విడువవలసింది' అని ప్రార్థించింది. ఆ వెంటనే, ఆయన, దాన్ని తీసుకుపోయి, ఒక చిన్న మడుగులో వదిలాడు.

మడుగులో ప్రవేశించిన మరుక్షణంలోనే, అది, ఆ జలాశయాన్ని మించి పెరిగిపోయింది. ఆ మడుగుకూడా తనకు సుఖప్రదంగాలేదని, మహారాజుకు విన్నవించుకుంది.

ఆ పరిస్థితి, మహారాజుకు, ఆశ్చర్యం కలిగించింది. ఆ వెంటనే, ఆయన, దాన్ని తీసుకువెళ్ళి, ఒక నదిలో వదిలాడు. ఆ నదీగర్భంలో ప్రవేశించగానే, ఆ మీను అమితంగా పెరిగిపోయింది.

అక్కడకూడా అటూఇటూ కదలటానికి తావు లేకపోవటంవల్ల, అది, ఆ మహారాజుకు, తిరిగి తన పరిస్థితిని వివరించుకుంది. అది మహాద్భుతమనుకుంటూనే, ఆ మహారాజు, దాన్ని, అక్కడనుంచి తొలగించి, మహార్ణవంలో వదిలాడు.

అలా మహార్ణవంలో విడువబడ్డ మీను, ఆ మహారాజు నుద్దేశించి, 'రాజా ! దయతో నన్నింతదాన్ని చేసి, చివరకు, మకరాలయంలో వదలటానికి నీ మనసు ఎలా అంగీకరించింది ?' అని ప్రశ్నించింది.

ఆ పలుకులు విన్న మహారాజుకు, ఆ మీను, మాధవుడే అయి ఉండాలన్న అభిప్రాయం కలిగింది. అందుకనే, దానికి, భక్తిపూర్వకంగా ప్రణామం చేశాడు. ఆపైన, దాన్ని ఉద్దేశించి...

శ్రీలలనాకుచవీథిని
కేళీ పరతంత్రబుద్ధి గ్రీడించు సుఖా

లోలుడవు తామసాకృతి
నేలా మత్స్యంబవైతి వెఱిగింపు హరీ !'

అని ప్రార్థించాడు. అలా ప్రార్థించిన సత్యవ్రత మహారాజుకు సమాధానంగా, మీనరూపధారి అయిన శ్రీహరి ఇలా అన్నాడు.

"మహారాజా ! మరొక వారంరోజుల్లో జలప్రళయం సంభవించబోతోంది. ఆ సందర్భంలో, ముల్లోకాలూ, మున్నీటిలో మునిగిపోతై. అప్పుడు, నువ్వు, వివిధోషధులనూ, సకల బీజరాసులనూ సంగ్రహించి, సప్తర్షులతోసహా, నేను పంపే నావలో ప్రవేశించాలి. ప్రళయ ఝంఝూనిలంవల్ల, ఆ నావ, నీటిలో మునిగిపోకుండా, వాసుకుని త్రాడుగా ఉపయోగించి, నువ్వు, దాన్ని, నా కొమ్ముకు కట్టాలి. ఆ విధంగా, నువ్వూ, సప్తర్షులూ ఉన్న ఆ నావను, బ్రహ్మదేవునకు రాత్రికాలం గడచేవరకూ, ఆ జలమధ్యంలో, నేను నడుపుతూ ఉంటాను. ఆ మహత్కార్యాన్ని నిర్వహించటానికే, నే నీ రూపం ధరించి, అచిరకాలంలోనే, ఇలా, శతయోజన ప్రమాణంగా, శరీరాన్ని పెంచుకోవటం జరిగింది."

ఆ విధంగా తెలియబరచి, మత్స్యరూపి అయిన మాధవుడు తిరోహితుడయినాడు. ఆ తరువాత, ఆ మహారాజు, మాధవుని చరణాబ్జాలనే మనసులో నిలుపుకుని, ధ్యాననిష్ఠలో ఉండిపోయినాడు.

అంతలో, ప్రళయకాలం సమీపించింది. ఒక్కసారిగా, మహామేఘా లన్నీ వర్షించినై. అది కారణంగా, సప్త సముద్రాలూ పొంగి, చెలియలికట్టలు దాటి, భూమండలాన్నంతనూ ఏకార్ణవంగా తయారుచేసినై.

ఆ సమయంలో, దిక్కులన్నీ చీకటిమయమై పోయినై. కాని, సప్తర్షుల తేజం మాత్రం, ఆ చీకటిలో, అప్పుడప్పుడు, మినుకు మినుకుమంటూ, వెలుగులు చిమ్ముతూనే ఉంది.

ఆ వెలుగులో, సత్యవ్రతు డొక నావను చూశాడు. చూసి, తాను

సంగ్రహించిన సర్వౌషధులనూ, బీజాలనూ తీసుకుని, సప్తర్షులతోసహా, ఆ నావలో ప్రవేశించాడు; ఏకాగ్రచిత్తంతో, శ్రీహరిని ధ్యానించుకుంటూ ఉండిపోయినాడు.

ఆ వెంటనే, మీనరూపధారి అయిన శ్రీహరీ, వాసుకీ, అతని ఎదుట సాక్షాత్కరించారు. అతడు, వారికి అంజలించి, శ్రీహరి ఆదేశానుసారం, వాసుకిని నావకూ ఆమీను దయిన ఏకైక శృంగానికీ కలిపికట్టాడు; తిరిగి హరిధ్యానపరతంత్రుడై నాడు.

అంతవరకూ సృష్టికార్యాన్ని నిర్వహించి బడలిఉన్న చతుర్ముఖుడు, ఆ సమయంలో విశ్రాంతి తీసుకుంటున్నాడు. అలా విశ్రాంతి తీసుకుంటున్న ఆయన ముఖంనుంచి, వేదాలు బాహిరిల్లినై. అది గ్రహించిన హయగ్రీవుడనే ఒక దైత్యభటుడు, వాటిని దొంగిలించి, ఆపైన అక్కడ ఉండటం అపాయకరమని భావించి, సముద్రగర్భంలో ప్రవేశించాడు.

హయగ్రీవుడు, వేదాల నలా అపహరించుకుపోవటం, శ్రీహరి గ్రహించాడు. ఆ వెంటనే, ఆయన, అతణ్ణి వెంబడించివెళ్ళాడు. అలా వెళ్ళి...

ఒకమాటు జలజంతుయూథంబుతో గూడు
    నొకమాటు దరులకు నుఱికివచ్చు
నొకమాటు మింటికి నుదరి యుల్లంఘించు
    నొకమాటు లోపల నొదిగియుండు
నొకమాటు వారాసి నొడలు ముంపమి జూచు
    నొకమాటు బ్రహ్మాండ మొరయదలచు
నొకమాటు ఋషకోటి నొడిసి యాహారించు
    నొకమాటు జలముల నుమిసివైచు
గఱులుసారించు మీసల గదలు నివురు
బొడలు మెఱపించు గన్నుల పొలపమార్చు

నొడలు జళిపించు దళుకున నొలయు మీన
వేషి పెన్నీట నిగమ గవేషి యగుచు.

ఆ పెనురేయి పూర్తి అయేవరకూ అలా జలగర్భంలో విహరిస్తూ ఉన్న శ్రీహరి, చిట్టచివరకు, ఆ హయగ్రీవునితో తలపడి, పోరాడి, అతణ్ణి వధించాడు. అతడివద్ద ఉన్న వేదరాశిని సంగ్రహించాడు; ప్రళయావసానసమయంలో నిద్రనుంచి మేల్కొన్న చతుర్ముఖునికి, తిరిగి వాటిని ప్రసాదించాడు.

ఆ విధంగా వేదచయాన్ని ఉద్ధరించిన పరమపురుషుని, సత్యవ్రత మహారాజు ఇలా ప్రార్థించాడు.

"తండ్రీ! నేను నీ దాసానుదాసుణ్ణి. ఈ సంసారచక్ర పరిభ్రమణంనుంచి తప్పుకోవాలని చూస్తున్నవాణ్ణి. ముక్తిదాతవైన నువ్వు నాకా మహద్భాగ్యాన్ని కలిగించవలసింది.

నాయనా! నువ్వు, సూర్యుడే కన్నులుగా వెలిగే మహానుభావుడవు. నీకు, యీ ప్రపంచంలో, తెలియని విషయమంటూ లేదు. నువ్వు నాకు గురుడవు కావలసింది; నాకు సద్గతిని చూపవలసింది.

చెలివై చుట్టమవై మనస్థితుడవై చిన్మూర్తివై యాత్మవై
వలనౌ కోర్కులపంటవై విభుడవై వర్తిల్లు ని న్నొల్లకే
పలువెంటం బడి లోక మక్కట వృథాబద్ధాశమై పోయెడిన్
నిలువన్ నేర్చునె హేమరాశి గనియున్ నిర్భాగ్యు డంభశ్శయా!

ఆలింపుము విన్నప మిదె
వేలుపుగమిఱేని నిన్ను వేడికొనియెదన్
నాలోని చిక్కు మానిచి
నీలోనికి గొంచుబొమ్ము నిఖిలాధీశా!"

అలా పలికిన సత్యవ్రతుని భక్తికి సంతోషించి, మత్స్యరూప

ధారి అయిన శ్రీహరి, అతనికి, పరమేశ్వర తత్త్వాన్ని గురించి విపులంగా విశదపరచటం, అనంతరకాలంలో ఆ మహారాజు, శ్రీమన్నారాయణుని కృపావిశేషంవల్ల, ఏడవమనువుగా ప్రసిద్ధిపొందటం, జరిగింది.

## 52. అంబరీషుడు :

అంబరీషుడు ఒక మహారాజు. ఆయన, మహీమండలాని కంతటికీ నాథుడై ఉండికూడా, తనదైన వైభవాన్ని ఏమాత్రంగానూ లక్ష్యం చేసేవాడు కాదు. విభవమన్నది తమోద్వారమన్న అభిప్రాయం ఆయన కుండేది. అందుకనే, ఆయన, అశాశ్వతమయిన భోగా లన్నింటినీ త్యజించి, సదా, విష్ణుసేవానిరతుడై ఉండేవాడు; అహోరాత్రాలు, వైష్ణవార్చనలో కాలం వెళ్ళదీసుకునేవాడు.

చిత్తంబు మధురిపు శ్రీపాదముల యంద
పలుకులు హరిగుణ పఠనమంద
కరములు విష్ణుమందిరమార్జనములంద
చెవులు మాధవకథాశ్రవణమంద
చూపులు గోవిందరూప వీక్షణమంద
శిరము కేశవ నమస్కృతులయంద
పదము లీశ్వరగేహపరసర్పణములంద
కామంబు చక్రి కైంకర్యమంద
సంగ మచ్యుతజనతను సంగమంద
ఘ్రాణ మసురారిభక్తాంఘ్రికమలమంద
రసన దులసీదళము లంద రతులు పుణ్య
సంగతులయంద యా రాజచంద్రమునకు.

అటువంటి అంబరీషుడు, అనేకమైన అశ్వమేధాలుచేసి, విష్ణువు

నారాధించాడు. ఆయన నాదర్శంగా తీసుకుని, ఆయన ప్రజలుకూడా, భక్తి యోగపరులై వ్యవహరించటం జరిగింది.

ఆ మహారాజు, ఏపనిచేసినా, హరిపరంగానే చేసేవాడు. హరి భక్తులను చూసినప్పుడల్లా, హరిని దర్శించినంతగా ఆనందించేవాడు. అలా ఉండికూడా, ఆయన, రాజ్యవ్యవహారాలన్నీ చూసుకుంటూనే ఉండేవాడు. అందుకనే, ఆయనకు, రాజర్షి అన్న ప్రఖ్యాతి లభించింది.

అలా ఉన్న అంబరీషునకు, కాలక్రమాన, గృహారామవిత్తాదుల మీదా, భార్య మీదా, పుత్రమిత్రాదులమీదా ఆస క్షీణించిపోయింది. ఆ వెంటనే, ఆయన, సంసారాన్ని వదలి, ఒక ఏకాంతస్థలానికి వెళ్ళిపోయినాడు; అలా వెళ్ళి, నిర్మలచిత్తంతో, శ్రీమహావిష్ణువును సేవింపసాగాడు.

అంబరీషుని భక్తిభావం, శ్రీహరికి అమితానందం కలిగించింది. అది కారణంగానే, ఆయన, అతని రక్షణభారాన్ని, తన చక్రాయుధానికి ఒప్పగించాడు; అతణ్ణి, తన భక్తులలో అగ్రగణ్యునిగా పరిగణింపసాగాడు.

అలాఉండగా, ఓసారి, అంబరీషుడు, విష్ణుప్రీత్యర్థం, ఒక సంవత్సరంపాటు, విధ్యుక్తంగా, ద్వాదశీవ్రతం నిర్వహించటం జరిగింది. ఆ వ్రతాంతాన, ఆయన, మూడురాత్రులు ఉపవసించి, నాల్గవనాడు ఉదయాన పారణకు తగిన ఏర్పాట్లన్నీ చేయించుకున్నాడు.

ఆ సమయంలో, దుర్వాసమహర్షి అక్కడకు వచ్చాడు. అలా వచ్చిన దుర్వాసుని, అంబరీషుడు, భక్తిపూర్వకంగా పూజించాడు. ఆ పూటకు, తన ఆతిథ్యాన్ని స్వీకరింపవలసిందిగా, ఆయన్ని కోరాడు. దుర్వాసు డందుకు అంగీకరించి, మాధ్యాహ్నిక క్రియలు నిర్వర్తించుకునే నిమిత్తం, యమునానదికి వెళ్ళాడు.

అలా యమునానదికి వెళ్ళిన మహర్షి, ద్వాదశిఘడియలు గడిచే సమయానికికూడా తిరిగిరాలేదు. ద్వాదశి, అప్పటికింకా అర్ధముహూర్తం

మాత్రమే ఉంది. ఆ లోపల పారణచేయకపోతే, వ్రతఫలం దక్కదు. అది గ్రహించిన అంబరీషుడు, వ్రతభంగంకాకుండానూ, అతిథిపట్ల అపచారం సలిపిన దోషం, సంభవించకుండానూ ఉండేవిధంగా, శాస్త్రచోదితమైన జల పారణం చేసి, మహర్షికోసం ఎదురుచూస్తూఉన్నాడు.

అంతలో, దుర్వాసుడు వచ్చాడు. వచ్చి, తన దివ్యదృష్టిద్వారా, అంబరీషుడు జలపారణచేయటం గ్రహించాడు. అది, తనపట్ల జరిగిన అప చారంగా భావించాడు. ఆ వెంటనే, అంబరీషుని ఉద్దేశించి, 'అతిథినైన నన్ను అవమానించిన ఫలం ఇప్పుడే అనుభవించితీరుతావు' అని గర్జించాడు; తన జట నొకదాన్ని పెఱికి, దానినుండి, ప్రళయానల సదృశమైన ఒక కృత్యను సృజించి, వివిధాయుధాలంకృత అయిన, దాన్ని, ఆయనమీదకు వదిలాడు.

అది గ్రహించిన శ్రీమన్నారాయణుడు, దుర్వాసుని దురా గ్రహాన్ని వారించి, భక్తుడయిన అంబరీషుని సంరక్షించేనిమిత్తం, తన చక్రాయుధాన్ని పంపాడు. అది, ప్రచండవేగంతో వచ్చి, ఆ మహర్షి సృజిం చిన కృత్యను సంహరించింది. అంతటితోఆగక, భక్తాపరాధానికి పూనుకున్న దుర్వాసునిమీదకు వెళ్ళింది.

దవానలంమాదిరి తనమీదకువస్తున్న చక్రాన్ని చూసి, దుర్వాస మహర్షి, అమితంగా భయపడిపోయినాడు. దాన్ని నివారింపగల శక్తి తనకు లేదని తెలుసుకుని, ఆయన, అక్కడినుంచి పారిపోవటానికి ప్రయత్నిం చాడు. కాని, ఆయన ప్రయత్నమంతా విఫలమైపోయింది. ఆ చక్రాయుధం, ఆయన ఎటుపోతే అటుపోయి, ఆయన్ని, అమితంగా పీడింపసాగింది; ఆయనకు, మనశ్శాంతి లేకుండా చేసింది.

అది కారణంగా, దుర్వాసుడు, పోయిపోయి, బ్రహ్మదేవుని శరణుజొచ్చాడు; తన్ను పీడించే విష్ణుతేజాన్ని నివారించి, తన్ను కాపాడ వలసిందిగా ఆయన్ని ప్రార్థించాడు. కాని, చతుర్ముఖుడు, తన కా శక్తి లేదని ఆయనకు తెలుపుకోవటం జరిగింది.

ఆ వెంటనే, దుర్వాసుడు, కైలాసానికి వెళ్ళి, శంకరుని సమీపించి, తన్ను తరుముకువస్తున్న చక్రాయుధాన్ని వారించి, తన భీతిని తొలగింపవలసిందిగా ప్రార్థించాడు. అక్కడకూడా, ఆయనకు శాంతి లభించలేదు. చతుర్ముఖునిమాదిరిగానే, శంకరుడుకూడా తన అశక్తతను తెలియబరచుకున్నాడు.

ఆ సమయంలో, దుర్వాసునకు గత్యంతరం కనిపించలేదు. అప్పుడు తనను రక్షింపగలవాడు ఆ శ్రీమన్నారాయణుడు మాత్రమే అన్న అభిప్రాయం ఆయనకు కలిగింది. ఆ వెంటనే, ఆయన, పరుగుపరుగున వైకుంఠానికి వెళ్లాడు. వెళ్ళి, అక్కడ, ఒక మణిసౌధంలో, శ్రీదేవితో ముచ్చటిస్తూ ఉన్న జగన్నాథుని సమీపించి, ఆయన పాదాలమీదపడి, 'తండ్రీ! నీ చక్రాయుధజ్వాల నన్ను భస్మంచేయకుండా చూడవలసింది. నీ భక్తునిపట్ల నేను చేసిన అపచారాన్ని క్షమించవలసింది; నన్ను రక్షింపవలసింది;' అని ప్రతిమాలుకున్నాడు.

దుర్వాసుని దీనాలాపాలు, శ్రీమన్నారాయణునకు, జాలి కలిగించినై. అందుకనే, ఆయన, ఆ మహర్షి నుద్దేశించి ఇలా అన్నాడు.

"మహర్షీ! నేను భక్తపరాధీనుణ్ణి. సాధువులయినవారు తమదైన భక్తిభావంతో నన్ను వశీకరించుకుంటారు. పుత్ర మిత్ర కళత్రాదులనూ, గృహారామాది సర్వసంపదలనూ త్యజించి, నేనే పరమగతి అని నమ్ముకున్న నా భక్తులను వదలి, నే నొక క్షణకాలమయినా దూరంగా ఉండలేను. వారిని నేను నా హృదయంగా భావిస్తాను. వారుకూడా నన్నే వారి హృదయంగా భావిస్తారు. అటువంటి భక్తులపట్ల అపచారం సలిపినవారు తమదైన తేజాన్ని కోల్పోయితీరుతారు.

ఆ విధమైన తేజోహానివల్లనే, మీరిప్పుడు బాధపడుతున్నారు. మీ బాధను తొలగించేశక్తి, నాకుకూడా లేదు. మీరు ఏ భక్తునికైతే అపకారం తలపెట్టారో ఆ భక్తుడుమాత్రమే మీ కిప్పుడు అభయమివ్వటానికి

అర్హుడై ఉంటాడు. మీ రతని శరణు కోరి, అతణ్ణి ప్రసన్నుని చేసుకోవటం అవసరం. అదే, మీకు శాంతిని చేకూర్చగలుగుతుంది."

అలా ఉపదేశించిన శ్రీమన్నారాయణునివద్ద సెలవు తీసుకుని, దుర్వాసుడు, ఆ వెంటనే, అంబరీషుని సమీపించాడు. ఆయన పాదాలమీద పడ్డాడు; తన దోషాన్ని క్షమించవలసిందనీ, తన ప్రాణభీతిని తొలగించ వలసిందనీ వేడుకున్నాడు.

దుర్వాసమహర్షి అంతవాడు, తన చరణాలను స్పర్శించటం, అంబరీషుడు భరించలేకపోయినాడు. అందుకనే, ఆయనను లేవదీశాడు. ఆయనకు గౌరవం చూపాడు; ప్రణామం చేశాడు. ఆ పైన చక్రాయుధాన్ని స్తుతి పూర్వకంగా ఇలా ప్రార్థించాడు.

"నీవ పావకుడవు నీవ సూర్యుండవు
నీవ చంద్రుండవు నీవ జలము

నీవ నేలయు నింగి నీవ సమీరంబు
నీవ భూతేంద్రియ నికరములును

నీవ బ్రహ్మంబును నీవ సత్యంబును
నీవ యజ్ఞంబును నీవ ఫలము

నీవ లోకేశులు నీవ సర్వాత్మయు
నీవ కాలంబును నీవ జగము

నీవ బహుయజ్ఞభోజివి నీవ నిత్య
మూలతేజంబు నీకు నే మ్రొక్కువాడ
నీరజాక్షుండు చాల మన్నించునట్టి
శస్త్రముఖ్యమ కావవే 'సంయమీంద్రు'.

కమల లోచనుండు ఖలుల శిక్షింపంగ
బాలుసేయ నీవు పాలువడితి

వైన నింకజాలు నాపన్నుడై యున్న
తపసి గావు మీవు ధర్మవృత్తి."

ఆ విధంగా, భక్తశిరోభూషణుడయిన అంబరీషుడు ప్రార్థించ గానే, ఆ సుదర్శన చక్రం, అక్కడే ఆగిపోయింది. అది గ్రహించిన అంబరీషుడు, శ్రీమన్నారాయణుని స్మరించుకుని, అంజలించి, ఇలా అన్నాడు.

"విహిత ధర్మమందు విహరింతునేనియు
నిష్టమైన ద్రవ్య మిత్తు నేని
ధరణి సురుడు మాకు దైవతంబగునేని
విప్రునకు శుభంబు వెలయుగాక.

అఖిలగుణాశ్రయుడగు హరి
సుఖియై నా కొలువువలన జొక్కెడి నేనిన్
నిఖిలాత్మమయుండగుటను
సుఖమందుంగాత భూమిసురు డి వ్వేళన్".

అంబరీషుడు అలా పలుకగానే, ఆ చక్రం అంతర్థానమై పోయింది. దుర్వాసమహర్షి శాంతిపొందాడు. ఆ పైన, ఆయన, అంబరీషుని ఉద్దేశించి...

"ఒకమా చెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోకినన్
సకలాఘంబులు పల్లటించి తొలగున్ సంభ్రాంతితో నట్టి స
త్సుకరున్ మంగళ తీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశు దా
రకలంకస్థితి గొల్చు భక్తులకు లే దర్థంబు రాజోత్తమా!"

అని, భక్తులపట్ల తనకు కలిగిన అభిప్రాయాన్ని వ్యక్తపరచుకున్నాడు. ఆ తరువాత, ఆ మహారాజు సలిపిన పూజలందుకుని, అతిధిసత్కారాలన్నిటినీ స్వీకరించి, ఆయన్ని దీవించి, బ్రహ్మలోకానికి వెళ్ళిపోయినాడు.

## 53. భగీరథుడు :

సూర్యవంశానికి, వైవస్వతమనుపుత్రుడయిన ఇక్ష్వాకుడు మూల పురుషుడు. ఆయన కుమారులు, నూరుమందిలోనూ, పెద్దవారయిన కుక్షి, నిమి, దండకుడు అనేవారు ముగ్గురూ, హిమాచల వింధ్యాద్రుల మధ్యభాగానికి అధిపతులయినారు. మిగిలినవారు, ఆర్యావర్తంలోని తదితర భాగాలను పాలించారు.

నిమి వంశీయులలో పదిహేనవతరంవాడైన యువనాశ్వుడు, సంతానాన్ని కోరి, ఇంద్రయాగంచేస్తున్నసమయంలో, పొరపాటున, మంత్ర జలాన్ని త్రాగటం జరిగింది. అది కారణంగా, ఆయన, గర్భం ధరించాడు; ఒక మగ శిశువును ప్రసవించాడు. అలా పుట్టిన కఱ్ఱవాడే, కాలక్రమాన, 'మాంధాత' అని, ప్రసిద్ధిపొందాడు.

మాంధాత భార్యపేరు బిందుమతి. బిందుమతీ, మాంధాతలకు అంబరీషుడు, పురుకుత్సుడు, ముచికుందుడు అనే, ముగ్గురు కుమారులూ, ఏబదిమంది కుమార్తెలూ, కలిగారు. వారిలో, ముచికుందుడు పరమభక్తుడు.

మాంధాత కుమార్తెలయిన, ఏబదిమంది కన్యలూ, సౌభరి అనే ఒక మునీశ్వరుని, కోరి పెండ్లిచేసుకున్నారు. ఆయనవల్ల, తలకొక నూర్గురు పుత్రులను పొందారు.

వారి, సోదరుడయిన, పురుకుత్సుడు, ఉరగవంశానికి చెందిన నర్మదను, వివాహంచేసుకున్నాడు. ఆ నర్మదా పురుకుత్సుల వంగడం లోనే, త్రిశంకుడు జనించాడు.

త్రిశంకుడు, వసిష్ఠమహాముని శాపంవల్ల, చండాలుడై, విశ్వామిత్రుని కృపావిశేషంవల్ల, సశరీరస్వర్గం పొందటం జరిగింది. ఆ త్రిశంకుని కుమారుడే హరిశ్చంద్రుడు.

హరిశ్చంద్రుడు సత్యవ్రత పరాయణుడు. విశ్వామిత్రుడు ఒక సారి ఆయనను కలుసుకుని, యాగదక్షిణగా ఆయన ధనరాసులన్నిం

టినీ కొల్లగొన్నాడు. చివరకు, ఆయన నొక చండాలునకు విక్రయించి, ఆయన నమితంగా పీడించాడు. అది గ్రహించిన వసిష్ఠుడు, విశ్వామిత్రుని మీద కోపగించుకుని, ఆయనను, 'గద్దగా మారిపోవలసింది' అని, శపించటం, అది కారణంగా, విశ్వామిత్రుడు, వసిష్ఠుని ఉద్దేశించి, 'నువ్వు కొంగవు కావలసింది' అని, ప్రతిశాప మివ్వటం, జరిగింది.

హరిశ్చంద్రునకు, వరుణుని దయవల్ల, రోహితుడనే కుమారుడు కలిగాడు. ఆ రోహితుడు, ఆరు సంవత్సరాలపాటు భూపర్యటనం చేయటం సంభవించింది.

రోహితునివంశంలో పుట్టినవాడే సగరుడు. సగరకుమారుల వల్ల నిర్మింపబడటంచేతనే, సముద్రానికి, సాగరమని పేరు వచ్చింది.

సగరునకు, సుమతి. కేశిని, అనే ఇద్దరు భార్య లున్నారు. వారిలో, సుమతికి, అరవై అయిదుగురు కుమారులూ, కేశినికి, అసమంజసు డనే ఏకైకపుత్రుడూ, కలిగారు.

అసమంజసుడు, పూర్వజన్మలో, ఒక మహాయోగిగా ఉండేవాడు. కాని, దుష్టసాంగత్యంమూలంగా, యోగభ్రష్టుడు కావటం జరిగింది. అయినా, అతని కీ జన్మలో, పూర్వస్మృతిలభించడంవల్ల, సంగపరిహారార్థం, లోకానికి అప్రియమైనకార్యాలనే ఆచరిస్తూ, అసమంజసుడనిపించుకున్నాడు. అది కారణంగా, అతనితండ్రి, అతణ్ణి, దేశంనుంచి బహిష్కరించాడు.

ఒకసారి. సగరమహీపతిదైన యాగాశ్వాన్ని, మహేంద్రుడు అపహరించటం, దాన్ని కపిలాశ్రమంలో వదలటం, జరిగింది. ఆ అశ్వాన్ని అన్వేషిస్తూ పోయిన సగరకుమారులు, పాతాళంలోఉన్న కపిలమహర్షివద్ద దాన్నిచూసి. కపిలుడే దాన్ని హరించి ఉంటాడన్న అభిప్రాయంతో, ఆయన్ని అవమానించారు. అది కారణంగానే, ఆయన శాపానికి పాత్రులై, భస్మీభూతులయినారు.

ఎంతకాలానికీ తన కుమారులు తిరిగిరాకపోవటంవల్ల, సగరుడు,

అమితంగా వ్యాకులపడ్డాడు. అందుకనే, వారిజాడ తెలుసుకురావలసిందిగా, అసమంజసుని కుమారుడయిన అంశుమంతుని ఆదేశించాడు.

అంశుమంతుడు, దిక్కులన్నీ గాలించి, చిట్టచివరకు కపిలాశ్రమం చేరుకున్నాడు. అక్కడఉన్న తమ యాగాశ్వాన్ని, భస్మరాసులై పడి ఉన్న తన పినతండ్రులనూ చూశాడు. చూసి, కపిలుని సేవించి, ఆయన అభిమానాన్ని పొంది, తన తండ్రులను పవిత్రులనుచేసే ఉపాయాన్ని ఆయననుంచి గ్రహించాడు. ఆపైన, అతడు, తన తాతను చేరుకోవటం, ఆయన అనుగ్రహానికి పాత్రుడై, ఆయన తరువాత, రాజ్యాధికారాన్ని పొందటం, సంభవించింది.

సగరపుత్రులను పవిత్రులను చేయటానికి, వారి భస్మరాసుల మీదుగా గంగను ప్రవహింపచేయట మొకటే మార్గమని గ్రహించిన అంశుమంతుడు, అది తన కసాధ్యమైన కార్యమని తేల్చుకున్నాడు; చాలా విచార పడ్డాడు. ఆయన కోరికను తీర్చటానికీ, తన తాతలకు ఉత్తమగతులు కల్పించటానికీ, ఆయన తరువాత రాజైన దిలీపుడు, ఎంతగానో ప్రయత్నించాడు; కాని, అతని ఆశయంకూడా సిద్ధించలేదు.

అతని అనంతరం రాజ్యాధికారానికి వచ్చిన అతని పుత్రుడు, భగీరథుడు, తన పూర్వుల ఆశయాన్ని సిద్ధింపజేయాలనే అభిప్రాయంతో, తీవ్రతప మాచరించాడు. గంగను సంతుష్టి పరచాడు. ఆమెను ప్రసన్నురాలిని చేసుకున్నాడు. ఆపైన ఆమెతో...

"మావారి భస్మరాసుల
నీ వారిం గలిపికొనుము నెఱి మావారల్
నీ వారి గలయ నాకము
మావారికి గలుగు నిది ప్రమాణము తల్లీ!"

అని, ప్రార్థనాపూర్వకంగా విన్నవించుకున్నాడు.

గంగ అతని విన్నపాన్ని మన్నించింది; భూమికి దిగిరావటానికి

అంగీకరించింది. కాని, వినువీధినుంచి భూమికి దిగే సమయంలో, తన వేగాన్ని భరింపగలవాని నొకని జూపవలసిందిగా భగీరథుని కోరింది. దాని మీద, భగీరథుడు...

"తనలో నిన్ని జగంబులుం గలుగుటం తా నన్నిటం గల్గుటన్
జననీ తంతువులందు జీరగల యా చందంబునన్ విశ్వభా
వనుడై యొప్పు శివుండుగాక మఱి నీ వారిన్ నివారింప నే
ర్చినవారెవ్వరు నిన్ ధరించుకొఱకై శ్రీకంఠునిం గొల్చెదన్"

అని ఆమెకు నివేదించుకున్నాడు. అది విన్న గంగ, తనకు గల మరొక సందేహాన్ని కూడా ఆయనకు తెలుపుకుంది.

"భూలోకానికి రావటానికి నా కేవిధమయిన సంకోచం లేదు. కాని, మానవు లందరూ నన్ను సేవించి, వారి వారి పాపాలను నాలో వదలటం జరుగుతుంది. ఆ పాపా లన్నింటినీ నే నెలా హరించుకోవాలో నాకు తెలియకుండా ఉంది."

అలా పలికిన సురనదీమతల్లికి సమాధానంగా, భగీరథు డిలా అన్నాడు.

"పరతత్త్వజ్ఞులు శాంతచిత్తులు తపః పారీణు లార్యుల్ ఘనుల్
పురుషశ్రేష్ఠులు వచ్చి తల్లి భవదంభోగాహముల్ సేయగా
నరసంఘాఘము నిన్ను బొందునె జగన్నాథుండు నానాఘ సం
హరుడా విష్ణుడు వారి చిత్తముల దానై యుంట మందాకినీ!"

భగీరథుని పలుకులు విన్న మందాకిని అమితంగా సంతోషించింది. ఆ వెంటనే, భగీరథుడు, ఆమె వద్ద సెలవు తీసుకుని వెళ్ళి, మహేశ్వరుని గూర్చి ఘోరమైన తపస్సు చేశాడు. అది కారణంగానే...

భక్తవత్సలుండు ఫాలాక్షు డా భగీ
రథుని మెచ్చి నిజ శిరంబునందు

శౌరి పాదపూత సలిలయై దివినుండి
ధరకు వచ్చు గంగ దాల్చెనపుడు.

అలా, శివజటాజూటంనుంచి భూమికి దిగిన గంగను తనవెంట తీసుకుపోయి, భగీరథుడు, తన పితృవ్యుల భస్మరాసులమీద ప్రవహింప చేశాడు. వారికి ఉత్తమలోకాలు కల్పించాడు. ఆ విధంగా భగీరథుని యత్నంవల్ల భువికిదిగిన మందాకినికి, 'భగీరథి' అన్న సార్థకనామం సిద్ధించింది. ఆమెనే, 'జాహ్నవి' అనికూడా అంటారు.

*54. ఖట్వాంగుడు* :

పవిత్ర చరిత్రుడైన భగీరథుని మనుమని ముని మనుమడు ఋతుపర్ణుడు. ఆయన, నలమహారాజుతో స్నేహంచేసి, ఆయననుంచి అశ్వవిద్యను గ్రహించాడు; దానికి మారుగా, ఆయనకు, అక్షహృదయాన్నిచ్చాడు.

ఆ ఋతుపర్ణుని కుమారుడయిన సుదామునే, కల్మాషపాదుడనికూడా అంటారు. ఆయన భార్యపేరు మదయంతి. మదయంతీ సుదాముల ముని మనుమని మనుమడు ఖట్వాంగచక్రవర్తి.

ఖట్వాంగుడు, దేవాసుర సమరంలో దేవతలకు సాయపడి, దానవులను వధించాడు. దానికి మెచ్చుకున్న దేవతలు, అతణ్ణి, ఏదో ఒక వరం అడుగవలసిందిగాకోరారు. దానిమీద, ఖట్వాంగుడు, తన కే వరమూ అక్కరలేదనీ, తన జీవితశేషం ఆపైన, ఎంతఉన్నదీ చెబితే చాలుననీ అన్నాడు. అది విన్న దేవతలు, అతడు, మరొక ముహూర్తంమాత్రమే జీవించిఉంటాడని తెలియబరచారు. ఖట్వాంగుడు, ఆ వెంటనే, ఒక దివ్య విమానంమీద తన రాజ్యానికి వెళ్లాడు. అలా వెళ్ళి...

'ఇలమీదన్ బ్రదుకేల వేల్పుల వరంబేలా ధనం బేల చం
చల గంధర్వపురీ విడంబనము లైశ్వర్యంబు లేలా జగం

బుల బుట్టించు తలంపునం బ్రకృతితో బొత్తై తుదిం బాసి ని
ర్మలమై వాఙ్మన సామితంబగు పరబ్రహ్మంబు నే జెందెదన్'

అని నిశ్చయించుకుని, తన రాజ్యాన్ని కుమారులకు పంచియిచ్చి, సర్వ విధ సంబంధాలనూ త్యజించి, మనస్సును మాధవునిమీదనే నిలుపుకుని, కళ్యాణప్రదమయిన బ్రహ్మపదాన్ని పొందాడు.

*55. రఘు రాముడు :*

మహనీయుడయిన ఆ మహారాజు మనుమడే రఘుచక్రవర్తి. ఆయన పేరటనే, రఘువంశం వెలిసింది.

రఘుమహారాజు మనుమడయిన దశరథుడు సుప్రసిద్ధుడు. ఆ దశరథునకు కౌసల్య, కైకేయి, సుమిత్ర అనే ముగ్గురు భార్య లుండేవారు. ఆ ముప్పురకూ, హరి అంశాంశలుగా, రామ భరత లక్ష్మణ శత్రుఘ్ను లనే నలువురు కుమారులు కలిగారు.

రామచంద్రుడు బాలుడై ఉన్నప్పుడే, విశ్వామిత్రుని కోరికమీద, ఆయనదైన సవనరక్షణార్థం వెళ్ళి, తాటక అనే ఒక ఘోర రాక్షసిని సంహరించాడు. సుబాహు డనే ఒక దానవునితో యుద్ధంచేసి, అతణ్ణి చంపాడు. అతని సోదరుడయిన మారీచుని, ఒకేఒక బాణంతో, సప్తసముద్రాలకూ అవతల పడేటట్టు విసరివేశాడు.

ఆ తరువాత, విశ్వామిత్రునితోసహ మిథిలానగరానికి వెళ్ళి, మూడువందలమంది మోసి తీసుకువచ్చిన శివధనుస్సును, అవలీలగా విరిచి, తన దోశ్శక్తిని ప్రకటించుకుని, అయోనిజఅయిన సీతామహాదేవిని, స్వయంవరంలో, భార్యగా స్వీకరించాడు.

సీతాస్వయంవరానంతరం, అయోధ్యకువస్తూఉన్న సమయంలో, శ్రీరామచంద్రుడు, క్షత్రియవంశ నిర్మూలనకు పూనుకున్న పరశురామునితో తలపడటం, విప్రుడయిన ఆయనను వధించటం భావ్యం కాదని, ఆయన తేజాన్ని మాత్రం హరించి పంపివేయటం, జరిగింది.

కైకేయి శ్రీరాముని సవతితల్లి. దశరథమహారాజు సంతానవంతుడు కాకపూర్వం, ఒకానొక సందర్భంలో, 'ఏవైనా మూడు వరాలు కోరుకో వలసింది' అని ఆయన ఆమె నడగటం జరిగింది. ఆమె, వాటిని, అప్పుడు కోరుకోలేదు. అలా దాచుకున్న ఆ వరాలను, ఆమె, రామచంద్రుని పట్టాభి షేకసమయంలో అడిగింది. ఆ వరప్రదాన ఫలితంగా శ్రీరాముడు, సీతా సహితుడై, లక్ష్మణునితోసహా, పధ్నాలుగేళ్ళపాటు, అరణ్యవాసం చేయ వలసివచ్చింది. అందుకు, రామచంద్రుడు, ఏవిధంగానూ, తండ్రిమీదగాని, కైకేయిమీదగాని, కోపగించుకోలేదు. పితృవాక్యాన్ని పరిపాలించటమే తన ధర్మ మనుకుని, ఆయన, తన రాజ్యాధికారాన్ని తన సవతి తమ్ముడయిన భరతునకు వదలి, నారలు ధరించి, అయోధ్యనుంచి వెళ్ళిపోయినాడు.

రామచంద్రుడు సతీ సోదర సహితుడై, దండకారణ్యంలో ఉండగా, లంకేశ్వరుడయిన రావణాసురుని చెల్లెలు శూర్పణఖ, దుశ్చింతతో, వారిని సమీపించటం జరిగింది. అది గ్రహించిన లక్ష్మణుడు, అన్న గారి ఆదేశానుసారం, అప్పుడు, దాని ముక్కూ-చెవులూ కోసేశాడు. అది కారణంగా, ఖర దూషణాది రాక్షసులు పధ్నాలుగువేలమందితో, రామ లక్ష్మణులు యుద్ధం చేయవలసివచ్చింది. ఆ యుద్ధంలో, రాక్షసు లందరూ హతు లయినారు.

శూర్పణఖద్వారా సీతాదేవి సౌందర్యాన్ని గురించి తెలుసుకున్న రావణుడు, మారీచుని, ఒక బంగరులేడిగా, పర్ణశాలవద్దకు పంపాడు. ఆ లేడినిచూసిన సీతాదేవి, అది తనకు కావాలనికోరింది. ఆమె కోరికనుతీర్చే నిమిత్తం, రామచంద్రుడు, ఆ మాయామృగాన్ని తరుముకుంటూవెళ్ళాడు. ఆ మృగంకూడా, ఆయనకు అందకుండా, చాలాదూరం వెళ్ళింది; చివరకు ఆయన వదలిన బాణంద్వారా ప్రాణం వదిలింది.

అలా ప్రాణంవదులుతూకూడా, మృగరూపంలోఉన్న మారీచుడు, తన ప్రభుడయిన రావణునకు సహాయం చేయనేచేశాడు. ప్రాణావసానసమయంలో, అతడు, 'హా ! లక్ష్మణా !' అని అఱచిన అఱపు, పర్ణశాలలోఉన్న

సీతాదేవీ, ఆమెకు కాపలాకాస్తున్న సౌమిత్రీ విన్నారు; విని, కలవరపడ్డారు. కాని, లక్ష్మణుడు, ఆవెంటనే తెప్పరిల్లి, అదేదో రాక్షసమాయ అయి ఉంటుందని అనుకున్నాడు. సీతాదేవి మాత్రం, తనభర్తకు అపాయమేదో సంభవించి ఉంటుందనే విశ్వసించింది. అందుకనే, ఆయనకు సహాయంగా వెళ్ళవలసిందని లక్ష్మణుని ఆదేశించింది; అతడెంత చెప్పినా, ఊరటపొంద కుండా, అతణ్ణి, అక్కడనుంచి పంపేసింది.

ఆ విధంగా, పర్ణశాలనుంచి రామ లక్ష్మణులు దూరంగా వెళ్ళిన సమయం కనిపెట్టి, రావణాసురుడు, మహాపతివ్రత అయిన సీతాదేవిని అప హరించుకుపోయినాడు. అలా రావణునిచేత అపహరింపబడ్డ సీతాదేవిని అన్వేషిస్తూఉన్న రామ లక్ష్మణులకు, జానకిని రక్షించే నిమిత్తం లంకేశ్వరు నితో పోరాడి గాయపడి ప్రాణాలు వదలబోతున్న జటాయువు, కనిపించింది. అది, శ్రీరామునకు, సీతాదేవివృత్తాంతం తెలియపరచి, ఆయన చేతుల్లోనే ప్రాణం విడిచింది.

అలా తన చేతుల్లో ప్రాణం వదలిన జటాయువునకు, రామచం ద్రుడు, అంత్యక్రియలు నెరవేర్చాడు. ఆ తరువాత, అక్కడనుంచివెడుతూ, దారిలోఎదురయిన కబంధుని వధించాడు. భక్తురాలయిన శబరికి, మోక్షం ప్రసాదించాడు.

అక్కడినుంచి, రామ లక్ష్మణులు, ఋష్యమూకానికి వెళ్ళారు. వానరనాథుడయిన సుగ్రీవునితో స్నేహం చేసుకున్నారు. ఆతరువాత, రామ చంద్రుడు, సుగ్రీవునకు మేలు చేకూర్చే నిమిత్తం, అతని సోదరుడూ దుష్ట స్వభావుడూ అయిన వాలిని వధించటం జరిగింది.

వాలి వధానంతరం, శ్రీరాముడు, సీతాదేవిజాడ తెలుసుకునే నిమిత్తం, వానరులను నలుదిక్కులకూ పంపాడు. అలా వెళ్ళిన వానరులలో హనుమంతుడు, సముద్రాన్ని లంఘించి, రాక్షస రాజ్యంలో ప్రవేశించి, సీతాదేవిని చూసి, ఆమెకు, శ్రీరాముని సందేశాన్ని తెలియపరచి, లంకాపట్ట

ణాన్ని దహించి, జానకినిచూసివచ్చినదానికి గుర్తుగా, ఆమె ప్రసాదించిన చూడామణిని రామచంద్రునకు సమర్పించుకున్నాడు.

ఆ వెంటనే, రామచంద్రుడు, కపిసేనతో, రావణునిపైకి దండెత్తి వెళ్ళాడు. అలా వెడుతున్న రామచంద్రునకు, దారిలో, సముద్రం, అడ్డుగా తోచింది. అది గ్రహించి, ఆ రఘువీరుడు, తనకు త్రోవ నివ్వవలసిందిగా సముద్రుని కోరాడు. కాని, రామచంద్రుని దర్శించిన ఆనందంతో, సముద్రుడు, ఉప్పొంగిపోవటం జరిగింది.

అది తెలియక, రామచంద్రుడు, సతీవియోగంవల్ల కలిగిన అవివేకంతో, సముద్రుని సంహరించటానికి విల్లందుకున్నాడు. అది గ్రహించిన సాగరుడు, రామవిభుని సముఖానికివచ్చి, ఆయన కిలా విన్నవించుకున్నాడు.

"ఓ కాకుత్స్థకులేశ యో గుణనిధీ యో దీనమందార నే
నీ కోపంబున కెంతవాడ జడధిన్ నీ వేమి భూరాజవే
లోకాధీశుడ వాదినాయకుడ వీ లోకంబు లెల్లప్పుడున్
నీ కుక్షిం బ్రభవించు నుండు నడగున్ నిక్కంబు సర్వాత్మకా !
కట్టుము సేతువు లంకం
జుట్టుము నీ బాణశిఖల సురవైరి తలల్
గొట్టుము నేలంబడ జే
పట్టుము నీ యబల నధిక భాగ్యప్రభలన్."

అలా విన్నవించుకున్న సముద్రుని మన్నించి, శ్రీరామచంద్రుడు, ఆ వెంటనే, వానరవీరుల సహాయంతో, సముద్రానికి సేతువును నిర్మించాడు; సునాయాసంగా, వారితో వారిధిని తరించాడు.

సముద్రాన్ని దాటి, లంకారాజ్యంలో ప్రవేశించబోతున్న శ్రీరామచంద్రుని, రావణుని సోదరుడయిన విభీషణుడు, శరణుజొచ్చాడు. వివేకనిధి అయిన విభీషణునకు అభయమిచ్చి, అతణ్ణి లంకారాజ్యానికి రాజుగా అభిషిక్తుని చేసి, శ్రీరామచంద్రుడు, ఆ వెంటనే, లంకలో ప్రవేశించాడు

రామ లక్ష్మణులు, వానరసేనతో లంకాప్రవేశం చేయటం గ్రహించిన రావణుడు, కుంభ నికుంభ ధూమ్రాక్ష విరూపాక్ష సురాంతక దుర్ముఖాది మహావీరుల సహాయంతో, వివిదాయుధాలు ధరించి, వారిమీదకు యుద్ధానికి వెళ్ళాడు. అప్పుడు జరిగిన ఘోరసమరంలో, వానరవీరులు, రాక్షసులందరనూ సంహరించారు. రామచంద్రుడు, రావణ కుంభకర్ణులనూ, లక్ష్మణుడు రాక్షసేశ్వరుని కుమారుడయిన మేఘనాథునీ, వధించటం జరిగింది. అదిచూసిన రావణుని పట్టమహిషి అయిన మండోదరి, తన భర్త నుద్దేశించి...

'ఎండ గాయ వెఱచు నినుడు వెన్నెలగాయ
వెఱచు విధుడు గాలి వీవ వెఱచు
లంకమీద నిట్టి లంకాపురికి పూకు
నధిప విధవభావ మదరె నేడు'

అని రోదించింది. ఆ తరువాత, విభీషణుడు, రామచంద్రుని ఆదేశాన్ననుసరించి, రావణునకు దహనాదిక్రియ లాచరించాడు. ఆ వెంటనే, శ్రీరామచంద్రుడు, విభీషణునకు లంకారాజ్యాధిపత్యాన్నీ, కల్పాంతాయువునూ ప్రసాదించి, అశోకవనంలోఉన్న సీతామహాదేవిని తీసుకుని, లక్ష్మణ సుగ్రీవాదులతో పుష్పకాన్నధిరోహించి, అయోధ్యానగరోన్ముఖుడై బయలుదేరాడు.

అలా వెడుతున్న శ్రీరామచంద్రాదులకు, నందిగ్రామంవద్ద, భరతుడు, భక్తిపూర్వకంగా స్వాగతంచెప్పి, అత్యంతవైభవంతో, వారిని అయోధ్యానగరానికి తీసుకువెళ్ళాడు. అక్కడ, రామచంద్రుని దర్శనం చేసుకుని....

'నృపవర పెక్కునాళ్ళగొలె నిన్ గనకుండిన యట్టి నేడు మా
తపములు పండె నిందఱము ధన్యులమైతి' మటంచు బుట్టముల్
చపలత ద్రిప్పి పువ్వుల వసంతములాడుచు బాడుచున్ గత
త్రపులయి యాడుచుం బ్రజలు పద్దయు బండుగసేసి రెల్లెడన్.

అలా నగరులో ప్రవేశించిన శ్రీరాముడు, తల్లులను కలుసుకుని, వారికి నమస్కరించి, తమ్ములను కౌగిలించుకుని, స్నేహితులను పలుకరించి, భృత్యులను మన్నించి, అందరికీ ఆనందం కలిగించాడు.

అంతలో వసిష్ఠమహర్షి వచ్చి, శ్రీరాముని జటాబంధం విడివించాడు; కులవృద్ధులసహాయంతో, ఆయనకు, సమంత్రకంగా, మంగళస్నానం చేయించాడు. భరతుడు సమర్పించుకున్న రాజసింహాసనంమీద ఆయన్ని కూర్చోబెట్టి, రాజ్యాభిషేకం చేశాడు. ఆ విధంగా పట్టాభిషిక్తుడై...

తండ్రిక్రియ రామచంద్రుడు
తండ్రుల మఱపించి ప్రజల దా రక్షింపం
దండ్రుల నందరు మఱచిరి
తండ్రిగదా రామధరణిదయితుం డనుచున్.

అలా రాజ్యపాలనం చేస్తూఉన్న రామచంద్రుడు, ప్రజల కష్ట సుఖాలనూ, ప్రజలకు తన పరిపాలనపట్లగల అభిప్రాయాలనూ గ్రహించే నిమిత్తం, అప్పుడప్పుడు, ప్రచ్ఛన్నరూపంతో, నగరంలో సంచరిస్తూ ఉండేవాడు. అలా సంచరిస్తూ ఉన్న సందర్భంలో, ఓరోజున, 'పరుని ఇంట్లో ఉన్న భార్యను రామచంద్రుడు తిరిగి తెచ్చుకున్నాడుగాని, నే నైతే అటు తిరిగి చూసేవాణ్ణికూడా కాదు,' అని, ఒకదుర్జను డనటం ఆయన విన్నాడు. విని, సీతాదేవి పాతివ్రత్యం తనకు తెలిసినా, లోకాపవాదుకు భయపడి, అప్పుడు, గర్భవతిగా ఉన్న జానకిని, అడవులకు పంపేశాడు.

అకారణంగా అడవులపాలయిన సీతామహాదేవిని, వాల్మీకిమహర్షి, ఆదరించి, తన ఆశ్రమంలో ఆమెకు ఆశ్రయ మిచ్చాడు. అక్కడే ఆమె ప్రసవించింది. ఆమెకు పుట్టిన కుమారులకు, వాల్మీకిమహర్షి, లవ కుశు లని నామకరణం చేశాడు. వారు అక్కడే పెరుగుతూ వచ్చారు.

కాలక్రమాన, లక్ష్మణునకు అంగద చంద్రకేతులూ, భరతునకు దక్ష పుష్కలులూ, శత్రుఘ్నునకు సుబాహు శ్రుతసేనులూ జనించారు.

ఆ తరువాత, భరతుడు, దిగ్విజయం చేసి, గంధర్వులను జయించి, విశేష ధనరాసులను తెచ్చి రామచంద్రునకు సమర్పించుకోవటం; శత్రుఘ్నుడు, మధువనంలో ఉన్న లవణు డనే రాక్షసుని సంహరించి, అక్కడ, మధురాపురాన్ని నిర్మించటం జరిగింది.

అనంతరం, సీతాదేవి, తన కుమారులను, వాల్మీకిమహర్షికి అప్ప గించి, భూగర్భంలోకి వెళ్ళిపోయింది. ఆదిదేవుడైన శ్రీరామచంద్రుడు, ఆ తరువాత, పదమూడువేల సంవత్సరాలు రాజ్యపాలనం చేసి, నిజావాసమైన వైకుంఠానికి వెళ్ళిపోయినాడు. ఆ పైన...

రామ చంద్రుతోడ రాకలపోకల
గదిసి తిరుగువారు గన్నవారు
నంటికొన్నవారు నా కోసల ప్రజ
లరిగి రాదియోగు లరుగు గతికి.

* * *

మంతనములు సద్గతులకు
పొంతనములు ఘనములైన పుణ్యముల కిదా
నీంతన పూర్వమహాఘ ని
కృంతనములు రామనామకృతి చింతనముల్.

## 56. రంతిదేవుడు :

వాల్మీకి ఆశ్రమంలో పెరిగి పెద్దవారయిన లవ కుశులు అయో ధ్యాపతులై, చాల కాలం రాజ్యపాలనం చేశారు. వారి వంశీయులలో చివరి వాడు సుమిత్రుడు. అతనితో, ఇక్ష్వాకువంశం, కలియుగంలో అంతరించి పోయింది.

బ్రహ్మపుత్రుడయిన అత్రితో చంద్రవంశం ప్రారంభమయింది. ఆ అత్రికుమారుడు సోముడు. ఆయన భార్యపేరు తార. ఆ దంపతులకు బుధుడు జన్మించాడు. ఆ బుధుని కుమారుడే, పురూరవుడు.

మిత్రావరుణుల శాపంవల్ల, ఊర్వశి, మానుషీరూపం ధరించి పురూరవుని పెళ్ళిచేసుకుంది. ఆ దంపతులకు పుట్టిన ఆర్గురుకుమారులలోనూ, ఆయువు, జ్యేష్ఠుడు. అతనికి, నహుషుడు జనించాడు. ఆ నహుషుని కుమారుడయిన యయాతికి, పూరుడనేవాడు పుట్టి, రాజైనాడు.

పూరుని కుమారుడు, జనమేజయుడు. అతనికి పదమూడవతరం వాడయిన దుష్యంతునకూ, మేనకా విశ్వామిత్రుల కుమార్తె అయిన శకుంతలకూ, భరతుడు జనించాడు. అతని పేరటనే, భారత వర్షం వెలిసింది.

భరతుడు, నూటముప్పైమూడు అశ్వమేధా లాచరించాడు. దిగ్విజయం చేశాడు. ఇరవై వేల సంవత్సరాలు రాజ్యమేలాడు. మరుత్సోమం అనే యజ్ఞంచేశాడు. అది కారణంగా, మరుత్తులు, అతనికి, భరద్వాజుని, పుత్రునిగా ప్రసాదించారు.

భరద్వాజుడు, బృహస్పతీ మమతల కుమారుడు. అతడినే, వితథుడు అనికూడా అంటారు. ఆయన మునిమనుమని కుమారుడే రంతిదేవుడు.

రంతిదేవు డొక మహారాజు. ఆయన, తన సర్వసంపదలనూ పాత్రులయినవారికి దానంచేసి, తన దనేది ఏదీ లేకుండా చేసుకుని, ఎప్పటి కేదిలభిస్తే అది అనుభవిస్తూ, జీవితంగడుపసాగాడు. ఆవిధంగా, కోరి పేదరికాన్ని వరించిన ఆ మహారాజు కుటుంబం కూడా, ఆయన అడుగుజాడల్లోనే నడుస్తూవచ్చింది. ఆయున్నీ, ఆయన సంసారాన్నీ ఆదర్శంగా ఉంచుకుని, ఆయన ప్రజలు సయితం, సర్వాధారుడయిన శ్రీమన్నారాయణునే ఆశ్రయించి, నిత్యసంతుష్టులై వ్యవహరిస్తూ ఉండేవారు.

అలా ఉన్న ఆ దేశంలో, ఒకసారి, తీవ్రమైన క్షామం సంభవించింది. ఆ సమయంలో, ప్రజలు, ఆకటిబాధతో అటమటించిపోయినారు. మహారాజు, వారిపట్ల సానుభూతిని ప్రదర్శిస్తూ, తనకు ఏరోజుకు ఏదిలభిస్తే అది, వారికే పంచిపెడుతూ, తాను మాత్రం పస్తు పడుకుంటూ, శ్రీహరి కరుణాకటాక్షంకోసం ప్రార్థిస్తూ, ఆయన్నే నమ్ముకుని, కాలం వెళ్ళదీయ సాగాడు.

ఒక పరిస్థితిలో, ఆ మహారాజు, నలభై ఎనిమిదిరోజులపాటు, త్రాగటానికి నీరుకూడా దొరక్క, పడరానిపాట్లు పడ్డాడు. ఆ కష్టదశలో కూడా, ఆయనకు పరమాత్మునిమీద ఉన్న విశ్వాసం, కించిన్మాత్రంగా అయినా సడలిపోలేదు.

నలభై ఎనిమిదిరోజులు ఉపవసించిన నరేంద్రునకు, ఒకరోజున, అనుకోకుండానే, నెయ్యీ పాయసం నీరూ లభించినై. అవి పారణచేసి, ప్రాణాన్ని నిలుపుకుందామని, ఆ మహానుభావు డనుకున్నాడు. అంతలో, ఆయన ఇంటికి, ఒక అతిథి విచ్చేశాడు.

అలా వచ్చిన అతిథిని ఆదరించి, ఆ మహారాజు, తన కానాడు లభించిన ఆహారంలో సగభాగం, ఆయనకు ఆరగింపు చేశాడు; సాక్షా ద్భగవంతుడే అతిథిరూపంలో వచ్చి, తన్ను తరింప చేశాడని భావించి, సంతుష్టిచెందాడు.

ఆ మహారాజుద్వైన ఆతిథ్యాన్ని పొంది, అతిథి వెళ్ళిపోగానే, ఒక శూద్రుడు, ఆయనను సమీపించి, తన క్షుద్బాధను తొలగించవలసిందిగా కోరాడు. ఆ శూద్రుడుకూడా శ్రీమన్నారాయణునిరూపమే అని విశ్వసించిన ఆ మహారాజు, ఆ వెంటనే, తనవద్ద ఉన్న ఆహారంలో సగపాలు, ఆనం దంతో అతనికి పంచిఇచ్చాడు. అతణ్ణి సంతుష్టిపరచి పంపించాడు.

అప్పటికి మిగిలిఉన్న ఆహారం అతిస్వల్పం. అయినా, అది తనకూ తన కుటుంబానికీ ప్రాణదానం చేయగలదన్న అభిప్రాయంతో, ఆ మహారాజు, దాన్ని ఆరగించే నిమిత్తం, సకుటుంబంగా కూర్చున్నాడు. అంతలో, ఒకడు, కొన్ని కుక్కలను వెంటబెట్టుకుని వచ్చి, 'మహారాజా! నేనూ నా కుక్కలూ ఆకటిబాధతో అటమటించిపోతున్నాం. దయచేసి, మా బాధను తొలగించవలసింది' అని వేడుకున్నాడు. ఆ వెంటనే, ఆ మహా రాజు, తాను తనభార్యాబిడ్డలతో తినబోతున్న ఆహారాన్నికాస్తా, అతనికీ అతని కుక్కలకూ పెట్టి, అదికూడా హరికే సమర్పితమైనట్టు భావించి,

సంతుష్టిచెందాడు. ఆయన భార్యా బిడ్డలూ కూడా అలాగే ఆనందించారు ; అప్పటికి మిగిలిఉన్న మంచినీరు త్రాగి, ప్రాణాలను నిలుపుకుందామని అనుకుంటూ ఉన్నారు.

ఆ సమయంలో, ఒక చండాలుడు వారిని సమీపించి, 'మహారాజా ! ఆకలితోనూ దాహంతోనూ నా ప్రాణం పోయేటట్టుంది. న న్నెలాగయినా రక్షించవలసింది' అని ప్రాధేయపడ్డాడు. అలా దీనంగా ప్రతిమాలుకున్న అతణ్ణి చూసి, ఆ మహారాజు...

'అన్నము లేదు కొన్ని మధురాంబువు లున్నవి త్రావుమన్న రా
వన్న శరీరధారులకు నాపద వచ్చిన వారి యాపదల్
గ్రన్నన మాన్చి వారికి సుఖంబులు సేయుటకన్న నొండు మే
లున్నదె నాకు దిక్కు పురుషోత్తము డొక్కడచుమ్ము పుల్కసా !'

అని, ఆదరపూర్వకంగా దగ్గరకు తీసుకుని, ఆ ఉన్న మంచినీళ్లు కాసినీ, అతనిచేత త్రాగించాడు; ఆ విధంగా అయినా అతనికి సాయపడగలిగినందుకు అమితంగా ఆనందించాడు.

అలా ఆనందపారవశ్యంలో ఉన్న ఆ రంతిదేవుని మనస్థితి గ్రహించిన బ్రహ్మాదిదేవతలు, అతనిపట్ల ప్రసన్నులయినారు. ఆ వెంటనే, అతనికి ప్రత్యక్షమయినారు.

ఆ విధంగా తనకు సాక్షాత్కరించిన ఆ మహనీయులకు, రంతిదేవుడు అంజలించాడు. వారి నందరినీ, సముచితంగా స్తుతించాడు. కష్టకాలంలోకూడా, తనకు ఏ విధమైన మోహాన్నీ కలిగించకుండా, అచంచల భక్తిని ప్రసాదించిన వారికి, తన కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

అతని మనోధైర్యాన్ని పరీక్షించే నిమిత్తం తాము కల్పించిన మాయనుకూడా అధిగమించిన ఆ మహారాజును అమితంగా అభినందించి, బ్రహ్మాదులు, అతనికి పరమపదాన్ని ప్రసాదించారు; అతణ్ణి అనుసరించి వ్యవహరించిన ఇతరు లందరికీ, సిద్ధపదాన్ని సిద్ధింపచేశారు.

## 57. పరశురాముడు :

అలా, భక్తిద్వారా పరమపదంపొందిన ఆ రంతిదేవుని జ్ఞాతి వర్గానికి చెందినవాడే, జహ్నువు. ఆ మహనీయుడు, గంగాప్రవాహాన్ని తన అఱచేతిలోకి తీసుకుని, ఒకేఒకగుక్కలో ఆచమించటం, భగీరథునిప్రార్థన మీద, తిరిగి, దాన్ని విడుదల చేయటం జరిగింది. అది కారణంగానే, గంగకు, జాహ్నవి అన్న సార్థకనామం సిద్ధించింది.

జహ్నువు వంశీయుడయిన గాధి సుప్రసిద్ధుడు. ఆయనకు సత్యవతి అనే కూతురూ, విశ్వామిత్రుడనే కొడుకూ జనించారు. కాలక్రమాన, సత్యవతి, ఋచీకుని భార్య అయింది; ఆ పైన, కౌశికినదిగా రూపొందింది. విశ్వామిత్రుడు, ఘోర తపస్సుచేసి, బ్రహ్మర్షి పదం పొందాడు.

సత్యవతీ ఋచీకులకు జమదగ్ని జన్మించాడు. ఆ జమదగ్నికి ధర్మపత్ని అయిన రేణుక, వాసుదేవాంశసంభూతుడయిన పరశురాముని, కనిష్ఠపుత్రునిగా పొందింది.

పరశురాముడు, అమిత బల పరాక్రమసంపన్నుడు. అతడు, హైహయేశ్వరుడయిన కార్తవీర్యార్జునునిపై అలిగి, అతడినీ, అతని పది హేడు అక్షౌహిణులసేననూ, ఒక్కచేతిమీద కూల్చేశాడు. భూభారాన్ని తొలగించే నిమిత్తం, మదోన్మత్తులయిన క్షత్రియులపైకి, ఇరవై ఒక్కమార్లు దండెత్తివెళ్ళి, వారినందరినీ సంహరించి, వారి రక్తంతో, తొమ్మిదిమడుగులు నిర్మించాడు; ఆ రుధిరతర్పణంద్వారా, తన పితృదేవతలకు, ఉత్తమ గతులు కల్పించాడు.

పరశురాముని తల్లిఅయిన రేణుక, ఒకసారి, స్నానార్థం, గంగకు వెళ్ళిన సందర్భంలో, అక్కడ, అచ్చరలతో జలక్రీడ సలుపుతున్న చిత్ర రథు డనే ఒక గంధర్వుని చూడటం జరిగింది. అతణ్ణి చూడగానే, ఆమె మనసు, కొద్దిగా చలించింది. ఆ విషయాన్ని, తనదివ్యదృష్టిద్వారాగ్రహించిన జమదగ్ని, ఆమెకు, మానసిక వ్యభిచారదోషం సంభవించిందని నిశ్చయించి,

ఆమె, తిరిగి ఇంటికి రాగానే, తన పుత్రుల నుద్దేశించి, 'వ్యభిచారిణితో ఆశ్రమవాసం చేయటం అనుచితం. మీ రీమెను సంహరించవలసింది' అని ఆదేశించాడు. కాని, మాతృవధ, ఘోరాతిఘోరమయిన పాపమని భావించి, వా రెవరూ ఆ పనికి పూనుకోలేదు. అది కారణంగా, జమదగ్ని, వారిమీద కూడా అలగటం జరిగింది.

ఆ సమయాన, పరశురాముడు అక్కడలేడు. అతడు ఆశ్రమం చేరుకోగానే, జమదగ్ని, అతనికి, ఆ పరిస్థితినంతనూ తెలిపి, 'వ్యభిచార దూషిత అయిన నీ తల్లినీ, పితృవాక్యాన్ని పాలించని నీ అన్నలనూ, సంహరించవలసింది' అని ఆజ్ఞాపించాడు.

పరశురామునకు, తనతండ్రిఅయిన జమదగ్ని మాహాత్మ్యం, పూర్తిగా తెలుసు. అందుకనే, అతడు, మారుమాట చెప్పకుండా, ఆయన ఆజ్ఞను పాలించి, కన్నీటితో, ఆయన ముందు నిలబడ్డాడు.

పరశురాముని పితృభక్తికి, జమదగ్ని, చాలా సంతోషించాడు. అందుకనే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, 'ఏదైనా వరం కోరుకోవలసింది' అన్నాడు. అలా ప్రసన్నుడయిన తండ్రిని చూసి, పరశురాముడు, 'నా పరశువునకు బలి అయిన వీ రందరినీ బ్రతికించవలసింది' అని కోరాడు. జమదగ్ని, అతని ధర్మబుద్ధిని ప్రశంసించి, అతనికోరికను తీర్చాడు; దానికి తోడు, అతనికి, అనేకవరాలుకూడా ప్రసాదించాడు.

## *58. శ్రీ కృష్ణావతారం :*

విష్ణు కథారతుడగు నరు
విష్ణు కథల్ సెప్పు నరుని వినుచుండు నరున్
విష్ణు కథా సంప్రశ్నము
విష్ణుపదీజలము భంగి విమలులజేయున్.

* * *

పూర్వం, దేవమీడు డనే ఒక రాజేంద్రు డుండేవాడు. ఆయన

కుమారుడు శూరసేనుడు. శూరసేనుని భార్య మారిష. ఆ మారిషా శూర సేనులకు, వసుదేవాదులు పదిమంది కుమారులు కలిగారు.

వసుదేవుడు జన్మించగానే, దేవదుందుభులు మ్రోగినై. అది కారణంగా, ఆయనకు, ఆనకదుందుభి అన్న సార్థకనామం సిద్ధించింది.

వసుదేవుని సోదరి అయిన పృథను, శూరసేనుని మిత్రుడయిన కుంతిభోజుడు పెంచుకున్నాడు. అందువల్ల, ఆమెకు, కుంతి అనే పేరు వచ్చింది.

కుంతి కన్యగా ఉన్నప్పుడే, సూర్యుని వరంవల్ల, కర్ణుడు జన్మించాడు. ఆ తరువాత, ఆమె, పాండురాజుకు పత్నికావటం, యుధిష్ఠిర భీమార్జునులకు తల్లికావటం జరిగింది.

భోజవంశీయుడయిన ఆహుకునకు, దేవకుడు, ఉగ్రసేనుడు అనే ఇద్దరుకుమారు లున్నారు. వారిలో, దేవకునకు, దేవలాదులు నలుగురు పుత్రులూ, దేవకి ప్రభృతులు ఏడుగురు పుత్రికలూ కలిగారు. తన ఏడుగురు కుమార్తెలనూ, దేవకుడు, వసుదేవునకిచ్చి వివాహం చేశాడు. ఆ తరువాత, కాలక్రమాన, వసుదేవుడు, రోహిణి మొదలయినవారిని, మరికొందరిని కూడా వివాహం చేసుకోవటం జరిగింది.

దేవకుని సోదరుడైన ఉగ్రసేనునకు, కంసప్రభృతులు తొమ్మిది మంది కుమారులూ, కంసవతీత్యాదు లైదుగురు కుమార్తెలూ జనించారు. ఆ కుమార్తెలను, ఆయన, వసుదేవుని సోదరుల కిచ్చి వివాహం చేశాడు. ఆ విధంగా, యాదవులకూ భోజులకూ సంబంధం కలిసింది.

* * *

ఒకసారి, భూమినంతనూ ,దైత్యు లాక్రమించుకోవటం జరిగింది. వారిబాధ భరించలేక, భూదేవి, గోరూపంలో, బ్రహ్మదేవుని సమీపించి, తన కష్టాలను, అతి దీనంగా, ఆయనకు వివరించుకుంది. అది విన్న బ్రహ్మ, ఆ వెంటనే, మహేశ్వరునితోనూ, కొందరు సురప్రముఖులతోనూ, మహర్షులతోనూ, భూదేవితోనూ బయలుదేరివెళ్ళి, క్షీరసాగరంలోఉన్న శ్రీమన్నా

రాయణుని సందర్శించుకున్నాడు. ఆయనను యథోచితంగా ప్రస్తుతించి, సమాధిస్థితిలో, కొంత సేపు ఉండిపోయినాడు.

ఆ విధంగా సమాధిస్థితుడయిన చతుర్ముఖునకు, ఒక అశరీర వాణి వినిపించింది. దాన్ని విని, ఆయన,అమితానందంపొందాడు. ఆవెంటనే, తన్ను పరివేష్టించిఉన్నవారిని ఉద్దేశించి, తను విన్న పలుకుల నిలా తెలియ పరచుకున్నాడు.

"సర్వలోకేశ్వరుడయిన శ్రీమన్నారాయణుని సందేశం నేను గ్రహించాను. ఆ పురాణపురుషుడు, భూభారాన్ని తొలగించే నిమిత్తం, త్వరలోనే, యాదవశ్రేష్ఠుడయిన వసుదేవునకు పుత్రుడై జన్మించటానికి నిశ్చయించుకున్నాడు. అలా, లీలామానుషరూపుడై జనించబోయే ఆయనకు అగ్రజుడుగా పుట్టటానికి, ఆదిశేషుడు అంగీకరించాడు. జగన్మోహిని అయిన మాయ, శ్రీహరి ఆజ్ఞానుసారం, నిజాంశతో, అక్కడే ఆవిర్భ వించబోతోంది. ఇక, ఆ మహనీయుని సేవించే నిమిత్తం సురసుందరులూ, ఆయన ఆశయసిద్ధికి తోడ్పడే నిమిత్తం దేవతలూ, వారివారి అంశలతో, యాదవకులంలో పుట్టవలసి ఉంది."

అలా విశదపరచిన చతుర్ముఖుడు, భూదేవికి, కొంత ఊఱట కలిగించి, అందరకూ సెలవిచ్చి, నిజావాసానికి వెళ్ళిపోయినాడు.

## 59. *భగవంతుడు :*

అంభోధి స్థలతాం, స్థలం జలధితాం, ధూళీలవ శ్శైలతాం,
శైలో మృత్కణతాం, తృణం కులిశతాం, వజ్రం తృణక్షీణతాం,
వహ్ని శ్శీతలతాం, హిమం దహనతా మాయాతి యస్యేచ్ఛయా
లీలా దుర్లలితాద్భుత వ్యసనినే కృష్ణాయ తస్మై నమః.

* * *

సృష్టి స్థితి లయాలకు మూలమైన ఒక మహత్తర శక్తి ఉంది. అది, ఒకరిచేత కల్పింపబడేదికాదు; తనకు తానై ఉద్భవిస్తుంది. కొంత కాలం ఉండి, ఆ పైన నశించేది కాదు; శాశ్వతమైనది. ఎక్కడో ఒకచోట

మాత్రమే వ్యక్తమయేదికాదు ; సర్వవ్యాపకత్వం కలది. పిపీలిక మొదలు బ్రహ్మవరకు అంతటా నిండి ఉంటుంది ; కాని, నిగూఢంగా ఉంటుంది. మరొక శక్తిమీద ఆధారపడి ఉండదు ; తన మహిమమీద మాత్రమే ఆధారపడి ఉంటుంది. భూనభోంతరాళాలనూ సూర్య చంద్రాదులనూ సృజించి, వాటికి అనుగుణమైన ధర్మాలను వాటికి నిర్దేశించి, ఆ ధర్మాల నవి సక్రమంగా పాలించుకునేటట్టు చూస్తూ ఉంటుంది. అదీ దాని విశిష్టత.

మహాద్భుతమైన ఆ విశిష్టశక్తిని, మాంస చక్షువులతో, యెవరూ చూడలేరు. పరిశుద్ధమైన మనసుగల మహర్షులు మాత్రమే, జ్ఞాననేత్రంతో, దాన్ని దర్శించగలుగుతారు. అలా దర్శించుకున్న మహనీయులే, దానికి, 'భగవంతుడు' అని నామకరణం చేశారు.

అజ్ఞానం, దుఃఖం, రాగం, ద్వేషం, అభినివేశం అనే పంచవిధ క్లేశాలనుంచీ, పాపం, పుణ్యం, వాటి మిశ్రమం అనే త్రివిధకర్మలనుంచీ, జాతి, ఆయువు, భోగం అనే కర్మ విపాకంనుంచీ దాని వాసనలనుంచీ దూరంగా ఉండే పురుషోత్తముడే భగవంతుడు. ఆయనకు, సజాతీయ విజాతీయ భేదాలు లేవు. ఆయన, తనకు తానై ప్రకాశిస్తాడు. నాశరహితుడుగా, జ్ఞానమయుడుగా, చైతన్యమూర్తిగా, పరమానంద స్వరూపుడుగా, ఉంటాడు. తన్ను ఆశ్రయించిన అణిమాది సిద్ధులనూ, సమగ్రమైన ప్రతాపం, యశం, ఐశ్వర్యం, జ్ఞానం, శ్రీ, వైరాగ్యం, అనే ఆరు ప్రముఖ లక్షణాలనూ యేలుకుంటూ ఉంటాడు. సర్వశక్తి సంపన్నుడుగా, సర్వజ్ఞుడుగా, సర్వాంతర్యామిగా, సర్వసాక్షిగా, సర్వోత్కృష్టుడుగా, సర్వాధ్యక్షుడుగా, సర్వేశ్వరుడుగా, పరమపవిత్రుడుగా, పరమ మంగళకారకుడుగా, ప్రేమరసప్రపూర్ణుడుగా, పరమాశ్రయుడుగా, పరమపితగా, పరబ్రహ్మగా, పరమాత్ముడుగా, భక్తవత్సలుడుగా, జ్ఞానులచేత భావింపబడుతూ, భజింపబడుతూ ఉంటాడు; అలాగే సాక్షాత్కరించి, వారికి, పరమానందాన్నీ పరమపదాన్నీ ప్రసాదిస్తూ ఉంటాడు.

మహోదారుడైన ఆ మహానుభావుడు ఒకే ఒకడైనా, మహర్షులు,

ఆయనను, అనేక నామాలతో పిలుస్తూ ఉంటారు. ఆయన అద్వితీయుడైనా, భక్తులు, ఆయనను, అనేక విధాల భావిస్తూ ఉంటారు. సృష్టికార్యం జరిపే టప్పుడు బ్రహ్మ అనీ, పోషించేటప్పుడు విష్ణువు అనీ, లయింపచేసేటప్పుడు శివుడనీ, ప్రజలు ఆయనను పేర్కొంటూ ఉంటారు.

ఆయన మాధవుడు. సర్వ కామదుడు. ముకుందుడు. అందుకనే, మాయాదూరులైనవారు, ఆయన నాశ్రయిస్తారు. అలా ఆశ్రయించినవారికి, ఆ మహానుభావుడు, సర్వైశ్వర్యాలనూ చేకూరుస్తాడు. కొఱత అనేది లేకుండా చేస్తాడు. దుఃఖ నివృత్తి కలిగిస్తాడు. మోక్షాన్ని ప్రసాదిస్తాడు.

ఆ మహానుభావుని విలాస విభూతి మహాద్భుతంగా ఉంటుంది. దాన్ని సంభావించటం, జ్ఞానులకు మాత్రమే సాధ్యమవుతుంది.

*60.* అవతారాలు :

ప్రపంచంలో, ధర్మానికి హాని కలిగినప్పుడు, అధర్మం హద్దులు మీరిపోయినప్పుడు, ధర్మ సంరక్షణకోసం, అధర్మ ప్రవృత్తిని అంతరింప చేసే నిమిత్తం, ఆయన, ఎప్పటి కే రూపం అవసరమో ఆ రూపంలో అవ తరిస్తూ ఉంటాడు. అలా అవతరించి, శిష్టులను రక్షిస్తూ ఉంటాడు; దుష్టు లను శిక్షిస్తూ ఉంటాడు. అది, ప్రతి యుగంలోనూ జరుగుతూనే ఉంటుంది.

ఆ అవతారాలు, మూడు రకాలుగా ద్యోతమవుతై. వాటిలో, సృష్టికి సాయపడే శక్తిగలవాటిని, బ్రహ్మదేవుని అవతారా లంటారు. స్థితికి దోహదమిచ్చే శక్తిగలవాటిని, విష్ణుదేవుని అవతారా లంటారు. సంహార క్రియకు మాత్రమే ఉపకరించేవాటిని, రుద్రావతారా లంటారు. ఎప్పుడు ఏ రూపంలో ఏ విధమైన అవతరణ జరిగినా, దుష్టశిక్షణ, శిష్టరక్షణ, అనేవి మాత్రమే, దాని ప్రధాన లక్ష్యాలుగా ఉంటై.

ప్రపంచాన్నంతనూ నడుపుతూఉండే ఆ భగవచ్ఛక్తి, మేధాశక్తి, ధీశక్తి, జ్ఞానశక్తి, యోగశక్తి మొదలయిన రూపాలలో, విశ్వమంతటా వ్యాపించి ఉంటుంది. కాని, అది, చాలామందిలో పరిమితంగానూ, కొద్ది

మందిలో మాత్రం అపరిమితంగానూ ఉండటం సంభవిస్తుంది. ఏ ప్రాణిలో అయితే ఆశక్తి విశేషం అపరిమితంగా ఉండి, లోకక్షేమానికి ఉపకరిస్తుందో, ఆ ప్రాణిని, పరమేశ్వరుని అవతారంగా పేర్కొనటం జరుగుతుంది.

ఉదాహరణకు, మేధ అనేది ఒకశక్తి. అది, ప్రపంచంలో, ఎప్పుడూ ఉండనే ఉంటుంది. అంటే, నిత్యమైన దన్నమాట. అలా, నిత్యమై, ప్రపంచమంతటా ప్రసరించి ఉన్న ఆశక్తి, సాత్యవతేయునిలో అపరిమితంగా అభివ్యక్తమయింది. అది కారణంగానే, ఆయన, మహర్షి కాగలిగాడు. మహత్తరమైన కృతులను కల్పించగలిగాడు. విశ్వశ్రేయానికి తోడ్పడ గలిగాడు. అవతారపురుష దనిపించుకున్నాడు.

కాని, ఆయనలో, మేధాశక్తి అభివ్యక్తమైనంతగా, శౌర్య ధైర్య పరాక్రమాది శక్తులు అభివ్యక్తం కాలేదు. అందుకనే, ఆయనది, పూర్ణావ తారమనిపించుకోలేదు.

ఒకే ఒక వ్యక్తిలో, వివిధ శక్తి విశేషాలు అపరిమితంగా అభి వ్యక్తమై, లోక కల్యాణానికి ఉపకరించినప్పుడే, ఆ వ్యక్తి, పూర్ణావతారు దని పించుకోవటం జరుగుతుంది.

ఆ అవతారాలలోకూడా, తరతమ భేదాలు గోచరిస్తై. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, పూర్ణతముని అంశావతారులనీ, వారికి సాయపడే నిమిత్తం ఉద్భవించిన మరీచ్యాదులు, అంశాంశావతారులనీ, ఆవేశ విశేషం ద్వారా, ఒకానొక మహత్తర కార్యాన్ని సాధించే శక్తిని ఆకర్షించుకున్న పరశురామాదులు, ఆవేశావతారులనీ, పరమేశ్వరుని కళ ప్రసరించటంద్వారా తత్త్వవేది అయిన కపిలుడూ, మందర నగాన్ని మోసిన కూర్మమూ, కళావ తారాలనీ, నర నారాయణులూ, శ్రీ రామచంద్రుడూ, పూర్ణావతారులనీ, వాసుదేవుడు, పూర్ణతమావతారుడనీ, వ్యాసర్షి వివరించారు.

భగవంతుని అవతారాలు అనేకమున్నై. వాటిలో మొట్టమొదటిది,

పరమపురుషావతారం. అది, శ్రీమన్నారాయణుని విరాట్స్వరూపంగా అభివర్ణిత మయింది. ఆ పరమపురుషుడు, జగ దుత్పత్తి స్థితి లయాలకు ఆది కర్త అయినాడు.

ఆ తరువాత, దక్షపుత్రి అయిన మూర్తియందు, ధర్మునకు, భగవదంశతో, నర నారాయణు లుదయించారు. వారు, ఋషులకు ఆత్మబోధ చేయటం జరిగింది.

ఆ పైన, శ్రీమన్నారాయణుడు, హంస, దత్తాత్రేయ, సనత్కుమార ఋషభావతారాలు ధరించి, ఆత్మయోగం ప్రసాదించాడు. హయగ్రీవావతారమెత్తి, మధుదానవుని సంహరించాడు. మత్స్యావతారుడై, మనువును రక్షించాడు. అలాగే, కూర్మరూపంలో, మందరాద్రిని మోశాడు. వరాహరూపంలో, భూమిని ఉద్ధరించాడు. నృసింహ రూపంలో, హిరణ్యకశిపుని వధించాడు. వామనుడై, బలిదానవుని నిగ్రహించాడు. పరశురాముడై, గర్వాంధులయిన క్షత్రియులను సంహరించాడు. శ్రీరామచంద్రుడై, దశగ్రీవుని నిర్జించాడు. శ్రీకృష్ణుడై అవతరించి, అనేక దుష్కరకార్యా లాచరించాడు; అర్హుల నెందరినో అనుగ్రహించాడు.

## *61.* మాధవుడు - మహర్షిశాపం :

శ్రీమన్నారాయణుడు, లోకానుగ్రహార్థమే అవతరిస్తాడు. ఆ అవతరణలోనే, ఆయనకు శాప విముక్తి కూడా ఉంది.

ప్రహ్లాదుని పౌత్రుడు బలి. అతడు దానవాధిపతి. ఒకసారి, అతనికి దేవతలకూ మధ్య, ఘోరమైన యుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో, దానవులు గెలిచారు. దేవతలను స్వర్గంనుంచి తరిమివేశారు; స్వర్గాన్ని ఆక్రమించుకున్నారు. కాని, దేవతలు, విష్ణుదేవుని సహాయంతో, దానవులను జయించి, తిరిగి తమ రాజ్యాన్ని స్వాధీనపరచుకోవటం జరిగింది.

ఆ సమయంలో, దానవులు, తమ గురువైన శుక్రాచార్యుని ఆశ్ర

యించి, తమ్ము రక్షించవలసిందిగా ప్రార్థించారు. శుక్రాచార్యుడు, వారికి అభయ మిచ్చాడు.

దేవతలకు ఆ విషయం తెలిసింది. వెంటనే, వారు, దేవేంద్రుని సమీపించి, దానవులు యుద్ధానికి సిద్ధమయేలోపల, వారిని సంహరించవలసిందిగా ప్రార్థించారు. ఇంద్రుడు, వారి ప్రార్థనను మన్నించాడు.

ఆ వెంటనే, మహేంద్రుడు, దేవ సమూహాలతో, రాక్షసుల మీద పడ్డాడు. ఆ తాకిడికి తట్టుకోలేక, వారు, శుక్రాచార్యుని శరణు జొచ్చారు. అప్పుడు, శుక్రుడు, తన ప్రభావంద్వారా, దేవతలను, స్వర్గందాకా తరిమివేశాడు.

ఆ పైన, దేవతలను జయించటానికి, తన శక్తి చాలదనీ, మంత్రశక్తి అవసరమనీ, శుక్రాచార్యుడు భావించాడు. ఆ మంత్రశక్తిని సంపాదించుకునే నిమిత్తం, అతడు, ఈశ్వరునిగూర్చి తపస్సు చేయ సంకల్పించాడు.

తపస్సు చేసుకునే నిమిత్తం, శుక్రాచార్యుడు వెళ్ళిపోయిన పక్షంలో, తమజీవితాలకు రక్షణ ఉండదని, దానవులు భావించారు. అందుకని, వారు, ఆయన సలహామీద, మునివేషధారులై, వనాలలో, అక్కడక్కడ నివాసా లేర్పరచుకోవటం జరిగింది.

అలా మునివేషధారులైన దానవు లొకసారి, గంధమాదనం మీద తపస్సు చేసుకుంటున్న ప్రహ్లాదుని సమీపించి, ఆయనను, దేవతల వద్దకు రాయబారిగా పంపారు. దానవులకు సంగ్రామవాంఛ లేదనీ, వారు, పూర్వం చేసిన దోషాలకు పశ్చాత్తాప పడుతున్నారనీ, ఇకముందు, దేవతలను సోదర భావంతో చూసుకోవటానికే నిశ్చయించుకున్నారనీ, వారు, ఆయన ద్వారా, వారికి విన్నవించుకున్నారు.

ప్రహ్లాదుని మాటలమీది విశ్వాసంతో, దేవతలు, 'సరే' నన్నారు. అసురులుమాత్రం, తమ కుటిల ప్రయత్నం ఫలించినట్టు భావించి, కపట తపో వ్యాపారంతో, కశ్యపుని ఆశ్రమంలో ఉంటూ వచ్చారు.

కాలక్రమాన, శుక్రాచార్యునకు, శంకరుడు ప్రత్యక్షమైనాడు;

'వర మేదైనా కోరుకోవలసింది' అన్నాడు. దానిమీద, అతడు, సురపరాజయాన్నీ అసుర విజయాన్నీ చేకూర్చే మంత్రాన్ని ప్రసాదించవలసిందిగా ఆయన్ని అభ్యర్థించాడు. ఆ మీద, మహేశ్వరుడు, దేవతల క్షేమం కోరి, శుక్రాచార్యుని ఉద్దేశించి, 'దానికి తగిన అర్హతను సంపాదించుకోవలసింది' అని ఆదేశించాడు. అది కారణంగా, శుక్రాచార్యుడు, వేయి సంవత్సరాల పాటు, ఘోరమైన తపస్సు చేశాడు. ఆ సమయంలో, అతడు, ధూమపానంతో, ప్రాణాన్ని నిలుపుకోవటం జరిగింది.

శుక్రాచార్యుడు అలా తీవ్ర తపస్సు చేస్తున్న విషయం, దేవతలకు తెలిసింది. ఆ వెంటనే, వారు, శుక్రాచార్యుని తపస్సు ఫలించేలోపల, రాక్షసులను నిర్జించటం అవసరమనుకున్నారు. అది కారణంగానే, వారిమీద పడ్డారు.

అప్పుడు జరిగిన పోరులో, అనేకమందిరాక్షసులు హతులైనారు. బ్రతికి బయటపడ్డవారు, శుక్రాచార్యుని తల్లివద్దకు పరుగెత్తుకు పోయి, శరణు వేడుకున్నారు. ఆమె, వారందరికీ అభయ మిచ్చింది.

సురలు, అసురులను వెంటాడుతూ, అక్కడకు వెళ్ళారు. వెళ్ళి, ఆమె యెదుటనే, వారిని దండింప సాగారు. అది, ఆమెకు, భరింపరాని ఆవేదనను కలిగించింది. అందుకనే, ఆమె, వారిని అడ్డుకుంది. అయినా దేవతలు, దానవులను హింసించటం మానుకోలేదు.

అది గ్రహించిన భృగుపత్నికి ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే, ఆమె, వారి మీదకు, నిద్రాదేవిని పంపింది.

అలా విడువబడిన నిద్రాదేవి, దేవతలందరనూ, మహామోహంలో ముంచేసింది. అది చూసిన దేవేంద్రుడు భయపడ్డాడు; ఆ భయంతోనే, విష్ణుదేవుని శరీరంలో తలదాచుకున్నాడు.

కాని, నిద్రాదేవి, అతణ్ణి వదలలేదు. అతణ్ణి తరుముకుంటూ వెళ్ళి, 'విష్ణువును వదలి బయటకు రావలసింది' అని ఆదేశించింది. అలా రాని

పక్షంలో, విష్ణువుతోసహా అతణ్ణి కబళించవలసి వస్తుందనికూడా హెచ్చరించింది.

భృగుపత్ని, మహా తపశ్శాలిని. సత్యసంధురాలు. పరమ పతివ్రత. ఆమె శక్తిని అడ్డుకోవటం, తనకు మించిన పనిగా మహేంద్రుడు భావించాడు. ఎలాగైనా, ఆ ఆపదనుంచి తన్ను తప్పించవలసిందని, విష్ణువును ప్రార్థించాడు.

శ్రీహరి, అతని ప్రార్థన నంగీకరించి, ఆమెమీదకు, తన చక్రాయుధాన్ని వదిలాడు. ఆ చక్రం, మంటలు క్రక్కుతూపోయి, భృగుపత్ని కంఠాన్ని ఉత్తరించింది. ఆమె అలా మరణించగానే, దేవతలు, నిద్రనుంచి మాదిరి లేచారు.

ఇంద్రోపేంద్రులు, అలా, తన భార్యను చంపిన సంగతి తెలుసుకుని, భృగుమహర్షి, ఆగ్రహపరవశుడైనాడు. అది కారణంగానే, శ్రీ మహావిష్ణువు నుద్దేశించి, 'ఇకముందు, నువ్వు, నానాయోనులలోనూ పుడుతూ, దుఃఖా లనుభవిస్తూ ఉంటావు! అని శపించాడు.

ఆ విధంగా, శప్తుడైన శ్రీహరి, వివిధావతారాలు ధరిస్తూ ఉండటం, తనదయిన పాపాన్ని తఱుగజేసుకుంటూ ఉండటం, లోకకళ్యాణప్రదమైన కొన్ని కార్యాలను చేస్తూ ఉండటం, జరుగుతోంది.

## *62. భగవల్లీలలు :*

యథార్థానికి, భగవంతుడు, జ్ఞాన ఐశ్వర్య వీర్య బల తేజస్సంపన్నుడు. అంతేకాదు. ఆయన సృష్టికర్త. శాశ్వతుడు. సర్వేశ్వరుడు. అలా అయి కూడా, భూలోకంలో అవతరించినప్పుడు, తనదైన వైష్ణవమాయను వశపరచుకుని, అతి విచిత్రంగా చరిస్తాడు. శరీరధారు లందరి మాదిరిగానే జన్మించినట్టూ, పెరిగి పెద్ద అయినట్టూ, ప్రాపంచిక బంధాలకు కట్టుబడి ఉన్నట్టూ, మానవసహజమైన వివిధ గుణాలచేతా ఆవరింపబడి ఉన్నట్టూ,

వ్యవహరిస్తాడు. ముక్త స్వభావుడై కూడా, బంధువులపట్ల మమకారం ఉన్నట్టూ, శత్రువుల పట్ల విరోధం వహించినట్టూ, సుఖ దుఃఖాలను అనుభవిస్తున్నట్టూ గోచరిస్తాడు. ఏ విధంగా వ్యవహరించినా, తనుమాత్రం తామరాకు మీది నీటిబొట్టు మాదిరిగా ఉంటాడు. అలా, అభినివేశంలేకుండా చేసే కార్యాలనే, 'లీలలు' అంటారు. ఆ విధమైన లీలలను ప్రదర్శించటంలో, శ్రీకృష్ణుడు అగ్రేసరుడు.

*63. కృష్ణావతార కారణం :*

శ్రీకృష్ణుడు, ద్వాపరాంతాన, కలియుగం ప్రారంభమయేముందు అవతరించాడు. ఆయన అవతరణకు మూలకారణం, మదోన్మత్తులూ నిరంకుశులూ అధర్మపరులూ అయిన రాజులను సంహరించటం ; ప్రపంచంలో, శాంతినీ సుఖాన్నీ సంస్థాపించటం.

ద్వాపరాంతాన, మహాసురు లెందరో మానవులై జనించటం, మహీధవులు కావటం సంభవించింది. వారు, అధికార మదోన్మత్తులైనారు. అది కారణంగా, వారు, నిరంకుశులు కావటం, ప్రజాపీడకు పూనుకోవటం, ధర్మదూరులై చరించటం, జరిగింది.

సహజంగా, పాలకుల గుణాలు, పాలితులలో, ప్రస్ఫుటంగా ద్యోతకమవుతూ ఉంటై. ప్రభువు ఉత్తముడైన పక్షంలో, ప్రజలు ఉత్తములవుతారు. ప్రభువు దుర్మార్గుడైనప్పుడు, ప్రజలు కూడా దుర్మార్గులే అవుతారు.

ఆ సమయంలో, అసురులు అధిపతులు కావటంవల్ల, ప్రజలు, ధర్మదూరులూ, కామక్రోధాదులకు దాసులూ, అయినారు. వా రందరూ, నరకకూపంలో పడిపోయే స్థితి ఏర్పడ్డది.

ఆ పరిస్థితిని అరికట్టటానికీ, భూదేవికి దైత్యులవల్ల సంభవించిన భారాన్ని తొలగించటానికీ, శ్రీహరి సంకల్పించుకున్నాడు. మానవలోకానికి తాను దిగటానికీ, మానవులను ఉద్ధరించటానికీ, ఆయన నిశ్చయించు

కున్నాడు. ఆ సందర్భంలో, ఆయనకు సాయపడటానికి, కొందరు దేవతలూ మహర్షులూ కూడా పూనుకున్నారు. కాలక్రమాన, శ్రీ కృష్ణుడై జన్మించిన శ్రీమన్నారాయణునకు సహాయం చేసే నిమిత్తం జనించిన వారిలో, బలరాముడు ప్రముఖుడు. ఆయన, ఆదిశేషుని అంశతో జన్మించాడు. అలాగే, నరుడు అర్జునుడుగా పుట్టాడు. యముని అంశతో విదురుడూ ధర్మరాజూ, వాయుదేవుని అంశతో భీముడూ, అశ్వినీ దేవతల అంశతో నకుల సహదేవులూ, సూర్యాంశతో కర్ణుడూ, బృహస్పతి అంశతో ద్రోణుడూ, రుద్రాంశతో అశ్వత్థామా, సాగరుని అంశతో శంతనుడూ, వసువుల అంశతో భీష్ముడూ, మరుద్గణాల అంశతో విరటుడూ కృపాచార్యుడూ కృతవర్మా, అగ్నిదేవుని అంశతో ధృష్టద్యుమ్నుడూ, సనత్కుమారాంశతో ప్రద్యుమ్నుడూ, వరుణుని అంశతో ద్రుపదుడూ, విశ్వేదేవుల అంశతో పాంచాలీకుమారులూ. జనించారు. లక్ష్మిదేవి అంశతో ద్రౌపది జన్మించింది.

## *64.* దేవకీ వసుదేవులు :

అవతారమూర్తులను కనిపెంచే అర్హత, అందరికీ లభ్యంకాదు. దానికి, ప్రత్యేకమైన పూర్వజన్మ విశేషం ఎంతో అవసరం.

శ్రీ కృష్ణునకు తలిదండ్రులయే అదృష్టం, దేవకీ వసుదేవులకు దక్కింది. శ్రీ కృష్ణుని కని, వారు, పునర్జన్మలేని ఉత్తమోత్తమ గతిని సాధించుకున్నారు.

పూర్వం, స్వాయంభువ మన్వంతరంలో, పృశ్ని అనే ఒక పరమ పతివ్రత ఉండేది. ఆమె, సుతపుడనే ప్రజాపతి భార్య.

ఆ దంపతులు, శ్రీహరి నుద్దేశించి, పన్నెండువేల దివ్యసంవత్సరాలు తపస్సు చేశారు. వారి తపస్సుకు మెచ్చి, శ్రీహరి, తన నిజరూపంలో వారికి దర్శనమిచ్చాడు ; 'ఏదైనా వరం కోరుకోవలసింది' అన్నాడు.

ఆ దంపతులు ఏది అడిగినా ఇవ్వటానికి, శ్రీహరి, ఆ సమ

యంలో సిద్ధంగా ఉన్నాడు. ముక్తి కోరినా, వారికి, అప్పుడు లభించేదే. కాని, వారు, ఆయన దివ్యసౌందర్యం చూసి ముగ్ధులై, 'నువ్వు మాకు కుమారుడవై జన్మించ వలసింది' అన్నారు. ఆ అనటం కూడా, ముమ్మారు అన్నారు.

చేసిన వాగ్దానం ప్రకారం, శ్రీహరి, వారికి, మూడు జన్మలలో కుమారుడుగా జన్మించటానికి అంగీకరించాడు. ఆ జన్మలోనే, పృశ్ని గర్భుడనే పుత్రుడై పుట్టాడు.

తరువాతి జన్మలో, ఆ దంపతులు, అదితీ కశ్యపుడూ అయినారు. అప్పుడు, శ్రీహరి, వారికి, వామనుడై జన్మించాడు.

ఆ అదితీ కశ్యపుడూ, అనంతరజన్మలో, దేవకీ వసుదేవులైనారు. శ్రీహరి, వారికి, శ్రీకృష్ణుడై జన్మించాడు. తన వాగ్దానాన్ని చెల్లించుకున్నాడు. వారికి, ముక్తిని ప్రసాదించాడు.

* * *

మరీచి కుమారుడైన కశ్యప ప్రజాపతి, ఒకసారి, ఒక మహా యాగం తలపెట్టాడు. ఆ యాగానికి, గోవులు కావలసివచ్చినై. అది కారణంగా, ఆయన, వరుణదేవుని గోవులను అపహరించటం జరిగింది.

గోవులు అలా అపహరింపబడటంవల్ల, లేగలు రోదింపసాగినై. అది చూసిన వరుణుడు బ్రహ్మదేవుని సమీపించి, జరిగిందంతా చెప్పి, 'గోవత్సలు తమ తల్లులకోసం కుమిలికుమిలి రోదిస్తున్నట్లుగా, కశ్యపుని భార్య అయిన, అదితి, తన కుమారులకోసం రోదించటం జరుగుతుంది' అన్నాడు.

అదే విధమైన మరొక శాపంకూడా అదితికి ఉంది. దితి ఒకసారి అదితిని శపించింది; 'నీకు ఏడు గర్భాలు శోక కారణ మవుతై' అని. అది కారణంగా, అదితి, మూడవ జన్మలో, దేవకి అయింది. ఆమెకు జనించిన ఆరుగురు కుమారులను, ఆమె అన్న అయిన, కంసుడు సంహ

రించటం, ఆమె ఏడవ గర్భం చ్యుతం కావటం, తద్వారా, ఆమెకు గర్భశోకం కలగటం, జరిగింది.

దోషమని తెలిసికూడా గోవుల నపహరించిన కారణాన, కశ్యపుడు సయితం, వరుణుని శాపానికి గురి అయినాడు. గోవుల మీది కోరికతో ఆ దోషాన్ని ఆచరించినందువల్ల, అనంతర జన్మలో, ఆయనకు, గోపాలకత్వం సిద్ధించింది.

## 65. నంద యశోదలు :

శ్రీకృష్ణుని కన్నది దేవకీ వసుదేవు లయినా, ఆయన్ని పెంచి పోషించుకునే అదృష్టం, వారికి లేకపోయింది. ఆ భాగ్యానికి నోచుకున్నది నంద యశోదలు.

అష్టవసువులలో, ద్రోణుడనేవాడు ప్రసిద్ధుడు. ఆయన భార్య పేరు ధర. ఆ దంపతులకు, చతుర్ముఖుడు, గోరక్షణాది కార్యాలు నిర్దేశించటం జరిగింది. ఆ సమయంలో, వారు, ఆయన నుద్దేశించి, 'మహానుభావా ! మేము నీ ఆదేశానుసారం మానవలోకంలో పుడతాం. కాని, అప్పుడుకూడా, మాకు, శ్రీమహావిష్ణువును సేవించుకునే భాగ్యం ఉండేటట్లు చూడవలసింది' అని ప్రార్థించారు.

అందుకు, చతుర్ముఖు డంగీకరించాడు. కాలక్రమాన, ఆ దంపతులు, గోకులంలో, నంద యశోదలై జన్మించారు. చతుర్ముఖుని వర ప్రభావం వల్ల, బలరామ కృష్ణులను సేవించి, వారు తమ జీవితాలకు ధన్యత చేకూర్చుకున్నారు.

## 66. శ్రీకృష్ణుడు పూర్ణతముడు :

శ్రీ కృష్ణుడు, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే కావటంవల్ల, శ్రీహరివైన సర్వశక్తులూ ఆయన్ని ఆశ్రయించినై. ఆయన చరిత, నవరస మహార్ణవ మయింది.

ఆయన, ఏకైక వీరుడై, కంసాది అసురులను సంహరించాడు. రణరంగంలో, మూర్తీభవించిన రౌద్రం మాదిరి, భీష్మాచార్యునిపైకి లంఘించాడు. ఆహవ ప్రారంభంలో, కర్తవ్యతామూఢుడైన అర్జునునకు, పరమ శాంత చిత్తంతో, కర్తవ్యోపదేశం చేశాడు. పదహారువేల ఎనిమిది మంది పడుచులతో, చిత్రాతిచిత్రంగా, శృంగార చేష్టలు సలిపాడు. బాలుడై ఉండి, బ్రహ్మాండమైన గోవర్ధన పర్వతాన్ని కొనగోట నిలుపుకుని, మహాద్భుత మనిపించాడు. మృద్భక్షణాది కార్యాల ద్వారా, బీభత్సరసాన్ని వ్యక్తీకరించాడు. విరాడ్రూపాన్ని ప్రదర్శించి, దుర్యోధనాదులకు భయోత్పాతం కలిగించాడు. యాదవ కౌరవ వినాశన ఘట్టాలలో, కరుణా మూర్తిగా ప్రత్యక్షమైనాడు. శిశుక్రీడలలో చమత్కారాన్ని కల్పించి, హాస్య రసాన్ని పోషించాడు. వివిధ రాక్షసులను సంహరించే సమయంలో, వీర రసమూర్తిగా విలసిల్లాడు. ఆ విధమైన పరిణతిని అన్ని రంగాలలోనూ ప్రదర్శించటం, ఆయన, ఒక్కనికే చెల్లింది. అందుకనే, ఆయన, 'పరిపూర్ణ తమావతారుడు' అనిపించుకున్నాడు.

పరమాత్ముడు పరమానంద స్వరూపుడు. ప్రాణికోటి వాంఛించేది అవధిలేని పరమానందం. అది కారణంగానే, ప్రతిజీవీ, ఏదో ఒక సందర్భంలో, పరమాత్మని వేపు గమించటం జరుగుతుంది. ఆ పరమాత్ముడు, మానవరూపంలో అవతరించినప్పుడు, అందులోనూ, అనిర్వచనీయమైన మనోహరాకృతి ధరించినప్పుడు, ఆ అవతార ప్రయోజనం అతిశయిస్తుంది. అదే శ్రీ కృష్ణావతారంలో జరిగింది.

'కృష్ణుడు'అంటేనే 'అందరి హృదయాలనూ ఆకర్షించేవాడు' అని అర్థం. యథార్థానికి, ఆయనవల్ల ఆకర్షింపబడని ప్రాణి అంటూ లేదు. ప్రేమపూరితలై గోపికలు, భయాన్వితులై కంసాదులు, వైరంమూలంగా శిశుపాల దంతవక్త్రులు, బాంధవ్యంద్వారా యాదవ పాండవులు, భక్తి మూలంగా పరమర్షులు, అందరూ ఆయనవల్ల ఆకర్షింపబడినవారే; తద్ద్వారా ధన్యత పొంది, తరించిన వారే.

శ్రీకృష్ణుడు, మాయామానుష విగ్రహుడై, భూలోకంలో, నూట ఇరవై అయిదు సంవత్సరాలు చరించాడు. ఆ కాలంలో, ఆయన, అనేక మైన అద్భుత కార్యాలను సాధించాడు. అనేకుల ననుగ్రహించాడు. పురిటి పొత్తిళ్ళలో ఉండి, తలిదండ్రులకు, శ్రీమన్నారాయణుడుగా దర్శన మివ్వ టంతో ప్రారంభమైన ఆయన లీలలు, యాదవవంశ వినాశంతో అంత మయినై.

* * *

బలసంపదలో బలరాము డెంతో, ఆత్మ సౌందర్యంలో అచ్యు తుడు అంత. ఆయన అందచందాలను అభివర్ణించటానికి, ఆ పలుకుల తల్లి మాత్రమే అర్హురాలనిపిస్తుంది. మన్మథుని కన్నతండ్రి కానున్న కృష్ణయ్య సౌందర్యాన్ని, మహర్షులు కూడా, పరిపూర్ణంగా వర్ణించలేక పోయినారు.

శ్రీకృష్ణుడు ముగ్ధమోహనమూర్తి. ఆయన, శృంగారరస సర్వస్వం. నల్లనిఅగిసెన పువ్వువంటి శరీరచ్ఛాయ, పద్మంవంటి కోలముఖం, ఆ ముఖంలో, చిలిపితనాన్ని చిందే, తామర రేకులవంటి విశాల నేత్రాలు, ప్రేమామృతాన్ని వర్షిస్తూ ఉండే పెదవులు, ఆ గిరజాల జుట్టు, చిరుకేశాల ముడి, దానిమీద శిఖిపింఛం, మెళ్లో బంగరు పులిగోరు, చేతులకూ కాళ్ళకూ బంగరు గజ్జెలు, మొలకు పైడి త్రాడు, మెళ్ళో వనమాల...అవన్నీ తలచు కుంటే, సౌందర్యరసాధిదేవత ఆయనగా మూర్తీభవించిందా అనిపిస్తుంది. ఆయన నాశ్రయించటంవల్లనే, మాధుర్య రసానికి సిద్ధి లభించిందా అని పిస్తుంది.

శ్రీకృష్ణుని మాహాత్మ్యం ఎంత గొప్పదో, సౌందర్యం కూడా అంతగొప్పదే. ఆ యుగంలో, శ్రీకృష్ణుని వంటి అందగాళ్ళు లేనేలేరని ప్రతీతి. ఆయన తరువాత చెప్పదగినవారు, ఆయన కుమారుడు ప్రద్యు మ్నుడూ, మనుమడు అనిరుద్ధుడూ, పాండుపుత్రుడైన నకులుడూమాత్రమే.

* * *

శ్రీకృష్ణుని అభిరుచులుకూడా, ఆయన అందానికి అనుగుణం గానే ఉండేవి. నీలమేఘచ్ఛాయ గల ఆ మహానుభావుడు, పసుపురంగు పట్టు

బట్టలు కట్టుకునేవాడు. కొన్ని అమడల దూరం సౌరభాన్ని విరజిమ్మే పారిజాతాన్ని, తన ఉద్యానవనంలో ప్రతిష్ఠించుకున్నాడు. అద్భుతమైన అశ్వ రాజాలను, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, బలాహక, అనే వాటిని, పెంచి పోషించుకున్నాడు. ప్రపంచంలోని నగరాలన్నిటిలోకీ శ్రేష్ఠమైన ద్వారావతిని, విశ్వకర్మచేత నిర్మింపజేసుకున్నాడు. ఆ నగరంలో, తను కొలువు దీర్చే నిమిత్తం, 'సుధర్మ' అనే సింహాసనాన్ని, మహేంద్రునివద్దనుంచి తెప్పించుకున్నాడు. ప్రాగ్జ్యోతిషాధిపతి అయిన నరకాసురుడు, ఏరి కోరి తెప్పించుకుని,చెఱలో ఉంచిన, పరమ సౌందర్యవతులను, పదహారువేలమంది రాకుమార్తెలను, వారి కోరికమీద, తన అంతఃపురంలో చేర్చుకున్నాడు. తలచు కున్నంతలో ఎంత దూరమైనా వెళ్ళటానికి వీలుగా, 'గరుడ' అనే ఒక మహత్తర విమానాన్ని కల్పించుకున్నాడు. అదీ; ఆయన వైశిష్ట్యం.

## 67. కంసుడైన కాలనేమి :

శ్రీహరి, భూలోకంలో అవతరింపబోతున్నాడన్న విషయం, ప్రప్రథమంగా కంసునకు తెలిసింది. ఆ విషయాన్ని అతనికి వినిపించింది, ఒక అదృశ్యవాణి.

కంసుడు, మధురాధిపతి అయిన ఉగ్రసేనుని కుమారుడు. పూర్వజన్మలో, అతడు, కాలనేమి అనే రాక్షసుడు. అతడు సామాన్యుడు కాడు ; శతభుజుడు. శత శిరస్కుడు. శైల సదృశుడు. ఉగ్రవీక్షణుడు.

క్షీరసాగర మథన సమయంలో, అతడు, శ్రీహరి నెదిరించి, యుద్ధం చేశాడు. ఆయన వల్ల నిహతుడైనాడు. కాని, అసుర పురోహితుడయిన భార్గవుడు, తిరిగి అతణ్ణి బ్రతికించటం జరిగింది.

అలా పునర్జీవితుడైన కాలనేమి, శ్రీహరిని జయించే ఉద్దేశంతో, ఆ తరువాత, నూరేళ్ళపాటు, బ్రహ్మదేవుని గురించి తీవ్రమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చుకుని, చతుర్ముఖుడతనికి ప్రత్యక్షమై, 'నీ మనోరథ మేమిటో తెలుపవలసింది' అన్నాడు.

ఆయనకు సమాధానంగా, కాలనేమి, 'నేను అమరులచేత మరణించకుండా ఉండే వరం ప్రసాదించవలసింది' అన్నాడు. ఆ సమయంలో, అతనికి ఆ వర మివ్వటం అనుచితమని, చతుర్ముఖుడు భావించాడు. అది కారణంగానే, 'వచ్చే జన్మలో నీ కీ వరం లభిస్తుంది' అని చెప్పి, అదృశ్యుడై నాడు.

### 68. కంసుని దిగ్విజయం :

ఆ తరువాత, కంసుడై జనించిన కాలనేమి, అమిత బలపరాక్రమాలు కలవాడని ప్రసిద్ధి పొందాడు. కనిపించిన వీరు లందరితోనూ అతడు కయ్యానికి దిగేవాడు. అందరినీ అతి సులభంగా పరాజితులను చేసేవాడు.

అలా ఉండగా, ఓసారి, మగధేశ్వరుడైన జరాసంధునితో అతనికి పోరు సంభవించింది. యమునానది ఒడ్డున ఆ మహావీరు లిద్దరూ రణోత్సాహంతో ఉన్న సమయంలో, 'కువలయాపీడం' అనే జరాసంధుని పట్టపుచేనుగు, గొలుసులు త్రెంచుకుని, శిబిరాలను కూలద్రోసుకుంటూ రణరంగంలో ప్రవేశించింది.

ఆ మత్త గజేంద్రం చేసే ఘీంకృతులు విని, అక్కడి యోధులందరూ, ప్రాణభీతితో పారిపోయినారు; కాని, కంసుడు మాత్రం కదలలేదు.

అంతలో, కువలయాపీడం, అతణ్ణి సమీపించింది. భీకరంగా ఘీంకరిస్తూ, అతనితో తలబడ్డది.

వేయి ఏనుగుల బలం కలది కువలయాపీడం. అది తెలిసి కూడా, కంసుడు కలవరపడలేదు. ఒక్క అడుగైనా వెనక్కు వేయలేదు. అలా నిశ్చలంగా నిలబడి ఉండే, ఆ గజేంద్రుని తొండం గట్టిగా పట్టుకున్నాడు. అలా పట్టుకుని, దాన్ని పైకెత్తి, గిరగిరా త్రిప్పి, జరాసంధుని సైన్యం మీదకు విసరి వేశాడు. ఆ సందర్భంలో, అనేక వేలమంది మరణించటం సంభవించింది.

అది చూసిన జరాసంధునకు, కంసుని బలసంపద మహాద్భుత

మైన దనిపించింది. ఆపైన, కంసునితో పోరుసలిపేకంటె, మైత్రి చేసుకోవటం శ్రేయస్కరమని, అతను భావించాడు. ఆ వెంటనే, కంసునితో సంధి చేసుకుని, తన కుమార్తెలైన, అస్తి ప్రాప్తి అనేవారిని, అతనికిచ్చి వివాహం చేసి, అతనితో బాంధవ్యం ఏర్పరచుకున్నాడు.

ఆ తరువాత, కంసుడు, మాహిష్మతీపురం మీదకు దాడివెళ్ళాడు. వెళ్ళి, మల్లయుద్ధ విశారదులైన చాణూర ముష్టికాది రాజ కుమారులను, తనతో ద్వంద్వ యుద్ధానికి ఆహ్వానించాడు. అప్పుడు జరిగిన ద్వంద్వ యుద్ధంలో, వారిని అవలీలగా ఓడించి, నియమప్రకారం, వారిని, తన భృత్యులను చేసుకున్నాడు.

అక్కడి నుంచి బయలుదేరి, కంసుడు, ప్రవర్షణాద్రికి వెళ్ళాడు. వెళ్ళి, అక్కడ వీరవిహారం చేస్తూఉండే, ద్వివిదుడనే వానరునితో యుద్ధం చేశాడు.

ద్వివిదునకూ కంసునకూ, మధ్య, ఇరవై ఎనిమిది రోజులు, ఘోరమైన పోరు జరిగింది ఆ సందర్భంలో, ద్వివిదుడు, ఒక కొండను పెల్లగించి, గిరగిరా త్రిప్పి కంసుని మీదకు వదిలాడు. కంసుడు, ఆ కొండను పట్టుకుని, తిరిగి ద్వివిదుని మీదకు విసరి వేశాడు. ఆ తాకిడికి తట్టుకోలేక, ద్వివిదుడు మూర్ఛ పోవటం, ఆ తరువాత తేరుకుని, కంసునికి 'దాసోహ' మనటం, జరిగింది.

ద్వివిదుని దాసునిగా స్వీకరించి, అక్కడినుంచి బయలుదేరి, కంసుడు, ఋష్యమూకానికి వెళ్ళాడు. అక్కడ ఉన్న కేశి అనే నర భోజనునితో యుద్ధంచేసి, గెలిచాడు. ఆ సమయంలో, కంసుడు, ఋష్యమూకాన్ని పెకలించి, దాన్ని అవలీలగా నూరుసార్లు అటూ ఇటూ కుదించి పడవేయటం జరిగింది.

అక్కడే, కంసునకు, పరశురాముని దర్శన మయింది. కంసుడాయనకు నమస్కరించి, భక్తితో ప్రదక్షిణం చేశాడు. కాని, క్షత్రియ కులాంతకుడైన పరశురాముడు, అతణ్ణి, ఊరక వదలదలచుకోలేదు. అది

కారణంగానే, తనదైన విష్ణుధనుస్సును, త్రిపుర సంహార సమయంలో శ్రీమహావిష్ణువు మహేశ్వరునకు ప్రసాదించినదాన్ని, అతనికి అందిస్తూ, 'దీన్ని ఎక్కుపెట్టగలిగినపక్షంలో నీ ప్రాణం నీకు దక్కుతుంది' అన్నాడు.

కంసుడు ఆ మాటలు విని కూడా, కలవరపడలేదు. ఆ ధనుస్సును, గౌరవపూర్వకంగా స్వీకరించాడు. వింటికి నారిని సంధించాడు. టంకారం చేశాడు.

అది గ్రహించిన పరశురాముడు, అతని బాహుబల సంపత్తికి అమితాశ్చర్యం పొందాడు. అతని పట్ల ప్రసన్నుడైనాడు. అది కారణంగానే ఆ ధనుస్సును అతనికి బహూకరిస్తూ, 'దీనితో నువ్వు నీ శత్రువు లందరినీ సంహరించగలుగుతావు' అని చెప్పాడు.

ఆ మాటలు విని; కంసుడు, పరమానందం పొందాడు. కాని, అంతలోనే, పరశురాము డతణ్ణి ఉద్దేశించి, 'నాయనా ! ఇది మహా చాపం. దీన్ని ఏ మహానుభావుడు విడుస్తాడో, అతడే, దీని అధికారికి అంతకు దవుతాడు. అది మాత్రం గ్రహించవలసింది' అన్నాడు. అది విన్న కంసుడు, ఆలోచనలో పడ్డాడు. కాని, చేయగల దేమీ లేక, పరశురామునివద్ద సెలవు తీసుకుని వెళ్ళిపోయినాడు.

అలా వెళ్ళిన కంసుడు, దారిలో, సర్పరూపి అయిన అఘాసురునీ, వృషభ రూపి అయిన అరిష్టునీ జయించాడు.

అక్కడినుంచి ఉత్తరంగా వెళ్ళి, ప్రాగ్జోతిష పురాధిపతిని అయిన నరకాసురుని, తనతో యుద్ధం చేయవలసిందిగా ఆహ్వానించాడు. ఆ ఆహ్వానాన్ని, నరకుడు అంగీకరించటం జరిగింది.

అంతలోనే, నరకుని సహచరుడైన ప్రలంబుడు, కంసునితో కలియబడ్డాడు. తీవ్రంగా పోరాడాడు, చివరకు. పరాజితుడయినాడు.

ఆ పైన, కంసునకూ ధేనుకాసురునకూ మధ్య ద్వంద్వయుద్ధం జరిగింది. ఆ యుద్ధంలో, ధేనుకుడు, కంసునకు సముదనిపించుకున్నాడు.

ఆ తరువాత, కంస తృణావర్తుల మధ్య, ఘోరమైన పోరు జరిగింది. ఆ పోరులో, తృణావర్తుడు, కంసుని, గుప్పిటిలో ఇరికించుకుని, ఆకాశానికి ఎగిరిపోయి, అక్కడ, అతనితో యుద్ధం చేశాడు. కాని, కంసుడు, అతణ్ణి అక్కడినుంచి క్రిందికి పడవేయటం జరిగింది.

అనంతరం, కంసుడు, బక దైత్యునితో పోరాడి గెలిచాడు. బకుని చెల్లెలయిన పూతనను, సోదరిగా భావించి, మన్నించాడు.

అదంతా చూసిన నరకాసురుడు, కంసుని సమీపించి, గౌరవించి, అతనితో స్నేహం చేసుకుని, 'దేవతలను జయించే విషయంలో నాకు తోడ్పడవలసింది' అని కోరాడు. కంసుడు దానికి అంగీకరించాడు.

ఆ తరువాత, కంసుడు, నారదుని ప్రేరణమీద, బాణాసురునితో యుద్ధం చేశాడు. ఆ సమయంలో, అతడు, ఒక మూరెడు క్రుంగినభూమిని, అనాయాసంగా పైకి ఎత్తటం జరిగింది. అది చూసిన శంకరుడు, ఆ మహావీరు లిద్దరకూ సంధి చేశాడు.

ఆపైన, కంసుడు, వత్స వ్యోమ కాలయవనులను జయించాడు. వారినికూడా, తన అనుచర వర్గీయులనుగా స్వీకరించాడు.

అనంతరం, అంతకు పూర్వం తను జయించిన అసురవీరులందరితోనూ బయలుదేరి, కంసుడు, అమరావతిలో ప్రవేశించాడు. అక్కడ, అతనికి, మహేంద్రునితో, ఘోరమైన సంగ్రామం జరిగింది. అందులో, దేవతలు, కొందరు హతులైనారు. కొందరు వికలాంగులయినారు. మరి కొందరు పారిపోయి, అక్కడక్కడ తలదాచుకున్నారు.

ఆ సమయంలో, మహేంద్రుడు, తన ఐరావతాన్ని కంసుని మీదకు పంపటం జరిగింది. అది ఘీంకారం చేస్తూ వెళ్ళి, కంసునితో కలియబడి, అతణ్ణి పడత్రోసింది. కాని, కంసుడు, వెంటనే లేచి, ఆ గజేంద్రుని దంతం ఒక చేత్తో పట్టుకుని, మరొక చేత్తో మహేంద్రుని గుద్దాడు. అది చూసిన దేవతల గుండెలు, నీరైపోయినై. అంతలో, కంసుడు, మహేం

ద్రుని సింహాసనాన్ని సమీపించి, దాన్ని స్వాధీన పరచుకుని, మధురానగరం చేరుకున్నాడు.

## 69. కంసుని ప్రాణభీతి :

ఆ విధంగా దిగ్విజయయాత్ర చేసి, వీరాధివీరు లందరినీ తనకు దాసులుగా చేసుకుని, దేవతలనుసయితం భయభ్రాంతులను చేసిన కంసుడు, ఒకసారి, తన చెల్లెలయిన దేవకినీ, ఆమె భర్త అయిన వసుదేవునీ, వారి నివాసానికి తీసుకుపోతూ ఉండగా, దారిలో, 'కంసా ! నువ్వు ఏ సోదరిని సంతోషపరచే నిమిత్తం ఆమె ఉన్న రథాన్ని నడుపుతున్నావో, ఆమెదైన అష్టమగర్భం నిన్ను సంహరిస్తుంది సుమా!' అన్న ఒక అదృశ్యవాణి వినిపించింది. ఆ పలుకులు విన్న కంసుడు, అమితంగా కలవరపడ్డాడు. ఆ కలవరపాటు మూలంగా, అతని వివేచనాజ్ఞానం అంతరించిపోయింది. అంతవరకూ, అతనికి, తన సోదరిపట్లా ఆమె భర్త పట్లా ఉన్న అభిమాన మంతా హరించిపోయింది. అశరీరి పలుకులు అసత్యాలు కావన్న విశ్వాసం అతనిలో కలిగింది. తా నంతవరకూ ప్రేమ చూపుతున్నది, తన్ను సంహరింప బోయేవాని తల్లిదండ్రులనన్న అభిప్రాయం కూడా అతనిలో ఏర్పడ్డది. అది కారణంగా, అతనిలో, అంతులేని క్రోధం జనించింది. ఆ వెంటనే, అతను, ఒరనుంచి కత్తిదూసి, దేవకీదేవిని చంపటానికి ఉద్యమించాడు. అది గ్రహించిన వసుదేవుడు, అదలిపోయినాడు. ఒక అబలను, అందులోనూ సోదరిని, అదీకాక నూత్నవధువును, సంహరించటానికి నిశ్చయించుకున్న కంసుని క్రోధాన్ని, ఏ విధంగా ఉపశమింపచేయాలో అతని కప్పుడు తోచలేదు. ఆ కల్యాణసమయంలో, అతడితో విరోధించి పోరాడటం కూడా ఉచితం కాదని, ఆయన అనుకున్నాడు. అందుకనే, ఆ అపాయం నుంచి, తన భార్యను తాత్కాలికంగా అయినా తప్పించే నిమిత్తం, అతణ్ణి ఉద్దేశించి,

'అన్నవు నీవు చెల్లెలికి నక్కట మాడలు సీర లిచ్చుటో
మన్నన సేయుటో మధుర మంజుల భాషల నాదరించుటో

మిన్నుల మ్రోత్రలే నిజము మేలని చంపకుమన్న మాని రా
వన్న సహింపుమన్న తగదన్న వధింపకుమన్న వేడెదన్'

అని అతిదీనంగా విన్నవించుకున్నాడు. అంతేకాదు. 'కంసా! ఈమె నీ కింతవరకు చేసిన అపకార మేమీలేదు. అదీకాక, నీ మీద ఈమెకు అమిత మైన అభిమానంకూడా ఉంది. అనవరతం నీ క్షేమాన్ని అభిలషించే ఈ అమాయకురాలిని, ఒక అశరీరి పలుకులు నమ్మి, హత్య చేయటం ఉచితం కాదు. పాలకుడవైన నువ్వే ఇలా ప్రవర్తిస్తే, ప్రజలలో, అధర్మభీతి అనేదే ఉండదు. ఆ విధంగా ధర్మచ్యుతికి కారకుడవు కావటం, పాపాన్ని ఒడి గట్టుకోవటమే అవుతుంది. అది, నీవంటివానికి ఉచితం కాదు; అని కూడా తెలియపరచుకున్నాడు.

అలా ఎంతగా ఉపదేశించినా, కంసుడు తన ప్రయత్నం విరమించుకునేటట్టు కనిపించలేదు. అది గ్రహించిన వసుదేవుడు, అతనిలోని జ్ఞానాన్ని స్పృశించి చూద్దా మనుకున్నాడు. అందుకనే...

'బావా! ఉత్తమకులంలో జన్మించి, విజ్ఞాని వనిపించుకున్ననువ్వు, ఇంతటి అఘాయిత్యానికి పూనుకోవటం, నీకూ నీ వంగడానికీ కూడా అవమానకరమే అవుతుంది.

యథార్థానికి, జనించిన ప్రతిప్రాణీ మరణించటం సహజం, ఆ మరణ మన్నది ఎప్పుడెలా సంభవించేది ఎవరికీ తెలియదు. అది, దేహిని, పుట్టుకనుంచీ వెంటాడుతూనే ఉంటుంది. ఈ రోజున కాకపోయినా, మరో నూరేళ్ళకైనా, అది, తనపని పూర్తిచేసుకు తీరుతుంది. కాని, అందులో, మనం గ్రహించవలసిన విషయ మొకటి ఉంది. దేహి, తన పూర్వకర్మల ననుసరించి, కష్ట సుఖాలను గానీ, ఆనంద విషాదాలను గానీ పొందుతూ

ఉండటం జరుగుతుంది. కాలక్రమాన పంచత్వం పొందేది దేహమే కాని దేహి కాదు. అది గ్రహించలేక, ప్రతిప్రాణీ, తనకు అనుభవ నీయమయే ప్రతి విషయానికీ, ఇతరులు కారకు లనుకోవటం సంభవిస్తూ ఉంటుంది. దానికి, అజ్ఞానమే మూలకారణం. ఆ అజ్ఞానం, మాయవల్ల జనిస్తుంది. మాయను జయించటం, మానవులందరకూ సాధ్యమయే పని కాదు.

మన కర్మలే,మనకుమేలునుగాని కీడునుగాని కల్పిస్తూ ఉంటై. అందుకనే, ఆత్మ క్షేమాన్ని ఆశించేవారు, ఇతరులకు ద్రోహం తలపెట్టరు; పరులను హింసించటానికి పూనుకోరు.

ద్రోహచింత కలవారికీ, హింసాప్రవృత్తి నవలంబించేవారికీ, శాంతి అనేది లభించదు. వారు శాంతిదూరులు కావటానికి, వారిలో ఉండే నిరంతర భీతి కారణమవుతుంది. హింసా ప్రవృత్తి నవలంబించటంవల్ల, అపయశం కలుగుతుంది; ఇహ పరాలలో సుఖం లేకుండా పోతుంది.

అందుకనే, ఉద్రేకాన్ని ఉపశమింపచేసుకోవలసిందనీ, హింసా ప్రవృత్తిని త్యజించవలసిందనీ, సత్కీర్తికి పాత్రుడవు కావలసిందనీ, విజ్ఞాని వైన నిన్ను కోరుతున్నాను.'

వసుదేవుని వచనాలు, కంసునిలో, ఏ విధమైన మార్పునూ కలిగించలేదు. అది గ్రహించిన వసుదేవుడు, ఇలా అనుకున్నాడు.

'బుద్ధిబలాన్ని ఉపయోగించి, అపాయాన్ని తొలగించుకోవటం,

ప్రతివ్యక్తికీ అవశ్యకర్తవ్యం. నాకు కూడా, ఇప్పుడు, అదే శరణ్యంగా కనిపిస్తోంది.

ఈమెకు పుట్టబోయే కుమారునివల్ల, తనకు మృత్యువు సంభవిస్తుందని, ఇతడు భావిస్తున్నాడు. అందుకనే, ఈమెను సంహరించటానికి పూనుకున్నాడు. ఈమెకు పుట్టే బిడ్డలను ఇతనికి ఒప్పగించటానికి నేను అంగీకరించేపక్షంలో, ఇత డిప్పు డీమెను ఒదిలిపెట్టడం అసంభవం కాకపోవచ్చు. అలా, ఈమె బ్రతికి బయటపడట మనేదే సంభవిస్తే, కాల క్రమాన, దైవ నిర్ణయం యెలా ఉంటే అలా జరుగుతుంది. నా బిడ్డలు, ఇతని చేతులో మరణించట మనేదే దైవనిర్ణయమైతే, దాన్ని, నేనే కాదు, బ్రహ్మదేవుడు కూడా తప్పించలేడు. అలాకాక, ఆకాశవాణి పలుకులే యథార్థమయే పక్షంలో, ఇత డిప్పు డీమెను సంహరించటం కూడా అసంభవమే. ఏ దేమైనా, నా కర్తవ్యాన్ని మాత్రం నేను నెరవేర్చుకోవాలి ; ఆపన్నురాలయిన ఈమెను రక్షించటానికి ప్రయత్నించి తీరాలి.'

అలా అనుకుని, వసుదేవుడు, లేని వికాసం తెచ్చిపెట్టుకుని, కంసుని ఉద్దేశించి...

'బావా ! ఈమెకు పుట్టిన కుమారునివల్ల గదా, నీకు మరణమున్నదని, గగనవాణి చెప్పింది. ఆ పలుకుల మీద నీకు నమ్మిక ఉన్న పక్షంలో, నీ భయ నివృత్తి కోసం, ఈమెకు పుట్టే పిల్లలందరినీ నీకు ఒప్పగిస్తాను. వారిని నువ్వు ఏం చేసినాసరే; నేను అడగను. నా మాటవిని, ఈమెకు ప్రాణదానం చేయవలసింది'

అని, బహుమాన పురస్సరంగా బ్రతిమాలుకున్నాడు.

ఆ పలుకులు విన్న కంసునకు, వసుదేవుని అభిప్రాయం సమంజసమైనదిగానే తోచింది. అందుకనే, అతను, వసుదేవుని పలుకులమీది విశ్వాసంతో, ఆ నియమానికి అంగీకరించి, వారిని వదలి, గృహోన్ముఖుడై వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, దేవకీ వసుదేవులు, ఆ ఆపదనుంచి తమ్ము రక్షించిన పరమాత్ముని పలువిధాల ప్రస్తుతిస్తూ, నిజ నివాసం చేరుకున్నారు.

కాలక్రమాన, దేవకీ వసుదేవులకు, ఆరుగురు కొడుకులూ, ఒక కూతురూ, జనించారు. ఆ కొడుకులలో జ్యేష్ఠుని పేరు, కీర్తిమంతుడు. సత్యవచనానికి, పుత్రప్రేమ కూడా అడ్డు కారాదన్న అభిప్రాయంతో, వసుదేవుడు, ఆ కుఱ్ఱవాణ్ణి, పుట్టిన వెంటనే తీసుకుపోయి, కంసునకు ఒప్పగించాడు. వసుదెవుని సత్యనిష్ఠకు అమితానందం పొందిన కంసుడు, ఆయన నుద్దేశించి, 'బావా! ఇతనివల్ల నాకు కలిగే అపాయ మేమీ లేదు. ఇతణ్ణి నువ్వు తీసుకువెళ్ళవలసింది. దేవకికి జనించే ఎనిమిదవ పాపను మాత్రం నాకు ఒప్పగిస్తే చాలు; అతణ్ణి వధించి, నేను, చావు తప్పించుకుంటాను' అని తెలియపరచి, పంపివేశాడు.

ఆ తరువాత, ఒకసారి, నారదమహర్షి కంసుని సమీపించి, మందలో ఉన్న నందాదులూ వారి భార్యలూ పుత్రులూ బంధువులూ వసుదేవాదులూ దేవతలనీ, ఉగ్రసేనసుతులూ వారి మిత్రులూ దైత్యాంశ సంభూతులనీ, దేవమయుడయిన వాసుదేవుడు, దైత్యులను సంహరించే నిమిత్తం, దేవకీ గర్భాన జనింపబోతున్నాడనీ, తెలియపరచాడు. ఆ పలుకులు విన్న కంసుని హృదయంలో, తిరిగి, కలవరం ప్రారంభమయింది. అది కారణంగానే, అతడు, దేవకీ వసుదేవులను బంధించాడు. ఆ తరువాత, వారు కన్న పిల్లలందరినీ వధించాడు. అనంతరం, అతను, యాదవులతో పగ పెంచుకోవటం, యదు భోజాంధకులకు అధిపతి అయిన తన తండ్రిని, ఉగ్రసేనుని, నిర్బంధించి, రాజ్యాసనాన్ని ఆక్రమించుకోవటం కూడా, జరిగింది. ఆ సందర్భంలో, అతనికి, జరాసంధాదు లెంతగానో సహాయపడ్డారు.

ఆ విధంగా, నిరంకుశుడై వ్యవహరింపసాగిన కంసునకు, కాలక్రమాన, బాణుడు, భౌముడు, కేశి, ధేనుకుడు, బకుడు, ప్రలంబుడు, చాణూరుడు, ముష్టికుడు, పూతనా తృణావర్తాదులూ, అనుచరవర్గీయులయినారు. వారి తోడ్పాటుతో, కంసుడు, యాదవులను, అనేక విధాల హింసించాడు. ఆ బాధలు భరించలేక, వారిలో చాలామంది, మధురాపురం వదలి, నిషధ కురు కోసల విదేహ విదర్భ కేకయ పాంచాలాది దేశాలలో

తలదాచుకోవటం జరిగింది.

*　　*　　*

కంసుడు, ఆ విధంగా అసుర ప్రవృత్తి నలవరచుకోవటానికి కారణం, అతని పుటుకలోనే ఉంది. కంసుని తల్లి, ఒకసారి, యదు వృష్ణి భోజాంధక స్త్రీలతో కలసి, సుయామునశైలానికి వెళ్ళింది. ఆమె అక్కడ ఉన్న సమయంలో, ఒక రాక్షసుడు, ఉగ్రసేనుని రూపంలో అక్కడికి వెళ్ళి, ఆమెతో కొంతకాలం గడిపాడు. అది కారణంగా ఆమె గర్భవతి అయింది.

ఆ రాక్షసుడు, సౌంభపురాధీశ్వరుడయిన ద్రామిళుడు. అత డామెతో, 'నీకు జగదేక వీరుడయిన కుమారుడు కలుగుతాడు' అని చెప్పాడు. ఆమె, అతని మోసం గ్రహించి, 'నువ్వు అర్ధాయుష్కుడవు కావలసింది' అని శపించింది. అంతేకాదు. 'నీ వల్ల కలిగే కుమారుని, నా కుమారునిగా భావించను' అని కూడా చెప్పింది. దానికితోడు, 'నా భర్తవంశంలో జనించినవాడే అతణ్ణి చంపుతాడు' అని కూడా అన్నది.

తరువాత, కంసుడు పుట్టాడు. అతనికి, మొదటినుంచీ కూడా, ఉగ్రసేనుడంటే గిట్టేది కాదు. తల్లిమీద, గౌరవం అనేదే ఉండేది కాదు. బంధువర్గానికి, అతడు, యెప్పుడూ దూరంగానే ఉండేవాడు.

### 70. శ్రీకృష్ణుని జననం :

కాలక్రమాన, హర్యంశతో, అనంతుడు, దేవకీదేవి గర్భాన ప్రవేశించాడు. అది గ్రహించిన శ్రీమన్నారాయణుడు, ఆ గర్భానికి అపాయం కలుగకూడదన్న అభిప్రాయంతో, యోగమాయను పిలిచి, ఇలా అన్నాడు :

'భద్రా! దేవకీ వసుదేవులను, కంసుడు, అమితంగా హింసిస్తున్నాడు. వారి పుత్రుల నార్వురను, అత డింతకుముందు వధించటం జరిగింది. ఇప్పుడు, అనంతుడు దేవకీ గర్భాన ఉన్నాడు. అత దక్కడ జనించటం అపాయకరం.

మధురలో, కంసుడు పెట్టే బాధలు భరించలేక, వసుదేవుని భార్య అయిన రోహిణి, ప్రస్తుతం, నందగోకులంలో ఉన్నది. నువ్విప్పుడు, నీ ప్రభావంద్వారా, దేవకీదేవి కడుపున ఉన్న ఆ తేజాన్ని, మందలో ఉన్న రోహిణీ గర్భాన ప్రవేశింప జేయాలి.

అంతేకాదు. ఆ తరువాత, నువ్వు, నందగోపుని భార్య అయిన యశోదకు జనించాలి. అదే సమయానికి, నేను, దేవకికడుపున, నిజాంశతో జన్మిస్తాను.

యశోద కడుపున పుట్టిన నిన్ను, ఆపైన, మానవులు, దుర్గ, భద్రకాళి, వైష్ణవి, చండిక, విజయ, కుముద, కృష్ణ, మాధవి, కన్యక, మాయ, నారాయణి, ఈశాన, శారద, అంబిక అనే పేర్లతో పిలుస్తూ ఉంటారు; కొలుస్తూ ఉంటారు.'

శ్రీహరి అలా ఆదేశించగానే, యోగమాయ, అక్కడినుంచి వెళ్ళి, తన కర్తవ్యాన్ని నెరవేర్చుకుంది. అది కారణంగా, రోహిణికి, బలరాముడు జనించాడు.

ఆ తరువాత, కొంతకాలానికి, భూభారాన్ని తొలగించే ఉద్దేశంతో, శ్రీమన్నారాయణుడు, తన నిజాంశతో, దేవకీదేవి గర్భాన ప్రవేశించాడు; అక్కడ, క్షణక్షణం వృద్ధిపొందసాగాడు.

దేవకీదేవి గర్భంలో హరితేజం వర్ధిల్లుతూ ఉండటంవల్ల, ఆమె, చూపరులకు, మహాద్భుతంగా కనిపించసాగింది. అది గ్రహించిన కంసుడు, అమితంగా ఆందోళనపడసాగాడు. అశరీరి పలుకులు, యథార్థాలు కాబోతున్నై కాబోలు ననుకున్నాడు. దేవకీదేవి ధరించిన అష్టమగర్భం అదేనన్న అభిప్రాయం కూడా అప్పు డతనికి కలిగింది. కాని, అప్పు డేమి చేయటానికీ అతనికి పాలుపోలేదు.

'ఆడుదాన్ని వధించటమే పాపం. అందులోనూ చెల్లెలిని, అదీకాక, నిండుచూలాలిని, చంపటం వల్ల, అనతికాలంలోనే సర్వ సంపదలూ హరిస్తై. కీర్తి నశిస్తుంది. ఆయువు క్షీణించి పోతుంది.

స్త్రీ హత్యాపాతకానికి పాల్పడ్డవాడు, బ్రతికి ఉండికూడా, మరణించిన వాడుగానే పరిగణింపబడతాడు. అతణ్ణి, ప్రజలు, పరిపరివిధాల దూషిస్తారు. 'అతడు కీర్తిహీనుడు' అని, పెద్దలందరూ, అతణ్ణి త్యజిస్తారు. ఇహలోకంలో ఈవిధమైన అవమానంపాలై, పరలోకంలో అతడు, ఘోర నరకయాతనలనుభవించటం జరుగుతుంది.'

ఆ విధంగా ఆలోచించి, కంసుడు, దేవకీదేవిని వధించటం తనకు తగదని నిర్ణయించుకున్నాడు. ఆమెకు పుట్టే కుమారుని మాత్రం, వెంటనే నఱికివేయటానికీ, తన భీతిని తొలగించుకోవటానికి, నిశ్చయించుకున్నాడు. ఆ నిశ్చయంతోనే, అతడు, హరి ఏదైన రూపం ఎప్పుడు తన కళ్ళబడుతుందా అని, క్షణ మొక యుగంగా గడుపసాగాడు. అలా, హరితో వైరం పెంచుకుని, తింటున్నా తిరుగుతున్నా, పడుకున్నా పనిమీద ఉన్నా, కూర్చున్నా లేచినా, సర్వకాల సర్వావస్థలలోనూ ఆ హరినే తలచుకుంటూ, అతని మీదనే మనసు పెట్టి చరిస్తూ, చివరకు, ప్రపంచమంతా హరిమయంగా భావించే స్థితికి వచ్చాడు. అంతేకాదు.

శ్రవణ రంధ్రముల నే శబ్దంబు వినబడె
నది హరి పలుకని యాలకించు
నక్షిమార్గమున నెయ్యది సూడబడె నది
హరి మూర్తి గానోపునంచు జూచు
దిరుగుచో దేహంబు తృణమైన జోకిన
హరికరాఘాతమో యనుచు గదియు
గంధంబు లేమైన ఘ్రాణంబు సొచ్చిన
హరి మాలికాగంధ మనుచు నదరు
బలుకు లెవ్వియైన బలుకుచో హరిపేరు
పలుకబడియె ననుచు బ్రమసి పలుకు
దలపు లెట్టివైన దలచి యా తలపులు
హరి తలంపు లనుచు నలుగ దలచు.

అలా కొంతకాలం గడిచింది. అంతలో, దేవకీదేవి నీళ్ళాడే రోజులు సమీపించినై. అది గ్రహించిన బ్రహ్మ రుద్రాదులూ, నారదాది మహర్షులూ, దేవకీ వసుదేవులున్న చెరసాలకు వచ్చి, దేవకీ గర్భస్థుడై ఉన్న శ్రీహరిని, అనేక విధాల ప్రస్తుతించారు. అలా ప్రస్తుతించి...

'తండ్రీ ! నువ్వు సాధుజన పోషకుడవు. నీ ప్రభావాన్ని గుర్తించినవారు, నీమీదనే మనసు పెట్టుకుని, నీ పాదాబ్జాలనే సేవిస్తూ, భవసాగరాన్ని తరిస్తారు.

నువ్వు, మంచివారికి మేలునూ, దుష్టులకు కీడునూ, కల్పించే నిమిత్తం, అనేకరూపాలు ధరిస్తూ ఉంటావు; లోకాలకు క్షేమం చేకూరుస్తూ ఉంటావు.

కొందఱు, కొఱమాలిన చదువులుచదివి, తాము ముక్తులైనట్లు భావించి, నీ మాహాత్మ్యాన్ని ఎఱిగిఉండి కూడా, నిన్ను సేవించక, అధోగతి పాలవుతూ ఉంటారు. తపోబలంవల్ల, కొందరు, పరమపదాన్ని సమీపించబోతూకూడా, నీ చరణసేవ ననాదరించి, భ్రష్టులవుతారు కాని, నీ భక్తులయినవారు, నిన్నే ఆశ్రయించి, ముల్లోకాలకూ మేలుచేకూర్చే నీ నామాన్ని స్మరిస్తూ, నీ రూపాన్ని అభివర్ణిస్తూ, నీ లీలలను కీర్తిస్తూ, నిన్ను పూజిస్తూ, నీ ప్రేమను పొంది, నిర్భయులై చరిస్తూ ఉంటారు. వారు చేసే ప్రతిపనీ నిర్విఘ్నంగా కొనసాగుతూ ఉంటుంది. చివరకు, వారు, నిన్నే చేరుకుంటారు. మేము కూడా, అటువంటి భక్తులం కావాలనే కోరుతున్నాము.

నువ్వు, ఇంతకు పూర్వం, అనేక రూపాలు ధరించావు. ఎన్నో విధాల, ముల్లోకాలనూ రక్షించావు. ఇప్పుడు...

ముచ్చిరియున్నది లోకము
నిచ్చలు కంసాది ఖలులు నిర్దయు లేపన్
మచ్చిక గావగవలయును
విచ్చేయుము తల్లికడుపు వెడలి ముకుందా !'

అని విన్నవించుకున్నారు. ఆ తరువాత, వారందరూ, దేవకీదేవినుద్దేశించి, 'అమ్మా ! సాక్షాద్భగవంతుడయిన శ్రీమన్నారాయణుడు, అనతికాలంలోనే, నీకు కుమారుడై జన్మించబోతున్నాడు. మాయా మానుషరూపం ధరించే ఆ మహానుభావుణ్ణి, కంసుడు ఖండిస్తాడేమో నన్న భయం నీకు అనవసరం. కంసాది రాక్షసులను సంహరించటానికీ, యాదవులను సంరక్షించటానికీ, లోకాలకు మేలు చేకూర్చటానికీ, ఆ పురాణపురుషుడు పుట్టబోతున్నాడు. నువ్వికనిశ్చింతతో ఉండవలసింది' అని చెప్పి, ఆమెను దీవించి వెళ్ళి పోయినారు. ఆ తరువాత, కొద్దిరోజులకే, శ్రావణ బహుళంలో, రోహిణీ నక్షత్రయుక్తమైన అష్టమి రోజున...

సుతుగనె దేవకి నడురే
యతి శుభగతి దారలును గ్రహంబులునుండన్
దితిసుత నిరాకరిష్ణున్
శ్రితవదనాలంకరిష్ణు జిష్ణున్ విష్ణున్.

ఆ సమయంలో, దేవదుందుభులు మ్రోగినై. గంధర్వులు గానం చేశారు. రంభాదులు ఆనందంతో ఆడారు. సిద్ధచారణులు ప్రస్తుతించారు. దేవతలూ మునులూ కుసుమవర్షం కురిపించారు.

## *71. ప్రథమ లీల :*

అంతలో, శిశువుగా జనించిన శ్రీమన్నారాయణుడు, దేవకీ వసుదేవుల ముందు, తన నిజరూపంలో ప్రత్యక్షమైనాడు. నీల మేఘం వంటి దేహ కాంతితోనూ, వికసించిన తామరలవంటి నేత్రాలతోనూ, మణిమయాంచితమైన కిరీట కుండలాలతోనూ, సువిశాలమయిన వక్షస్థలంతోనూ, కౌస్తుభమణితోనూ, శ్రీవత్సలాంఛనంతోనూ, నాలుగు చేతులతోనూ, శంఖ చక్ర గదాద్యాయుధాలతోనూ, బంగరు మొలనూలుతోనూ ఒప్పారుతున్న పురాణ పురుషుని చూసి, వసుదేవుడు, అమితానందం పొందాడు. ఆ ఆనంద పారవశ్యంతోనే, ఆయనకు సాష్టాంగ ప్రణామం చేసి...

'ఏ నిన్ను నఖిలదర్శను
జ్ఞానానందస్వరూపు సంతతు నపరా
ధీనుని మాయాదూరుని
సూనునిగా గంటి నిట్టి చోద్యము గలదే !'

అని, తన హృదయాన్ని ఆయనకు నివేదించుకున్నాడు. ఆపైన, దేవకీదేవి, ఆ మహాపురుషుని ఉద్దేశించి..

"విశ్వము లీల ద్రిప్పుచు నవిద్యకు జుట్టమవైన నీకు దా
శాశ్వతమైన కాల మిది సర్వము వేదబమందు రట్టి వి
శ్వేశ్వర మేలుకుప్ప నిను నెవ్వడు కోరి భజించు వాడ షో
శాశ్వత లక్ష్మి మృత్యుజయ సౌఖ్యయుతుం డభయుండు మాధవా!

నాయనా ! పురాణయోగులు, యోగమార్గాన నిన్ను దర్శించా మంటారు. కాని, నీ ఈ ఆకృతిని వారు చూసి ఉండరు. మాంసచక్షువులతో, నీ నిజరూపాన్ని వీక్షించటం, మాబోటివారికి సాధ్యంకాదు. మమ్మల్ని కరుణించి, ఈ రూపాన్ని ఉపసంహరించుకోవలసింది.

విలయకాలంలో, విశ్వాన్నంతనూ కడుపులో దాచుకునే నువ్వు, నా కడుపున పుట్టడం, వింతగానే ఉంది. కాని, నా అదృష్టంవల్లనే, నువ్వు, నాకు జనించావు. నువ్వు, నాకు యిలా పుడతావనీ, పుట్టి, క్రూరకర్ముడైన కంసుని సంహరిస్తావనీ, ఆకాశవాణి ఏనాడో చెప్పింది. అది కారణంగానే, కంసుడు, మా ఇద్దరినీ, ఇంతకాలంనుంచీ, కారాగారంలో ఉంచాడు. నువ్విక మా కష్టాలను తొలగించవలసింది.

భక్తవత్సలా ! నీ పాదాలనే మే మాశ్రయించాము. నిన్నే నమ్ముకున్నాము. నువ్వే మా భీతిని తొలగించాలి; మమ్ము రక్షించాలి."

అలా ప్రార్థించిన దేవకీ వసుదేవులకు, శ్రీమన్నారాయణుడు, వారి పూర్వజన్మ వృత్తాంతాన్ని విశదపరచాడు. ఆ తరువాత, వారిని ఉద్దేశించి...

'ఇప్పుడు, మీరు, కంసుని గురించిగాని, అతని భటులను గురించిగాని, భయపడలవసిన పని లేదు. ప్రస్తుతం, ప్రపంచమంతా, యోగ మాయాప్రభావంలో మునిగి ఉంది. ఆ యోగమాయ, మరికొంతసేపట్లో, నందగోకులంలో ఉన్న నందునిభార్యకు, కుమార్తెగా జనించబోతోంది. నేను, నా నిజరూపాన్ని ఉపసంహరించుకున్న వెంటనే, మీరు, నన్ను, ఆ నందగోపునిఇంటికి చేర్చి, అక్కడ పుట్టిన మాయను, ఇక్కడికి తీసుకు రావాలి. ఆ పని అసాధ్యమేమో అనుకోవద్దు. అంతా, సక్రమంగానే జరుగు తుంది. ఆపైన, మీకూ ముల్లోకాలకూ, మేలు కలిగితీరుతుంది'.

అని తెలియజెప్పి, దేవకీ వసుదేవులు చూస్తూ ఉండగానే, శ్రీమన్నారా యణుడు, శిశురూపం ధరించాడు. అప్పుడు పుట్టిన పాపనిమాదిరి ప్రవర్తించ సాగాడు.

అంతలోనే, అప్పటివరకూ వసుదేవుని బంధించి ఉన్న ఇనుప గొలుసులు, వాటి కవి విచ్చిపోయినై. అది గ్రహించిన వసుదేవుడు, అమి తాశ్చర్యం పొందాడు. ఆ వెంటనే, ఆయన, శ్రీహరి ఆదేశాన్ననుసరించి, ఆ శిశువును చేతుల్లోకి తీసుకుని, మెల్లమెల్లగా అడుగులు వేసుకుంటూ, ద్వారబంధం సమీపించాడు. ఆయన అలా చేరువకు రాగానే, ఆ తలుపులు, వాటంతట అవే తెఱచుకున్నై. అది మహాద్భుతమని భావిస్తూ, వసుదేవుడు, ముందుకు సాగిపోయినాడు. ఆయన, ఆవిధంగా, ఎనిమిది ద్వారాలను దాటి కారాగారం వెలుపలకు పోయి, అటూ ఇటూ చూశాడు. అంతవరకూ, కంటి రెప్ప వాల్చకుండా కావలికాస్తూ ఉన్నవారందరూ, ఆ సమయంలో, గాఢ నిద్రాపరవశులై ఉండటం, ఆయన గ్రహించాడు. అదంతా, విష్ణుమాయగా భావించాడు. అదే ఆలోచిస్తూ, మరికొన్ని అడుగులువేశాడు. అంతలో, వర్షం ప్రారంభమయింది. అది చూసిన వసుదేవుడు, తన చేతుల్లో ఉన్న పిల్లవాడు తడిసిపోతాడేమోనని భయపడసాగాడు. అంతలో, ఆదిశేషుడు, పడగలు విప్పుకుని, ఆ కుఱ్ఱవాణ్ణి కప్పి, తన ప్రక్కగా నడుస్తూ ఉండటం ఆయన గ్రహించాడు. అంతే. మంత్రముగ్ధునిమాదిరి, అలాగే ముందుకు సాగిపోయినాడు

## 72. గోపిల ప్రవేశం.

అలా వెళ్ళిన వసుదేవుడు, యమునానదిని సమీపించాడు. లీలా మానుషవిగ్రహుడై, శిశురూపంలో తన్ను సమీపించిన శ్రీహరిని చూసి, యమున మురిసిపోయింది. ఆ వెంటనే ఆమె, రెండుగా చీలి, ఆయనకు దారి కల్పించింది. అదేమీ గ్రహించే స్థితిలోలేని వసుదేవుడు, తన చేతుల్లోని చక్కనయ్యతో, అలా వెళ్ళివెళ్ళి, నందగోకులం చేరుకున్నాడు.

ఆ సమయంలో, గోకులమంతా, మాయామోహితమై ఉంది. అది కారణంగా, అప్పు డక్కడ ఏం జరిగేదీ గ్రహించే స్థితి, ఎవరికీ లేకుండా పోయింది.

అప్పుడు, గోకులం చేరుకున్న వసుదేవుడు, సరాసరి వెళ్ళి, తన ప్రాణస్నేహితుడయిన నందుని ఇంట్లో ప్రవేశించాడు. ఎక్కడివారు అక్కడ, సుఖనిద్రాపరవశులై ఉండటం గ్రహించాడు. ఆ వెంటనే, సూటిగా, పురిటి గదిలోకి వెళ్లాడు. అక్కడ, యశోదనూ, ఆమె ప్రక్కన పడుకుని ఉన్న పసినిసువునూ, చూశాడు. తను తీసుకు వచ్చిన లీలాశిశువును, యశోద ప్రక్కలో ఉంచి, ఆమెకుపుట్టిన పాపను చేతుల్లోకి తీసుకుని, ఒక్క క్షణం మాత్రం, తన కుమారునివంక తదేకంగా చూసి, చెమ్మ గిల్లిన కళ్ళతో, అక్కడినుంచి వెనుదిరిగి బయటకు వచ్చాడు. ఆపైన ఎక్కడా ఆగకుండా, తన నల్లనయ్య మీదనే మనసు నిల్పుకుని, వచ్చినదారినే పోయి, కారాగారం చేరుకున్నాడు.

ఆయన అలా కారాగారంలో ప్రవేశించగానే, అక్కడి తలుపులు యథాప్రకారంగా మూసుకున్నై. ఆయన, తను తెచ్చిన పాపను, దేవకీదేవి పాన్పుమీద ఉంచగానే, ఆయనకు, తిరిగి సంకెళ్ళు పడినై.

అంతలో, దేవకీదేవి ప్రక్కన ఉన్న బాలిక, ఏడువసాగింది. అప్పుడే మేలుకున్న కావలివారు, ఆ ఏడుపు విని, చరచరా కంసుని సమీపించి, దేవకీదేవి నీళ్ళాడిందని, ఆయనకు నివేదించుకున్నారు.

## 73. మాయా బాలిక :

ఆ వెంటనే, కంసుడు, విహ్వాల చిత్తంతో, కత్తి తీసుకుని, పురిటిల్లు చేరుకున్నాడు. దేవకీదేవిని సమీపించాడు. ఆమె చేతుల్లో ఉన్న పసిపాపను నఱుకటానికి ఉద్యుక్తుడయినాడు.

అది చూసిన దేవకీదేవిగుండె చెదిరిపోయింది. అయినా, ఆమె, మనసును దిట్టపరచుకుని, క్రోధమూర్తి అయిన కంసుని ఉద్దేశించి....

"అన్న శమింపు మన్న తగ దల్లుడుగా డిది మేనకోడలా
మన్నన సేయు మన్న విను మానిని జంపుట రాచపాడి గా
దన్న సుకీర్తివై మనగదన్న మహాత్ములు వోవు త్రోవ బో
వన్న భవత్సహోదరి గదన్న నినున్ శరణంబు వేడెదన్.

కట్టా యార్గురు కొడుకుల
బట్టి వధించితివి యాడుబడుచిది కోడల్
నెట్టన జంపగవలెనే
కట్టిడివిగదన్న యన్న కరుణింపగదే!

పుత్రుడు నీ బ్రతుకునకును
శత్రుండని వింటిగాన సమయింపదగున్
పుత్రులకు నోమనేనియు
బుత్రీ దానంబు చేసి పుణ్యము గనవే !"

అని, అతిదీనంగా బ్రతిమాలుకుంది. చేతుల్లోని బిడ్డను హృదయానికి హత్తుకుని, అమితంగా రోదింపసాగింది.

తన దయకోసం అలా ప్రాధేయపడుతున్నది తన చెల్లెలని గాని, తాను చంపదలచింది నెత్తురు గుడ్డు నని గాని, కంసుడు ఆలోచించ లేదు. అతడు, దేవకీదేవివంక చూసి, వికటాట్టహాసం చేశాడు. ఆమె చేతుల్లో ఉన్న ఆడుబిడ్డను, బలవంతంగా లాక్కున్నాడు. ఆ పాపదైన కాలు పట్టుకుని, గిరగిరాత్రిప్పి ఎగరేశాడు.

అలా పైకి ఎగురవేయబడ్డ పాప, తిరిగి క్రిందకుదిగలేదు. అతడు భావించినట్టుగా, నేలమీద పడి, తలపగిలి మరణించటంగాని, అతని కత్తికి బలికావటంగాని, జరుగలేదు. ఆమె, అంతకంతకు పై పైకి వెళ్ళ సాగింది అలా వెడుతూ, క్రమక్రమంగా రూపం మార్చుకుంది ఎనిమిది చేతులతో, గదా శంఖ చక్ర చర్మ శర చాపాసి శూలాలతో కనిపించింది. దివ్య వస్త్రాద్యలంకారాలతో ప్రకాశించింది. అతి భీకరంగా గోచరించింది.

అది చూసిన కంసుడు అదలిపోయినాడు అతని కళ్ళను అతడే నమ్మలేకపోయినాడు. అంతలో, ఆమె, అతణ్ణి ఉద్దేశించి, 'కంసా ! నువ్వు ఉట్టిదుర్మార్గుడవు. క్రూరుడవు. అదికారణంగానే, దేవకీదేవిబిడ్డలను ఆర్గురిని, ఇంతవరకు సంహరించటం జరిగింది. ఇప్పటికీ శాంతి వహించకుండా, 'ఆడు బిడ్డ' సని అయినా అనుకోకుండా, నన్ను కూడా హింసించటానికి ఉద్యుక్తుడవైనావు. ఇదంతా, నీలో ఉన్న రాక్షసత్వానికి మాత్రమే చిహ్నం. అది గ్రహించిన, శ్రీమన్నారాయణుడు, నిన్ను సంహరించే నిమిత్తం, ఇటీ వలనే ఒక చోట జన్మించాడు. అతడు, పెరిగి పెద్దవాడై, నీ పీచమడచటం తథ్యం. అది మాత్రం మఱచిపోవద్దు' అని పలికింది; ఆ వెంటనే అదృశ్యమై పోయింది.

## *74. కంసుని పశ్చాత్తాపం :*

అది విన్న కంసునకు, ఆకాశవాణి పలుకులూ, నారదుని వచనాలూ, స్ఫురణకు వచ్చినై. ఆ మాయాబాలిక తెలిపినట్టుగా, తనకు మారకుడయినవాడు, ఎక్కడో పుట్టిపెరుగుతున్నాడన్న అభిప్రాయంకూడా, అతనిలో, అప్పుడు, దృఢమయింది. కాని, చేయగల దేమీ లేక, దేవకీ వసుదేవులను సమీపించి, అమిత పశ్చాత్తాపంతో ఇలా అన్నాడు:

"పాపుడ బాలఘాతుకుడ బంధువిరక్తుడ దుష్ట చిత్తుడం
గోపనుడం జరన్మృతుడ గ్రూరుడ బ్రాహ్మణ హంతభంగి మీ

పాపల జంపితిం బయలి పల్కుల నమ్మితి సాధులార నా
పాపము లుగ్గడింపక కృపాపరులై కనరే శమింపరే !"

అలా ప్రార్థించి, కంసుడు, ఆ వెంటనే, దేవకీ వసుదేవుల సంకెలలు విడిపించాడు. వారికి స్వేచ్ఛ కలిగించాడు. ఆ సమయంలోనే...

'పగతురచే జెడిచితి ననియును
బగతురచే జెడితి ననియు బాలుడు దలచుం;
బగ సెలుములు లే వాత్మకు,
బగ సెలుముల కీలు కర్మబంధము సుండీ !'

అనికూడా వారికి తెలియపరచుకున్నాడు. అది విన్న వసుదేవుడు, అతణ్ణి ఉద్దేశించి...

'బావా! నీ వచనంబు నిక్కము సుమీ, ప్రాణుల్ గతజ్ఞానులై
నీ వే నంచును లోభ మోహ మద ధీ నిర్మిత్రతామోద శో
కావేశంబుల నొందొరుం బొడుతు రేకాకారుడై సర్వ రూ
పావిష్టుండగు ఈశ్వరుం దెలియలే రన్యోన్య విభ్రాంతులై'

అని, ప్రసన్నుడై పలికాడు. అలా పలికిన వసుదేవుని వద్దా, దేవకీదేవి వద్దా సెలవు తీసుకుని, కంసుడు, తన ప్రాసాదానికి వెళ్ళిపోయినాడు.

### 75. అనుచరుల అభిప్రాయాలు :

అలా పశ్చాత్తాపంతో ఇల్లు చేరుకున్న కంసుడు, ఆ మరునాటి ఉదయాన, తన సహచరులందరినీ సమావేశపరచి, ఆ క్రిందటి రాత్రి జరిగిందంతా వారికి తెలియపరచాడు. ఆ సందర్భంలోనే, తన్ను సంహరించే నిమిత్తం, శ్రీహరి, ఎక్కడో పుట్టి పెరుగుతున్నాడన్న తన దృఢాభిప్రాయాన్ని కూడా, అతను, వారికి విశదపరచటం జరిగింది. అది విన్న అందరూ, అతనితో ఇలా అన్నారు.

"మహారాజా ! మిమ్మల్ని సంహరించే నిమిత్తం, శ్రీహరి, మానవ రూపం ధరించి ఉంటాడని, మీరు భావిస్తున్నారు. మీ బాహుబలాన్ని

గ్రహించి, దేవతలే భయపడుతూ ఉన్న సందర్భంలో, మానవులు చేయగల దేమిటో, మాకు అర్థం కాకుండా ఉంది.

అదలా ఉండగా, ఆ శ్రీహరి అయినా, నిన్ననో మొన్ననో పుట్టి ఉంటాడనికూడా, మీరు విశ్వసిస్తున్నారు. అలా పుట్టినవాడు, పెరిగి పెద్దవాడు కాకముందే హతమార్చటం, ఏమంత కష్టమైనపని కాదు. కాని, అనుదినం పుడుతూ ఉండే వేలాది శిశువులలో, అత డెవరో గుర్తించటం మాత్రం, దుర్ఘటకార్యం కావచ్చు. అందుకని, వారు వీరని లేకుండా, ఇటీవల పుట్టిన పిల్లలందరినీ సంహరించటం సమంజస మనిపిస్తోంది. దానివల్ల, ఆ హరి అనేవాడు పుట్టడమే జరిగివుంటే, తప్పకుండా గిట్టి తీరుతాడు.

మరొక విషయంకూడా ఉంది. శ్రీహరి ఉట్టి మాయలాడు. అతడు, ఇటీవలనే పుట్టి ఉండవచ్చు; కాని, ఈ పాటికే పెద్దవాడుగా మారటం కూడా, అసంభవం కాదు. అందుకని, మనం, సాధారణంగా శ్రీహరి సంచరిస్తూ ఉండే స్థలాలను గ్రహించటం, వాటిని ధ్వంసం చేయటం, ఆయన తలదాచుకునే అవకాశం లేకుండా చూడటం, ఏకాకిగా బయటపడగానే పట్టుకుని వధించటం, అన్నవి, సులభమయిన మార్గాలని మేము భావిస్తున్నాము.

శ్రీ మహావిష్ణువు ఉండే ప్రత్యేక స్థలాలు కొన్ని ఉన్నై. ధర్మమే ఆయన దేహ మన్నది యథార్థం. వేదాలూ గోవులూ విప్రులూ పూజింపబడేచోటా, తపో దాన యజ్ఞాదులు జరిగేచోటా, దయా సత్య శౌచాలు పాటింపబడేచోటా, సహనం ఉన్నచోటా, ఆయన తప్పకుండా ఉండి తీరుతాడు.

ఆయనను సంహరించటానికి, మనం, ప్రప్రథమంగా, ధర్మాన్ని హింసించాలి. ఆ తరువాత, ఆయన ఉండే ఆ యా స్థలాలను చికాకుపరచాలి; ధ్వంసం చేయాలి. సాధువులనూ, ఋషులనూ, విప్రులనూ, గోవులనూ

చిత్రవధపాలుచేయాలి. శిశువులను వధించటంతోపాటు ఆ పనులనుకూడా చేయటం జరిగితే, శ్రీహరి అంతరించి తీరుతాడు. ఆయన్ని, అలా నిర్మూలించటానికీ, మీ భయాన్ని నివారించటానికీ, మేము నిశ్చయించుకున్నాము. అందుకు, మాకు, అనుమతి నివ్వవలసింది."

అలా పలికిన తనవారి మాటలు, కంసునకు అమితానందం కలిగించినై. అందుకనే, ఆయన, ఆ వెంటనే, వారు కోరిన అనుమతిని వారికి ప్రసాదించాడు.

## *76. మిత్ర సమాగమం :*

రాక్షసేంద్రుని అనుమతి పొందిన రక్కసులు, ఆ పైన, సాధు హింస కుపక్రమించారు. మున్యాశ్రమాలను నిర్మూలించటం, పసి నిసువులను వధించటం, యజ్ఞ యాగాదులను ధ్వంసంచేయటం, మొదలు పెట్టారు. అంతేకాదు. శ్రీహరి, అంతవరకూ పుట్టకపోయినా, పుట్టబోతూ ఉండవచ్చునన్న అభిప్రాయంతో, గర్భిణీస్త్రీల నందరినీ, నిర్దాక్షిణ్యంగా, చిత్రవధపాలు చేయసాగారు. అది కారణంగా, వారి తేజం హరించిపోయింది ; వారి సిరి సంపదలూ ఆయుపూ క్షీణించిపోయినై.

వారలా ఉండగా, అక్కడ, గోకులంలో, నందుడు, తనకు కుమారుడు కలిగాడని విని, అమితానందం పొందాడు. ఆ సందర్భంలో, ఆయన అనేక దాన ధర్మాలు చేశాడు. మహనీయుల నాహ్వానించి, సత్కరించి, వారిద్వారా, ఆపిల్లవానికి, జాతకర్మాదులు నిర్వర్తింపచేశాడు. ఆ తరువాత, నందవ్రజమంతా, ఆ కుఱ్ఱవాణ్ణి, తమ కంటి వెలుగుగా చూసుకోసాగింది. ఆనాటినుంచీ, మంద, సర్వసంపదలతోనూ తులదూగుతూ ఉండటం జరిగింది.

ఆ సమయంలో, ఒకసారి, తను, ఏటేటా కంసునకు కట్టవలసిన కప్పం చెల్లించుకునే నిమిత్తం, నందుడు, మధురకు వెళ్ళాడు. ఆ సందర్భంలోనే, అతను, తన బాల్య సఖుడయిన వసుదేవుని కూడా దర్శించుకున్నాడు.

పరస్పర కుశలప్రశ్న లయినతరువాత, వసుదేవుడు, నందునితో ఇలా అన్నాడు.

"ప్రాణమిత్రులను కలుసుకోవటం, చచ్చి
బ్రతుకటం వంటిది

నే నీ రోజున, ఆ విధమైన ఆనందం పొందుతున్నాను ఈనాటికయినా నిన్ను చూడగలిగినందుకు, ఎంతగానో సంతోషిస్తున్నాను.

ఇటీవల, నీకు, సంతానం కలిగిందని విన్నాను. వయసు చెల్లిన నీకు, సంతానం కలగటం, అందులోనూ, పుత్రు డుదయించటం, నిజంగా, నీ అదృష్టమనే చెప్పాలి.

నువ్వూ, నీ భార్యా, ఆ చిరంజీవీ, క్షేమంగా ఉన్నారనీ, మీ శ్రేయస్సే తమ భాగ్యంగా భావించే మన గోకులం, ఆనందోత్సాహాలతో వర్ధిల్లుతోందనీ వినటానికి, సంతోషంగా ఉంది. ఇక, మీ దంపతులూ, మంద లోని మనవారూ, ఆ చిరంజీవిని, వేయికళ్ళతో కనిపెట్టి ఉండాలనీ, మీ ప్రాణానికి ప్రాణంగా చూసుకుంటూ ఉండాలనీ మాత్రం, నేను కోరు తున్నాను."

ఆ మాటలు అంటూ ఉండగానే, వసుదేవుని కళ్ళు చెమ్మగిలినై. కంఠం రుద్ధమయింది. ఆయన, కలవరపడటం జరిగింది. అది గ్రహించిన నందుడు, ఆయన ఆవేదనను ఉపశమింపచేసే నిమిత్తం, ఆయన నుద్దేశించి...

'నీకున్ దేవకికిన్ జనించిన సుతానీకంబు దోడ్తోడ ము
న్నీ కంసుండు వధించె, మీ సుత దుది న్హింసింప జేదప్పి తా
నాకాశంబున కేగ, బాల యది, దైవాధీన; మాపద్దశన్
శోకంబందునె తజ్జు, డూరదుము, నా సూనుండె నీ సూనుడున్'

అని, సాంత్వన వచనాలు పలికాడు.

అంతలో, వసుదేవునకు, ఏవో కొన్ని ఉత్పాతాలు గోచరించినై. ఆ వెంటనే, ఆయన, నందుని ఉద్దేశించి, 'మందలో ఏదో చెడు జరుగు

తున్నట్టు నాకు తోస్తోంది. నువ్వు వెంటనే ఇంటికి వెళ్ళటం మంచిది' అని హెచ్చరించాడు. అది విన్న నందుడు, తక్షణమే, తన వారితో సహా, గోకులానికి ప్రయాణమై వెళ్ళాడు.

## 77. పూతన :

ఆ సమయంలో, కంసుని అనుచరవర్గానికిచెందిన పూతన, సర్వమోహనరూపం ధరించి, దేశదేశాలూ తిరిగి, కనిపించిన శిశువులందరినీ కబళిస్తూ, నందగోకులం చేరుకుంది. నందుని ఇంట్లో ఉన్న పసినిసుపును పసిపట్టి, అక్కడికి వెళ్ళింది. ఆమెను చూసిన వ్రజాంగన లందరూ, ఆమె సౌందర్యానికి ముగ్ధులై, ఆమె, భూమికిదిగివచ్చిన శ్రీదేవి కాబోలు నను కున్నారు. ఆమెకు, గౌరవపూర్వకంగా స్వాగతం చెప్పారు. ఆమె ఎవరి పడుచో, ఎవరికోసం అక్కడికి వచ్చిందో చెప్పవలసిందిగా కోరారు.

ఆ విధంగా తన చుట్టూచేరి, అంత ఆదరపూర్వకంగా అడుగు తున్న వారికి, ఏమని సమాధాన మివ్వాలో పూతనకు తోచలేదు. కాని, తలలుమార్చే తెలివికలది కావటంవల్ల, కన్నీరు పెట్టుకుంటూ, వారివంక దీనంగాచూడసాగింది. అంతలో, ఒకగోపిక, 'మననల్లనయ్యను చూడటానికి వచ్చిందో ఏమో !' అన్నది. ఆ పలుకులు విన్న పూతన, అది ఆధారంగా తీసుకుని, 'ఔ' నన్నట్టు తల పంకించింది. ఆ వెంటనే, వా రామెను, ఆ లీలా మానుష విగ్రహుడు పడుకుని ఉన్న ఊయెలవద్దకు తీసుకువెళ్ళారు.

అలా ఆ శిశువును సమీపించిన పూతన, ఆనందపారవశ్యాన్ని ప్రదర్శించింది. అతణ్ణి, ఆ వెంటనే, తన చేతుల్లోకి తీసుకుంది. హృదయా నికి హత్తుకుంది. ఆడించింది. అది చూసిన వ్రజాంగనలు, ఆమె నిజాభి ప్రాయాన్ని గ్రహించలేక, ఆమె, అతణ్ణి అలా ముద్దాడటం, తమ కంటి వెలుగైన అతడిలో ఉన్న విశేషమే అనుకున్నారు; గర్వించారు.

కాని, లోకేశ్వరుడయిన ఆ లీలాశిశువుమాత్రం, అది పాపజాతి సుందరి అనీ, బాలహంత్రి అనీ, దాని నిలువెల్లా విసమే అనీ, తన్ను

సంహరించే ఉద్దేశంతోనే అలా వచ్చిందనీ గ్రహించాడు. మందహాసం చేశాడు. యశోద చేతుల్లో ఆడుకునేటట్టుగానే, దాని చేతుల్లో కూడా ఆడుకో సాగాడు. అంతలో, ఆ రక్కసి, అతణ్ణి ముద్దాడుతూ...

'నా చనుబా లొక గ్రుక్కెం
డో చిన్నికుమార త్రావుమొయ్యన పిదపన్
నీ చెలువ మెఱుగవచ్చును
నా చెలువము సఫలమగును నళినదళాక్షా !'

అని, పాలివ్వటానికి ప్రయత్నించింది. ఆమె కోరికనుతీర్చటానికి, ఆ శిశువు, ఏమాత్రంగానూ సంకోచించలేదు. రోహిణీ యశోదలు కూడా, ఆమె మన సును నొప్పించటం దేనికన్న అభిప్రాయంతో, ఆమెనుగాని శిశువునుగాని వారించటానికి ప్రయత్నించలేదు.

ఆ వెంటనే, నల్లనయ్య, ఆ మాయాసుందరివద్ద పాలు త్రావటం మొదలుపెట్టాడు. అది గ్రహించిన ఆమె, ఆ శిశువుదైన ఆయువుకూడా తీరి పోయిందనే భావించింది.

శిశువు ఒక గుటక వేశాడు. అంతలోనే, ఆ రక్కసిదైనతేజం, క్షీణించిపోయింది. అతడు రెండో గుటక వేసేటప్పటికి, అది తన ప్రాణాలను పట్టి లాగినంతగా బాధపడ్డది. ఆ వెంటనే, భయంతో అఱచింది. అతణ్ణి, అవతలకు త్రోసివేయాలని ప్రయత్నించింది. కాని, అత డామెను వదలలేదు. మూడవ గుటకకూడా వేశాడు. దాని జవసత్వాలన్నీ పీల్చేశాడు. దాంతో, అది, గావుకేకలుపెడుతూ, గిలగిలాతన్నుకుంటూ, ఒరిగిపోయింది; తన మాయారూపాన్ని త్యజించి, ప్రాణం వదిలేసింది.

ఆ సమయంలో రక్కసివేసిన కేకలకు, దిక్కులు పిక్కటిల్లి పోయినై. నందగోకులం, ఆ పరిసర గ్రామాలూ, గజగజలాడిపోయినై. అప్పుడు, నందుని ఇంట్లోఉన్నవా రందరూ మూర్ఛపోయినారు. కాని, ఆ నల్లనయ్యమాత్రం, ఆ రక్కసి గుండెలమీద కూర్చుని, ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ, ఏమీ ఎరుగనట్టే ఉన్నాడు. ఆ తరువాత కొంత

సేపటికి, అదంతా చూసిన యశోదా రోహిణీత్యాదులు, అతణ్ణి అవతలకు తీసుకుపోయి, గోపుచ్ఛాన్నీ, గోమయాన్నీ అతనిచుట్టూ త్రిప్పి, గోమూత్రంతో అతణ్ణి స్నానంచేయించి, అతని నొసట గోరజం పెట్టి, 'దృష్టి' తీశారు. అనేకవిధాల రక్షపెట్టారు; తిరిగి తొట్టెలో పడుకోపెట్టారు.

అంతలో, నందాదులు, మధురనుంచి మందకువచ్చారు. వస్తూనే, అక్కడ పడిఉన్న పూతనను చూశారు. చూసి, అక్కడ జరగబోయే విషయాన్ని ముందుగానే గ్రహించి హెచ్చరించిన వసుదేవుడు, మహాయోగి అయిఉండాలనుకున్నారు. తమవారిద్వారా, అంతకుపూర్వం అక్కడ జరిగినదంతా విని, తమ నల్లనయ్య, సామాన్యశిశువుకాదని నిర్ధారించుకున్నారు.

ఆ తరువాత, వ్రజవాసులు, నందుని ఆజ్ఞానుసారం, పూతన దేహాన్ని గొడ్డళ్ళతో నరికి, ఆ శరీర శకలాలకు దహనక్రియ జరిపారు. ఆ సమయంలో, కాలుతున్న వాటినుంచి వచ్చిన అగరుపరిమళం, దశదిశలనూ ఆక్రమించింది. అది గ్రహించిన గోపాలురు, ఆశ్చర్యచకితులయినారు.

దురుద్దేశంతో అయినా, శ్రీకృష్ణుని ఎత్తుకుని ఆడించి స్తన్యమిచ్చినంతమాత్రం చేతనే, బాలఘాతిని అయిన పూతన పాపాలన్నీ హరించిపోయినై. ఆమెకు పరమపదం లభించింది.

పూతన రక్కసి అయినా, త్రావించింది విసమే అయినా, తనకు చన్నిచ్చిన కారణంచేత, శిశురూపంలో ఉన్న శ్రీహరి, ఆమెను, తల్లిగానే భావించాడు. పూతన కోరిందికూడా అదే.

* * *

పూతన, పూర్వ జన్మలో, బలిదానవుని కుమార్తె. అప్పుడు, ఆమె పేరు రత్నమాల.

బలిదానవుని నిగ్రహించే నిమిత్తం, శ్రీహరి, వామనుడై ఆ దానవేంద్రుని యజ్ఞవాటికకు వెళ్ళటం జరిగింది. ఆ సమయంలో అక్కడే ఉన్న రత్నమాల, ఆ వటుని చూసి, 'ఈ మనోహరమూర్తికి పాలిచ్చే అదృష్టం

నాకు లేకపోయిందే' అని, తనలో తను అనుకుంది.

శ్రీహరి, ఆమె మనోవ్యథను గ్రహించాడు. గ్రహించి, ఆమె కోరికను తీర్చాలనుకున్నాడు.

ఆ నిర్ణయా న్ననుసరించే, రత్నమాల, ద్వాపర యుగాంతాన, పూతనగా జన్మించింది. కృష్ణయ్యగా జనించిన శ్రీహరి, ఆమెఒళ్లోపడుకుని, ఆమె యిచ్చిన పాలు త్రాగాడు. ఆమె కోరికను తీర్చాడు. ఆమెకు పరమ పదాన్ని ప్రసాదించాడు.

* * *

వెన్నుని కొకపరి విషమగు
చన్నిచ్చిన బాలహంత్రి చనెనట దివికిన్
వెన్నుఁ గని పెంచి భక్తిం
జన్నిచ్చిన సతికి మరియు జన్మము గలదే !

హరిగని చన్నులు గుడిపెడి
తరుణులు ప్రాపించు గతులు దడవన్ వశమే
హరి యారగించుటకు బా
ల్గురిసిన ధేనువులు ముక్తికొనల జరించున్.

### 78. శకటాసురుడు :

పూతన సంహారానంతరం, కాలక్రమాన, శ్రీకృష్ణుడు, ఒదికిల బడటం నేర్చుకున్నాడు అది గ్రహించిన యశోద, అమితానందంతో, వ్రేపల్లె అంతటా వేడుకలు చేయించింది. వేదమంత్రాలతో అభిషేకాదికాలు జరిపించింది. అనేక దాన ధర్మాలు చేసింది. పూజ్యుల దీవన లా చిరంజీవికి లభించే విధంగా వ్యవహరించింది.

గోకులమంతా ఆ విధమైన ఆనందోత్సాహాలతో ఉన్న సమయంలో, కంసుని అనుచరవర్గానికిచెందిన ఒక రాక్షసుడు, శకటరూపంలో అక్కడకు రావటం, నందుని ఇంట్లోఉన్న నల్లనయ్యను గురించిన విచిత్ర

కథలు కొన్ని వినటం, జరిగింది. అది కారణంగా, అతనికి, ఆ నందనంద నుని చూడాలన్న అభిప్రాయం కలిగింది. అంతేకాదు. పూతనను సంహరించిన ఆ చిన్నారి, సామాన్యుడై ఉండడనీ, కంసుడు వివరిస్తూవచ్చిన వింతబాలుడు అతడే అయిఉండవచ్చుననీ కూడా, అతడు భావించటం జరిగింది. ఆ వెంటనే, అతడు, నందగోపుని ఇల్లు చేరుకున్నాడు.

శకటాసురుడు అలా వెళ్ళిన సమయానికి, నందగోపుని ఇంటి ముందు, అనేక మధురపదార్థాలతో నింపబడ్డ బళ్ళు, లెక్కలేనన్ని, అక్కడక్కడ నిలబడి ఉన్నై. శకటాసురుడు, అది అదనుగా తీసుకుని, వాటిమధ్య ప్రవేశించాడు. చిత్రాతిచిత్రమైన కథల కాకరమయిన ఆ ఇంటి వెలుగును, ఎలా ఎప్పుడు చూడటమా అన్న ఆలోచనలో పడ్డాడు.

ఆ విషయం, అక్కడ ఉన్నవా రెవరికీ అర్థం కాలేదు. కాని, గృహాంతర్భాగాన, తొట్టెలో పడుకుని ఉన్న లీలాశిశుపుమాత్రం, అది గ్రహించాడు. ఆ వెంటనే, అకారణంగా రోదించటం మొదలుపెట్టాడు.

బాలుని రోదనం విన్న గోపికలు కొందరు, చరచరా, ఆ తొట్టెను సమీపించారు. నల్లనయ్య ఏడుపును మాన్పించాలని ప్రయత్నించారు. కాని, వారి ప్రయత్నాలన్నీ నిష్ఫలమేఅయినై. అది గ్రహించిన ఒక గోపాంగన, అతణ్ణి ఎత్తుకుని ఆడిస్తూ, అవతలకు తీసుకువెళ్ళింది. ముంగిటఉన్న శకటాలనూ, వాటిలోని మధుర పదార్థాలనూ, అతనికి చూపించసాగింది.

ఆ విధంగా బయటకువచ్చిన బాలుని, శకటాసురుడు, దూరం నుంచే చూశాడు. చూసి, అతని దివ్యతేజాన్ని గ్రహించి, ముగ్ధుడైనాడు. అతడు, తన సమీపానికి వస్తే బాగుండునని, ఉబలాటపడ్డాడు.

నల్లనయ్య అది గ్రహించాడు. గ్రహించి, గోపికలు చూపుతున్న బళ్ళమీద తనకు మోజులేనట్టూ, దూరంగా ఉన్న మాయాశకటం తన మనసును ఆహరించినట్టూ చూడసాగాడు.

ఆ వెంటనే, గోపికలు, అతణ్ణి, అటుదిక్కుగా తీసుకువెళ్ళారు.

తన సమీపానికి వస్తున్న కృష్ణయ్యనుచూసి, అసురుడు తన్మయుడయినాడు. తను వచ్చినపనిని కూడా మరచిపోయి, ఆ బాలునివంకనే చూస్తూ నుంచున్నాడు.

అంతలో, కృష్ణయ్య, అతణ్ణి సమీపించాడు. సమీపిస్తూనే, భయ పడిపోయినవానిమాదిరి, కెవ్వు కెవ్వున ఏడువసాగాడు. తన్ను ఎత్తుకున్న గోపిక చేతుల్లో నిలువకుండా, కాళ్ళూ చేతులూ చాచి, గిలగిలా తన్నుకోవటం మొదలుపెట్టాడు. అలా భయంకరంగా తన్నుకుంటున్న సమయంలో, అతని వామపాదం, ఆ ప్రక్కనే ఉన్న మాయాశకటానికి తగిలింది. ఆ తాకి డికి, శకటరూపంలో ఉన్న అసురుడు, అమాంతంగా ఆకాశానికి ఎగిరి, నెత్తురు కక్కుకుంటూ, నిజరూపంలో, నేలమీద పడటం జరిగింది. ఆ పాటు వల్ల, అతని శరీరం, తునాతునకలై పోయింది. అతడు, భీకరంగా అఱుస్తూ, ప్రాణంవదిలాడు.

అదంతా కళ్ళారాచూసిన గోపికలూ గోపాలురూ అమితా శ్చర్యంపొందారు. ఆ రాక్షసుని గావుకేకలు విని అక్కడ చేరినవారు, ముక్కలుముక్కలై పడిఉన్న రక్కసునీ, అతని మృతికి కారకుడైన నల్ల నయ్యనూ చూసి విస్మితులయినారు.

అంతలో, యశోద అక్కడకువచ్చింది. అలావచ్చిన యశోదకు, గోపికలు, కృష్ణయ్య నందించారు. ముసిముసినవ్వులు నవ్వే తన చిన్నా రిని చేతుల్లోకితీసుకుని, హృదయానికి హత్తుకుని, యశోద, ఆనందాశ్రులు రాల్చింది. అదంతా చూస్తూఉన్న గోకులం, ఆ నల్లనయ్య చేసిన అతి మానుషచర్యను, మహాద్భుతంగా భావించింది. అతణ్ణి, ఒక దివ్యబాలుని మాదిరి చూడసాగింది.

* * *

శ్రీకృష్ణునిచేత ఆ విధంగా సంహరింపబడ్డ శకటాసురుడు, పూర్వజన్మలో, హిరణ్యాక్షుని కుమారుడైన ఉత్కచుడు. అత డొకసారి, లోమశమహర్షి ఆశ్రమంలో ప్రవేశించి, అక్కడి ఉద్యానవనాన్ని పాడు

చేయటం జరిగింది. అది గ్రహించిన లోమశుడు, అతణ్ణి ఉద్దేశించి, 'ఈ చెట్లను నువ్వు ఎలా పెల్లగించావో, అలా, నీ శరీరంకూడా, పాముకుబుసం మాదిరి ఊడిపోతూ ఉంటుంది' అని శపించాడు.

ఆ మాటలు విన్న ఉత్కచునికి, అప్పుడు, పశ్చాత్తాపం కలిగింది. ఆ వెంటనే, అతడు, మహర్షి పాదాలమీద పడి, తనకు శాపవిముక్తి ఎప్పుడు ఎలా కలిగేదీ తెలుపవలసిందిగా ప్రతిమాలుకున్నాడు.

లోమశుడు అతణ్ణికరుణించాడు. కరుణించి, 'ద్వాపరయుగాంతాన నువ్వు, వాయురూపం ధరించి, శ్రీహరి పదాఘాతంద్వారా మోక్షాన్ని పొందుతావు' అని తెలియబరచాడు.

ఆ విధంగా మోక్షమార్గం గ్రహించిన ఉత్కచుడు, శకటాసురుడై జన్మించటం, శ్రీకృష్ణుని అనుగ్రహం ద్వారా శాపవిముక్తి నందటం జరిగింది.

## 79. తృణావర్తుడు :

అదలా ఉండగా, నల్లనయ్యవైన మహాద్భుతచర్యలు, ఆనోటా ఆనోటా ప్రాకి, దేశమంతటా వ్యాపించినై. కాలక్రమాన, అవి, కంసుని చెవులోకూడా పడటం జరిగింది.

కంసుడు, అంతకుపూర్వమే, వ్రేపల్లెవాడలో ఉన్న వింతబాలుని గురించి విన్నాడు. దానికితోడుగా, ఇద్దరు రాక్షసులు ఆ బాలునివల్ల హతులయినారని తెలుసుకోగానే, అతనికి, అమితమైన ఆవేదన కలిగింది. నల్లనయ్యగా వ్యవహరింపబడే ఆ బాలుడు నారాయణుడే కావచ్చుననీ, అతనిచేత చంపబడ్డవారు, పూతనా శకటాసురుడూ అయి ఉండవచ్చుననీ, అతను అనుకోవటం జరిగింది. ఆ ఇద్దరు రక్కసులూ, అంతవరకు తిరిగి రాకపోవటం అతని అనుమానాన్ని బలపరచింది.

అది గ్రహించిన అతని అనుచరుడు, తృణావర్తుడనేవాడు, తన ఏలిక అయిన కంసుని అనుమానాన్ని నివృత్తిచేసే నిమిత్తం, అవకాశం

లభించినపక్షంలో, ఆ నల్లనయ్యను హతమార్చే అభిప్రాయంతో, ఆ వెంటనే బయలుదేరి, వ్రేపల్లెలో వాలాడు.

వ్రేపల్లెలో ప్రవేశిస్తూనే, తృణావర్తుడు, ఒక పెద్ద సుడిగాలిని లేవదీశాడు. అది కారణంగా, ఆ ప్రదేశమంతటా, దుమారం చెలరేగింది. అది కల్పించిన చిమ్మచీకటిలో, గోకులమంతా మునిగిపోయింది. కన్ను కన పడక, ఎక్కడివారక్కడ, ఒక ముహూర్తకాలం నిలబడిపోయినారు. అది అదనుగా తీసుకుని, తృణావర్తుడు, అప్పుడు నందుని ఇంటిగుమ్మంలో ఆడుకుంటూ ఉన్న నల్లనయ్యను, అమాంతంగా పట్టుకుని, ఆకాశమార్గాన ఎగిరిపోయినాడు.

అంతలో, చీకటి విచ్చిపోయింది. తల్లులందరూ, ఎవరి బిడ్డల కోసం వారు వెతుక్కున్నారు; కనిపించిన తమబిడ్డలను తీసుకుని ఇళ్ళకు వెళ్ళారు. కాని, యశోదకుమాత్రం, ఆమె కుమారుడు కనిపించలేదు. ఆమె, ఇల్లంతా వెదికింది. బయటకూడా చూసింది. "నాయనా!కృష్ణా! ఎక్కడ ఉన్నావు తండ్రీ!" అని, బిగ్గరగా అఱచింది. అమితంగా రోదించింది. అలా రోదించి రోదించి...

'ఇక్కడ బెట్టితిం దనయు డిక్కడ నాడుచునుండె గాలి దా
నెక్కడనుండి వచ్చె శిశు వెక్కడిమార్గము వట్టిపోయె నే
నెక్కడ జొత్తు' నంచు గమలేక్షణ గ్రేపు దొఱంగి ఖిన్నయై
పొక్కుచు వ్రాలు గోవృక్రియ భూస్థలిఁ వ్రాలె దురంతచింతయై.

అలా కూలిపోయిన యశోదాదేవిని చూసి, గోపాలసతులందరూ, కన్నీరు పెట్టుకున్నారు.

బాలకృష్ణుని అపహరించిన తృణావర్తుడు, గగనమార్గాన పోతూ ఉండగా, అతనికి, ఆ బాలుడు, క్రమక్రమంగా, భరింపరాని బరువైపోయి నాడు ఆ పైన, అతణ్ణి మోసుకుపోవటం, అతనికి, దుర్ఘటమనిపించింది. అతని గమనవేగంకూడా మందగించింది.

అదంతా గ్రహించిన తృణావర్తుడు, అక్కడనుంచే ఆ బాలుని క్రిందపడేసి, తనదారిన తాను పోదామనుకున్నాడు. కాని, అప్పటికే, కృష్ణయ్య అతని మెడను గట్టిగా పట్టుకుని ఉండటంవల్ల, ఆ పట్టు విడిపించుకోవటంకూడా అతని శక్తికి మించిందిగా తోచింది. అయినా, అతడెంతగానో పెనగులాడాడు; కాని, లాభం లేకపోయింది.

అప్పటికే, తృణావర్తుని కనుగ్రుడ్లు మీదికివచ్చినై. అతని బలమంతా హరించిపోయింది. అక్కడినుంచి ఒక అడుగుకూడా ముందుకు వెయ్యలేనిస్థితి ఏర్పడ్డది. అది కారణంగానే, అతను, అక్కడినుంచే, ఫాలాక్షుని బాణపాతంవల్ల కూలిన త్రిపురాలమాదిరి, గంభీరమైన ధ్వనితో, కూలిపోయినాడు. అలా పడటంవల్ల, అతని అవయవాలన్నీ నుగ్గునుగ్గయిపోయినై. కాని, అప్పటికీ, కృష్ణయ్య, అతని గొంతును విడిచిపెట్టలేదు; తన సహజ మందహాసాన్ని త్యజించలేదు.

అలా నేలకు దిగిన కృష్ణయ్యను, గోకులమంతా, అత్యాశ్చర్యంతో చూసింది. నందాదులు, అమితానందం పొందారు. అప్పు డక్కడ చేరినవా రందరూ...

'రక్షణములేక బాలుడు
రక్షితుడగు సమతజేసి రాయిడులందున్ ;
రక్షణములు వెయిగలిగిన
శిక్షితుడగు ఖలుడు పాపచిత్తుం డగుటన్'

అనుకున్నారు. అంతేకాదు.

'గత జన్మంబుల నేమి నోచితిమొ యాగశ్రేణు లేమేమి సే
సితిమో యెవ్వరి కేమి పెట్టితిమొ యే చింతారతిం బ్రొద్దు పు
చ్చితిమో సత్యము లేమి పల్కితిమొ యే సిద్ధప్రదేశంబు ద్రొ
క్కితిమో యిప్పుడు నూడగంటి మిచటం గృష్ణార్భకున్ నిర్భయున్'

అని, తమలో తాము ఎంతగానో ఆనందించారు. నల్లనయ్యదయిన మాహా

త్మ్యాన్ని భావించి, అతణ్ణి దర్శించుకునే భాగ్యం కలిగినందుకు తమ్ముతాము ప్రశంసించుకున్నారు.

*  *  *

తృణావర్తుడు, పూర్వజన్మలో, పాండు దేశాధిపతి. అమిత బలశాలి. అచ్యుతాంఘ్రిసేవాతత్పరుడు. అయికూడా, స్త్రీ లోలుడు.

అత డొకసారి, తన అంతఃపుర స్త్రీలతో, రేవాతీరంలో ఉండగా, దుర్వాసమహర్షి అక్కడకు వెళ్ళటం జరిగింది. అలా వెళ్ళిన మహర్షిని చూసికూడా, ఆ రాజేంద్రుడు, కాముకీజనపరివృతుడై ఉండటంవల్ల, లక్ష్యం చేయలేదు; ఆతిథ్యం ఇవ్వలేదు.

ఆ చర్య, దుర్వాసునకు, అమితమైన ఆగ్రహం కలిగించింది. అది కారణంగా, ఆయన, అతణ్ణి, 'రాక్షసుడవు కావలసింది' అని శపించాడు.

అలా శప్తుడైన పాండుభూపతి, తృణావర్తుడై జన్మించటం, నరకాసురుని కొలువులో చేరటం, కాలక్రమాన, కంసుని బంటుకావటం, చివరకు, శ్రీకృష్ణునిద్వారా శాపవిముక్తి పొందటం జరిగింది.

## 80. నామకరణం :

ఆ తరువాత కొంతకాలానికి, యాదవపురోహితుడైన గర్గుడు, వసుదేవుని కోరికమీద, నందవ్రజానికి రావటం జరిగింది. పరమ తపోనిధి అయిన ఆ గర్గునికి, నందాదులు, భక్తిపూర్వకంగా అతిథిపూజలు చేశారు. సత్కారాలన్నీ ముగిసిన తరువాత, నందుడు, ఆయన నుద్దేశించి...

'ఊరకరారు మహాత్ము లు
వా రకముల యిండ్లకడకు వచ్చుటలెల్లం
గారణము మంగళములకు
నీ రాక శుభంబు మాకు నిజము మహాత్మా !'

అని, తన హృదయాన్ని ఆయనకు నివేదించుకున్నాడు. అంతేకాదు...

'జ్యోతి శ్శాస్త్రుల కెల్ల మేటరివి తేజోమూర్తి వాశాంత వి
ఖ్యాతస్ఫూర్తివి బ్రహ్మబోధనుడ వాకర్ణింపు నా పల్కు ని
ర్ణీతుండైన గురుండు మానవులకు న్విప్రోత్తముండంద్రు నీ
చాతుర్యంబున నీ కుమారులకు సంస్కారంబు సేయంగదే !'

అని, ప్రస్తుతిపూర్వకంగా బ్రతిమాలుకున్నాడు.

నందుని ప్రార్థన నంగీకరించి, గర్గుడు, రోహిణీ కుమారునకు బలరాముడనీ, యశోదా పుత్రునకు కృష్ణుడనీ, నామకరణంచేశాడు. ఆ సందర్భంలో, ఆయన, నందుని ఉద్దేశించి...

"రోహిణీకుమారుడు, తన గుణాలద్వారా, ప్రజలకు ఆనందాన్ని కలిగించేవాడవుతాడు. అందుకనే అతనికి 'రాముడ'ని పేరుపెట్టదలచాను. కాలక్రమాన, అతడు, అత్యధిక బలసంపన్నుడు కావటం జరుగుతుంది. అది కారణంగా, ప్రజలు అతణ్ణి 'బలు'డని కూడా పిలుస్తారు. అలాగే, యాదవులందరినీ అతడు సమభావంతో చూసుకునేవాడు కావటంవల్ల, అనంతర కాలంలో, 'సంకర్షణుడు' అన్న పేరు అతనికి సార్థక మవుతుంది.

ఇక, యశోదా పుత్రుని విషయం : ఇతడు గడచిన మూడు యుగాలలోనూ మూడు రకాల రంగులు, శ్వేత రక్త పీత వర్ణాలు ధరించి అవతరించటం జరిగింది, ఇప్పుడు, నల్లవాడై పుట్టాడు. అందుకనే, ఇతనికి, 'కృష్ణు'డని నామకరణం చేస్తున్నాను.

పూర్వం, ఇతడు, వసుదేవుని ఇంట జన్మించటం జరిగింది. అది తెలిసిన ప్రాజ్ఞులు, ఇతణ్ణి, 'వాసుదేవు'డని పిలుస్తారు.

అంతేకాదు. ఈ చిన్నారి, భవిష్యత్తులో, ఎన్నో మహాద్భుత కార్యాలు చేయబోతున్నాడు. అది కారణంగా, ప్రజలు, ఇతణ్ణి, ఆ యా కార్యాలకు అనుగుణమైన పేర్లతో పిలవటంకూడా జరుగుతుంది.

ఈ బాలుని ద్వారా, దుర్జనులు శిక్షింపబడతారు; సజ్జనులు రక్షింపబడతారు. ధర్మం ప్రతిష్ఠింపబడుతుంది. ప్రత్యేకించి, ఇతని సాయంతో, తలిదండ్రులయిన మీరూ, గోపకులూ, గోకులం యావత్తూ

కూడా, ఎటువంటి కష్టాన్నయినా, యిట్టె అధిగమించగలుగుతారు; పరమానందం పొందగలుగుతారు.

పూర్వం, అరాచకం ప్రబలిన ఒక సమయంలో, ఇతని నాశ్రయించి, ఇతని అనుగ్రహాన్ని పొందిన సాధువు లెందరో, అసాధువులను జయించగలిగారు. ఇతనిపట్ల భక్తిభావం గలవారిని, ఇతని ప్రేమకు పాత్రులయిన వారిని, యెటువంటి శత్రువులూ కూడా యేమీ చేయలేరు.

మరొక విషయం. ఈ కుమారుడు సామాన్యుడు కాడు. సద్గుణ సంపత్తిలోనూ, ఐశ్వర్యవిభూతిలోనూ, కీర్తిప్రతిష్ఠలలోనూ, భోగానుభవంలోనూ, ఇతడు, శ్రీమన్నారాయణునకు సముడనిపించుకుంటాడు. అది కారణంగానే, మీరు, ఇతణ్ణి, కంటిని రెప్పమాదిరి కాపాడుకోవాలని కోరుతున్నాను"

అని కూడా తెలియపరచాడు.

## *81. బాల్యక్రీడలు :*

కాలక్రమాన, బలరామ కృష్ణులు, ఇంట్లో ఇటూఅటూ తిరగటం, తోటి బాలురతో ఆడుకోవటం, మొదలుపెట్టారు. ముద్దుల మాటలయిన వారి ఆటలూ మాటలూ పాటలూ, నందాదులకేకాక, గోకులానికి అంతటికీకూడా మహదానందదాయకంగా తయారయినై. మధుర మోహనమూర్తులయిన ఆ అన్నదమ్ములు, నందగోకులానికి కంటివెలుగైనారు. వారి శిశుక్రీడలు, ఆబాలగోపాలానికీ గిలిగింతలు పెట్టసాగినై. వారిని తలచుకోకుండా, వారిని చూడకుండా, అక్కడివారు, ఒక్కక్షణంకూడా ఉండలేకపోయేవారు. అలా, బలరామ కృష్ణులు, ఆ మందలోనివారి ప్రాణానికి ప్రాణమై, వారి ఆనందానికి అవధిగా వ్యవహరించసాగారు. ఆ సమయంలో, కృష్ణయ్య...

తనువున నంటిన ధరణీ పరాగంబు
పూసిన నెఱిభూతిపూతగాగ
ముందఱ వెలుగొందు ముక్తాలలామంబు
తొగలసంగడికాని తునుకగాగ

ఫాలభాగంబుపై బరగు కావిరిబొట్టు
కాముని గెల్చిన కన్నుగాగ
గంఠమాలికలోని ఘననీలరత్నంబు
కమనీయమగు మెడకప్పుగాగ
హారవల్లు లురగహారవల్లులుగాగ
బాలలీల ప్రౌఢ బాలకుండు
శివుని పగిదినొప్పె శివునికి దనకును
వేఱులేమి దెల్ప వెలయునట్లు.

అలా ఉన్న ఆ చిన్నారి చేసే ప్రతిపనీకూడా, చూసేవారికి, అతి విచిత్రంగాతోస్తూ ఉండేది. అతడు, తఱుచుగా, గోపకుమారులతో కలసి...

'గో వల్లభుడ నేను గోవులు మీర'ని
వడి ఱంకెవైచుచు వంగియాడు
'రాజనే భటులు మీరలు రండురండ'ని
ప్రాభవంబున బెక్కుపనులు వనుచు,
'నే దస్కరుండ మీ రింటివార'ని నిద్ర
పుచ్చి సొమ్ములు గొనిపోయి డాగు
'నే సూత్రధారి మీ రందఱు బహురూపు'
లని చెలంగుచు నాటలాడబెట్టు

మూల లుఱుకును డాగురుమూతలాడు
నుయ్యేలలనూగు జేబంతు లొనరవైచు
జాఱు జీరల జిఱుతలసాటి నిగుడు
శౌరి బాలురతో నాడు సమయమందు.

అలా చిత్రాతిచిత్రంగా ఆడుతూ, కృష్ణయ్య, అనేకరకాలైన చిలిపిచేష్టలు కూడా అలవాటుచేసుకున్నాడు. ఆవుదూడల తోకలు పట్టుకుని, ఇటూఅటూలాగి, వాటితో చెల్లాటమాడటం, ఇరుగుపొరుగు ఇళ్ళలో, దొంగ

తనంగా ప్రవేశించి, గోపికలు దాచుకున్న పాలూ పెరుగూ వెన్నా, తను తిన్నంతతిని, మిగిలింది తన తోటివారికి పంచి పెట్టడం, కట్టిఉన్న దూడలను, పాలుత్రాగే నిమిత్తం తల్లుల వద్దకు వదలటం, మొదలయిన అల్లరి పనులెన్నో చేయటం మొదలుపెట్టాడు.

## *82. నవనీతచౌర్యం - నానావిధాభియోగాలు :*

శ్రీకృష్ణుని బాల్యక్రీడలు, గోపికలకయితే ఆనందదాయకంగానే ఉన్నై. కాని, వృద్ధులుమాత్రం, వాటిని, చిలిపి చేష్టలుగా భావించి, ఆ బాలునికి అంతగా అలుసిచ్చినందుకు, వారిని మందలిస్తూ ఉండేవారు. అదిమాత్రం, వారికి, భరింపరానిదిగా ఉండేది. అందుకనే, వారు, ఒకసారి, యశోదను సమీపించి, ఇలా విన్నవించుకున్నారు

"బాలురకు బాలు లేవని
బాలెంతలు మొఱలువెట్ట బకపక నగి యీ
బాలుం డాలముసేయుచు
నాలకు గ్రేపులను విడిచె నంభోజాక్షీ !

పడతీ నీ బిడ్డడు మా
కడవలలో నున్న మంచి కాగినపాలా
పడుచులకుబోసి చిక్కన
కడవల బోనడచె నాజ్ఞ కలదో లేదో !

మీపాపడు మా గృహముల
నాపోవగ బాలుద్రావ నగపడకున్నం
గోపించి పిన్న పడుచుల
వాపోవగ జిమ్ముకొనుచు వచ్చెం దల్లీ !

పుట్టి పుట్టడు నేడు దొంగిలబోయి మాయిలు సొచ్చి తా
నుట్టి యందక ఱోళ్ళు పీటలు నొక్కద్రోవిడి యెక్కి చే

వెట్టఁజాలక కుండ క్రిం దొక పెద్ద తూ టొనరించి మీ
పట్టి మీగడ పాలు చేరలఁబట్టి త్రావె దలోదరీ !

ఆదం జని వీరల పెరు
గోడక నీ సుతుడు త్రావి యొకయించుక తా
గోడలి మూతిం దుడిచిన
గోడలు ముచ్చనుచు నత్త గొట్టె లతాంగీ !

వా రిల్లు సొచ్చి కడవల
దోరంబగు నెయ్యి ద్రావి తుది నా కడవల్
వీరింట నీ సుతుం డిడ
వారికి వీరికిని బెద్ద వాదయ్యె సతీ !

వేలుపులఁటె నాకంటెను
వేలుపు మఱి యెవ్వరనుచు వికవికనగి మా
వేలుపుల గోడపై నో
హేలావతి నీ తనూజు డెంగిలిజేసెన్.

ఇమ్మగువ తన్ను వాకిట
గ్రుమ్మరుచో జీరి నిలిపికొని పే రడుగం
గెమ్మోవి గఱచి వడి జనె
నమ్మా యీ ముద్దుగుఱ్ఱ డల్పుడె చెపుమా !

నమ్మి నిదురవోవ నాపట్టి చుంచు మా
లేగ తోకతోడ లీలగట్టి
వీధులందు దోలె వెలది నీ కొమరుండు
రాచబిడ్డడైన నవ్వ మేలె?

నాపట్టి పొట్ట నిండగ
బై పడి నీపట్టి వెన్న బానెం డిడినా

దూపిరి వెడలదు వానిం
జూపెద నేమైన నీవచుమ్ము లతాంగీ !

కలకంఠి మావాడ గరితలమెల్ల నీ
పట్టి రాగలడని పాలు వెరుగు
లింద్లలోపల నిడి యే మెల్ల దనత్రోవ
జూచుచో నెప్పుడు సొచ్చినాడొ
తలుపుల ముద్రలు దాళంబులును బెట్టి
యున్న చందంబున నున్న వరయ
నొకయింటిలో నాడు నొకయింటిలో బాడు
నొకయింటిలో నవ్వు నొకట దిట్టు
నొకట వెక్కిరించు నొక్కొక్కచో మృగ
పక్షి ఘోషణములు పరగజేయు
నిట్లు చేసి వెనుక నెక్కడబోవునో
కానరాడు రిత్త కడవ లుండు.

కడు లచ్చి కలిగె నేనిం
గుడుతురు కట్టుదురు కాక కొడుకుల నగుచున్
బడుగుల వాడలపైబడ
విడుతురె రాకాంత లెందు విమలేందుముఖీ !

ఓయమ్మ నీ కుమారుడు
మాయింద్లను బాలు బెరుగు మననీదమ్మా
పోయెద మెక్కడకైనను
మా యన్నల సురభు లాన మంజులవాణీ !"

బాలకృష్ణుని వినోదలీలలను అనేకవిధాల అలా వివరించిన గోపి కలనుచూసి, యశోద, విస్మితురాలయింది. ఆమె, ఆ పరిస్థితిలో ఉన్నప్పుడే, మరికొందరు గోపికలు, తమకు చిక్కిన దొంగకృష్ణుని, తల కొకని

చొప్పున బంధించి, ఆమె వద్దకు తీసుకువచ్చారు. ఆ సమయానికి, ఆమె చిన్నారి, ఆమె ఒళ్ళోనే పడుకుని నిద్రపోతున్నాడు. అందుకనే, ఆమెకు అమితమయిన ఆశ్చర్యం కలిగింది. అంతవరకూ నిద్రలేవని తన కన్నారి, పొరుగువారి ఇళ్ళలో ప్రవేశించటం, అక్కడ, చేయరానిపనులు చేయటం, వారిచేత బంధింపబడటం, ఆమెకు, విపరీత మనిపించింది. గోపికలుకూడా, అప్పు డక్కడ తల్లి ఒళ్లో పడుకుని ఉన్న కృష్ణయ్యనుచూసి, తాము తమతో తీసుకువచ్చిన కృష్ణులు కనపడకపోవటం గ్రహించి, అమితాశ్చర్యం పొందారు. ఆశ్చర్యపడటమే కాదు; సిగ్గుపడ్డారుకూడా. యశోదకు, అదేమీ అర్థంకాలేదు. అందుకనే, ఆమె, వారిని ఉద్దేశించి...

'చన్నుు విడిచి యిట్టటు చన
దెన్నడు బొరుగిండ్లత్రోవ లెఱుగడు నేడుం
గన్నులు దెఱవని మా యీ
చిన్ని కుమారకుని అవ్వసేయం దగునే !'

అని, అమితాశ్చర్యంతో అన్నది. అంతేకాదు. వారి పలుకులన్నీ విపరీత మయినవిగా తోచటంవల్ల, తన చిన్నారిదయిన నిర్దోషిత్వాన్ని వ్యక్తపరచు కుంటూ...

'అన్య మెఱుగడు, తనయంత నాడుచుండు'
మంచివా డీత, దెగ్గులు మానరమ్మ !
రామలార ! త్రిలోకాభిరామలార !
తల్లులార ! గుణవతీమతల్లులార !'

అనికూడా వారిని ప్రార్థించింది.

ఆ విధంగా, తన చేష్టలనుగూర్చి ఇరుగుపొరుగువారు తనతల్లికి నివేదించుకోవటం, తనతల్లి, తన మంచితనాన్ని ఉగ్గడించటం, కృష్ణయ్య గ్రహిస్తూనే ఉన్నాడు. దొంగనిద్దురపోతూ, గుఱ్ఱుపెడుతూ, తనలో తాను ముసిముసినవ్వులునవ్వుకుంటూ, గోపికలందరూ వెళ్ళిపోయేవరకూ, అలా పడుకునే ఉన్నాడు.

*83. విశ్వరూప ప్రదర్శనం :*

అలా జరిగిన కొంతకాలానికి, ఒకరోజున, బలరాముడూ, మరి కొందరు గోపబాలురూ, పరుగు పరుగున యశోదను సమీపించి, 'అమ్మా ! మన కృష్ణయ్య మన్ను తింటున్నాడు,' అని చెప్పారు. అది విన్న యశోద, వెంటనే, కృష్ణయ్య ఉన్నచోటికి వెళ్ళి, అతణ్ణి దగ్గరకు తీసుకుని...

'మ న్నేటికి భక్షించెదు
మ న్నియమము లేల నీవు మన్నింపవు మీ
యన్నయు సఖులును జెప్పెద
రన్నా ! మన్నేల మఱి పదార్థము లేదే ?'

అని, ప్రేమపూర్వకంగా మందలించింది. ఆమె పలుకులు విన్న కృష్ణయ్య, అసలు మన్నంటేనే తనకు తెలియనట్టుగా ఆమెవంక చూశాడు. చూసి...

'అమ్మా మన్నుదినంగ నే శిశువునో యాకొంటినో వెఱ్ఱినో
నమ్మంజూడకు వీరిమాటలు మదిన్ న న్నీవు కొట్టంగ దా
రి మ్మార్గంబు ఘటించి చెప్పెదరు ; కాదేనిన్ మదీయాస్యగం
ధ మ్మాఘ్రాణము సేసి నా వచనముల్ తప్పైన దండింపవే !'

అని, ఉట్టి అమాయకునిమాదిరి పలికాడు. ఆ తల్లికూడా, నిజానికి, తన చిన్నారి, అటువంటిపని చేసిఉండదనే అనుకుంది. అయినా, అతని తోటివారందరూ గట్టిగా చెప్పటంవల్లా, అందులోనూ, బలరాముడుకూడా వారి మాటలను బలపరచటంవల్లా, తన కుమారుడు సూచించినట్టు, అతనినోరు చూడటానికే నిర్ణయించుకుంది. ఆమె అభిప్రాయాన్ని గ్రహించిన కృష్ణయ్య, ఆ వెంటనే, తననోరు తెరచి ఆమెకు చూపాడు.

బాలుని ముఖం చూడగానే, యశోద, అమితాశ్చర్యంపొందింది. అతని ముఖ గహ్వరంలో, ఆమెకు, భూమ్యాకాశాలూ, పర్వతాలూ, సముద్రాలూ, ద్వీపాలూ, సూర్య చంద్రాదులూ, ఇదీ అదీ అని లేకుండా, బ్రహ్మాండమంతా గోచరించింది. అంతేకాదు. తనూ, తను ఉన్న గోకులం,

అందులో ఉండే సకలప్రాణులూకూడా, ఆ వక్త్రంలో ఆమె చూడటం జరిగింది. అది కారణంగా, ఆమె, తన్ను తాను నమ్మలేకపోయింది. అందు కనే...

'కలయో వైష్ణవమాయయో యితర సంకల్పార్థమో సత్యమో
తలపన్ నేరకయున్నదాననో యశోదాదేవి గానో పర
స్థలమో బాలకు డెంత యాతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమై యుండుట కేమి హేతువో మహాశ్చర్యంబు చింతింపగన్'

అనుకుంది. అంతేకాదు,

'బాలమాత్రుడైన బాలుని ముఖమందు
విశ్వమెల్ల నెట్లు వెలసియుండు
బాలుభంగి నితడు భాసిల్లుగాని స
ర్వాత్ము డాది విష్ణు డగుట నిజము'

అనికూడా నిర్ణయించుకుంది. అది కారణంగానే...

'ఏ మహాత్మువలన నీ విశ్వమంతయు
గానబడిన బుద్ధి కంపమయ్యె
నా మహాత్ము నితని నఖిలలోకాధారు
నార్తులెల్ల బాయ నాశ్రయింతు'

అని, చేతులు జోడించింది. అలా, తన్ను, పరమేశ్వరునిగా భావించే తల్లిని చూసి, కృష్ణయ్య, ఆ వెంటనే, ఆమెమీద, వైష్ణవమాయను ప్రయోగించాడు. అది కారణంగా, ఆమె, అంతకుపూర్వం తను పొందిన అనుభూతినంతనూ మఱచిపోయింది. తన ఎదుట ఉన్న శ్రీమన్నారాయణుడు, తన చిన్నారి కృష్ణుడే అనుకుంది. అతణ్ణి, చేతుల్లోకి తీసుకుని ఆడిస్తూ, ఇంట్లోకివెళ్ళింది.

### 84. మాతృదండనం :

ఒకసారి, యశోదాదేవి పెరుగు చిలుకుతూ ఉన్న సమయంలో, నల్లనయ్య, అమితంగా ఆకలిగొన్నవాని మాదిరి అక్కడకువచ్చి, పాలు

కా వాలని రోదింపసాగాడు. అలా రోదిస్తున్న అతణ్ణి చూసి, యశోద, నిజంగానే అతనికి ఆకలి అయిఉంటుం దనుకుని, చేతిలో ఉన్న పని నాపి, అతణ్ణి దగ్గరకుతీసుకుని, పా లివ్వబోయింది. కాని, అతడు, పాలు త్రాగ లేదు. కడుపు నిండిఉన్నవానిమాదిరి, ముసిముసి నవ్వులు నవ్వుతూ, ఆమె ఒళ్ళో ఆడుకోవటం మొదలుపెట్టాడు.

అంతలో, ఇంటిలోపల, కాగుతున్న పాలు పొంగుతున్నట్టు యశోద భావించింది. ఆ వెంటనే, ఆమె, అతణ్ణి అక్కడే కూర్చోపెట్టి, లోపలికి వెళ్ళింది. ఆమె అలా వెళ్ళగానే, కృష్ణయ్య, ఆ ప్రక్కనే ఉన్న ఒక గుండ్రాయిని తీసుకుని, అక్కడ ఉన్న పెరుగుకడవను, దానితో పగులకొట్టి, కడవలోని వెన్ననంతనూ గబగబా తినేశాడు.

పొయ్యిమీది పాలుదించి, యశోద, తిరిగి అక్కడికి వచ్చేటప్పటికి, ఆమెకు, పగిలిపోయిన కడవముక్కలుమాత్రం కనిపించినై. అది, కృష్ణయ్యచేసినపనే అనుకుని, ఆమె, ఆతనికోసం నలువంకలా చూసింది. కాని, అతను కనిపించలేదు. ఆ వెంటనే, ఆవిడ, అతణ్ణి వెతుక్కుంటూ, పెరుగుచాతికలు గుర్తుగా, ప్రక్కఇంట్లో ప్రవేశించింది. ఆ సమయానికి, ఆ ఇంట్లో ఎవ్వరూ లేరు. కాని, కృష్ణయ్య మాత్రం, అక్కడ, ఒక రోటి మీద ఎక్కి నుంచుని, ఉట్టి మీద ఉన్న కుండనుంచి వెన్న తీసుకునితింటూ ఉన్నాడు. తను తినటమే కాదు; ప్రక్కనేఉన్న ఒక కోతిచేతకూడా తినిపిస్తున్నాడు.

యశోద, అదంతా విచిత్రంగా చూసింది. చూసి, ఆ సమీపం లోనే ఉన్న ఒక సెలగోలను తీసుకుని, అతణ్ణి సమీపించింది. అలా సమీపిస్తూ...

'బాలు డీతండని భావింతు సందునా
యే పెద్దలును నేర రీ క్రమంబు
వెలపెటుంగుటకునై వెఱపింతుసందునా
కలిగి వే రొక్కడుగాని లేదు

వెఱపుతో నాబుద్ధి వినిపింతునందునా
　　తనుదానయై బుద్ధి దప్పకుండు
నొం దెఱుంగక యింట నుండెడినందునా
　　చొచ్చిచూడని దొకచోటు లేదు
తన్ను నెవ్వరైన దలపోయ బాఱెడి
యోజలేదు భీతి యొకటి యెఱుగ
దెలమి నూరకుండ దెక్కసక్కెములాడు
బట్టి శాస్తిసేయు భంగి యెట్లు ?"

అని, ఎంతగానో ఆలోచించింది. అలా ఆలోచించి...

'లాలనమున బహుదోషము
లోలిం బ్రాపించు దాడనోపాయములం
జాల గుణంబులు కలుగును
బాలురకును దాడనంబ పథ్యం బరయన్'

అని నిశ్చయించుకుంది.

అలా నిశ్చయించుకుని, చేతిలోని కోలను ఝళిపిస్తూ, తన్ను సమీపిస్తున్న తల్లినిచూసి, కృష్ణయ్య, భయపడినవానిమాదిరి, ఱోటి మీది నుంచి, ఒక్కసారిగా క్రిందకు ఉఱికాడు. అలా ఉఱికి, అక్కడినుంచి ఆమెను తప్పించుకుని, పరుగుతీశాడు.

ఆ విధంగా, తన్ను తప్పించుకుని పారిపోతున్న కృష్ణయ్యను తఱుముకుంటూ, యశోద పరుగెత్తింది. అలా పరుగిడుతున్న తల్లినీ కుమారునీ చూసిన గోపికలందరూ, అదోవిధమయిన ఆనందంతో, పకపక లాడసాగారు. అదంతా గ్రహిస్తూనే, యశోద...

స్తంభాదికంబులు తనకు నడ్డంబైన
　　నిట్టట్టు సని పట్టనీనివాని

నీ తప్పు సైరింపు మింక దొంగిలబోవ
　　నే నని మునుముట్ట నేడ్చువాని
గాటుక నెఱయంగ గన్నులు నులుముచు
　　వెడలు కన్నీటితో వెగచువాని
నే దెస వచ్చునో యిది యని పలుమాఱు
　　సురుగుచు గ్రీగంట జూచువాని
గూడ బాఱి పట్టుకొని వెఱపించుచు
జిన్ని వెన్నదొంగ సిక్కెననుచు
నలిగి కొట్ట జేతులాడక పూబోడి
కరుణతోడ బాలు గట్ట 'దలచె'.

తల్లి అభిప్రాయం గ్రహించిన కృష్ణయ్య, ఆమెవంక దీనంగా చూస్తూ, అలాగే నిలబడిపోయినాడు. ఆ వెంటనే, యశోద, అతణ్ణి ఉద్దేశించి...

"పీ రెవ్వరు శ్రీకృష్ణులు
కారా యెన్నడును వెన్న గానరటకదా
చోరత్వం బించుకయును
నేరరట ధరిత్రి నిట్టి నియతులుగలరే!

పట్టిన బట్టువడని నిను
బట్టెదమని చలముగొనిన బట్టుట బెట్టే
పట్టువడవంద్రు పట్టీ
పట్టుకొనన్ నాకుకాక పరులకు వశమే!

ఎక్కడనైనను దిరిగెద
వొక్కయెడన్ గుణము గలిగి యుండవు నియమం
బెక్కడిది నీకు మఱచిన
జక్కన బోయెదవు పెక్కుజాడల బుత్రా!

తోయంబు లివియని తొలగవు చొచ్చెదు
　　తలచెదు గట్టైన దరలనెత్త
మంటితో నాటలు మానవు కోరాడె
　　దున్నత స్తంభంబు లూపబోయె
దన్యుల నల్పంబు లడుగంగబారెదు
　　రాచవేటల జాల అవ్వదెచ్చె
దలయవు నీళ్ళకు నడ్డంబు గట్టెదు
　　ముసలివై హరివృత్తి మొనయ జూచె
దంబరంబు మొలకు నడుగవు తిరిగెద
వింక గల్కితనములేల పుత్ర
నిన్ను వంప వ్రాల్ప నే నేరననియె నీ
విట్లు క్రిందుమీదు నెఱుగకునికి"

అని, అతని ధూర్తత్వాన్ని పరిపరివిధాల పేర్కొంటూ, యశోద, అక్కడేఉన్న ఒకరోటికి అతణ్ణి కట్టడానికి ప్రయత్నించింది. కాని, ఆమె తెచ్చినత్రాడు, ఆ చిన్నారి నడుముకు సరిపోలేదు. ఆమె, ఆ వెంటనే, మరొకత్రాడు తెచ్చి, మొదటి త్రాటికి ముడేసి, పిల్లవాణ్ణి కట్టబోయింది. కాని, ఆ త్రాడుకూడా, ఆ లీలాశిశువు నడుముకు తక్కువే అయింది. అమి తాశ్చర్యంతో, ఆ తల్లి, మరొక పెద్దత్రాడు తెచ్చి, తిరిగి ప్రయత్నించింది. కాని, ఆ ప్రయత్నంకూడా నిష్ఫలమే అయింది. యశోదకు, అదంతా మహాద్భుతమనిపించింది. అయినా, ఆమె, తన ప్రయత్నం విరమించుకో లేదు. ఇంట్లోఉన్న త్రాళ్ళన్నీ తెచ్చి, ఎలాగైనా ఆ చిన్నారిని కట్టితీరాలని చూసింది. కాని, అదామెకు సాధ్యంకాలేదు. యథార్థానికి, జగజ్జాలాలన్నీ ఉన్న ఆ బొజ్జను, త్రాళ్ళతో కట్టడం ఎలా సాధ్యమౌతుంది !

తన్ను బంధించటానికి, తల్లిపడుతున్న పాట్లన్నీ చూసి, ఆ నల్ల నయ్య, జాలిపొందాడు. ఆమెను, ఆ పైన కష్టపెట్టడం ఉచితంకాదను

కున్నాడు. అందుకనే, బంధవిమోచనుడయిన ఆ లోకేశ్వరుడు, తనకుతానై, కోరి బంధింపబడ్డాడు. నిజానికి...

పట్టి యెల్లటోటి పట్టి యీతండని
గట్టి తలపుతోడ గట్టెగాక
పట్టి కడుపు పెక్కు బ్రహ్మాండములు వట్టు
టెఱిగెనేని దల్లి యేల కట్టు ?
చిక్కడు సిరికౌగిటిలో
జిక్కడు సనకాది యోగి చిత్తాబ్జములం
జిక్కడు శ్రుతిలతికావలి
జిక్కె నతడు లీల దల్లిచేతన్ ఱోలన్.

*

సంగడి దిరిగెడి శంభుడు
నంగాశ్రయయైన సిరియు నాత్మజుడై యు
ప్పొంగెడి పద్మజుడును గో
పాంగన క్రియ గరుణ వడయ రఖిలేశ్వరుచేన్.
జ్ఞానులచే మౌనులచే
దానులచే యోగసంవిధానులచేతం
బూని నిబద్ధుండగునే
శ్రీనాథుడు భక్తియుతుల చేతంబోలెన్.

* * *

అలా ఱోటికి కట్టబడిన కుమారుని అక్కడే వదలి, యశోద, ఇంటిపనులు చూసుకునే నిమిత్తం, లోపలికి వెళ్ళింది. అది అదనుగా తీసుకుని, కృష్ణయ్య, ఆ ఱోటిని ఈడ్చుకుంటూ బయటకు వెళ్ళాడు. అలా వెళ్ళివెళ్ళి, అక్కడికి అనతిదూరంలో ఉన్న రెండు మద్ది చెట్లను సమీపించాడు.

### 85. కుబేర పుత్రులు - నారదశాపం :

పూర్వం, నలకూబర మణిగ్రీవు లనే ఇద్దరు గుహ్యకు లుండే

వారు. వారు, కుబేరుని కుమారులు ; అమిత గర్విష్టులు. వారు, సర్వవేళలా, సురాపాన పరవశులై, స్త్రీలోలురై, చరిస్తూ ఉండేవారు.

ఒకసారి, వా రున్నచోటికి, నారదమహర్షి వెళ్ళటం జరిగింది. వారు, ఆ మహర్షిని చూడటమయితే చూశారు; కాని, సురాపానపరవశులై ఉండటంవల్ల, ఆయనను లక్ష్యంచేయలేదు. అది గ్రహించిన మహర్షి, అమితంగా కోపగించుకున్నాడు. అది కారణంగానే...

'సంపన్నుం డొరు గానలేడు, తనువున్ సంసారమున్ నమ్మి హిం
సింపం జూచు, దరిద్రు డెత్తువడి శుష్కీభూతుడై చిక్కి హిం
సింపం, డన్యుల నాత్మకున్ సములుగా జింతించు, నట్లౌట, ద
త్సంపన్నాంధున కంజనంబు వినుమీ దారిద్ర్య మూహింపగన్'

అని భావించాడు. ఆ భావంతోనే...

'కలవాని సుతుల మనుచును
గలకంఠులతోడగూడి కానరు పరులం
గలలోనైనను, వీరికి
గల క్రొవ్వడగించి బుధుల గలుపుట యొప్పున్'

అనికూడా నిర్ణయించుకున్నాడు. అంతేకాదు.

విషయలంపటులయినవారి బుద్ధిని నశింప చేయటానికి, రజోగుణాన్ని మించింది మరొకటి లేదు. రజోగుణావృతులయినవారు, సంపన్నాంధులూ, ఉత్తమకులజన్మాహంకారులూ, స్త్రీలోలురూ, ద్యూతక్రీడాపరులూ, మధుపాన వ్యసనులూ అవుతారు. అశాశ్వతమయిన ఈ శరీరానికి, జరామరణాలుఉన్నవనే అభిప్రాయం కూడా వారికి కలుగదు. అది కారణంగానే, వారు, దయావిహీనులై, హింసాపరులై,

ఇంద్రియ వశులై, చరిస్తారు; అసాధువులని పించుకుంటారు. ఆ విధంగా అసాధువులై వ్యవహరించే శ్రీమంతులకు, పే ద రి క మొక్కటే పరమౌషధం.

దరిద్రుడైనవాని జీవితం బాధామయంగా ఉంటుంది. బాధామయజీవి అయినవాడు పరులను హింసించటానికి పూనుకోడు. వ్యధిత హృదయమంటే ఏమిటో తెలియటమే దానికి మూలం.

దరిద్రుడు, అహంభావదూరుడుగానూ, మదరహితుడుగానూ ఉంటాడు. అ త ని లో, మూర్ఖత్వమనేది సహజంగా ఉండదు. వ్యధ అనేదే అతనికి తపమవుతుంది. నిత్య దరిద్రుడయినవానికీ, ఆకటిమంటచే అటమటించి పోయేవానికీ, ఇంద్రియాలు వశమైఉంటై. ఇంద్రియాలు వశమై ఉన్నవాడు, సాధు సంగమం అపేక్షిస్తాడు. తృష్ణారహితుడై వ్యవహరిస్తాడు. తమోవిదూరుడూ, ముకుంద చరణాపేక్షుడూ అవుతాడు.

అలా ఆలోచించి, నారదమహర్షి, నలకూబర మణిగ్రీవుల నుద్దేశించి, 'మీరు శ్రీమదాంధులుగా వ్యవహరించారు కాబట్టి, భూలోకంలో, మద్దిమానులై పుట్టవలసింది' అని శపించాడు.

మహర్షి శపించినమీదట, ఆ కుబేరపుత్రులకు, తాముచేసిన తప్పు తెలిసివచ్చింది. అది కారణంగానే, వారు, మహర్షి పాదాలమీద వ్రాలి, తమ తప్పును క్షమించవలసిందని ప్రార్థించారు. నారదమహర్షి, వారి

పశ్చాత్తాపాన్ని గ్రహించి, 'మీరు, నూరుసంవత్సరాలు మాత్రమే ఆ రూపంలో ఉంటారు. ఆ తరువాత...

ముక్తుల రై, నారాయణ
భక్తులరై పరమసాధు భావశ్రీసం
సక్తులరై సురలోక
వ్యక్తుల రయ్యెదరు నాదు వాక్యము కతనన్'

అని పలికాడు.

ఆ విధంగా నారదమహర్షివల్ల శపింపబడ్డ నలకూబర మణి గ్రీవులు, వ్రేపల్లెలో, నందుని ఇంటిసమీపాన, రెండు మద్దిమ్రానులై ఉద్భ వించారు. ఆ మ్రానులవద్దకే, చిన్ని కృష్ణయ్య, తాను కట్టబడి ఉన్న రోటిని ఈడ్చుకుంటూ పోయినాడు.

అలా పోయి, ఆ జంట మ్రానుల మధ్యనుంచి దారిచేసుకుని వెళ్ళాడు; కాని, ఆ మ్రాకులు అడ్డుకోవటంవల్ల, రోలు మాత్రం, అవతల ప్రక్కనే ఆగిపోయింది. అది గ్రహించిన కృష్ణయ్య, తన బలమంతా ఉప యోగించి, ఆ రోటిని లాగాలని చూశాడు. దాంతో, ఆ మద్దిచెట్లు రెండూ, కూకటి వ్రేళ్ళతో కూడా తెగి, కూలిపోయినై. ఆ వెంటనే, ఆ మ్రాకుల మధ్యనుంచి, అమిత తేజస్సంపన్నులయిన ఇద్దరు సిద్ధపురుషులు బయటకు వచ్చారు. వచ్చి, శ్రీకృష్ణునకు సాష్టాంగ ప్రణామం చేశారు; ఆ తరువాత, ఆయన్ని ఇలా స్తుతించారు.

"బాలుడవె నీవు నరుడ వ
నాలంబుడ వధిక యోగి వాద్యుడవు తను
స్థూలాకృతి యగు విశ్వము
నీ లీలారూపమండ్రు నిపుణులు కృష్ణా !

తండ్రీ ! నువ్వు గోపాలుడవుకాదు; జగత్కారణ భూతుడయిన పరమపురుషుడవు. నీ రూపమే ఈ విశ్వం. ఈ విశ్వంలో ఉండే సకల భూతజాలానికీ నువ్వు అధీశ్వరుడవు.

భువనములు సేయ గావగ
నవతీర్ణుడవై తిగాదె యఖిలేశ్వర యో
గివరేణ్య విశ్వమంగళ
కవినన్నుత వాసుదేవ కళ్యాణనిధీ !

కృష్ణా ! వాసుదేవుడవైన నీకు ప్రణమిల్లుతున్నాము. మేము, నీ అనుచరుని కింకరులం. మమ్మల్ని అనుగ్రహించవలసింది. ఇకమీద...

నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీ పేరం బని సేయు హస్తయుగముల్ నీ మూర్తిపై జూపులున్
నీ పాదంబుల పొంత మ్రొక్కు శిరముల్ నీ సేవపై జిత్తముల్
నీ పై బుద్ధులు మాకు నిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా !"

అలా ప్రార్థించిన నలకూబర మణిగ్రీవులను కరుణించి, ఉలూఖల బద్ధుడై ఉన్న శ్రీహరి, ఇలా అన్నాడు.

"మీరు, శ్రీమదాంధులై చరిస్తూ ఉండటంవల్ల, మీకు మేలు చేకూర్చాలనే ఉద్దేశంతో, నారదమహర్షి, మీకు, ధనభ్రంశం కలిగించటం, జ్ఞానమార్గం చూపటం, సంభవించింది. తమతమ ధర్మాలను ఆచరించేవారూ, సమచిత్తులై వ్యవహరించేవారూ, నన్నే ఆశ్రయించినవారూ, బంధ విముక్తులవుతారు. దేవర్షి దయవల్ల, మీరు, నన్ను చూడగలిగారు. ఇక, మీమనసు, నామీద లగ్నమై తీరుతుంది. మీ రిక, సుకృతులై చరించటం జరుగుతుంది."

ఆ విధంగా పలికిన శ్రీకృష్ణునికి ప్రదక్షిణం చేసి, నలకూబర మణిగ్రీవులు, తమతమ నివాసాలకు వెళ్ళిపోయినారు.

మద్దిమ్రాకులు విరిగిన చప్పుడు పిడుగుపాటుగా భావించి, గోకులంలోనివారు, ఆబాలగోపాలం, అక్కడకువచ్చారు. వచ్చి, కూలిన మ్రాకులనూ, వాటిమధ్య, మందహాసంచేస్తూ ఉన్న చిన్ని కృష్ణునీ చూశారు. చూసి, అమితాశ్చర్యంతో...

'ఈ పాదపములు కూలగ
నీ పాప డులూఖలమున నిటు బద్ధుండై
యే పగిది బ్రదికె గంటిరె
వాపోవడు వెఱవ డెట్టి వాడో యితడున్.

పిడుగు పడుట కాదు పెనుగాలి విసరదు
ఖండితంబులగుట కానరాదు
బాలు డితడు పట్టి పడద్రోవజాలడు
దరువు లేల కూలె ధరణిమీద'

అని, పరిపరివిధాల ఆలోచించారు. అంతలో, నందుడు ముందుకువచ్చి, శ్రీకృష్ణుని కట్టిఉన్న త్రాటిని విప్పాడు. ఆ వెంటనే, కృష్ణయ్య, అంతకు ముందు అక్కడ జరిగిందేమీ తెలియనివానిమాదిరిగా, ఆడుతూ పాడుతూ కేరింతలు కొడుతూ, తోటిబాలురతో కలసిపోయినాడు.

86. బృందావన ప్రవేశం :

శ్రీపతి పదమను నావను
ప్రాపించి భవాబ్ధి వత్స పదముగ ధీరుల్
రూపించి దాటి చేరుదు
రాపత్పద రహితులగుచు నమృత పదమున్.

* * *

పూతన, శకటాసుర, తృణావర్తాదులు సంహరింపబడటం, మద్ది మ్రాకులు అకారణంగానే కూలిపోవటం మొదలయినవి, మహోత్పాతాలని, గోపవృద్ధులు భావించారు. అది కారణంగానే, వారందరూ సమావేశమై, ఆ ప్రదేశం, తమకు అంత మంచిదికాదని నిర్ణయించుకున్నారు. ఆ సందర్భం లోనే, ఉపనందుడనే వృద్ధగోపకుడొకడు వారిని ఉద్దేశించి...

'ఇక్కడనుందురే మనుజు లీ మనకృష్ణున కెగ్గుసేయగా
రక్కసురాలు చన్గొనసగె, రాలపయిన్ సుడిగాలివైచె బై

గ్రిక్కిరియం దరుల్ వడియె గేళవు సత్కృప దప్పె జాలు నే
డెక్కడకైన బోవలయు నిం కిట గోపకులార వింటిరే !

కసవు గల దిరవు పసులకు
లసదద్రి నదీ మహీజ లతికావలి పెం
పెసగును గాపురమునకును
బొసగును బృందావనంబు వోద దచ్చటికిన్'

అని, తన మనసును వారికి తెలుపుకున్నాడు. అది, గోపకు లందరికీ, సమంజసంగానే తోచింది. ఆ వెంటనే, వారు, నందుని అనుమతి నంది, తమతమ ఆలమందలను తీసుకుని, సంసారాలను తరలించుకుని, ఆడుతూ పాడుతూ బృందావనం చేరుకున్నారు.

* * *

బృందావనం ఒక తీర్థరాజం. దానికి తూర్పునా ఉత్తరానా బర్హిషదం, దక్షిణదిశన మధురాపురం, పశ్చిమాన శోణపురం ఉన్నై. దాని నిడివి డెబ్బైనాలుగు క్రోసులు; వెడల్పు అర్ధ యోజనం.

బృందావనంలో, నందీశ్వర గోవర్ధన పర్వతా లున్నై. వాటిని అనుకునే, యమునానది ప్రవహిస్తోంది. అక్కడ, ఇరవైనాలుగు మహోద్యానాలు కూడా ఉన్నై.

బృందావనంలో, పశుగ్రాసానికి లోటు లేదు. అక్కడి జలం అమృతతుల్యం.

బృందావనం చేరుకున్న గోపప్రముఖులు, పదహారు క్రోసులమేర భూమిని ఆక్రమించుకున్నారు. అక్కడ, అర్ధచంద్రాకారంలో, ఇళ్ళూ వాకిళ్ళూ ఏర్పరచుకున్నారు. ఏడు ద్వారాలతో, ఒక మహానగరాన్ని నిర్మించుకున్నారు.

గోకులమంతా, ఆ విధంగా బృందావనం చేరుకోవటానికి, మరొక ప్రబల కారణంకూడా ఉంది. ఒకసారి, గోకులమంతటా, అదోవిధమైన వ్యాధి వ్యాపించింది. దాన్ని నివారించే నిమిత్తం, వ్రజవాసులు, ఏడు రోజుల

పాటు, దీక్షతో, మహేశ్వరుని పూజించారు. వారి భక్తికి మెచ్చి, మహేశ్వరుడు, తన భటుడైన శంఖకర్ణుని, ఒక సందేశంతో, వారివద్దకు పంపాడు. అలా గోకులం చేరిన శంఖకర్ణుడు, ఒక బ్రాహ్మణుని ఆవేశించి, ఇలా చెప్పాడు :

"యమునకు దక్షిణంగా ఒక వెలగతోట ఉంది. పూర్వం, అది, బలికి అన్న అయిన కాలకలి అనేవాని సంతానం. ఆ వనంలోని వృక్షాలన్నీ, విషగంధం వదులుతూ ఉంటై. ఆ వృక్షాలను ఆశ్రయించి, కాలకలి అనుచరులుకూడా, ఆ ప్రాంతంలోనే, మరికొన్ని వృక్షాలుగా ఉద్భవించారు.

కాలకలి భార్యలు ఏడుగురు. వా రందరూ గోవులైనారు. వారికి, వందలాది సంతానం కలిగింది. ఆ వెలగమాను, పుట్టిన పన్నెండేళ్ళకు పూచి ఫలించింది. ఆ ఫలాలను తింటూ, ఆ గోసంతతి జీవిస్తోంది. ఆ వృక్షాలు విడిచే విషగంధం వల్లనే, వ్రేపల్లెలో, వ్యాధులు ప్రబలినై.

కాలకలి సంతానాన్ని నిర్మూలించే శక్తి, రామ కృష్ణులకు మాత్రమే ఉంది. గోపకులందరూ బృందావనానికి మారినపక్షంలో, రామ కృష్ణులకు, ఆ వృక్షాలను నిర్మూలించే అవకాశం లభిస్తుంది. దానిమూలంగా, గోకులం వ్యాధినుంచి తొలగి, సుఖంగా జీవిస్తుంది".

ఆ విధమైన మహదేవుని సందేశాన్ని శిరసావహించి, నందాదులు, వ్రేపల్లెను విడిచి ,బృందావనం చేరుకోవటం జరిగింది.

## 87. వత్సాసురుడు :

అలా బృందావనం చేరుకున్న బలరామ కృష్ణులు, ఒకసారి, ఆవులను మేపుకునే నిమిత్తం, తమతోటివారితో కలసి, యమునా తీరానికి వెళ్ళటం జరిగింది. ఆ సమయంలో, కంసభృత్యుడయిన ఒక దైత్యుడు, కృష్ణయ్యను వెతుక్కుంటూ అక్కడికివచ్చాడు. వచ్చి, ఒక లేగ రూపం ధరించి, ఆ పరిసరాల్లో తిరిగే మందలో చేరాడు. కాని, గోపబాలు రెవరూ

అది గ్రహించలేదు. ఆ క్రొత్తలేగ ఎక్కడిదా అన్న ఆలోచన, చివరకు, బలరామునకుకూడా కలుగలేదు.

కొంతసేపు ఆటలూ పాటలూ సాగింతరువాత, కృష్ణయ్య, బల రాముని ఓ ప్రక్కకుపిలచి, ఆ క్రొత్తలేగను చూపించి, 'అది, మనకోసం, మన కంసుడు మామయ్య దగ్గరనుంచి వచ్చింది. దానికి తగిన మర్యాద చెయ్యటం మనధర్మం' అన్నాడు. అంటూనే, మెల్లగా దాన్ని సమీపించాడు. అమాంతంగా, దాని వెనుక కాళ్ళు రెండూ కలిపిపట్టుకుని, ఎత్తి, గిరగిరా త్రిప్పి, ఆ ప్రక్కనే ఉన్న ఒక వెలగి చెట్టుకు వేసి మోదాడు. ఆ వ్రేటు భరించలేక, ఆ రాక్షసుడు, గావు కేక పెట్టి, నిజ రూపంలో ప్రాణాలు వద లటం జరిగింది. అది చూసిన గోపాలు రందరూ, అదలిపోయినారు. ఆ వెంటనే, కృష్ణయ్య మీద పుష్ప వర్షం కురిసింది. అది చూసిన బలరాముడు, మందహాసంచేశాడు.

* * *

శ్రీకృష్ణునిచేత ఆ విధంగా నిహతుడైన వత్సాసురుడు, పూర్వం, మురా సుతుడైన ప్రమీలుడనేవాడు. అత డొకసారి, వసిష్ఠమహర్షి ఆశ్ర మానికి వెళ్ళి, అక్కడ ఉన్న నందినీ ధేనువును చూశాడు. చూసి, అది తన వద్ద వుంటే బాగుండుననుకున్నాడు.

ఆ వెంటనే, అతడు, బ్రాహ్మణరూపం ధరించి, మహర్షిని సమీ పించాడు. తనకు ఆ ధేనువును దాన మివ్వవలసిందిగా కోరాడు. కాని, వసిష్ఠుడు, అతనికి ఏ విధమైన సమాధానం ఇవ్వలేదు; మౌనం వహించి ఊరకున్నాడు.

నందిని, ఆ పరిస్థితిని అర్థంచేసుకుంది. ప్రమీలుని మోసప్రవృత్తిని గ్రహించింది. గ్రహించి, 'నువ్వు దేనిని కోరి మహర్షిని మోసంచేయ దల చావో దాని రూపాన్నే ధరించవలసింది' అని శపించింది.

అలా శప్తుడైన ప్రమీలునికి, అతడు తలపెట్టిన అత్యాచారం, అప్పుడు అర్థమయింది. వెంటనే, అతడు, మహర్షికీ నందినికీ నమస్కరిం

చాడు. తన దోషాన్ని క్షమించి, తన్ను రక్షించవలసిందిగా ప్రార్థించాడు.

అతని ప్రార్థన విన్న నందిని జాలిపడ్డది అది కారణంగానే, ద్వాపరంలో, శ్రీహరి, గోపాలుడై బృందావనంలో విహారిస్తాడనీ, అప్పుడు, ఆయనవైన గోవత్సలతో కలసి మెలసి చరించటంద్వారా, అతనికి ముక్తి లభిస్తుందనీ, తెలియపరచింది.

శాపవిమోచన మార్గం గ్రహించిన ప్రమీలుడు, ఆ వెంటనే, వత్స రూపం ధరించి, గోపాలుని దర్శనం కోసం, బృందావనంలో చరించసాగాడు. అది గ్రహించిన కృష్ణయ్య, అతణ్ణి కనికరించి, అతనికి శాప విముక్తిని కలిగించాడు.

## *88. బకాసురుడు :*

అది జరిగిన కొద్దిరోజులకే, మరొక విచిత్రం జరిగింది. ఒక సారి, గోప కుమారులు, రామ కృష్ణ సహితులై, ఒక అడవికి వెళ్లారు. అలా వెళ్ళి, ఆడుకుంటూ ఉన్న సమయంలో, వారికి, ఒక పెద్ద కొంగ కనిపించింది. ఆ కొంగను చూడగానే, గోపబాలుర గుండెలు ప్రీలిపోయినై. వజ్రం మాదిరి ఉన్న దాని ముక్కు, వెండికొండ మాదిరి ఉన్న దాని శరీరం, చూసి, వారు భీతిలిపోయినారు. అంతలోనే, అది, తటాలున వచ్చి, కృష్ణయ్య ముందు వ్రాలి, అతణ్ణి మింగేసింది.

అది చూసిన గోపబాలు రందరూ, హాహాకారాలు చేశారు. వారి ఆక్రందనం విన్న మహేంద్రుడు, ఆ వెంటనే, రుద్రాదులతోనూ, సర్వవిధ శస్త్రాస్త్రాలతోనూ, అక్కడికి వచ్చాడు. ఆ బకునిమీద, ముందుగా, తన వజ్రాయుధాన్ని ఒదిలాడు.

ఆ వజ్రాయుధం, బకుని చలింప చేయలేకపోయింది. అది గ్రహించిన మహేంద్రుడు, అతని మీద, బ్రహ్మదండాన్ని ప్రయోగించాడు.

బ్రహ్మదండం తాకిడికి, బకుడు, ఒక క్షణమాత్రం మూర్ఛితుడైనాడు. కాని, వెంటనే తేరుకున్నాడు.

అది చూసిన రుద్రుడు, అమితాశ్చర్యంతో, తన త్రిశూలాన్ని, ఆ బకుని మీదకు విసరి వేశాడు.

ఆ త్రిశూలం, బకుని పక్షాలలో ఒకదాన్ని మాత్రమే ఖండించ గలిగింది. అది చూసిన పవనుడు, బకునిమీద తన శక్తిని ప్రయోగించాడు. అదికూడా, బకుని చలింపచేయలేకపోయింది.

ఆ తరువాత, కిన్నరేశ్వరుడు, బకునిమీదకు, తన కృపాణాన్ని విసిరాడు. అది, బకుని మరొక పక్షాన్ని మాత్రమే ఖండించింది. అది గ్రహించిన చంద్రుడు, తన హిమాస్త్రాన్ని, అతని మీదకు వదిలాడు; అయినా, ప్రయోజనం కనిపించలేదు.

ఆ తరువాత, అగ్ని దేవుడు, ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. అది, బకుని రోమాలనుమాత్రం భస్మం చేయగలిగింది. అది చూసిన వరుణుడు, తన పాశాన్నీ, కాశీ, తన గదనూ, బకుని మీద విసరివేశారు; కాని, అవికూడా, నిష్ఫలమే అయినై.

అది చూసిన దేవతలు, ఆ బకుని శక్తిని గ్రహించి, విస్మితులైనారు. అతణ్ణి సంహరించటం అసంభవమనుకున్నారు.

దేవతలను ఆ విధంగా ఆశ్చర్యచకితుల్ని చేసి, బకుడు, ఒక్కసారిగా, ఆకసానికి ఎగిరాడు. ఎగురుతూ, పెనుగాలిని కల్పించాడు.

ఆ గాలికి, దేవతలు తట్టుకోలేకపోయినారు. ఎక్కడివారు అక్కడి నుంచే పారిపోసాగారు. బకుడు, వారిని, తరిమి తరిమి కొట్టాడు.

ఆ సమయంలో, దేవతలకు, గత్యంతరం తోచలేదు. వారందరూ కలసి, ఆపైన, శ్రీకృష్ణునే ప్రార్థించారు. బకుని ముఖ గహ్వరం నుంచి బయటపడి, తమకు శాంతిని, ప్రసాదించవలసిందిగా ఆయన్ని వేడుకున్నారు.

దేవతల మొఱనాలకించిన కృష్ణయ్య, ఆ వెంటనే, తన శరీరాన్ని పెంచుకున్నాడు. అలా బృహద్రూపం ధరించిన కృష్ణయ్యను, ఆ బకం,

భరించలేకపోయింది. స్వప్రాణ రక్షణార్థం, అది, అతణ్ణి కక్కేసింది. అలా కక్కికూడా, తన శరీరాన్ని అమితంగా పెంచుకుని, అతణ్ణి, ముక్కుతో పొడిచిచంపటానికి ఉద్యమించింది.

కృష్ణయ్య అది గ్రహించాడు. గ్రహించి, తన రెండుచేతులతోనూ బకుని ముక్కుతుండాలు పట్టుకుని, పూరిపుల్లనుమాదిరి చీల్చేశాడు.

అంతలో, ఆ కొంగ, మాయమైపోయింది. దాని స్థానంలో, ఒక రాక్షసుడు, రెండుగా చీలిన శరీరంతో కనిపించి, గిలగిలా తన్నుకుని ప్రాణం వదలటం జరిగింది.

* * *

దేవతలను ఆ విధంగా భయభ్రాంతులను చేసిన ఆ బకుడు, పూర్వజన్మలో, హయగ్రీవుని కుమారుడయిన ఉత్కలుడు. అతడు, ఆ జన్మలోకూడా, దేవతలందరనూ ఎంతగానో వేధించాడు. వారి ఛత్ర చామరాదులన్నీ హరించాడు. నూరు సంవత్సరాలపాటు, వారికి నాథుడై వ్యవహరించాడు.

అలా వ్యవహరించిన ఉత్కలుడు, ఒకసారి, జాజలుని ఆశ్రమంలో ఉన్న ఒక మడుగులో ప్రవేశించి, చేపలను పట్టుకోవటం జరిగింది. అది జాజలుడు చూశాడు. చూసి, అతణ్ణి ఉద్దేశించి, 'నీ శౌర్య ప్రతాపాలు చూపటానికి ఈ మీనులే దొరికాయా !' అన్నాడు.

జాజలమహర్షి పలుకులు, ఉత్కలునిలో, ఏవిధమైనమార్పునూ కలిగించలేదు. అది గ్రహించి, ఆ మహర్షి, 'నువ్వు బకరూపం ధరించవలసింది' అని అతణ్ణి శపించాడు

జాజలుడు సామాన్యుడు కాడు. ఆరువేల సంవత్సరాలు తీవ్ర తపస్సు చేసిన మహానుభావుడు. ఆ మహర్షి శాపానికి గురిఅయిన ఉత్కలుడే, బకుడై, బృందావనంలో చరిస్తూ ఉండటం, కాలక్రమాన, శ్రీకృష్ణుని స్పర్శద్వారా ముక్తిని పొందటం జరిగింది.

## 89. కౌమారచేష్టలు :

ఆ తరువాత, బృందావనంలో, బలరామ కృష్ణులు సలిపిన కౌమార చేష్టలకు అంతులేదు. క్రేపులను కాచే సమయంలో, వారు, తమ స్నేహితులయిన గోపబాలురతో కలసి, ఎన్నో చిత్రాతిచిత్రమయిన ఆటలాడుకునేవారు.

కపులమై జలరాసి గట్టుదమా యని
　　కట్టుదు రడ్డంబు గాలువలకు
మునులమై తపములు మొనయుదమా యని
　　మౌనులై యుందురు మాటలేక
గంధర్వవరులమై గాన విద్యలు మీఱ
　　బాడుదమా యని పాడజొత్తు
రప్సరోజనులమై యాడుదమా యని
　　యాదరూపుల దాల్చి యాడజనుదు
రమర దైత్యవరులమై యబ్ధిద్రత్తమా
యని సరోవరములయందు హస్త
దండచయము ద్రిప్పి తరుతురు తమ యీడు
కొమరు లనుచరింప గొమరు మిగిలి.

అంతేకాదు. వా రొక్కొకప్పుడు, వనమాలా విభూషితులై, వనాంతరాల్లో ప్రవేశించి, తేనెటీగలతోపాటు ఝుంకారం చేసేవారు. హంసలతోపాటు ధ్వనించేవారు. నెమిళ్ళతో కలసి నాట్యం చేసేవారు. చకోర. క్రౌంచ, చక్రవాక, భరద్వాజాదుల ననుకరించి నినాదాలు చేసేవారు. వన్య మృగాలకు భయపడిపోయినట్లు, అప్పుడప్పుడు నటిస్తూ ఉండేవారు.

యథార్థానికి మహానుభావులై కూడా, ఆ అన్నదమ్ములు, తమ శక్తి సామర్థ్యాలను, తమ మాయాశక్తిద్వారా మఱుగుపరచుకుని, మందలో, సామాన్యుల మాదిరి క్రీడిస్తూ ఉండటం జరిగింది.

అదంతా గ్రహిస్తూఉన్న గోపవృద్ధులు, గర్గాచార్యుని పలుకులు స్మరించుకుని, తమ చిన్నారి కృష్ణయ్య, తమ్మొ తరింపచేయటానికే తమ మధ్య ఉద్భవించాడని భావించి, అతణ్ణి, అమితాభిమానంతో చూసుకో సాగారు; అతని కథలను కీర్తిస్తూ, భవవేదనలను వేటినీ లక్ష్యంచేయ కుండా జీవితం గడుపుకోగలిగారు.

## *90.* అఘాసురుడు :

కాలక్రమాన, బలరామ కృష్ణులకు కౌమారదశ గడిచింది. ఆ సమయంలో, ఒకసారి, వారిద్దరూ, గోపబాలురతో కలసి, బంతిచల్దు లారగించేనిమిత్తం, ఒక వనానికి వెళ్ళారు. అలా వెళ్ళి, అనేకమైన ఆట లాడుకున్నారు.

ఎన్నడునైన యోగివిభు లెవ్వని పాదపరాగ మింతయున్
గన్గొనలేని యట్టి హరి గౌగిట జేర్చుచు జెట్టబట్టుచున్
దన్నుచు గ్రుద్దుచున్ నగుచు దద్దయు బైపడి కూడియాడుచున్
మన్నన సేయు వల్లవకుమారుల 'పున్నెము నెన్నశక్యమే !'

ఏందులకును బ్రహ్మ సుఖా
నందంబై భక్తగణమునకు దైవతమై
మందులకు బాలుడగు హరి
పొందుగనిరి గొల్ల 'లట్టి' పుణ్యులు గలరే !

అలా ఆ పిల్లలు ఆడుకుంటూ ఉండగా, అఘుడనే రాక్షసుడు, కంసుని పంపున అక్కడికి వచ్చాడు. అతడు, బకునికీ పూతనకూ తమ్ముడు. తనవారు, మందలోని ఒక నల్లనయ్య వల్ల సంహరింపబడ్డారని విని, అతడు, ఎలాగైనా ఆ నల్లవాని అంతు కనుక్కోవాలన్న నిశ్చయంతో, అక్కడికి రావటం జరిగింది.

అలా వచ్చిన అతడు, ఆమడ పొడవూ, పెద్ద కొండంత లావూ ఉన్న చిలువరూపం ధరించి, పెద్ద గుహమాదిరిఉన్న నోరుతెరుచుకుని

కృష్ణుని మ్రింగేనిమిత్తం, ఒకచోట వేచిఉన్నాడు. అతణ్ణి చూసిన గోపబాలురు, అది మహాజగరమని తెలిసికూడా, 'మన కృష్ణయ్య ఉండగా మనకేం భయం' అనుకుంటూ, దాన్ని సమీపించారు; తమ గోగణంతోసహా, బిలంమాదిరి ఉన్న దానినోట్లో ప్రవేశించారు. కాని, కృష్ణయ్య కోసం వేచిఉన్న అఘుడు, ఆ బాలుర నేమీ చేయలేదు; కదలకుండా మెదలకుండా అలాగే ఉండిపోయినాడు.

గోపబాలు రందరూ, తనమీది విశ్వాసంతో, తెలిసికూడా అజగరం నోట్లో, ప్రవేశించారనీ, అది తన కోసమే వేచిఉన్నదనీ, కృష్ణయ్య గ్రహించాడు. గ్రహించి, తనవారికి చేటుకలుగకుండానూ, ఆ పాపాత్ముని ఆశయం నెఱవేరకుండానూ ఉండే ఉపాయం ఏమిటాఅని, ఒక క్షణకాలం ఆలోచించాడు. ఆలోచించి, ఆవెంటనే, తనుకూడా దాన్ని సమీపించాడు; మెల్ల మెల్లగా దాని గొంతులో ప్రవేశించాడు.

అలా ప్రవేశించిన కృష్ణయ్య, ఆ అజగరం గొంతులోనే ఆగి, తన శరీరాన్ని మహాద్భుతంగా పెంచుకున్నాడు. దాంతో, ఆ అజగరం గొంతు పూడిపోయింది. దానికి, ఊపిరిసలిపే అవకాశం ఏమాత్రంగానూ లేకపోయింది. అది కారణంగా...

ఊపిరి వెడలక కడుపున
వా పొదవిన బాము ప్రాణవాతంబులు సం
తాపించి శిరము వ్రక్కలు
వాపికొనుచు వెడలి చనియె బటు ఘోషముతోన్.

అలా పగిలిన శిరస్సులోనుంచి, ఆ వెంటనే, గోవత్ససంఘంతోనూ, గోపబాలురతోనూ, కృష్ణయ్య, బయటకు వచ్చేశాడు. శ్రీకృష్ణుని అంగస్పర్శ మూలంగా పాపాలన్ని హరించిపోవటంవల్ల, ఆ అజగరంలోనుంచి ఒక దివ్యతేజం బయటకువచ్చి, కృష్ణయ్యలో లీనమైపోయింది. అది చూసిన చతుర్ముఖుడు కూడా నివ్వెరపోయినాడు.

తనరూ పొకమాటయినను
మనమున నిడికొనిన బాపమయు దనగతికిన్
గొనిచను హరి దను మ్రింగిన
దనుజుని గొనిపోవకున్నె తనలోపలికిన్.

అఘాసురుడు ఆ విధంగా సంహరింపబడటం చూసిన దేవతలు, కృష్ణయ్యమీద పుష్ప వర్షం కురిపించారు. ఆ ప్రదేశమంతటా, అప్పుడు, గంధర్వగానం మారు మ్రోగింది.

* * *

కృష్ణయ్యలో అలా లీనమైన అఘుడు, పూర్వం, శంఖుడనే రాక్షసుని కుమారుడు; అఘు డనేవాడు.

అఘుని బలసంపద అద్వితీయమైనదిగా ఉండేది. దానికి తోడు, అతని రూపం యౌవనం, అతణ్ణి, అమితగర్విష్టిగా తయారుచేసినై.

అత డొకసారి, మలయాద్రిమీద తపస్సు చేసుకుంటున్న అష్టావక్రుని చూశాడు. చూసి, ఆయన్ని అపహాస్యంచేశాడు. అది అష్టావక్రునికి ఆగ్రహకారణమయింది. ఆ వెంటనే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, 'నువ్వు సర్పరూపం ధరించవలసింది' అని శపించాడు. కాని, పశ్చాత్తప్తుడైన అఘుని చూసి, జాలిపడి, 'శ్రీకృష్ణు డెప్పుడు నీ గర్భంలో ప్రవేశిస్తాడో అప్పుడు, నీకు, శాపవిముక్తి కలుగుతుంది' అని చెప్పాడు.

ఆ రోజునుంచీ, శ్రీకృష్ణుడు ఎప్పుడుకనిపిస్తాడా అనీ, ఆయన్ని ఎప్పుడు ఎలా మ్రింగి శాపవిముక్తిని పొందుతానా అనీ, అఘుడు, ఆలోచించసాగాడు. కాలక్రమాన, బృందావనం చేరుకుని, శ్రీకృష్ణుని అనుగ్రహం ద్వారా, పరమపదం పొందాడు.

## *91.* బహురూపధారణం :

ఆ తరువాత, కృష్ణయ్య, తనవా రందరినీ, ఆ సమీపంలోనే ఉన్న యమునా తీరానికి తీసుకువెళ్ళి ...

'ఎండన్ బ్రగ్గితి రాకటం బడితి రింకేలా విలంబింపగా
రం డో బాలకులార చల్ది గుడువన్ రమ్యస్థలం బిక్కడీ
దండన్ లేగలు నీరుద్రావి యిరవందం బచ్చికల్ మేయుచుం
దండంబై విహరించుచుండగ నమందప్రీతి భక్షింతమే'

అని, వారందరినీ ఆహ్వానించాడు. ఆ వెంటనే, గోపబాలురందరూ, క్రేపులను పచ్చికలకు తోలి, ఆ సైకత ప్రదేశంలో, శ్రీకృష్ణుని చుట్టి, వలయాకారంగా కూర్చున్నారు. కాని, ఆయన సుందరముఖ పద్మం, అందరికీ కూడా దర్శనీయ మౌతూనే ఉంది. ఆ పరిస్థితిలో, వారు, తమతమ చిక్కాలు విప్పుకుని తమ ముందుంచుకుని...

మాటిమాటికి వ్రేలు మడిచి యూరించుచు
నూరగాయలు తినుచుండు నొకడు
డొకని కంచములోని దొడిసి చయ్యన మ్రింగి
'చూడు, లేద'ని నోరు సూపు నొకడు
డేగు రార్గురు చల్దు లెలమి బన్నిదమాడి
కూర్చొని కూర్చొని కుడుచు నొకడు
డిన్నియు దగబంచి యిడుట నెచ్చెలితన
మనుచు బంతెనగుండు లాడు నొకడు

'కృష్ణు జూడు' మనుచు గికురించి పరుమోల
మేలి భక్ష్యరాశి మెసగు నొకడు,
నవ్వు నొకడు, సఖుల నవ్వించు నొక్కడు,
ముచ్చటాడు నొకడు, మురియు నొకడు.

ఆ విధంగా, గోపబాలురు, ఆనందంతో ఆరగింపులు చేస్తూ ఉండగా...

కడుపున దిండుగా గట్టిన వలువలో
లాలిత వంశనాళంబు జొనిపి

విమల శృంగంబును వేత్ర దండంబును
జాటిరానీక డా చంక నిఱికి
మీగడ పెరుగున మేళవించిన చల్ది
ముద్ద డాపలిచేత మొనయ నునిచి
చెలరేగి కొసరి తెచ్చిన యూరగాయలు
వ్రేళ్ళ సందులనెల్ల వెలయ నిఱికి
సంగడీల నడుమ జక్కన గూర్చుండి
నర్మభాషణముల నగవు నెఱపి
యాగభోక్త కృష్ణు డమరులు వెఱగంద
శైశవంబు మెఱసి చల్ది గుడిచె.

ఆ సమయంలో, అక్కడి క్రేపులు, దూరంగా ఉన్న పచ్చిక మేసే నిమిత్తం, గుంపుగా అటు వెళ్ళటం జరిగింది. అది తెలియని గోపబాలురు, అమితంగా భయపడ్డారు. కృష్ణయ్య అది గ్రహించాడు. గ్రహించి...

'వినుడో బాలకులార క్రేపు లటవీ వీథిన్ మహాదూరమున్
జనియెం గోమల ఘాస ఖాదన రతోత్సాహంబుతో నెందుబో
యెనొ యేమయ్యెనొ క్రూరజంతువులచే నే యాపదం బొందెనో
కని తెత్తుం గుడువుండు చల్ది, గొఱతల్ గాకుండ మీ రందఱున్'

అని, వారిని సమాధానపరచి, చెంగుచెంగున దూకుతూ, వనాంతరానికి వెళ్ళాడు.

ఆ సమయంలో, చతుర్ముఖునికి, ఒక వింత ఆలోచన కలిగింది. అంతకుముందు, అఘాసుర సంహారం ఆతడు కళ్ళారాచూశాడు. మృత్యుముఖంలో ప్రవేశించిన గోపబాలురూ గోవత్సాలూ బ్రతికి బయటపడటం గ్రహించాడు. అదంతా ఆతనికి అద్భుత మనిపించింది. అది కారణంగానే, అటువంటి మహాద్భుతకార్యాలు మరికొన్ని చూడాలన్న కుతూహలంకూడా అతనిలో జనించింది. అందుకనే, వనాంతరాల్లో చరిస్తున్న గోసంఘాన్ని,

చల్ది లారగిస్తున్న గోపబాలురనూ, తన మాయాశక్తిద్వారా, ఎవరికీ కనబడకుండా దాచేశాడు.

అది ఊహించని కృష్ణయ్య, గోసంఘాన్ని వెతుక్కుంటూ, వాటి అడుగుజాడలబట్టి, కొద్దిసేపు, వనమంతా తిరిగాడు. కాని, ఆయన కవి కనిపించలేదు. అది కారణంగా, ఆయన, విసుగుచెంది, తను తన స్నేహితులతో పూర్వం చల్ది లారగించినచోటికి తిరిగివెళ్ళాడు. అక్కడ, వారు కూడా ఆయనకు కనిపించలేదు. అది ఆయనకు వింతగాతోచింది. దాని కంతటికీ కారణ మేమై ఉంటుందా అని, అప్పు డాయన ఆలోచనచేశాడు. ఆయన విశ్వవిదుడు కావటంవల్ల, ఆ వెంటనే, అదంతా ఆయనకు అర్థమైపోయింది. అది చతుర్ముఖుని చర్యగా, ఆయన గ్రహించగలిగాడు. చతుర్ముఖుడైనా, తన్ను వంచించటానికి అలా చేసిఉండదనీ, తన శక్తిని గ్రహించటానికే ఆ పనికి పూనుకుని ఉంటాడనీ, భావించాడు అందుకనే...

'గోపాల సుతులు లేరని
గోపికలకు చెప్పనేల గోపాలకులున్
గోపికలు నలర బాలుర
క్రేపుల రూపముల నే జరించెద 'నింకన్'

అని నిర్ణయించుకున్నాడు. ఆ వెంటనే...

కరముల్ పాదములున్ శిరంబు లవలగ్నంబుల్ ముఖంబుల్ భుజాం
తరముల్ ముక్కులు గన్నులున్ శ్రవణముల్ దంతాదులున్ దండకాం
బర స్రగ్వేణు విషాణ భూషణ వయో భాషా గుణా ఖ్యాన త
త్పరతల్ పీడ్వడకుండ దాల్చె విభుఁ డా వత్సార్భకాకారముల్.

ఆ విధంగా, గోపబాలు రెందరున్నారో వారందరి రూపాలూ, క్రేపు లెన్ని ఉన్నయ్యో వాటి అన్నిటి ఆకారాలూ ధరించి, ఆ నల్లనయ్య, అన్ని రూపులతోనూ గోకులంలో ప్రవేశించాడు. అలా ప్రవేశించి, ఎవరి గోవత్సలను

వారి దొడ్లలోకి తోలి, ఎవరిపిల్లలను వారి ఇళ్ళముందు వదలి, యథాప్రకారంగా, వేణువు నూదుకుంటూ ఇల్లు చేరుకున్నాడు.

అలా ఇళ్ళు చేరుకున్న క్రేపులనూ పిల్లలనూ చూసిన ఇల్లాండ్రకు, ఆరోజున, అదోవిధమైన అపూర్వానందం కలిగింది. అప్పటినుంచీ, వారు, కారణం తెలియకుండానే, తమ బిడ్డలనూ క్రేపులనూ అమితమైన ఆదరాభిమానాలతో చూసుకోసాగారు. ఆ క్రేపులరూపంలోనూ గోపబాలుర రూపంలోనూ ఉన్న కృష్ణయ్యకూడా, వారిపట్ల అలాగే ప్రవర్తించసాగాడు. కాని, ఆ ప్రవర్తనలో, మమకారం అనేది మాత్రం, ఆయనకు, ఏ కోశానా ఉండేదికాదు.

తమ గోవులపట్లా సంతానంపట్లా, వ్రజవాసులకు, క్షణక్షణాభివృద్ధి పొందుతున్న ప్రేమను గ్రహిస్తూ, అందులోఉన్న రహస్యాన్ని అర్థం చేసుకోలేక అమితాశ్చర్యపడుతూఉన్న బలరాముడు కూడా, కాలక్రమాన, వారితో కలసిపోయినాడు. వారి మాదిరిగానే ప్రవర్తించసాగాడు. ఆ గోవుల లోనూ, గోపబాలురలోనూ, శ్రీమహావిష్ణువును దర్శించుకుని, మహాద్భుతమైన దివ్యానుభూతిని పొందగలిగాడు.

వ్రజవాసులందరూ ఆ పరిస్థితిలోఉండగా, ఒక సంవత్సరం గడచింది. ఆ కాలంలో, కృష్ణయ్య, గోవత్సరూపంలోఉన్న తన్ను, గోప బాలుర రూపంలో ఉన్న తన ద్వారా పాలించుకుంటూ, వనాంతరాల్లోనూ వ్రజంలోనూ క్రీడించటం జరిగింది.

ఆ విధంగా, మానవమానంలో అయితే ఒక సంవత్సరం గడిచిందేకాని, యథార్థానికి, బ్రహ్మ కది త్రుటి మాత్రమే. ఆ త్రుటికాలం గడచిపోగానే, చతుర్ముఖుడు, కన్ను తెఱచాడు. కన్నుతెఱచి చూడగానే, ఆ వనంలో, అతనికి, తిరిగి, శ్రీకృష్ణుడూ, ఆయనప్రక్కన యథాపూర్వకంగా గోప బాలురూ, క్రేపులూ, కనిపించటం జరిగింది, అత డాశ్చర్యపడ్డాడు. అంతకు ముందు, తను గోవులను దాచినదిక్కు చూశాడు. అవి, తను నిర్మించిన గుహలోనే ఉన్నై. గోపబాలురను దాచినవేపు చూశాడు. వారుకూడా,

అక్కడే ఉన్నారు. అది గ్రహించి, చతుర్ముఖుడు, తన్నుతానే నమ్మలేక పోయినాడు. అదంతా పరమేశ్వరుడైన శ్రీకృష్ణుని పరమాద్భుత చర్యగా అతడు భావించాడు. విష్ణుదేవుని మోహింపజేయాలనుకున్న తనే, విష్ణు మాయకు మోహితుడు కావటం, అతనికి అమితమైన ఆవేదన కలిగించింది. తాను సృష్టికర్త అయినట్టూ, ప్రాణిసంతతిని సృజించేశక్తి తనకుతప్ప ఇతరులకెవ్వరికి లేనట్టూ, అతడు అంతవరకు భావిస్తూవచ్చాడు. కాని, అదంతా భ్రమ మాత్రమే అని, అతని కప్పుడు తోచింది. ఆ అభిప్రాయం కలగగానే, దూరాన ఉన్న క్రేపులూ, గోపబాలురూకూడా, ఆయనకు, శ్రీకృష్ణుని ప్రతిరూపాలుగా గోచరించటం జరిగింది. గోపబాలు రందరూ, నీలమేఘచ్ఛాయలోనే ఉన్నారు. వా రందరికీ కుండలాలు ఉన్నై. కేయూ రాలతో, కిరీటాలతో, అందరూ అలంకృతులై ఉన్నారు. పీతాంబరాలు ధరించి, చతుర్భుజులై, శంఖ చక్ర గదా పద్మాలతో విలసిల్లుతున్నారు. శ్రీవత్సంతో కౌస్తుభంతో అందరూశోభిస్తున్నారు. భగవంతునకు భక్తు లర్పించుకునే తులసీదళమాలికలు వారిమీద భాసిస్తున్నై. అందరి ముఖాల లోనూ, చిరునవ్వుచిందులు వేస్తూఉంది. వారి కటాక్షవీక్షణలు, కన్నులపండు వుగా ఉన్నై. అందరూ అఖండానందమూర్తులై, అద్భుతతేజంతో ప్రకా శిస్తున్నారు. అదంతా చూసిన చతుర్ముఖుడు, పరవశత్వం పొందాడు. అది గ్రహించి, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుడు....

'బాలుండై చతురాననుండు తన యీ బ్రహ్మాభిమానంబునన్
లోలుండై మతి దప్పి నా మహిమ యాలోకింప నేతెంచె దా
నాలోకింపగ నెంతవా' డనుచు మాయాజాలమున్ విప్పి త
ల్లీలారూపము లెల్లదాచె నట గేళీచాతురీ ధుర్యుడై.

ఆ విధంగా మాయను తొలగించగానే, చతుర్ముఖుడు, తిరిగి బృందావనసమీపారణ్యాన్నీ, అక్కడవిహరించే క్రేపులనూ, శ్రీకృష్ణునితో క్రీడించే గోపబాలకులనూ చూశాడు అంతేకాదు.

తన కన్యములు లేక తనరారి ముమ్మొల
విభుడయ్యు గ్రేపుల వెదకువాని,
నఖిలజ్ఞుడై యొక్కడయ్యు నజ్ఞాకృతి
జెలికాండ్ర బెక్కండ్ర జీరువాని,
బహిరంత రాద్యంత భావశూన్యుండయ్యు
నంతంత నడుగుచొ ప్పరయువాని
గురు గభీరుం డయ్యు గురువులు వాఱుచు
నట్టిట్టు బాతరలాడువాని
జాతి రహితుడయ్యు జతురగోపార్భక
భావమెల్ల నచ్చుపడిన మేటి
చెలువువాని హస్త శీతాన్న కబళంబు
వాని గాంచె నపుడు వాణి మగడు.

92. చతుర్ముఖుడు—శ్రీకృష్ణస్తుతి :

ఆ లీలావిశేషమంతా చూసి చతుర్ముఖుడు విస్మయావిష్టుడైనాడు. ఆదికారణంగానే తన వాహనమైన రాయంచమీది నుంచి క్రిందికి ఉఱికి, చరచరావెళ్ళి, శ్రీకృష్ణుని చరణాబ్జాలమీద సాగిలపడ్డాడు. ఆనంద బాష్పాలతో ఆయన పాదాలను కడిగాడు. ఆ తరువాత లేచి నిలబడి, వినయపూర్వకంగా అంజలి ఘటించి, దేవదేవుడయిన ఆ నల్లనయ్యను ఇలా స్తుతించాడు.

"శంపాలతికతోడి జలదంబు కై వడి
మెఱుగుటొల్లియతోడి మేనివాని
గమనీయ మృదులాన్న కబళవేత్ర విషాణ
వేణు చిహ్నంబుల వెలయువాని,
గుంజావినిర్మిత కుండలంబులవాని
శిఖిపింఛ వేష్టిత శిరమువాని,

వనపుష్పమాలికా వ్రాత కంఠమువాని
నలినకోమల చరణములవాని
గరుణ గడలుకొనిన కడగంటివాని గో
పాలబాలుభంగి బరగువాని
నగు మొగంబువాని నను గన్నతండ్రిని
నిను భజింతు మ్రొక్కి నీరజాక్ష !

దేవదేవా ! నేను కించిజ్ఞుణ్ణి. నిన్నుగాని, నువ్వు ధరించే రూపాలనుగాని, నీ మహిమనుగాని వర్ణించగలశక్తి నాకులేదు. నీ విశ్వాకృతిని ఊహించటానికికూడా, నాబోటివారు అర్హులు కారు.

నీ విశ్వరూపాన్ని దర్శించాలనే ఉద్దేశంతో అనేకులు, జ్ఞానసిద్ధికి తపస్సుచేస్తారు. కాని, వారికి నువ్వు అగోచరుడవే అవుతావు. యథార్థానికి నీమీద భక్తికలవారికి మాత్రమే నువ్వు దర్శనీయుడ వవుతావు. ఇంతకు పూర్వం నిన్ను చేరినవారు మహానుభావులనీ, భక్తి యోగంద్వారా ఆత్మజ్ఞానాన్ని పొందిన తరువాతనే, వారు, పరమపదాన్ని పొందగలిగారనీ, నా కిప్పుడు అర్థమయింది.

భూమిమీది ఇసుక రేణువులనూ, ఆకాశంలోని నక్షత్రాలనూ లెక్కపెట్టడం, అత్యంతనిపుణులయినవారికి, కాలక్రమాన సాధ్యం కావచ్చు; కాని, విశ్వరక్షణోద్దేశంతో, వివిధగుణాల నావిష్కరిస్తూ ఉండే నీ గుణాల నెన్నటం మాత్రం, ఎంతటివారికీ ఏనాటికీ అలవికాని దనే చెప్పాలి. యథార్థానికి...

ఏవేళం గృపజూచు నెన్నడు హరి న్వీక్షింతునం చాత్మ్యుడై
నీ వెంటంబడి తొంటికర్మచయమున్ నిర్మూలముం జేయుచున్
నీవాడై తను వాఙ్మనోగతుల ని న్సేవించు విన్నాణి యో
కైవల్యాధిప లక్ష్మినుద్ధవడి దా గైకొన్నవా డీశ్వరా !
మాయలు గల్గు వారలను మాయల బెట్టెడి ప్రోఢ నిన్ను నా
మాయ గలంచి నీ మహిమ మానము జూచెదనంచు నేరమిం

జేయగబూనితిం గరుణసేయుము కావుము యోగిరాజవా
గ్గేయ దవాగ్ని దగ్ధనిత కీలము గెల్చి వెలుంగ నేర్చునే !

సర్వేశ్వరా ! నేను ఉట్టి మూఢుణ్ణి. నేనే విశ్వాని కంతటికీ ప్రభుడననీ, సృష్టి కంతటికీ కారకుణ్ణనీ ఇంతవరకు భావిస్తూవచ్చాను. ఆ విధమైన గర్వం నా కళ్ళను కప్పటం వల్లనే, సర్వప్రపంచోత్పాదన భూతుడవూ సర్వేశ్వరుడవూ అయిన నీ పట్ల, నేను, అపచారం చేయటం జరిగింది. నేను రజోగుణ ప్రధానుణ్ణి కావటంవల్లనే, ఈ అపచారానికి పాల్పడ్డాను. యథార్థానికి, నువ్వు, నారాయణుడవు. నేను, నీ నాభీకమలంలో పుట్టిన ఒకానొక పరమాణువును. నువ్వు, సకల భూతాలకూ సాక్షివి. అధీశ్వరుడవు. నేనో నీ కింకరుణ్ణి. నువ్వు...

ఎఱిగిన వారికి దోతువు
నెఱి బ్రకృతిం జేరి జగము నిర్మింపగ నా
తెఱగున రక్షింపగ నీ
తెఱగున బ్రహరింప రుద్రు తెఱగున నీశా !

పరాత్పరా ! నువ్వు దుష్టులను శిక్షించేనిమిత్తం, శిష్టులను రక్షించేనిమిత్తం, అప్పుడప్పుడు, జలచర మృగ సుర ముని నర కులాలలో జన్మిస్తూ ఉంటావు. నువ్వు యోగీశ్వరేశ్వరుడవు. నీ లీలలు, ఎక్కడ ఎప్పుడు ఏవిధంగా ఉండేది, ఎవ్వరూ గ్రహించలేరు. నీ యోగ మాయా ప్రభావంవల్లనే, నువ్వు, నానావిధరూపాలనూధరిస్తూ ఉంటావు. నీమాయను గ్రహించటం, నావంటి వానికి సాధ్యం కానేకాదు. నువ్వు అద్వితీయుడవనీ, ఆత్ముడవనీ, పురాణపురుషుడవనీ, స్వయంజ్యోతివనీ, అనంతుడవనీ, నిత్యుడవనీ, అక్షరుడవనీ గ్రహించిన జ్ఞానులుమాత్రమే, సంసారసాగరాన్ని తరించగలుగుతారు; తమలో ఉన్న నిన్ను చూడగలుగుతారు.

దేవా నీ చరణప్రసాదకణలబ్ధింగాక లేకున్న నొం
దేవెంటం జను నీ మహామహిమ నూహింపంగ నెవ్వారికిన్

నీవారై చనువారిలో నొకడనై నిన్‌గొల్చు భాగ్యంబు నా
కీవే యిప్పటి జన్మమం దయిన నొం డెం దైన నోయీశ్వరా !

పరమేశ్వరా ! ఎన్ని యజ్ఞయాగాదులుచేసినా, నిన్ను సంతృప్తి పరచటం సాధ్యం కాదు. యథార్థానికి, వేదాలుకూడా, నిన్ను వీక్షించ లేవు. అటువంటి నువ్వు, గోపగోపికాజనంపట్ల ప్రసన్నుడవైనావు. వారు నీతో నివసిస్తున్నారు. వారు పిలువగానే నువ్వు పలుకుతున్నావు. వారితో నువ్వు క్రీడిస్తున్నావు. నిజానికి నా ఈ బ్రహ్మపదంకంటె, వారిదయిన భాగ్యమే మహత్తరమైనదని నేను భావిస్తున్నాను. వారి పాదరేణువు నా శిరానసోకినా, నా జన్మకు ధన్యత చేకూరేది. కాని, ఆ అదృష్టానికి నేను నోచుకోలేదు.

నిను హింసించిన పూతనాదులకు మున్ నీమేటి సంకేత మి
చ్చిన నీకుం బుర దార పుత్ర గృహ గో స్త్రీప్రాణ దేహాదు లె
ల్లను వంచింపక యిచ్చు గోపకులకున్ లక్షింప నే మిచ్చెదో
యని సందేహము దోచుచున్నది ప్రపన్నానీకరక్షామణీ !

నాయనా ! భక్తితో నిన్ను భావించనంతవరకూ, నీది కానంత వరకూ, ఏ ప్రాణి అయినా, అంధకారంలోనే ఉండిపోతుంది. అలా ఉన్న ప్రాణులకు, దేహం ఒక కారాగారంగానూ, మోహమనేది సంకెలగానూ, అనురాగపరంపరలనేవి రిపువ్యూహాలుగానూ ఉంటై.

నువ్వు ప్రపంచాతీతుడవు. కాని, నిన్నాశ్రయించినవారికి ఆనందాన్ని చేకూర్చేనిమిత్తం, ప్రపంచాన్ని కల్పిస్తూ ఉంటావు. నీ మాయా యోగంద్వారా, అనేకమైన లీలలుచూపిస్తూఉంటావు. తండ్రీ !...

సర్వము నీవ యెఱుంగుదు
సర్వ విలోకనుడ వీవ జగదధిపతివిన్
సర్వాపరాధు నను వో
సర్వేశ యనుగ్రహింపు చనియెద నింకన్ !"

అలా ప్రార్థించి, తిరిగి శ్రీకృష్ణుని పాదాలమీదపడి, లేచి,

ఆయనకు ముమ్మారు ప్రదక్షిణంచేసి, ఆయనవద్ద సెలవు తీసుకుని, చతుర్ముఖుడు, తన నివాసానికి వెళ్ళిపోయినాడు. ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తిరిగి గోపబాలురను కలుసుకుని, క్రేపులతోసహ మందచేరుకున్నాడు.

* * *

అఘుని చంపి కృష్ణు డాప్తులు దానును
జల్దీ గుడిచి జలజసంభవునకు
జిద్విలాసమైన చెలువు సూపిన కథ
జదువ వినిన గోర్కి సంభవించు.

*93. ధేనుకాసురుడు :*

బలరామ కృష్ణులకు, శ్రీదాముడూ సుబలుడూ మొదలయిన కొందరు స్నేహితులున్నారు. వా రొకరోజున, రామ కృష్ణులను సమీపించి, అక్కడికి అనతిదూరంలో ఒక తాళవనం ఉన్నదనీ, అందులోని పళ్ళు రుచికరమయినవని చెప్పుకుంటారనీ, వాటిని తినాలని ఉన్నదనీ తెలుపుకున్నారు. అది విన్న రామ కృష్ణులు, వారి కోరికను తీర్చటానికి నిశ్చయించుకున్నారు.

కాని, ఆ వనంలో ధేనుకుడు అనే ఒక రాక్షసుడున్నాడు. వాడు, అమిత బల పరాక్రమాలు కలవాడు. గర్దభాకారుడై ఉండే ఆ ధేనుకుడు, తన బంధువులందరితోనూ అక్కడ విహరిస్తూ ఉండటంవల్ల, సామాన్యంగా, ఆ వనంలోకి ఎవరూ వెళ్ళరు. ఎవరయినా అటు వెళ్ళటం జరిగితే, వారు, తిరిగి రావటమనేది ఉండదు. ఆ ప్రాంతంలో సంచరించే వారిని, ధేనుకుడుగాని, అతని సహచరులుగాని వధించటం తథ్యం. ఆ విషయాన్నికూడా, శ్రీదామ ప్రభృతులు, రామ కృష్ణులకు విన్నవించుకున్నారు. అయినా, రామ కృష్ణులు, తమ నిర్ణయాన్ని మార్చుకోతలచలేదు.

ఆ వెంటనే, గోపబాలురతోసహా, రామ కృష్ణులు, ఆ వనంలో ప్రవేశించారు. అలా ప్రవేశించి...

తత్తరమున బలభద్రుడు
తత్తాలానోకహముల దన భుజబల సం
పత్తి గదల్చుచు గ్రక్కున
మత్తేభము భంగి బండ్లు మహిపై రాల్చెన్.

పండ్లు రాలినధ్వని చెవుల బడగానే, గర్దభాసురుడు, భీకరంగా ఓండ్ర పెడుతూ, గబగబా అక్కడికి వచ్చాడు. వచ్చి, బలరాముని రొొమ్ము మీద ఒక్కతన్ను తన్నాడు.

తన్ను తిన్న బలరాముడు, రుద్రుడయినాడు. ఆ వెంటనే, ఆయన, ధేనుకుని నాలుగుపాదాలూ కలిపి పట్టుకుని, ఎత్తి, గిరగిరా త్రిప్పి, ఆ ప్రక్కనే ఉన్న ఒక మహాతాళానికివేసి మోదాడు. దాంతో, ధేనుకుడు, నెత్తురు కక్కుకుని ప్రాణం వదిలాడు. అదే సమయంలో, అతని తాకిడివల్ల, ఆ తాళవృక్షం కూలిపోయింది. అలా కూలినవృక్షం, ప్రక్కనే ఉన్న మరొకవృక్షంమీద పడ్డది. అది కారణంగా, అదికూడా కూలిపోయింది అది పడటంవల్ల, ఆ సమీపంలో ఉన్న మరికొన్ని వృక్షాలుకూడా, సమూలంగా కూలినై. అవి కల్పించినశబ్దం విని, ధేనుకుని బంధువులందరూ, అక్కడికి పరుగుపరుగున వచ్చారు. అలా వచ్చిన రాక్షసులందరినీ, రామ కృష్ణులు, అనాయాసంగానే వధించారు.

ఆ విధంగా ఆ తాళవనం నిష్కంటకమయింది. అప్పు డక్కడ రాలిన తాటిపళ్ళ నన్నింటినీ ఏరి, ఒక పెద్దకుప్పవోసి, వాటిని, రామ కృష్ణులు, తమ స్నేహితు లందరికీ పంచిపెట్టారు. ఆరోజునుంచీ, ఆ వనం కూడా, గోపబాలురకూ గోగణానికీ విహార యోగ్యం కావటం జరిగింది.

* * *

ధేనుకుడు, తొలిజన్మలో, బలిదానవుని కుమారుడైన సాహసికుడు. అతడు, గంధమాదన పర్వతంమీద, తన కామినీజనంతో, యథేచ్ఛా విహారం చేస్తూ ఉండేవాడు.

ఆ పర్వతంమీదనే, ఒక గుహలో, దుర్వాసుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. సాహసికుని నృత్య గాన విలాసాదులు, ఆయన

ధ్యానానికి భంగంకలిగిస్తూఉండేవి. అది కారణంగా ఆయన, ఒకసారి. ఆగ్రహించుకుని, 'నువ్వు గాడిదవై పుట్టవలసింది' అని, సాహసికుని శపించాడు.

అలా శపింపబడిన సాహసికుడు, మధురా మండలంలోని తాళ వనంలో, గర్దభరూపం ధరించి ప్రవేశించాడు. ఆ వనానికి అధిపతిగా వ్యవహరించాడు. కాలక్రమాన, బలరామ కృష్ణులతో పోట్లాడి, వారి కర స్పర్శద్వారా శాపవిముక్తి పొందాడు.

## 94. కాళియుడు :

పూర్వం, సౌభరి అనే ఒక మహర్షి ఉండేవాడు. ఆయన, కొంత కాలం, కాళిందీనదిలో ఉండి ఉగ్రతపమాచరించాడు. ఆ సమయంలో, ఒక రోజున, పక్షీంద్రుడయిన గరుడుడు అక్కడకు వచ్చి, ఆ నదిలో ఉన్న జల చరేంద్రు నొకని ఒడిసి పట్టుకుని, భక్షించటం జరిగింది.

తమకు రాజైన ఆ మీను అలా మరణించటంవల్ల, మీనులన్నీ, అమిత వేదనతో హాహాకారాలు చేసినై. అది గ్రహించిన మహర్షి, తన దివ్యదృష్టి ద్వారా, అంతకుపూర్వం అక్కడ జరిగిన విషాదోదంత మంతా గ్రహించాడు. ఆ మీనులను చూసి, చాలా విచారపడ్డాడు. గరుడుని చర్యకు ఆగ్రహం పొందాడు. అది కారణంగానే, ఆ మీనులకు మేలుచేసేనిమిత్తం, పక్షీంద్రుని ఉద్దేశించి, 'ఇక నువ్వు యీ నదిలో అడుగుపెడితే, నీ తల నూరు వ్రక్కలై పోతుంది' అని శపించాడు.

సౌభరి ముని అలా శపించిన విషయం, పక్షీంద్రుడయిన గరుడునకూ, సర్పరాజైన కాళియునకూ మాత్రమే తెలుసు.

మొదట్లో, గరుడుడు, కనిపించిన పాములనల్లా పట్టి, వధించి, భక్షించేవాడు. ఆ పీడ భరించలేక, పాములన్నీ కలసి, గరుడునితో ఒక ఒడంబడిక చేసుకున్నై. ఆ ఒడంబడిక ప్రకారం, సర్పజాతి, మాసానికి ఒక పామును గరుడునకు సమర్పించటం, గరుడు డది తీసుకుని సంతుష్టుడు కావటం, జరుగుతూఉండేది.

ఆ ఒడంబడికను, గరుడుడు, అతరాలాపాటిస్తూవచ్చాడు. కాని, విషవీర్యంవల్లమదించిఉన్న కాళియుడుమాత్రం, దాన్ని, 'త్రోసిరాజ'న్నాడు. అతని మదాంధత్వం, సుపర్ణుడయిన గరుడునికూడా సరకుచేయనంతగా పెరిగింది. అది గ్రహించిన గరుడు డొకసారి, కాళియు డున్న రమణక ద్వీపానికి వెళ్ళి, ఆడినమాట తప్పటం అనుచితమనీ, అనవసర వైరానికి దిగటం అసమంజసమనీ, కాళియునకు బోధించాడు. కాని, కాళియుడు, అతని ఉపదేశాన్ని లెక్కచేయలేదు. లెక్కచేయకపోవటమే కాదు; అమితంగా అలిగి, శ్రీహరి వాహనమయిన అతణ్ణి, తన క్రూర దంష్ట్రిలతో గాయపరచటం కూడా జరిగింది.

కాళియుని చర్య, గరుడునకు, అమితమయిన కోపంకలిగించింది. ఆ వెంటనే అతను, తన ఎడమరెక్కను విచ్చి, కాళియుని, ఒక్క చరుపు చరిచాడు. ఆ దెబ్బకు, కాళియుని కళ్ళు తిరిగిపోయినై. దాంతో, అతడు, విషం కక్కుకుని, మూర్ఛితుడయినాడు.

ఆ విధంగా కాళియునకు బుద్ధిచెప్పి, గరుడుడు వెళ్ళిపోయినాడు. ఆపైన, గరుడుని కంటపడటంకూడా అపాయమే ననుకుని, కాళియుడు, రమణకద్వీపం వదలి, గరుడునకు ప్రవేశార్హతలేని యమునా నదిలో ప్రవేశించాడు. అప్పటినుంచీ అక్కడే ఉండిపోయినాడు.

అలా ఉన్న సమయంలో, ఒకసారి, ఆ పరిసరారణ్యంలో విహరిస్తున్న గోపబాలురూ గోవులూ, దాహం తీర్చుకునే నిమిత్తం, కాళిందీజలం త్రాగటం జరిగింది. కాళియుని విషవహ్ని శిఖలమూలంగా కలుషితమయిన ఆ నీటిని త్రాగటంవల్ల, గోసంఘంతో సహా, గోపబాలు రందరూ,మూర్ఛితులయినారు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వెంటనే వారిని సమీపించి, తన కటాక్షవీక్షణామృతాన్ని వారిమీద వర్షించాడు. అది కారణంగా, వారందరూ గాఢనిద్రనుంచి లేచినట్టు లేచి, ఒడ్డుకు వచ్చారు. గోవులుకూడా వారి ననుసరించినై.

కాళిందీజలం విషపూరితం కావటానికి, కాళియు డందులో ఉండ

టమే కారణమనీ, అతణ్ణి అక్కడినుంచి తొలగించి, ఆ జలాన్ని దోష రహితం చేయటం తనధర్మమనీ, అప్పుడు, శ్రీకృష్ణునకు తట్టింది. ఆవెంటనే అతడు, సమీపంలో ఉన్న ఒక కదంబవృక్ష మెక్కి, అక్కడి నుంచి, ఒక్కసారిగా ఆ నదిలోకి దూకాడు. అలా దూకటంవల్ల, ఆ మడుగు కదల బారింది. అది గ్రహించిన కాళియుడు, ఉగ్రుడైనాడు. అది తన నివాస మని తెలిసికూడా, ఎవడో ఒక గర్వపోతు, ఆ మడుగులో ప్రవేశించి ఉంటా డనుకున్నాడు. అది కారణంగానే, అతణ్ణి, తన విషాగ్నిజ్వాలలకు ఆహుతి చేయటానికి సంకల్పించుకున్నాడు ; ఆ వెంటనే, విజృంభించాడు.

అలా విజృంభించిన కాళియుడు, చరచరా కృష్ణుని సమీపించి, అతని శరీరమంతటా కరిచాడు. అది చాలదన్నట్లు, అతణ్ణి, గట్టిగా చుట్టేసు కుని, నలిపివేయటానికికూడా ప్రయత్నించాడు.

అది చూసిన గోపబాలురు అదలిపోయినారు తమ ప్రాణసఖు నకు వాటిల్లిన ఆపదను తలచుకుని, దుఃఖించి దుఃఖించి, వారిలో చాలా మంది, మూర్ఛితులుకావటంకూడా జరిగింది. ఆ పరిస్థితినంతనూ అర్థం చేసుకున్నట్టుగా, గోవులూ గోవత్సలూ, కృష్ణునిమీదనే చూపులు నిలుపు కుని, కన్నీరు కారుస్తూ, అతిదీనంగా అరవసాగినై.

ఇక్కడ ఇలా ఉండగా, మందలో, అనేకమైన ఉత్పాతాలు కనిపించినై. ఆ దుర్నిమిత్తాలు చూసిన గోపాలురూ గోపికలూ, తమప్రాణా నికి ప్రాణమయిన కృష్ణయ్యకు, తిరిగి ఏదో కీడు సంభవించి ఉంటుందని భావించారు. ఆ వెంటనే, వారందరూ, గుంపులు గుంపులుగా బయలుదేరి, అతణ్ణి వెతుక్కుంటూ వెళ్ళారు. అదంతా చూసి కూడా, బలరాముడు, ఏమీ కలవరపడలేదు. కలవరపడకపోవటమే కాదు; కృష్ణయ్యదైన మాహాత్మ్యం తెలిసినవాడుకావటంవల్ల, మందహాసం చేస్తూ, వారి ననుసరించాడు.

ఆ విధంగా, బలరామసహితులైన గోపకులూ గోపికలూ,యమునా నదిని సమీపించే సమయానికి, కృష్ణయ్య, కాళిందిమడుగులో, కాళియుని చేత

చుట్టబడి, కదలలేనిస్థితిలో ఉన్నట్టు కనిపించాడు. అతణ్ణి అలా చూడగానే, వా రందరూ, అమితంగా విలపింపసాగారు. ఆ సమయంలో, నంద యశోదలు పొందిన విచారం, ఇంతా అంతా కాదు. వారు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

"పూతనలోని విషాన్నంతనూ త్రావి హరించుకున్న నీకు యీ సర్పవిషం అజేయమయిందా తండ్రీ ! ఇది నిన్ను కఱచినప్పుడు ఎంతగా కంపించావో ! మమ్మల్ని తలచుకుని ఎంతగా విలపించావో ! విధిని, ఎంతగా తూలనాడావో ! ఇంతకూ, ఇది, మమ్మల్నెవరినైనా కఱవకుండా, నిన్నే యెందుకు కరవాల్సి వచ్చింది? యథార్థానికి, మాకు ఏ ఆపద సంభవించినా, నువ్వు దాన్ని అనాయాసంగా తొలగించేవాడివి. ఇప్పుడు, నీకు సంభవించిన యీ ఆపదనుంచి నిన్ను రక్షించే శక్తి, మాలో ఎవరికి ఉంది నాయనా! ఎవ్వరికీ లేదు. కృష్ణా...

చూడ వదేమి గారవపుజూపుల మమ్ము, సఖాలితోడ మా
టాడ వదేమి నర్మముగ, నందెలు పాదములందు మ్రోయ నే
డాడ వదేమి నర్తనము, లవ్వల మ్రోలను గోపికావళిం
గూడ వదేమి నవ్వులకు, గోపకుమారవరేణ్య చెప్పుమా !

కృష్ణా ! నువ్వే ఇలా అయితే, ఇక, మాతో, ముద్దుముద్దుగా మాట్లాడేదెవరు? మా మీదికి ఎగిరి, ప్రాకి, మా కరచరణాదులకు ధన్యత చేకూర్చే దెవరు ? ముసిముసినవ్వులతో మాముందు క్రీడిస్తూ, మా కళ్ళకు కృతార్థత కల్పించే దెవరు ? ఇక మేము 'గోపాలా! గోవిందా !' అని ఎవరిని పిలిచి, మా జిహ్వలకు చరితార్థత కల్పించుకోగలం? మా కిక దిక్కెవరు నాయనా ! నువ్వులేని ఈ లోకం మాకు దేనికి తండ్రీ"

అని, ఎంతగానో విలపించారు.

నంద యశోదల దీనాలాపాలూ, తనే తమ సర్వస్వం అనుకునే గోపికల ఆక్రందనలూ, విన్న కృష్ణయ్య, వారి హృదయాన్ని గ్రహించిన వాడు కావటంవల్ల, ఒక ముహూర్తంమాత్రమే అలాఉండి, ఆ వెంటనే, ఒక్క

సారిగా ఒళ్ళువిఱుచుకోవటానికి ప్రయత్నించాడు. దాంతో, అతణ్ణి అంత వరకూ గట్టిగా చుట్టుకుని ఉన్న కాళియుని ప్రక్కటెముకలన్నీ పటపట లాడినై. అతని పడగలు కుంచించుకుపోయినై. అతని ముక్కు రంధ్రాల నుంచి, నెత్తురు, వఱదలై పాఱింది

ఆవెంటనే, కృష్ణయ్య, అతణ్ణి, చెయ్యెత్తి చఱచాడు. ఆ పాటు భరించలేక, కాళియుడు, అతణ్ణి వదిలి పాఱిపోవటానికి ప్రయత్నించాడు. కాని, కృష్ణయ్య మాత్రం, అతణ్ణి, అలా వదలదలచుకోలేదు. వెంటనే, అతడి తోక పట్టుకుని, గిరగిరా త్రిప్పి వదిలాడు. అప్పటికే సగం చచ్చిన కాళియుడు, చేయగలదేమీ లేక, అతిదీనంగా, తలవంచుకుని, నిలబడ్డాడు. అంతలో, కృష్ణయ్య, ఒక్కసారిగా పైకెగిరి, అతని పడగలమీద నిలబడి, విచిత్రంగా నృత్యం చేయసాగాడు. అది చూసినవారు, మహాద్భుతమనుకున్నారు. కాళియుడు కూడా...

'వేలుపులైన లావుసెడి వేదన బొందుచు నా విషానల
జ్వాలలు సోకినంతటన చత్తురు నేడిదియేమి చోద్య మా
భీల విషాగ్ని హేతిచయ పీడకు నోర్చియు గ్రమ్మరంగ నీ
బాలుడు మత్ఫణాశతము భగ్నముగా వెసద్రొక్కియాడెడిన్ !'

అని, తనలోతాను వితర్కించుకోసాగాడు. ఆ పైన, 'ఇతడు సర్వచరాచర భూతేశుడయిన పరమపురుషుడుగాని, సామాన్య మానవుడుకాడు' అని నిర్ధారించుకున్నాడు. ఆ వెంటనే, 'శ్రీహరీ ! నేను నీ దాసానుదాసుణ్ణి. మదాంధీభూతుడనై, నీ పట్ల ఎంతటి అపచారమో సలిపాను. నా దోషాలను క్షమించవలసింది. నన్ను రక్షించవలసింది' అని, ఆయన శరణు కోరాడు.

ఆ విధంగా పశ్చాత్తాపతప్తుడై ఉన్న తమ భర్తపట్ల శ్రీహరిని ప్రసన్నుని చేసుకునే నిమిత్తం, కాళియుని భార్యలయిన నాగకాంతలు, శ్రీకృష్ణుని సముఖానికి వచ్చి, దండ ప్రణామాలాచరించి, ఆయన్ని ఇలా ప్రార్థించారు :

"దేవాధిదేవా ! ఇతడు నీపట్ల అపచారం చేసినమాట యథార్థమే. దుష్టనిగ్రహార్థం అవతరించిన నువ్వు, దోషాచరుడయిన ఇతణ్ణి దండించటం అన్యాయం కాదు. అసాధులయినవారు నీవల్ల శిక్షింపబడి, తమతమ పాపాలను తొలగించుకుంటారు. సర్పజాతిలో జనించిన ఇతనిపట్ల నువ్వు పూనిన క్రోధం, ఇతణ్ణి అనుగ్రహించటమేకాని అన్యంకాదు. నాయనా...

ఎట్టి తపంబు సేసెనొకో, యెట్టి సుకర్మము లాచరించెనో,
యెట్టి నిజంబు పల్కెనొకొ, యీ ఫణి పూర్వభవంబునందు,ము
న్నెట్టి మహానుభావులకు నెన్నడు జేరవగాని నీవు నే
డిట్టి వినోదలీల దలలెక్కి నటించెద వీ ఫణీంద్రుపై.

బహుకాలంబు దపంబు సేసి వ్రతముల్ పాటించి కామించి నీ
మహనీయోజ్జ్వల పాదరేణుకణ సంస్పర్శాధికారంబు శ్రీ
మహిళా రత్నము దొల్లి కాంచె, నిదె నేమం బేమియున్ లేక యీ
యహి నీ పాదయుగాహతిం బడసె నే, తత్యద్భుతం బీశ్వరా !

శ్రీహరీ ! నీ పాదపరాగం ప్రాప్తించిన ధన్యులకు అన్యవాంఛ అనేదే ఉండదు. వారికి, మహేంద్రపదవీ, బ్రహ్మపదం, ముక్తీ కూడా, అత్యల్పమైనవిగానే కనిపిస్తై. నిన్ను దర్శించలేనివారే, అణిమాది సిద్ధులనూ ఐహిక భోగాలనూ స్వర్గాది సుఖాలనూ వాంఛిస్తారు.

తండ్రీ ! నువ్వు పరమపురుషుడవు. పరమాత్ముడవు జ్ఞాన విజ్ఞాన పరిపూర్ణుడవు. నీదైన మాయకు మోహితులుకానివా రంటూ లేరు. విశ్వ సృష్టి స్థితి లయాలకు నువ్వే కారణభూతుడవు. అటువంటి నిన్ను గ్రహించటం, మాబోటివారికి సాధ్యం కాదు.

నువ్వు, భక్తజనపాలకుడవనీ, సేవకజన ఫలప్రదాతవనీ, గ్రహించిన జ్ఞానులుమాత్రమే, నిన్నాశ్రయిస్తారు; ధన్యులవుతారు. ఆ విధంగా ధన్యత్వం పొందే అర్హత, మూఢులమైన మాకు లేదు. కాని, నువ్వు కృపానిధివి. నీ కరుణా కటాక్షవీక్షణలకు అర్హులు కానివారంటూ ఉండరు. ఘోర

మైన దోషాలకు పాల్పడ్డవారు కూడా, నిన్ను స్మరించుకుని అంజలించి నంత మాత్రంలోనే, కృతార్థులు కావటం జరుగుతుంది.

ఈ కాళియుడు, బాలుడై, అజ్ఞానంవల్ల నీ పట్ల అపచారం చేశా డనిగాని, అసలు మంచివాడేననీ, ఏదో పొరపాటున దోషాచరణకు పూను కున్నాడనికాని, మేము మనవిచేసుకోవటం లేదు. ఇతడు, కళ్ళుకప్పిన గర్వంతోనే, నిన్ను హింసించాడు. అది మాకూ తెలుసు. అయినా, ఇత డిప్పుడు పశ్చాత్తాపపడుతున్నాడు. ప్రాణావశిష్టుడై ఉన్నాడు. ఇక నీ పద తాండవం ఆపనిపక్షంలో, ఇతని ప్రాణాలు ఇతణ్ణి త్యజించటం తథ్యం. ఇతణ్ణి నువ్వు నిగ్రహించావు. అది మాకూ సంతోషమే. కాని, నువ్వితణ్ణి నిర్జించటం మాత్రం మేము సహించలేము. ఇతడు తనుత్యాగం చేయటం ద్వారా, మాకు సంభవించే వైధవ్యదుఃఖాన్ని మేము భరించలేము. అది కారణంగానే, మాకు పతిభిక్ష పెట్టవలసిందని నిన్ను ప్రార్థిస్తున్నాము.

మమ్ము బెండ్లిసేయుమా ప్రాణవల్లభు
ప్రాణమిచ్చి కావు భక్తవరద ;
నీవు సేయు పెండ్లి నిత్యంబు భద్రంబు
పిన్ననాటిపెండ్లి పెండ్లి కాదు.

తండ్రీ ! ఇత డిక తన దుర్మార్గ ప్రవర్తనను వదలుకుంటాడనీ, ఇకముం దెవరినీ హింసించడనీ, మేము నీకు మాటఇస్తున్నాము. మా మాటను మన్నించవలసింది. మమ్మల్ని అనుగ్రహించవలసింది."

అలా ప్రార్థించిన భుజగసతులను, పుండరీకాక్షుడు, కరుణించాడు. వెంటనే, తన చరణ ఘట్టనం చాలించాడు; క్రిందికి దిగాడు.

ఆ విధంగా, ప్రాణేంద్రియాలను తిరిగిపొందిన పాములతేడు, నలిసిన తన తలలను సవరించుకున్నాడు. అంజలి ఘటించి, అసురారాతి సముఖాన, వినయవిధేయతలతో నిలబడ్డాడు; వదలిపోయే గొంతుతో, ఇలా విన్నవించుకున్నాడు.

''మలకలు మా ప్రచారములు మా ముఖముల్ విషవహ్ని ఘోరముల్
ఖలులము రోషజాతులము గర్వుల మే మొక మంచివారమే
నలినదళాక్ష ప్రాణులకు నైజగుణంబులు మాననేర్చునే
వెలయవె మా వికారములు వింతలె మే లొనరించి తీశ్వరా !

కృష్ణా ! వివిధభావాకారయుతమైన ఈ సృష్టికంతటికీ నువ్వే కారణభూతుడవు. మమ్మ, తామసగుణ ప్రధానులనుగా సృజించింది కూడా నువ్వే. నీ మాయ మహాద్భుతమైనది. అది, జ్ఞానులనుకూడా, అప్పుడప్పుడు మోహింపచేస్తూ ఉంటుంది. ఇక, అజ్ఞానులమైన మేము, దానికి అతీతులమై ఎలా ఉండగలం ?

నాయనా ! నువ్వు సర్వజ్ఞుడవు. నా దోషాలు నీకు తెలియనివి కావు. నే నిప్పుడు హృదయపూర్వకంగా పశ్చాత్తాపపడుతున్నాను. ఇక నన్ను శిక్షించటమో, రక్షించటమో, నువ్వే నిర్ణయించుకోవాలి. నువ్విక ఏమి చేసినా, నే నది నా భాగ్యంగానే భావిస్తాను. ఇంతకూ...

నా పుణ్యం మేమి సెప్పుదు
నీ పాదరజంబు గంటి నే సనకాదుల్
నీ పాదరజము గోరుదు
రే పదమందున్ననైన నిక మేలు హరీ !''

అలా విన్నవించుకున్న కాళియుని పలుకులు, కారుణ్యమానసుడైన శ్రీకృష్ణుని హృదయాన్ని ద్రవింపచేసినై. అది కారణంగానే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి...

'గోవర్గముతో మనుజులు
ద్రావుదు రీ మడుగునీరు దగ దిందుండన్
నీవును నీ బాంధవులును
నీ వనితలు సుతులు జనుడు నే డంబుధికిన్'

అని, శాసించాడు. అది విన్న కాళియునిలో, కాళిందిని విడిచి బయటకు

పోయినపక్షంలో గరుడుడు బ్రతుకనివ్వడేమోనన్న భయం, శ్రీకృష్ణునకు గోచరించింది. అందుకనే...

'గరుడభీతి రమణకద్వీప మొల్ల కీ
మడుగు జొచ్చి తీవు, మత్పదాబ్జ
లాంఛనములు నీ తలల నుంట జూచి, యా
పక్షిరాజు నిన్ను బట్ట డింక !

అని, అతని భీతిని తొలగించాడు. అంతే కాదు :

'ఇవె మొద లెవ్వరైన నను లీ యమునాతటినీ హ్రదంబులో
వదలక తోగి నన్ను నుపవాసముతోడ దలంచి కొల్చుచుం
గదలక దేవతాదులకుగా జలతర్పణ మాచరించినన్
సదమల చిత్తులై దురితసంఘము బాయుదు రా క్షణంబునన్'

అనికూడా వెల్లడించాడు.

ఆ విధంగా, ప్రాణదానంపొందిన కాళియుడు, ఆ వెంటనే, పత్నులతో కూడి, శ్రీకృష్ణునకు, దివ్యాంబరాలూ, మణిమయాంచిత భూషలూ సమర్పించుకుని, ఆయనను పుష్పమాలలతో అలంకరించి అర్చించాడు. అది చూసిన నంద యశోదాదులు, మాయామానవ బాలుడయిన శ్రీకృష్ణుని మహిమను గ్రహించి, అతడు తిరిగి తమకు దక్కినందుకు అమితానందం పొందారు. ఆ తరువాత, శ్రీకృష్ణుని సెలవుతీసుకుని, పుత్ర మిత్ర కళత్రాదులతో సహా, కాళియుడు, కాళిందిని వదలి, తిరిగి, రమణకద్వీపం చేరుకున్నాడు. అప్పటినుంచీ, కాళింది, విషరహితమైనదీ, మధుర సలిలపూరితమయినదీ అయి, ప్రసిద్ధికెక్కింది. భగవంతుని లీలావిలాసాలకు ఆటపట్టయినది కావటంవల్ల, అతి పవిత్రమయినదిగాకూడా భావింపబడుతూ ఉంది.

* * *

శ్రీకృష్ణునివల్ల ఆ విధంగా అనుగ్రహింపబడిన కాళియుడు, పూర్వజన్మలో, వేదశిరు డనే ఒక మునీశ్వరుడు. ఆయన, తను తపస్సు చేసుకోవటానికి తగిన స్థలంకోసం వెదకి వెదకి, వింధ్య పర్వతానికి వెళ్ళాడు.

అదే పనిమీద, అశ్వశిరుడనే మరొక మహర్షి కూడా అక్కడకు వెళ్ళటం జరిగింది. వేదశిరుడు ఆయన్ని చూసి, ఆయన ఆ ప్రాంతంలో ఉండటానికికూడా వీలులేదనీ, మరొకచోటికి పోయితీరాలనీ, గర్జించాడు.

వేదశిరుని గర్జన, అశ్వశిరుని విస్మితునిచేసింది. అది కారణం గానే, అతడు, వేదశిరుని ఉద్దేశించి, అక్కడ అంతకుపూర్వం ఎందరో మహానుభావులు తపస్సు చేసుకున్నారనీ, ఆ స్థలంమీద పరమేశ్వరునకు తప్ప ఇతరులెవరికీ అధికారం లేదనీ, అనవసరంగా తనమీద బుసలుకొట్టిన కారణాన, అతడు, సర్పమై జనించటం జరుగుతుందనీ, తెలియ పరచాడు.

ఆ మాటలు విన్న వేదశిరుడు, అశ్వశిరుని ఉట్టి వాచాలునిగా భావించాడు. తనమాటను మన్నించకుండా అతడు, కారులుకూస్తున్నాడను కున్నాడు. అది కారణంగానే, 'నువ్వు పక్షివై పుట్టవలసింది' అని, అతనికి ప్రతిశాప మిచ్చాడు.

వేదశిరుడూ అశ్వశిరుడూ కూడా మహర్షులే. వా రిద్దరి ఆశ యమూ, శ్రీహరి నారాధించటమే; ఆయన అనుగ్రహానికి పాత్రులుకావటమే. అయినా, వారు, కోపాన్ని మాత్రం వదలుకోలేకపోయినారు.

శ్రీహరి, వారి పరిస్థితిని గ్రహించాడు. గ్రహించి, వారిని సమీ పించి, మునులకు ఆగ్రహం పనికిరాదని బోధించి, వారికి పశ్చాత్తాపం కలి గించి, సర్పమైన వేదశిరుని తలమీద తనపదలాంఛన ముంచేటట్టూ, పక్షి అయిన అశ్వశిరుని, తనప్రక్కనే ఉంచుకునేటట్టూ వాగ్దానంచేసి, వారిబాధను కొంత వరకు ఉపశమింప చేశాడు.

ఆ తరువాత, వేదశిరుడు కాళియుడయినాడు. అశ్వశిరుడు గరుడు డైనాడు. వా రిద్దరికీకూడా, శ్రీకృష్ణుని అనుగ్రహం పరిపూర్ణంగానే లభించింది.

95. దవానల భక్షణం :

శ్రీకృష్ణుడు కాళియుని గర్వాన్ని హరించిననాటి రాత్రి, నందాదులు, యమునాతీరంలోనే ఉండిపోయినారు. అలా ఉండగా, అర్ధరాత్రి సమయాన, ఆ పరిసరారణ్యమంతటా దవాసలం అలముకుంది. అది, అంత కంతకు తమ సమీపానికి రావటం గ్రహించిన గోపకులూ, గోపికలూ, రామ కృష్ణుల నుద్దేశించి...

'అదె వచ్చెన్ దవవహ్ని ధూమకణ కీలాభీల దుర్వారమై
ఇదె కప్పెన్ మము నెల్లవారి నిటమీ దేలాగు రక్షింపు నీ
పదపద్మంబుల కాని యొండెఱుగ మో పద్మాక్ష యో కృష్ణ రమ్మె
క్కడ మో రామ మహా పరాక్రమ దవాగ్నిన్ వేగ వారింపవే !

అని, ఏకకంఠంతో వేడుకున్నారు. అంతే కాదు.

'నీ పాదంబులు నమ్మిన
నాపద లెక్కడివి జనుల; కిత్యుగ్ర మహా
దీపిత దావ జ్వలనము
పైబడకుండెడి విధంబు భావింపగదే !'

అనికూడా విన్నవించుకున్నారు.

అలా ఘోషించే తనవారిని కరుణించి, సర్వలోకేశ్వరుడయిన శ్రీకృష్ణుడు, తన్ను సమీపించిన ఘోర దవానలాన్ని, అతివిచిత్రంగా త్రాగేశాడు; గో గోపగణాన్ని రక్షించాడు.

96. ప్రలంబుడు :

అది జరిగిన కొంతకాలానికి, ఒకసారి, కంసుని భృత్యుడయిన ప్రలంబుడు,బృందావనానికి రావటంజరిగింది. శ్రీకృష్ణ బలరాములను అపహరించుకుపోయే ఉద్దేశంతోమాత్రమే, ప్రలంబుడు అలా వచ్చాడు. కాని, తన సోదరుడూ, తనకంటె బలాధికుడూ అయిన తృణావర్తునకే మోయ

రానివాడయిన శ్రీకృష్ణుని ఎత్తుకుపోవటం అపాయకరమనిభావించి, అతడు, బలరామ కృష్ణులను వేరుచేయటమే ఆశయంగా, ఒక గోపబాలునివేషంలో అక్కడ సంచరింపసాగాడు.

సర్వదర్శనుడయిన శ్రీకృష్ణుడు, ప్రలంబుని అభిప్రాయం గ్రహించాడు. గ్రహించి, ఏమీ తెలియనివానిమాదిరి, అతణ్ణి, తమతో ఆడుకోవటానికి రావలసిందిగా ఆహ్వానించాడు. అతణ్ణి సంహరించాలని కూడా నిర్ణయించుకున్నాడు.

శ్రీకృష్ణుని మాయోపాయాలను గురించీ, అతని విచిత్ర ప్రవర్తనను గురించీ, శక్తి సామర్థ్యాలనుగురించీ విని ఉన్నవాడుకావటంవల్ల, ప్రలంబుడు, శ్రీకృష్ణుని సమీపించటానికి సంకోచించాడు కాని, సంకోచించినట్టు కనబడటం అనుమానానికి కారణమవుతుందనీ, తన్ను శంకించిన కృష్ణుని తప్పించుకుపోవటం అసంభవమనీ భావించి, ఆతడు, 'విధిలో ఎలా ఉంటే అలా అవుతుంది' అనుకుని, గోపబాలురను సమీపించాడు. బలరామాదులుకూడా, ఆ క్రొత్తకుఱ్ఱవానికి స్వాగతం చెప్పారు.

అంతలో, శ్రీకృష్ణుడు, ఒక విచిత్రమైన ఆటను కల్పించాడు. గోపాలురను, రెండు వర్గాలుగా విభజించాడు. ఒకవర్గాన్ని తను తీసుకున్నాడు. మరొక వర్గాన్ని బలరామునకు ఒప్పచెప్పాడు. అలా విభజింపబడ్డ గోపాలురలో శ్రీదాముడు వృషభుడు మొదలయినవారు, బలుని పక్షానికి వెళ్ళారు. భద్రసేనుడు ప్రలంబుడు మొదలయినవారు, శ్రీకృష్ణుని పక్షానికి వచ్చారు.

ఆపైన, ఆ ఇరుపక్షాలవారూ, జంటలుగా ఏర్పడ్డారు. దూరంగా ఉన్న కొన్ని మహావృక్షాలను లక్ష్యంగా నిర్ణయించుకున్నారు. తలకొకరాయి తీసుకున్నారు. ఆ రాళ్ళను, తాము నిర్ణయించుకున్న లక్ష్యం తాకేటట్టు బంతిమాదిరిగా విసరటమే ఆ ఆట. అందులో ఓడిపోయినవారు, తమ కుద్దిగా నిలబడి గెల్చినవారిని, బుజాలమీద ఎక్కించుకుని, కొంతదూరం

మోసుకుపోవటం, ఆ ఆటకు సంబంధించిన నియమం అదీ, శ్రీకృష్ణుని ఏర్పాటు. అందుకు అందరూ అంగీకరించారు

అంతలో ఆట ప్రారంభమయింది. ఆ ఆటలో, కృష్ణుని జట్టు, ఓడి పోవాలని ఓడిపోవటం కూడా జరిగింది. దాని ఫలితంగా, అతని పక్షీయులు, బలరామునిపక్షాన ఉన్నవారిని మోసుకుపోవటానికి సిద్ధపడ్డారు. ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, శ్రీదాముని తన బుజాలమీద ఎక్కించుకున్నాడు. ప్రలంబుడు, బలరాముని ఎత్తుకున్నాడు. భద్రసేనుడు, వృషభునిమోశాడు.

అలా తన బుజాలమీద కూర్చున్న బలభద్రుని, ప్రలంబుడు, ఉపహరించుకుపోవాలనుకున్నాడు. ఆ వెంటనే, పరుగుతీయటం మొదలు పెట్టి, లక్ష్యాన్నిదాటి పారిపోవటానికి ప్రయత్నించాడు.

అది, బలభద్రుడు గ్రహించాడు. మందహాసం చేశాడు. ఆ మఱుక్షణంలోనే, అత డొక పర్వతం మాదిరి బరువైపోవటం, ప్రలంబుడు, అతణ్ణి మోయటానికి తన సరరూపం పనికిరాదని గ్రహించి, భీకరదైత్యాకృతి ధరించి, అతనితోసహా ఆకసానికి ఎగిరిపోసాగటం, జరిగింది.

ప్రలంబాసురుని మోసప్రవృత్తిని అప్పటికి పూర్తిగా అర్థంచేసుకున్న బలభద్రుడు, ఆ వెంటనే, తన పిడికిటి పోట్లతో అతణ్ణి పీడించసాగాడు. ఆ బాధను తట్టుకోలేక, ప్రలంబుడు, నెత్తురు కక్కుకుంటూ, పెద్ద పర్వతం మాదిరి పడిపోయినాడు. అంతలో, అతనిలోనుంచి ఒక జ్యోతి బయటకు వచ్చి, బలరామునిలో లీనమైపోయింది.

అదిచూసిన గోపకులందరూ హర్షధ్వానాలుచేశారు. శ్రీకృష్ణుడు, ఆ వెంటనే బలరాముని సమీపించి, అతణ్ణి, అమితోత్సాహంతో ఆలింగనం చేసుకున్నాడు. అప్పుడు, ఆ అన్నదమ్ములమీద, దేవతలు, కుసుమవర్షం కురిపించారు.

* * *

అలా బలరామునిచేత సంహరింపబడిన ప్రలంబుడు, హూహూ

నామక గంధర్వుని కుమారుడు, విజయుడనేవాడు; శ్రీహరి భక్తుడు. అతడు, అనుదినం, వీణ వాయించుకుంటూ, శ్రీహరిస్తోత్రం చేసుకుంటూ, వీధి వీధీ తిరిగేవాడు. అలా తిరుగుతూ ఉండే సమయంలో, అత డొకసారి, కుబేరుని ఉద్యానవనం మీదుగా వెళ్లటం జరిగింది.

ఆ వనంలోని పూలను, కుబేరుడు, చంద్రశేఖర పూజార్థం నిర్దిష్టం చేసి ఉంచాడు. అది తెలియని విజయుడు, ఆ వనంలో ప్రవేశించి, వాటి నన్నిటినీ కోసుకున్నాడు. కుబేరుడు అది గ్రహించాడు. అమితంగా విచారపడ్డాడు; ఆగ్రహించుకున్నాడు. అది కారణంగానే, అతడు, ఆ పూలను తస్కరించినవాడు దానవుడై జన్మిస్తాడని శపించటం జరిగింది.

ఆ శాప విషయం తెలుసుకుని, విజయుడు, అమితంగా పశ్చాత్తాప పడ్డాడు. వెంటనే, కుబేరుని సమీపించి, ఆయన పాదాలమీద వ్రాలాడు; తన తప్పిదాన్ని క్షమింపవలసిందిగా వేడుకున్నాడు.

విజయుని పరితాపాన్ని గ్రహించిన కుబేరుడు, తన శాపం అప్రతిహతమైనదనీ, అయినా, ద్వాపరయుగాంతాన, బలభద్రుని చేతులో అతనికి శాపవిముక్తి కలుగుతుందనీ తెలియపరచాడు.

ఆ విజయుడే ప్రలంబుడై పుట్టి, బలరాముని ముష్టిఘాతంవల్ల శాపవిముక్తుడై, పరమపదం పొందటం జరిగింది.

*97. గోసంరక్షణ :*

ఆ విధంగా ప్రలంబుడు సంహరింపబడ్డ తరువాత, గోపకుమారు లందరూ, ఆ వనంలోనే, అమితానందంతో, కొంతసేపు ఆడుకున్నారు. ఆ సమయంలో, వనాంతరాలకుపోయిన పశువులు, ఒక మహాగ్నిలో చిక్కు కోవటం, అవి కంపించి ఘోషించటం, జరిగింది. ఆ ఆర్తనాదం విన్న గోపాలురు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'నీ చుట్టాలకు నాపదల్ గలుగునే, నే మెల్ల నీవార, మ
న్యాధారంబు లెఱుంగ, మీశుడవు మా, కాభీల దావాగ్ని నే

దే చందంబున నింక దాటుదుము, మ మ్మీక్షించి రక్షింప వ
న్నా, చంద్రాభ, విపన్నులన్ శిఖివితానచ్ఛన్నులన్ ఖిన్నులన్'

అని, అతిదీనంగా విన్నవించుకున్నారు.

గోపకుల దీనాలాపాలు విన్న శ్రీకృష్ణుడు, మందహాసంతో, వారికి అభయదానం చేశాడు. అంతేకాదు. 'మీ రొకక్షణకాలం కళ్ళుమూసు కోవలసింది' అని కూడా వారిని ఆదేశించాడు. అంతే వారు కళ్ళుమూసు కున్నారు. ఆ వెంటనే, విశ్వరూపుడైన శ్రీకృష్ణుడు, తన యోగమాయా ప్రభావంద్వారా, ఆ కార్చిచ్చును ఒక్కసారిగా త్రాగేశాడు. అది గ్రహించిన గోపకులు...

'కార్చిచ్చార్చు పటుత్వము
నేర్చునె నరు డొకడు, శౌరి నేడిదె కార్చి
చ్చార్చి మనల రక్షింపగ
నేర్చె, నితం డజుడొ హరియొ నిటలాక్షుండో !'

అని, అతణ్ణి అనేకవిధాల ప్రశంసించారు. ఆ ఆనందోత్సాహంతో, తిరిగి మంద చేరుకున్నారు.

## *98.* మధుర వేణువు :

ఆ విధంగా మంద చేరుకున్న రామ కృష్ణులు, తమవారికి అమితా నందం కలిగించటం జరిగింది. అది వర్షాకాలం. వర్షర్తువు గతించగానే, శరత్కాలం ఆసన్నమయింది.

శరత్కాలంతోపాటు, బృందావనమంతటా, ఉత్సవాలు ప్రారంభ మయినై. ఆ సందర్భంలో, ఒకసారి, తమతమ ఇళ్ళలో పని పాట్లు చేసు కుంటున్న గోపికలకు, మధురాతిమధురమైన మురళీరవం వినిపించింది. ఆ వేణునాదం చెవులబడగానే, గోపికలందరూ హర్ష పులకిత శరీర లయినారు. వారి మనసు లొక్కసారిగా, ఆ వేణురవం వినిపించిన దిక్కుగా పరుగులు

తీసినై. ఆ వెంటనే, వారు, తమతమ పని పాట్లు ఒదిలిపెట్టి, జట్లుజట్లుగా ఏర్పడి, మురళీమోహనుని దర్శించుకునే నిమిత్తం, అమితోత్సాహంతో బయలుదేరి వెళ్ళారు.

అలా వెళ్ళిన గోపికలకు, వనాంతరంలో, మధురమోహనమూర్తి అయిన మాధవుడు కనిపించాడు. నెమిలిపింఛంతో, వైజయంతీమాలతో, పట్టు పుట్టంతో, దర్శనమిచ్చిన ఆ దివ్య సుందర విగ్రహానీ, అతని ప్రక్కనే నిలబడి, ఆతడు పలికిస్తున్న వేణుధ్వని నాలకిస్తూ, తన్మయులై ఉన్న బల రామాదులనూ చూసి, ఆ కన్యలు, తమజీవితాలు ధన్యమైన వనుకున్నారు; అమితానందాన్ననుభవించారు. అది కారణంగానే...

'ఓ చెలువలార వినుడీ
వాచా శతకంబు లేల వర్ణింపంగా
లోచనముల కలిమికి ఫల
మీ చెలువుర జూడగలుగు టింతియసుండీ !'

అని, వారు, పరస్పరం అనుకోవటం జరిగింది. ఆ సందర్భంలో, ఒకర్తు, గోవిందుని ఉద్దేశించి, అతని మురళిదయిన అదృష్టాన్ని అభివర్ణిస్తూ, తన స్నేహితురాలితో ఇలా అన్నది.

'ఒనరన్ ద్రవేతల కించు కేనియును లేకుండంగ గోపాల కృ
ష్ణుని కెమ్మోవి సుధారసంబు గొనుచున్, జోద్యంబుగా మ్రోయుచున్,
దన పర్వంబులు నేత్రపర్వములుగా దర్పించె, బూర్వంబునన్
వనితా యెట్టి తపంబు సేసెనొకొ యీ వంశంబు వంశంబులోన్'.

అది విన్న పడుచు నిట్టూర్చింది. ఆ వేణువుదయిన అదృష్టం తనకు లేకపోయిందే అని అమితంగా విచారపడ్డది. ఆ విచారాన్ని వ్యక్త పరచుకుంటూ...

'నా మోసంబున కెద్ది మేర వినవే నా పూర్వజన్మంబునన్
లేమా నోమును నోచుటో నకట కాళిందీ తటిన్ వేణువై

భూమిం బుట్టెదనంచు గోరదగదే బోధిల్లి యట్లైన నీ
బామం బిప్పుడు మాధవాధరసుధాపానంబు గల్గుంగదే!'
అని వాపోయింది.

ఆ పడుచుల సంభాషణ విన్న మరొకర్తు, తను పూర్వజన్మలో చేయని పుణ్యానికి వగచి లాభంలేదని నిర్ధారించుకుంది. ముందుజన్మలో అయినా, కోరిన ఫలాన్ని ప్రసాదించే పుణ్యకర్మను, ఈ జన్మలో చేయాలనుకుంది. అందుకనే, తన ఔత్సుక్యాన్ని ప్రదర్శిస్తూ...

'కాళిందీ కూలంబున
నాళీ యీ నందసుతుని యధరామృతముం
గ్రోలెడి వేణువునకు నో
మేలాగున నోమవచ్చు నెఱిగింపగదే!

అని, తన చెలిమికత్తెను వేడుకుంది.

అసలా చెలిమికత్తె, ఆమెమాట లాలకించేస్థితిలో లేదు. ఆమె, అదేపనిగా, శ్రీకృష్ణునిదిక్కు చూస్తూవుంది. చూసి చూసి, తన ప్రక్కనే ఉన్న మరొకర్తె నుద్దేశించి...

'వనితా కృష్ణుడు నల్లని
ఘన మనియున్, వేణురవము గర్జనమనియున్
మనమున దలంచి రొప్పచు
ననవరతము నెమలితుటుము లాడెడి గంటే!'

అని, తన సంభ్రమాశ్చర్యాలను ప్రదర్శించుకుంది. అది విన్న ఆమె స్నేహితురాలు, ఒక నిట్టూర్పు విడిచి, శ్రీకృష్ణుని సమీపంలో ఉన్న జంతు సంతానాన్ని ఆమెకుచూపుతూ, ఇలా అన్నది·

'కానల నుండుచున్ సరస గాన వివేకవిహీన జాతులై
వీనుల నేడు కృష్ణముఖ వేణు రవామృతధార సోకినన్

మేనులు మేతలున్ మఱచి మెత్తని చూడ్కి మృగీ మృగావళుల్
మానిని చూడవమ్మ బహుమానముచేసె కృతార్థచిత్తలై.'

ఆ పలుకులువిన్న మరొక గోపిక, వేరొకర్తుకు, అనతిదూరంలో ఉన్న గోవులను చూపుతూ...

'మమతన్ మోములు మీది కెత్తుకొని, రోమంథంబు సాలించి, హృ
త్కమలాగ్రంబుల కృష్ణు నిల్పి, మురళీగానామృతశ్రేణి క
ర్ణములం గ్రోలుచు, మేత మాని, గళితానందాశ్రులై చిత్రితో
పమలై గోవులు సూచుచున్న వవిగో పద్మాక్షి వీక్షించితే'

అని పలుకరించింది. ఆ విధంగా, ఆ గోపికలందరూ, బృందావన విహారి అయిన గోవిందుని లీలావిలాసాన్నీ ఆయన ప్రయోగించే దివ్యవేణువునూ, దాని మధురధ్వనికి పులకించి పరవశత్వం చెందిన ప్రకృతినీ అభివర్ణిస్తూ, అక్కడ చాలాసేపు ఉండిపోయినారు; తమ జీవితాలకు ధన్యత్వం సమకూర్చుకున్నారు.

*99.* వస్త్రాపహరణం :

ఆ విధంగా శ్రీకృష్ణుని ఆరాధిస్తూ, అతనిమీద అభిమానాన్నీ అనురాగాన్నీ అభివృద్ధిపరచుకుంటున్న గోపిక లొకసారి, కాత్యాయనీ వ్రత నిర్వహణకు పూనుకున్నారు. ఆ కాలంలో, వారు, ప్రతిరోజూ, అరుణోదయ సమయానికి పూర్వమే, యమునానదికి వెళ్ళేవారు. ఆ నదిలో స్నానంచేసే వారు. ఆ వెంటనే, సైకతప్రతిమ నొకదాన్ని ఏర్పరచుకుని, దానిలో, కాత్యాయనీదేవి నావాహనచేసి, ఆమెను ధూప దీప నైవేద్యాలతోనూ, పుష్పాదుల తోనూ అర్చించేవారు. అలా అర్చించి ....

'ఓ కాత్యాయని భగవతి
నీకున్ మ్రొక్కెదము నేము నీ దనుకంపన్
మా కిందఱకును వైళమ
శ్రీకృష్ణుడు మగడు గాగ జేయుము తల్లీ!'

అని, భక్తిబంధురంగా ప్రార్థించేవారు. అంతేకాదు.

'ఓ తల్లి మాకు కృష్ణుడు
చేతోవిభు డైననాడు చెలువల మెల్లన్
నేతి వసంతము లాడుచు
జాతర సేసెదము భక్తి చాతురితోడన్'

అనికూడా ఆమెకు నివేదించుకునేవారు.

అలా, వారు, ఆ వ్రతాన్ని, ఒక నెలరోజులపాటు, నియమపూర్వకంగా నిర్వహించారు. ఆ నెలరోజులూ, వారు, ఆహారాన్ని తీసుకునేవారు కాదు; మంత్రపూతమయిన జలాన్ని మాత్రమే త్రాగేవారు.

తన్ను భర్తగాపొందాలనే ఉద్దేశంతో, గోపకన్యలు ఆ వ్రతాన్ని అలా నిర్వహిస్తూఉండటం, శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి, వారిపట్ల ప్రసన్నుడయినాడు. వారి వ్రతానికి సఫలత చేకూర్చాలనుకున్నాడు.

ఆ వెంటనే, ఒకరోజున, గోపకన్యలు జలకమాడే ఉద్దేశంతో జల ప్రవేశం చేసిన సమయం గ్రహించి, అత డా నదీతీరానికి వెళ్ళాడు. వెళ్ళి, వా రా నదిఒడ్డున ఉంచిన చీర లన్నింటినీ, దొంగతనంగా తీసుకుని, ఆ సమీపంలోనేఉన్న ఒక అశోకవృక్ష మెక్కి, సవిలాసంగా కూర్చుని, వేణువు నూదటం మొదలుపెట్టాడు.

వేణురవం చెవులబడగానే, గోపికలు అటుగా చూశారు. చూడగానే, వారికి, ఆ చెట్టుమీద, ఏమీ ఎరుగనట్టు కూర్చునిఉన్న కృష్ణయ్య కనిపించాడు. అది కారణంగా, వారికి, చెప్పరాని సిగ్గేసింది. అందుకనే, వారు, తలలు వంచుకుని, మెడబంటినీటిలో మునిగిపోయినారు.

కృష్ణయ్య అది గ్రహించాడు. మందహాసం చేశాడు. నీటిలో మునిగి ఉండికూడా, తనవంకే ఓరగా చూస్తున్న గోపికల నుద్దేశించి, తన వద్దకు రావలసిందిగా వారికి సైగచేశాడు. వారి చీరలన్నింటినీ, వారు చూసేటట్టుగా, ఒకటొకటే తీసి, చేరువలో ఉన్న కొమ్మలమీద, విడివిడిగా వేయటం మొదలుపెట్టాడు.

అది చూసిన గోపికలు అతణ్ణి ఉద్దేశించి, 'కృష్ణా! మా చీరలు మాకు ఇవ్వవలసింది; మా మానాన్ని కాపాడవలసింది' అని, ప్రార్థించారు.

గోపికల పలుకులు విన్న కృష్ణయ్య చిలిపిగా నవ్వాడు. అది గ్రహించిన గోపికలు, లజ్జతోనూ, అతనిమీద ఉన్న అభిమానంతోనూ, మృదుమధురంగా ఇలా అన్నారు :

'కొంటివి మా హృదయంబులు
గొంటివి మానంబు లజ్జ గొంటివి వలువల్
గొంటి విక నెట్లు సేసెదొ
కొంటెవుగద నిన్ను నెఱిగి కొంటిమి కృష్ణా!'

అలా, తమ దీనావస్థనూ హృదయాన్నీ నివేదించుకున్న గోపికలను చూసి, శ్రీకృష్ణుడు, పకపకలాడాడు. అతడు, తమందరినీ అల్లరి చేయటానికే నిశ్చయించుకున్నాడన్న అభిప్రాయం, గోపికలకు, అప్పుడు కలిగింది. అందుకనే, వారు, ఆపైన అతడితో మర్యాదగా మాట్లాడి లాభం లేదని నిర్ణయించుకున్నారు. అది కారణంగానే...

'రాజుల నెఱుగవు బలిమిని
రాజిల్లెదు చీర లీవు రమణుల మింకన్
రాజున కెఱిగించెద మో
రాజీవ దళాక్ష నీవు రాజవె ధరకున్'

అని బెదరించారు. అది విన్న కృష్ణయ్య, మందహాసం చేశాడు. 'ఓహో! మీరు నన్నే బెదరిస్తున్నారే!' అన్నట్టు, వారివంక చూశాడు. చూసి...

'రామల్ రాజులతోడ నీపనికి నారంభింతురే యీ క్రియన్
మోమో టేమియు లేక దూఱెదరు మీ మోసంబు చింతింప రం
భో మధ్యంబుననుండి వెల్వడి వెసం బూర్ణేందు బింబాననల్
మీ మీ చీరలు వచ్చి పుచ్చుకొనుడా మీ కిచ్చెదన్ జెచ్చెరన్'

అని, వారిని ఉద్దేశించి అన్నాడు.

శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయం, గోపికలకు, అప్పుడు పూర్తిగా అర్థమయింది. అతడు తమ బెదరింపులకు లొంగడని, వారు తేల్చు కున్నారు. అంతేకాదు. అతని శరణుకోరి, అతణ్ణి స్తుతించి, మెప్పించి, ప్రసన్నుని చేసుకోవటం ఒక్కటే అప్పుడు తమ కర్తవ్యమనికూడా, వా రను కున్నారు. ఆ వెంటనే, అతణ్ణి ఉద్దేశించి ఇలా అన్నారు.

"మా వలువ లాగడంబున
నీ వేటికి బుచ్చుకొంటి నీ వల్పుడవే
నీ వెఱుగని దేమున్నది
నీ విందఱిలోన ధర్మనిరతుడవు గదే!

ఇంతుల్ తోయము లాడుచుండ మగవా రేతెంతురే వచ్చిరా
యింతల్ సేయుదురే కృపారహితులై యే లోకమందైన నీ
వింతల్ నీ తల బుట్టెగాక మఱి యేవీ కృష్ణ యోచెల్ల నీ
చెంతన్ దాసులమై చరించెదము మా చేలంబు లిప్పింపవే!

వచ్చెదము నీవు పిలిచిన
నిచ్చెద మేమైన నీకు నెటు సొరుమనినన్
జొచ్చెదము నేడు వస్త్రము
లిచ్చి మముం గరుణతోడ నేలుము కృష్ణా!"

అలా దీనాతిదీనంగా పలుకుతూ, తన్నే ఆశ్రయించిఉన్న గోపికలను విని, శ్రీకృష్ణుడు, సంతుష్టుడయినాడు. అయికూడా, అతడు, వారి దిక్కై, కొంటెగా ఇలా ప్రశ్నించాడు :

"ఏ తరుణుడు మగ డగుటకు
మీ తపములు సెప్పుడింక మీ యానలు సుం
డీ తప్పిన నీ కూరిమి
మీ తలలనె పుట్టెనోటు మేదిని లేదే!
ఎవ్వనిగని మోహించితి
రెవ్వడు మీ మానధనము లెల్ల హరించెన్

నివ్వటిలు మీకు గూరిమి
యెవ్వనిపై బలుకరాదె యే నన్యుడనే !"

ఆ విధంగా తమ హృదయాలకు చక్కిలిగింతలు పెట్టిన కృష్ణయ్యకు, ఏమని సమాధాన మివ్వాలో గోపికలకు తోచలేదు. వారు, తమలో తాము ముసిముసినవ్వులు నవ్వుకుంటూ, తలలు వంచుకుని నిలబడిపోయినారు. అది గ్రహించిన కృష్ణయ్య, వారి నుద్దేశించి...

'నా యింటికి దాసులరై
నా యాజ్ఞవహించి మీరు నడచెదరేనిన్
మీ యంబరంబు లిచ్చెద
దోయంబులు వెడలిరండు తొయ్యలులారా !'

అని, సమాధానపూర్వకంగా అన్నాడు. అంతేకాదు. 'మీరు వ్రతదీక్షలో ఉండికూడా, వివస్త్రలై స్నానం చేయటంవల్ల, వరుణదేవుని పట్ల అపచారం చేసినవారైనారు. ఆ అపచారానికి ప్రాయశ్చిత్తంగా, రెండు చేతులూ ఎత్తి నెత్తిన పెట్టుకుని, ఒంగి నమస్కరించ వలసింది' అనికూడా అన్నాడు. అదివిన్న గోపికలు కొందరు, కృష్ణయ్య సూచించినదొకటే తమ మాన సంరక్షణకు మార్గమనుకున్నారు. 'మాధవుడు మన మానాపహరణకు నిశ్చయించుకున్నాడు' అని, మరికొందరు భావించారు. ఏ దేమైనా, వారు, గత్యంతరం తోచక, అతడు సూచించిన మార్గాన్నే అనుసరించటానికి అంగీకరించారు. ఆ వెంటనే, వారు, సర్వశరణ్యుడయిన ఆ కృష్ణునే శరణుకోరి, మెల్లమెల్లగా నీటినుంచి బయటకువచ్చారు. వచ్చి, ఆయనకు అంజలించారు. అది చూసిన కృష్ణయ్య, మందహాసంచేస్తూ, వారి వలువలను వారికి ప్రసాదించాడు. అలా ఆయనద్వారా వలువలు తీసుకుని, ధరించి, ఆ గోపికలు, తమ వ్రతాన్ని నిర్విఘ్నంగా కొనసాగించుకున్నారు. ఆ తరువాత...

'చీర లపహరించి సిగ్గులు విడిపించి
పరిహసించి యెన బరగ మనకు

ఘనుడు నోము కొఱతగాకుండ మ్రొక్కించె'
ననుచు హరి నులించి రబల లెల్ల.

దాస్యయోగంలో పరిణతిపొందినవారు గోపికలు. వారికి, శ్రీకృష్ణుడు సర్వశరణ్యుడు. ఆయననే వారు ఆశ్రయించారు. ఆయన నర్చించటమే, ఆయనను సంతృప్తి పరచటమే, ఆయనను ప్రసన్నుని చేసుకోవటమే తమ జీవిత పరమావధిగా వారు భావించారు. అందుకనే, 'నీ పాదపద్మాల నాశ్రయించటం వినా మాకు గత్యంతరంలేదు. మా మనసులు ముచ్చిలించిన నీకు,మేము,మా అభిమానాన్ని కూడా అర్పించుకుంటున్నాము.సర్వజ్ఞుడవైన నీపట్ల దాపరికంతో ప్రవర్తించటం, అజ్ఞానమేకాని అన్యంకాదు. నిష్కల్మష చిత్తంతో, అనన్య భావంతో, నిన్ను చేరటమే మా అభీప్సితం. అది నెరవేర్చిన నీకు, మా నమోవాకాలు' అని, వారు, హృదయపూర్వకంగా, ఆయనకు నివేదించుకోవటం జరిగింది.

గోపికల హృదయాన్ని ఆ విధంగా గ్రహించిన కృష్ణయ్య, ఆ తరువాత, వారిని ఉద్దేశించి, 'మీరు నన్ను చేరటానికే యీ వ్రతం ఇలా చేశారని నాకు తెలుసు. అది కారణంగానే, నేను, మిమ్మల్ని అనుగ్రహించ దలచాను. నా మీద మనసు నిలుపుకున్నవారికి, విషయవాసన లేవీ ఉండవు. వైరాగ్యం సిద్ధిస్తుంది. ఇప్పుడు మీరు పొందిన మహద్భాగ్యం కూడా అదే. ఇకముందు, మీరు, నాతోనే ఉంటారు. నాతో క్రీడిస్తూఉంటారు. నా ప్రేమకు పాత్రులై పరమానందాన్ననుభవిస్తారు', అని చెప్పి, వారిని, వారి వారి ఇళ్ళకు పంపివేశాడు.

## 100. *భక్తానుగ్రహం* :

ఆ విధంగా గోపికలపట్ల ప్రసన్నుడయిన గోవిందు డొకసారి, తన భక్తురాండ్రయిన కొందరు విప్రపత్నుల ననుగ్రహించాలనుకున్నాడు. ఆ వెంటనే, ఆయన, ఆ ప్రాంతంలో ఆంగిరస సత్రం నిర్వహిస్తున్న విప్రుల వద్దకు, తన సహచరులను కొందరిని పంపాడు. అలా పంపుతూ, 'వారి

నడిగి, మా కోసం భోజనం తీసుకురావలసింది' అని ఆదేశించాడు.

శ్రీకృష్ణుని ఆదేశాన్ని శిరసావహించి, గోపబాలురు అక్కడికి వెళ్ళారు. వెళ్ళి, ఆ ప్రాంతంలో ఆలమందలను మేపుకుంటూఉన్న బల రామ కృష్ణులు అమితంగా అలసిపోయినారనీ, ఏదైనా ఆహారం, అడిగి తీసుకు రమ్మన్నారనీ, వారికి నివేదించుకున్నారు. కాని, శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్ని తెలిసినవారైకూడా, మాయావిష్టులైఉన్న ఆ విప్రులు, గోపబాలుర మాటలను నిర్లక్ష్యంచేశారు. అంతే కాదు. 'గొల్లల కోసం మే మీ సత్రాన్ని నిర్వహించటంలేదు' అనికూడా అన్నారు; వారిని అక్కడినుంచి తరిమి కొట్టారు.

అలా వెళ్ళిన గోపబాలురు, ఆ విషయాన్ని, శ్రీకృష్ణునకు నివేదించుకున్నారు. అది విన్న కృష్ణయ్య, మందహాసంచేసి, 'మీరు మరొక మారు వెళ్ళండి. వెళ్ళి, ఆ విప్రులనుకాకుండా, వారి పత్నులను కలుసు కోండి. ఆ తల్లులు, మీ కోరికను తప్పకుండా తీరుస్తారు' అని తెలియ పరచాడు.

అదివిన్న గోపబాలురు తిరిగి వెళ్ళారు. వెళ్ళి, శ్రీకృష్ణుడు తెలివినట్టుగానే, ఈమాటు, విప్రపత్నులను కలుసుకున్నారు. అలా కలుసుకుని, వారికి నమస్కరించి...

'గోవుల మేపుచు నాకొని
గోవిందుం డన్న మడిగి కొనిరం డని మ
మ్మీవేళం బుత్తెంచెను
ధీ విలసితలార రండు తెం డన్నంబుల్'

అని, విన్నవించుకున్నారు.

'గోవిందు' డన్నమాట చెవుల పడగానే, ఆ విప్రసతులు, అదో విధమైన అనిర్వచనీయానందం పొందారు. ఆ వెంటనే, భక్ష్యభోజ్యాదులన్నీ కావళ్ళకెత్తించి...

బిడ్డలు మగలును భ్రాతలు
నడ్డముచని వలదనంగ నటు దలదని మా
రొడ్డుచు జగదీశ్వరునకు
జడ్డన నన్నంబు గొనుచు జని రా సుదతుల్.

అలా వెళ్ళిన విప్రసతులు, యమునాతీరాన, ఒక అశోక వృక్షం క్రింద కూర్చునిఉన్న నల్లనయ్యను...

ఒక చెలికానిపై నొకచేయి సాచి వే
    రొకచేత లీలాబ్జ మూచువాని
గొప్పున కందని కొన్ని కుంతలములు
    సెక్కుల నృత్యంబు సేయువాని
గుఱుచ చుంగులు పుచ్చి కొమరార గట్టిన
    పసిడి వన్నియ గల పటమువాని
నొదల దిరిగిరా నలవడ జుట్టిన
    దట్టంపు బింఛెపు దండవాని
రాజితోత్పల కర్ణపూరములవాని
మహిత పల్లవ పుష్పదామములవాని
భువనమోహన నటవేషభూతివాని
గనిరి కాంతలు కన్నుల కఱవుదీర.

ఆ విధంగా కృష్ణయ్యను దర్శించుకుని, విప్రపత్నులు, మన స్తాపాన్ని ఉపశమింపచేసుకున్నారు. క్రతువులు, మంత్రతంత్రాలు, ధన ధాన్యాదులు, దేశ కాలాలు, దేవతలు, ధర్మం, అన్నీకూడా అతడే అన్న విశ్వాసంతో, అతడే సర్వేశ్వరుడన్న పరిపూర్ణభావంతో, అతణ్ణిచూసి, తన్మ యత్వం పొందారు. తమతమ హృదయాలలో అతణ్ణి నిలుపుకుని, అదో విధమైన అనుపమానందం అనుభవించారు.

అఖిలదర్శనుడైన కృష్ణయ్య అది గ్రహించాడు. వారిదైన పరమ

భక్తి, అతణ్ణి, వారిపట్ల ప్రసన్నునిగా చేసింది. అది కారణంగానే, అతడు, సంతుష్ట చిత్తంతో, వారిని ఉద్దేశించి...

'కాంతారత్నములార మీ గృహములం గల్యాణమే, యేమి గా
వింతున్ మీ, కిటు రండు, మమ్ము నిచటన్ వీక్షింప నేతెంచినా
రెంతో వేడుకతో, నెఱుంగుదుము, నిర్వైతుస్థితిన్ నన్ను ధీ
మంతుల్ మీ క్రియ జేరి కందురుగదా, మత్సేవలన్, సర్వమున్'

అని, పరామర్శపూర్వకంగా ఉద్బోధించాడు. ఆ తరువాత, వారు తెచ్చిన భక్ష్యాదుల నన్నింటినీ కోరి తీసుకుని, అందరితోపాటు ఆరగించాడు. అనంతరం, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు :

"మీరు సర్వాశలూ విసర్జించి, నన్ను చూడటానికి వచ్చారు. అది కారణంగా, మీకు, త్వరలోనే శుభం చేకూరుతుంది.

నన్ను కీర్తించటంవల్ల, ధ్యానించటంవల్ల, దర్శించటంవల్ల, నా కథలను ఆకర్ణించటంవల్ల, మీకు, కర్మక్షయ మవుతుంది; బంధ విమోచనం కలుగుతుంది.

వివేకులయినవారుమాత్రమే నన్ను ఆత్మనిగానూ, ప్రియుని గానూ గ్రహించగలుగుతారు. అది కారణంగానే, వారు, మనస్సును నామీద నిలుపుకుని, నిరంతర భక్తిభావంతో, నన్ను ఉపాసిస్తారు ; తద్వారా కృతార్థులవుతారు. ఆ అదృష్టమే, ఇప్పుడు మీకు కలిగింది. కాలక్రమాన, మీరు నన్ను చేరుకుంటారు. అందుకు సందేహ మేమీ లేదు."

ఆ విధంగా తమ స్త్రీలపట్ల శ్రీకృష్ణుడు ప్రసన్నుడు కావటం, విప్రులకు కనువిప్పు అయింది. సర్వలోకేశ్వరుడయిన శ్రీకృష్ణుని, సామాన్య మానవునిగా, తాము, అంతవరకు భావించటం జరిగింది. అది, తమ గర్వానికి మూలమైన అజ్ఞాన చిహ్నమని, వారు, అప్పుడు గ్రహించారు. భగవంతునిమీద తమ స్త్రీలకు కుదిరిన భక్తి, తమకు కుదురకపోవటం, తమ దురదృష్టంగా వారు భావించారు. అందుకనే...

'కటకట మోసపోయితిమి కాంతలపాటియు బుద్ధిలేదు నే
డిట హరి గానఁబోనెఱుగ మేము దురాత్ముల మేము కల్మషో
ద్భటులము విష్ణుదూరగుల ప్రాజ్ఞత లేల తపంబు లేల ప
ర్యటనము లేల శీలములు యాగములున్ మఱియేల కాల్పనే!'

అని, తమ్ము తాము దూషించుకున్నారు. అంతేకాదు.

'జప హోమాధ్యయనంబులు
దపములు వ్రతములును లేని తరుణులు హరి స
త్కృప బడసి, రన్ని గలిగియు
జపలత బొందితిమి; భక్తి సలుపమి నకటా !'

అని, అమితంగా విచారపడ్డారు. ఆ సందర్భంలోనే...

'సుర గురులగు యోగీంద్రుల
నరుదుగ మోహితుల జేయు హరిమాయ మమున్
నరగురుల మూఢ విప్రుల
నురవడి మోహితుల జేయనోపకయున్నే !'

అనుకుని, ఎంతగానో పశ్చాత్తాపపడ్డారు. ఆ పశ్చాత్తాపంమూలంగా, వారికి, జ్ఞానోదయమయింది. అది కారణంగానే, వారు...

'క్రతువుల్ ధర్మము మంత్ర తంత్ర ధనముల్ కాలంబు దేశంబు దే
వతయున్ వహ్నులు మేదినీసురులు నెవ్వా దట్టి సర్వేశు డీ
క్షితి రక్షింప జనించినా డెఱుగ మాశ్రీభర్తకుం గర్తకుం
గుతలోద్ధర్తకు మేము మ్రొక్కెదము రక్షోనాథ సంహర్తకున్'

అని, భక్తిపూర్వకంగా ఆయనకు అంజలించారు. ఆ వెంటనే, వారికి, ఆ పురాణపురుషుని దర్శించుకోవాలనీ, తమ అపరాధాన్ని క్షమించవలసిందిగా ఆయన్ని అర్థించాలనీ అనిపించింది. కాని, కంసరాజేంద్రునకు భయపడి, వా రాపని చేయలేకపోయినారు; తమతమ ఇళ్ళలోనే ఉండి, ఆ భగవంతుని భజించుకోసాగారు.

## 101. మహేంద్ర గర్వభంగం:

ఒకసారి, నందాది గోపవృద్ధులు, ఇంద్రయాగం చేయాలని సంకల్పించుకున్నారు. అఖిలదర్శనుడయిన కృష్ణయ్య, వారి అభిప్రాయం గ్రహించాడు. గ్రహించి, నందుని ఉద్దేశించి...

'నాయనా ! ఈ యాగానికి ఈశ్వరుడెవరు ? ఆయనను మెప్పించటంవల్ల మనకు కలిగే ప్రయోజనమేమిటి ? అసలిది ఇలా చెయ్యాలని ఎవరు చెప్పారు?' అని, ఏమీ ఎరుగనట్టుగా అడిగాడు. అతనికి సమాధానంగా, నందుడు, యిలా అన్నాడు.

"బాబూ ! ఈ యాగానికి మహేంద్రుడు అధిపతి. అతణ్ణి అర్చించటం ద్వారా, అతడు మనపట్ల ప్రసన్నుడు కావటం, తన అధీనంలో ఉన్న మేఘ బృందాన్ని, మన దిక్కుగా పంపి, వాటిని మన నేల మీద వర్షింపచేయటం, జరుగుతుంది. ఆ మేఘాలు వర్షించటంవల్లనే, మన భూమి నిండా, పచ్చిక పెరుగుతుంది. ఆ పచ్చికను తిని, పశువులు జీవిస్తై. పశువుల పాడిద్వారా, మనమూ దేవతలూ కూడా, సంతృప్తితో జీవించటం జరుగుతుంది."

సర్వజ్ఞుడయిన గోపాలునకు, ఇది, తెలియని విషయం కాదు. అయినా, ఆ సమయాన, మహేంద్రుడు, అమిత గర్వంతో వ్యవహరిస్తూ ఉండటంవల్లా, అతని గర్వాన్ని హరించటం అవసరమని, అప్పుడు, ఆయన అనుకోవటంవల్లా, నందాదుల నుద్దేశించి, ఆయన ఇలా అన్నాడు.

"ప్రపంచంలో, కర్మకు లోబడని ప్రాణి అంటూ లేదు. ప్రతి ప్రాణీ, కర్మ కారణంగానే జనించటం, వృద్ధి పొందటం, నశించటం జరుగుతూ ఉంటుంది. ఆ యా ప్రాణులనుభవించే కష్ట సుఖాలూ, ఆనంద విషాదాలూ, అన్నీ కూడా, కర్మాధీనమైనవే.

నిష్కర్ముడయినవాడు, ఈశ్వరు డొక్కడే. ఆయనే,

కర్మఫలప్రదాత. ఆయన అయినా, కర్మకారికే ఫలాన్నిస్తాడు. ఏ కర్మనూ ఆచరించకుండా ఉండేవారికి, సర్వేశ్వరుడుకూడా సహాయం చేయడు.

సర్వభూతాలూ, కర్మానుసారంగానే వ్యవహరిస్తూ ఉంటై. పూర్వకర్మవల్ల కలిగే ఫలాన్ని, ప్రతిజీవీ, అనుభవించి తీరాలి. దాన్ని తప్పించుకునే శక్తి, ఎవ్వరికీ లేదు.

దేహి, కర్మవాసనావశుడై, వివిధ దేహాలు ధరిస్తూ ఉంటాడు; విసర్జిస్తూ ఉంటాడు. అతడు కర్మకు మాత్రమే కట్టుబడి వ్యవహరిస్తూ ఉండటం జరుగుతుంది. అదికారణంగా, సర్వులకూ, కర్మ, ప్రధానమైనదిగా ఉంటుంది. అందుకనే, ఎవరి కర్మను వారు, భక్తిపూర్వకంగా ఆచరించితీరాలి. అప్పుడే, వారికి, మేలు కలుగుతుంది.

ఒక్కొక్క వర్ణానికి, ఒక్కొక్క కర్మ, అనుష్ఠేయమై ఉంది. బ్రాహ్మణులకు వేదాధ్యయనం, క్షత్రియులకు శిష్టజనరక్షణం, వైశ్యులకు వాణిజ్యం, శూద్రులకు ద్విజసేవ, అనేవి, ఉచిత కర్మలు.

అలాగే, మనకు, గోసంరక్షణ మనేది, ఉచిత కర్మ అయింది. మనం, దాన్నే అనుష్టించాలి. ఆ కర్మను త్యజించటం, మరొక కర్మను గ్రహించటం, మనకు, సమంజసంగాని, శ్రేయస్కరంగాని, కాదు.

ఉత్పత్తి స్థితి లయాలకు, వరుసగా, సత్త్వ రజ స్తమోగుణాలు కారణ మవుతై. యజ్ఞయాగాదులు, రజోగుణాత్మకమైన కర్మలు. అవే, మేఘాలు వర్షించటానికి మూలం. ఆ మేఘాలు, అన్నిచోట్లా వర్షిస్తై. అది కారణంగా, ప్రజానీకానికి, సర్వసమృద్ధి కలుగుతుంది.

మన మందలో ఆ మేఘాలు వర్షించటానికీ, మహేంద్రునికీ, సంబంధం లేదు. మనకు ఉపకారి కాని ఆ మహేంద్రుని అర్చించాలను.

కోవటం, అజ్ఞానమే కాని, అన్యం కాదు. అలా అన్నామని...

కోపింపం బనిలేదు శక్రునికి, దా గోపించుగాకేమి, సం
క్షేపం బయ్యేడి దేమి, పట్టణములున్ గేహంబులున్ దేశముల్
వ్యాపారంబులు మీకు బోయెడినె, శైలారణ్య భాగంబులన్
గోపత్వంబున నుండుచున్, మనకు, సంకోచింపగా నేటికిన్.

ఇంతకూ, మనకు ప్రాణాధారమైనది ఈ పర్వతప్రాంతం. పూజార్హమైనవి ఈ గోవులు. వీటిపట్ల, మనం, మన కృతజ్ఞతనూ భక్తినీ ప్రదర్శించుకోవటం సమంజసం. ఇంద్రయాగార్థం సమకూర్చుకున్న సంభారాలను, ఈ గోవర్ధన పర్వతపూజకూ, గో పూజకూ, వినియోగించుకునేటట్టు నిశ్చయించుకోవటం, ఆ యా పదార్థాలను, బ్రహ్మవాదులయిన బ్రాహ్మణులద్వారా హోమం చేయించటం, సర్వజీవులకూ సంతృప్తి కలిగేటట్టుగా, మృష్టాన్న సంతర్పణ చేయటం, శ్రేయస్కరం.

భూత తృప్తికి పూనుకునే సందర్భంలో, వీరు వారు అన్న భేదాన్ని పాటించటం, పాపహేతువవుతుంది. విప్రులకే విధంగా సంతుష్టి కలిగిస్తామో, అదేవిధంగా, చండాలురకూ పతితులకూ కూడా, ఆ సమయంలో, సంతుష్టిని కలిగించటం ధర్మం. గోవులను తృప్తి పరచినట్లే, కుక్కలు మొదలైన జంతువులను కూడా తృప్తిపరచటం ఉచితం. ఆ విధంగా, సమచిత్తంతో, సర్వభూత తృప్తిని కలిగించటమే, ఉత్తమోత్తమమయిన యాగ మనిపించుకుంటుంది"

అనికూడా తెలియపరచాడు.

ఆ విధమైన శ్రీకృష్ణుని అభిప్రాయం, అందరికీ నచ్చింది. ఆ వెంటనే, వారు, అతను నిర్దేశించిన విధంగా, పర్వతపూజకుపక్రమించారు. అది, శ్రీకృష్ణునకు, పరమానందం కలిగించింది. ఆ ఆనందాతిశయంతో, అతను, తన శరీరాన్ని అమితంగా పెంచుకున్నాడు. ఒక మహాపర్వతం మాదిరి, సవిలాసంగా నుంచున్నాడు. తనవారర్పించిన బలిని, ప్రేమపూర్వకంగా స్వీకరించాడు.

అది చూసిన గోపకులు, అమితానందంతో ఆడారు; పాడారు. అసదృశమయిన భక్తిభావంతో, చిన్నికృష్ణుని ముందుంచుకుని, ఆ గోవర్ధన గిరికి ప్రదక్షిణం చేశారు. తాము, కృతార్థులైనట్టుగా భావించుకున్నారు.

మహేంద్రుడు, అదంతా గ్రహించాడు. తనపూజను నివారించిన కృష్ణునిపట్లా, అతని ఆదేశానుసారం వ్యవహరించిన యాదవుల పట్లా, అతడు, ఆగ్రహించుకున్నాడు. అది కారణంగానే, తన అధీనంలో ఉన్న మేఘగణాన్ని ఉద్దేశించి...

'ఉద్యత్సంపద నమ్మి నందతనయోద్యోగంబునన్ వెఱ్ఱులై
మ ద్యాగంబు విసర్జనీయ మని రీ మర్త్యుల్ వడిన్ మీరు మీ
విద్యుద్వల్లుల గప్పి గర్జనములన్ వేధించి గోవుల్ జనుల్
సద్యోమృత్యువు బొంద జాల్గురియుడీ శౌర్యం బవార్యంబుగన్'

అని, ఆదేశించాడు; తను, తన ఐరావతంమీద, వారి ననుసరించి వెళ్ళాడు.

మహేంద్రుని ఆదేశాన్ని శిరసావహించి, మహామేఘాలు, నందుని మంద దిక్కుగా బయలుదేరినై. వాటికి, వాయుదేవుడుకూడా తోడైనాడు. అది కారణంగా, ఆ వెంటనే, బృందావనమంతా, ప్రళయకాల మేఘావృత మయింది. మరుక్షణంలోనే, అతి భీకరమయిన ఉఱుములతో, మెఱుపులతో, తీవ్రమయిన రాళ్ళవాన కురిసింది.

ఆ విధంగా జలమయమయిన మందలో ఉన్నవా రందరూ, ఆబాల గోపాలం, కలవరపడిపోయినారు. వారిలో జ్ఞాన వృద్ధులయినవారు, ఆ సమయంలో తమ్ము రక్షింపగలవాడు, నల్లనయ్య ఒక్కడే అన్న అభిప్రాయంతో, ఆయన్ని సమీపించారు. సమీపించి ..

'అక్కట వాన దోగి వ్రజ మాకులమయ్యె గదయ్య, కృష్ణ! నీ
వెక్కడనుంటి, వింతదడ వేల సహించితి, నీ పదాబ్జముల్
దిక్కుగనున్న గోపకులు దీనతవొంద, భయాపహారివై
గ్రక్కున గావ కిట్లునికి, కారుణికోత్తమ, నీకు బాడియే !

ఈ యుఱుములు నీ మెఱుపులు
నీ యశని విఘోషణములు నీ జలధారల్
నీయాన దొల్లి యెఱుగము
కూయాలింపంగదయ్య గుణరత్ననిధీ !'

అని, దీనాతిదీనంగా విన్నవించుకున్నారు.

వారి మొఱాలించిన కృష్ణయ్య, పరిస్థితినంతనూ అర్థం చేసుకున్నాడు. అందుకనే...

'త న్నొకయింత గై కొనరు, తప్పిరి, యాగము చేసిరంచు, దా
మిన్నున నుండి గోపకులమీద శిలల్ గురియించుచున్నవా,
డున్నత నిర్జరేంద్ర విభవోత్థిత గర్వనగాధిరూఢుడై,
కన్నుల గాన డింద్రు డిటు, గర్వపరుం డొరు గాననేర్చునే?'

అనుకున్నాడు. అంతే కాదు.

"మూఢత్వంవల్ల, ఇంద్రుడు, తనే లోకేశ్వరుడయినట్టు భావిస్తున్నాడు. అది, అసాధులక్షణమని గ్రహించే జ్ఞానంకూడా, అతనికి లేకుండా పోయింది. అదే, అతని అకృత్యా లన్నింటికీ కారణం. అనుచిత కర్మాచరణకు పూనుకున్న అతణ్ణి వారించటం నా ధర్మం. ఆ ధర్మ నిర్వహణకు, అతని గర్వాన్ని హరించటం అవసరం"
అని కూడా భావించాడు.

ఆ విధమైన భావంతోనే, భక్తవత్సలుడూ, సకలలోక రక్షకుడూ అయిన శ్రీకృష్ణుడు, వారికి అభయప్రదానం చేశాడు. ఆపైన వారిని ఉద్దేశించి...

"కలగకుడీ వధూజనులు, కంపము నొందకుడీ వ్రజేశ్వరుల్,
తలగకుడీ కుమారకులు, తక్కినవారలు, ఱాలవానచే
నలగకుడీ, పశువ్రజము నక్కడ నక్కడ నిల్వనీకుడీ,
మెలపున మీకు నీశ్వరుడు మే లొసగుం, గరుణార్ద్రచిత్తుడై"

అని ఉద్బోధించాడు. ఆ వెంటనే...

కిరియై ధరయెత్తిన హరి,
కర సరసిజముకుళమెత్తుగతి, త్రిభువన శం
కరకరుడై, గోవర్ధన
గిరి యెత్తెం, జక్క, నొక్క కేలన్, లీలన్.

అలా ఎత్తిన గోవర్ధన పర్వతాన్ని, ఒక గొడుగు మాదిరిగా పట్టుకుని, తన వారి నుద్దేశించి...

"రా తల్లి, రమ్ము తండ్రీ,
వ్రేతలు గోపకులు రండు, విను, డీ గర్త
క్ష్మాతలమున నుండుడు, గో
వ్రాతముతో, మీరు, మీకు వలసిన యెడలన్.

బాలుం డీతడు, కొండ దొడ్డది, మహాభారంబు సైరింపగా
జాలండోయని, దీనిక్రింద నిలువన్ శంకింపగాబోల, దీ
శైలాంభోనిధి జంతుసంయుత ధరాచక్రంబు పై పడ్డ, నా
కే లల్లాడదు, బంధులార, నిలు, డీక్రిందం, బ్రమోదంబునన్"

అని, వారిని ఆహ్వానించాడు.

ఆ పలుకులు విన్న గోపాలురు, ఆ వెంటనే, తమతమ పుత్ర మిత్ర కళత్రాదులతోనూ, గో సంపదతోనూ, నిర్భయంగా, ఆ కొండ క్రింద, తల దాచుకున్నారు. ఆకలి దప్పులనుకూడా మరచిపోయి, ఆనందంతో, శ్రీకృష్ణ కథాభివర్ణనం చేసుకుంటూ, అక్కడే ఉండిపోయినారు.

ఆ విధంగా, ఏడు రోజులు గడచినై. ఆ ఏడురోజులూకూడా, కృష్ణయ్య, ఒక్క అడుగైనా కదల్చలేదు. అది చూసిన మహేంద్రుడు, అమితాశ్చర్యం పొందాడు. విఫల మనోరథుడయినాడు. అది కారణంగానే, అతడు, మేఘాలను మరల్చుకోవటం జరిగింది. అది గ్రహించిన కృష్ణయ్య, గోపాలుర నుద్దేశించి...

'ఉడిగెను వానయు గాలియు,
వడిసెడె, నదులెల్ల బొలుప వఱద లిగిరె, గొం
దడుగున నుండక వెడలుడు,
కొడుకులు గోధం(డు సతులు గోవులు మీరల్'

అని, హెచ్చరించాడు. ఆ వెంటనే, వారు, కొండగొడుగు క్రిందినుంచి బయటకు రావటం, కృష్ణయ్య, సవిలాసంగా, ఆ గిరిని, యథాస్థానంలో ఉంచటం, జరిగింది.

* * *

గోవర్ధనగిరి, ద్రోణాచలానికి పుత్రుడని ప్రతీతి. అది, తొలుదొల్త, భారతదేశానికి పశ్చిమంగా ఉన్న శాల్మలీ ద్వీపంలో ప్రభవించింది. అది, భూదేవికి, శ్రీనాధుని కానిక కావటంవల్ల, పరమపవిత్రమైనదిగా భావింపబడుతూ ఉంది.

పూర్వం, పులస్త్యుడనే ఒక ముని ఉండేవాడు. ఆయన నివాసం వారణాసి. ఆ ముని, ఒకసారి, తీర్థాటనానికి బయలుదేరి, అనేక పవిత్ర స్థలాలు దర్శించాడు. ఆయన ఏప్రదేశం మెట్టినా, అక్కడివారు, ఆయనకు, గోవర్ధన మాహాత్మ్యాన్ని వివరిస్తూ ఉండటం జరిగింది. అది కారణంగా, ఆయన, మహోత్సుకతతో, గోవర్ధనగిరిని కూడా సందర్శించాడు.

అయిదు ఆమడల విస్తృతీ, రెండు ఆమడల ఎత్తూ, ఎనిమిది ఆమడల నిడివీ, ఉన్న, గోవర్ధనాద్రిని చూడగానే, పులస్త్యునకు, అమితానందం కలిగింది. ఆ పవిత్ర గిరీంద్రం, విశ్వేశ్వర సన్నిధానంలో ఉండటం సమంజసమని, ఆయన భావించాడు. ఆ భావంతోనే, గోవర్ధనాద్రిని, తనతో వారణాసికి రావలసిందిగా కోరాడు.

గోవర్ధన గిరీంద్రుడు, అందుకు అంగీకరించాడు కాని, అక్కడినుంచి వారణాసికి వెళ్ళేమార్గం, ఆయనకు తోచలేదు. అది గ్రహించిన పులస్త్యుడు, ఆ గిరీంద్రుని ఉద్దేశించి, 'నువ్వు నా అఱచేతులో కూర్చుంటే, నేను,

నిన్ను, అనాయాసంగా, వారణాసి చేరుస్తాను' అని చెప్పాడు.

పులస్త్యుని మాహాత్మ్యాన్ని గ్రహించిన గిరీంద్రుడు, 'సరే' నన్నాడు. ఆయన అఱచేతిలో కూర్చున్నాడు. కాని, బయలుదేరేముందు, ఆ మునిని ఉద్దేశించి, 'నువ్వు, నన్ను, ఎక్కడదించితే అక్కడే ఉండి పోతాను. అక్కడినుంచి, తిరిగి, కదలటమంటూ ఉండదు' అని, తన నియమాన్ని తెలియపరచాడు. పులస్త్యుడు అందుకు అంగీకరించాడు; బయలు దేరాడు.

అలా బయలుదేరిన పులస్త్యుడు, ఏ విధమైన అలసటా లేకుండా, గోకులందాకా వెళ్ళాడు. కాని, అక్కడికి చేరుకునేటప్పటికి, ఆయ నకు, కొంత విశ్రాంతి అవసరమనిపించింది ఆ వెంటనే, తన చేతులోఉన్న గిరీంద్రుని, ఆయన నియమాన్ని విస్మరించి, అక్కడ దించాడు. యమునా నదిలో స్నానంచేసి, బడలిక తీర్చుకున్నాడు. తిరిగివచ్చి, గిరీంద్రుని ఉద్దే శించి. 'ఇక బయలుదేరవలసింది' అన్నాడు.

పులస్త్యుని పలుకులు విని. గోవర్ధనుడు, మందహాసం చేశాడు. 'స్వామీ! నా నియమాన్ని మీరు విస్మరించారు ; కాని, నేను మాత్రం, పాటించదలచుకున్నాను' అన్నాడు.

అది విన్న పులస్త్యునకు, తన శ్రమ అంతా వ్యర్థమైపోయిందే అన్న బాధ కలిగింది. ఆ బాధలో, ఆయన, ఉచితానుచితాలనుకూడా గణించ కుండా, 'నువ్వు, ఇక్కడనుంచి కదలని పక్షంలో, క్రమక్రమంగా క్షీణించి పోతూ ఉంటావు' అని, ఆ గిరీంద్రుని శపించాడు.

ఆ గోవర్ధనగిరినే, శ్రీకృష్ణుడు, చిటికెన వ్రేలిమీద ఎత్తి, ఏడు రోజులపాటు భరించటం, అనంతరం, యథాస్థానంలో దింపటం, జరిగింది.

* * *

ఆకసంలో ఉండి అదంతాచూసిన సుర సిద్ధ గంధర్వాదులు, శ్రీకృష్ణునిమీద, విరులవానకురిపించారు. అదే సమయంలో, దేవదుందుభులు

మ్రోగినై. శంఖాలు ధ్వనించినై. తుంబురాదులు పాడారు. మందలోఉన్న యాదవులు, ఆబాలగోపాలం, శ్రీకృష్ణుని అద్భుత కృత్యాన్ని, వేనోళ్ళ కీర్తించారు; పరమానందంపొందారు. ఆ సమయంలో, కొందరు గోప వృద్ధులు నందుని సమీపించి, ఇలా అన్నారు.

"కన్నులు దెఱవని కడుచిన్ని పాపడై
 దానవి చనుబాలు ద్రాగి చంపె,

మూడవనెలనాడు ముద్దులబాలుడై
 కోపించి శకటంబు గూల దన్నె,

నేడాది కుఱ్ఱడై యెగసి తృణావర్తు
 మెడ బట్టుకొని కూల్చి మృతుని జేసె,

దల్లి వెన్నలకునై తను ఱోలగట్టిన
 గొమరుడై మద్దులు గూల నీడ్చె,

బసుల గ్రేపుల గాచుచు బకుని జీరె,
వెలగతో వత్స దైత్యుని వ్రేసి గెడపె,
సబలుడై ఖర దైత్యుని సంహరించె,
నితడు కేవల మనుజుడే; యెంచిచూడ !

అంతేకాదు. బలునిచేత ప్రలంబాసురుని చంపించాడు దవానలాన్ని, వెన్న మాదిరి మింగేశాడు. కాళియుని పడగలపయిన నిలబడి, నాట్యంచేసి, అతని గర్వాన్ని హరించాడు; అతణ్ణి కాళిందినుంచి పారద్రోలాడు. అవన్నీ అలా ఉండగా, ఏడేండ్లు నిండీ నిండని వయస్సులో, ఈ రోజున, ఈ గోవర్ధనగిరిని, గొడుగు మాదిరి ఎత్తి పట్టుకుని, మనందరినీ, మహాద్భుతంగా రక్షించాడు. అది తలచుకుంటేనే, మా ఒళ్ళు జలదరిస్తోంది.

ఓ నంద గోపవల్లభ
నీ నందను డాచరించు నేర్పరితనముల్

మానవులకు శక్యంబులె
మానవమాత్రుండె నీ కుమారుడు తండ్రీ!"

గోపకులు, తమ హృదయాన్ని ఆ విధంగా తెలుపుకుంటూ ఉండగా, నందునకు, గర్గమహర్షి పలుకులు, స్ఫురణకు వచ్చినై. వాటిని తలచుకోగానే నందుని శరీరం పులకరించింది. గర్గుని పలుకులు అమోఘమైనవనీ, అవి, కాలక్రమాన, అక్షరాలా జరిగితీరుతాయనీ, ఆయనకున్న విశ్వాసం, అప్పుడు, దృఢతరమయింది. ఆ విశ్వాసంతోనే, ఆయన, గోపకుల మహాద్భుతభావాన్ని, మందహాసంతో గ్రహించటం జరిగింది.

ఆ సమయంలోనే, తన రాజ్యమదాన్నంతనూ తొలగించుకుని, గర్వాన్ని పరిత్యజించి, మహేంద్రుడు, కారుణ్యరసప్రపూర్ణుడయిన శ్రీకృష్ణుని సందర్శనార్థం వచ్చాడు. అలావస్తూ, గోలోకం నుంచి, కామధేనువైన సురభినికూడా, వెంటతీసుకువచ్చాడు. అలా వచ్చి, సభక్తికంగా ఆయన్ని పూజించి, ఆయన చరణాబ్జాలమీద సాగిలబడి మ్రొక్కి, ఇలా ప్రార్థించాడు.

"కృష్ణా ! నువ్వు, సర్వజ్ఞుడవు. సర్వలోకేశ్వరుడవు. శుద్ధసత్త్వమయ స్వరూపుడవు.

మాయామయమైనది ఈ సంసారం. దీనితో, నీకు, యే విధమైన సంబంధం లేదు సంసారంతో సంబంధం లేనివాడవూ, నిర్గుణుడవూ, జ్ఞానమూర్తివీ, కావటంవల్లనే, నువ్వు, కామ క్రోధాదులకు అతీతుడవుగా ఉంటావు.

దుష్టశిక్షణం, శిష్టరక్షణం, అనే ధర్మాలను పాలించటానికే, నువ్వు, దండధారివవుతూ ఉంటావు. నువ్వు, ప్రపంచానికంతటికీ, పతివి. నీ అనంతశక్తిని గ్రహించలేనివారు, తమకు లభించిన అల్పాతి అల్పమయిన పదవులనూ, ఐశ్వర్యాన్నీ, భోగాలనూ, చూసుకుని, మదోన్మాదులై వ్యవహరిస్తూ ఉంటారు. వారి మదాన్ని హరించటానికీ, లోకానికి మేలు చేకూర్చటానికీ, నువ్వు, లీలావతారాలు ధరిస్తూ ఉంటావు.

నిను, బ్రహ్మాదు లెఱుంగలేరు, జడతానిష్టుండ, లోకత్రయా
వన, దుర్మాన గరిష్టుడన్, విపుల దుర్వైదుష్య భూయిష్టుడన్,
వినయ త్యాగవరిష్ఠుడన్, గుణసగర్విశ్రేష్ఠుడన్, దేవ, నీ
ఘన లీలా విభవంబు పెంపు దెలియంగా నెవ్వడన్, సర్వగా !

పరమేశ్వరా ! ఐశ్వర్యమదంవల్ల, నేను, నీ ప్రభావాన్ని గుర్తించలేకపోయినాను. నీపట్ల, అపచారంకూడా చేశాను. అది గ్రహించి, నువ్వు, నాకు తగినశాస్తి చేశావు. నావంటివారిని శిక్షించటంవల్ల గర్విష్టులయిన ఇతరులు, సన్మార్గగాములు కావటానికి అవకాశం లభిస్తుంది.

తండ్రీ! మూఢత్వం మూలంగా నేను చేసిన దోషాన్ని, నువ్విప్పుడు, అమితౌదార్యంతో క్షమించటం జరిగింది. ఇకముందు, నేను అటువంటి దోషాల నాచరించకుండా చూడవలసింది.

వాసుదేవ కృష్ణ వరద స్వతంత్ర వి
జ్ఞానమయ మహాత్మ సర్వపుణ్య
పురుష నిఖిల బీజ భూతాత్మక బ్రహ్మ
నీకు వందనంబు నిష్కలంక !"

ఆ విధంగా విన్నవించుకున్న మహేంద్రుని, శ్రీకృష్ణుడు, ఆదరపూర్వకంగా చూశాడు. చూసి...

'అమరాధీశ్వర, లక్ష్మితో దగిలి, యి ట్లంధుండవై యున్న నీ
సమదోద్రేకము ద్రుంచివైచుటకు, నీ జన్నంబు దప్పించితిం
బ్రమదశ్రీకులు, దండధారినగు నన్ భావింప, రెవ్వాని ని
క్కము రక్షింప దలంతు, వాని, నధనుం గావింతు, జంభాంతకా !'

అని, ఉపదేశయుక్తంగా మందలించాడు. ఆపైన...

'నాయాజ్ఞ సేయుచుండుము,
నీ యధికారంబునందు నిలువు, సురేంద్ర
శ్రీయుతుడవై మదింపకు,
శ్రేయంబులు గల్గు, బొమ్ము, సితకరిగమనా !'

అని, ఆశీఃపూర్వకంగా ఆదేశించాడు. అదంతా గ్రహిస్తూఉన్న కామధేనువు, శ్రీకృష్ణుని సమీపించి...

"కృష్ణా ! నువ్వు, మహాయోగివి. విశ్వాత్ముడవు. విశ్వభావనుడవు. భూభారాన్ని తొలగించటానికే అవతరించావు. మాకు, పతివీ గతివీ కూడా నువ్వే"

అంటూ, తన దివ్యక్షీరంతో, ఆయన్ని, గోవులకూ, గోపకులకూ పతిగా, అభిషేకించింది. ఆదికారణంగా, ముకుందుడు, గోవిందు డనికూడా వ్యవహరింపబడటం జరుగుతోంది

*102. వరుణలోక యాత్ర :*

ఒకసారి, అరుణోదయానికి పూర్వమే, నందుడు, యమునా నదిలో స్నానం చేయటం జరిగింది. అది, అసుర సమయం కావటంవల్ల, ఒక రాక్షసుడు, ఆయన్ని పట్టుకుని, వరుణునకు ఒప్పగించాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆ వెంటనే, వరుణలోకానికి వెళ్ళాడు.

అక్కడ, వరుణుడు, ఆయన్ని, విధ్యుక్తంగా పూజించాడు. అనంతరం, ఆయన్ని ఉద్దేశించి, సవినయంగా, ఇలా నివేదించుకున్నాడు.

"ఏ విభు పాదపద్మరతు లెన్నడు నెవ్వరు బొందలేని పెం
ద్రోవ జరింతు, రట్టి బుధతోషక, నీ వరుదెంచుటం, బ్రమో
దావృతమయ్యె జిత్తము, గృతార్థతనొందె మనోరథంబు, నీ
సేవ బవిత్రభావమున జెందె శరీరము, నేడు, మాధవా !

ఏ పరమేశ్వరున్, జగము లిన్నిటి గప్పిన మాయ గప్పగా
నోపక, పారతంత్ర్యమున నుండు, మహాత్మక, యట్టి నీకు, ను
ద్దీపిత భద్రమూర్తికి, సుధీజనరక్షణ వర్తికిం, దనూ
తాపమువాయ, మ్రొక్కెద, నుదార తపోధన చక్రవర్తికిన్.

నాయనా ! ఈ మహానుభావుడు, నీ తండ్రి అని తెలియక, నా

భటు డొకడు, ఈయన్ని యిక్కడికి తీసుకురావటం జరిగింది. అది, అతడు చేసిన అపచారమే అయినా, నా అదృష్టానికి మూలంగా, నేను భావిస్తున్నాను. అత డా పని చేయనిపక్షంలో, నాకు, నీ పాదదర్శనభాగ్యం లభించేది కాదు. మహానుభావా! నా దాసుని తప్పిదాన్ని క్షమించవలసింది. న న్ననుగ్రహించి, నీ తండ్రిని తీసుకుపోవలసింది."

ఆ విధంగా ప్రార్థించిన వరుణునిపట్ల, శ్రీకృష్ణుడు ప్రసన్ను డయినాడు. ఆ వెంటనే, ఆయన, నందునితోసహా బయలుదేరి, వ్రేపల్లె చేరుకున్నాడు.

అలా, తిరిగి మందచేరిన నందుడు, తాను, అంతకు పూర్వం చూసిన వరుణలోక విశేషాలనూ, వరుణుడు, కృష్ణయ్యను పూజించి స్తుతిం చిన వృత్తాంతాన్నీ, తనవా ండరికీ, మహాద్భుతంగా వివరించాడు. అది విన్న గోపకులందరూ, తమ కృష్ణయ్య, సాక్షాత్పరమేశ్వరుడేనని భావిం చారు ఆయన్ని అమితంగా ప్రశంసించారు; పరమానందం పొందారు.

ఆ సమయంలో, వారందరిలోను ఒకవిధమైన కొఱత, అనుకో కుండానే కలిగింది. పరమాత్ముడే అయిన తమ కృష్ణయ్య, తమకుకూడా ఆ లోకాంతరాలనూ, తననిజధామమైన వైకుంఠాన్నీ, సత్యమూ పరిశుద్ధమూ స్వప్రకాశమూ, అనంతమూ, శాశ్వతమూ, అయిన, తన దివ్యస్వరూపాన్నీ చూపిస్తే బాగుండునన్న భావం, వారిలో ఏర్పడ్డది.

కృష్ణయ్య అది గ్రహించాడు. గ్రహించి, వారి మనోవ్యథను తొలగించాలనుకున్నాడు. ఆ ఉద్దేశంతోనే...

"దేహాభిమానరూపంలో జనించే అజ్ఞానంద్వారా, ఆ అజ్ఞానంనుంచి ఉద్భవించే కోరికలద్వారా, ఆ కోరికలు కల్పించే కర్మలమూలంగా, జీవుడు, తన యథార్థ స్వరూపాన్ని గ్రహించలేకుండా ఉంటాడు. ఉచ్చ నీచజన్మల ననుభవిస్తూ, సంసారచక్రంలో పరిభ్రమిస్తూ ఉంటాడు.

అతనికి జిజ్ఞాస కలిగినప్పుడే, ఆ ఉత్తమస్థితిని రుచి చూపించటం మంచిది' అని నిర్ణయించుకుని, కరుణామూర్తి అయిన ఆ మహానుభావుడు, వారందరికీ, తన దివ్య ధామాన్నీ, దివ్య రూపాన్నీ, వ్యక్తపరచాడు.

ఆది చూసిన నందాదులు, పరమానందాన్ననుభవించారు. పరవశత్వం పొందారు. తిరిగి, ఆ వెంటనే, కలనుంచి మెలకువ పొందినట్లుగా పూర్వస్థితికి వచ్చి, తమ సముఖాన ఉన్న కృష్ణయ్యను చూసి, ఆశ్చర్య చకితులయినారు.

*103. గోపికలు – కృష్ణప్రేమ :*

శ్రీకృష్ణుని సేవించే నిమిత్తం, శ్రీహరి కరుణాకటాక్షంద్వారా, శ్రుతులు, వ్రజంలో, గోపికలై జనించటం జరిగింది.

శ్రుతుల మాదిరిగానే, మిథిలా పురంధ్రులూ, కోసల నారీ మణులూ, అయోధ్యానగరవాసినులూ, దండకారణ్యంలోఉండే మునులూ, పంచవటి ప్రాంతంలో నివసించే పుళిందాంగనలూ కూడా, వ్రజంలో జన్మించారు. వారు, అలా జనించటానికి, ఏకపత్నీవ్రతుడయిన శ్రీరామ చంద్రుడు, త్రేతాయుగంలో, వారి కిచ్చిన వరాలే మూలం.

వారి మాదిరిగానే, వైకుంఠంలో ఉండే విలాసినులూ, శ్వేత ద్వీపంలోని సుందరాంగులూ, లక్ష్మీదేవి స్నేహితురాండ్రూ, జాలంధర పురంధ్రులూ, సముద్రకన్యలూ కూడా, పూర్వం, శ్రీహరివైన అవతారాల్లో ఆయనను కామించి, కాలక్రమాన, గోపికలుగా జన్మించటం జరిగింది. అలా జన్మించిన గోపికలు, పదహారువేలమందికి పైగా ఉన్నారు.

* * *

చల్లని పండువెన్నెల వర్షిస్తున్న సమయంలో, ఒకనాటి రాత్రి, కృష్ణయ్యకు, ఆ గోపికల నానందపరచాలన్న అభిప్రాయం కలిగింది. ఆ వెంటనే, ఆయన, యమునాతీరంలో ఉన్న ఒక వనంలో ప్రవేశించాడు; వేణువు నూదసాగాడు.

మధురాతిమధురమైన వేణునాదం చెవులబడగానే, మందలోఉన్న గోపికలందరూ, తమతమ పనులు మానుకుని, మురళీమోహను డున్న చోటికి, పరుగు పరుగున వెళ్ళారు. ఆయనను దర్శించుకున్నారు. ఆయన్ని చుట్టి, పరమానందంతో క్రీడింపసాగారు.

శ్రీహరిని, అనన్యభావంతో సేవించేవారికి,ఆయన్ని ప్రసన్నుని చేసుకునే మార్గాలు అనేకమున్నా, వాటి అన్నింటికీ అనవరతస్మరణ మనేది ప్రధానం. ఆ స్మరణకు మూలం, దైన్యం కావచ్చు; దంభం కావచ్చు. ఆర్తి కావచ్చు, ఆనందం కావచ్చు. బాంధవ్యం కావచ్చు; వైరానుబంధం కావచ్చు. రాగం కావచ్చు; ద్వేషం కావచ్చు. ఎవ రేవిధంగా తన్ను తలచుకున్నా, ఆయన, వారికి, మోక్షాన్ని ప్రసాదించి తీరుతాడు.

గోపికలు, శ్రీకృష్ణుని, తమ హృదయేశ్వరునిగా భావించారు. ఆయన సన్నిధి నాశించారు. ఆయన అనురాగాన్ని వాంఛించారు. ఆయన్నే, అనన్యభావంతో ఆశ్రయించారు. అది కారణంగానే, ఆ పరమపురుషుడు, వారిపట్ల ప్రసన్నుడు కావటం జరిగింది. ఆయన దైన ప్రసన్నవదనారవిందాన్ని దర్శించుకుని, వారు, తన్మయత్వం పొందటం సంభవించింది.

శ్రీకృష్ణుని లీలలన్నిటిలోకీ మహాద్భుతమనిపించేది, ఆయన బృందావనవిహారలీల. ఆ లీలా విశేషాలను అర్థం చేసుకోవటం, సామాన్యులకు సాధ్యంకాదు. పరిశుద్ధహృదయులూ, పరిణత మనస్కులూ, పవిత్ర జీవనులూ మాత్రమే, దాన్ని అర్థం చేసుకోవటానికి అర్హు లవుతారు. శ్రీకృష్ణుని మధురమూర్తిని భావించగలవారూ, ఆయన్ని ఆశ్రయించినవారూ, అనన్యభావంతో, ఆయన్నే అర్చించేవారూ, ఆయన పట్ల జనించిన ప్రేమతో, ఉన్మాదులు కాగలిగినవారూ, ఆయన వర్షించే ప్రేమామృతాన్ని ఆస్వాదించి, అనితర దుర్లభమైన

ఆనందాన్ని పొందగలవారూ, మాత్రమే, ఆ లీలలను అర్థం చేసుకోగలుగుతారు.

గోపికలు, శ్రీకృష్ణుని ప్రేమించారు. వారిది దివ్యమైన ప్రేమ. ఆ ప్రేమకు, ప్రతిఫలాపేక్ష అనేది లేదు. అంతేకాదు. ఆ ప్రేమ ముందు, వారికి, ప్రపంచమే కనిపించేది కాదు. దానివల్ల, వారు, స్వర్గాధిపత్యాన్ని కూడా, లక్ష్యం చేసేవారుకారు. అవధిలేని పరమానందానుభవమే, వారి చరమ లక్ష్యంగా ఉండేది.

ఆ పరమానందానుభూతిని వాంఛించేవారు, ప్రప్రథమంగా, ఐహికభోగాలమీది అభిరుచిని త్యజించాలి. సిరి సంపదలమీదా, పేరు ప్రతిష్ఠలమీదా, తమకున్న వ్యామోహాన్ని, విసర్జించాలి. ప్రాపంచిక విషయవాసనాదూరులు కావాలి; సర్వసంగ పరిత్యాగులు కావాలి.

పరమాత్మని ప్రేమించి, సేవించి, ఆయన వాత్సల్యామృతాన్ని ఆస్వాదించినవారికి, ప్రపంచంతో ఏవిధమైన సంబంధం ఉండదు. వారు, ప్రపంచానికి దూరంగా ఉంటారు. ప్రపంచంకూడా వారికి దూరంగా ఉండటానికే ప్రయత్నిస్తుంది; వారిని, ఉన్మాదులను చూసినట్టు చూస్తుంది.

శ్రీకృష్ణప్రేమను మించిన మరొక మత్తుపదార్థం,ప్రపంచంలో లేనేలేదు. ఆయన్ని ప్రేమించిన వారికి, ఆయనవినా, అన్యమేదీ కనిపించదు. ప్రపంచమంతా, వారికి, కృష్ణ మయంగానే కనిపిస్తుంది. చివరకు, వారుకూడా, శ్రీకృష్ణునిమాదిరి మారిపోతారు. వారి ముఖంలో, శ్రీకృష్ణుని రూపురేఖలు గోచరిస్తై. వారి చూపులు, వెన్నదొంగచూపుల ననుకరిస్తై. అలాగే, వారి పలుకులు, కులుకులు, నడకలు, అన్నీ, శ్రీకృష్ణునివిగానే రూపొందుతై. వారి దేహంకూడా, నీలమేఘవర్ణం ధరిస్తుంది. అంతేకాదు. చివరకు, వారే శ్రీకృష్ణుడయిపోతారు.

అదే, గోపికలు సాధించుకున్న, పరిశుద్ధమూ పరిపూర్ణమూ అయిన పరిణత స్థితి.

## 104. గోపికల అనన్యాభక్తి :

గోపికలు, శ్రీకృష్ణుని మురళీరవం విన్నారు. ఆ వెంటనే, తమ ఇళ్ళూ వాకిళ్లూ వదలి, తల్లిదండ్రులూ, భర్తలూ, సోదరులూ, బంధు మిత్రులూ, వారిస్తున్నా వినకుండా, శ్రీకృష్ణుని సమీపించారు. అలా సమీపించిన గోపికల నుద్దేశించి, శ్రీకృష్ణుడు...

'వనితలు నన్ను గోరి యిట వచ్చితి, రింత, గొఱంత లేదు, మే
లొనరె, సమస్త జంతువులు నోలి ప్రియంబులు గావె నాకు, నై
నను, నిలువంగబోలదు, సనాతన ధర్మము లాడువారికిం
బెనిమిటులన్ భజించుటలు, పెద్దలు సెప్పుచునుందు రెల్లెడన్'

అని, పరామర్శపూర్వకంగా, హితోపదేశం చేశాడు. అంతేకాదు.

'ధ్యానాకర్ణన దర్శన
గానంబుల నా తలంపు గలిగిన జాలుం
బూనెదరు కృతార్థత్వము,
మానవతుల్, చనుడు మరలి, మందిరములకున్'

అని, ఆదేశించాడుకూడా.

శ్రీకృష్ణుని పలుకులు, గోపికలను, ములుకులమాదిరి బాధించినై. అతని సేవాభాగ్యాన్ని పొందే నిమిత్తం, వారు, అప్పటికే ఎన్నో త్యాగాలు చేశారు. క్షుత్పిపాసలనుకూడా లెక్కచేయకుండా, వారు, ఎన్నోదినాలు, అహోరాత్రాలు, ఆయన ధ్యానంలోనే గడిపారు. మనోవాక్కాయ కర్మలు ప్రాపంచిక విషయాలమీదికి పోకుండా నిర్బంధించి, తమ సర్వస్వాన్ని, ఆయనకే అంకితం చేసుకున్నారు. తమతమ హృదయాలలో, ఆయన మధురమూర్తినే నిలుపుకుని, అరిషడ్వర్గాలకు తమలో తావులేకుండా చేసుకున్నారు. ఆయననే పరమపురుషునిగా గ్రహించి, ఆయన మీదనే మనసును

లగ్నం చేసుకున్నారు. అన్నిటికీ మించి, ఆయన్ని, తమ ప్రాణానికి ప్రాణంగా భావించారు. ఆ పరిస్థితిలో, ఆయన ఆదేశించిన ప్రకారం, ఆయన్ని వదలిపోవటం, వారికి, అసాధ్యమనిపించింది అందుకనే, దీనాతి దీనంగా ఆయనవంక చూస్తూ...

'నీ పాదకమలంబు నెమ్మి డగ్గఱగాని
తరలిపోవంగ బాదములు రావు
నీ కరాబ్జంబులు నెఱినంటితివ గాని
తక్కినపనికి హస్తములు సొరవు
నీ వాగమృతధార నిండ గ్రోలగ గాని
చెవు లన్యభాషలు సేరి వినవు
నీ సుందరాకృతి నియతి జూడగ గాని
చూడ వన్యంబుల జూడ్కి కనులు
నిన్ను కాని పలుకనేరవు మా జిహ్వ
లొల్ల ననుచు బలుకనోడ వీవు
మా మనంబు లెల్ల మరపి దొంగిలితివి
యేమి సేయువార మింక కృష్ణ !'

అని, తమ పరిస్థితిని ఆయనకు నివేదించుకున్నారు. అంతేకాదు.

"కృష్ణా ! నిన్ను మించిన ప్రియుడు, దేహులకు, లేనేలేడు. అందుకనే, మేము నిన్ను ఆశ్రయించటం జరిగింది. నిన్ను ప్రేమించి, నీ దాస్యాన్నిమాత్రమే ఆశించే మాపట్ల, నువ్వు, ప్రసన్నుడవు కావాలి. అలా నువ్వు ప్రసన్నుడవయేవరకూ, మేము, నిన్ను వదిలేదిలేదు. అంతే కాదు. ఇకపైన, మేము, నిన్నువినా అన్యులను చేరేదిలేదు. అన్యులను చేరకపోవటమేకాదు; నీవు కాని దానిని, దేనినీ, తలచేదికూడా లేదు."

అలా పలికిన గోపికలనుచూసి, శ్రీకృష్ణుడు, మందహాసం చేశాడు, ఆ తరువాత, వారితో, ఎంతోసేపు, అక్కడ, సవిలాసంగా క్రీడిం

దాడు. ఆ సమయంలో...

మక్కువ వికసిత వదనలు
చక్కగ దను గొల్వ, హాసచంద్రికతోడన్,
మిక్కిలి మెఱసెను కృష్ణుడు,
చుక్కలగమి నడిమి పూర్ణసోముని భంగిన్.

అంతేకాదు.

సతులు దన్నుబాడ సంప్రీతి నాడుచు
నలుత నున్న వైజయంతితోడ
వనజలోచనుండు వనభూషణుండయ్యె
యువతిజనశతంబు లోలి గొలువ.

అనుపమ సౌభాగ్యం ఏదైనా, అమితానందాన్నీ, అహంభావాన్నీ, గర్వాన్నీ, కలిగిస్తుంది. అది కారణంగా, చాలామంది, పతనం పొందుతారు. ఆ విధమయిన పతనం, తన వారికి సంభవించగాదన్న ఉద్దేశంతో, శ్రీకృష్ణుడు, వారికి, సౌభాగ్యహీనుల అవస్థనుకూడా, రుచి చూపించాలనుకున్నాడు. ఆ అభిప్రాయంతోనే, వారితో క్రీడిస్తూ ఉన్నవాడు కాస్తా, అమాంతంగా, అదృశ్యుడయినాడు.

## *105. గోపికల ప్రేమోన్మాదం :*

ఆ మధురమోహనమూర్తి, అలా అంతర్హితుడు కావటం, గోపికలకు, అమితబాధాకరమయింది. వారు అతనికోసం, కాళిందీ తీరంలోఉన్న వనాంతరాలన్నీ వెదికారు. కంటికి కనిపించిన చెట్టునూ, పుట్టనూ కూడా, వారు, అతణ్ణిగురించి ప్రశ్నించారు. కాని, ఆ నల్లనయ్య జాడ, వారికి తెలియరాలేదు.

అంతలో, వారికి, ఒక మల్లెపొద కనిపించింది. వారు, ఆ సుమసుందరులను సమీపించి...

'నల్లనివాడు పద్మనయనంబులవాడు కృపారసంబు పై
జల్లెడువాడు మౌళి పరిసర్పిత పింఛమువాడు నవ్వు రా

జిల్లెడు మోమువా డొకడు చెల్వల మానధనంబు దెచ్చె నో
మల్లియలార మీ పొదలమాటున లేడుగదమ్మ చెప్ప రే!'

అని, తమ ప్రియునిగుర్తులు తెలుపుకుంటూ, అతడు చేసిన తుంటరి పనిని వివరిస్తూ, బ్రతిమాలుకున్నారు. వారి వేదన గ్రహించిన మల్లియలు, అతడు, అక్కడ, 'లేడు లే' దన్నట్టు తలలూపినై.

అక్కడినుంచి బయలుదేరి, ఆ గోపికలు, తమ కెదురయిన సుమసుందరుల నెందరినో, నందనందనుని గురించి ప్రశ్నించారు. కాని, వా రెవరిపల్లాకూడా, వారికి, శాంతి లభించలేదు. అంతలో. వారికి, తులసి ఎదురయింది. వా రామె నుద్దేశించి...

'హరి చరణములకు బ్రియవై
హరి నిను మన్నింప భద్రమందెడు తులసీ
హరి నీదెస రాడు గదా
హరి చొ ప్పెరిగించి శుభము లందీయ గదే!'

అని, వేడుకున్నారు.

తులసి, వారి పలుకులు విన్నది. శ్రీహరిమీద వారికిగల భక్తిని గ్రహించి, ముగ్ధురాలయింది. అది కారణంగానే, వారిదయిన పరమ భక్తికి, తలవంచి ప్రణమిల్లింది.

తులసికూడా, తమ ప్రియతముని జాడ తెలుపలేకపోవటం వల్ల, గోపికలు, విహ్వలచిత్తలయినారు. ఆ విహ్వలత్వంతోనే, వారు, ఉన్మాదినులుకూడా అయిపోయినారు.

అలా ప్రేమోన్మాదినులయిన గోపికలు, ఆ తరువాత, అతి విచిత్రంగా వ్యవహరించటం జరిగింది. ఆ అవస్థలో, వారందరూ, శ్రీకృష్ణుని లీలలను అనుకరించటం ప్రారంభించారు. వారిలో కొందరు, శ్రీకృష్ణునీ, మరికొందరు, పూతనాది రాక్షసులనూ, అనుకరించారు. కృష్ణుల మనుకున్న వారు, పూర్వం, ఆ నల్లనయ్య, ఆ యా దుష్టులతో ఎలా వ్యవహరించాడో

అలా, వ్యవహరించటం మొదలు పెట్టారు. కొందరు గోపికలు, రామ కృష్ణు లయినప్పుడు, మిగిలినవారు, గోవులు గానూ గోవత్సలుగానూ చరించారు. ఒక సుందరి, తన నోరు తెరచి, 'నేను మాధవుణ్ణి. నాలో ముల్లోకాలూ ఉన్నై; చూడవలసింది,' అని, మరొకర్తుకు చూపింది. ఒకతె, వెన్న దొంగిలుతున్న కృష్ణయ్య కాగా, మరొకతె, యశోదగా అతణ్ణి బంధించటానికి ప్రయత్నించింది. పడుచులు కొందరు, రాళ్ళవానకు జడిసినట్టు నటిస్తూ ఉండగా, ఒక పడుచు, వారికి అభయ మిచ్చి, శ్రీకృష్ణుడు మందరగిరి నెత్తినట్టు, తన చేలాంచలాన్ని గొడుగుమాదిరి ఎత్తటంజరిగింది. నల్లనయ్య దవానలాన్ని మింగినట్టు, ఒక కన్య, ఉట్టి బయలును కబళించటం సంభవించింది. అలాగే, కొందరు, కాళీయుని పత్నుల ననుకరించారు. అంతలో ఒకర్తు, కృష్ణుడై, వారి మొక్కు లందుకుంది.

ఆ విధంగా, చాలాసేపు, శ్రీకృష్ణుని లీలావిశేషాల ననుకరించి, గోపికలు, సంధ్యాసమయానికి, యమునాతీరం చేరుకున్నారు. అలాచేరుకుని, తమ ప్రియుడయిన శ్రీకృష్ణుని తలచుకుంటూ, అక్కడే కూర్చునిపోయినారు. ఆ సమయంలో, వారికి, శ్రీకృష్ణుని, తన హృదయపీఠం మీద సర్వదా నర్తింపచేసుకునే భూదేవి గుర్తుకు వచ్చింది అప్పుడు, వారికి, ఆమె దయిన అదృష్టమే అదృష్టమనిపించింది. అందుకనే, వా రామెనుద్దేశించి...

'కిటియై కౌగిట జేర్చెను
వటుడై వర్ధిల్లి కొలిచె వడి గృష్ణుండై
యిట పద చిహ్నము లిడె గ్రిం
దటి బాముస నేమి నోచితమ్మ ధరిత్రీ !'

అని, ఆమెను ప్రశంసించారు.

## *106. గోపికల తాపనివృత్తి :*

అంతలో, కృష్ణయ్య, అతివిచిత్రంగా, వారిమధ్యకు వచ్చాడు. ఆ జగన్మోహనుడు అలా వచ్చి దర్శనమీయటంతో, వారు, పోయిన

ప్రాణాలు ప్రాప్తించినంతగా సంతోషించారు. ఆ వెంటనే, ఆయన చుట్టూ చేరి...

ఎలయించి ప్రాణేశ యెందు బోయితి వని
తోరంపుటలుకతో దూఱె నొకతె,
జలజాక్ష నను బాసిచనగ నీ పాదంబు
లెట్లాడె నని వగనెయిదె నొకతె,
నాథ నీ వరిగిన నా ప్రాణ మున్నది
కూర్మియే యిది యని కుందె నొకతె,
ఈశ్వర నను నిన్ను నిందాక బాపెనే
పాపపు విధి యని పలికె నొకతె,

తలగిపోవునట్టి తప్పేమి చేసితి
నధిప పలుకు ధర్మ మనియె నొకతె,
ఏమి నోము ఫలమొ హృదయేశ నీ మోము
మరల గంటి ననుచు మసలె నొకతె.

అలా, తమ హృదయాన్ని విశదపరచుకున్న గోపికలనుచూసి, శ్రీకృష్ణుడు, మందహాసం చేశాడు. ప్రసన్నతాచిహ్నమయిన ఆ మంద హాసం గ్రహించి, గోపికలు, పరిపూర్ణ మనోరథలయినారు. ఆ తరువాత, వారు, తమ పైట చెంగులు పరచి, అతనికి, అక్కడే, ఒక ఆసనం ఏర్పర చారు. అప్పుడు...

పరమయోగి హృదయ భద్రపీఠంబుల
నుండు మేటి వ్రజవధూత్తరీయ
పీఠమున వసించి పెంపారె త్రిభువన
దేవి లక్ష్మి మేన దేజరిల్ల.

ఆ సమయంలోనే, శ్రీకృష్ణుడు, వారికి తాపోపశమనం కలిగించే నిమిత్తం, వారి నుద్దేశించి ఇలా అన్నాడు.

"మీకు నామీద నిత్యధ్యానం కలగటానికే, నేను, మీకు కనపడకుండా పోవటం జరిగింది. ద్రవ్యాన్ని కోల్పోయినవాడు, ఇతరచింత లేకుండా, నష్ట ద్రవ్యం మీదనే మనసు నిలుపుకుని చరిస్తాడు. అదే విధంగా, నన్ను సర్వస్వంగా భజించే మీరు, నేను కనపడకపోవటంవల్ల, నన్నే ధ్యానిస్తూ, నాకై తపించిపోయినారు. ఆ సమయంలో, మీరు, ధర్మాధర్మ చింతనుగాని స్వజన సంబంధాలనుగాని, పాటించలేదు. ఆ స్థితిని మీకు లభింపచేయటానికే, నే నలా వ్యవహరించాను.

మీరు, నామీద, అత్యంతమయిన అనురక్తిని కలిగించుకుని, నాకోసం, స్వజనాన్నీ లోకాన్నీ ధర్మాన్నీకూడా త్యజించారు. అదే. మీ అనన్యభక్తికి తార్కాణం. అది, నాకు, అమితానందం కలిగించింది. ఇక, మీకు, ఏవిధమైన కొఱతా ఉండదు."

అలా పలుకుతూ, శ్రీకృష్ణుడు, వారితో, రాసక్రీడ కుపక్రమించాడు. ఆ సమయంలో, గోపికలందరూ, వలయాకారంగా నిలబడ్డారు. అలా నిలుచున్న ఇద్దరిద్దరి నడుమ, శ్రీకృష్ణుడు నుంచున్నాడు. అది గ్రహించలేక, ఆ గోపికలు, ఎవరికి వారు, శ్రీకృష్ణుడు, తమకుమాత్రమే సన్నిహితుడుగా ఉన్నాడనిభావించటంజరిగింది. కృష్ణయ్యకూడా, అప్పుడు, ఒకరికి కనిపించినరూపంలో మరొకరికి కనిపించలేదు. ఒకరితో క్రీడించిన విధంగా మరొకరితో క్రీడించలేదు. ఆ వేడుక చూసే నిమిత్తం, ఖేచరులు, తమ స్త్రీజనంతోసహా, విమానాలమీద వచ్చి, ఆకసంలో నిలబడ్డారు. వారికే అది మహాద్భుతమనిపించింది. అప్పుడు దేవదుందుభులు మ్రోసినై. పుష్ప వర్షం కురిసింది. గంధర్వులు, ఆ లీలామానుషవిగ్రహుని కీర్తిని, గానం చేశారు.

* * *

గోపజనములందు గోపికలందును
సకల జంతులందు సంచరించు
నా మహాత్మునకు బరాంగన లెవ్వరు
సర్వమయుడు లీల సలిపెగాక.

## 107. బాలయతి కృష్ణయ్య :

ఒకసారి, గోపికలు కొందరు, బృందావనరాజ్ఞి అయిన బృందా దేవిని ఆరాధిస్తూ ఉండగా, శ్రీకృష్ణుడు, అక్కడికి వచ్చాడు. అది, అర్ధ రాత్రి సమయం. ఆ సమయంలో, అత డలా దర్శన మివ్వటం, ఆ పడు చులకు ఆశ్చర్యం కలిగించింది.

అది గ్రహించిన కృష్ణయ్య, తను, అంతకు పూర్వమే వారిని కలుసుకోదలచినట్టూ, కాని, తన గురుడైన దుర్వాసునికి శుశ్రూషచేయ టంలో ఆలస్యమైనట్టూ తెలియబరచాడు.

అది విన్న గోపికలు, అమితాశ్చర్యం పొందారు. కృష్ణయ్యకు కూడా గురువు ఉన్నాడా అనుకున్నారు. అనుకుని, 'మాకు, నీ గురువును చూడాలని ఉంది' అని, ఆయనతో అన్నారు.

ఆ మీద, కృష్ణయ్య, తన గురువు, యమున కావలిగట్టున, భాండీర వనంలో ఉన్నాడనీ, అక్కడికి పోయి చూడవచ్చుననీ చెప్పాడు. కాని, వారికి, అప్పు డది అసంభవమనిపించింది. భాండీరవనానికీ బృందా వనానికీ మధ్య కాళింది ప్రవహిస్తూఉండటమే, దానికి కారణం. అదే, వారు, కృష్ణయ్యకు విన్నవించుకున్నారు.

అది విన్న కృష్ణయ్య, మందహాసం చేస్తూ, 'మీరు, కాళిందిని సమీపించి, గోపికాలోలుడైన శ్రీకృష్ణుడు, యథార్థ బాలయతి అయిన పక్షంలో, మేము ఆయన్ని హృదయపూర్వకంగా ఆశ్రయించినవారమే అయిన పక్షంలో, మాకు త్రోవ నివ్వవలసింది, అని అడగండి. ఆమె దారి నిచ్చి తీరుతుంది' అని, సలహా ఇచ్చాడు.

ఆయన మాటను శిరసావహించిన గోపికలు, అప్పటికప్పుడే బయలుదేరి, యమునానదిని చేరుకున్నారు. వెడుతూ వెడుతూ...

'గురు సందర్శనానికి రిక్త హస్తాలతో వెళ్లరాదు.'

అన్న అభిప్రాయంతో, యాభై ఆరు పాత్రలలో భక్ష్యాదులు నింపుకుని, ఆయనకు కానుకగా తీసుకు వెళ్ళారు.

అలా కాళిందిని సమీపించిన గోపికలు, కృష్ణయ్య సూచించినట్లే, ఆమెను ఉద్దేశించి అన్నారు. ఆ వెంటనే, కాళింది, వారికి దారి నిచ్చింది. వారు, సంభ్రమాశ్చర్యాలతో, భాండీరవనం చేరుకుని, దుర్వాసుని సందర్శించుకున్నారు; సేవించుకున్నారు.

గోపికల పరిచర్యకు, దుర్వాసుడు సంతుష్టుడైనాడు. వారు తెచ్చిన భక్ష్యాదికాలను స్వీకరించాడు. క్షుధాతురుని మాదిరి, వాటి నన్నింటినీ ఆరగించాడు; వారిని ఆశీర్వదించాడు.

ఆ తరువాత, గోపికలు, ఆయనవద్ద సెలవు తీసుకుని వెళ్ళబోతూ, 'స్వామీ ! శ్రీకృష్ణుని దయవల్ల, మేము, యమునానదిని దాటి వచ్చాము. తిరిగి దాన్ని తరించి. బృందావనం చేరుకునే మార్గం, తమరు చూపవలసి ఉంది' అన్నారు.

ఆ మాటలు విన్న దుర్వాసుడు, మందహాసం చేసి, 'ఈమాటు యమునానదిని సమీపించగానే, నిత్యోపవాసీ, దోషరహితుడూ అయిన దుర్వాసుని నమ్మిన మాకు, దారి నివ్వవలసింది, అని కోరండి. ఆపైన, మీకే విధమైన అడ్డంకీ ఉండదు' అని చెప్పాడు.

గోపికలకు, దుర్వాసుని పలుకులు, అమితాశ్చర్యం కలిగించినై. 'మన కళ్ళముందు, మనం తెచ్చిన భక్ష్యాదు లన్నిటినీ భక్షించినమహర్షి, నిత్యోపవాసి ఎలా అవుతాడు' అనుకున్నారు. అయినా, ఆయన మాటమీది విశ్వాసంతో, యమునను సమీపించారు; ఆయన అడుగమన్నట్టుగా అడిగారు.

ఆ వెంటనే, యమునానది రెండుగా చీలి, వారికి దారి కల్పించింది. అమితాశ్చర్యంతో, గోపికలు, బృందావనం చేరుకున్నారు. చేరుకుని, కృష్ణయ్యను సమీపించి, ఆయన విషయంలోనూ, ఆయన గురువు విషయంలోనూ, తమకు కలిగిన సందేహాన్ని, ఆయనకు తెలుపుకున్నారు. అది విన్న కృష్ణయ్య, మందహాసం చేశాడు.

యథార్థానికి, శ్రీకృష్ణుడు, గోపికలను కలుసుకునేవాడు. వా రిచ్చిన పాలూ పెరుగూ వెన్నా మొదలైనవన్నీ స్వీకరించేవాడు. వారితో క్రీడించేవాడు. అయినా, ఆయనకు, వారి మీద మమకారం ఉండేదికాదు.

శ్రీకృష్ణుడు పరమానందస్వరూపుడు. తనదైన పరమానందాన్ని, ఇతరులకు అనుభవనీయం చేయటానికే, ఆయన, ప్రతిపనీ చేసేవాడు. 'నే నీపనిచేస్తున్నాను' అన్నభావం, లేశమాత్రంకూడా, ఆయనలో ఉండేదికాదు.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడు. ఆయన నిరాకారుడు. నిర్గుణుడు. నిరంజనుడు. అహంకార మమకారాలు, రాగ ద్వేషాలు, సుఖ దుఃఖాలు మొదలైన ద్వంద్వాలకు ఆయన అతీతుడు. ఆయనది పద్మ పత్రాంభ స్థితి. అంటే, తామరాకుమీద నీటిబొట్టు వంటి స్థితి అన్నమాట. అందుకనే, ఆయన, మాయా మోహితులకు గోపీలోలుడుగా కనిపించినా, పవిత్ర కాళిందిచేత, బాలయతిగానే భావింపబడటం జరిగింది.

దుర్వాసుని విషయంకూడా అంతే. ఆయన మహాజ్ఞాని. ఆయన ఏ కర్మ చేసినా, బ్రహ్మార్పణ బుద్ధితో చేస్తాడు. ఏ కర్మ ఫలాన్నీ, ఆయన ఆసించడు. అది కారణంగానే, ఆయనకు, నైష్కర్మ్యం సిద్ధించింది. ఆయన దైన జ్ఞానాగ్నిలో, ఆయన చేసే సర్వకర్మలూ దహించుకు పోవటం జరుగు తోంది. లోక సంగ్రహార్థం కొన్ని కర్మలు చేసినా, ఆయన, వాటిని, చేయని వాడే అవుతున్నాడు. అది కారణంగానే, ఆయన, ఎంతగా ఏది భుజించినా, నిత్యోపవాసిగానే పరిగణింపబడుతున్నాడు. ఆ మహద్రహస్యాన్నే, కృష్ణయ్య, పై సంఘటన ద్వారా, గోపికలకు బోధింపదలచాడు; బోధిం చాడు.

## *108.* సుదర్శనుడు :

ఒకసారి, నందాదులు అంబికావనంలో ఉండగా, ఒక మహా నాగం, నందుని కఱచి, అతణ్ణి మింగబోయింది. అది చూసిన గోపికలు,

హాహాకారాలు చేశారు. నందుడు కూడా, 'కృష్ణా ! కృష్ణా !' అని, అమిత వేదనతో ఆక్రందించాడు.

ఆ హాహాకారాలూ, ఆక్రందనా, విన్న గోపకులు, ఆ వెంటనే, వివిధాయుధాలతోనూ అక్కడికి వచ్చి, ఆ మహానాగాన్ని అమితంగా పీడించారు. కాని, అది, నందుని వదలలేదు.

కృష్ణయ్య అది చూశాడు. చూసి, అమితంగా ఆగ్రహించు కున్నాడు. చరచరా ఆ మహానాగాన్ని సమీపించి, తన వామపాదంతో, దాన్ని, ఒక్కతన్ను తన్నాడు.

శ్రీకృష్ణుని పాదం తగులగానే, ఆ సర్పం, తన రూపాన్ని త్యజించింది. గంధర్వరూపం ధరించింది. అలా నిజరూపాన్ని పొందిన గంధర్వుడు, ఆపైన, శ్రీకృష్ణునకు సాష్టాంగ ప్రణామం చేయటం జరిగింది. అది చూసిన వ్రజవాసు లందరూ, అమితాశ్చర్యంపొందారు. అంతలో, శ్రీకృష్ణుడు, ఆ గంధర్వుని ఉద్దేశించి...

'మండితమూర్తితో గనకమాలికతో శుభలక్షణుండవై
యుండెడి నీకు గష్టపు మహోరగదేహ మిదేల వచ్చె, నె
వ్వండవు, నామ మెయ్యది, భవంబున కెద్ది మిషంబు, నాకు నొం
డొండ యెఱుంగజెప్పుము, బుధోత్తమ, నీపని చోద్యమయ్యెడిన్'

అని, ఆదరపూర్వకంగా అడిగాడు. ఆయనకు సమాధానంగా, ఆ గంధ ర్వుడు, ఇలా తెలియపరచుకున్నాడు.

"స్వామీ ! నేను, సుదర్శను డనే ఒక విద్యాధరుణ్ణి. విద్యాధర వంశంలో జనించినా, నాకు, వినయ మనేది లేకపోయింది నా ఐశ్వర్యం, నా రూపం, నా భోగాలూ, నాకు, అమితమయిన గర్వాన్ని కలిగించినై. ఆ గర్వం, కాలక్రమాన, నా కళ్ళను కప్పేసింది.

ఆ సమయంలో, నే నొకసారి విమానం మీద పోతూ, ఒకచోట అంగిరసులయిన ఋషులను చూశాను. చూసి, వికృతాకారులైన వారిపట్ల

సానుభూతి చూపటానికిమారు, వారినిఅసహ్యించుకున్నాను ; విరగబడి నవ్వాను.

నా అనుచిత ప్రవర్తన, ఆ ఋషులకు, ఆగ్రహ కారణమయింది. ఆ వెంటనే, వారు, నన్నుద్దేశించి, 'ఏ రూపమూ సంపదా కారణంగా, నువ్వు, మమ్మల్నినిర్లక్ష్యంచేశావో, అవన్నీ నశించిపోయి, నువ్వు. పామువై పుట్టటం జరుగుతుంది' అని శపించారు.

మహర్షుల శాపానికి మారులేదు.

అది తెలిసినవాణ్ణికావటంవల్లనే, నేను, నా అనుచిత చర్యకు అమితంగా పశ్చాత్తాపపడ్డాను. వారి పాదాలమీద పడి, నాకు, శాపవిమోచన మెప్పుడో తెలుపవలసిందని ప్రార్థించాను.

నా పశ్చాత్తాపం గ్రహించిన మహర్షులు, నామీద జాలి వహించారు. అది కారణంగానే, వారు...

'యదు కులమందు, భక్తుల భయంబు హరించుటకున్ జనార్దనుం
డుదయమునొంది, యీ యడవి కొక్కదినంబున రాగలండు, త
త్పదమున నీవు దన్నబడి, పన్నగ దేహము తోడబాసి, నీ
మొదలిటిమేను గాంచెదవు, మూఢుడ పొ'మ్మని, రో దయానిధీ!

అని తెలియపరచుకున్నాడు. ఆపైన, ఆయన నుద్దేశించి...

'తండ్రీ ! నువ్వు దురితహారివి. నిన్ను స్మరించుకున్నంతలోనే, నీ నామాన్ని ఉచ్చరించినంతలోనే, పాపాలు హరించిపోవటం సంభవమయినప్పుడు, నీ చరణారవింద స్పర్శ లభించిన నాకు, శాప విమోచనం కలగటంలో ఆశ్చర్య మేముంది ?'

అని కూడా మనవిచేసుకున్నాడు.

అలా విన్నవించుకున్న సుదర్శనుడు, ఆ తరువాత, శ్రీకృష్ణునకు ప్రదక్షిణం చేశాడు. పునః పునః ప్రణామా లాచరించాడు. ఆయన వద్ద సెలవుతీసుకుని, తన నిజావాసానికి వెళ్ళిపోయినాడు. అనంతరం, సర్ప

ముక్తిపొందిన నందునితోసహా, గోపకులు, శ్రీకృష్ణ సంకీర్తనం చేసుకుంటూ అమితానందంతో, మంద చేరుకున్నారు.

## 109. గోపికల విరహోత్కంఠత :

శ్రీకృష్ణుడు, సాధారణంగా, పవలంతా వనాంతరాల్లో విహరిస్తూ ఉండేవాడు. ఆ విధంగా అతడు తమకు దూరగుడై ఉండటం, గోపికలు, సహించలేకపోయేవారు. అహోరాత్రాలూ, అతని సన్నిధిలో ఉండాలని వాంఛించే గోపికలకు, అతనితోటి వియోగం భరింపరానిదిగా ఉండేది. అది కారణంగానే, వారు, ఒకరితో ఒకరు...

'చెలియా కృష్ణుడు నన్నుబాసి వనముం జేరంగ నయ్యే క్షణం
బులు నా కన్నియు నుండ నుండ గడు నాపూర్ణంబులై సాగి లో
పల దోచుం బ్రహరంబులై దినములై పక్షస్వరూపంబులై
నెలలై యబ్దములై మహాయుగములై నిండారు కల్పంబులై'

అని, తమతమ హృదయాలను వ్యక్తపరచుకునేవారు; బాధపడే వారు. అంతేకాదు. ఎప్పుడు సాయంత్రం అవుతుందా అనీ, తమ ప్రియ తముడయిన ఆ కృష్ణయ్య, తమకు, తిరిగి ఎప్పుడు కనబడతాడా అనీ, ఆలోచిస్తూ, వారు, పగలంతా వేగించేవారు. సంధ్యాసమయాన, కృష్ణయ్య తోలుకువచ్చే గోవుల పాదపరాగం, దూరాన గోచరించగానే, అటుగా పరు గెత్తేవారు. ఆయన్ని సమీపించి, గోధూళి ధూసరితమైన ఆయన దివ్య కోమల రూపాన్ని దర్శించుకుని, పరమానందభరితలయేవారు. ఆయనదైన మృదు మందహాసాన్ని గ్రహించి, తన్మయత్వం పొందేవారు.

## 110. శంఖ చూడుడు :

శ్రీకృష్ణుడు, గోపీజనంతో యథేచ్ఛగా విహరిస్తూ ఉన్న సమ యంలో, ఒకసారి, కుబేరభటుడైన శంఖచూడుడు చూశాడు. శ్రీకృష్ణుని చుట్టి ఉన్న గోపికలను, అపహరించుకుపోవా లనుకున్నాడు; వారిని సమీ పించాడు.

శంఖచూడుడు, పెద్దపులిముఖంవంటి ముఖం కలవాడు. తాటి చెట్టంత పొడగరి. అతి భయంకరుడు.

అతణ్ణి చూడగానే, గోపికలు యెక్కడివా రక్కడినుంచే, భీతితో అరుస్తూ, పారిపోవటం మొదలు పెట్టారు. అలా పారిపోతున్న గోపికలను, అతడు, వెంటాడసాగాడు.

గోపికల ఆర్తనాదం, శ్రీకృష్ణుని చెవులబడ్డది. ఆ వెంటనే, ఆయన, అతని మీదికి ఉతికాడు

శ్రీకృష్ణుడు, అలా ఉరికివస్తూ ఉండటం, శంఖచూడుడు గ్రహించాడు. గ్రహించి, గోపికలను, అక్కడే వదలి, ప్రాణభీతితో పారిపోసాగాడు. కాని, శ్రీకృష్ణుడు, అతణ్ణి వదలదలచుకోలేదు.

అప్పుడు, శ్రీకృష్ణ శంఖచూడుల మధ్య. ఘోరమైన ద్వంద్వ యుద్ధం జరిగింది. ఆ పోరులో, శంఖచూడుడు, శ్రీకృష్ణుని పట్టుకుని, అనేక సార్లు, నేలకువేసి మోదాడు. కాని, చివరకు, శ్రీకృష్ణుడు, అతణ్ణి, పిడిగుద్దులతో సంహరించటం జరిగింది.

అలా మృతుడైన శంఖచూడునిలోనుంచి, ఒక దివ్యజ్యోతి బాహిరిల్లి, శ్రీకృష్ణుని మిత్రుడైన శ్రీదామునిలో లీనమయింది. ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, శంఖచూడుని శిరోజాలతో ఉద్భవించిన మణిని గ్రహించటం, దాన్ని, బలరామునకు కానుకగా సమర్పించుకోవటం, జరిగింది.

### *111.* వృషభాసురుడు :

శ్రీకృష్ణుడు, ఆనంద స్వరూపుడై, ఆ విధంగా మందలో వ్యవహరిస్తూ ఉన్న సమయంలో, ఒకసారి...

ఎవ్వని మూపుర మీక్షించి మేఘంబు
లద్రి శృంగం బని యాశ్రయించు
నెవ్వని అంకె కర్ణేంద్రియంబులు సోక
గర్భపాతంబగు గర్భిణులకు

నెవ్వని పదహతి నెగయు పరాగంబు
లంధకారారాతి నావరించు
నెవ్వడు కొమ్ముల నెదిరించి చిమ్మిన
బృథ్వీధరంబులు పెల్లగిల్లు
నట్టి వృషభాసురేంద్రు డహంకరించి
వాలలత యెత్తి పెనుబంకె వైచి నేల
గాలు ద్రువ్వుచు సిశిత శృంగములు సాచి
మంద బెగడంద గవిసె నమందుడగుచు.

అతణ్ణి చూసి, వ్రజవాసు లందరూ, ఇళ్ళూ వాకిళ్ళూ వదలి, ప్రాణ భీతితో పరుగెత్తారు. ఆపన్నశరణ్యుడయిన శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'కృష్ణా! కృష్ణా! మమ్మ రక్షించవలసింది' అని, ఆక్రందించసాగారు.

ఆ పరిస్థితినంతనూ, కృష్ణయ్య, అర్థం చేసుకున్నాడు. మందలో అలా ప్రవేశించి, తనవారిని కలవరపరుస్తున్నది వృషభం కాదనీ, అరిష్టు డనే రాక్షసుడు, ఆ రూపంలో అక్కడికి రావటం జరిగిందనీ, గ్రహించాడు. ఆ వెంటనే, తనవారి నుద్దేశించి, భయపడవద్దని హెచ్చరించాడు; వృష భాసురుని దిక్కుగా ఉరికాడు. అలా ఉరుకుతూనే...

'బాలుర నింతులం బసుల బాఱగదోలుట బంటుపంతమే,
చాలు, వృషాసురేంద్ర, బలసంపద జూపగ నెల్లబోటి గో
పాలుర మందగాదు, చన బైపడితేని, బ్రచండ కృష్ణ శా
ర్దూలము, నేడు, నీ గళము ద్రుంపక చంపక పోవనిచ్చునే!'

అని, భీకరంగా గర్జించాడు.

అలా గర్జిస్తూ, తనమీదికి ఉరికివచ్చిన కృష్ణయ్యనుచూసి, వృష భాసురుడు, ఉగ్రుడయినాడు. ఆ వెంటనే, అతడు, తన ముందు పాదాలతో, నేలను గీటించాడు. మింటఉన్న మేఘాలు కూడా చిందఱవందఱ అయ్యే విధంగా, తన వాలాన్ని, వలయాకారంగా త్రిప్పాడు. కళ్ళతో నిప్పులు క్రక్కుతూ, కృష్ణయ్యతో తలపడ్డాడు.

అప్పుడు, ఆ వృషభాసురునికీ, కృష్ణయ్యకూ మధ్య, ఘోరమైన పోరు జరిగింది. ఆ పోరులో, కృష్ణయ్య, వృషభాసురుని కొమ్ము నొకదాన్ని పెకలించి, దాంతోనే, అతణ్ణి తీవ్రంగా గాయపరచాడు; కూల్చేశాడు.

* * *

అలా కూలిపోయిన వృషభాసురుడు, ఆ వెంటనే, తనరూపాన్ని త్యజించి, భూసుర రూపం ధరించి, కృష్ణయ్యను సమీపించాడు; ఆయనకు అంజలించి, ఇలా విన్నవించుకున్నాడు.

"స్వామీ ! నేను, పూర్వం, వరతంత్వుడనే ఒక బ్రాహ్మణుణ్ణి. నాకు విద్యాగురువు బృహస్పతి. నే నాయనవద్ద విద్యాభ్యాసం చేసేరోజుల్లో, ఒకసారి, అజ్ఞానవశంచేత, ఆయన్ని శిరస్కరించటం జరిగింది.

అది ఆచార్యునకు ఆగ్రహం కలిగించింది. ఆ వెంటనే, ఆయన, నన్ను, 'ఎద్దువు కావలసింది' అని శపించాడు. ఆ శాపంవల్ల, నేను, వృషభరూపం ధరించి, వంగదేశంలో చరింపసాగాను. ఆ కాలంలో, నాకు, అసురులతో స్నేహం ఏర్పడ్డది. అదికారణంగా, నేను, అసురుడనయినాను. నీ దయవల్ల, ఈనాడు, నాకు, శాపవిముక్తి కలిగింది; ధన్యత్వంచేకూరింది.

ఆ విధంగా తన పూర్వ చరిత్రను వివరించి, ఆయనవద్ద సెలవు తీసుకుని, ఆ భూసుర కుమారుడు, ఒక విమానాన్ని అధిరోహించి, దివ్య తేజంతో, దేవలోకానికి వెళ్ళిపోయినాడు.

## *112. కంసుని నిర్ణయం :*

బృందావనంలో, బలరామ కృష్ణులు ఈ విధంగా క్రీడిస్తున్న సమయంలో, నారదమహర్షి, ఒకసారి మధురాపురానికి వెళ్ళి, కంసుని కలుసుకోవటం జరిగింది. ఆ సందర్భంలో, ఆయన, శ్రీకృష్ణుడు, దేవకీ దేవికి జనించినవాడనీ, మాయను కన్నది యశోద అనీ, బలరాముడు, మొదట దేవకీ గర్భస్థుడై, ఆ తరువాత రోహిణీసుతు డయినాడనీ, విశద పరచాడు. అంతేకాదు.

'కంసా ! ప్రస్తుతం మందలో ఉన్న బలరామ కృష్ణులు మానవ మాత్రులు కారు; దానవాంతకులు. వారే, ఇంతకుముందు, పూతన మొదలు ప్రలంబుని వరకు, అందరనూ వధించటం జరిగింది' అని కూడా తెలియ పరచాడు.

నారదుని వచనాలు, కంసుని ఉద్రేకపరచినై. వసుదేవుడు, తన కుమారులను మందలో ఉంచి, తన్ను మోసం చేశాడని, అతను భావించాడు. అది కారణంగానే, వసుదేవుని సంహరించటానికి ఉద్యుక్తుడయినాడు. కాని, నారదుడే తిరిగి కల్పించుకుని, వసుదేవుని వధించటం ప్రయోజనశూన్య మైన కార్యమనీ, దానివల్ల, ఘోర పాపం సంభవిస్తుందనీ తెలియపరచి, కంసుని, కొంతవరకు శాంతింపచేశాడు.

ఆ తరువాత, కంసుడు, తన క్రోధాన్ని ఉపశమింప చేసుకునే ఉద్దేశంతో, దేవకీ వసుదేవులకు సంకెలలు వేయించాడు. కేశి అనే తన అను చరుణ్ణి పిలచి, 'మందకుపోయి, అక్కడ ఉన్న బలరామ కృష్ణులను సంహ రించి రావలసింది' అని ఆదేశించాడు. తన మంత్రులనూ, తనవద్ద ఉన్న మల్లులనూ, తదితర ప్రముఖులనూ సమావేశపరచి, వారి నుద్దేశించి ఇలా అన్నాడు :

"వసుదేవుని పుత్రులయిన బలరామ కృష్ణులు, రాక్షసాంతకులని తెలియవస్తోంది. దేవకీదేవిదైన అష్టమగర్భం, ఇంతవరకూ మన మనుకుం టున్నట్టు, స్త్రీమూర్తి కాదనీ, ఆమె ప్రసవించిన నల్లనయ్య, నందుని ఇంట పెరుగుతున్నాడనీ కూడా, తేలిపోయింది. అంతేకాదు. దేవేంద్రాదులు సయితం ఎవరితో పోరాడటానికి భయపడతారో అటువంటి నన్ను యెది రించటానికికూడా, ఆ అర్భకుడు ఉబలాటపడుతున్నాడట. మేనమామను గదా అన్న అభిమానం, ఆవంతఅయినా లేకుండా, 'నేను కంసుని వధించి తీరుతాను' అని, అతడు, ప్రగల్భాలు పలుకుతున్నాడట. ఈ పరిస్థితిలో, నేను అతణ్ణి, అతడినేకాదు, ఆ అన్నదమ్ము లిద్దరినీ, సహించటం, ఉచితం కాదు; సంహరించటం, అనుచితం కాదు.

ఆ రామ కృష్ణుల అంతు కనుక్కోవటానికి, నేనొక ఉపాయం కూడా ఆలోచించాను. వచ్చే చతుర్దశినాడు, మన మధురానగరంలో, ధనుర్యాగం చేయటానికి నేను నిశ్చయించుకున్నాను. ఆ యాగ సందర్శనానికి, నావారి నందరినీ ఆహ్వానించాలనికూడా, నేను నిర్ణయించుకున్నాను. ఆ సందర్భంలో, యాదవ ప్రముఖులతోపాటు, ఆ రామ కృష్ణులు కూడా, అప్పటివరకూ బ్రతికి ఉంటే, ఇక్కడికి వస్తారు. వారిని తీసుకువచ్చే బాధ్యత, అక్రూరునిమీద ఉంచుతున్నాను.

రామ కృష్ణులు రాజ ప్రాసాదాన్ని సమీపించే సమయానికి, అక్కడ, కాలాంతకతుల్యమైన మన కువలయాపీడం, వారి నెదుర్కొంటుంది; సంహరిస్తుంది. దానికి బలికాకుండా, వారు, ప్రాసాదంలో ప్రవేశించటమే జరిగిన పక్షంలో, వారిని, మన భటులు, మన మేర్పరచే మల్లరంగ స్థలానికి తీసుకుపోతారు. అక్కడ, మన మేటి మల్లులు, చాణూర ముష్టికులు ఉంటారు. వారు, వారిని, పోరాటానికి ఆహ్వానిస్తారు. అతిమానుష చర్యలు చేయటంలో అందెవేసిన చేతు లనిపించుకున్న ఆ అన్నదమ్ములు, ఆ ఆహ్వానాన్ని నిరాకరించలేరు; తప్పకుండా, వారితో తలపడతారు. అప్పుడు జరిగే పోరాటంలో, మహావీర్య ప్రతాపాది సంపన్నులయిన మన చాణూర ముష్టికులు, వారిని మర్దించి తీరుతారు.

ఆ రామ కృష్ణులను అలా అంతరింపచేసి, వారివారైన వసుదేవాది యాదవులనూ, వృష్ణి భోజ దాశార్హ ప్రభృతులనూ, ముదుకదై కూడా రాజ్య కాంక్షను వదలని ఉగ్రసేనునీ, అతని తమ్ముడయిన దేవకునీ, తదితర వైరులనూ, అనాయాసంగా సంహరించి, నేను, భూతలాన్ని నిష్కంటకం చేసుకోదలచాను. ఆ తరువాత, నా మామ అయిన జరాసంధునకూ, నా స్నేహితులయిన నరక శంబర బాణాది ప్రముఖులకూ, ఆనందాన్ని కల్పించే విధంగా, రాజ్యాన్ని పాలించదలచాను; మీ అందరికీ మేలు చేయటానికే సంకల్పించుకున్నాను."

ఆ విధంగా, తన సహచరవర్గానికి, తన హృదయాన్ని విశద

పరచుకుని, కంసుడు, ఆ పైన, ఎవరే కార్యనిర్వహణకు సమర్థులో, వారిని, ఆయా పనులలో నియమించాడు. ఆ తరువాత, అక్రూరునకు కూడా, తన మనో భీష్టాన్ని వ్యక్తపరచుకున్నాడు. ఎలాగైనా, బలరామ కృష్ణులను తనవద్దకు తీసుకురావలసిందిగా, ఆదేశించాడు.

అక్రూరుడు, అతను చెప్పిన దంతా సావధానంగా విన్నాడు. విని, అమితంగా బాధపడ్డాడు. కాని, చేయగల దేమీ లేకపోవటంవల్ల, అతణ్ణి ఉద్దేశించి...

'పంపిన బోనివాడనె నృపాలక, మానవు లెన్న దమ్ము నూ
హింపరు, దైవయోగముల నించుక గానరు, తోచినట్లు ని
ష్కంపగతిం జరింతు, రది కాదనవచ్చునె, యీశ్వరేచ్ఛ ద
ప్పింపగరాదు ; నీ పగతు బిడ్డల దెచ్చెద, బోయి వచ్చెదన్'

అని, సవినయంగా తెలుపుకున్నాడు. ఆ వెంటనే, రథ మెక్కి, బృందా వనం దిక్కుగా బయలుదేరాడు.

## *113. హయాసురుడు :*

అదే సమయానికి, శ్రీకృష్ణుని సంహరించే ఉద్దేశంతో, కంసుడు పంపిన కేశి, అశ్వరూపం ధరించి, నందవ్రజం చేరుకోవటం జరిగింది. అలా చేరుకున్న అతడు, భీకరమయిన తన పాదఘట్టనలతోనూ, హేషారవం తోనూ, ఊర్పులతోనూ, మందను కంపింపచేస్తూ, శ్రీకృష్ణునికోసం వెదుక సాగాడు. అది గ్రహించిన కృష్ణయ్య, తనకు తానై ఆ హయాసురుని సమీ పించి, భీకర సింహనాదం చేశాడు.

ఆ గర్జన విన్న హయాసురుడు, ఆ వెంటనే, ఆకసాన్ని కబ ళించటానికా అన్నట్టు, నోరుతెరచి, కృష్ణయ్య మీదికి ఉఱికాడు. ఒక్క సారిగా వెనుదిరిగి, వెనుక కాళ్ళతో, ఆయన్ని తన్నాలని చూశాడు. కాని, కృష్ణయ్య, ఆ కాళ్ళు రెండూ పట్టుకుని, దాన్ని, ఒక్కసారిగా పైకెత్తి, గిర గిరా త్రిప్పి, దూరంగా విసరివేశాడు. దాంతో, ఆ హయాసురుడు, మూర్ఛ

తుడు కావటం జరిగింది. అయినా, అత డావెంటనే లేచి, కృష్ణయ్యను మ్రింగటానికి, తిరిగి నోరు తెరచి, అతని మీదికి ఉఱికాడు. అలా ఉఱుకు తున్న హయాసురుని వక్త్రగహ్వరంలోకి, కృష్ణయ్య, తన ఎడమచేతిని జొనిపాడు. ఆ వెంటనే, తన శరీరాన్ని పెంచుకున్నాడు. అతనికి ఊపి రాడకుండా చేశాడు. అది కారణంగా, హయాసురునకు, ఒళ్ళంతా చెమటలు పోసినై. అతడు, గిలగిలా తన్నుకుంటూ, ఒరిగిపోయినాడు. అంతలో, ఊపిరి బయటకువచ్చే మార్గం లేక, అతని తల, దోసపండు మాదిరి బ్రద్దలై పోయింది. ఆ వెంటనే, అతనిలోనుంచి ఒక దివ్యపురుషుడు బయటకువచ్చి, శ్రీకృష్ణునకు ప్రణామంచేశాడు. దివ్యతేజంతో వినువీధిని వెళ్ళిపోయినాడు.

* * *

అలా వెళ్ళిన కేశి అనేవాడు, పూర్వం, కుముదుడనే దివ్యుడు. అతడు, మహేంద్రుని అనుచరుడుగా వ్యవహరించేవాడు. ఆయనకు, గొడుగు పట్టి తిరుగుతూ ఉండేవాడు.

వృత్రాసురవధ మూలంగా తనకు సంక్రమించిన బ్రహ్మహత్యా పాతకాన్ని తొలగించుకునే నిమిత్తం, దేవేంద్రుడు, అశ్వమేధం తల పెట్టాడు. ఆ యాగం కోసం నిర్ణయించిన అశ్వాన్ని, కుముదుడు, హరిం చుకుపోవటం జరిగింది. అది గ్రహించిన మహేంద్రుడు, అతణ్ణి వెదకి పట్టు కుని, బంధించి, తెచ్చి, 'అశ్వంమీదివ్యామోహంతో నువ్వి రాక్షసకృత్యానికి పాల్పడ్డావు. కాబట్టి, అశ్వరూప రాక్షసుడవు కావలసింది' అని శపించాడు. ఆ శాపం మూలంగా అశ్వరూపి అయిన కుముదుడు, శ్రీకృష్ణుని అను గ్రహంవల్ల శాపవిముక్తి నందటం, తిరిగి అమరావతి చేరుకోవటం, సంభ వించింది.

* * *

హయాసురుడు హతుడైనాడని తెలుసుకున్న దేవతలు, కృష్ణయ్య మీద, కుసుమవర్షం కురిపించారు. వ్రజవాసులు, అదంతా ఒక మహాద్భుత చర్యగా భావించారు; తమకు రక్షకుడయిన నల్లనయ్యను, అమితంగా ప్రస్తు

తించారు. ఆ సమయంలోనే, నారదమహర్షి కూడా అక్కడికిరావటం, శ్రీకృష్ణుని ప్రశంసించి, సాధుజన పోషణార్థం ఆయన చేయవలసిన మరి కొన్ని పనులను ఆయనకు నివేదించుకోవటం, జరిగింది.

*114.* వ్యోమాసురుడు :

ఆ మరునాడు, శ్రీకృష్ణుడూ కొందరు గోపకుమారులూ, పశువులను మేపుకునే నిమిత్తం, ఒకకొండ ప్రక్కకు వెళ్ళారు. అలా వెళ్ళి...

కొందరు గొఱియల మంచును
గొందరు పాలకుల మంచు కుటిలత్వమునం
గొందరు దొంగల మనుచును
జెంది కుమారకులు గ్రీడ సేసిరి తమలోన్.

అంతలో, మయాసురుని కుమారుడూ, మహా మాయావీ అయిన వ్యోముడు, గోపబాలుని రూపం ధరించి, వారితో చేరాడు. అలా చేరి, వారిలో చాలామందిని, కపటోపాయంతో, ఒక కొండగుహ వద్దకు తీసుకు పోయి, వారి నందులో ప్రవేశింప చేశాడు; వారు తిరిగి బయటకురాకుండా, ఒక పెద్ద పాషాణాన్ని, ఆ గుహాముఖాన ఉంచాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, ఆ ప్రాంతంలోనే, తక్కుతూ తారాడుతూఉన్న వ్యోముని, ఒడిసి పట్టుకున్నాడు. ఒక మహా పర్వతం మాదిరి శరీరాన్ని పెంచుకున్న అతణ్ణి, అనాయాసంగానే సంహ రించాడు. గోపకుమారులందరినీ తీసుకుని, అమితానందంతో మంద చేరు కున్నాడు.

* * *

శ్రీకృష్ణునివల్ల సంహరింపబడ్డ వ్యోముడు, పూర్వం, భీమరథు డనే రాజు. అతడు, మంచి మేధావి. హరిభక్తుడు. వారణాసిలో నివసిస్తూ ఉండేవాడు.

భీమరథుడు, చాలాకాలం, ప్రజారంజకుడై రాజ్యపాలనం చేశాడు. ఆ తరువాత, కుమారునకు పట్టం కట్టి, మలయాచలానికి వెళ్ళి, తపస్సు చేసుకోసాగాడు.

ఆ సమయంలో, ఒకసారి, పులస్త్యుడు, తన శిష్యవర్గంతో అక్కడికి వెళ్ళటం సంభవించింది. అదితెలిసికూడా, భీమరథుడు, ఆయన్ని సందర్శించుకోలేదు; సన్మానించలేదు.

అది, పులస్త్యునకు ఆగ్రహ కారణమయింది. అవెంటనే, ఆయన, భీమరథుని ఉద్దేశించి, 'నువ్వు రాక్షసుడవు కావలసింది' అని శపించాడు.

అలా శాపం పొందిన భీమరథుడు, ఆ మహర్షి పాదాలమీద పడి, తన తప్పిదాన్ని క్షమింపవలసిందిగా ప్రార్థించాడు. మహర్షి, అతని పశ్చాత్తాపాన్ని గ్రహించి, ద్వాపరాంతాన వ్రజసీమలో జనించే శ్రీహరి ద్వారా అతనికి శాపవిముక్తి కలిగేటట్టు అనుగ్రహించాడు.

శాపమోక్షణమార్గం గ్రహించిన భీమరథుడు, కాలక్రమాన, మయపుత్రుడయిన వ్యోమాసురుడు కావటం, శ్రీకృష్ణునిచేత సంహరింపబడి, శాప విముక్తినంది, ఆయనలో లీనమైపోవటం, జరిగింది.

## *115. అక్రూరుని ఆగమనం :*

మధురనుంచి బయలుదేరిన అక్రూరుని రథం, మాధవుని విహార స్థలమయిన మందలో ప్రవేశింపబోతూఉండగా, అక్రూరుని హృదయం ఆనందతాండవం చేయసాగింది. శ్రీహరి సన్నిధానానికి తన్ను తీసుకుపోతున్న తన అదృష్టాన్ని, అత దప్పుడు యెంతగానో అభినందించుకో సాగాడు. ఆ సందర్భంలోనే...

'ఎట్టి తపంబు సేయబడె, నెట్టి చరిత్రము లబ్ధ మయ్యెనో,
ఎట్టి ధనంబు లర్థులకు నీబడెనో తొలిబామునందు, నా
యట్టి వివేకహీనునకు, నాది మునీంద్రులు యోగదృష్టులం
బట్టగలేని యీశ్వరుని, బ్రహ్మమయున్, హరి, జూడ గల్గెడిన్'

అని, తనలో తా, నెంతగానో మురిసిపోయినాడు.

అంతలో, తనదయిన అదృష్టానికి, మహారాజయిన కంసునితో తన కున్న స్నేహమే కారణమన్న భావం, అతనికి కలిగింది. అందుకనే...

"సూరులు తొల్లి యే విభుని శోభితపాదనఖ ప్రభావళిం
జేరి, భవాంధకారముల జిక్కక దాటుదు, రట్టి దేవరన్,
వైరముతోడనైన బిలువన్ ననుబంచి శుభంబు సేసె, ని
ష్కారణమైన ప్రేమ, నిదె, కంసుని బోలు సఖుండు గల్గునే!"

అని, మనసారా, కంసుని ప్రశంసించాడు.

యథార్థానికి, శ్రీకృష్ణుడు, తన ప్రాణానికి ప్రాణమైనవాడు. ఆయనకు సర్వవేళలా జయం కలగాలనే, తను, కోరుకుంటూ ఉంటాడు. ఆ రోజున, ఆయనను దర్శించుకునే అవకాశం లభించబోతున్నందుకు, తానెంతగానో సంతోషిస్తున్నాడు కూడా. కాని, గత్యంతరంలేక, మహారాజైన కంసుని కుటిల సందేశాన్ని, ఆయన కందచేయబోతున్నాడు. అందుకనే, తన స్వామి అయిన శ్రీకృష్ణుడు...

'ఇత డా కంసునిచేత బంపువడి నన్ హింసింప నేతెంచినా
డతి దుష్టుండని చూచునో, సకల భూతాంతర్బహిర్మధ్యసం
గతుడౌటం దలపోసి నన్ను సుజనుంగా జూచునో, యెట్టి యు
న్నతి గావించునొ, యేక్రియం బలుకునో, నా భాగ్య మెట్లున్నదో!'

అని, తనలోతాను వితర్కించుకోసాగాడు. అంతలో, అతనికి, భక్తవత్సలుడయిన శ్రీకృష్ణుడు, తనకు అభయమిచ్చి తీరుతాడన్న విశ్వాసం కలిగింది. ఆ విశ్వాసంతోనే, అతడు, ముందుకు పోసాగాడు.

అలా పోయి పోయి, అక్రూరుడు, సాయంసమయానికి, బృందావనం సమీపించాడు. సమీపించగానే, అతనిలో అదోవిధమైన అనిర్వాచనీయానందం జనించింది. అక్కడఉన్న చెట్లూ, పుట్టలూ, గుట్టలూ, నదీనదాలూ అన్నీకూడా, ఎప్పుడో ఒకప్పుడు, శ్రీకృష్ణుని సన్నిధినంది, పవిత్రతను పొందినవే ననీ, బృందారణ్యసీమలో ఉన్న చరాచర జీవరాశి అంతా, ఆ లీలామానుష విగ్రహుని అపాంగవీక్షణల నందుకుని, ధన్యత పొందినదే ననీ కూడా, అత డప్పుడు భావించాడు. అది కారణంగానే, అతడు, తనకు లేని అదృష్టం, వాటికి ఉన్నదని నిర్ణయించుకున్నాడు.

వాటితో పోల్చుకుని, తన అల్పజ్ఞత్వాన్ని గుర్తించుకున్నాడు ; ఆ వెంటనే, రథంనుంచి దిగాడు.

అలా రథంనుంచి దిగిన అక్రూరునకు, శ్రీకృష్ణుని చరణాబ్జాలను శిరాన ధరించి తరించిన పచ్చికబీళ్ళు కనిపించినై. వాటిని చూడగానే, ఆయన ఒళ్ళు పులకరించింది. ఆయన కళ్ళవెంట ఆనందాశ్రులు రాలినై. ఆ వెంటనే, ఆయన, వాటిమీద పడి పొర్లాడాడు. వాటిని కన్న ధరిత్రిని చుంబించాడు. ఆ విధంగా, కొంతసేపు, తన్మయుడై చరించి, ఆ తరువాత, బలరామ కృష్ణులున్న గోదోహన స్థానం చేరుకున్నాడు. చేరుకుని...

కనె నక్రూరుడు పద్మనేత్రులను రంగ ద్గాత్రులన్ ధేను దో
హన వాటీ గతుల న్నలంకృతుల నుద్యద్బాహులం బీత నీ
ల నవీనోజ్జ్వల వాసులం గుసుమమాలాధారులం ధీరులన్
వనితాకాముల గృష్ణ రాముల జగద్వంద్యక్రమోద్దాములన్.

అలా తమ్ము సమీపించిన అక్రూరుని, బలరామ కృష్ణులు చూశారు. చూసి, మందహాసంతో పలుకరించారు. అతని అభివాదనను స్వీకరించారు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, అక్రూరుని, ప్రేమపురస్సరంగా కౌగిలించుకున్నాడు. కుశలప్రశ్నలు వేశాడు. బలరామ సహితుడై, అతణ్ణి, తన ఇంటికి తీసుకు వెళ్ళాడు. అనంతరం...

"శుభమే నీకు, బ్రమోదమే సఖులకుం, జుట్టాలకున్ సేమమే,
యభయంబే ప్రజకెల్ల, గోత్రజుల కాత్మానందమే, మామ ము
క్తభయుండే, వసుదేవ దేవకులు త త్కారాగృహంబందు మ
త్ప్రభవ వ్యాజ నిబద్ధులై బ్రదికిరే ప్రాణానిలోపేతులై.

నెఱి నే డిక్కడ నీవు రాగ వగతో నీతోడ నేమైన నా
కెఱుగం జెప్పుమటంచు జెప్పరుగదా, యేమందు, రా వార్త యే
తెఱగున్ లేదని డస్సిరో, వగచిరో, దీనత్వముం జెందిరో,
వెఱతో నా తలిదండ్రు లెట్లు వడిరో విన్పింపు మక్రూరకా!"

అని, పరామర్శపూర్వకంగా అడిగాడు. ఆ తరువాత, అతని రాకకు గల కారణం తెలుపవలసిందని కోరాడు.

శ్రీకృష్ణునకు సమాధానంగా, అక్రూరుడు, తన ఆగమనానికి సంబంధించిన సర్వవిషయాలనూ విశదపరచుకున్నాడు. ఆ సందర్భం లోనే...

'కృష్ణా ! నారదమహర్షి ఇటీవల మధురకువచ్చి, మా మహారాజును కలుసుకున్నాడు. ఆ సమయంలో, ఆయన, నువ్వు రాక్షసాంతకుడవనీ, దుష్ట సంహారానికే ఉద్భవించావనీ కూడా తెలియపరచాడు. అది కారణంగానే, కంసుడు, ఈ ధనుర్యాగం పేరు పెట్టి, నిన్నక్కడికి రప్పించుకోవాలనీ, అక్కడ, ఏదో ఒక విధంగా నిన్ను సంహరించాలనీ, నిశ్చయించుకున్నాడు,' అని కూడా విశదపరచాడు.

అక్రూరుని పలుకులు విన్న బలరామ కృష్ణులు, కడుపుబ్బ నవ్వుకున్నారు. ఆ వెంటనే, కృష్ణయ్య...

'భూనాథుండు మఖంబుఁజూడ బిలువం బుత్తెంచినా డవ్విభుం
గానం బోవలె, బాలు నెయ్యి పెరుగుల్ గట్నంబులుం గానికల్
మీ నేర్పొప్పఁగ గూడబెట్టుడు తగన్ మీ మీ నివాసంబులన్,
యానంబుల్ గొనిరండు పొందు మధురాయాత్రాభిముఖ్యంబుగన్'

అని, గోపప్రముఖుల నుద్దేశించి పలికాడు. శ్రీకృష్ణుని దైన అభిప్రాయాన్ని గ్రహించి, నందుడు, ఆ వెంటనే, ఆ విషయాన్ని, పల్లెలో నలుమూలలా చాటించవలసిందిగా, తనవారికి ఆదేశించాడు.

## *116. గోపికల ఆవేదన :*

అది విన్న గోపికలు, శ్రీకృష్ణుడు మధురానగరానికి వెళ్ళటం తథ్యమని తేల్చుకున్నారు. తమ ప్రియుడైన అతణ్ణి వదలిఉండటం దుర్భరమనుకున్నారు. అతడు, తమ్ము విడిచి పోకుండా ఉండాలనికోరుతూ, ముక్కోటి దేవతలకూ మొక్కుకున్నారు. తమ ప్రాణానికి ప్రాణమైన

శ్రీకృష్ణుని తమకు దూరం చేయదలచిన బ్రహ్మదేవుని, పరిపరివిధాల దూషించారు. అక్రూరుడనే పేరు పెట్టుకునికూడా, క్రూరుడై, తమకు ప్రియ వియోగదుఃఖాన్ని కల్పిస్తున్న అక్రూరుని తూలనాడారు. అంతేకాదు. అంతవరకూ తమతోటిదే లోకమన్నట్టు వ్యవహరించి, అలా, అమాంతంగా తమ్ము వదలిపోవటానికి నిశ్చయించుకున్న కృష్ణయ్యనుకూడా, నిశితంగా విమర్శించారు. ఆ రాత్రంతా, కన్నీటికాలువలై, వివశత్వంతో, తమ కృష్ణయ్యనే తలచుకుంటూ వేగించారు.

ఆ మరునాడు ఉదయాన, నందాది గోపప్రముఖులందరూ, తమ తమ శకటాలమీద, మథురాభిముఖులై బయలుదేరారు. బలరామ కృష్ణులు మాత్రం, అక్రూర చోదితమయిన రథ మధిరోహించి, వారికి ముందుగా కదిలారు.

బలరామ కృష్ణుల రథం బయలుదేరబోతూఉండగా, గోపికలు, ఒక్కసారిగా దాన్ని చుట్టేశారు. చుట్టేసి, 'నువ్వు లేని మందలో మేము ఉండలేము. మమ్మల్ని కూడా తీసుకుపోవలసింది' అని దీనాతిదీనంగా, శ్రీకృష్ణుని బ్రతిమాలుకున్నారు.

ఆ విధంగా బ్రతిమాలుకుంటున్న గోపికలను, కృష్ణయ్య, ప్రేమ పూర్వకంగా చూశాడు. మందహాసం చేశాడు. ఆపైన, వారి నుద్దేశించి, 'వెంటనే, తిరిగివస్తాను' అని, మాటయిచ్చి, వారికి కొంత ఉపశమనం కలిగించాడు.

## *117.* అక్రూరుని అదృష్టం :

అలా ప్రయాణంసాగించిన బలరామ కృష్ణులు, మధ్యాహ్న సమయానికి, కాళిందిని చేరుకున్నారు; అక్కడ, వారు, రథాన్ని ఆపి, స్నానంచేసి, సేదదీర్చుకున్నారు; తిరిగి, రథ మధిరోహించారు.

బలరామ కృష్ణులు రథ మధిరోహించిన తరువాత, అక్రూరుడు, వారివద్ద సెలవుతీసుకుని, స్నానార్థం, అచటి అనంత తీర్థానికి వెళ్ళాడు.

అలా వెళ్ళి, అందులో ప్రవేశించి, విధిపూర్వకంగా వేదమంత్రాలు పఠిస్తూ ఉండగా, అతనికి, నదీగర్భంలో, రామ కృష్ణులు కనిపించారు. అంతకు పూర్వం రథంలో ఉండి తనకు సెలవిచ్చిన వారు, తన ఎదుట అలా ప్రత్యక్షం కావటం అతనికి ఆశ్చర్యం కలిగించింది. అందుకనే, అతడు, అదేమిటో తెలుసుకుందామని, చరచరా ఒడ్డుకు వచ్చి, రథం ఉన్న దిక్కుగా వెళ్ళాడు. అలా వెళ్ళిన అతనికి, రథంలో, యథాపూర్వకంగా ఆసీనులై, ముచ్చటలాడు కుంటున్న ఆ అన్నదమ్ములు కనిపించారు. అది చూసిన అక్రూరుడు, అది మహాద్భుతమనుకున్నాడు. అయినా, తన విస్మయాన్ని ఏమాత్రంగానూ వారికి తెలియపరచకుండానే, అతడు, తిరిగి నదివేపుగా నడకసాగించాడు. అలా వెడుతూ, ఆ కళ్యాణచరితుల మాహాత్మ్యాన్ని గురించే ఆలోచింప సాగాడు.

## *118.* అక్రూరుని హృదయం :

తిరిగి కాళిందిని చేరుకున్న అక్రూరునికి, వేయి పడగలతో వెలుగులు చిమ్ముతూఉన్న అనంతుడూ, అతడు తల్పంగా పడుకునిఉన్న శ్రీ మహావిష్ణువూ, గోచరించారు. శ్రీమహావిష్ణువు, నీలమేఘంవంటి శరీర చ్ఛాయతో ప్రకాశిస్తున్నాడు. పట్టుపీతాంబరం ధరించి ఉన్నాడు. నాలుగు చేతులతోనూ, కలువరేకుల వంటి కళ్ళతోనూ, ప్రముఖమైన నాసికతోనూ, తీర్చి దిద్దినట్లున్న కనుబొమలతోనూ, చూడటానికి ముచ్చటగా ఉండే బుగ్గల తోనూ, దొండపండువంటి పెదిమతోనూ, పొడుగుపాటి చేతులతోనూ, ఉబికిఉండే వక్షస్థలంతోనూ, శంఖంవంటి మెడతోనూ, సర్వాంగ సుందర మైన రూపంలో పొడగట్టాడు. ఆయన ధరించిన భూషలు, దివ్యమైన విగా ఉన్నై. ఆయన రొమ్ముమీద, శ్రీవత్సం భాసిస్తోంది. మెడలో, కౌస్తుభ మణి ప్రకాశిస్తోంది. ఆయన, తులసీదామ భూషితుడై ఉన్నాడు.

ఆ మహానుభావుని ప్రక్కగా నిలబడి, నంద సునందులు స్తోత్రం చేస్తున్నారు. సనక, సనందన, సనాతన, సనత్కుమారులు, ఆయన వెనుక నిలబడి ఉన్నారు. బ్రహ్మ రుద్రాదులు, ఆయన దక్షిణ పార్శ్వాన

నుంచున్నారు. మరీచి మొదలైన నవవిప్రులు, ఆయన వామభాగాన ఉన్నారు. ప్రహ్లాదుడు, నారదుడు, ఉపరిచర వసువు మున్నగువారు, ఆయన ఎదుట నిలబడి ఉన్నారు. శ్రీ, పుష్టి, వాణి, కాంతి, కీర్తి, తుష్టి, ఇల, ఊర్జ, విద్య, అవిద్య, శక్తి, మాయ, మున్నగువారు, ఆయన్ని సేవిస్తూ ఉన్నారు. సిద్ధులు, చారణులు, గంధర్వులు, అసురులు, ఆ మహానుభావుని స్తుతిస్తూ ఉన్నారు. వారందరినీ చూడగానే, అతని కళ్ళవెంట ఆనందాశ్రులు రాలినై. అతని శరీరం పులకించింది. ఆ వెంటనే, అతనికి, శ్రీకృష్ణుడు శ్రీమహావిష్ణువే అన్న అభిప్రాయం కలిగింది. అది కారణంగానే, అతను, ఆ భగవంతునకు సాష్టాంగ ప్రణామం చేశాడు; తిరిగి లేచి, గద్గదస్వరంతో, ఆయన నిలా ప్రస్తుతించాడు.

"కృష్ణా ! నువ్వు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవు. సృష్టిలో ఉన్న జీవరాశి అంతటికీ, నువ్వే, మూలకారణుడవు. కాని, మాయామోహితుడయిన జీవుడు, సామాన్యంగా, నిన్ను గుర్తించ లేడు.

మహాయోగులు, నిన్ను, మహాపురుషునిగా కొలుస్తారు. కర్మిష్ఠులు, నిన్ను, యజ్ఞ యాగాదులద్వారా ఆరాధిస్తారు. జ్ఞానులు, తాము చేసే సర్వకర్మలనూ నీయందే సన్యసించి, జ్ఞానస్వరూపుడవైన నిన్ను జ్ఞానమార్గాన ధ్యానిస్తారు. ఎవరు ఏవిధంగా ఏరూపాన్ని ఆరాధించినా, అది, సర్వదేవతామయుడవైన నీకే చెందుతుంది.

నాయనా ! నీ మాయకు వశం కాని దేదీ లేదు. జీవులకు, 'నేను' 'నాది' అనే అభిప్రాయం కలగటానికి మూలం, నీ మాయ తప్ప మరొకటి కాదు. ఆ మాయ కారణంగానే, సర్వజీవులూ, కర్మమార్గాన పరిభ్రమించటం జరుగుతోంది. నామటుకు నేను కూడా...

కలలం బోలెడి పుత్ర మిత్ర వనితాగారాది సంయోగముల్
జలవాంఛారతి నెండమావులకు నాసల్ సేయు చందంబునం
దలతున్ సత్యములంచు; మూఢుడ, వృథా తత్త్వజ్ఞుడన్, నాకు నీ
విలసత్పాదయుగంబు సూపి కరుణన్ వీక్షింపు లక్ష్మీపతీ !"

అలా వినుతించిన అక్రూరునికి అభయ మిచ్చి, శ్రీమన్నారాయణుడు, తిరోహితుడయినాడు. ఆ వెంటనే, అక్రూరుడు, తిరిగి, రామ కృష్ణులను చేరుకున్నాడు. అతణ్ణి చూడగానే, శ్రీకృష్ణుడు, మందహాసం చేస్తూ...

'జలములు చేరువ నున్నవి,
తలపోయగ నీవుపోయి తడవయ్యె, నదీ
జలముల, నభమున ధరణిం
గలుగని చోద్యములు నీకు గానంబడెనే !'

అని, ప్రశ్నించాడు. ఆ ప్రశ్నకు సమాధానంగా, అక్రూరుడు...

'నీలోన లేని చోద్యము
లే లోకములందు జెప్ప, రీశ్వర, నీటన్
నేలన్ నింగిని నున్నవె,
నీలో జోద్యంబు లెల్ల నెగడు, మహాత్మా !'

అని, నివేదించుకున్నాడు. అది విన్న బలరామ కృష్ణులు, ఒకరివంక ఒకరు చూసుకున్నారు. చిరునవ్వు నవ్వుకున్నారు. ఆ తరువాత, అక్కడినుంచి బయలుదేరి, వారు, సాయంకాలానికి, మధురానగరం చేరుకున్నారు.

మధురానగరం చేరుకోగానే, బలరామ కృష్ణులు, పురోపవనం వద్ద తమ రథాన్ని ఆపించి, అక్రూరుని, ముందుగా నగరంలో ప్రవేశించవలసిందని ఆదేశించారు. కాని, అక్రూరుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'నా యింటికి విచ్చేయుము,
నీ యంఘ్రి సరోజ రేణు నికరము సోకన్
నా యిల్లు పవిత్రంబగు
శ్రీయుత, నీ భటుని బెద్ద సేయం దగదే !'

అని, ప్రార్థించాడు.

ఆ విధంగా ప్రార్థించిన అక్రూరునకు సమాధానంగా, శ్రీకృష్ణుడు...

'యదుకుల విద్వేషణుడై
మదమున వర్తించు కంసు మర్దించి, భవ
త్సదనంబు జూడ వచ్చెద,
బొదమీ స్యందనము గొనుచు, బురమున, కనఘా !'

అని, ప్రేమపూర్వకంగా పలికాడు. ఆ పలుకులు విని సంతుష్టిపొందిన అక్రూరుడు, ఆ తరువాత, పురప్రవేశంచేసి, కంసరాజేంద్రుని దర్శించు కున్నాడు. బలరామ కృష్ణుల రాకను గురించి, ఆయనకు విన్నవించు కున్నాడు.

*119. మధురానగరం :*

పూర్వం, మధురానగరం, మధువన మనే పేరుతో ఉండేది. అప్పుడు, దానికి ,రావణాసురుని మేనల్లుడు, లవణాసురుడు, అధిపతిగా ఉండేవాడు.

లవణాసురుడు, బల పరాక్రమ సంపన్నుడు. అతనిముందు రావణాసురుడు కూడా, తల ఒగ్గి ఉండటం జరిగేది.

ఆ లవణాసురుడు, సాధువులను అమితంగా బాధించేవాడు. అది గ్రహించి, శ్రీరామచంద్రుడు, శత్రుఘ్నునిద్వారా అతణ్ణి సంహరింప చేసి, మధువనాన్ని అసురనిర్ముక్తం చేయటం జరిగింది. అది కారణంగా, ఆ వనంలో వెలసిన మధురానగరానికి, శ్రీహరి అధిపతి అయినాడు.

ఆ మధురానగరాన్ని, శత్రుఘ్నునికుమారులయిన పుష్కరుడూ అక్షుడూ అనేవారు, కొంతకాలం పాలించారు. వారి తరువాత, యాదవులు, దానికి పాలకులయినారు.

మధురాధిపతి అయిన శూరసేనుడు, యయాతి కుమారుడు. అతడు, మహాబలవంతుడు; ప్రతాపవంతుడు. కాని, అతని పాలన, అంత సక్రమంగా ఉండేదికాదు. అది కారణంగా, మాధవ వంశానికి చెందిన ఉగ్ర సేనుడు, ఆ పరిపాలనా బాధ్యతను వహించటం జరిగింది.

మధురా ప్రజకు ఆరాధ్య దేవత చండిక. ఆమెనే, మధురాంబ అని కూడా అంటారు. ఆమె, తన్ను కొలిచేవారికి, ఆయురారోగ్యైశ్వర్యాలను చేకూరుస్తూ ఉంటుంది; అక్కడ మరణించినవారికి, పరమపదాన్ని ప్రసాదిస్తూ ఉంటుంది.

స్వాయంభువు, అక్కడ, నూరేళ్ళు తపస్సుచేసి, స్వాయంభువ మనువు అనే కుమారుని పొందాడు. భూతేశ్వరుడయిన శంకరుడు, ఆ విధంగానే తపస్సుచేసి, శ్రీహరి దయవల్ల, ఆ నగర ద్వారపాలకత్వం వహించాడు.

ఇంద్రుడు, ఇనుడు, ధనదుడు, యముడు, ధ్రువుడు, నియమ ప్రకారం, ఆ వనంలోనే తపస్సుచేశారు. దాని ఫలితంగా, వారికి, క్రమంగా మహేంద్రపదవీ, ప్రాజాపత్యం, నిత్యనిధీ, పాశం, ధ్రువపదం, లభించినై.

మధువనంలో తపస్సు చేయటంద్వారానే, రావణాసురుడు, బర్హిర్ముఖులను ఓడించగలిగాడు; లంకానగరాన్ని నిర్మించుకోగలిగాడు. ఆ వనంలో తపస్సు చేసిన తరువాతనే, శంతనునకు భీష్ముడు జనించాడు.

మధురను స్మరిస్తే, మాధవుని స్మరించినట్టవుతుంది. మధురావాసులను భజిస్తే, మాధవభక్తులను భజించినట్టవుతుంది. మధురను గురించి వింటే, మాధవుని గాథను విన్నట్టవుతుంది. మధురను చూస్తే, మాధవుని దర్శించుకున్న ఫలం లభిస్తుంది.

మధురాధిపతి మాధవుడు అది, యాదవులకు తొలి నివాసం.

## *120.* మధుర హృదయాలు :

నందాది గోపకులతోనూ, బలరామునితోనూ, ఒకరోజంతా పురోపవనంలో గడిపి, శ్రీకృష్ణుడు, ఆ మరునాడు, మధురానగరంలో ప్రవేశించాడు. అలా నగర ప్రవేశం చేసిన బలరామ కృష్ణులను సందర్శించు

కోవాలన్న అభిలాష, పౌరసుందరులకు కలిగింది. అది కారణంగానే, వారిలో కొందరు...

'నంద తపఃఫలంబు, సుగుణంబుల పుంజము, గోపకామినీ
బృందము నోముపంట, సిరివెంట, దయాంబుధి, యోగిబృందముల్
డెందములందు గోరెడు కడింద నిధానము, సేరవచ్చె; నో
సుందరులార! రండు, చని చూతము కన్నులకోర్కి తీరగన్'

అని, పరస్పరం ఆహ్వానించుకుంటూ, ముందుకు సాగిపోయినారు. మరి కొందరు, హర్మ్యాగ్రభాగాలలో నిలబడి, అత్యుత్సాహంతో, ఆ యదుకుల శ్రేష్ఠులను దర్శించుకోసాగారు.

అంతకుపూర్వం, మధురానగరవాసులు, బలరామ కృష్ణుల లీలా శిశుక్రీడలను గురించిన మహాద్భుత విషయాలెన్నో విన్నారు. అవి విన్నప్పటి నుంచీ, ఆ దివ్యసుందరమూర్తుల నెప్పుడు దర్శిస్తామా అన్న ఆతురత, వారిలో ప్రబలమయింది. అది కారణంగానే, ఆ అన్నదమ్ములను చూసే భాగ్యం కలిగినందుకు, తమ్ముతామెంతగానో అభినందించుకున్నారు. ఆ సమయంలో వారు పొందిన ఆనందానికి, అవధి అనేది కనిపించలేదు. అందుకనే, వారా నందకిశోరుని చూసి...

"వీడచే రక్కసి విగతజీవిగ జన్ను
బాలు ద్రావిన మేటి బాలకుండు
వీడటె నందుని వెలదికి జగమెల్ల
ముఖమందు జూపిన ముద్దులాడు
వీడచే మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాపరీడు
వీడచే యెలయించి వ్రేతల మానంబు
సూఱలాడిన లోకసుందరుండు
వీడులేకున్న పుర మటవీస్థలంబు
వీని బొందని జన్మంబు విగత ఫలము

వీని బలుకని వచనంబు విహగరుతము
వీని చూడని చూడ్కులు వృథలు వృథలు"

అని, అతనిమీద తమకున్న అభిమానాన్నీ ప్రేమనూ గౌరవాన్నీ పరస్పరం విశదపరచుకున్నారు. ఆ ఆనందమయ మూర్తిమీద, కుసుమవర్షం కురిపించారు. ఆయనకూడా, తన ప్రసన్న వదనంతోనూ, మందహాసంతోనూ, ఓర చూపులతోనూ, వారందరి హృదయాలనూ ఆకర్షించుకున్నాడు; వారందరికీ పరమానందాన్ని ప్రసాదించాడు.

*121. కంస భృత్యుఁడు—రజకుడు :*

ఆ విధంగా పురపురంధ్రుల నధిగమించి, రామ కృష్ణులు. మరి కొంతదూరం వెళ్ళారు. అంతలో, వారికి, కంస పరిచారకుడయిన రజకు డొకడు ఎదురయినాడు. శ్రీకృష్ణు డతణ్ణి చూసి...

'విందులమై, నరేశ్వరుని వీటికి వచ్చితి మేము, మాకు, మా
మందలలోన గట్టికొన మంచి పటంబులు లేవు, నీ ముడిన్
సుందర ధౌతచేలములు శోభిలుచున్నవి, తెమ్ము, నిన్ను మే
లందెదు, నిమ్ము, రాజుదెస నల్లుర, మో రజకాన్వయాగ్రణీ !'

అని, పరియాచకంగా పలుకరించాడు.

ఆ పలుకులు, రజకునికి కోపం కలిగించినై. అది కారణంగానే, అతడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'ఎట్టెట్టా ! మనుజేంద్రు చేలములు మీ కీ బాడియే, మీరలుం
గట్టం బోలుదురే, పయో ఘృత దధి గ్రాసంబులన్ మత్తులై
యి ట్టాడంజనెగాక, గొల్లలకు మీ కెట్భంగి నోరాడెడిం
గట్టా, ప్రాణము గోలుబోయెదుసుమీ కంసోద్ధతిన్, బాలకా !'

అని, హుంకరించాడు. అంతేకాదు. 'మీరు, మందబుద్ధులూ ఆసన్న మరణులూ కావటంవల్లనే, మా రాజుగారి ద్రవ్యానికి ఆసపడు

తున్నారు. మీ దురుద్యోగం, మా రాజభటులకు తెలిసినపక్షంలో, వారు, మిమ్మల్ని బంధించి, హింసించి తీరుతారు. మీ రది గ్రహించి, బ్రతికి బయట పడటం సమంజసం ;' అని కూడా ప్రేలాడు.

రజకుని పలుకులు, శ్రీకృష్ణునకు కోపం కలిగించినై. అది కారణంగా, ఆయన, అతణ్ణి, ఒక్క చఱపు చఱిచాడు. దాంతో, ఆ రజకుడు, నేలకొఱిగి, ప్రాణం వదలటం జరిగింది. ఆ వెంటనే, అతనిలో నుంచి బాహిరిల్లిన ఒక జ్యోతి, శ్రీకృష్ణునిలో లీనమయింది.

రజకు డలా కూలటం చూసి, అతని అనుచరు లందరూ, తమ తమ మూటల నక్కడే వదలి, ప్రాణభీతితో పారిపోయినారు. అది గ్రహించిన బలరామ కృష్ణులు, పకపకలాడారు. ఆ వెంటనే, ఆ వస్త్ర రాసులనుంచి తమకు నచ్చినవాటిని ఏరి తీసుకుని, కొన్నిటిని తాము ధరించారు; మరి కొన్నిటిని, తమ పక్కనే ఉన్న గోపబాలురకు పంచిపెట్టారు.

* * *

రావణ సంహారానంతరం, శ్రీరామచంద్రుడు, అయోధ్యకు పోయి రాజ్యపాలనం చేస్తున్న సమయంలో, ఒక చాకలివాడు, తనభార్యను ద్దేశించి, 'పరుని ఇంట్లో ఉండివచ్చిన నిన్ను పరిగ్రహించటానికి, నేను వెఱ్ఱి, రాముడ ననుకున్నావా !' అని, నిందాపూర్వకంగా అనటం జరిగింది. చారులద్వారా ఆ పలుకులు విన్న రామచంద్రుడు, చాలా బాధపడ్డాడు. ఆ అపకీర్తిని తొలగించుకునే నిమిత్తమే, ఆయన, దోష రహిత అయిన సీతామహాదేవిని, మాయోపాయంద్వారా అడవికి పంపివేశాడు.

ఆ విధంగా, ఏ పాపం ఎరుగని సీతామహాదేవికి అరణ్యవాసం కల్పించిన ఆ రజకుడు, తను చేసిన పాపఫలాన్ని అనుభవించే నిమిత్తం, ద్వాపరాంతాన, తిరిగి, రజకుడుగానే జన్మించాడు. శ్రీకృష్ణుడై అవతరించిన శ్రీహరి, అతణ్ణి సంహరించి, అతనికి పాపవిముక్తి కలిగించాడు; పరమ పదాన్ని ప్రసాదించాడు.

**122. వాయకుడు :**

రజకుని మూటలోనుంచి తీసుకున్న పట్టుపుట్టాలను, రామ కృష్ణులు, అ_స్తవ్య_స్తంగా ధరించటం జరిగింది. అది చూసిన వాయకు డొకడు, వారిని సమీపించి, వారి దుస్తులను స్వయంగా సవరించి, నూత్న వస్త్రాలలో వెలుగులు జిమ్ముతున్న వారి సౌందర్యాన్ని కళ్ళారాచూసి, మురిసిపోయినాడు; తన్మయుడయినాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతనికి మేలు చేకూర్చే ఉద్దేశంతో, ఎన్నో వరా లిచ్చాడు. ఆ సందర్భం లోనే, అతనికి, అమితమైన ఐశ్వర్యాన్నీ సారూప్యాన్నీ కూడా ప్రసా దించాడు.

* * *

ఆ వాయకుడు, తొలిజన్మలో, మిథిలాపురవాసి. జానకీదేవి వివాహ సమయంలో, జనకుని ఆదేశంమీద, రామ లక్ష్మణులకు వలసిన పీతాంబరాలను అతడు స్వయంగా నేసి ఇచ్చాడు. ఆ వస్త్రాలను, జనక మహారాజు, అల్లుర కివ్వటం, వారు, పరమానందంతో వాటిని ధరించటం, జరిగింది. అది చూసిన వాయకుడు, ఆ దుకూలాలతో ఆ దివ్యమూర్తులను అలంకరించే అదృష్టం తనకు లేకపోయిందే అని, ఎంతగానో తపించి పోయినాడు.

శ్రీరామచంద్రుడు, అతని తాపాన్ని అర్థం చేసుకున్నాడు. అది కారణంగానే, అతని కోరిక, ద్వాపరాంతాన తీరేటట్టు వరం ప్రసాదిం చాడు; శ్రీకృష్ణుడై జన్మించినప్పుడు, ఆ వరాన్ని సఫలం చేశాడు.

**123. సుదాముడు :**

ఆ విధంగా అతనిపట్ల ప్రసన్నుడయిన శ్రీకృష్ణుడు, ఆపైన, బలరామునితోసహా, సుదాముడనే ఒక మాలాకారుని ఇంటికి వెళ్ళాడు. అలా, తమకు తామై కోరి దర్శన మిచ్చిన రామ కృష్ణులకు, సుదాముడు ఉత్తమాసనం సమర్పించుకున్నాడు. అమితభక్తితో వారి పాదాలు కడిగాడు;

శరీర మంతటా చల్లని సుగంధం పూశాడు. వారిని వివిధపుష్పాలతో అలంకరించి పూజించాడు. అనంతరం వారిని ఉద్దేశించి...

'పావనమయ్యె నా కులము, పండె దపంబు, గృహంబు లక్ష్మికిన్
సేవితమయ్యె, నిష్టములు సేకుఱె, విశ్వనిదాన మూర్తులై
భూవలయంబుగావ నిటుపుట్టిన మీరలు రాక జేసి, నే
నే విధ మాచరింతు, బను లెయ్యవి, బంట నెపుంగ జెప్పరే!'

అని, వినయపూర్వకంగా నివేదించుకున్నాడు ; ప్రార్థించాడు.

తమపట్ల సుదామునకున్న భక్తిని గ్రహించి, రామ కృష్ణులు సంతుష్టులయినారు. అది కారణంగానే, 'ఏదైనా వరం కోరుకోవలసింది' అని వా రతనితో అన్నారు. ఆ వెంటనే, సుదాముడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'నీ పాద కమల సేవయు,
నీ పాదార్చకులతోడి నెయ్యమును, నితాం
తాపార భూతదయయును
దాపసమందార నాకు దయసేయగదే!'

అని, అర్థించాడు.

ఆ విధంగా తనపట్ల అనన్యభక్తిని ప్రదర్శించుకున్న సుదామునకు, శ్రీకృష్ణుడు, అతడు కోరిన వరాలతోపాటు, అతని వంశాభివృద్ధికి అవసరమైన ఐశ్వర్యాన్ని, బలాన్ని, ఆయువునూ, యశాన్ని, తేజాన్ని కూడా ప్రసాదించాడు.

* * *

సుదాముడు, పూర్వం, కుబేరుని చైత్రరథ వనంలో, పూలు ఏరే వాడుగా ఉండేవాడు. అప్పు డతని పేరు హేమమాలి.

హేమమాలి, న్యాయబుద్ధి గలవాడు. గురుజన విధేయుడు. దాన శీలుడు. హరిసేవాపరాయణుడు.

అతడు, శ్రీహరిని సాక్షాత్కరింపచేసుకునే ఉద్దేశంతో, ఐదువేల

అరవిందాలను ఏరి కోరి సమకూర్చుకుని, మహేశ్వరుని, స్వయంగా అర్చించాడు.

మహేశ్వరుడు, అతని భక్తికి సంతోషించి, ప్రత్యక్షమై, 'వరమే దయినా కోరుకోవలసింది' అన్నాడు. అది విన్న హేమమాలి, ఆయన్ని అమితంగా స్తుతించి, 'స్వామీ! జగన్నాధుడయిన శ్రీమన్నారాయణుడు, నా ఆతిథ్యాన్ని స్వీకరించేటట్లు అనుగ్రహించవలసింది' అని కోరాడు.

హేమమాలి కోరికను, మహేశ్వరుడు మన్నించాడు. మహేశ్వరుడిచ్చిన ఆ వరాన్నే, శ్రీకృష్ణుడు, ద్వాపరాంతాన చెల్లించటం జరిగింది.

*124.* కంస దాసి కుబ్జ :

సుదామునకు ఆ విధంగా వరాలు ప్రసాదించి, నగరసౌభాగ్యాన్ని తిలకించే ఉద్దేశంతో, బలరామ కృష్ణులు, అక్కడినుంచి బయలుదేరి వెళ్ళారు. వారలా వెడుతూఉండగా, మైపూతలతో నిండిన బంగరుపాత్రలు తీసుకుపోతున్న కంసదాసి, కుబ్జ, వారికి కనిపించింది. శ్రీకృష్ణుడు, ఆమె వికృతాకృతిని చూసి, అమితంగా జాలిపడ్డాడు. అది కారణంగానే, ఆమె నాపి...

'ఎవ్వారెదానవు, లేపము
లెవ్వారికిం గోరి కొనుచు నేగెదు, నీ పే
రెవ్వాతె, మా కి మ్మెన్నియు,
నివ్వటిలెదు చక్కనగుచు, నీరజనేత్రా !'

అని, పలుకరించాడు.

ఆ పలుకులు విన్న కుబ్జ, రామ కృష్ణుల రూప లావణ్య సౌంద ర్యాదులు గ్రహించి, ముగ్ధురాలయింది. వారి మధుర మందహాసాన్ని తిల కించి, మురిసిపోయింది. అది కారణంగానే, ఆమె, తన్ను పలుకరించిన కృష్ణయ్య నుద్దేశించి...

'చక్కనివాడ వౌదు, సరసంబుల నొంపకు, మెల్ల వారికిం
జక్కదనంబు లెక్కడివి, చారు శరీర, త్రివక్రయంత్రుు, నే
నిక్కము కంసు దాసిని, వినిర్మల లేపన విద్యదాన, నన్
మిక్కిలి రాజు మెచ్చు, దగ మీరు విలేపనముల్ ధరింపరే!'

అని, సమాధానపూర్వకంగా ప్రార్థించింది. స్వయంగా, వారికి, మైపూతలు పూసింది. వారిని, మనసారా సేవించుకుంది.

అలా తమ్ము సేవించిన కుబ్జపట్ల, రామ కృష్ణులు ప్రసన్నులయినారు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, ఆమె పాదంమీద తనపాదం మోపి, ఆమె గడ్డంక్రింద చెయి పెట్టి, పైకి ఎత్తాడు. అలా ఎత్తటంవల్ల, ఆమెకు, నడుంవద్దా, వక్షస్థలంవద్దా, కంఠంవద్దా, అంతవరకూ ఉన్న వంకరలు, తొలగిపోయినై; ఆమె, సౌందర్యరాశిగా తయారయింది.

* * *

సీతా రామ లక్ష్మణులు జనస్థానంలో ఉన్న సమయంలో, లంకేశ్వరుని సోదరి అయిన శూర్పణఖ వారిని సమీపించటం, రామచంద్రుని మోహించి, తన్ను పెండ్లిచేసుకోవలసిందిగా ఆయన్ని కోరటం, జరిగింది. రాముడు, ఏకపత్నీవ్రతుడు కావటంవల్ల, ఆమె కోరికను తిరస్కరించాడు. ఆ యథార్థాన్ని గ్రహించలేక, శూర్పణఖ, సీతామహాదేవి ఉండటంవల్ల రాముడు తన్ను తిరస్కరించాడనుకుని, సీతను మ్రింగటానికి ఉద్యమించింది. అది గ్రహించిన సౌమిత్రి, దాని ముక్కునూ చెవులనూ కోసివేశాడు.

ఆ విధంగా అవమానింపబడ్డ శూర్పణఖ, ఆ తరువాత, పుష్కర తీర్థానికి పోయి, శంకరుని గురించి తీవ్రమైన తపస్సు చేసింది. శంకరుడామెకు ప్రత్యక్షమై, 'నీ కోరిక ఏమిటి?' అని అడిగాడు. ఆయనకు సమాధానంగా, శూర్పణఖ, 'శ్రీ రా ము డు నన్ను అనుగ్రహించేటట్టు వరమివ్వవలసింది' అని కోరింది. శంకరుడు, "సరే" నన్నాడు. కాని,' నీ కోరిక ద్వాపర యుగాంతాన తీరుతుంది' అని, చెప్పాడు.

అనంతర జన్మలో, శూర్పణఖ, కుబ్జగా జనించింది. ఆమెకు శంకరుడిచ్చిన వరాన్ని గుర్తుంచుకుని, శ్రీకృష్ణుడు, ఆమెపైన మూడు వంకరలనూ తొలగించి, ఆమెను అనుగ్రహించటం జరిగింది.

*125.* రాచవిల్లు :

ఆ విధంగా కుబ్జను అనుగ్రహించిన అనంతరం, బలరామకృష్ణులు, విపణిమార్గాన నడకసాగించారు. ఆ సమయంలో, పురప్రముఖులూ వణిజులూ, వారిని, చందన తాంబూలాదులతోనూ, పూలమాలలతోనూ, బహువిధాలయిన కానికలతోనూ, సన్మానించటం జరిగింది. అలా సన్మానితులవుతూ, వారు, పోయిపోయి, కంసుని ధనుశ్శాలలో ప్రవేశించారు ; అక్కడ, ఇంద్రచాపంమాదిరి మహాద్భుతంగా ఉన్న ఉద్దండ కోదండాన్ని చూశారు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, ఆ కోదండాన్ని సమీపించి, కావలివారు ఎంతగా వారిస్తున్నా లక్ష్యం చేయకుండా, దాన్ని ఎక్కుపెట్టాడు ; మరుక్షణంలోనే, ఏనుగు చెఱకుగడను విఱిచినట్టుగా విఱిచేశాడు.

అది చూసిన నందాదులు, అమితాశ్చర్యం పొందారు. అది కల్పించిన ధ్వనికి, కంసాదులు, భయవిహ్వలులైనారు.

రాచవిల్లు నావిధంగా అగౌరవపరచిన గోపకుమారులను శిక్షించి తీరాలని, కోదండ రక్షకులు నిశ్చయించుకున్నారు. వారి అభిప్రాయం గ్రహించిన రామ కృష్ణులు, చెరొక కార్ముక ఖండాన్నీ తీసుకుని, వివిధాయుధాలతోనూ, పరివారంతోనూ, తమతో తలపడ్డ వారందరినీ సంహరించటం జరిగింది.

ఆ రోజుకు, ఆ విధంగా, మధురాపురీ విహారం ముగించుకుని, రామ కృష్ణులు, విడిదల చేరుకున్నారు. ఆ మర్నాడు కంసుని కలుసుకునే ఉద్దేశంతో, ఆ రాత్రి, సుఖంగా నిద్రపోయినారు.

బలరామ కృష్ణులు, రాచవిల్లు విఱిచారని విన్న కంసునకు, పరవ

రాముని పలుకులు గుర్తుకు వచ్చినై. తనకు మారకు డౌతాడని ఆయన సూచించినవాడూ, ఆకాశవాణి తెలిపినవాడూ, మాయాబాలిక ప్రకటించిన వాడూ, యీ కృష్ణుడే కాబోలునన్న భావం, అతనిలో జనించింది. దానికి తోడుగా, తన మరణాన్ని సూచించే అనేక ఉత్పాతాలుకూడా, అతని కప్పుడు గోచరించినై.

> అద్దంలో చూసుకున్నప్పుడు తన ముఖం, అందులో ప్రతి ఫలిస్తూకూడా గోచరింపకపోవటం, నీళ్ళలో తొంగి చూసి నప్పుడు, తన మెడ మీద, తల కనపడకపోవటం, వెలుగులో నిలబడి ఉన్నప్పుడు, తన నీడలో రంధ్రాలు కనిపించటం, కర్ణ పుటాలు మూసుకున్నప్పుడు వినిపించవలసిన ప్రాణఘోష విని పించకపోవటం, చెట్లు స్వర్ణపర్ణంకలవిగా కనిపించటం, మేలు కునిఉన్నప్పుడు, అడుగు జాడలు ద్యోతం కావలసిన చోట్ల కూడా కాకపోవటం, స్వప్నావస్థలో, వస్త్రహీనంగా చరించటం, గాడిదమీద ఎక్కి తిరగటం, నెత్తిన నూనె పెట్టుకోవటం, పట్టని పూలమాలలు ధరించటం, అన్నీ ఆసన్న మరణాన్ని సూచినై.

వాటిలో కొన్నిటిని, అంతకుపూర్వం, కంసు డనుభవించాడు. అది కారణం గానే, అతనిలో, మరణభీతి కలిగింది; అశాంతి పెరిగింది.

## *126.* కువలయాపీడం ;

అంతలో తెల్లవారింది. బలరామ కృష్ణులు, తమవారితోపాటు లేచి, స్నానాదికాలు పూర్తిచేసుకున్నారు. ఆ వెంటనే, కంసరాజేంద్రుడు నిర్వహింపబోతున్న మల్ల క్రీడా మహోత్సవాన్ని తిలకించే నిమిత్తం అటుగా బయలుదేరారు.

ఆలా బయలుదేరిన రామ కృష్ణులు, మల్లరంగద్వారం చేరుకునే సమయానికి, భీకరంగా ఘీంకరిస్తున్న మత్తగజం, కువలయాపీడం, వారికి

కనిపించింది. దాన్ని చూసి, వారు అక్కడే ఆగారు. అంతలో, దాని మావటి వాడు, దాన్ని, ఆ అన్నదమ్ముల మీదకు ఉసి గొల్పటం జరిగింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, పోటు తప్పదనుకున్నట్టు, కాసె బిగించి కట్టుకున్నాడు. ముఖంమీద పడుతున్న చిరుకేశాలను ముడివేసుకున్నాడు. ఆ పైన, మేఘ గంభీరస్వరంతో, మావటివాణ్ణి ఉద్దేశించి...

'ఓరీ కుంజరపాల, మా దెసకు నీ యుద్యన్మదేభేంద్రముం
బ్రేరేపం బనిలేదు, త్రిప్పు, మరలం బ్రేరేచినన్, నిన్ను, గం
భీరోగ్రాశనితుల్య ముష్టి హతులన్ భేదించి, నే, దంతకుం
జేరం బుత్తు మహత్తర ద్విపముతో, సిద్ధంబు, యుద్ధంబునన్'

అని హెచ్చరించాడు. అలా హెచ్చరించి ఊరుకోలేదు. చూపరులు తన్ను ప్రశంసిస్తూ ఉండగా, ఆ మత్తగజేంద్రాన్ని సమీపించాడు.

శ్రీకృష్ణు డలా ముందుకురావటం చూసి, మావటివాడు మండి పడ్డాడు. ఆ వెంటనే, అతడు, తన మత్తేభాన్ని ఉద్రేకపరచాడు; కృష్ణయ్యతో డీ కొలిపాడు.

అప్పుడు, కృష్ణయ్యకూ, కువలయాపీడానికీ మధ్య, విచిత్రమైన పోరు జరిగింది కువలయాపీడం, కృష్ణయ్యను, తన తొండంతో పట్టు కుంది. కృష్ణయ్య, దానిపట్టు తప్పించుకుని. దాని కాళ్ళక్రిందకు దూరాడు. అది గ్రహించలేక, ఆ ఏనుగు, అతణ్ణి వెతుక్కుంటూ, వలయాకారంగా కొంతసేపు తిరిగింది. కాని, చివరకు వాసనపట్టి, అతణ్ణి పట్టుకునే ఉద్దేశంతో, తన తొండాన్ని చాచింది. వెన్నదొంగ, దానికి అందకుండా, మెల్ల మెల్లగా వెనక్కుపోయినాడు. అలా పోయి పోయి, దాని తోకపట్టుకుని, లాగి, అటూ ఇటూ త్రిప్పి, దాన్ని అమితంగా పీడించాడు. అది కారణంగా దానికి రోషం పెరిగింది. వెంటనే, అది. అతనిమీదకు కాలు విసిరింది. ఆ దెబ్బను తప్పించుకునే నిమిత్తం, నల్లనయ్య, నేలమీద వ్రాలాడు. అది చూసిన ఆ మత్తగజేంద్రం, కృష్ణయ్య కూలిపోయినాడనే అనుకుంది. అను కుని, అమిత క్రోధంతో, అతణ్ణి, తన దంతాలతో చీల్చటానికని, అతని

మీదకు ఉఱికింది. అది గ్రహించిన కృష్ణయ్య, అతి విచిత్రంగా, ప్రక్కకు తప్పుకున్నాడు. అత డలా తప్పుకోవటంవల్ల, దాని దంతాలు, భూమిలో గ్రుచ్చుకుపోయినవై; అది, అమితంగా బాధపడ్డది.

అలా బాధపడుతూఉన్న ఆ మత్తగజేంద్రాన్ని, మావటివాడు, నిర్లక్ష్యంగా ఉద్రేకపరచాడు. దాంతో, అది, ఒక్కసారిగా, కృష్ణయ్య మీదకు ఉఱికింది. అది చూసిన కృష్ణయ్య, మఱుక్షణంలోనే, దాని రెండు దంతాలనూ పట్టుకోవటం, వాటిని బలవంతంగా పెకలించటం, వాటితోనే దాన్ని మోది గాయపరచటం, జరిగింది. ఆ బాధ భరించలేక, ఆ దంతావళం, గిలగిలా తన్నుకుని, ప్రాణం వదిలింది. ఆ వెంటనే, దానిలోనుంచి బాహిరిల్లిన ఒక దివ్యతేజం, శ్రీకృష్ణుని సమీపించి, ఆయనలో లీనమై పోయింది.

* * *

పూర్వం, బలి కుమారుడు, మందగతి అనేవా డొక డుండేవాడు. అతడు, మహాబలుడు; సర్వశాస్త్రప్రవీణుడు.

అత డొకసారి, శ్రీరంగయాత్రకు బయలుదేరాడు. అలా బయలుదేరినవాడు, దారిలో, కనిపించినవా రందరినీ, మత్తగజంమాదిరి డీ కొంటూ, పడత్రోసుకుంటూ, గమించటం జరిగింది.

అతనివల్ల ఆ విధంగా బాధపడ్డవారిలో, త్రితుడనే ఒక ముని కూడా ఉన్నాడు. ఆయన వృద్ధుడు. బలహీనుడు. ఆయన, నేలమీద పడి పోయినాడు. అమితంగా గాయపడ్డాడు. అది కారణంగా, ఆయనకు, ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే, ఆయన, మందగతి నుద్దేశించి, 'నువ్వు ఏనుగు మాదిరి చరిస్తున్నావుకాబట్టి, ఏనుగువై పోవలసింది' అని శపించాడు.

అలా శాపం పొందినమీదట, మందగతికి, తన దోషం తెలిసి వచ్చింది. ఆ వెంటనే, అతడు, ఆయన పాదాలమీదపడి, క్షమించవలసిందిగా ప్రార్థించాడు. కాని, ఆ మహర్షి, తన శాపం వ్యర్థం కాదనీ, శ్రీకృష్ణుని

ద్వారా మాత్రమే అతనికి ముక్తి లభిస్తుందనీ, తెలియజేశాడు.

ఆ తరువాత, మందగతి, కువలయాపీడమనే పేరుతో, వింధ్య పర్వతాలలో జనించటం జరిగింది. దాన్ని, మగధేశ్వరుడయిన జరాసంధుడు అతి కష్టంమీద స్వాధీనపరచుకున్నాడు; కాలక్రమాన, దాన్ని, కంస రాజేంద్రునకు కానికగా సమర్పించుకున్నాడు.

ఆ మత్తగజేంద్రాన్నే, శ్రీకృష్ణుడు, సునాయాసంగా సంహరించటం, తద్వారా, మందగతికి ముక్తిని ప్రసాదించటం, జరిగింది.

## *127. రంగస్థల ప్రవేశం:*

ఆ విధంగా, కువలయాపీడం అనే మత్త మాతంగాన్ని వధించి, గోవిందుడు, దాని దంతాన్ని బుజాన పెట్టుకుని, బలరామునితోనూ, తదితర యాదవులతోనూ, రంగస్థలం సమీపించాడు. అలా సమీపించిన కృష్ణయ్య, మల్లులకు పిడుగుమాదిరిగా, పురుషులకు మూర్తిదాల్చిన పౌరుషంగా, యువతీమణులకు నవమన్మథుడుగా, గోపబాలురకు వారి ప్రాణస్నేహితుడుగా, దుర్మార్గులకు శాసకుడుగా, తల్లిదండ్రులకు తమ ముద్దుబిడ్డడుగా, కంస రాజేంద్రునకు మృత్యుదేవతగా, అజ్ఞానులకు అల్పుడుగా, యోగీశ్వరులకు తత్త్వస్వరూపుడుగా, యాదవులకు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడుగా, గోచరించటం జరిగింది. అలా దర్శనీయుడయిన శ్రీకృష్ణునీ, అతని ప్రక్కనే ఉన్న బలరామునీ, చూసి, అక్కడివారు...

'వసుదేవు నివాసంబున
వసుధన్ రక్షింప వీరు వైష్ణవ తేజో
ల్లసనమున బుట్టినారట
పసిబిడ్డ లనంగ జనదు పరదేవతలన్'

అని, తమకు వారిపై కుదిరిన భక్తిభావాన్ని, పరస్పరం వ్యక్తపరచుకున్నారు. అంతేకాదు...

"చంపె రక్కసి బట్టి చక్రవాకుని గూల్చె
బడ 'ద్రోసె' మద్దుల బకుని జీరె
నఘదైత్యు బొరిగొనె నదరి వత్సకు ద్రుంచె
గిరియె త్తి దేవేంద్రు గ్రిందు పఱిచె
గాళియు మర్దించె గహనానలము ద్రావె
గేశి నంతకుపురి క్రేవ కనిచె
మయపుత్రు బరిమార్చె మఱియును దానవ
భటుల హరించి గోపకుల గాచె
గోపకాంతల మనముల కోర్కి దీర్చె
నీ సరోరుహలోచనుం డీ శుభాంగు
డీ మహామహుం డీ దిగ్గజేంద్రనిభుడు
మనుజమాత్రుడె తలపోయ మాధవుండు"

అని, శ్రీకృష్ణుని లీలావిశేషాలను తలచుకుంటూ, అబ్బురపడసాగారు.

*128*. సమరాహ్వానం :

ఆ విధంగా, పురజనుల ప్రశంసలు పొందుతూ, రంగస్థలం దిక్కుగా వస్తున్న రామకృష్ణులను, చాణూరుడు చూశాడు. చూసి...

'వనమార్గంబున గోపబాలకులతో వత్సంబులన్ మేపుచున్
బెనగన్ మిక్కిలి నేర్చినా రనుచు నీ పృథ్వీజనుల్ సెప్ప మా
మనుజేంద్రుం డిట మిమ్ము జీరబనిచెన్ మల్లాహవక్రీడకుం
జనదే కొంత పరాక్రమింప మనకున్ సభ్యుల్ విలోకింపగన్'

అని పలుకరించాడు. అంతే కాదు.

'జనములు నేర్చిన విద్యలు
జననాధుని కొఱకుగాదె జననాధుడు నీ
జనములు మెచ్చగ యుద్ధం
బున మనముం గొంత ప్రొద్దు పుత్తమె కృష్ణా!'

అనికూడా అన్నాడు. అతనికి సమాధానంగా, శ్రీకృష్ణుడు...

'సాములు లేవు, పిన్నలము, సత్త్వము గల్గనరాదు, మల్ల సం
గ్రామ విశారదుల్ కులిశకర్కశ దేహులు మీరు, మీకడ
న్నేము చరించు టెట్లు, ధరణీపతి వేడ్కలు సేయువారముం
గాము, వినోదముల్ సలుపగా దనవచ్చునె యొక్కమాటికిన్'

అని, అతని ఆహ్వానానికి తన అంగీకారాన్ని తెలియపరచాడు. అదివిన్న చాణూరుడు, 'కృష్ణా ! నువ్వుగాని, బలుడుగాని, నీవన్నట్లు పిన్నలు గారు. వేయి యేనుగుల బలంగల కువలయాపీడాన్ని, అనాయాసంగా, 'ఇట్టె' కూల్చివేసిన మీరు, బాలు రనుకోవటం గాని, మల్లయుద్ధ విశారదులు కారనుకోవటం గాని, భ్రమ కాకపోదు. మీరు మాతో పోట్లాడటంలో, అధర్మ మేమీ ఉండదు. ఇక మీ మీ శక్తిసామర్థ్యాలను, మా పట్ల చూపవలసింది; మహారాజుకు వినోదం కలిగించవలసింది' అన్నాడు. ఆ వెంటనే, కృష్ణయ్య అతణ్ణి ఉద్దేశించి...

'నీ తోడుత నే బెనగెద
బ్రీతిన్ ముష్టికునితోడ బెనగెడి బలు డు
గ్రాతత మల్లాహవమున
భూతలనాధునకు మెచ్చు పుట్టింతు సభన్'

అని, అతడితో పోటుసలుపటానికి తనకున్న ఉత్సాహాన్ని వ్యక్తపరచాడు.

శ్రీకృష్ణుని పలుకులు, చాణూరునకు, రోషం కలిగించినై. అది కారణంగానే, అతడు, వికటాట్టహాసం చేశాడు. ఆపైన, కృష్ణయ్య నుద్దేశించి ...

'నాతో బోరగ నెంతవాడ, విసిరో, నాపాటియే నీవు, వి
ఖ్యాతుండం, గులజుండ, సద్గుణుడ, సత్కర్మ స్వభావుండ, నీ
కేతాదృగ్విభవంబులెల్ల గలవే, యీపీట బోరాడుటల్
వ్రేతల్ చూడగ గుప్పిగంతు లిడుటే, వీక్షింపు, గోపార్భకా !'

అని, తన్ను తాను పొగడుకున్నాడు ; ఆయన్ని హేళనచేశాడు. అప్పటికీ ఆగకుండా...

'వ్రల్లదమేటికి గోపక,
బల్లిదుడను, లోకమందు ప్రఖ్యాతుడ, నా
చల్లదముక్రింద దూఱని
మల్లురు లే, రెందు, ధరణి మండలమందున్'

అని, తన అద్వితీయ ప్రతాపాన్ని, తనకుతానై ప్రకటించుకున్నాడు కూడా.

అంతలో, ముష్టికుడు ముందుకువచ్చి, అతిభీకరంగా గర్జించాడు. జబ్బలు చరచాడు. ఆ ధ్వనికి బెదరిపోయినవాని మాదిరి, కృష్ణయ్య, గబగబా, బలరాముని వెనుకకు వెళ్ళాడు. అది చూసిన చాణూరుడు, పగలబడి నవ్వాడు. అలా నవ్వుతూనే, అతణ్ణి ఉద్దేశించి...

'మహిమతో నుండంగ మధురాపురము గాని
పొలుపారు వైకుంఠపురము గాదు
గర్వంబుతో నుండ గంసుని సభ గాని
సంసార రహితుల సభయు గాదు
ప్రకటించి వినగ నా బాహునాదము గాని
నారదు వీణాస్వనంబు గాదు
చదురు లాడగ మల్లజన నిగ్రహము గాని
రమతోడి ప్రణయ విగ్రహము గాదు
వెలసి తిరుగంగ వేదాంత వీధి కాదు
మొఱగిపోవంగ ముని మనోమూల కాదు
సాగి నడవంగ భక్తుల జాడ కాదు
శౌరి నా మ్రోల నీ వెందు జనియె దింక !'

అని, హేళనపూర్వకంగా అయినా, శ్రీకృష్ణుడు శ్రీమన్నారాయణుడే అన్న భావంతో అన్నాడు ; అంటూనే, అతని దిక్కుగా ఉఱికాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణ చాణూరులకూ, బలరామ ముష్టికులకూ మధ్య, భీకరమైన మల్లయుద్ధం జరిగింది. వారు, చేతులు చఱచినప్పుడు, తొడ లప్పళించినప్పుడు, తలలతోను మోచేతులతోను ఢీకొన్నప్పుడు, అదచు కున్నప్పుడు, క్రింద పడ్డప్పుడు, కలిగిన శబ్దాలకు, రోదోంతరాళం మారు మ్రోగింది. ఆ సమయంలో, ఆ నలుగురూ, ప్రళయాగ్నుల మాదిరి ప్రజ్వ లించారు ; ఒకరికొకరు ఏ విధంగానూ తీసిపోకుండా, తమతమ సామర్థ్యా లను ప్రదర్శించుకున్నారు.

*129.* ప్రజాభిప్రాయం ;

అది చూసిన పౌరకాంతలు, బలరామ కృష్ణులమీది ప్రేమాతి శయంవల్ల, వారికి ఏ ఆపద సంభవిస్తుందో అని భయపడసాగారు. గుంపులు గుంపులుగాచేరి, వేడి నిట్టూర్పులు విడుస్తూ...

'మంచి కౌమారులం, గుసుమమంజు శరీరుల దెచ్చి, చెల్లరే,
యంచిత వజ్రసారులు, మహాద్రి కఠోరులు నైన, మల్లురం
గించులబెట్టి, రాజు, పెనగించుచు చూచుచు నున్నవాడు, మే
లించుక లేదు, మాను మన, డిట్టి దురాత్ముని మున్ను వింటిమే.

చూచెదరు గాని, సభికులు,
నీ చిన్ని కుమారకులకు నీ మల్లురకున్,
ఓ చెల్ల, యీడుగాదని
సూచింపరు పతికి. దమకు శోకము గాదే !'

అని, రాజేంద్రునీ, సభికులనూ, తమలోతాము తీవ్రంగా విమర్శించుకున్నారు. వారిలో కొందరు...

''వేణు నాళములమై వెలసిన మాధవుం
దధరామృతమునిచ్చి యాదరించు
బింభదామములమై పెరిగిన వెన్నుడు
మస్తకంబున దాల్చి మైత్రి నెఱపు

పీతాంబరములమై బెరసిన గోవిందు
డంసభాగమున బాయక ధరించు
వైజయంతికలమై వాలిన గమలాక్షు
డతి కుతూహలమున నరుత నునుచు
దనరు బృందావనంబున దరుణమైన
గృష్ణు డానందమున జేరి క్రీడసల్పు
నెట్టి నోములనయిన ము న్నిట్టి విధము
లేల కామైతి మోయమ్మ యింక నెట్లు"

అని, పరస్పరం అనుకుని, తమదైన దురదృష్టానికి వాపోవసాగారు. అంతలో, చాణూరుడు, అమితంగా బడలిపోవటం సంభవించింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అమాంతంగా అతణ్ణి పట్టుకుని, గిరగిరా త్రిప్పి, నేలకు వేసి కొట్టాడు. అది కారణంగా, చాణూరుడు, గావుకేక పెడుతూ, నెత్తురు కక్కుకుని ప్రాణం వదలటం, జరిగింది.

అదే సమయంలో, బలరాముడు, ముష్టికుని పడద్రోసి, పాదంతో త్రొక్కి, అతని ప్రాణాలుతీశాడు. అది చూసిన కొందరు మల్లురు, ఆ వెంటనే, ఒక్కుమ్మడిగా, బలరామ కృష్ణులతో తలపడ్డారు. వా రందరినీ కూడా, ఆ అన్నదమ్ములు, అవలీలగానే వధించేశారు. ఆ పరిస్థితినంతనూ అర్థంచేసుకున్న ఇతరవీరులు, చెల్లాచెదరైపోయినారు.

ఆ విధంగా మల్లు రందరినీ వధించిన బలరామ కృష్ణులను చూసి, కంసుడుక్షీతప్ప మిగిలినవా రందరూ, అమితాశ్చర్యం పొందారు ; వా రా చిరంజీవులను, విశేషంగా ప్రస్తుతించారు.

* * *

పూర్వం, అమరావతీపురంలో, ఉతథ్యుడనే ఒక మహర్షి ఉండే వాడు. ఆయనకు, అమితసౌందర్యమూర్తులైన అయిదుగురు కుమారు లుండే వారు. వారు, పెరిగి పెద్దవారైకూడా, విద్యాబుద్ధులు వృద్ధిచేసుకోకుండా, బలాధిక్యతను మాత్రమే పెంపొందించుకుంటూ, తోమర ముద్గరాదులతో

సమర క్రీడ సలుపుతూ, కాలం గడిపేవారు. అది చూసిన ఉతథ్యుడు, వారు భ్రష్టులైనారని భావించి, అమితంగా విచారపడేవాడు.

బ్రాహ్మణులై జన్మించికూడా, శమ దమాది సంపత్తి లేకుండా, క్షత్రియోచితమైన కర్మలలో మెలుగుతూఉన్న కుమారులకు ధర్మమార్గాన్ని బోధించాలని, ఆ తండ్రి ఎంతగానో ప్రయత్నించాడు. కాని, అతని ప్రయత్నాలన్నీ విఫలమైపోయినై. వారు, ఆయన మాటను ఇసుమంతైనా పాటించకుండా వ్యవహరించసాగారు.

అది గ్రహించిన ఉతథ్యుడు, ఒకసారి, అమితమైన వేదనతో, వారిని ఉద్దేశించి, మీరు అసురులై పుట్టి, అసురసంపర్కం పొంది, మల్ల విద్యా ప్రదర్శకులుగా చరిస్తారు,' అని. శపించాడు.

తండ్రివల్ల ఆ విధంగా శపింపబడ్డ సోదరులే, ఆ తరువాత, చాణూరుడు, ముష్టికుడు, కశలుడు, తోశాలకుడు, కూటుడు అనే అసురులుగా జన్మించటం, కాలనేమి అయిన కంసుని కొలువులో చేరటం, చివరకు, శ్రీకృష్ణుని మూలంగా శాపవిముక్తి పొందటం, జరిగింది.

## *130. కంస సంహారం :*

చాణూర ముష్టికుల సంహారం మూలంగా జనించిన కలకలాన్ని నివారించే నిమిత్తం, కంసుడు, తన మంత్రుల నుద్దేశించి...

'వల్లవబాలురన్ నగరి వాకిటికిన్ వెడలంగ 'ద్రోయు', డీ
గొల్లల ముట్టికోల్ గొనుడు, క్రూరుని నందుని గట్టు డుర్వికిం
దెల్లముగాగ నేడు వసుదేవుని జంపుడు, తండ్రిగాడు వీ
డెల్ల విధంబులం బరుల కిష్టుడు, గావకు, డుగ్రసేనునిన్'

అని ఆజ్ఞాపించాడు. ఆ పలుకులు విన్న శ్రీకృష్ణుడు, అమితమైన ఆగ్రహంతో, అతనిమీదికి, ఒక్కసారిగా ఉఱికాడు.

అలా, మృత్యువు మాదిరి తనమీదికి ఉఱుకుతున్న కృష్ణయ్యను చూసి, కంసుడు, తటాలున తన ఆసనం మీదినుంచి క్రిందికి దుమికాడు.

ఒఱనుంచి ఖడ్గాన్ని పెరికి, అతనితో తలపడ్డాడు. అప్పుడు...

పక్షీంద్రుం డురగంబు బట్టువిధ మొప్పం, గేశబంధంబు లో
క క్షోభంబుగ బట్టి, మౌళిమణు లాకల్పాంత వేళాపత
న్నక్షత్రంబులభంగి రాల, రణ సన్నాహంబు రెట్టింప, రం
గ క్షోణిం బడద్రోసె, గృష్ణుడు, వెసం గంసున్, నృపోత్తంసునిన్.

ఆ విధంగా, రంగమధ్యంలో కూలిపోయిన కంసుని పైకి ఉఱికి, కృష్ణయ్య, అతని కిరీటాన్ని కాలితో తన్నాడు. అతని ప్రక్కటెముకలన్నీ నుగ్గునుగ్గయేటట్టు మర్దించాడు. అతడు ప్రాణాలువదిలేవరకూ అలా పీడించి, చివరి కతణ్ణి ఈడ్చి, ఒక మూలకు విసరివేశాడు. అంతలో, కంసునిలో నుంచి ఒక దివ్యతేజం బయటకు వచ్చి, శ్రీకృష్ణునిలో ప్రవేశించింది.

కంసుడు, రాత్రింబవళ్లు, అనుక్షణం, శ్రీకృష్ణునే చింతిస్తూ ఉండేవాడు. తింటూ, త్రాగుతూ, విహరిస్తూ కూడా, అతడు, శ్రీకృష్ణునే స్మరించుకునేవాడు. శ్రీకృష్ణునిచేత తాను సంహరింపబడటం తథ్యమని తెలుసుకుని, అతడు, సర్వవేళలా, ఉద్విగ్న చిత్తంతో, ఆయననే తలచుకునేవాడు. ప్రతిపదార్థంలోనూ ఆయననే చూసేవాడు. అది కారణంగానే, అతడు, అంతిమాన, ఆయనలో లీనమైపోవటం జరిగింది.

కంసుని మరణవార్త కర్ణపుటాల్లో పడగానే, అతని తమ్ములు, కంకుడు, న్యగ్రోధుడు, సహ్వుడు మొదలయినవారు, పగ సాధించుకునే నిమిత్తం, ఒక్కుమ్మడిగా, బలరామ కృష్ణులమీద పడ్డారు. కాని, బలరాముడు, వారిలో ఒక్కనికూడా తన తమ్ముని కందనీకుండా, తనే, హతమార్చేశాడు.

* * *

కంసానుజులు, పూర్వం, అలకాపుర నివాసులు; దేవయక్షుడనే వాని కుమారులు. వా రప్పుడు, దేవకూట, మహాగిరి, గండ, చండ, ప్రచండ, ఖండ, అఖండ పృథువులనే పేర్లు కలిగి ఉండేవారు.

ఆ అన్నదమ్ము లొకసారి, తమ తండ్రి ఆదేశం ప్రకారం,

మానసరోవరానికి వెళ్ళి, మహేశ్వర పూజార్థం, అరవిందాలను తీసుకు రావటం జరిగింది. కాని, దారిలో, వాటి సౌరభానికి ముగ్ధులై, వారు, వాటిని ఆఘ్రాణించారు. దానివల్ల, వారికి, ఉచ్ఛిష్టీకృతదోషం సంభవించింది. అది కారణంగా, వారు. ఎనిమిది మందీ, వరుసగా మూడు జన్మలలో, అసురులై జనించటం జరిగింది. మూడవమారు, వారు, ఉగ్రసేన సుతు లయినారు. శ్రీకృష్ణ బలరాముల దర్శన స్పర్శనాదులద్వారా, పాపవిమోచనం పొందారు.

## *131. వసుదేవాదుల బంధవిముక్తి :*

కంసరాజేంద్రుని మరణవార్త విని, అతని పత్నులు, అక్కడకు, పరుగు పరుగున వచ్చారు. వచ్చి కూలిపోయిన కంసుని కళేబరం మీద పడి అమితంగా రోదించారు.

అలా రోదిస్తున్న రాజపత్నుల నూరడించి, శ్రీకృష్ణుడు, కంసాదులకు, దైహిక సంస్కారాలు జరిపించే ఏర్పాట్లన్నీ చేశాడు. అనంతరం బలునితో సహ బయలుదేరి వెళ్ళి, తన తల్లిదండ్రులను కలుసుకున్నాడు. వారి సంకెలలు విడిపించాడు. వారికి సాష్టాంగనమస్కారం చేశాడు.

అంతకుముందు, అక్కడ జరిగిన విశేషాలన్నింటినీ గ్రహించిన దేవకీ వసుదేవులు, తమకు పాదాభివందనం చేస్తున్న చిరంజీవులు, జగదీశ్వరులే కాని సామాన్యులు కారన్న అభిప్రాయంతో, వారిని లేవదీయటానికీ, ఆలింగనం చేసుకోవటానికీ సంకోచించారు. వారిని స్పృశించటంకూడా, వారి పట్ల అపచారం చేయటం కావచ్చునని భావించారు. అందుకనే, వారి వంక చూస్తూ, అలాగే నిలబడిపోయినారు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. తమ తల్లిదండ్రులు, తమ్ము ప్రేమించి, సేవించి, దివ్యానుభూతుల ననుభవించక ముందే తమ దివ్యత్వాన్ని గ్రహించటం, వారి ఆనందానికి పరిపూర్ణత్వాన్ని ప్రసాదించదని భావించాడు. అది కారణంగానే, వారికి లభించిన జ్ఞానాన్ని తొలగించేనిమిత్తం, తన మాయను, వారిమీద ప్రయోగించాడు. ఆపైన, వారిని ఉద్దేశించి...

'కారాశాలల మా నిమిత్తము మిముం గంసుండు గారింపగా
వారింపంగ సమర్థతల్ గలిగియున్ వారింపగా రాక ని
ష్కారుణ్యాత్ముల మైన క్రూరుల మహా కౌటిల్య సంచారులన్
సారాతిక్షములార మమ్ము గొఱతల్ సైరించి రక్షింపరే !'

అని, ప్రతిమాలుకున్నాడు. ఆ సందర్భంలోనే ..

'చెల్లుబడి గలిగి యెవ్వడు
తల్లికి దండ్రికిని దేహ ధనముల వృత్తుల్
చెల్లింప డట్టి కష్టుడు
ప్రల్లదు డామీద నాత్మపలలాశి యగున్.

జననీ జనకుల వృద్ధుల
దనయుల గురు విప్ర సాధు దారాదుల నే
జనుడు ఘనుడయ్యు బ్రోవక
వనరును జీవన్మృతుండు వాడు ధరిత్రిన్'

అనికూడా, తన హృదయాన్ని, ఆయన, దేవకీ వసుదేవులకు విశదపరచుకున్నాడు.

మాయామానవుడయిన శ్రీహరి, ఆ విధంగా, తనకు తన తలిదండ్రుల మీద ఉన్న గౌరవాభిమానాలను వ్యక్తపరచుకుని, మాతామహుడైన ఉగ్రసేనుని సమీపించి...

'అనఘ యయాతి శాపమున యాదవ వీరులకున్ నరేశ్వరా
సనమున నుండరాదు నృపసత్తమ రాజవుకమ్ము భూమి కే
నిను గొలువంగ నిర్జరులు నీకరి బెట్టుదు రన్య రాజులం
బనిగొను చెంత రమ్ము జనపాలనశీలివి గమ్ము వేడ్కతోన్'

అని, ఆయన్ని గౌరవించి, రాజుగా అభిషేకించాడు. ఆ వెంటనే, పవమానుని పిలిచి, 'సుధర్మ' అని పిలువబడే ఇంద్రసభను ఆయనకు తెచ్చి ఈయవలసిందిగా ఆదేశించాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, బలరామ సహితుడై, నందునివద్దకు వెళ్ళి, ఆయనకు గౌరవం చూపాడు. ఆ సమయంలోనే, ఆయన్ని ఉద్దేశించి...

'తండ్రిం జూడము తల్లి జూడము యశోదాదేవియున్ నీవు మా
తండ్రిం దల్లియు నంచు నుండుదుము సద్ధర్మంబులం దొల్లి యే
తండ్రుల్ బిడ్డల నిట్లు పెంచిరి భవత్సౌజన్యభావంబులం
తండ్రీ యింతటివార మైతిమికదా తత్తద్వయోలీలలన్'

అని, ఆ దంపతులపట్ల తమ కృతజ్ఞతను విశదపరచుకున్నాడు వారిని, దివ్యవస్త్రాద్యలంకారాలతో సత్కరించాడు.

అనంతరం, కొంతకాలానికి, అంతకుపూర్వం, కంసునిబాధ భరించలేక దూరప్రాంతాలకు వెళ్ళిపోయిన తనవారిని, యాదవులను, వృష్ణులను, అంధకులను, మాధవులను, దాశార్హులను, కుకురులు మున్నగు వారిని, అందరినీ అక్కడకు రప్పించుకున్నాడు. అంతవరకూ వారు అనుభవించిన కష్టాల పట్ల, తన సానుభూతిని తెలుపుకున్నాడు. వారందరికీ, విశేష ధనరాసుల నిచ్చి, వారివారి నివాసాలలో వారికి పునరావాసం కల్పించాడు.

## 132. గురు శుశ్రూష :

అది జరిగిన కొద్దికాలానికి, వసుదేవుడు, గర్గాచార్యుని ద్వారా, రామ కృష్ణులకు, విధ్యుక్తంగా, ఉపనయన సంస్కారం జరిపించాడు. ఆ సమయంలో, ఆయన, బ్రహ్మవిదులను యథావిధిగా పూజించాడు. యథోచితంగా సత్కరించాడు. అంతేకాదు. శ్రీకృష్ణ బలరాముల జనన సమయంలో తాను, మానసికంగా బ్రాహ్మణోత్తములకు దానం చేసిన గోవులను. అనంతర కాలంలో కంసుడు అన్యాయంగా స్వాధీనపరచుకున్నవాటిని, తెప్పించి, వాటి కొమ్ములకు బంగారపు తొడుగులువేయించి, పైడి మెడ త్రాళ్ళతోనూ తదితరమైన ఆభరణాలతోనూ వాటిని అలంకరించి, వాటివాటి దూడలతో సహా, వాటిని, స్వయంగా, విప్రులకు సమర్పించుకున్నాడు. ఆ తరువాత...

ఉర్విన్ మానవు లెవ్వరైన గురువాక్యోద్యుక్తులై కాని త
త్పూర్వారంభము సేయబోల దనుచున్ బోధించు చందంబునన్
సర్వజ్ఞత్వముతో జగద్గురువులై సంపూర్ణులై యుండియుం
గుర్వంగీకరణంబు సేయజని రా గోవిందుడున్ రాముడున్.

ఆ సమయంలో, సకల విద్యావిలాసి అయిన సాందీపని మహర్షి, వారణాసిలో ఉంటున్నాడు. అదిగ్రహించిన బలరామ కృష్ణులు, అక్కడికి వెళ్ళారు. వెళ్ళి, ఆయనకు శిష్యులుగా చేరారు. ఆయన్ని సేవించి, సంతుష్టి పరచారు.

అది కారణంగా, సాందీపని, వారికి, వేదవేదాంగాలను, ధనుర్వే దాన్ని, ధర్మశాస్త్రాన్ని, తర్కమీమాంసలను, రాజనీతిని, అలాగే అరువది నాలుగు విద్యలనూ నేర్పాడు. వారు నెగవాదులు కావటంవల్ల, అరువది నాలుగు రోజుల్లోనే, వాటినన్నింటినీ, సాంగోపాంగంగా గ్రహించారు. ఆ తరువాత, ఆయన్ని అర్చించి, 'మహాత్మా ! మీరు కోరిన గురుదక్షిణ నివ్వ టానికి మేము కుతూహల పడుతున్నాము. అదేదైనాసరే, ఆ దేశించవలసింది' అని, వినయ పూర్వకంగా నివేదించుకున్నారు.

తన ప్రియశిష్యులయిన రామ కృష్ణులు అద్భుతమహిమా సమ న్వితులని గ్రహించిన సాందీపని, తన భార్యతో ఆ విషయ మాలోచించాడు. ఆలోచించి...

'అంభోరాశి ప్రభాస తీర్థమున ము న్న స్మత్తనూ సంభవుం
డంభోగాహము సేయుచున్ మునిగి లేడయ్యెం గృపాంభోనిధుల్
శుంభద్వీర్యులు మీరు మీ గురునికిన్ జోద్యంబుగా శిష్యతన్
గాంభీర్యంబున బుత్ర దక్షిణ యిడం గర్తవ్య మూహింపరే !'

అన్నాడు. అంతే కాదు.

'శిష్యులు బలాఢ్యులైన వి
శేష్య స్థితి నొంది గురువు జీవించును ని

ర్ధూష్య గుణ బలగరిష్టులు
శిష్యులరై గురునికోర్కె సేయందగదే!'

అని కూడా వారిని ప్రోత్సహించాడు. ఆ వెంటనే, బలరామ కృష్ణులు, తమ దివ్య రథాన్ని అధిరోహించి, ప్రభాసతీర్థం చేరుకున్నారు. వా రలా తన్ను సమీపించారని తెలుసుకున్న వరుణదేవుడు, వారి మాహాత్మ్యాన్ని గ్రహించిన వాడు కావటంవల్ల, అనేకమైన కానికలతో వారిని సందర్శించుకున్నాడు. ఆ సందర్భంలో, కృష్ణయ్య, ఆయన్ని ఉద్దేశించి...

'సాగర సుబుద్ధితోడను
మా గురుపుత్రకుని దెమ్ము మాఱాడిన నీ
వాగడ మవుదువు దుస్సహ
వేగ రణాభీల నిశిత విశిఖాగ్నులకున్'

అని, తన హృదయాన్ని తెలియపరచుకున్నాడు.

ఆ మాటలు విన్న సముద్రుడు, అదలిపోయినాడు. అది కారణంగానే, అతడు, వారిని ఉద్దేశించి...

'వంచన యింతలేదు యదువల్లభులార ప్రభాస తీర్థమం
దంచితమూర్తి విప్రసుతు డార్యుడు తోయములాడుచుండ ను
త్సంచలి తోర్మి యొక్కటి ప్రచండగతిం గొనిపోయె బోవగా
బంచజనుండు మ్రింగె నతి భాసురశీలుని విప్రబాలునిన్'

అని, నివేదించుకున్నాడు. పంచజనుని నివాసం కూడా వారికి తెలియపరచుకున్నాడు.

ఆ వెంటనే, రామ కృష్ణులు, శంఖరూపధారి అయిన పంచజనుని సమీపించి, ఆ అసురుని సంహరించారు. అతని పొట్ట అంతా గాలించిచూశారు. కాని, వారి గురుపుత్రుడు వారికి కనిపించలేదు. ఆ వెంటనే, వారు, అతని లోని, పాంచజన్యం అనే శంఖాన్ని తీసుకుని, విప్రబాలుని వెతుక్కుంటూ, సంయమనీ పురం చేరుకున్నారు.

ఆ విధంగా సంయమనీపురం చేరుకుని, నగరద్వారంలో ఉండే, శ్రీకృష్ణుడు, పాంచజన్యం పూరించాడు. ఆ ధ్వని చెవుల బడగానే, యముడు ఆ అన్నదమ్ములను సమీపించి, భక్తితో పూజించాడు; వారు వచ్చినపని యేమిటో తెలుపవలసిందిగా కోరాడు.

యముని వినయ విధేయతలకు, శ్రీకృష్ణుడు, అమితానందం పొందాడు. అది కారణంగానే, ఆయన, అతణ్ణి ఆదరభావంతో చూసి, 'మా గురు పుత్రుడు, తన పూర్వకర్మకు కట్టుబడి, అకాలమరణం పాలు కావటం జరిగింది. అతణ్ణి, ఇప్పుడు, మాకు ఒప్పచెప్పవలసింది' అన్నాడు.

ఆ పలుకులువిన్న శమనుడు, ఆ వెంటనే, అక్కడ ఉన్న విప్ర బాలుని, శ్రీకృష్ణునకు ఒప్పగించాడు. అతణ్ణి తీసుకుపోయి, రామకృష్ణులు తమ గురువత్నికు సమర్పించుకున్నారు ; ఆయన ఆశీస్సులందుకుని, తిరిగి మధురానగరం చేరుకున్నారు.

* * *

శ్రీ మన్నారాయణునకు ఉపాంగాలుగా ఉండి ప్రఖ్యాతి పొందిన చక్రాదులలో, పాంచజన్యం ఒకటి. ఆ పాంచజన్యాన్ని పూరించటం ద్వారా, శ్రీహరి, శాత్రవానీకంలో భీతిని కల్పిస్తూ ఉండేవాడు ; అనంతరం, వారిని జయిస్తూ ఉండేవాడు.

పాంచజన్యానికి, అది గర్వకారణంగా ఉండేది. శ్రీసతికి కూడా దుర్లభమైన శ్రీహరి అధరసుధారసాన్ని, అనవరతం ఆస్వాదిస్తూఉండే అదృష్టం, తనకు మాత్రమే లభించినట్టు, అది భావి చేది. అది కారణం గానే, శ్రీహరి వైన చక్రాద్యాయుధాలనూ శ్రీసతినీ కూడా, అది, చిన్న చూపు చూసేది.

అది గ్రహించిన శ్రీసతి, దాని గర్వాన్ని హరించేనిమిత్తం, అసుర జన్మ నందవలసిందిగా దాన్ని శపించింది. అలా శపింపబడ్డ శంఖమే, ఆ తరువాత, పంచజనుడుగా జనించటం జరిగింది.

## 133. ఉద్ధవ హృదయం :

మధురకు తిరిగి వచ్చిన తరువాత, శ్రీకృష్ణు డొకసారి, యాదవ ప్రముఖుడూ, తనకు శిష్యుడూ, ఏకాంతభక్తుడూ అయిన ఉద్ధవునిపిలిచి...

'లౌకిక మొల్లక న న్నా
లోకించు ప్రపన్నులకును లోబడి కరుణా
లోకనముల బోషింతును
నా కాశ్రితరక్షణములు నైసర్గికముల్'

అని తెలియపరుస్తూ, తన యోగ క్షేమాదులు, నందాదులకూ గోపికలకూ అందచేసేనిమిత్తం, అతణ్ణి, వ్రేపల్లెకు పంపాడు. అలా మంద చేరుకున్న ఉద్ధవునకు, నందాదులు, అత్యంతాభిమానంతో స్వాగతం చెప్పారు. అతడే తమ పాలిటి కృష్ణు డనుకుని, ఆనందించారు. అతణ్ణి సత్కరించారు. ఆ తరువాత, నందు డతణ్ణి సమీపించి...

'నా మిత్రుడు వసుదేవుడు
సేమంబున నున్నవాడె చెలువుగ బుత్రుల్
నేమంబున సేవింప మ
హా మత్తుండైన కంసు డడగిన పిదపన్.

అన్నా భద్రమె తల్లిదండ్రుల మమున్ హర్షించి చింతించునే
తన్నుం బాసిన గోప గోపికల మిత్ర వ్రాతమున్ గోగణం
బు న్నిత్యంబు దలంచునే వన నదీ భూముల్ ప్రసంగించునే
వెన్నుం డెన్నడు వచ్చునయ్య యిటు మా వ్రేపల్లెకు న్నుద్ధవా!'

అని, తనకు, వసుదేవాదులపట్లా శ్రీకృష్ణునిపట్లా ఉన్న అభిమానాన్ని పురస్కరించుకుని, ప్రశ్నించాడు. ఆ తరువాత, తమతో ఉన్న సమయంలో నల్లనయ్య చేసిన పనులన్నీ తలచుకుని, ఆనందాశ్రులు రాల్చాడు. యశోద కూడా, ప్రేమవిహ్వలచిత్తంతో, కృష్ణయ్యనే తలచుకుంటూ, అతణ్ణి తిరిగి

ఎప్పు డెలా సందర్శించడమా అన్న ఆలోచనలో ఉండిపోయింది. అది గ్రహించిన ఉద్ధవుడు, వారిని ఉద్దేశించి...

'జననీ జనకుల మిమ్ముం
గనుగొన శీఘ్రంబె వచ్చు గని భద్రంబుల్
వనజాక్షుం డొనరించును
మనమున వగవకుడు ధైర్యమందనులారా!'

అని, వారికి, మనశ్శాంతి కలిగించాడు. ఆ పైన, బలరామ కృష్ణుల మాహాత్మ్యాన్ని గూర్చి, ఇలా విశదపరచాడు.

"బలుడుం గృష్ణుడు మర్త్యులే వసుమతీభారంబు వారింప వా
రల రూపంబుల బుట్టినాడు హరి నిర్వాణ ప్రభుం డెవ్వ డు
జ్జ్వలుడై ప్రాణ వియోగకాలమున తత్సర్వేశు జింతించు వా
డలఘుశ్రేయము బొందు బ్రహ్మమయుడై యర్కాభుడై నిత్యుడై.

సాక్షాన్నారాయణుడయిన శ్రీకృష్ణుడు, సర్వజీవుల హృదయాలలోనూ ఉంటాడు. ఆయనకు, ఒకరు ప్రియులనిగాని, మరొకరు అప్రియులనిగాని, లేదు. వీరు ఉత్తములనీ, వారు అధములనీ, వీరు ఆత్మీయులనీ, వారు పరకీయులనీ, ఆయన, ఎవరి విషయంలోనూ పాటించడు.

యథార్థానికి, శ్రీకృష్ణుడు, గుణరహితుడు. కాని, శిష్టరక్షణాభిరతితో, ఆయన, కొన్ని గుణాలను కల్పించుకుని, సర్వరక్షణ వినాశ కేళీ పరతంత్రుడై వ్యవహరిస్తూ ఉంటాడు. ఆ మహానుభావుని, మీరు, పరమార్థభూతుడని గ్రహించారు. ఆత్మజునిగా భావించారు. ఆయనమీద, అవ్యాజానురాగాన్ని పెంపొందించుకున్నారు. అది కారణంగానే, మీరు, మీ జీవితాలకు ధన్యత్వం చేకూర్చుకోవటం జరిగింది."

ఆ విధంగా, నంద యశోదలతో ముచ్చటించి, ఉద్ధవుడు, గోపికలను సమీపించాడు. వారికికూడా, శ్రీకృష్ణుని క్షేమాన్ని తెలియ పరచాడు. ఆ తరువాత, వారితో ఇలా అన్నాడు.

"శ్రీకృష్ణుడు సాక్షాద్భగవంతుడు. ఆయనమీద మనసునిలుపుకోవటంవల్ల, మీరు కృతార్థులయినారు; లోకపూజితలయినారు.

ధ్యాన వ్రత తపో హోమాదులవల్ల భగవద్భక్తి నలవరచుకోవటం సాధ్యంకాదు. దుర్లభమయిన ఆ భక్తిని, మీరు, సేవాభావంతో సాధించుకున్నారు. అది కారణంగానే, దేహ గేహాదులపట్ల సహజంగా ఉండే మమకారాన్నికూడా త్యజించగలిగారు.

సర్వవిధకార్యాలకూ, శ్రీకృష్ణుడే ప్రధానకారణుడు. చరాచర జీవరాశి అంతటా ఆయన ఉంటాడు. ఆయన లేని తావు అంటూలేదు. అటువంటి సర్వాత్మునితో వియోగం సంభవించిందనుకోవటం, మీవంటివారికి సమంజసం కాదు.

మీకు ప్రియుడయిన శ్రీకృష్ణుడు, మీ సన్నిధిలో లేకపోవటం, మీ అదృష్టమేగాని, దురదృష్టం కాదు. ఆయన మీకు కనపడనప్పుడే, ఆయనను, మీరు, అమితంగా ధ్యానిస్తారు. ఆ ధ్యానం తీవ్రతరమయినప్పుడు, ఆయన సన్నిధిలో పొందే ఆనందానికి మించిన ఆనందాన్ని, మీరు అనుభవించగలుగుతారు. ఆ ఆనందపారవశ్యంలో, మీరు, సర్వవిధ వృత్తులనూ విసర్జిస్తారు. ఆయనమీదనే మనసును లగ్నం చేసుకుంటారు. అన్యచింత అనేదేలేకుండా వ్యవహరిస్తారు. అది కారణంగానే, శీఘ్రంగా, ఆయన్ని పొందగలుగుతారు."

ఉద్ధవుని పలుకులు విన్న గోపికల తాపం, కొద్దిగా ఉపశమించింది. ఆపైన, వారు, శ్రీకృష్ణునకు విన్నవించుకోవలసిందిగా అభ్యర్థిస్తూ, తమ హృదయాన్ని, ఆయన కిలా నివేదించుకున్నారు.

'తను బాసి యొక్కింత తడవైన నిటమీద
నేలపై మేనులు నిలువ వనుము
నేలపై మేనులు నిలువక యట మున్న
ధైర్యంబు లొక్కట దలగు నసుము
ధైర్యంబు లొక్కట దలగిన పిమ్మట
చిత్తంబు లిక్కడ జిక్క వనుము

చిత్తంబు లిక్కడ జిక్కక వచ్చిన
ప్రాణంబు లుండక పాయు ననుము

ప్రాణములు వోవ మఱివచ్చి ప్రాణవిభుడు
ప్రాణి రక్షకు డగు తన్ను ప్రాణు లెల్ల
జేరి దూరంగ మఱి యేమి సేయువాడు
వేగ విన్నప మొనరింపవే మహాత్మ !'

గోపికల అభ్యర్థన నంగీకరించి, నందాదుల పూజ లందుకుని, ఉద్ధవు, దక్కడనుంచి బయలుదేరి, మధుర చేరుకున్నాడు; రామ కృష్ణులను దర్శించి, మందలో జరిగిన యావద్వృత్తాంతాన్నీ, వారికి, విశదపరచు కున్నాడు.

## 134. హస్తినాపురంలో అక్రూరుడు :

అనంతర మొకసాటి, శ్రీకృష్ణుడు, ఉద్ధవ బలరామ సహితుడై, అక్రూరుని ఇంటికి వెళ్ళటం జరిగింది. అలా విచ్చేసిన రామ కృష్ణులను, అక్రూరుడు, విధ్యుక్తంగా అర్చించాడు. అర్చించి...

'ఏ పుణ్యాతిశయ ప్రభావముననో యీ జన్మమం దిక్కడన్
నీ పాదంబులు గంటి, ని న్నెరిగితిన్, నీవున్ గృపాళుండవై,
నాపై నర్మిలి జేసి, మాన్పదగవే, నానా ధనాగార కాం
తా పుత్రాదులతోడ బంధనము, భక్తవ్రాతచింతామణీ!'

అని, తన హృదయాన్ని, శ్రీకృష్ణునకు నివేదించుకున్నాడు.

అక్రూరుని పలుకులు, శ్రీకృష్ణునకు, అమితానందం కలిగించినై. అది కారణంగానే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, అతనికి మోహాన్ని కలిగించే విధంగా, ఇలా అన్నాడు.

"మహానుభావా ! నువ్వు మాకు గురుడవు. మేము, నీ బిడ్డలం; నీ ప్రేమకు పాత్రులం కావాలని కోరే వాళ్ళం. నువ్వు, సాధుపురుషుడవు;

పరమ భాగవతుడవు.

> సాధువులూ భాగవతులూ అయినవారు, సర్వవేళలా
> నిస్వార్థపరులుగానే జీవిస్తారు. అటువంటి నిస్వార్థజీవులను
> సేవించటం, సర్వశ్రేయాలకూ మూల మవుతుంది.

కొందరు, తమ కోరికలను తీర్చుకునే నిమిత్తం, తీర్థ యాత్రలు చేస్తారు. మృచ్ఛిలావిగ్రహాలకు మ్రొక్కుతారు. అయినా, వారికి, పావనత్వం సులభంగా సిద్ధించదు. దానికి, ఆ తీర్థాలుగాని, విగ్రహాలుగాని, దేవతలు కాక పోవటమే కారణం.

> సాధుజనులకూ దేవతలకూ భేదంలేదు. అది కారణం
> గానే, పరమభక్తులయిన సాధువులను దర్శించినంతమాత్రం
> లోనే, ఎవరికయినా, పావనత్వం సిద్ధించి తీరుతుంది."

ఆ విధంగా ప్రస్తుతించి, శ్రీకృష్ణుడు, పాండవుల యోగ క్షేమాది కాలను గ్రహించివచ్చే నిమిత్తం, అక్రూరుని, హస్తినాపురానికి పంపాడు.

అలా హస్తినాపురం చేరుకున్న అక్రూరుడు, మహారాజైన ధృత రాష్ట్రునీ, కురువృద్ధులూ పూజ్యులూ అయిన భీష్మ విదురాదులనూ, సందర్శించాడు. ఆ తరువాత, కుంతీసహితులయిన పాండు పుత్రులను కలుసుకున్నాడు. ఆ సమయంలో, కుంతీదేవి, అక్రూరుని ఉద్దేశించి...

"అన్నా, తల్లులు దండ్రులున్ భగినులు న్నల్లుండ్రు మద్భ్రాతలున్
నిన్నుం బొమ్మను వేళ నే మనిరి, మా నెవ్వల్ విచారింతురే,
యున్నారా సుఖయుక్తులై, మృగి వృక వ్యూహంబులో నున్నరే
ఖ న్నేనిక్కడ నున్న దాన, గుమనః కౌరవ్య మధ్యంబునన్.

కఱపించెన్ ఫణికోటిచే, లతికలం గట్టించి గంగానదిన్
నెఱి ద్రోపించె, విషాన్వితాన్న మొసగెన్, నిద్రారతిం జెంది యే
మఱియుండం బొడిపించె నాయుధములన్ మత్పుత్రులం, దేమియుం
గొఱగా డీ ధృతరాష్ట్రసూనుడు, మహాక్రూరుండు, కార్యంబులన్.

బలుదుం గృష్ణుడు నెన్నడైన దమలో భాషించి మేనత్త బి
డ్డలకున్ మేలు తలంతురే, వగపులన్ దయ్యంగ బాలయ్యెనే
జలజాతాక్షుడు, భక్తవత్సలు డిలా చక్రంబు భాగించి యి
మ్ముల నిప్పించునె నా కుమారకులకున్, ముఖ్యప్రకారంబునన్"

అని, తన హృదయాన్ని, అక్రూరునకు నివేదించుకుంది; ప్రశ్నించింది.

కుంతీదేవి అలా నివేదించుకునే సమయాన, విదురుడు కూడా అక్కడే ఉన్నాడు. తన కుమారులు అనుభవిస్తున్న ఇక్కట్లను తలచుకుని, ఆమె దుఃఖించటం చూసి, ఆ మహాత్ముడు, ఆమెపట్ల తన సానుభూతిని తెలుపుకున్నాడు; ఆమెకు కొంత ఊరట కలిగించాడు.

### *135. అక్రూరోపదేశం :*

ఆ తరువాత, అక్రూరుడు, ధృతరాష్ట్రుని కలుసుకోవటం జరిగింది. ఆ సమయంలో, దుర్యోధనాదులూ వారి సహచరులూకూడా అక్కడే ఉన్నారు. అప్పుడు, అక్రూరుడు, మహారాజు నుద్దేశించి...

'నీ యనుజుండు పాండు ధరణీవిభు డీల్గిన, నీవు భూమి ధ
ర్మాయత బుద్ధి నేలుచు, బ్రజావళి గాచుచు, గౌరవంబుతో,
బాయక లోకులందు సమభావన చేసితివేని, గీర్తియున్
శ్రేయము గల్గు, వేఱొకటి చేసిన దుర్గతి కల్గు, భూవరా!'

అని, ఉపదేశించాడు. అంతేకాదు. "మహారాజా!

ఈ ప్రపంచంలో, కనిపించేదేదీ కలకాలం ఉండదు. ఒకరికి మరొకరితో కలిగే స్నేహం కూడా, శాశ్వతం కాదు. మన దేహమే మనకు శాశ్వతం కానప్పుడు, భార్యతోనూ, పుత్రులతోనూ, బంధు మిత్రులతోనూ, నిత్య సహవాసం ఎలా సంభవ మవుతుంది?

ఏ ప్రాణి కా ప్రాణి, పుడుతుంది, పెరుగుతుంది, మర

జిస్తుంది. ఎవరు చేసిన సుకృత దుష్కృత ఫలితాలను, వారే అనుభవిస్తారు. ఆ విషయంలో, ఒకరి కొకరు తోడు పడటమంటూ ఉండదు.

అర్థసంగ్రహాపేక్ష అమితమైనప్పుడు, మానవుడు, అధర్మాచరణకుకూడా పాల్పడుతూఉంటాడు. అలా ఆర్జించిన అతని అర్థాన్ని అనుభవించే నిమిత్తం, భార్యా పుత్రులమనీ, మిత్రులమనీ సంబంధాలు కల్పించుకుని, అనేకమంది, అతణ్ణి సమీపిస్తారు. అర్థ సంగ్రహం నిమిత్తం అధర్మానికి కూడా పాల్పడ్డ ఆ మూఢుడు, వారందరినీ, ప్రేమతో పోషిస్తాడు. అజ్ఞాని అయిన అతని ధనాన్ని పూర్తిగా అపహరించిగాని, దుర్భావులయిన వారు అతణ్ణి వదలరు. అతడు నిర్ధనుడని తేల్చుకున్న మీదట, వారు, అతనివంక చూడనయినా చూడరు. అటువంటివారిని అభిమానించిన అధముడు, ఇహ పరాలు రెంటికీ కాకుండా, చెడిపోతాడు. నిందితు డవుతాడు: ఘోర నరకయాతన లనుభవిస్తాడు.

ప్రపంచమంతా ఒక కలవంటిది. ఇందులో కనిపించే దేదీ శాశ్వతమైనది కాదు. అది గ్రహించినవారే, తమ్ముతాము నియమించుకోగలుగుతారు: శాంతి నార్జించుకుంటారు.

అది గ్రహించి, జ్ఞాన చక్షుడవైన నువ్వు, ధర్మాన్ని ఆశ్రయించాలి. నీ కుమారులనూ, నీ తమ్ముని కుమారులనూ, ఒకేవిధంగా చూసుకోవాలి. పాండు పుత్రులదయిన రాజ్యభాగాన్ని, వారికి, సద్బుద్ధితో ఇచ్చివేయాలి."

అలా పలికిన అక్రూరునకు సమాధానంగా, ధృతరాష్ట్రుడు. ఇలా అన్నాడు. 'అక్రూరా ! నీ ఉపదేశమైతే ఉత్తమోత్తమ మైనదిగానే ఉంది. కాని, పుత్రప్రేమతో నిండిఉన్న నా హృదయంలో, దానికి, తావు కనపడటం లేదు. ఇంతకూ, భూభార హరణార్థం ఉద్భవించిన ఆ శ్రీకృష్ణుని నిశ్చయ మేమిటో, మనకు తెలియదు. ఆయన అభిప్రాయం ఎలాఉంటే అలా జరిగి

తీరుతుంది. దాన్ని, నువ్వుగాని, నేనుగాని, అన్యులుగాని, తప్పించటానికి వీల్లేదు.'

ధృతరాష్ట్రుని అభిప్రాయం గ్రహించిన అక్రూరుడు, ఆ వెంటనే, పెద్దల దగ్గర సెలవు తీసుకుని, తిరిగి మధురానగరం చేరుకున్నాడు. అక్కడ, బలరామ కృష్ణులను సందర్శించి, తను హస్తినాపురంలో ప్రవేశించింది మొదలు, దాన్ని వదిలేవరకూ జరిగిన యావద్వృత్తాంతాన్నీ, వారికి నివేదించుకున్నాడు.

*136. జరాసంధుని ఆగ్రహం :*

శ్రీకృష్ణుడు కంసుని సంహరించిన తరువాత, కంసభార్యలయిన, అస్తి, ప్రాప్తి, అనేవారు, తమ పుట్టింటికి వెళ్ళారు. వెళ్ళి, కంసుని దుర్మరణాన్ని గురించీ, తమకు సంభవించిన దురవస్థనుగురించీ, తమ తండ్రి అయిన జరాసంధునికి, దీనాతిదీనంగా నివేదించుకున్నారు. ఆ సందర్భంలోనే...

'వాంఛ్రుడున్ వీంఛ్రుడును రాజులే యనుచు, గర్వప్రౌఢితో, యాదవుల్,
వేంఛ్రదంబైన బలంబుతో మధురకున్ వేవచ్చి, నిష్కారణం,
బాంఛ్రుడున్ బిడ్డలు బంధులున్ వగవ, గంసాది క్షమానాథులం,
దంఛ్రడీ, చంపిరి; కృష్ణుచేత నిటు వైధవ్యంబు వచ్చెం జుమీ'

అనికూడా వారు విన్నవించుకోవటం జరిగింది.

వారి పలుకులు విన్న జరాసంధుడు, ప్రళయ కాలానలం మాదిరి ప్రజ్వలించాడు. అది కారణంగానే, అతడు...

'ఏమీ, కంసుని గృష్ణుడే రణములో హింసించె నో చెల్ల, నా
సామర్థ్యంబు దలంప డించుకయు, మ చ్చండ ప్రతాపానలో
ద్దామార్చుల్ వడి నేడు గాల్చు, యదు సంతానాటవీ వాటికన్,
భూమిం గ్రుంగిన, మింట దాగిన, మహాంభోరాశిలో జొచ్చినన్.
యాదవ విరహిత యగుటో
మేదిని, నాచేత, నేడు, మీదు మిగిలి, సం

పాదితబలులై, హరి రు
ద్రాదులు నింద్రాదు లెవ్వ రడ్డం బైనన్'

అని, గర్జించాడు. ఆ వెంటనే, రణభేరి మ్రోయింపించి, ఇరవై మూడు అక్షౌహిణుల బలంతో, మధురమీదకు దాడి వెళ్ళాడు.

మహార్ణవం మాదిరి మధురపై పడ్డ మాగధసైన్యాన్ని చూసి, మాధవుడు, చాలా సంతోషించాడు. భూభారాన్ని కొద్దిగా అయినా తొలగించటానికి, జరాసంధుడు, తనకు అవకాశం కల్పించాడుగదా అనుకున్నాడు. ఆ సమయంలో, జరాసంధునిమాత్రం వదలి, అతనికి అండగా వచ్చిన రాజు లందరినీ నిర్జించటానికే, ఆయన నిశ్చయించుకున్నాడు.

అంతలో, ఆకాశమార్గాన, రెండు ఉత్తమరథాలు, తన దిక్కుగా రావటం, ఆయన చూశాడు. చూసి, వాటినీ, వాటిలో ఉన్న వివిధ యుద్ధోపకరణాలనూ, బలరామునకు చూపుతూ...

'కంటే రామ, రథంబు లాయుధములున్ గాథ ప్రకాశంబులై
మింటన్ వచ్చెను, వీని గైకొని, సురల్ మెచ్చన్, నృపశ్రేణులన్
బంటింపం బనిలేదు చంపుము, ధరాభారంబు వారింపు, మీ
వెంటన్ నీ యవతారమున్ సఫలమౌ, వేవేగ లె మ్మాజికిన్'

అని, అతణ్ణి ప్రోత్సహించాడు. అతనితోసహ, సమరోన్ముఖుడై బయలుదేరాడు. అప్పుడు, జరాసంధుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'అదలించి రొప్పంగ నాలమందలు గావు
గంధ గజేంద్ర సంఘములుగాని

పరికించి వినగ నంభారవంబులు గావు
వాజీంద్ర హేషారవములుగాని

పదహతి గూల్పంగ బాతబండ్లివి గావు
నగసమాన స్యందనములుగాని

ప్రియము లాడంగ నాభీర లోకము గాదు
కాలాభవైరి వర్గంబుగాని
యార్ప వన వహ్ని గాదు బాణాగ్నిగాని
మురియ బృందావనముగాదు మొనలుగాని
యమున గాదు నటింప ఘోరాజిగాని
పోరు నీకేల గోపాల పొమ్ము పొమ్ము !'

అని, హేళనపూర్వకంగా అన్నాడు. అంతేకాదు.

'తరుణిం జంపుటయో, బకున్ గెడపుటో, ధాత్రీజముల్ గూల్చుటో,
ఖరముం ద్రుంచుటయో, ఫణిం బరపుటో, గాలిన్ నిబంధించుటో,
గిరి హస్తంబున దాల్చుటో, లయమహాగ్నిస్ఫార దుర్వార దు
ర్భర బాణాహతి నెట్లు నిల్చెదవు సప్రాణుండవై, గోపకా !'

అని, ఆయన్ని కించపరచేమాట లెన్నో అన్నాడు. అదివిన్న శ్రీకృష్ణుడు...

'పంతములేల, తొల్లి జనపాలుర బోరుల గెల్చినాడవం
త్రింతియకాలదే, బిరుదులాడుట బంటుతనంబుత్రోవయే,
యింతట దీరెనే, మగధ, యేటికి ద్రేలెదు, నీవయేల, క
ల్పాంత మహోగ్ర పావకుని నైన హరింతు, వరింతు సంపదన్'

అని హుంకరించాడు. అదివిన్న జరాసంధుడు, పగలబడినవ్వాడు. నవ్వి, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'బాలుడ వీవు, కృష్ణ, బలభద్రుని బంపు రణంబు సేయ, గో
పాలక బాలుతోడ జనపాల శిఖామణియైన మాగధుం
డాలముసేసెనంచు జను లాడెడి మాటకు సిగ్గువుట్టెడిన్,
జాలు, దొలంగు, దివ్యశరజాలుర మమ్ము జయింపవచ్చునే !'

అన్నాడు. ఆ మాటలు విన్న శ్రీకృష్ణునకు, అమితమయిన రోషం కలిగింది. అది కారణంగానే, ఆయన...

'గోపాలుడ నని పలికితి,
భూపాలక, దీన నేమి, పోరాడంగా

గోపాల మహీపాల
వ్యాపారాంతరము దెలియ వచ్చుం బిదపన్'

అని, అతనికి సమాధాన మిచ్చాడు. ఆ వెంటనే, అతనితో తలపడ్డాడు. ఆ సమయంలో...

హయహేషల్, గజ బృంహితంబులు, రథాంగారావముల్, శింజినీ
చయ టంకారములున్, వివర్ధితగదా చక్రాస్త్ర నాదంబులున్,
జయ శబ్దంబులు, భేరిభాంకృతులు, నిస్సాణాది ఘోషంబులున్,
భయద ప్రక్రియ నొక్క వీక నెగసెన్, బ్రహ్మాండ భేదంబుగన్.

ఆ పోరు, చూపరులకు, అమితభయం కలిగించింది. అందులో, జరాసంధుని పక్షీయులు, చాలామంది, సంహరింపబడ్డారు. అప్పుడు, బలరాముడు, ఒక్కసారిగా అతనిపై కుఱికి, అతణ్ణి బంధించాడు. తన పిడికిటి పోట్లతో, అతణ్ణి, అమితంగా పీడించాడు; సంహరించటానికి కూడా పూనుకున్నాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతణ్ణి అప్పుడు సంహరించటం సమంజసం కాదని, తన అన్నగారికి నివేదించుకున్నాడు. ఆపైన, అతనికి బంధవిముక్తి కలిగించి, అతనితో...

'దుఃఖింపం బనిలేదు, పొమ్ము, బలసందోహంబులం దెమ్ము, చే
తః ఖేదం బెడలంగ రమ్ము, రిపులం దండింపు, కాదేని, భూ
స్వఃఖేలజ్జన మెల్ల మెచ్చ, నృప, నీ శౌర్యోన్నతుల్ చూపి, మే
దః ఖండంబులు భూతముల్ తిన, దనుత్యాగంబు సేయందగున్'

అని పలికాడు; అతణ్ణి, యుద్ధరంగంనుంచి, అప్పటికి పంపివేశాడు.

ఆ విధంగా అవమానింపబడి వెళ్ళిన జరాసంధుడు, ఆ తరువాత పదిహేడుసార్లు, మధురానగరంమీద దాడి చేయటం జరిగింది. కాని, ఏ ఒక్కసారికూడా, అతడు, జయించింది లేదు. అయినా, అతడు నిరాశ చెందకుండా, మరొకసారి ప్రయత్నించదలచాడు; దానికి తగిన సన్నాహాలు చేసుకోసాగాడు.

**137.** కాలయవనుడు :

అత డలా ఉన్న సమయంలో, ఒకసారి, శ్రీకృష్ణునిమీదకు, కాలయవనుడు దాడి వెళ్ళటం జరిగింది. అయినా, ఆ సందర్భంలో, వారిరువురి మధ్యా, ఏ విధమైన పోరూ జరుగలేదు. కాని, కాలయవనుడు మాత్రం, కాలుని వీటికి అతిథి కావటం సంభవించింది.

కాలయవనుడు, ఆజన్మబ్రహ్మచారీ, యాదవ పురోహితుడూ అయిన గర్గాచార్యునకూ, ఒక అప్సరస్త్రీకీ, జనించిన మహావీరుడు. అతడు, యాదవులను భయపెట్టటానికే జనించాడు.

వృష్ణ్యంధకాదులకు గురుడైన గర్గుడు, అవివాహితుడై ఉండటం తెలిసిన ఒకడు, ఒకసారి, 'ఇతడు పురుషుడే అయిన పక్షంలో, ఇలా ఎందుకు ఉంటాడు?' అని, హేళన చేయటం జరిగింది. అది విన్న గర్గుడు, అమితంగా బాధపడ్డాడు. ఆయన శిష్యులయిన యాదవులు, అది గ్రహించి కూడా, ఆ వాచాలుని ఏమీ అనలేదు. అది, ఆయనకు, మరింత బాధ కలిగించింది. అది కారణంగా, ఆయన కుపితుడై, అడవికి వెళ్ళి, పన్నెండు సంవత్సరాలపాటు, అమిత నిష్ఠతో, మహేశ్వరునిగూర్చి తపస్సుచేశాడు. ఆ సమయంలో, ఆయన, లోహ చూర్ణం తిని ఉండేవాడు.

గర్గాచార్యుని దీక్షకు మెచ్చి, మహేశ్వరుడు, ఆయనకు ప్రత్యక్షమయినాడు; 'వర మేదయినా కోరుకోవలసింది' అన్నాడు. అప్పుడు, గర్గుడు, ఆయన్ని ఉద్దేశించి, 'మహాత్మా ! వృష్ణ్యంధకాదులకు భయాన్ని కలిగించే కుమారుని ప్రసాదించవలసింది, అని మాత్రమే కోరాడు.

కాలక్రమాన, ఆయనకు, గోపకామినీరూపం ధరించిన ఒక అప్సరతో స్నేహం కలిసింది. ఆమెకు, ఆయనవల్ల, ఒక కుమారుడు కలిగాడు. అతణ్ణి, యవనపతి పెంచుకున్నాడు.

కాలయవనుడు, గురుతేజుడు. గర్విష్ఠి. దుర్దముడు. ఎవ్వరినీ లక్ష్యం చేసేవాడు కాదు. అత డొకసారి, నారదమహర్షిని కలుసుకుని, 'స్వామీ ! ఈ ప్రపంచంలో, మహావీరు లనేవారు యెవరయినా ఉన్నారా !' అని అడిగాడు. దానికి సమాధానంగా, నారదుడు, యాదవ వంశమణి అయిన శ్రీకృష్ణుని పేర్కొనటం జరిగింది.

నారదుని పలుకులు వినగానే, కాలయవనునిలో, మత్సరం జనించింది. ఆ వెంటనే, అతడు, తన బలాన్నంతనూ సమకూర్చుకుని, మధురానగరం మీదికి దాడి వెళ్ళాడు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, 'కృష్ణుడు కృష్ణసర్పంవంటివాడు' అని సూచిస్తూ, ఒక కృష్ణసర్పాన్ని తెచ్చి, దాని మూతిని కుట్టి, దాన్ని ఒక కుండలో పెట్టి, అతని దగ్గరకు పంపాడు.

కాలయవను డది గ్రహించాడు. గ్రహించి, 'ఎవరిమటుకు వారు బలహీనులే అయినా, పదిమంది కలసివస్తే, ఎంతటి బలవంతుడయినా లోబడి తీరవలసిందే' నని సూచిస్తూ, కొన్ని గండుచీమల నేరి తెప్పించి, వాటిని, ఆ కుండలోనే ఉంచి, శ్రీకృష్ణుని వద్దకు పంపించాడు.

శ్రీకృష్ణుడు, పరిస్థితిని అర్థంచేసుకున్నాడు. 'కాలయవనుడు, మూడుకోట్లమంది మ్లేచ్ఛులతో, మధురానగర పరిసరాల్లో, ఒక వంక, దిగి ఉన్నాడు. జరాసంధుడు, రేపో మాపో, కొన్ని అక్షౌహిణుల సేనతో, మరొక దిక్కుగా రాబోతున్నాడు. యవన మాగధసేనలు చేతులు కలుపుకున్న పక్షంలో, యాదవులకు అపాయం తప్పదు. ఆ ఆపదనుంచి వారిని రక్షించటం నా ధర్మం' అనుకున్నాడు. అది కారణంగానే, సాగరుని అడిగి, సముద్ర మధ్యాన, నూరు యోజనాల పొడవూ, నూరు యోజనాల వెడల్పూ ఉన్న స్థలాన్ని, సంపాదించుకున్నాడు. అక్కడ, ఒకమహాదుర్గాన్ని నిర్మించవలసిందిగా, విశ్వకర్మ నాదేశించాడు. విశ్వకర్మ కూడా, ఆ వెంటనే, పని ప్రారంభించి, అనతికాలంలోనే...

వరుణపురముకంటె వాసవుపురికంటె
ధనదుపీటికంటె దండధరుని
నగరికంటె బ్రహ్మ నగరంబుకంటె బ్ర
స్ఫుటముగాగ నొక్క పురము జేసె.

ఆ పురానికి అలంకారంగా, మహేంద్రుడు, సుధర్మ అనే సభాభవనాన్ని, వృక్షరాజమైన పారిజాతాన్ని, పంపించాడు.

ఆ విధంగా ఏర్పాటయిన ద్వారకా నగరానికి, శ్రీకృష్ణుడు, తన యోగమాయా ప్రభావంద్వారా, తనవారి నందరినీ, క్షణమాత్రంలో తరలించేశాడు. వారి రక్షణభారాన్ని, బలరామునకు ఒప్పగించాడు. ఆపైన, వన మాలను మాత్రం ధరించి, నిరస్త్రుడై, తను, మధురా నగరం దిక్కుగా వెళ్ళసాగాడు.

అలా, నగరంనుంచి తనవేపు వస్తున్న శ్రీకృష్ణుని, కాలయవనుడు గుర్తించాడు. గుర్తించి, ఎన్నో దినాలుగా తను ఎవరికోసం ఎదురు చూస్తున్నాడో అతడు, తన కంటబడ్డందుకు, అమితంగా సంతోషించాడు. ఆ వెంటనే, అతణ్ణి బంధించే ఉద్దేశంతో, అట్టహాసంచేస్తూ, అతని కెదురు వెళ్ళాడు. అది చూసిన శ్రీకృష్ణుడు, అతనికి భయపడ్డవాని మాదిరిగా, వెనుదిరిగి పారిపోసాగాడు. కాలయవనుడు, ఆయన్ని తరుముకుంటూ వెళ్ళి, ఒకచోట ఆగి...

'యదువంశోత్తమ, పోకు పోకు, రణ మీ నర్హంబు, కంసాదులం
గదనక్షోణి జయించితీవని సమిత్కామంబునన్ వచ్చితిన్,
విదితఖ్యాతులు, వీటిబోవ, నరికిన్ వెన్నిచ్చి యిబ్బంగి నే
గుదురే రాజులు, రాజమాత్రుడవె, వైగుణ్యంబు వచ్చుంజుమీ !
బలిమిన్, మాధవ, నేడు నిన్ను భువన ప్రఖ్యాతిగా బట్టుదున్,
జలముల్ సొచ్చిన, భూమిక్రింద జనినన్, శైలంబుపై నెక్కినన్,
బలి దండన్ విలసించినన్, వికృతరూపంబుం బ్రవేశించినన్,
జలధిం దాగిన, నగ్రజన్మ హలికా ఖ్యాటాకృతుల్ దాల్చినన్'

అన్నాడు. అలా, అత డెంత ఉద్రేక పరచినా, శ్రీకృష్ణుడు ఆగలేదు ; ముందుకు పోతూనే ఉన్నాడు. అది గ్రహించిన కాలయవనుడు, తిరిగి ఆయన్ని తరుముకుంటూ వెళ్ళాడు.

అలా వెళ్ళిన కాలయవనుడు, ఒక గుహలో ప్రవేశించటం జరిగింది. అక్కడ, అతనికి, గుట్టుకొాడుతూ నిద్రపోతున్న ఒక మహాపురుషుడు కనిపించాడు. అతణ్ణి చూసి, నిద్రితుల నెవరూ సంహరించరన్న అభి

ప్రాయంతో, శ్రీకృష్ణుడే అలా నిద్రను నటిస్తూఉండి ఉంటాడని, అతడు భావించాడు. అది కారణంగానే, ఆ మహాపురుషుని సమీపించి...

'ఎక్కడ నెవ్వారలకును
జిక్కవనుచు నారదుండు సెప్పెను, నాకుం
జిక్కితి వెక్కడబోయెదు,
నిక్కముగా నిద్రబుత్తు, ని న్నీకొండన్'

అని, అట్టహాసం చేశాడు; కాలెత్తి, ఆయన్ని, ఒక్క తన్ను తన్నాడు.

*138.* ముచుకుందుడు :

బహుకాల నిద్రితుడై ఉన్న ఆ మహా పురుషుడు, కాలయవనుని పాదప్రహారంవల్ల లేచాడు. లేచి, అమితమయిన కోపంతో, అక్కడ ఉన్న యవనుని వంక, చురచురా చూశాడు. ఆ చూపు వేడిమికి, కాలయవనుడు, ఆ వెంటనే, భస్మమై పోయినాడు.

ఆ విధంగా కాలయవనుని భస్మం చేసినవాడు. యవనాశ్వుని మనుమడూ, మాంధాత కుమారుడూ అయిన, ముచుకుందుడు; ఇక్ష్వాకు వంశీయుడు. అతడు యెంతటి బల పరాక్రమ సంపన్నుడో అంత భక్తుడు.

ముచుకుందుడు, రాక్షసులకు భయపడిపోయిన దేవతలను, కొంతకాలం కాపాడటం జరిగింది. ఆ సమయంలో, వారు, అతణ్ణి సమీపించి, 'ఏదయినా ఒక వరం కోరుకోవలసింది' అన్నారు. వారికి సమాధానంగా, ముచుకుందుడు, తనకు, మోక్షాన్ని ప్రసాదించవలసిందని కోరాడు.

దేవతల కెవరికీ, మోక్షాన్ని ప్రసాదించే శక్తి లేదు. ఆ శక్తి, శ్రీహరి ఒక్కనికే ఉంది. అదే, వారు, అతనికి తెలుపుకున్నారు.

అప్పటికే, ముచుకుందుడు, తన రాజ్యం వదలివచ్చి, చాలా కాలమయింది. ఆ సమయంలో, అతని భార్యలూ, బంధువులూ, మిత్రులూ అందరూ, కాలధర్మం చెందారు. ఆ విషయం, దేవతలద్వారా తెలుసుకున్న

ముచుకుందుడు, వారికి నమస్కరించి, తన మనశ్శాంతికి, మంచి నిద్ర కావాలన్నాడు. అలా కోరి, దాన్ని, వారి నుంచి వరంగా పొంది, ఆ పర్వత గుహలో ప్రవేశించి, పడుకున్నాడు. దేవదత్తమయిన ఆ నిద్రను భంగ పరచటంవల్లనే, కాలయవనుడు, అతని కోపాగ్నికి ఆహుతి కావటం జరిగింది.

కాలయవనుడు అలా నీరైన తరువాత, శ్రీకృష్ణుడు, తన నిజ రూపంలో, ముచుకుందునకు ప్రత్యక్షమయినాడు. అనుకోకుండా అలా దర్శన మిచ్చిన ఆ మహానుభావుని ఉద్దేశించి...

'శశివో, యింద్రుడవో, విభావసుడవో, చండ ప్రభారాశివో,
శశి చూడామణివో, పితామహుండవో, చక్రాంకహస్తుండవో,
దిశలున్ భూమియు మిన్ను నిండె నిదె నీ తేజంబు, సూడంగ దు
ర్వశమై, యెవ్వడ, వేల వచ్చి, తిచటన్ వర్తించె దేకాకివై'

అని, ముచుకుందుడు, అమితాశ్చర్యంతో ప్రశ్నించాడు. అతనికి సమాధానంగా శ్రీకృష్ణుడు, ఇలా అన్నాడు.

"రాజా! నా గుణాలనుగాని, జన్మ కర్మ నామాలనుగాని గణించే శక్తి, నాకే లేదు. నేను, రాక్షసులను నిర్జించే నిమిత్తం, ధర్మాన్ని ప్రతిష్ఠించే ఉద్దేశంతో, బ్రహ్మదేవుని ప్రార్థనమీద, దేవకీ వసుదేవులకు పుట్టాను. కంసుడనే పేరుతో ఉన్న కాలనేమినీ, ప్రలంబాది రాక్షసులనూ పరిమార్చాను.

పూర్వం, నువ్వు, నన్ను సేవించటం కారణంగా, నిన్ననుగ్రహించే ఉద్దేశంతో, ఇలా వచ్చాను. నా భక్తులయినవారు, నన్ను దర్శించిన తరువాత, దుఃఖితులు కావట మనేది ఉండదు. ఇక, నీ కే వర మిష్టమో అది కోరుకోవలసింది."

ఆ విధంగా తనపట్ల ప్రసన్నుడయిన శ్రీకృష్ణుని, ముచుకుందుడు యిలా ప్రార్థించాడు.

"జగదీశ్వరా! నీ మాయకు మోహమందని ప్రాణి అంటూ లేదు. ఈ ప్రపంచంలో ఉండే స్త్రీ పురుషు లందరూ, నీ మాయకు వశులు

కావటంవల్లనే, గృహా రామ విత్తాదులపట్ల ఆసక్తి చూపుతూ, పరమార్థ స్వరూపుడవయిన నిన్ను మాత్రం మరచిపోయి వ్యవహరించటం జరుగుతూ ఉంటుంది. అది కారణంగానే, వారికి, సర్వవిధ దుఃఖాలూ సంభవిస్తూ ఉంటై.

సంసార చక్రంలో పరిభ్రమించేవారు, తమ పూర్వ జన్మల పుణ్యాధిక్యంవల్ల, ఈ కర్మభూమిలో, మానవులై జన్మిస్తారు.

అప్పుడు కూడా, వారు, కామ వంచితులు కావటం, వెలుగులు జిమ్మే నీ పాదారవిందాలను విస్మరించి, గృహాంధకూపంలో పడటం జరుగుతుంది. ఆ విధంగా, వివిధ కామ భోగ విషయలాలసులయిన వారిని కనిపెట్టి, నువ్వు సంహరిస్తూ ఉంటావు.

కాంచనరథాల నధిరోహించి, మత్తమాతంగాల నారోహించి, 'నేను రారాజును' అని విఱ్ఱవీగుతూ, చతురంగబల సమన్వితులై చరించేవారుకూడా, కాలక్రమాన, ఎందుకూ పనికి రానివా రవుతారు. వారి దేహాలుకూడా క్రిమి కీటకాదులకు ఆహారమవుతై. ఆ యథార్థాన్ని గ్రహించనంతవరకూ, వారికి, సంసారమోక్షం లభించదు.

మోక్షకాములయినవారికి, మున్ముందుగా, సాధుసమాగమం అలవడుతుంది.

దాని ద్వారా, వారికి, సర్వేశ్వరుడవైన నీపట్ల భక్తి యేర్పడుతుంది; అటువంటి నీ భక్తులకు మాత్రమే, ముక్తి లభిస్తుంది.

అలా భక్తులయినవారు, భగవత్పాద పరిచర్యను మాత్రమే అభిలషిస్తారు. భగవత్పరిచర్యద్వారా లభించే ముక్తినే వాంఛిస్తారు. అది వినా, మరేదీ, వారికి రుచించదు.

తండ్రీ ! ఇంతకు పూర్వమే, నాకు, నీ అనుగ్రహం మూలంగా,

రాజ్యబంధ నిర్మూలనం కలిగింది. ఇక, నాకు ప్రార్థనీయమైనది, నీ సేవా భాగ్యం ఒక్కటే. దానిని నాకు అనుగ్రహించవలసింది."

ఆ విధంగా ప్రార్థించిన ముచుకుందుని చూసి, శ్రీకృష్ణుడు, అమితానందం పొందాడు. అతడు కోరిన వరాన్ని ప్రసాదించాడు.

అలా శ్రీకృష్ణుని అనుగ్రహం పొందిన ముచుకుందుడు, ఆ వెంటనే, నర నారాయణ స్థానమైన బదరికాశ్రమం చేరుకున్నాడు. అక్కడ, శాంతచిత్తంతో, శ్రీహరి నారాధించసాగాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తిరిగి నగరం చేరుకుని, అక్కడ, విడిసి ఉన్న కాలయవనుని సేన లన్నింటినీ సంహరించి, వాని ధనరాసులను సంగ్రహించి, తన భృత్యులద్వారా, వాటిని, ద్వారావతికి పంపాడు.

అంతలో, జరాసంధుడు, తిరిగి, మధురమీదకు రావటం జరిగింది. అది గ్రహించిన బలరామ కృష్ణులు, ఆపదలో చిక్కుకున్న సామాన్య మానవుల మాదిరిగా, అక్కడనుంచి పారిపోసాగారు. అలా పోయిపోయి, ప్రవర్షణాద్రిని చేరుకున్నారు; దాని మీదకు వెళ్ళారు.

వారిని తరుముకుంటూపోయిన జరాసంధుడు, తను, తన సేనతో, ఆ గిరిపైకి పోవటం దుర్ఘటమనుకున్నాడు. అది కారణంగానే, అక్కడ ఆగాడు. ఆ అన్నదమ్ములు, ఆ కొండమీదనే హతులయేవిధంగా, దాని చుట్టూ, మహాగ్నిని కల్పించాడు. ఆ మంటలనుంచి వారు బయటపడకుండా, కట్టుదిట్టం చేశాడు. కాని, అతని కళ్ళు కప్పి, బలరామ కృష్ణులు, బయటపడటం జరిగింది. అది గ్రహించలేని జరాసంధుడు మాత్రం, వారు హతులై ఉంటారనే అనుకుంటూ, విజయగర్వంతో, తన నగరు చేరుకున్నాడు.

### *139.* ద్వారావతి-రుక్మిణీదేవి :

శ్రీకృష్ణుని ఆదేశానుసారం, విశ్వకర్మ నిర్మించిన ద్వారావతి, నగరా లన్నిటిలోకి అద్భుతమైన నగరం. ఇంద్ర, వరుణ, కుబేర, యమా

దుల నగరాలేవీ కూడా, దానికి, ఈడురావు. దాన్ని, విశ్వకర్మ, ఒకేఒక రాత్రిలో నిర్మించాడు.

ఆ ద్వారకాపట్టణం వెడల్పు, వంద ఆమడలు. చుట్టుకొలత, నాలుగు వందల ఆమడలు.

ఆ నగర మధ్యంలో, పన్నెండామడల పరిమితిగల ఒక దుర్గం, నగరానికి వెలుపల, తొమ్మిదామడల పరిమితిగల మరొకదుర్గం, ఉన్నై. నగరిలో ఉండే దుర్గంలో, శ్రీకృష్ణుని అంతఃపుర కాంతలకు చెందిన, తొమ్మిది లక్షల భవనాలున్నై. అక్కడే, లీలాసరోవరం ఉంది. పదహారువేల నూట యెనిమిది తీర్థాలున్నై. శ్రీకృష్ణుని అష్ట మహిషులకు చెందిన సుందర మంది రాలుకూడా, అక్కడే ఉన్నై. శ్రీకృష్ణుని ఆదేశంమీద, శంఖునిధి, అష్ట నిధులనూ, ద్వారావతిలో దింపాడు. ద్వారకలో, కృశవైభవులూ, సౌఖ్య హీనులూ, ఉండరాదన్న శ్రీకృష్ణుని అభిప్రాయమే, దానికి కారణం.

అక్కడి తీర్థాలలో ప్రముఖమయినది, జ్ఞాన తీర్థం. ఆ తీర్థం ప్రక్కనే, పారిజాత వృక్షం ఉంది. జ్ఞానతీర్థంలో స్నానంచేసి, పారిజాతాన్ని స్పృశించినవారికి, భక్తి జ్ఞాన వైరాగ్యాలు, తప్పక లభిస్తై. వారు, శ్రీకృష్ణుని ప్రేమకు, పాత్రులై తీరుతారు.

జ్ఞాన తీర్థానికి సమీపంలోనే, శ్రీకృష్ణుని ఆనంద మందిరం ఉంది. దాన్ని చూసినవారు, కృతార్థులూ జీవన్ముక్తులూ అవుతారు. ఆ మందిరానికి అనతి దూరంలో, శ్రీకృష్ణతేజోద్భవ అయిన కృష్ణ కుండం ఉంది. అందులో స్నానం చేయటం వల్లనే, జాంబవతీ సుతుడైన సాంబుడు, జీవన్ముక్తుడు కావటం జరిగింది. ఆ కృష్ణకుండానికి ప్రక్కనే, బలభద్ర సరోవరం ఉంది. అందులో స్నానం చేసినవారి పాతకాలన్నీ, హరించిపోతై.

అటువంటి అనేక సరస్సులతోనూ, సుందర మందిరాలతోనూ, దివ్యోద్యానాలతోనూ విరాజిల్లే ఆ ద్వారకానగరం, భూలోక స్వర్గంగా ఉంటుంది. దాన్ని దర్శించటంకూడా, గొప్ప అదృష్టమే. అందులో ప్రవే

శించిన తరువాతనే, శ్రీకృష్ణుడు, సాక్షాత్తు లక్ష్మీదేవి అయిన రుక్మిణిని వివాహం చేసుకోవటం జరిగింది.

* * *

భూషణములు సెవులకు బుధ
తోషణము లనేక జన్మ దురితౌఘ విని
శ్శోషణములు మంగళతర
ఘోషణములు గరుడ గమను గుణ భాషణముల్.

* * *

విదర్భదేశాధీశ్వరుడైన భీష్మకునికి, రుక్మి, రుక్మరథుడు, రుక్మ బాహుడు, రుక్మకేశుడు, రుక్మనేత్రుడు అనే ఐదుగురు కుమారులూ, రుక్మిణి అనే ఒక కూతురూ ఉన్నారు. వారందరిలోకీ, రుక్మిణి, కడగొట్టు బిడ్డ. ఆమె, లక్ష్మీదేవి అంశతో జనించింది. మహా గుణవంతురాలనీ, సౌందర్య రాశి అనీ, ప్రసిద్ధి పొందింది.

భీష్మకుని ఇంటికి, ఎప్పుడూ, అనేకమంది అతిథులు వస్తూ ఉండేవారు. వారు, రాజుల ప్రశంస వచ్చినప్పుడల్లా, యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణుని రూప బల గుణాదులను పేర్కొంటూ ఉండేవారు. వాటిని, అభి వర్ణిస్తూ ఉండేవారు. అది కారణంగా, రుక్మిణికి, బాల్యంలోనే, శ్రీకృష్ణునిమీద, అదో విధమైన అభిమానం ఏర్పడ్డది. అది, ఆమె వయసుతోపాటు అభివృద్ధి పొందటం, వివాహోచితమైన వయసు వచ్చే సమయానికి, ఆమె కాయనమీద ప్రేమ జనించటం, ఆయనకు భార్య కావాలని ఆమె నిశ్చయించుకోవటం, జరిగినై.

రుక్మిణీకన్య సౌందర్యాన్ని గురించీ, సద్గుణాలను గురించీ, శ్రీ కృష్ణుడు కూడా విన్నాడు. విని, ఆమె నెలాగైనా వివాహంచేసుకుతీరాలని నిర్ణయించుకున్నాడు.

అ దలా ఉండగా, భీష్మక నందనుడైన రుక్మి, తన చెల్లెలిని, చేదిరాజైన శిశుపాలునకిచ్చి వివాహంచేయాలని నిశ్చయించుకోవటం జరి

గింది. శ్రీకృష్ణునిమీద అతనికి కలిగిన అకారణ వైరమే, ఆ విధమైన అతని మౌఢ్యానికి మూలం.

తన అన్నదైన అభిప్రాయం, రుక్మిణీదేవి గ్రహించింది. గ్రహించి, అమితంగా విచారపడ్డది. అది కారణంగానే, ఆమె, ఒకసారి, తనకు పరమాప్తుడయిన ఒక బ్రాహ్మణునికి, సుదేవుడనేవానికి, తన హృదయాన్ని విశదపరచుకుంది. దాన్ని, శ్రీకృష్ణునకు, తన పక్షాన, నివేదించుకో వలసిందిగా ప్రార్థించింది. ఆ వెంటనే, ఆయనకు, అనేకమైన కానికలు సమర్పించుకుని, ఆయన్ని, ద్వారావతికి పంపించింది.

### *140. శుభ సందేశం :*

అలా ద్వారావతి చేరుకుని, తన సందర్శనానికివిచ్చేసిన బ్రాహ్మణునిచూసి, శ్రీకృష్ణుడు, తన ఆసనంమీదినుంచి దిగాడు. గౌరవ పూర్వకంగా ఆయన్ని సమీపించాడు. స్వాగతం చెప్పాడు. పూజించాడు. సత్కరించాడు. ఆ తరువాత, భోజనానంతరం, ఆయన విశ్రాంతి తీసుకునేటప్పుడు, ఆయన ప్రక్కగా కూర్చుని, స్వయంగా, ఆయన పాదాలు ఒత్తాడు. ఆ సమయంలోనే, కుశల ప్రశ్నల అనంతరం, 'మీరు ఎక్కడి నుంచి ఏపనిమీద ఇలా దయచేశారో, అది, అభ్యంతరం లేనిపక్షంలో, సెలవీయవలసింది. మీ ఆశయసిద్ధికి, మేము చేయగల దేమైనా ఉన్నట్టయితే, ఆజ్ఞాపించవలసింది' అని, వినయపూర్వకంగా అన్నాడు.

శ్రీకృష్ణు డొసగిన ఆతిథ్యానికి అమితంగా సంతుష్టిచెందిన ఆ విప్రుడు, ఆయనకు, ఇలా సమాధాన మిచ్చాడు.

"కృష్ణా ! నేను విదర్భవాసిని. నన్ను, సుదేవు డంటారు. నేను, మా రాజపుత్రి అయిన రుక్మిణీకన్యనుంచి, వివాహసంబంధమైన ఒక శుభ సందేశాన్ని, నీకు తీసుకువచ్చాను. ఆమె, నీ చరణాబ్జాలనే ఆశ్రయించి, నీ సన్నిధి నాకాంక్షిస్తూ, తన హృదయాన్ని నీకు నివేదించుకో

వలసిందిగా నన్ను కోరింది. ఆమె పలుకులనే, నేను, నీకు విన్నవించు కుంటున్నాను; అవధరించవలసింది.

ఏ నీ గుణములు కర్ణేంద్రియంబులు సోక
దేహ తాపంబులు దీఱిపోవు
నే నీ శుభాకార మీక్షింప గన్నుల
కఖిలార్థ లాభంబు గలుగుచుండు
నే నీ చరణసేవ నే ప్రొద్దు చేసిన
భువనోన్నతత్వంబు బొందగలుగు
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితో
దడవిన బంధ సంతతులు వాయు

నట్టి నీయందు నా చిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నాన లేదు
కరుణ జూడుము కంసారి ఖల విదారి
శ్రీయుతాకార మానినీచిత్తచోర !

కృష్ణా ! నువ్వు అతిలోకసుందరుడవు. కుల రూప శీల విద్యా వయో తేజ స్సంపన్నుడవయిన నిన్ను, శ్రీదేవి, తనకు తానై వరించింది. అదే, నీ త్రిజగన్మోహనత్వానికి నిదర్శనం; నన్ను నీ చరణదాసిగా చేయటానికి మూలం.

శ్రీయుతమూర్తి యో పురుష సింహమ సింహముపాలిసొమ్ము గో
మాయువు కోరుచందమున మత్తుడు చైద్యుడు నీ పదాంబుజ
ధ్యాయినియైన నన్ను వడి దా గొనిపోయెదనంచు నున్నవా
డా యధమాధముం దెలుగ దద్భుతమైన భవత్ప్రతాపమున్.

వ్రతముల్ దేవ గురు ద్విజన్మ బుధ సేవల్ దాన ధర్మాదులున్
గత జన్మంబుల నీశ్వరున్ హరి జగత్కల్యాణు గాంక్షించి చే

సిత నేనిన్ వసుదేవ నందనుడు నా చిత్తేశు డౌగాక ని
ర్జితులై పోదురుగాక సంగరములో జేదీశముఖ్యాధముల్.

అంకిలి చెప్పలేదు చతురంగ బలంబులతోడ నెల్లి యో
పంకజనాభ నీవు శిశుపాల జరాసుతులన్ జయించి నా
వంకకు వచ్చి రాక్షస వివాహమునన్ భవదీయ శౌర్యమే
యుంకువ సేసి కృష్ణ పురుషోత్తమ చేకొనిపొమ్ము వచ్చెదన్.

అంతఃపురంలోఉండే నన్ను, నా బంధువులకు చేటువాటిల్లకుండా నిన్ను చేర్చుకునే ఉపాయం కూడా నివేదించుకుంటున్నాను. వివాహానికి ముందురోజున, నవవధువు, కులదేవతా అయిన సర్వమంగళను కొలవట మనేది, మా ఆచారం. ఆ కులదేవతా దర్శనార్థం, నన్ను, మావారు, నగరి బయటకు తీసుకువెళతారు. ఆ సమయంలో నువ్వు, నన్ను గ్రహించవచ్చు.

ఘను లాత్మీయ తమో నివృత్తి కొఱకై గౌరీశు మర్యాద నె
వ్వని పాదాంబుజ తోయమందు మునుగన్ వాంఛింతు రే నట్టి నీ
యనుకంపన్ విలసింపనేని వ్రతచర్యన్ నూరు జన్మంబులన్
నిను జింతించుచు బ్రాణముల్ విడిచెదన్ నిక్కంబు ప్రాణేశ్వరా !"

రుక్మిణీకన్యవైన ఆ పలుకులు విని, శ్రీకృష్ణుడు, అమితానందం పొందాడు. ఆ సమయంలో, సుదేవుడు, ఆయన్ని ఉద్దేశించి...

'ఆ యెలనాగ నీకు దగు నంగనకున్ దగు దీవు మా యుపా
ధ్యాయుల యాన పెండ్లియగు దప్పదు జాడ్యము లేల నీవు నీ
తోయమువారి గూడుకొని తోయరుహానన దెత్తుగాని వి
చ్ఛేయుము శత్రులన్ నుఱుము సేయుము సేయుము శోభనం బిలన్'

అని, ప్రోత్సహించాడు.

ఆ పలుకులు విన్న శ్రీకృష్ణుడు, మందహాసంచేశాడు. సందేశ హారి అయిన ఆ బ్రాహ్మణుని చేతిని, తన చేతుల్లోకి తీసుకుని, ఇలా అన్నాడు.

'కన్నియమీద నా తలపు గాఢము కూరుకరాదు రేయి నా
కెన్నడు నా వివాహము సహింపక రుక్మి తలంచు కీడు నే
మున్నె యెఱుంగుదున్ బరుల మూక వధించి కుమారి దెత్తు వి
ద్వన్నుత మ్రాను ద్రచ్చి నవవహ్నిశిఖన్ వడి దెచ్చు కైవడిన్'

ఆ విధంగా తన హృదయాన్ని ఆయనకు విశదపరచుకుని, ఆ వెంటనే, ఆయననూ, అన్నగారయిన బలరామునీ, మరికొందరు యాదవ వీరులనూ తీసుకుని, శైబ్య, సుగ్రీవ, మేఘపుష్ప, బలాహక అనే దివ్యాశ్వాలు పూన్చిన రథ మెక్కి, ఒకేఒక రాత్రిలో, శ్రీకృష్ణుడు, విదర్భ రాజధానీ నగరమైన కుండినపురం చేరుకున్నాడు.

### *141.* స్వయంవర సన్నాహాలు :

కుండిన నగరంలో, రుక్మిణీ కళ్యాణానికి సంబంధించిన సర్వ సన్నాహాలూ, అప్పటికే పూర్తి అయినై. ముహూర్తం కూడా సమీపించబోతూ ఉంది. భీష్మకుడు, పితృదేవతల నర్చించాడు. విప్రసమారాధన జరిపాడు. వివాహోచితంగా, రుక్మిణీకుమారి నలంకరింపజేశాడు.

అక్కడ, చేది రాజ్యంలో, రాజైన దమఘోషుడు కూడా, తన కుమారుని అభ్యుదయం కోరి, హోమం చేయించాడు. దాన ధర్మా లాచరించాడు. ఆ తరువాత, రథ గజ హయాదులతోనూ, చతురంగ బలాలతోనూ, బంధు మిత్రులతోనూ, కుండినపురం చేరుకున్నాడు.

శిశుపాలుని మిత్రులయిన అనేకమంది రాజులు కూడా, వివాహ సందర్శనాపేక్షతో, అతణ్ణి అనుసరించారు. ఆ వివాహానికి విఘ్నంకలిగించే ఉద్దేశంతో బలరామ కృష్ణులు అక్కడికి వచ్చినపక్షంలో, వారిని యెదిరించటానికి, తరిమివేయటానికి నిర్ణయించుకుని, వారితో విరోధం పాటించే జరాసంధ దంతవక్త్రి శాల్వ విదూరథ పౌండ్రకాదులుకూడా, శిశుపాలుని పక్షాన, తమతమ సేనలతో తరలివెళ్ళారు. కుండిన నగరమంతా, ఆ సమయంలో, ఇసుకవేస్తే రాలకుండా ఉంది.

అదంతా ఎప్పటికప్పుడు గ్రహిస్తూఉన్న రుక్మిణీకన్య, అంత వరకూ, శ్రీకృష్ణునకు సంబంధించినవార్త ఏదీ తనకు చేరకపోవటంవల్ల, అమితంగా కలవరపడసాగింది. అది కారణంగానే...

'లగ్నం బెల్లి వివాహము గదిసె నేలా రాడు గోవిందు డు
ద్విగ్నుండయ్యెడి మానసంబు వినెనో వృత్తాంతమున్ బ్రాహ్మణుం
డగ్నిద్యోతను డేటికిం దడసె నా యత్నంబు సిద్ధించునో
భగ్నంబై చనునో విరించికృత మెబ్బంగిం బ్రవర్తించునో!
ఘను డా భూసురు డేగెనో నడుమ మార్గశ్రాంతుడై చిక్కెనో
విని కృష్ణుం డిది తప్పుగా దలచెనో విచ్చేసెనో యీశ్వరుం
డనుకూలింప దలంచునో తలపడో యార్యామహాదేవియున్
నను రక్షింప నెఱుంగునో యెఱుగదో నా భాగ్య మెట్లున్నదో!'

అని, తనలో తాను తర్కించుకోసాగింది.

అంతలోనే, ఆ బ్రాహ్మణుడు, అమితానందంతో ఆమెను సమీపించాడు. సమీపిస్తూనే, ఆమె నుద్దేశించి...

'మెచ్చె భవద్గుణోన్నతి కమేయ ధనావళు లిచ్చె నాకు దా
వచ్చె సుదర్శనాయుధుడు వాడె సురాసురులెల్ల నడ్డమై
వచ్చిన నైన రాక్షస వివాహమునం గొనిపోవు నిన్ను నీ
సచ్చరితంబు భాగ్యమును సర్వము నేడు ఫలించె గన్యకా!'

అని, తెలియపరచాడు.

ఆ బ్రాహ్మణుని పలుకులు, రుక్మిణీకుమారికి, అమృత ప్రాయమైనవిగా తోచినై. ఆమె మనసు కుదుట పడ్డది. అందుకనే, ఆమె, తనకు అంతటి ఉపకృతిచేసిన ఆ మహానుభావుని ఉద్దేశించి...

'జలజాతేక్షణు దోడితెచ్చితివి నా సందేశముం జెప్పి, నన్
నిలువంబెట్టితి, నీకృపన్ బ్రతికితిన్, నీయంత పుణ్యాత్మకుల్
గలరే, దీనికి నీకు బ్రత్యుపకృతిం గావింప నేనేర; నం
జలి గావించెద భూసురాన్వయమణీ సద్బంధుచింతామణీ!'

అని, హృదయపూర్వకంగా, ఆయనకు నమస్కరించింది; తన కృతజ్ఞతను ప్రకటించుకుంది.

అక్కడ, బలరామ కృష్ణులు తన నగరికి విచ్చేశారని విన్న భీష్మకుడు, మంగళవాద్యాలతో, వారికి స్వాగతం చెప్పాడు. విధ్యుక్తంగా వారిని పూజించాడు. ఉచితమైన కానిక లిచ్చి, వారినీ, వారితో వచ్చినవారినీ, వారికి ఉచితమైన ఒక విడిదిలో చేర్చాడు.

అలా మహారాజువల్ల పూజింపబడి, విడిదలచేరిన శ్రీకృష్ణుని చూసి, విదర్భపురవాసినులందరూ అమితానందం పొందారు. ఆ సందర్భంలోనే, వారు...

'తగు నీ చక్రి విదర్భరాజ సుతకుం దథ్యంబు వైదర్భియుం
దగు నీ చక్రికి నింతమంచిదగునే దాంపత్య మీ యిద్దఱం
దగులం గట్టిన బ్రహ్మ నేర్పరిగదా దర్పాహతారాతియై
మగడౌ గావుత జక్రి యీ రమణికిన్ మా పుణ్యమూలంబునన్'

అని, తమలో తాము అనుకోసాగారు.

## 142. *గౌరీ పూజ* :

అంతలో, సుముహూర్తం సమీపించింది. ఆ సమయాన...

సన్నద్ధులై బహుశస్త్ర సమేతులై
బలసి చుట్టును వీరభటులు కొలువ
ముందఱ నుపహారములు కానుకలు గొంచు
వర్గంబులై వారవనిత లేగ
బుష్ప గంధాంబర భూషణ కలితలై
పాడుచు భూసురభార్య లరుగ
బణవ మర్దళ శంఖ పటహ కాహళ వేణు
భేరీ ధ్వనుల మిన్ను పిక్కటిలగ

దగిలి సఖులు గొలువ దల్లులు బాంధవ
సతులు దోడరాగ సవినయముగ
నగరు వెడలి నడచె నగజాతకును మ్రొక్క
బాల చికురవిహితఫాల యగుచు.

అలా వెళ్ళి, రుక్మిణీకన్య, ఆలయం చేరుకుంది. అక్కడ ఉన్న ఆది దంపతులకు, ధూప దీపాదులూ నానావిధోపహారాలూ సమర్పించుకుంది. ఆపైన, సర్వమంగళ నుద్దేశించి...

'నమ్మితి నా మనంబున సనాతనులైన యుమా మహేశులన్
మిమ్ము బురాణ దంపతుల మేలు భజింతుగదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివిగదమ్మ హరిం బతి జేయుమమ్మ నిన్
నమ్మినవారి కెన్నడును నాశము లేదుగదమ్మ యీశ్వరీ !'

అని ప్రార్థించింది. అక్కడ ఉన్న ముత్తైదువులందరికూ, పసుపుకుంకుమలూ, నానావిధఫలాలూ, కానికలూ, సమర్పించుకుంది. వారి దీవన లందుకుంది. ఆపైన, శ్రీకృష్ణుని మనసులో నిలుపుకుని, రాయంచమాదిరి, ఆలయంనుంచి బయటకు వచ్చింది.

ఆ విధంగా బయటకు వచ్చిన రుక్మిణీకుమారికి, ద్వార సమీపం లోనే, గరుడకేతనాంచితమై ఉన్న శ్రీకృష్ణుని దివ్యరథం కనిపించింది. దాన్నిచూసి, ఆమె, అమితానందం పొందింది. లజ్జతో తలవంచుకుంది. మెల్ల మెల్లగా, అటే, అడుగులువేయసాగింది.

అంతలో, శ్రీకృష్ణుడు, తనకు నలువంపలా ఉన్న రాజుల నెవ్వ రినీ లక్ష్యం చేయకుండా ముందుకువచ్చి, రుక్మిణీ కరగ్రహణం చేసి, ఆమెను, దగ్గరకు తీసుకున్నాడు. రథంలో ఎక్కించుకున్నాడు. విజయ శంఖాన్ని పూరించాడు. ద్వారావతి దిక్కుగా పయనం సాగించాడు.

## *143. రుక్మిణీ హరణం :*

అది చూసిన జరాసంధాదులకు, అమితమైన ఆగ్రహం కలిగింది.

రు, శ్రీకృష్ణుని చర్యను సహించలేకపోయినారు. అందుకనే, రోషపూరిత హృదయాలతో...

'ఘన సింహంబుల కీర్తి నీచ మృగముల్ గైకొన్న చందంబునన్
మన కీర్తుల్ గొని బాల దోడ్కొనుచు నున్మాదంబుతో గోపకుల్
సనుచున్నా రదె శౌర్య మెన్నటికి మీ శస్త్రాస్త్రముల్ గాల్పనే
తనుమధ్యన్ విడిపింపమేని సగరే ధాత్రీజనుల్ క్రంతలన్'

అని, ఒకరికొకరు తెలుపుకున్నారు. ఆ వెంటనే, తమతమ అస్త్రాలు తీసుకుని, సైన్యాలను తరలించుకుని, యాదవవీరులను తరుముకుంటూ వెళ్ళారు; వెడుతూనే, వారిమీద బాణవర్షం కురిపించసాగారు.

అది చూసిన రుక్మిణీదేవి, అమితంగా లజ్జించింది. తను కారణంగా, యాదవవీరులు బాధలపాలు కావటం, ఆమె, భరించలేకపోయింది. అని, గత్యంతరం తోచక, శ్రీకృష్ణునివంక బిత్తర చూపులు చూడసాగింది. అది గ్రహించిన కృష్ణయ్య...

'చొచ్చెద రదె యదువీరులు
వ్రచ్చెద రరిసేన లెల్ల వైరులు పెలుచన్
నొచ్చెదరును విచ్చెదరును
జచ్చెదరును నేడు చూడు జలజాతాక్షీ !'

అని, ఆమెను ఊరడించాడు ; ఉత్సాహపరచాడు.

అంతలో, గద బలభద్రాదులయిన యదువీరులు, నిలబడి, జరాసంధాదులతో తలపడ్డారు. వారిమీద శరవర్షం కురిపించారు. వారి రథాలను కూల్చారు. మత్తగజాలను సంహరించారు. అశ్వాలను వధించారు. సైనికులను చంపేశారు. ఆ విధంగా తమ విక్రమాన్ని ప్రదర్శిస్తూఉన్న కృష్ణానుచరుల సమక్షాన నిలువలేక, శిశుపాలుని సహచరు లందరూ, చెల్లాచెదరైనారు.

అదంతా చూసి, శిశుపాలుడు, భార్యనుకోల్పోయినవాని మాదిరి,

అమితంగా విచారపడసాగాడు. జరాసంధుడు అది గ్రహించాడు. అందు కనే, అతణ్ణి సమీపించి, ఊరడించే ఉద్దేశంతో ఇలా అన్నాడు :

"దేహధారు లెప్పుడూకూడా స్వతంత్రులు కానే కారు. వారు, పరమేశ్వరునకు అధీనులు. ఆ పరమేశ్వరుడు, వారిని, తన ఇచ్ఛవచ్చినట్టు ఆడిస్తూఉంటాడు. సుఖం కలి గించి పొంగజేస్తాడు ; దుఃఖం కల్పించి క్రుంగదీస్తాడు.

జయాపజయాలనేవి ఎప్పుడు ఎవరికి ఏ విధంగా లభిం చేదీ, ఎవరూ చెప్పలేరు.

నామటుకు నేను, ఈ కృష్ణుని చేతులో, పదిహేడుసార్లు పరాజయం పొందటం జరిగింది. అయినా, నేను, నిరాశ చెందలేదు. తిరిగి, ఇరవై మూడు అక్షౌహిణుల సేనతో వెళ్ళి, అతడితో తలపడ్డాను ; అతణ్ణి తరిమి కొట్టాను. అలాగే, నువ్వుకూడా, కాలం కలిసివచ్చినప్పుడు, తప్ప కుండా అతణ్ణి జయిస్తావు. ఈరోజున అతడు, నీకు కల్పించిన అవమా నానికి తగిన ప్రతీకారం చేసి తీరుతావు. దానికి, ఇంతగా విచారపడటం సమంజసంకాదు. ఇంతకూ...

బ్రతుకవచ్చు నొడల బ్రాణంబు లుండిన
బ్రతుకు గలిగెనేని భార్య కలదు
బ్రతికి తీవు భార్య పట్టు దయ్యె మెఱుంగు
వగవ వలదు చైద్య వలదు వలదు !"

## *144.* రుక్మి పరాభవం :

ఆ విధంగా, శిశుపాలునకు కొద్ది ఊరట కలిగించి, జరాసంధాదులు వెళ్ళిపోయినారు. అదంతా గ్రహించిన రుక్మి, తన చెల్లెలిని, కృష్ణుడు అప హరించుకుపోవటం సహించలేక, ఒక అక్షౌహిణీబలంతో, యాదవులమీదికి ఉరికాడు. వారిమీద తీవ్రమైన బాణాలను వదిలాడు. శ్రీకృష్ణుని రథాన్ని సమీపించి, ఆయన్ని ఉద్దేశించి...

'మా సరివాడవా మా పాప గొనిపోవ
నేపాటిగలవాడ వేది వంశ
మెందు జన్మించితి వెక్కడ బెరిగితి
వెయ్యది నడవడి యెవ్వ డెఱుగు
మాన హీనుడ వీవు మర్యాదలును లేవు
మాయగైకొనిగాని మలయ రావు
నిజరూపమున శత్రు నివహంబుపై బోవు
వసుధేశుడవుగావు వావి లేదు
కొమ్మ నిమ్ము నీవు గుణ రహితుండవు
విడువు విడువవేని విలయకాల
శిఖిశిఖాసమానశిత శిలీముఖముల
గర్వమెల్ల గొందు గలహమందు'

అని, హుంకరించాడు.

రుక్మివైన పలుకులు విని, శ్రీకృష్ణుడు మందహాసంచేశాడు. ఆ వెంటనే, ఆగి, కొన్ని తీవ్రబాణాలను వదలి, అతని కోదండాన్ని ఖండించాడు. రథాన్ని కూల్చాడు. అతణ్ణి గాయపరచాడు.

అప్పటికికూడా, రుక్మికి, శ్రీకృష్ణుని సామర్థ్యం అవగతం కాలేదు. అది కారణంగానే, అతడు, ఖడ్గ కవచాలు ధరించి, ఆయనతో తలపడ్డాడు. శ్రీకృష్ణుడు, వాటినికూడా చూర్ణం చేశాడు. ఆపైన, అతని శిరాన్ని ఖండించే ఉద్దేశంతో, కత్తినెత్తాడు.

రుక్మిణీదేవి, అదంతా చూసింది. తన అన్నకు సంభవింపబోయే ఆపదను అర్థంచేసుకుంది. అమితంగా అదలిపోయింది. అందుకనే, శ్రీకృష్ణుని పాదాలను స్పృశించి...

'నిన్ను నీశ్వరు దేవదేవుని నిర్ణయింపగ లేక యో
సన్నుతామర కీర్తిశోభిత సర్వలోకశరణ్య మా

యన్న యీతకు నేడు సేసె మహాపరాధము నీయెడన్
నన్ను మన్నన సేసి కావు మనాథనాథ దయానిధీ!'

అని, వేడుకుంది. అంతే కాదు.

'కల్ల లేదని విన్నవించుట కాదు వల్లభ యీతనిం
బ్రల్లదుం దెగఁజూఁడితేనియు భాగ్యవంతుల మైత్రి మే
మల్లుడయ్యె ముకుందు డీశ్వరు డంచు మోదితులైన మా
తల్లిదండ్రులు పుత్రశోకము దాల్చి చిక్కుదు రీశ్వరా!'

అనికూడా, మృదుమధురంగా నివేదించుకుంది.

రుక్మిణీదేవి ప్రార్థన విని శ్రీకృష్ణుడు, రుక్మిని సంహరించే అభిప్రాయం వదలుకున్నాడు. ఆ వెంటనే, అతణ్ణి సమీపించి, బంధించి, తల గొరిగి, మీసలు కొంతవరకు తీసి, విరూపిని చేశాడు.

## *145. రుక్మిణీదేవి విచారం*

భీష్మకసందనుడయిన రుక్మిని ఆ విధంగా చూసిన బలరామునకు జాలివేసింది. అందుకనే, ఆయన, అతనికి బంధవిముక్తి కలిగించాడు. ఆపైన...

'తలమనక భీష్మనందను
తలయును మూతియును గొఱుగ దగవే బంధుం
దలయును మూతియు గొఱుగుట
తల దఱుగుటకంటె దుచ్ఛతరము మహాత్మా!

కొందఱు రిపులని కీడును
గొందఱు హితులనుచు మేలు గూర్పవు నిజ మీ
వందఱ యందును సముడవు
పొందగ నేలయ్యె విషమబుద్ధి ననంతా!'

అని, శ్రీకృష్ణునితో అన్నాడు. ఆ తరువాత, రుక్మిణీదేవిని ఉద్దేశించి...

తోడం బుట్టినవాని భంగమునకున్ దుఃఖించి మా కృష్ణు నె
గ్గాడం జూడకుమమ్మ పూర్వభవకర్మాధీనమై ప్రాణులం
గీడున్ మేలును జెందు లే దొకడు శిక్షింపంగ రక్షింప నీ
తోడంబుట్టువు కర్మశేష పరిభూతుండయ్యె నే డియ్యెడన్'

అన్నాడు. అంతేకాదు. "అమ్మా ! బంధువైనవాడు, ఎంతటి దోషం చేసినా, వధ్యుడు కాడు. అతణ్ణి వధించటంవల్ల పాపం సంభవిస్తుంది. ఎవరు చేసిన దోషానికి వారు, బలి అయితీరుతారు. అందుకనే, దోషిని, అతని దోషానికే వదలివేయటం ఉత్తమం. అది సామాన్య ధర్మం. కాని, క్షత్రియ ధర్మం దానికి విరుద్ధంగా ఉంటుంది. క్షత్రియుడైనవాడు, దోషి, తన సోదరుడే అయినా, శిక్షించి తీరుతాడు.

శ్రీమదాంధులైనవారు, భూమినీ, ధన ధాన్యాదులనూ, స్త్రీలనూ, భోగాలనూ అభిమానాన్ని నిమిత్తంగా చేసుకుని, ఇతరులను హింసిస్తూ ఉంటారు. అటువంటివారిని దండించటం, క్షత్రియులయినవారి ధర్మం. మా కృష్ణుడుకూడా, ఇప్పుడు, ఆ ధర్మాన్నే పాలించుకున్నాడు. దానికి, నువ్వు, విచారపడటం సమంజసం కాదు.

అజ్ఞానజ మగు శోకము
విజ్ఞాన విలోకనమున విడువుము నీకుం
బ్రజ్ఞావతికిం దగునే
యజ్ఞానులభంగి వగవ నంభోజముఖీ !'

అని, ఆమెకు కొంత ఊరట కలిగించాడు. కాని, రుక్మి మాత్రం, తనకు జరిగిన పరాభవానికి అమితంగా విచారపడుతూనే ఉన్నాడు. అది కారణంగానే, అతడు, 'కృష్ణుని గెలిచిగాని కుండిన నగరంలో ప్రవేశించను' అని ప్రతిజ్ఞచేశాడు. ఆపైన, ఆ సమీపంలో ఉన్న భోజకటకంలోనే ఉండి పోయినాడు.

ఆ విధంగా, రాజులందరినీ జయించి, ద్వారకానగరం చేరుకుని..

ధ్రువకీర్తిన్ హరి పెండ్లియాడె నిజ చేతో హారిణిన్ మాన వై
భవ గాంభీర్య విహారిణిన్ నిఖిల సంపత్కారిణిన్ సాధు బాం
ధవ సత్కారిణి బుణ్యచారిణి మహా దారిద్ర్య సంహారిణిన్
సువిభూషాంబరధారిణిన్ గుణవతీ చూడామణిన్ రుక్మిణిన్.

## *146.* ప్రద్యుమ్నుడు :

ఆ రుక్మిణీ కృష్ణులకు, పూర్వం మహేశ్వరుని కంటిమంటవల్ల దగ్ధుడయిన మన్మథుడు, ప్రద్యుమ్నుడుగా జన్మించాడు. అతని తరువాత, వారికి, చారుధేష్ణుడు, సుదేష్ణుడు, సుషేణుడు, చారుగుప్తుడు, చారువాహనుడు, చారువిందుడు, చారుభద్రుడు, చారుగర్భుడు, చారుడు అనే కుమారులూ, చారుమతి అనే కూతురూ జనించారు.

ప్రద్యుమ్నుడు, రూపు రేఖా విలాసాలలోగాని, వీర్య ప్రతాపాలలో గాని, ఏవిధంగానూ, తండ్రికి తీసిపోయేవాడుకాదు. అతణ్ణి చూసినవారందరూ, అతడు, శ్రీకృష్ణుడే అనుకునేవారు. ఒక్కొకప్పుడు, శ్రీకృష్ణుని అంతఃపుర కాంతలు కూడా, అలాగే పొరబడటం జరుగుతూ ఉండేది. శ్రీకృష్ణుని వైరివర్గానికి చెందినవారు, ప్రద్యుమ్ను డెదురైనప్పుడు, అతడే శ్రీకృష్ణు డనుకుని, భయపడి, తొలగిపోతూ ఉండేవారు. అతడు, శంబరాసురుని అనాయాసంగా సంహరించాడని తెలిసినవారు, అతనితో విరోధించటం అపాయకరమని నిర్ణయించుకుని, అతని చెలిమినే ఆశిస్తూ ఉండేవారు. కాలక్రమాన, మన్మథుని భార్య అయిన రతీదేవి, మాయావతి అనే పేరుతో, అతని ధర్మపత్ని అయింది.

శ్రీకృష్ణునకూ ప్రద్యుమ్నునకూ ఉన్న భేదమల్లా ఒకటే. శ్రీకృష్ణునకు మెడలో కౌస్తుభం, హృదయాన శ్రీవత్సం, ఉండేవి. ప్రద్యుమ్నునకు, అవిమాత్రం ఉండేవి కావు. అంతే.

## *147.* సత్రాజితుడు — స్యమంతకం :

పూర్వం, సత్రాజితుడనే ఒక రాజు ఉండేవాడు. ఆయన ఒకసారి,

దీక్షగా, పదహారు రోజులపాటు, సూర్యుని ఆరాధించటం జరిగింది. అది కారణంగా, సూర్యుడు, స్యమంతకమనే ఒక దివ్యమణిని ఆయనకు ప్రసాదించాడు.

ఆ స్యమంతకం ఎవరిదగ్గర ఉంటే వారికి, దినానికి, ఎనిమిది భారాలు - మూడు మణుగుల ఐదు శేర్లు - బంగారం లభిస్తుంది. ఆ మణిని, ఏ రాజు పూజిస్తే ఆ రాజు రాజ్యంలో, దుర్భిక్షంగాని, సర్పభీతిగాని, మానసిక శారీరక బాధలుగాని, ఉండవు. ఆ ప్రాంతంలో, దుష్టులు, కలికానికి కూడా కనిపించరు.

సత్రాజితు డొకసారి, ఆ మణిని ధరించి, ద్వారావతికి వెళ్ళాడు. అతణ్ణి దూరంనుంచి చూసిన ప్రజలు, శ్రీకృష్ణ దర్శనార్థం, సూర్యుడే దిగివచ్చా డనుకున్నారు. ఆ అభిప్రాయంతోనే, వారు, శ్రీకృష్ణుని సమీపించి...

'దివిజాధీశ్వరు లిచ్చయింతురుగదా దేవేశ నిన్జూడ యా
దవ వంశంబున గూఢమూర్తివి జగత్త్రాణుండవై యుండగా
భవదీయాకృతి జూడ నే డిదె రుచి ప్రచ్ఛన్న దిగ్భాగుడై
రవియో నీరజగర్భుడో యొకడు సేరన్వచ్చె మార్గంబునన్'

అని, నివేదించుకున్నారు.

సర్వజ్ఞుడయిన శ్రీకృష్ణుడు, వారిమాటలు విని, మందహాసం చేశాడు. వారికి కనిపించినవాడు, స్యమంతకమణిని ధరించిన సత్రాజితుడనీ, అన్యుడుకాడనీ, వారికి తెలియపరచాడు.

ఒకసారి, ఆ మణిని, యాదవ విభుడయిన ఉగ్రసేనున కీయవలసిందిగా, శ్రీకృష్ణుడు, సత్రాజితుని కోరటం జరిగింది. కాని, అర్థలోభంవల్ల, సత్రాజితుడు, ఆయన కోరికను నిరాకరించాడు.

సత్రాజితునకు, ప్రసేనుడనే ఒక సోదరు డున్నాడు. అత డొకసారి, ఆ మణిని ధరించి, మృగయావినోదార్థం అడవికి వెళ్ళాడు. అలా వెళ్ళిన ప్రసేనునీ, అతని అశ్వాన్నీ, కూల్చి, ఒక సింహం, ఆ మణిని తీసు

కేక విని, గుహాంతర్భాగంలో ఉన్న జాంబవంతుడు, పరుగుపరుగున అక్కడికి వచ్చాడు. వచ్చి, ఆయన ఎవరో ఒక సామాన్యమానవుడై ఉంటాడనుకుని, ఆయనతో తలపడ్డాడు.

అప్పుడు, శ్రీకృష్ణునకూ జాంబవంతునకూ మధ్య, తీవ్రమైన పోరు జరిగింది. ఆ సమయంలో, వారు, ఒకరిమీద ఒకరు, పెద్దపెద్ద పాషాణాలనూ వృక్షాలనూ విసరివేసుకున్నారు. బాహాబాహి పోట్లాడుకున్నారు. పిడుగుపాట్లవంటి పిడికిటి పోట్లతో, పరస్పరం, పీడించుకున్నారు. ఆ పోరు, అలా, ఇరవై ఎనిమిది రోజులు సాగింది.

అప్పటికి, శ్రీకృష్ణుని ముష్టిప్రహరణలవల్ల, జాంబవంతుని అంగ సంధి బంధాలన్నీ చెదరిపోయినై. అతని శరీరమంతా, నుగ్గునుగ్గయిపోయింది. అతడు, ప్రాణావశిష్టుడయినాడు. అప్పు డతనికి, తను, అంత వరకూ పోట్లాడుతున్నది, మానవమాత్రునితో కాదన్న జ్ఞానం కలిగింది. అది కారణంగానే, అతను, శ్రీకృష్ణుని ఉద్దేశించి ...

"తండ్రీ ! నువ్వు పురాణపురుషుడవు. జగదధీశ్వరుడవు; సర్గ స్థితి లయ కారణుడయిన ఈశ్వరుడవు. సర్వజీవరాసులకు, ధైర్యానిపీ బలానిపీ, ప్రాణానిపీ కూడా నువ్వే.

బాణాగ్ని నెవ్వఁడు పఱపి పయోరాశి
　　నింకించి బంధించి యేపు మాపె
బరగ నెవ్వఁడు ప్రతాప ప్రభారాశిచే
　　దానవ గర్వాంధ తమస మడచె
గంజాతములు ద్రెంచు కరి భంగి నెవ్వఁడు
　　దశకంఠు కంఠబృందముల ద్రుంచె
నా చంద్ర సూర్యమై యలరు లంకారాజ్య
　　మునకు నెవ్వఁడు విభీషణుని నిలిపె

నన్ను నేలిన లోకాధినాథు డెవ్వ
డంచితోదార కరుణారసాబ్ధి యెవ్వ
డాతడవు నీవకావె మహాత్మ నేడు
మాఱుపడి యెగ్గు సేసితి మఱవవలయు''

అని, ఆయన్ని వినుతించాడు; వేడుకున్నాడు.

ఆ విధంగా, పరమభక్తుడయిన జాంబవంతుడు తన పశ్చాత్తాపాన్ని తెలుపుకోవటంవల్ల, శ్రీకృష్ణుడు, అతనిపట్ల ప్రసన్నుడయినాడు. తన అభయ హస్తంతో, అతని శరీరాన్ని నిమిరాడు. ఆ మీద, అతణ్ణి ఉద్దేశించి...

'ఈ మణి మాచే బడెనని
తామసు లొనరించు నింద దప్పెడు కొఱకై
నీ మందిర మగు బిలమున
కే మరుదెంచితిమి భల్లుకేశ్వర వింటే !'

అని, తన రాకకుగల కారణం తెలియపరచుకున్నాడు.

శ్రీకృష్ణుని పలుకులు విన్న జాంబవంతుడు, అలా అయినా తనకు దర్శనమిచ్చి, తన చిరకాల వాంఛితాన్ని యీడేర్చిన ఆయనకు, కృతజ్ఞతాపూర్వకంగా, పునః పునః ప్రణామా లాచరించాడు ఆపైన, ఆ మణితోపాటు, తన పుత్రికామణి అయిన జాంబవతినికూడా, ఆయనకు, భక్తిపూర్వకంగా సమర్పించుకున్నాడు.

అప్పటికి, శ్రీకృష్ణుడు బిలంలో ప్రవేశించి, పన్నెండు రోజులయింది. అంతవరకూ ఆయన బయటకు రాకపోవటంవల్ల, ఆయనకక్కడ ఏదో అపాయం సంభవించి ఉంటుందని, ఆయనతో వచ్చినవారు అనుకున్నారు. అది కారణంగానే, వారు, అమిత విచారంతో, పురానికి వెళ్ళటం, దేవకీ వసుదేవాదులకూ, రుక్మిణీదేవికీ, తమ అభిప్రాయాన్ని విన్నవించుకోవటం, జరిగింది.

ఆ వార్త చేరగానే, ద్వారకావాసులు, ఆబాలగోపాలం, అమితంగా దుఃఖించారు. ఆ వెంటనే, వారు, ఆయన క్షేమంగా తిరిగి రావాలని కోరుతూ, మహామాయ అనీ, చంద్రభాగ అనీ పేర్కొనబడే దుర్గాదేవిని, దీక్షతో పూజించటం మొదలుపెట్టారు.

అలా, తన్ను దీనంగా ఆశ్రయించిన ప్రజలపట్ల, దుర్గాదేవి ప్రసన్నురాలయింది. అది కారణంగానే, ఆమె, వారిని ఉద్దేశించి, 'మీకు, త్వరలోనే ఆనందం కలుగుతుంది. మాధవుడు, స్యమంతక మణితోనూ, మరొక బాలామణితోనూ, మీకు దర్శనమీయబోతున్నాడు;' అని, పలికింది. అది విన్న ద్వారకావాసులు, ఆనంద తాండవం చేయసాగారు. అంతలో, శ్రీకృష్ణుడు, వారి ఎదుట సాక్షాత్కరించాడు. అప్పుడు...

మృతుడైనవాడు పునరా
గతుడైన క్రియం దలంచి కన్యామణి సం
యుతుడై వచ్చిన హరి గని
వితతోత్సవ కౌతుకముల వెలసిరి పౌరుల్.

ఆ విధంగా నగర ప్రవేశంచేసిన శ్రీకృష్ణుడు, ఒక పెద్ద సభ చేసి, ఆ సభకు, సత్రాజితుని ఆహ్వానించి, స్యమంతకమణి తనకులభించిన వృత్తాంతాన్ని అంతనూ అతనికి విశదపరచాడు ; ఆ మణిని, అతనికి అందజేశాడు.

*149. సాత్రాజితి :*

అలా, తన మణిని తిరిగి పొందిన సత్రాజితుడు, అంతకుముందు తను శ్రీకృష్ణునిగురించి పలికిన పలుకులకు అమితంగా పశ్చాత్తాప పడ్డాడు. అది కారణంగానే...

"పాపాత్ముల పాపములం
బాపంగా నోపునట్టి పద్మాక్షునిపై

బాపము గలదని నొడివిన
పాపాత్ముని పాపమునకు బారముగలదే !
మితభాషిత్వము మాని యేల హరిపై మిథ్యాభియోగంబు చే
సితి బాపాత్ముడ నర్థలోభుడను దుశ్చిత్తుండ మత్తుండ దు
ర్మతి నీ దేహము గాల్పనే దురిత మే మార్గంబునం బాయు నే
గతి గంసారి ప్రసన్నుడై మనుచు నన్ గారుణ్య భావంబునన్"

అని, ఎంతగానో విచారించాడు. అంతే కాదు. తన మణిని తన కిచ్చినా, తన దోషానికి, తన్ను, ఏనాటికైనా, శ్రీకృష్ణుడు శిక్షించితీరుతాడన్న అభిప్రాయంతో, కుమిలిపోవటం మొదలుపెట్టాడు. 'అనవసరంగా, బలవద్విరోధం కల్పించుకున్నానే' అని, బాధపడసాగాడు. అంతలో, అతనికి, ఒక చక్కని అభిప్రాయం కలిగింది. ఆ వెంటనే, అతను...

'మణిని గూతు నిచ్చి మాధవు పదములు
పట్టుకొంటినేని బ్రతుకు కలదు
సంతసించు నతడు సదుపాయ మగు నది
సత్య మితర వృత్తి జక్కబడదు'

అని, నిర్ణయించుకోవటం జరిగింది. ఆ నిర్ణయం ప్రకారమే, ఆ రత్నాన్నీ, కన్యారత్నమయిన తన కుమార్తెను సత్యభామనూ, ఆయనకు సమర్పించుకున్నాడు. కాని, శ్రీకృష్ణుడు, తన కా మణితో అవసరంలేదనీ, అది, సూర్యభక్తుడైన అతనివద్ద ఉండటమే సమంజసమనీ చెప్పి, ఆ మణిని, అతనికి తిరిగి యిచ్చేశాడు. కాని, సత్రాజితుని ప్రార్థనమీద, ఆ మణిద్వారా అనుదినం లభించే సువర్ణంలో కొంత భాగాన్ని మాత్రం, సత్యభామ పేరట స్వీకరించటానికి సమ్మతించాడు. ఆ పైన...

తామరసాక్షు, డచ్యుతు, డుదార యశోనిధి, పెండ్లియాడె, నా
నా మనుజేంద్ర నందిత గుణస్థితి లక్షణ సత్యభామ, ను
ద్దామ పతివ్రతాత్వ నయధర్మ విచక్షణతా దయా యశః
కామను, సత్యభామను, ముఖద్యుతి నిర్జిత సోమ, నయ్యెడన్.

## 150. శతధన్వుడు–అక్రూర కృతవర్మలు :

సత్యభామను, తన మిత్రుడైన శతధన్వున కిచ్చి వివాహం చేయాలని, సత్రాజితుడు, మొదట్లో అనుకున్నాడు. కాని, కారణాంతరాల వల్ల, ఆమెను, శ్రీకృష్ణున కీయటం జరిగింది. అది కారణంగా, శతధన్వుడు, సత్రాజితుని మీద పగబట్టాడు; అతణ్ణి, ఎలాగయినా సాధించితీరా లనుకున్నాడు.

అది గ్రహించిన అక్రూర కృతవర్మలు, శ్రీకృష్ణుని అపనింద పాల్చేసిన సత్రాజిత్తును దండించటానికి, అదే మంచి తరుణ మనుకున్నారు. ఆ వెంటనే, వారు, శతధన్వుని సమీపించి, సత్రాజిత్తునుండి, సత్యభామను కాకపోయినా, స్యమంతకాన్నయినా పొందటం సమంజసమని, అతనికి బోధించారు; అతణ్ణి ఉద్రేకపరచారు.

అది కారణంగానే, శతధన్వుడు, ఒకసారి, అవకాశం చూసుకుని, గాఢ నిద్రా పరవశుడై ఉన్న సత్రాజితుని సంహరించాడు; స్యమంతకాన్ని అపహరించాడు.

సత్రాజితుడు, సంహరింపబడ్డ సమయంలో, శ్రీకృష్ణుడు, హస్తినాపురంలో ఉన్నాడు. ఆయన్ని తెలుసుకుని, ఆ వార్త నందజేసి, శతధన్వునకు తగిన శాస్తి చేయించే ఉద్దేశంతో, సత్యభామ, ఆ వెంటనే, అక్కడకు వెళ్ళింది.

అలా తన్ను సమీపించిన సత్యభామలోని ఆవేదనను, శ్రీకృష్ణుడు గ్రహించాడు. గ్రహించి, ఆమె చెప్పినదంతా సానుభూతితో విన్నాడు. మానవ సహజమైన ఆచారాన్ననుసరించి, కన్నీరు పెట్టుకున్నాడు. 'ఈ దుఃఖ సముద్రాన్ని ఎలా తరించగలం ?' అంటూ, ఎంతగానో వాపోయినాడు. అలా కొంతసేపు దుఃఖించి, సత్యభామకు ఊరట కలిగించే ఉద్దేశంతో, సాంత్వనవచనా లెన్నో పలికాడు. 'శతధన్వుని వధించి, మామయ్య ఆత్మకు శాంతి చేకూర్చి తీరుతాను' అని, ఆమె చేతిలో చేయి వేశాడు. ఆ

సమయంలో, బలరాముడుకూడా, 'నేను పరాయివాణ్ణి కాను' అన్నట్టు, తమ్ముని మాదిరిగానే తనూ వ్యవహరించాడు. 'శతధన్వుని సంహరించటానికి నేను కూడా శాయశక్తులా, శ్రీకృష్ణునకు సాయపడతాను' అని, ఆమెకు మాట యిచ్చాడు.

బలరామ కృష్ణుల నిర్ణయం శతధన్వునకు చేరింది. ఆ వెంటనే, అతడు, వారితో సంభవించబోయే పోరులో తనకు సాయపడవలసిందిగా, యాదవవీరుడయిన కృతవర్మను కోరాడు. కాని, కృతవర్మ, అందుకు అంగీకరించలేదు. అంగీకరించకపోవటమే కాదు :

'అక్కట ! రామ కృష్ణులు మహాత్ములు, వారల కెగ్గు సేయగా
నిక్కడ నెవ్వడోపు, విను, మేర్పడ, కంసుడు, బంధుయుక్తుడై
చిక్కడె మున్ను, మాగధుడు సేనలతో బదియేడు తోయముల్
దిక్కుల బారడే, మనకు దృష్టము, వారల లావు వింతయే !'

అని, బలరామ కృష్ణుల శక్తిసామర్థ్యాలమీద తనకున్న విశ్వాసాన్ని కూడా చాటుకున్నాడు.

అతని పలుకులు విన్న శతధన్వుడు, అమితంగా నిరాశచెంది, ఆపైన, అక్రూరుని సందర్శించుకున్నాడు. అతణ్ణి కూడా, కృతవర్మను కోరినట్టే కోరాడు. కాని, అక్కడకూడా, అతనికి, సహాయం లభించలేదు. అక్రూరుడు, అతణ్ణి ఉద్దేశించి...

'ఎవ్వడు విశ్వంబు నెల్ల సలీలుడై
పుట్టించు రక్షించు బొలియజేయు
నెవ్వని చేష్టల నెఱుగరు బ్రహ్మాదు
లెవ్వని మాయ మోహించు భువన
మేదేంద్ర పాపడై యే విభు డొకచేత
గోరక్షణమునకై కొండ నెత్తె
నెవడు కూటస్థు డీశ్వరు డద్భుత
కర్ము డనంతుండు కర్మసాక్షి

యట్టి ఘనునకు శౌరికి ననవరతము
మ్రొక్కెదము గాక విద్వేషమునకు నేము
వెఱతు మొల్లము నీ పొందు వెంటఁబొమ్ము
చాలు బదివేలు వచ్చె నీ సఖ్యమునకు'

అని, తన హృదయాన్ని విశదపరచుకున్నాడు; అతణ్ణి మందలించాడు.

అప్పుడు, చేయగలదేమీ లేక, శతధన్వుడు, అక్రూరునకు తెలుపకుండానే, ఆ మణిని, అతని యింట్లో ఒకచోట, దాచి ఉంచాడు. ఆపైన, స్వప్రాణ రక్షణార్థం, మిథిలానగరం దిక్కుగా పారిపోసాగాడు.

అలా పారిపోతున్న శతధన్వుని, రామ కృష్ణులు, తరుముకుంటూ వెళ్ళారు. వెళ్ళి వెళ్ళి, అతణ్ణి, ఆ నగర పరిసరాల్లో కలుసుకున్నారు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, అతనిమీదకు, తన చక్రాయుధాన్ని వదిలాడు. ఆ మరుక్షణంలోనే, అది, అతని తలను నఱికివేసింది.

ఆ విధంగా కూలిపోయిన శతధన్వునివద్ద, ఎంతగా వెదకినా, స్యమంతకం, వారికి కనిపించలేదు. అది గ్రహించిన బలరాముడు, శతధన్వుడు, దాన్ని, తన మిత్రు లెవరివద్దనో దాచి ఉంటాడనీ, ద్వారావతికి వెళ్ళి, వారందరి నివాసాలూ వెదుకవలసిందనీ, కృష్ణునకు సలహా ఇచ్చాడు; తనుమాత్రం, మిథిలేశ్వరుడయిన జనకుని సందర్శించుకునేనిమిత్తం, నగరంలో ప్రవేశించాడు.

బలరాముడు తన నగరానికి అలా విచ్చేయటం, జనకునకు అమితానందం కలిగించింది. ఆ వెంటనే, ఆయన, అతనికి ఎదురువెళ్ళి, అర్ఘ్యపాద్యాదు లర్పించుకుని, కానికలిచ్చి, సత్కరించాడు. తనవద్ద కొంత కాలం ఉండవలసిందిగా, అతణ్ణి అభ్యర్థించాడు.

జనకునికోరికమీద, బలరాముడు, అక్కడ, కొన్ని సంవత్సరాలు ఉన్నాడు. ఆ సమయంలోనే, దుర్యోధనుడు అక్కడికి వెళ్ళటం, ఆయన వద్ద, గదాయుద్ధ కౌశలం గ్రహించటం, జరిగింది.

శతధన్వుని మరణవార్త చేరగానే, ద్వారావతిలో ఉన్న అతని మిత్రులందరూ అదలిపోయినారు. అంతలో, స్యమంతకమణికోసం, శ్రీకృష్ణుడు, శతధన్వుని మిత్రుల నివాసాలను వెదుకదలచాదనికూడా, వారు వినటంజరిగింది. అది కారణంగా, శ్రీకృష్ణునిచేతిలో తమ బ్రతుకేమౌతుందో అన్న భయం, వారిలో, ప్రతి ఒక్కరినీ ఆవరించింది.

అదే సమయంలో, తన ఇంట్లో ఉన్న స్యమంతకం, అక్రూరుని కంట పడ్డది. దాన్ని చూడగానే, అతడు, కంపించిపోయినాడు. ఆ మణి, తన వద్ద ఉన్నదని మాధవుడు గ్రహించినపక్షంలో, తన మర్యాద నిలువదని అతడు భావించాడు. ఆ భయంతోనే, అతడు, కృతవర్మతోసహా, అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

తన భక్తుడయిన అక్రూరుడు, ఆ విధంగా దేశాంతరగతుడు కావటం, శ్రీకృష్ణునకు బాధకలిగించింది. అందుకనే, ఆయన, అతణ్ణి, తిరిగి రప్పించి, గౌరవ పురస్సరంగా అతనితో ఇలా అన్నాడు.

"అక్రూరా ! శతధన్వుడు, నీకు తెలియకుండా, స్యమంతకాన్ని మీ యింట్లో ఉంచి వెళ్ళిన సంగతి, మాకు తెలిసింది. దాని విషయంలో, నువ్వు యే విధంగానూ భయపడవలసిన పనిలేదు.

ఇక ప్రకృతానికి వద్దాం. సత్రాజితునకు పుత్ర సంతానం లేదు. అతనికి పిండప్రదానం చేయవలసినవారూ, అతని ఋణాలను తీర్చవలసినవారూ, ఇక, అతని దౌహిత్రులేనన్న విషయం, నీకూతెలుసు. యథార్థానికి, ఆ పని చేసేవారికే, మృతులదయిన ఆస్తి సంక్రమించటం ధర్మం. అయినప్పటికీ, ఆ స్యమంతకాన్ని, మేము కోరటం లేదు. దాన్ని, నీ వద్దనే ఉంచటానికి, మేము నిశ్చయించుకున్నాము. కాని, మా అన్నగారయిన బలరాముడు, ఆ మణి విషయంలో, నన్నే నమ్మలేకుండా ఉన్నాడు. అది కారణంగా, నువ్వు, దయ ఉంచి, ఆ మణిని, ఒక్కసారి, మనవారందరికీ చూపించవలసింది. మన బంధువర్గాని కంతటికీ, మనశ్శాంతి కలిగించవల

సింది. ఆపైన, దాన్ని, సువ్రతుడవయిన నీవద్దనే ఉంచుకుని, నీవు, ఇటీవల, అనుదినం, స్వర్ణవేదికలమీద నిర్వహిస్తూ ఉన్న యజ్ఞ యాగాదికాలకు, దాని ఫలితాన్ని వినియోగించవలసింది."

ఆ విధంగా పలికి, శ్రీకృష్ణుడు, అక్రూరునకు మనశ్శాంతి కలిగించాడు. స్యమంతకాన్ని తనవారందరికీ చూపించి, తిరిగి, అక్రూరున కిచ్చి వేశాడు. ఆ మణి ప్రభావంవల్ల, తనకు లభ్యమైన సిరి నంతనూ దానంచేసి, అక్రూరుడు, ఆపైన, 'దాన పతి' అనిపించుకోవటం జరిగింది.

అనంతరం, మరణించిన తన మామగారికి పరలోకంలో, మేలు చేకూరే నిమిత్తం జరుపవలసిన కర్మ లన్నింటినీ, బంధు మిత్రుల సమక్షాన, శ్రీకృష్ణుడు యథావిధిగా జరిపించాడు.

## *151. ఇంద్రప్రస్థంలో శ్రీకృష్ణుడు :*

ఆ తరువాత, ఒకసారి, పాండవులను చూసివచ్చే నిమిత్తం, శ్రీకృష్ణుడు, యాదవ ప్రముఖులతోసహా, ఇంద్రప్రస్థానికి వెళ్ళటం జరిగింది. అలా వెళ్ళిన యాదవ వీరులనూ, శ్రీకృష్ణునీ, యుధిష్ఠిరాదులు, విధ్యుక్తంగా పూజించారు. ఆలింగనం చేసుకున్నారు. వారి స్పర్శద్వారా, తమ దోషాల నన్నింటినీ తొలగించుకున్నారు. మందహాసాన్ని వెదజల్లే, శ్రీకృష్ణుని ముఖారవిందాన్ని దర్శిస్తూ, మహదానందం పొందారు. ఆ సందర్భంలో, శ్రీకృష్ణుడు, కుంతీదేవిని కలుసుకుని...

'అత్తా కొడుకులు గోడలు
జిత్తానందముగ బనులు సేయగ నాత్మా
యత్తానుగవై యాజ్ఞా
సత్తాదులు కలిగి మనుదె సమ్మోదమునన్'

అని, ప్రేమపూర్వకంగా పలుకరించాడు.

శ్రీకృష్ణుడు, తనకుతానై వచ్చి, తన్ను అలాపలుకరించినందుకు

కుంతీదేవి ఎంతగానో సంతోషించింది. ఆనందాశ్రులు రాల్చింది. గద్గద భాషణలతో, ఆయన కిలా విన్నవించుకుంది :

'కృష్ణా ! నీ దయవల్ల, మేమందరం, క్షేమంగానే ఉన్నాము. నువ్వు, సర్వలోక సుహృదుడవు. ఆశ్రయించినవారి క్లేశాలను అంతరింప చేయటంలో నీకు నువ్వే సాటి, యథార్థానికి, నాకూ, నా పిల్లలకూ, నువ్వే దిక్కు. మా అదృష్టంవల్లనే నువ్వు, మమ్మల్ని మరచిపోకుండా, సర్వ వేళలా కాపాడుతూ, మా కష్టాలు తొలగిస్తూ ఉండటం జరుగుతోంది. అందుకు, మేము, నీ కెంతగానో ఋణపడి ఉన్నాము."

కుంతీదేవి ఆ విధంగా తన హృదయాన్ని నివేదించుకున్న తరువాత, యుధిష్ఠిరుడు, శ్రీకృష్ణుని, ఉద్దేశించి...

'పట్టగలేరు నిన్ను దమ భావములందు సనందనాదు లే
పట్టునన్నైన, నట్టి గుణ భద్ర చరిత్రుడ వీవు, నేడు, మా
చుట్టమవంచు వచ్చెదవు, చూచెద వల్పులమైన మమ్ము, నే
మెట్టి తపంబు సేసితి మధీశ్వర, పూర్వ శరీర వేళలన్'

అని, ప్రస్తుతి పూర్వకంగా తమ కృతజ్ఞతను తెలుపుకున్నాడు.

## 152. సూర్యపుత్రి; కాళింది :

ఆ తరువాత, ధర్మరాజాదుల అభ్యర్థనమీద, శ్రీకృష్ణుడు, ఇంద్రప్రస్థంలో కొన్ని నెల లున్నాడు. ఆ సమయంలో, ఒకసారి, ఆయన, మృగయావినోదార్థం యమునాతీరంలో ఉన్న అరణ్యానికి, అర్జునుడితో సహా వెళ్ళటం జరిగింది. అక్కడ, వారు, కొద్దిసేపు, మృగాలను వేటాడి, అనంతరం, బడలికను తొలగించుకునే నిమిత్తం, కాళిందిలో స్నానం చేయటానికి వెళ్ళారు. అలా వెళ్ళిన కృష్ణార్జునులకు, ఆ ప్రాంతంలో విహరిస్తున్న ఒక సుందరాంగి కనిపించింది. అప్పుడు, అర్జును డామెను సమీపించి...

"సుదతీ యెవ్వరిదాన, వేమికొఱ కిచ్చోటం బ్రవర్తించెద, దె
య్యది నీ నామము, గోర్కి యెట్టిది, వివాహాకాంక్షతో గూడి యీ

నదికిన్ వచ్చినజాడ గానబడె, ధన్యంబయ్యె నీ రాక, నీ
యుదయాది స్థితు లెల్ల జెప్పు, మబలా, యుద్యత్కురంగేక్షణా"

అని, పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, ఆ కన్య...

"నరవీరోత్తమ, యేను సూర్యుని సుతన్, నా పేరు కాళింది భా
స్కర సంకల్పిత గేహమందు, నదిలో, గంజాక్షు విష్ణున్ బ్రభున్
వరుగా గోరి తపంబు సేయుదు, నారున్ వాంఛింప, గృష్ణుండు వ
న్యరతిన్ వచ్చి వరించు నంచు బలికెన్ నా తండ్రి నా తోడుతన్"

అని, తన విషయం తెలుపుకుంది.

ఆమె పలుకులు విన్న అర్జునుడు, కృష్ణుని సమీపించి, ఆమె తెలిపిన దంతా ఆయనకు విన్నవించుకున్నాడు. ఆపైన, శ్రీకృష్ణుడు, అమితానందంతో, ఆమెను స్వీకరించటం జరిగింది.

*153. నాగ్నజితి :*

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, తన మేనత్త అయిన రాజాధిదేవి కుమార్తెను, తనకై తపిస్తున్న కన్యను, మిత్రవిందను, ఆమె సోదరులైన విందానువిందులతో విరోధించి, అవలీలగా, స్వయంవర మంటపం నుంచి అపహరించుకు వెళ్ళాడు. అనంతరం, కోసల దేశాధిపతి అయిన నగ్నజిత్తు కుమార్తెను, 'సత్య' అని పిలువబడే కన్యను, నాగ్నజితిని కూడా, ఆయన వివాహం చేసుకోవటం జరిగింది.

నగ్నజిత్తువద్ద ఏడు ఆబోతులుండేవి. వాటికి, వీరులపొడ గిట్టేది కాదు. వాటిని దమింపగలవానికే తన కుమార్తె నిచ్చి వివాహం చేస్తానని, నగ్నజిత్తు శపథం చేశాడు. శ్రీకృష్ణుడు అది గ్రహించి, అక్కడికి వెళ్ళి, ఆ ఏడు ఆబోతులనూ, ఏకకాలంలో, యేడు రూపాలలో సమీపించి, అనాయాసంగా, వాటిని, నిగ్రహించాడు. వాటికి, ముక్కుత్రాళ్లు పోశాడు. వాటి దర్పాన్ని హరించాడు. ఆ విధంగా వాటి శక్తిని అదుపులోకి తీసుకు

వచ్చి, బంధించి, పిల్లలు ఎడ్లరూపంలో ఉన్న కొయ్య బొమ్మలను ఈడ్చుకు పోయేటట్టుగా, వాటిని, సభాస్థలానికి తీసుకు పోయినాడు. అది చూసిన నగ్నజిత్తు, అమితంగా ఆనందించి, తను చేసిన శపథం ప్రకారం, తన కుమార్తెను ఆయన కిచ్చి వివాహం చేశాడు. ఆ విధంగా, నాగ్నజితి, శ్రీకృష్ణునకు భార్య కావటం జరిగింది.

## *154. మద్ర రాజపుత్రి : లక్షణ :*

అనంతరం, శ్రీకృష్ణుడు, కేకయ రాజపుత్రిని, తన మేనత్త అయిన శ్రుతకీర్తి కుమార్తెను, భద్రను, ఆమె సోదరులు సంతర్దనాదుల ద్వారా గ్రహించాడు. మద్ర రాజపుత్రి అయిన లక్షణను కూడా వివాహం చేసుకున్నాడు శ్రీకృష్ణుని అస్త్రప్రయోగ పాటవానికి, లక్షణా కరగ్రహణం, ప్రత్యక్ష నిదర్శనం. అస్త్రవిద్యా విశారదు లందరిలోనూ, ఆయనదే అగ్రతాంబూల మనటానికి, అదొక తార్కాణం.

మద్ర దేశాధీశ్వరుడైన బృహత్సేనుని ఇంటికి, దేవర్షి అయిన నారదుడు, తరుచుగా వచ్చిపోతూ ఉండేవాడు. ఆయన వచ్చినప్పుడల్లా, అక్కడివారికి, శ్రీకృష్ణుని లీలా విలాసాలను, అత్యుత్సాహంతో అభి వర్ణించి చెబుతూ ఉండేవాడు.

వాటిని విన్న లక్షణకు, శ్రీకృష్ణునిపట్ల అభిమానం, దినదినాభి వృద్ధి పొందసాగింది. కాలక్రమాన, ఆమెకు, ఆయనమీద ప్రేమ జనించటం 'ఆయన్ని తప్ప అన్యుని వివాహం చేసుకోరాదు' అని ఆమె నిర్ణయించు కోవటం కూడా జరిగింది.

బృహత్సేనుడు అది గ్రహించాడు. ఆమెను, తన ప్రాణానికి ప్రాణంగా చూసుకునేవాడు కావటంవల్ల, ఆమె కోరికను తీర్చటానికి నిశ్చ యించుకున్నాడు.

అది కారణంగానే, ద్రౌపదికి, అర్జునుని భర్తగా సంపాదించే నిమిత్తం, పాంచాల దేశాధీశ్వరుడు మత్స్య యంత్రాన్ని కల్పించినట్టుగా,

ఆయనకూడా, అటువంటిదాన్నే, మరొకదాన్ని సృష్టించాడు. కాని, ఆ విష యంలో, ఆయన, మరొక అడుగు ముందుకు వెళ్లటం జరిగింది. ఆయన కల్పించిన యంత్రంలో, మత్స్యం కనిపించేది కాదు; దాని నీడ మాత్రమే, నీటిలో, ద్యోతమయేది.

అది గ్రహించిన అస్త్రవిద్యా విశారదులైన రాజు లెందరో, తమ తమ అధ్యాపకులతోసహా, మద్ర దేశానికి వెళ్ళారు. ఆ మత్స్యాన్ని పడ గొట్టడానికి ఎంతగానో ప్రయత్నించారు. కాని, అది యెవరికీ కూడా సాధ్యం కాకపోయింది. జరాసంధ, శిశుపాల, భీమ, దుర్యోధన, కర్ణాది వీరులు, అక్కడ ఉంచిన వింటికి నారిని సంధించటంవరకూ విజయాన్ని సాధించారు; కాని, మత్స్యం ఎక్కడ ఉన్నదీ తెలుసుకోలేక, వారు, ఆ వింటిని అక్కడే వదలి వెళ్ళిపోవటం జరిగింది.

అంతలో, అర్జునుడు ముందుకు వచ్చాడు. నీటిలో కనిపించే నీడను చూసి, ఆ మత్స్యం ఉన్న స్థలాన్ని గ్రహించాడు. దాన్ని మనసులో నిలుపుకుని, వింటికి బాణాన్ని సంధించాడు. అతిజాగ్రత్తగా దాన్ని వది లాడు. కాని, అది, ఆ మత్స్యాన్ని కూల్చలేక పోయింది: దానికి తగిలి క్రింద పడిపోయింది.

ఆ విధంగా విలుకాండ్రందరి గర్వమూ హరించిపోయిన తరు వాత, శ్రీకృష్ణుడు, రంగంలో ప్రవేశించాడు. ఒకే ఒకసారి, ఆ చేప నీడను, నీటిలో చూశాడు. వింటికి నారిని బిగించి, బాణాన్ని సంధించి, అవలీలగా వదిలాడు దాంతో, ఆ మత్స్యం, నేలమీద పడిపోయింది; లక్షణ, ఆయన ధర్మపత్ని అయింది.

ఆ విధంగా. ఆ మహానుభావునకు, రుక్మిణి, జాంబవతి, సత్య భామ, కాళింది, మిత్రవింద, భద్ర, నాగ్నజితి, లక్షణ, అనే, అష్టపత్ను లేర్పడ్డారు. వారు కాక, మరి పదహారువేలమంది రాజసుందరులు కూడా, ఆయనను సేవించటం జరిగింది.

## 155. ప్రేమస్వరూపిణి; రాధాదేవి :

శ్రీకృష్ణుని ధర్మపత్నులందరూ ఒక యెత్తు; రాధాదేవి ఒక్కర్తూ ఒక యెత్తు. ఆమెకూ శ్రీకృష్ణునకూ యేవిధమైన భేదమూ లేదు. శ్రీకృష్ణుడే రాధ. రాధే శ్రీకృష్ణుడు. వా రిద్దరినీ, వైవాహిక బంధంతో ఏకీకృతం చేసినవాడు, చతుర్ముఖుడు.

రాధాదేవి, కన్యాకుబ్జ రాజకుమారి. వృషభానుని కుమార్తె. ఆ వృషభానుడు, పూర్వజన్మలో, నృగమహారాజు కుమారుడైన సుచంద్రుడు.

సుచంద్రుని భార్య కళావతి. కళావతీ సహితుడై, సుచంద్రుడు, గోమతీ తీరానికి వెళ్ళి, ఒక ఆశ్రమం ఏర్పరచుకుని, చతుర్ముఖుని గూర్చి, పన్నెండు దివ్యవత్సరాలు, తీవ్రమైన తపస్సు చేశాడు. అతని తపస్సుకు మెచ్చి, చతుర్ముఖుడు ప్రత్యక్షమై, "నీ కోరిక యేమిటి ?" అని, అతణ్ణి అడిగాడు.

సుచంద్రుడు, ఏ విధమైన ఆలోచనా లేకుండా, 'నాకు మోక్షం కావాలి' అన్నాడు అది విన్న చతుర్ముఖుడు, అతని కోరిక నెరవేరేటట్లు వరమిచ్చాడు. కాని, అది గ్రహించిన కళావతి, ఆ విధమైన వరప్రదానం వల్ల, తనకు, భర్తృవియోగం సంభవిస్తుందనీ, తన కా విధమైన అన్యాయం జరుగకుండా చూడవలసిందనీ చతుర్ముఖుని వేడుకుంది. అది కారణంగా, చతుర్ముఖుడు, వారు, ద్వాపరయుగాంతాన తిరిగి దంపతులయేటట్టూ, ఒక కుమార్తె కలుగగానే వారికి మోక్షం లభించేటట్టూ, తన వరాన్ని కొద్దిగా సవరించుకున్నాడు ; అదృశ్యుడైనాడు.

అనంతర కాలంలో, ఆ కళావతి, కన్యాకుబ్జ దేశాధీశ్వరుడైన భలందన మహారాజుకు కుమార్తెగా, యజ్ఞకుండంలో ఉద్భవించింది. సుచంద్రుడు, గోపవరుడైన సురభానునకు, వృషభానుడనే కుమారుడుగా జన్మించాడు.

అయోనిజ అయిన ఆ రాజపుత్రీ, వృషభానుడూ, చతుర్ముఖుని

నిర్ణయం ప్రకారం, భార్యా భర్త లయినారు. వారికి, కాలక్రమాన, ఒక కుమార్తె జనించింది. వా రామెకు, 'రాధ' అని నామకరణం చేశారు.

నారదమహర్షి, ఒకసారి, వృషభానుని కలుసుకుని, ఆయన కుమార్తెకు భర్త కాదగినవాడు ఒకే ఒక డున్నాడనీ, ఆయనే, నందనందను డైన శ్రీకృష్ణుడనీ తెలియపరచాడు. అలాగే. ఆయన, నందునితో, 'మీ ముద్దులయ్యకు తగిన చిన్నది, వృషభానుని ఇంట్లో, రాధగా పెరుగుతోంది' అని చెప్పటం కూడా జరిగింది.

అనంతరం, వృషభానుడు, ఒకసారి, నారదుని సూచనమీద, భాండీరవనానికి వెళ్ళాడు. వెడుతూ, రాధనుకూడా తీసుకువెళ్ళాడు. ఆ సమయంలో, నందాదులు, బాలకృష్ణ సహితులై, అక్కడ ఉన్నారు.

రాధ ఆ వనంలో ప్రవేశించే సమయానికి, కృష్ణయ్య, గుక్క పట్టి ఏడుస్తున్నాడు. అతణ్ణి శాంతింప చేయటం, అక్కడ ఉన్నవారికి ఎవరికీ సాధ్యం కాలేదు.

అంతలో, రాధ, వారిని సమీపించింది. కృష్ణయ్యను చేతుల్లోకి తీసుకుంది. ఆ వెంటనే, కృష్ణయ్య, ఏడుపుమాని, ముసిముసి నవ్వులు నవ్వటం మొదలు పెట్టాడు. అది గ్రహించిన నందుడు, 'వీ రిద్దరికీ పూర్వ జన్మ సంబంధం యేదో ఉండి ఉంటుంది' అనుకున్నాడు. నారదుని పలుకులు స్ఫురణకు తెచ్చుకుని, ఆశ్చర్యంతో వారి వంక చూస్తూ, అలాగే నిలబడిపోయినాడు.

అంతలో, భూదేవీ చతుర్ముఖుడూ అక్కడకు వచ్చారు. వచ్చి, ఆ రాధా కృష్ణులను, సభక్తికంగా స్తుతించారు. వా రిద్దరికీ ప్రణామం చేశారు. ఆ పైన, చతుర్ముఖుడు, అక్కడే ఒక మంటపాన్ని ఏర్పాటు చేయించాడు. వారికి, వేదోక్తంగా వివాహం చేయించాడు.

* * *

రాధాదేవి, ప్రేమ స్వరూపిణి ; మూర్తి దాల్చిన మధుర భక్తి.

ఆమెకు ఆ విధమైన విశిష్టస్థానాన్ని ప్రసాదించింది, శ్రీహరి చరణాబ్జాలనే సర్వదా ఆశ్రయించి ఉండే తులసి.

రాధాదేవిని, గోలోకంలో, లీలావతి అనీ, వైకుంఠంలో, శ్రీమహాలక్ష్మి అనీ, పేర్కొనటం జరుగుతుంది. శ్రీహరి, సృష్టికర్తగా వ్యవహరించే సమయాన, ఆమె, ప్రకృతిగా ఉండి, సృజన కార్యంలో, ఆయనకు దోహద మిస్తూ ఉంటుంది.

రాధాదేవిది అనన్యమైన భక్తి. ఆమె, శ్రీకృష్ణుని విడిచి ఉండలేదు. శ్రీకృష్ణుని మరచి బ్రతుకలేదు. శ్రీకృష్ణుని పట్ల ఏ విధమైన అపచారాన్నీ తలపెట్టలేదు : ఇతరులు తలపెట్టిన పక్షంలో, సహించలేదు. అదీ ఆమెవిశిష్టత.

పరా భక్తికి, రాధాదేవిని, మించిన నిదర్శనం మరొకటి లభించదు. పరాభక్తికి మారురూపమే రాధాదేవి. శ్రీకృష్ణుని సేవద్వారా ఆమె పొందదలచేది యేమీ లేదు. శ్రీకృష్ణుని సంతుష్టి పరచటమే, ఆయనదైన ఆనందాన్ని, క్షణక్షణం అతిశయింపచేస్తూ ఉండటమే, ఆమె ఆశయం. అది కారణంగానే, ఆమె, శ్రీకృష్ణునితో తాదాత్మ్యం పొందగలిగింది. శ్రీకృష్ణుని పత్నులందరి ప్రశంసలకూ పాత్రురాలు కాగలిగింది. శ్రీకృష్ణుని, 'రాధాకృష్ణుని' చేసుకోగలిగింది.

* * *

అటువంటి రాధాదేవిని పరీక్షించాలన్న అభిప్రాయం, ఒకసారి, మాధవునకు కలిగింది. ఆ వెంటనే, ఆయన, ఒక గోపాంగన రూపం ధరించి, రాధాదేవిని కలుసుకున్నాడు.

ఆ మాయా గోపికను చూడగానే, రాధాదేవికి, ఆమె మీద, అదో విధమైన అభిమానం కలిగింది, ఆ గోపికను, ఆమె, శ్రీకృష్ణునకు ప్రతిరూపంగా భావించటం జరిగింది. అది కారణంగానే, ఆమెను విధ్యుక్తంగా పూజించింది; సత్కరించింది. ఆ రోజంతా ఆమెతోనే గడిపింది.

మాటల సందర్భంలో, రాధాదేవి, ఆ గోపిక నడిగింది; 'మీ పే

రేమిటి ? మీ రెక్కడ ఉంటారు?' అని. ఆమెకు సమాధానంగా, ఆ మాయా గోపిక, తను ఉండేది నందపురి అనీ, అక్కడివారు, తనను, గోపదేవి అంటారనీ, తెలియపరచింది. అనంతరం, చీకటి పడబోయేముందు, అతి బలవంతాన ఆమెవద్ద సెలవు తీసుకుంది. 'మళ్ళీ రేపు వస్తాను' అని, మాట యిచ్చి, ఆమెకు కొంత మనశ్శాంతిని కలిగించిన పిమ్మటనే, ఆమె, అక్కడినుంచి కదలగలిగింది.

అన్న ప్రకారం, ఆ మాయా గోపిక, మర్నాడు వచ్చింది. వచ్చి, మాట్లాడకుండా, ఓ మూల, మౌనంగా కూర్చుంది. అది చూసిన రాధాదేవి, ఆమెను సమీపించి, ఆమె అలా ఉండటానికి గల కారణమేమిటో తెలుపవలసిందిగా బ్రతిమాలుకుంది. దానిమీద, ఆ మాయాగోపిక, యిలా చెప్ప సాగింది.

"ఈ ఉదయాన, నేను, గోవర్ధనగిరి సమీపంలో, పెరుగమ్ముకునే నిమిత్తం వెడుతున్నాను. అంతలో, నందనందనుడైన నల్లనయ్య, అక్కడ ప్రత్యక్షమైనాడు. నా చెయ్యి పట్టుకున్నాడు. 'నన్ను పెళ్ళిచేసుకోవలసింది' అని, యెంతగానో బలవంతం చేశాడు.

దాంతో, నాకు, ఎక్కడలేని కోపం వచ్చింది. ఆ కోపంలో, ఆయన్ని, నోటికి వచ్చినట్టల్లా అనేశాను 'చేసుకోగా చేసుకోగా, నీబోటివాణ్ణి, అందులోనూ నల్లవాణ్ణి, అదీకాక, నవనీతచోరుణ్ణి, అన్నిటికిమించి, గొల్లవాణ్ణి, నిన్నే చేసుకోవాలా !' అని కూడా అన్నాను.

అలా అన్నానని కోపం వచ్చింది కాబోలు. ఆ వెంటనే, ఆయన, నా పెరుగుకడవను లాక్కున్నాడు. త్రాగగలిగినంత పెరుగు త్రాగేశాడు; మిగిలింది, నెత్తిన పోసుకున్నాడు. ఆ పైన, వెకిలిగా నవ్వుకుంటూ వెళ్ళిపోయినాడు.

నిజానికి, అటువంటి అల్లరివాడు, ఇంతవరకు, ఎక్కడా పుట్టలేదు ; ఇకముందు పుట్టబోడుకూడా. అతణ్ణి నమ్ముకున్నవాళ్ళు, అతణ్ణి

ఆశ్రయించినవాళ్లు, అతణ్ణి పెళ్ళిచేసుకున్నవాళ్లు, చివరకు ఏమౌతారో, నాకుమాత్రం తెలియకుండా ఉంది."

ఆ మాటలు విన్న రాధాదేవి, అమితంగా బాధపడ్డది. ఐనా, ఆ బాధను బయట పడనీకుండా, ఆ మాయా గోపికతో ఇలా అన్నది :

"అమ్మా ! నువ్వు, ఆ మహానుభావుణ్ణి ఎందుకు అంతగా తూలనాడావో నేను గ్రహించలేకుండా ఉన్నాను. ఎవని దర్శనం కోసం, బ్రహ్మ రుద్రాదులుకూడా తపిస్తూ ఉంటారో, ఎవని పాదధూళికోసం, భక్త శిఖామణు లందరూ ప్రయత్నిస్తూ ఉంటారో, ఆ పవిత్రతమమూర్తిని, అనరాని మాట లన్నావు. అది, ఏ మాత్రంగానూ భావ్యంగా లేదు. ధర్మ సంస్థాపనకోసం, అధర్మాన్ని నశింపజేసే నిమిత్తం, శిష్టులను రక్షించటానికి, దుష్టులను శిక్షించటానికి ఉద్భవించిన ఆ శ్రియఃపతిని నిందించటం న్యాయంకాదు.

అతడు నల్లవా డన్నావు. కాని, ఆ నల్లనయ్య అనుగ్రహం వల్లనే, మహర్షులు సయితం, తమలోఉన్న చీకటి తెరలను తొలగించుకో గలుగుతున్నారు. అది నువ్వు గ్రహించినట్టులేదు.

అతడు, వెన్నదొంగ కావచ్చు. కాని, ఆ వెన్నతోపాటు, అతడు యెన్ని పవిత్ర హృదయాలనో ఆకర్షిస్తున్నాడు. దాన్ని నువ్వు గ్రహించలేకుండా ఉన్నావు. అసలు, కృష్ణుడంటే యేమిటో, యెవరో, తెలిస్తే, నువ్వుఅలా అని ఉండేదానివి కాదు.

గొల్లలంటే, నువ్వు, యేమనుకుంటున్నావో యేమో ! ఎల్లప్పుడూ గోసేవచేస్తూ, గోరజాన్ని ఎప్పుడూ శిరస్సున ధరిస్తూ ఉండే అదృష్టం, గోపాలుడుగా, గోవిందుడుగా, వ్యవహరించే ఆ మాధవుణ్ణి, అనుక్షణం దర్శించుకుంటూ, ఆయన లీలలను వీక్షిస్తూ, ఆయనతో క్రీడిస్తూ ఉండే భాగ్యం, గొల్లలమైన మనకే ఉందిగాని, మరెవరికైనా ఉందా ? లేదు. ఎవ్వరికీ లేదు. ఆ లీలామానుష విగ్రహుడు, ఆ శిఖిపింఛ విభూషణుడు,

ఆ శ్రీవత్సాంచితుడు, ఆ వనమాలా విరాజితుడు, ఆ మురళీ మనోహరుడు, ఆ పీతాంబర సుశోభితుడు, ఆ మహానుభావుడు, జన్మించటమే, ఆ వంశానికి ఉన్న విశిష్టతనూ, శ్రేష్టత్వాన్నీ విశదపరుస్తోంది. అది గ్రహించిన పక్షంలో, నువ్వు, ఆయన్ని అంత చులకనగా చూసేదానివి కాదు.

శ్రీసతిని హృదయాన నిలుపుకున్న ఆ పరిపూర్ణుడు, ఆశ్రితుల కొంగు బంగారమై చరించే ఆ మహానుభావుడు, తనకుతానై, కోరి, చేరి, ప్రణయభిక్ష నర్థించటం, అనుచితచర్యగా భావిస్తున్నట్టున్నావు. అందులో, ఆయినదైన అనుగ్రహబుద్ధి, అతినిగూఢంగా, అవధిలేనంతగా ఉన్నదని, అర్థం చేసుకోలేకుండా ఉన్నావు. యథార్థానికి, ఆ అనుగ్రహాన్ని పొందే అదృష్టం అందరికీ లభిస్తుందా ? లభించదు. సామాన్యులెవరికీ లభించదు. ఎన్నివేల జన్మల తపస్సో పండినవారికి మాత్రమే అది లభిస్తుంది... నిజానికి...ఎన్నివేల జన్మల తపస్సో...! ఎన్నివేల జన్మల తపస్సో... !''

ఆ మాట అంటూ ఉండగానే, రాధాదేవి కళ్లు, కన్నీటి కాలువ లయినై. కంఠం కంపించి పోయింది. ఆ వెంటనే, ఆమె, చెప్పరాని వేదనతో, తలవంచుకుంది. అరచేతులలో ముఖాన్ని కప్పుకుని, వెక్కివెక్కి యేడువసాగింది.

అది చూసిన మాయాగోపిక, మందహాసం చేసింది. ఆమెను దగ్గరకు తీసుకుంది. హృదయానికి హత్తుకుంది. ఆమె కన్నీటిని, తన పైటకొంగుతో అద్దుతూ, ఆమె చుబుకాన్ని, మెల్లగా పైకి ఎత్తింది. ఆమె ముఖానికి తన ముఖాన్ని ఆన్చి, అలాగే ఉండిపోయింది.

అంతలో, రాధాదేవి ఒళ్లు, పులకరించినట్టయింది. ఆమె కదో విధమైన దివ్యానుభూతి కలిగింది. అది కారణంగానే, అతి కష్టం మీద, ఆమె, కళ్లు తెరచింది. అనిర్వచనీయమైన ఆనందాన్ననుభవించింది. తన్ను తాను మఱచిపోయింది. 'కృష్ణా ! కృష్ణా !! కృష్ణా !!!' అంటూ,

తన్ను ఆవరించి ఉన్న ఆ నల్లనయ్య హృదయాన వ్రాలిపోయింది; ఆయన కౌగిట్లో కరగి పోయింది.

రాధా కృష్ణుల ప్రణయజీవితానికి, ఆ ముహూర్తమే, నాంది అయింది. ఆ క్షణంనుంచీ, గోపికలతో శ్రీకృష్ణుడు సలిపిన క్రీడ లన్నిటిలోనూ, రాధికదే అగ్రతాంబూలమయింది.

## 156. నరకాసురుడు :

పూర్వం, నరకుడనే ఒక రాక్షసేంద్రుడు, ప్రాగ్జ్యోతిషపురాన్ని పాలిస్తూ ఉండేవాడు. ఆ పురానికి నాలుగు దిక్కులా, నలుగురు మహా వీరులు, మురాసురుడు, హయగ్రీవుడు, నిశుంభుడు, పంచజనుడు అనే వారు, రక్షకులుగా ఉండేవారు. ఆ నరకాసురు డొకసారి, దేవలోకం మీదికి దండెత్తివెళ్లి, సురానీకాన్ని, అమితంగా చికాకుపరచటం జరిగింది. ఆ సమయంలో, అతను, మహేంద్రుని, అమరావతి నుంచి తరిమికొట్టాడు. అమర భవనా లన్నిటిలోనూ, తన విజయాన్ని చాటించుకున్నాడు. అతని సింహాసనాన్ని అధిష్ఠించాడు. అతని నివాసం దోచుకున్నాడు. సురతరువుల నున్మూలించాడు. దేవకాంతలను చెరబట్టాడు. విశ్వకర్మ కుమార్తెను కూడా బంధించాడు. ఎవరికీ కనబడనివీ, కోరరానివీ అయిన, అదితి కుండలాలను, అపహరించాడు. వరుణచ్ఛత్రాన్ని వశపరచుకున్నాడు. మణి పర్వతాన్ని స్వాధీనం చేసుకున్నాడు. ఆపైన, తన్ను, లోకేశ్వరునిగా ప్రకటించుకున్నాడు. పధ్నాలుగు లోకాలలోనూ విశిష్టమైనది యేది ఉన్నా, అది, తనకు దత్తం కావాలని, దానవానీకానికి ఆదేశించాడు. ఆ ఆదేశాన్న నుసరించి, అతని భటులు, పదహారువేల ఒకవందమంది గంధర్వ కన్యలనూ, లక్షమంది యక్ష కాంతలనూ, మరెందరినో కిన్నర సిద్ధ సాధ్య విద్యాధర సుందరులనూ, అతని కోసం బంధించి తెచ్చారు.

ఆ రాక్షసేంద్రు డొకసారి, బదరీవనానికి వెళ్లటం జరిగింది. అలా వెళ్లినవాడు, అక్కడ యజ్ఞ యాగాదులు నిర్వహిస్తున్న మునులను

సమీపించి, 'ఇక పైన, ఇవన్నీ, నా పేరట నిర్వహింపబడాలి' అని, ఆదేశించాడు. కాని, వారు, అతని పలుకులను లక్ష్యంచేయలేదు. లక్ష్యం చేయకపోవటమేకాదు; అవహేళన చేశారు కూడా. దానిమీద, అతడు, ఆగ్రహావేశ పరవశుడై, వారి యజ్ఞశాలలను తగులబెట్టించాడు. యజ్ఞ వేదికలను నేల మట్టం చేయించాడు. యజ్ఞకుండాలను పూడిపించాడు. యూపాలు విరిపించాడు. ఉద్గాతలనూ సదస్యులనూ బాధలపాలు చేశాడు. అన్నరాసులను అపవిత్రం చేయించి, వాటిని, నలుమూలలా విరజిమ్మించాడు. మునిపత్నులను కూడా, అమితంగా అవమాన పరచాడు.

అదంతా చూసిన. వసిష్ఠ, వామదేవ, కపిల, కశ్యప, ధౌమ్య, భరద్వాజాదులు, ఆ వెంటనే, ద్వారావతికి వెళ్ళి, శ్రీకృష్ణుని దర్శనం చేసుకుని, ఆయనకు, నరకుని దౌష్ట్యాన్ని విశదపరచుకున్నారు. అతని బారినుంచి తమ్ము రక్షించవలసిందిగా వేడుకున్నారు. ఆ తరువాత, మహేంద్రుడు కూడా, ఒకసారి, శ్రీకృష్ణుని కలుసుకుని, నరకుడు కారణంగా దేవతలు అనుభవిస్తున్న అగచాట్లను, ఆయనకు విన్నవించుకున్నాడు. అది కారణంగానే, శ్రీకృష్ణుడు, నరక సంహారానికి నిశ్చయించుకోవటం జరిగింది.

ఆ వెంటనే, ఆయన, గరుడ వాహనారూఢుడై బయలు దేరాడు. అది గ్రహించిన సత్యభామ, ఆయన్ని సమీపించి...

'దేవా నీవు నిశాట సంఘముల నుద్దీపించి చెండాడ నీ
ప్రావీణ్యంబులు సూడగోరుదుగదా ప్రాణేశ మన్నించి న
న్నీ వెంటం గొనిపొమ్ము నేడు కరుణన్ నే జూచి యేతెంచి నీ
దేవీ సంహతికెల్ల జెప్పుదు భవద్దీప్త ప్రతాపోన్నతుల్'

అని, మనవి చేసుకుంది.

సత్యభామ సమర రంగంలో ప్రవేశించాలనుకోవటం, శ్రీకృష్ణునకు హాస్యాస్పద మనిపించింది. అందుకనే, ఆయన, ఆమెను, ఆ ప్రయత్నం

విరమించుకోవలసిందిగా కోరాడు. సమరభూమి సుమోద్యానం వంటిది కాదనీ, మహాభయంకరంగా ఉంటుందనీ కూడా, తెలియపరచాడు. కాని, సత్యభామ, తన అభిప్రాయాన్ని మార్చుకోలేదు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆమెతో సహ బయిలుదేరి, ప్రాగ్జ్యోతిషపురం చేరుకున్నాడు. చేరుకుని, అక్కడి ప్రాకారాలను తన కౌమోదకితో పిండి పిండి చేశాడు. తన సుదర్శనంతో, అక్కడ ఉన్న అగ్ని వరుణ ప్రాకారాలను ధ్వంసం చేశాడు. తన ఖడ్గంతో, మురాసురుని మాయా జాలాన్ని తొలగించాడు. పాంచజన్యాన్ని పూరించి, కోట బురుజుల మీది శతఘ్నులనూ, వాటి కావలి వారినీ, కూల్చివేశాడు.

ఆ పాంచజన్యం ధ్వని విని మురాసురుడుకూడా అదలిపోయినాడు; అంతవరకూ, తను శయనించి ఉన్న వరుణ ప్రాసాదం నుంచి, తన త్రిశూలంతో, బయటకు వచ్చాడు.

అప్పుడు జరిగిన యుద్ధంలో, శ్రీకృష్ణుడు, ఆ త్రిశూలాన్ని, రెండు బాణాలతో, మూడు ముక్కలు చేశాడు. అతని గదను, తునా తునకలు చేశాడు. చక్రాయుధంతో, అతని తల లైదింటినీ నఱికి వేశాడు.

ఆ విధంగా మురాసురుడు కూలటం చూసి, అతని కుమారులు, తామ్రుడు, అంతరిక్షుడు, శ్రవణుడు, విభావసుడు, వసుడు, నభస్వంతుడు, అరుణుడు అనేవారు, నరకుని సేనాపతి అయిన పీఠుని పురస్కరించుకుని, శ్రీకృష్ణుని ఎదిరించారు; అనతికాలంలోనే, యమాలయానికి అతిథులుగా వెళ్ళారు.

తనవారలా నిహతులు కావటం తెలుసుకుని, నరకుడు, అమితంగా భయపడి పోయినాడు; మార్గాంతరం తోచక, ఐరావత కులానికి చెందిన తన గజయూథంతో, సమరరంగ ప్రవేశం చేశాడు.

నరకుని చూడగానే, సత్యభామలో, తీవ్రమైన రోషం ప్రజ్వలించింది. అది కారణంగానే...

వేణిన్ జొల్లెమువెట్టి సంఘటిత నీవీబంధయై భూషణ
శ్రేణిం దాల్చి ముఖేందుమండల మరీచీజాలముల్ పర్వగా
బాణిం బయ్యెద జక్కఁగా దురిమి శుంభద్వీర సంరంభయై
యేణీలోచన లేచి నిల్చె దన ప్రాణేశాగ్ర భాగంబునన్.

సత్యభామను ఆ విధంగా చూసిన శ్రీకృష్ణునకు, సంభ్ర మాశ్చర్యాలు కలిగినై. అందుకనే, ఆయన, ఆమె నుద్దేశించి...

'లేమా దనుజుల గెలువఁగ
లేమా నీ వేల కదఁగి లేచితి విటు రా
లే మాను మానవే నా
లే మా విల్లందికొనుము లీలం గేలన్'

అంటూ, తన బాణాసనాన్ని ఆమెకు అందించాడు.

శ్రీకృష్ణు డందించిన ఆవిల్లు నందుకోగానే, సత్యభామ, ఆదోవిధ మైన అపూర్వ తేజంతో ప్రకాశించింది. వీర, శృంగార, భయ, రౌద్ర రసాలన్నీ, అప్పు డామె నాశ్రయించినై. ఆ సమయంలో...

'వీణె జక్కఁగబట్ట వెరవెఱుంగని కొమ్మ
బాణాసనంబెట్లు పట్టనేర్చె
మ్రాకున దీగె గూర్పంగ నేరని లేమ
గుణము నే క్రియ ధనుఃకోటి గూర్చె
సరవి ముత్యము గ్రువ్వజాలని యబల యే
నిపుణతఁ సంధించె నిశితశరము
జిలుకకు బద్యంబు చెప్పనేరని తన్వి
యస్త్రమంత్రము లెన్న నభ్యసించె
బబుకుమనిన బెక్కు పలుకని ముగుద యే
గతి నొనర్చె సింహగర్జనముల'

ననగ మెఱసె ద్రిజగదభిరామ గుణధామ
చారు సత్యభామ సత్యభామ.

అప్పుడు జరిగిన ఘోర సమరంలో, నరకునిసైన్యం, అమితంగా నష్టమైపోయింది. మిగిలినవాళ్ళు, చెల్లాచెదరు కాజొచ్చారు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు...

'కొమ్మా దానవనాథుని
కొమ్మాహవమునకు దొలగె గురువిజయము గై
కొమ్మా మెచ్చితి నిచ్చెద
గొమ్మాభరణములు నీవు కోరిన వెల్లన్'

అని, బహుమాన పురస్సరంగా అన్నాడు. ఆ పలుకులు విన్న నరకుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి...

'మగువ మగవాని ముందఱ
మగతనములు సూప రణము మానుట నీకున్
మగతనము కాదు, దనుజులు
మగువల దెస జనరు, మగల మొగలగుట హానీ!'

అంటూనే, శతఘ్ని అనే శస్త్రాన్ని, శ్రీకృష్ణుని మీదకు విసిరాడు. ఆయన్ని అమితంగా ఉద్రేకపరచాడు. అలా ఉద్రేకపరచిన నరకుని మీదా, అతని యోధులమీదా, శ్రీకృష్ణుడు, ఆ వెంటనే, తన దివ్యాస్త్రాలను ప్రయోగించాడు. ఆ అస్త్రాల మూలంగా, వారందరూ అమితంగా పీడితులయినారు. అదే సమయంలో, గరుడుడు, నరకుని హస్తచయాన్ని తీవ్రంగా గాయపరచాడు. అవి పారిపోయేటట్టు చేశాడు. ఆ సమయంలో, ఎనభై నాలుగువేల మంది రాక్షసులు, హతులుకావటం జరిగింది.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, నరకుడు ప్రయోగించిన శస్త్రాస్త్రాల నన్నింటినీ ఖండించి, తన చక్రాయుధాన్ని అతనిమీదకు పంపాడు. అది

కారణంగా, ఆ మరుక్షణంలోనే, నరకుని తల నేలకు వ్రాలిపోవటం జరిగింది.

నరకు దలా కూలిపోగానే, భూదేవి, తన మనుమడయిన భగదత్తు నితో, శ్రీకృష్ణుని సమీపించి...

'దయ నిటు చూడుమా నరకదైత్యుని బిడ్డడు వీడు నీ దెసన్
భయమున నున్నవాడు గడు బాలు డనన్య శరణ్యు డార్తు డా
శ్రయ రహితుండు తండ్రి క్రియ శౌర్యము నేరదు నీ పదాంబుజ
ద్వయి బొడగాంచె భక్త పరతంత్ర సువీక్షణ దీనరక్షణా !'

అని, నివేదించుకుంది. ఆయనను, వైజయంతీమాలతో అలంకరించింది. అదితివైన కుండలాలనూ, వరుణఛ్ఛత్రాన్నీ, ఆయనకు సమర్పించుకుంది.

అనంతరం, భూదేవి ప్రార్థన నంగీకరించి, శ్రీకృష్ణుడు, భగదత్తున కభయమిచ్చాడు. ఆపైన, నరకాసురభవనంలో ప్రవేశించాడు.

అక్కడ, నరకుని ఉద్యోగులు, నరకుని ఆస్తి అయిన ఇరవై వేల ఏనుగులనూ, అన్ని కరేణువులనూ, సులక్షణాశ్వాలనూ, ఒక లక్షా ఎనిమిది వేల గోవులనూ, శ్రీకృష్ణునకు స్వాధీనపరచారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, అంతకుపూర్వం, నరకుడు, అక్కడ, బంధించి ఉంచిన పదారువేలమంది రాజపుత్రికలను చూశాడు. చూసి, వారి పట్ల ప్రసన్నుడై, వారికి విముక్తి కలిగించాడు.

అలా, శ్రీకృష్ణునిద్వారా, విముక్తినందిన రాజకన్యలు, శుభాకారుడూ, మనోహరుడూ అయిన ఆయన్ని, కన్నుల కఱవుదీర దర్శించుకుంటూ...

'పాపపు రక్కసుండు చెఱపట్టె నటంచు దలంతు మెప్పుడుం
బాపుడుకాడు వీని కత బద్మదళాక్షుని గంటిమమ్మ ము
న్నీ పురుషోత్తముం గదియ నేమి వ్రతంబులు సేసినారమో
యా పరమేష్ఠి పుణ్యుడు గదమ్మ హరిన్ మము గూర్చె నిచ్చటన్'

అని, తమ అదృష్టానికి ఎంతగానో మురిసిపోయినారు. అంతేకాదు

'వనజాక్షి నేగన్క వైజయంతిక నైన
గదిసి వ్రేలుదుగదా కంఠమందు
బింబోష్ఠి నేగన్క పీతాంబరము నైన
మెలిసియుండుదుగదా మేనునింద
గన్నియ నేగన్క గౌస్తుభమణినైన
నొప్పచూపుదుగదా యురమునందు
బాలిక నేగన్క పాంచజన్యమ నైన
మొనసి చొక్కుదుగదా మోవిగ్రోలి
పద్మగంధి నేను బర్హదామమనైన
జిత్రరుచుల నుందు శిరమునందు,'
ననుచు బెక్కుగతుల నాడిరి కన్యలు
గములుగట్టి గరుడగమను జూచి.

ఆ విధంగా తనపట్ల ప్రేమ చూపిన రాచకన్నియ లందరినీ, వారి కోరిక మీద, శ్రీకృష్ణుడు, ద్వారావతిలోని తన అంతిపురానికి చేర్చుకోవటం జరిగింది.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, సత్యభామాసమేతుడై, ఇంద్ర లోకానికి వెళ్ళి, భూదేవి ఇచ్చిన కుండలాలను అదితికి సమర్పించుకున్నాడు. ఆ సమయంలో, అదితి, శ్రీకృష్ణుని, సర్వవిజేతగా దీవించింది. కృష్ణుడు భూలోకంలో ఉన్నన్నాళ్ళూ, సత్యభామకు నిత్యయౌవనం నిలిచి ఉండేటట్టు, వరం ప్రసాదించింది. అనంతరం, శచీసమేతుడైన మహేంద్రుడు, శ్రీకృష్ణుని పూజించాడు. ఆపైన, శ్రీకృష్ణుడు, నందనోద్యానంలో ప్రవేశించి, సత్యభామ కోరికమీద, అక్కడ ఉన్న పారిజాతవృక్షాన్ని పెకలించి తీసుకుని, ద్వారావతి చేరుకున్నాడు. ఆ తరువాత, దాన్ని, సత్యభామా ప్రాసాదానికి చేరువలో ఉన్న ఉద్యానవనంలో నాటించాడు. ఆ పారిజాత సుమ

సౌరభాన్ని విడిచి ఉండలేక, అమరావతిలోఉండే తేనెటీగలన్నీ, ఆ ఉద్యానవనంలోనే నివాస మేర్పరచుకోవటం జరిగింది. ఆపైన...

అమిత విహారు డీశ్వరు డనంతుడు దా నొకనాడు మంచి ల
గ్నమున బదారువేల భవనంబులలోన బదారువేల రూ
పముల బదారువేల నృపబాలల బ్రీతి బదారువేల చం
దముల విభూతి నొందుచు యథావిధితో వరియించె 'నాదృతిన్.

*157.* రుక్మిణీ హృదయం :

అలా, పదహారువేలమంది పడుచులను భార్యలుగా స్వీకరించినా, శ్రీకృష్ణుడు, వా రందరిపట్లా, ఒకేఒక విధమైన ప్రేమను ప్రదర్శిస్తూ ఉండే వాడు. అయినా...

'నన్నే పాయడు రాత్రులన్ దినములన్ నన్నే కృపంజెందెడిన్
నన్నే దొడ్డగజూచు వల్లభులలో నాథుండు నాయింటనే
యున్నాడంచు బదారువేలు మదిలో నూహించి 'సేవింతు'రా
యన్నుల్ గాఢ పతివ్రతాత్వ పరిచర్యా భక్తి యోగంబులన్.'

అదేవిధమైన అభిప్రాయం, రుక్మిణీ సత్యభామాదులైన దేవేరులకు కూడా ఉండేది. అందుకనే 'నేను పట్టమహిషిని' అన్న భావం, రుక్మిణీదేవిలో, కిం చిన్మాత్రంగా కూడా ఉండరాదన్న ఉద్దేశంతో, శ్రీకృష్ణు డొకసారి, ఆమె నుద్దేశించి, సవిలాసంగా ఇలా అన్నాడు.

"దేవీ ! నిన్ను చూసినప్పుడల్లా, నాకు అదోవిధమైన విచారం కలుగుతూ ఉంటుంది. నువ్వు, నన్ను కోరిన, శ్రీమంతులూ, రూపవంతులూ, బల పరాక్రమసంపన్నులూ అయిన రాజాధిరాజుల నెందరినో కాదని, నన్ను వరించావు. దానికి ఫలితంగా, నువ్వు, బలవంతులైన రాజులకు భయపడి సముద్రంలో దాక్కున్న మమ్మల్ని సేవించటం జరుగుతోంది. యథార్థానికి, మేము...

లోకుల నడవడిలో నివారము గాము
పరులకు మాజాడ బయలుపడదు
బల మదోపేతులు పగగొం|డు మాతోడ
రాజపీఠములకు రాము తఱుచు
శరణంబుమాకు నీ జలరాశి సతతంబు
నిష్కించనుల మేము నిధులు లేవు
కలవారు చుట్టాలుగారు నిష్కించన
జనబంధులము ముక్త సంగ్రహులము
గూఢవర్తనులము గుణహీనులము భిక్షు
లైనవారి గాని యాశ్రయింప
మిందుముఖులు దగుల రిటువంటి మముబోటి
వారి నేల దగుల వారిజాక్షి !"

శ్రీకృష్ణుడు, ఆ విధంగా అప్రియవచనాలు పలుకటంవల్ల, రుక్మిణీదేవి, అమితంగా వ్యాకులపడ్డది. వేడి నిట్టూర్పులు విడిచింది. కన్నీరు మున్నీరుగా రోదించింది; మూర్ఛపోయింది.

అది చూసిన శ్రీకృష్ణుడు, అమితంగా జాలిపడ్డాడు. ఆమెను ఒళ్ళోకి తీసుకున్నాడు. ఆమె ముంగురులు సవరించాడు. కన్నీటిని తన ఉత్తరీయంతో అద్దాడు. వివిధోపచారాలూ చేశాడు. ఆపైన, ఆమె నుద్దేశించి, మృదు మధురంగా ఇలా అన్నాడు :

"వైదర్భి ! నీకు నా మీద ఉన్న ప్రేమ నాకు తెలియకపోలేదు. నేను, నవ్వుతూ, హాస్యానికి అన్నమాటలకు, నువ్వింతగా బాధపడటం భావ్యం కాదు. నే నలా అన్నప్పుడు, ను వ్వేమంటావో వినాలనీ, నాకు సమాధాన మిచ్చేటప్పుడు, కోపంతో జేవురించిపోయే నీ ముఖాన్ని, ఒణికిపోయే నీ పెదిమలను, బాణాలమాదిరి వచ్చిపడే నీ ఓరచూపులను, ముడివడిపోయే నీ కనుబొమలను, 'చూడాలనీ మాత్రమే, నే నలా అనటం జరిగింది. యథార్థానికి, గృహకృత్యాలలో సతమతమవుతూ ఉండే గృహస్థులకు, తమ

ప్రియురాండ్రతో, ఇలా కొంతకాలం గడపటానికి మించిన ఆనందం, మరొకటి యేముంటుంది? అది గ్రహించి అయినా, నువ్వు, శాంతిని పొందాలనీ, నా మీద కలిగిన కోపాన్ని తొలగించుకోవాలనీ కోరుతున్నాను."

ఆ విధమైన వచనాలతో తాపోప శమనం పొందిన రుక్మిణీదేవి, ఆ తరువాత, తన మనోవల్లభుడైన మాధవుని, ఇలా ప్రస్తుతించింది.

"మాధవా! నువ్వు పురుషోత్తముడవు. విమల తేజోమూర్తివి భక్తవత్సలుడవు.

జ్ఞాన సుఖ బల ఐశ్వర్యాదులు నీ అధీనంలోనివి. నువ్వు, సచ్చిదానందమూర్తివి, సర్వలోకేశ్వరుడవు.

నువ్వు, దివ్యసుందర విగ్రహుడవు. అజ్ఞానాంధకార నివారకమైనది నీ రూపం. నీ పాదారవిందాలు, యోగీంద్రులకుకూడా గోచరం కావు. కాని, నా అదృష్టవశాన, అవి నాకు లభించినై; అర్చనీయ మైనవయినై.

నువ్వు విజ్ఞానప్రదుడవు. దురితదూరుడవు. నీ మాయకు వశులైన మూఢులు, నిర్వాణరూపుడవైన నిన్ను గ్రహించలేక, సంసార చక్రంలో పడి పరిభ్రమిస్తూ ఉంటారు. భార్యాపుత్రాదుల పట్లా, గృహారామ విత్తాదులపట్లా ఆసక్తి పెంచుకుని జీవితాలను వ్యర్థం చేసుకుంటారు. ఖర సూకర మార్జాలాదుల మాదిరి, అజ్ఞానాంధకారంలో పడి, దిక్కుతోచక, అటమటిస్తూ ఉంటారు.

జలజనాభ సకల జగదంతరాత్మవై
నట్టి దేవ నీ పదారవింద
యుగళి సానురాగ యుక్తమై నా మది
గలుగునట్లుగాగ దలపు మనఘ!"

ఆవిధంగా తనహృదయాన్ని నివేదించుకున్న రుక్మిణీదేవిని చూసి, శ్రీకృష్ణుడు, అమితానందం పొందాడు. ఆమె మనస్సును, అంతగా వ్యాకులపరచినందుకు విచారపడ్డాడు. అది కారణంగానే...

'నీవు పతివ్రతామణివి నిర్మల ధర్మ వివేక శీల స
ద్భావవు నీ మనోగతుల బాయక యెప్పుడు నస్మదీయ సం
సేవయకాని యన్యము భజింపవు పుట్టిననాటినుండి నీ
భావ మెఱింగియుండినను బల్కిన తప్పు సహింపు మానినీ'

అని, సామాన్య గృహస్థుని మాదిరిగా, ఆమెను బ్రతిమాలుకున్నాడు; ఆమెకు కొంలది ఊరట కలిగించాడు.

## *158. శ్రీకృష్ణుని సంసారం :*

శ్రీకృష్ణుడు, తన, మిగిలిన పదహారువేల ఏడుగురు భార్యలతోనూ కూడా, ఇదేవిధంగా వ్యవహరిస్తూ ఉండేవాడు. ఆయన, ఎప్పుడూ వారి సముఖాననే ఉండేవాడు. వారి ప్రాసాదాలలో, వారితో క్రీడిస్తూ ఉండేవాడు. వారితో ముచ్చటిస్తూ ఉండేవాడు. అది కారణంగానే, వారిలో ప్రతి ఒక్కరూ, తమపట్లమాత్రమే శ్రీకృష్ణునకు ప్రేమఉన్నదని భావించి, ఆయన హృదయాన్ని ఆవిధంగా చూరగొన గలిగిన తమ అదృష్టాన్ని, తాము, అమితంగా అభినందించుకునేవారు.

అంతేకాదు. ప్రతి ప్రాసాదంలోనూ వందలాదిగా దాసీజనం ఉన్నా, ఆ ఇల్లాండ్రు, శ్రీకృష్ణునకు సంబంధించిన పరిచర్యలన్నీ, తామే స్వయంగా చేసేవారు. ఆయనకు ఆసనాన్ని అమర్చటం, అర్ఘ్య పాద్యాదులు సమర్పించుకోవటం, పూజచేయటం, అన్ని విధాలైన సుగంధద్రవ్యాలతోనూ తాంబూలమివ్వటం, శ్రమాపనోదార్థం చందనాదులు పూయటం, విసరటం, శయ్యాదుల నేర్పరచటం, స్నానం చేయించటం, పంచభక్ష్య పరమాన్నాలతోనూ భోజనంపెట్టటం, పూలమాలలతో ఆయన్ని అలంకరించటం, ఆయన కురులు దువ్వటం, మొదలైనపనులన్నీ, ఆ యా పడుచులే చూసుకునేవారు.

పదహారువేలమందికి పైగాఉన్న శ్రీకృష్ణుని పత్నులకు, ఒక్కొక్కరికి పదిమంది చొప్పున కొడుకులు పుట్టారు. వారందరిలోనూ, రుక్మిణీ

దేవి కుమారుడైన ప్రద్యుమ్నుడూ, జాంబవతి కుమారుడైన సాంబుడూ మాత్రమే ప్రసిద్ధులు.

శ్రీకృష్ణుని కుటుంబంలో, తల్లులే పదహారువేలమందికి పైగా ఉన్నారు. ఆయన కొడుకులూ, మనుమలూ, మునిమనుమలూ కలిసి, కొన్ని కోట్లయినారు. వారికి విద్యాదానం చేయటానికి, మూడుకోట్ల ఎనభై ఎనిమిది లక్షలమంది గురువులను, శ్రీకృష్ణుడు నియమించటం జరిగింది.

రుక్మిణీదేవి సోదరుడైన రుక్మికి, రుక్మవతి అనే కుమార్తె ఉంది. ఆమె ప్రద్యుమ్నుని వరించి వివాహం చేసుకుంది. ఆ రుక్మవతీ ప్రద్యుమ్ను లకు, అనిరుద్ధుడు ఉదయించాడు. అతనికి, రుక్మి, తన మనుమరాలైన రోచన నిచ్చి వివాహం చేశాడు. ఆ రోచనానిరుద్ధులకు, వజ్రుడు జన్మించాడు. యాదవ వినాశనం తరువాత, ఆ వంశంలో మిగిలినవాడు, వజ్రుడు ఒక్కడే.

### *159. నృగమహారాజు :*

పూర్వం, నృగుడనే మహారాజు ఉండేవాడు. ఆయన దానశీలి. గోవులనూ, భూములనూ, రత్న రాసులనూ, గృహాలనూ, కాంచన రజత శయ్యాదులనూ, యెన్నిటినో ఆయన దానం చేశాడు. వాపీ కూప తటాకాది నిర్మాణాలు చేయించాడు. పంచ మహా యజ్ఞాలాచరించాడు.

ఒకసారి, ఆ మహారాజు, కశ్యపుడనే బ్రాహ్మణునకు దానంచేసిన గోవు, తిరిగి వచ్చి, ఆయన మందలో కలసిపోయింది. అది తెలియని ఆ మహారాజు, దానిని తిరిగి మరొక బ్రాహ్మణునకు దానం చేశాడు.

తిరిగి దానం పొందిన బ్రాహ్మణుడు, ఆ గోవును తోలుకుపోతూ ఉండగా, కశ్యపుడు చూశాడు. చూసి, తన గోవును, ఆయన, అపహ రించుకు పోతున్నాడని భావించాడు; ఆయన్ని అమితంగా దూషించాడు.

కశ్యపుని పలుకులు, ఆ బ్రాహ్మణునకు ఆశ్చర్యం కలిగించినై.

అందుకనే, ఆయన, ఆ గోవును, మహారాజు తనకు దానం చేశాడనీ, తా నెవరి గోవునూ అపహరించుకుపోవటం లేదనీ, కశ్యపునకు తెలియ పరచుకున్నాడు. కాని, కశ్యపు డా పలుకులను విశ్వసించలేదు. అది కారణంగానే, అతడు, ఆయనతో కలహించటం జరిగింది.

ఆ కలహం తీవ్రరూపం ధరించింది. చివరకు, వారిద్దరూ, తమ వివాదాన్ని పరిష్కరించవలసిందిగా కోరుతూ, నృగ మహారాజును సమీపించారు; తమ కలహ కారణాన్ని ఆయనకు నివేదించుకున్నారు.

వారి మాటలు విన్న నృగ మహారాజుకు, తన తప్పిద మేమిటో అప్పు డర్థమయింది. అందుకనే, ఆయన, కశ్యపుని ఉద్దేశించి, తను తెలియక చేసిన తప్పిదాన్ని క్షమించవలసిందనీ, అతనికి తొలుదొల్త ఇవ్వబడిన గోవుకు మారుగా, ఒక లక్ష గోవులను స్వీకరించవలసిందనీ, ప్రతిమాలుకున్నాడు. కాని, కశ్యపుడు, అందుకు అంగీకరించలేదు. న్యాయసమ్మతంగా తనదయిన గోవు మాత్రమే తనకు కావాలని కోరాడు; అమిత క్రోధంతో అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

ఆ వెంటనే, నృగమహారాజు, ద్వితీయ పరిగ్రాహి అయిన బ్రాహ్మణుని ఉద్దేశించి, 'స్వామీ ! నా రాజ్యాన్నంతనూ గ్రహించి అయినా, ఈ గోవును కశ్యపునకు ఇవ్వవలసింది; నా దోషానికి నిష్కృతి కలిగించవలసింది' అని, ప్రాధేయపడ్డాడు. కాని, ఆయన ప్రార్థన ఫలప్రదంకాలేదు. ఆ బ్రాహ్మణుడుకూడా. ఆ గోవును, అక్కడే వదలి, వెళ్ళిపోయినాడు. ఆ పాపఫలాన్ని అనుభవించే నిమిత్తమే. నృగమహారాజు అనంతర కాలంలో, ఊసరవెల్లి రూపం ధరించటం, ఒక పాడుపడ్డనూతిలో ప్రవేశించటం, జరిగింది.

ఒకరోజున, యదుకుమారులయిన ప్రద్యుమ్న సాంబ సారణ గదాదులు, ఆ ఊసరవెల్లిని చూశారు. చూసి, కొండమాదిరి ఉన్న దాన్ని యెలాగయినా బయటకుతీయా లనుకున్నారు. తమ బలాన్నంతనూ విని యోగించి, ఎంతగానో ప్రయత్నించారు; కాని, విఫలులే అయినారు.

అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వారి కోరికమీద అక్కడికి వెళ్ళాడు. వెళ్ళి, గడ్డిపరకను మాదిరిగా, దాన్ని, తన ఎడమచేత్తో ఎత్తి, బయటపడేశాడు.

శ్రీకృష్ణుని కరస్పర్శమూలంగా, నృగమహారాజుదైన పాపం, పటాపంచలై పోయింది. ఆ వెంటనే, ఆయన, తన ఊసరవెల్లిరూపాన్ని త్యజించి, నిజరూపంలో, శ్రీకృష్ణునకు, సాష్టాంగ ప్రణామం చేశాడు. ఆయన్ని, అమితంగా ప్రస్తుతించాడు ఆపైన, 'తండ్రీ ! నీ పాదారవిందాలను సర్వవేళలా అర్చించుకుంటూ ఉండే భక్తిని నాకు ప్రసాదించవలసింది' అని, ఆయన్ని ప్రార్థించాడు. ఆపైన, ఆయన అనుగ్రహాన్ని పొంది, అక్కడికి వచ్చిన ఒక దివ్య విమాన మెక్కి, తన పూర్వ పుణ్య ఫలాన్ని అనుభవించే నిమిత్తం, దేవలోకానికి వెళ్ళిపోయినాడు.

## *160.* ఘంటాకర్ణుడు :

ప్రద్యుమ్న జననానంతరం, శ్రీకృష్ణుడు, ఒకసారి, తన పూర్వ తపస్థానమైన బదరీ వనానికి వెళ్ళటం సంభవించింది. అలా వెళ్ళిన ఆ మహానుభావుని సందర్శించుకునే నిమిత్తం, భరద్వాజ వాల్మీకి వ్యాస గౌతమ కశ్యప కణ్వ పులహ రైభ్య పరాశరాది మును లెందరో అక్కడ సమావేశమయినారు. శ్రీకృష్ణుడు, ఆ రోజంతా వారితో గడిపాడు.

ఆ తరువాత, వా రందరూ విశ్రాంతి తీసుకుంటున్న సమయంలో, అర్ధరాత్రి సమయాన, శ్రీకృష్ణుడు, వనాంతరంలో ప్రవేశించాడు. గంగకు ఉత్తరంగా వెళ్ళి, అక్కడ, కొంతసేపు, సమాధిస్థితుడై కూర్చున్నాడు; తిరిగి, వన సందర్శనకు బయలుదేరాడు.

ఆ సమయంలో ఆయనకు, కొన్ని మృగాల కలకలం వినిపించింది. అవన్నీ, 'జై జయ గోపాల ! హరే ! జై జయ గోవింద ! హరే !' అని అరుస్తున్నై. అంతలో, బాణాలు గుచ్చుకున్న పులులూ దుప్పులూ అడవిపందులూ, అటుగా పరుగు పరుగున పోతూఉండటం ఆయనకు కని

వించింది. ఆపైన, ఆయన, వాటిని తరుముకుంటూ వస్తున్న చాపహస్తులను, వికృతాకారులను, పిశాచ రూపులను, కొందరిని చూశాడు. వారుకూడా, హరినామ సంకీర్తన చేస్తూ ఉండటం, ఆయనకు, ఆశ్చర్యం కలిగించింది.

అంతలో, పిశాచ నాయకుడయిన ఘంటాకర్ణుడు, శ్రీకృష్ణుని సమీపించాడు. శ్రీకృష్ణుడు, అతణ్ణి ఉద్దేశించి, 'మీ రెవరు? ఎక్కడి కిలా వెడుతున్నారు?' అని ప్రశ్నించాడు. ఆయనకు సమాధానంగా, ఘంటాకర్ణుడు, తమ వృత్తాంతమంతా తెలియబరచుకున్నాడు మే మిప్పుడు, మాధవుని సందర్శించుకునే నిమిత్తం, మధురా నగరానికి వెడుతున్నాము' అని కూడా నివేదించుకున్నాడు. అంతేకాదు; 'మహానుభావా! నువ్వు ఎవరివో అయితే నాకు తెలియదు. కాని, నీ రూపం, నీ తేజం, నన్ను ఆకర్షించుకున్నై. దయఉంచి నా ఆతిథ్యాన్ని స్వీకరించ వలసింది,' అని కూడా విన్నవించుకున్నాడు. అలా విన్నవించుకుంటూనే, ఒక బాణానికి గుచ్చి ఉన్న మాంస ఖండాన్ని, ఆయనకు అందించాడు.

శ్రీకృష్ణుడు, దాన్ని స్వీకరిస్తూ, 'నువ్వు కూడా హింసావృత్తి నవలంబిస్తున్నావా? అన్నట్టు, ఘంటాకర్ణునివంక చూశాడు. అది గ్రహించిన ఘంటాకర్ణుడు, ఆయన కిలా నివేదించుకున్నాడు.

"స్వామీ! ఏదో పాతకంద్వారా, మా కీ జన్మ లభించింది. ఈ జన్మనుంచి తొలగిపోవాలనే మేము కోరుతున్నాము. దానికి సంబంధించిన సాధనలన్నీ చేస్తూనే ఉన్నాము.

ఇప్పుడు మేము సలిపే మృగయావిహారం కూడా, విష్ణు పూజా విధి ననుసరించే జరుగుతోంది. మేము, మా మనసులో, మాధవుని నిలుపుకున్నాము. మాధవుని నివాసమైన మధురానగరాన్ని, సర్వవేళలా, స్మరించుకుంటూ ఉన్నాము. మాధవుని, బహువిధాల భూషిస్తున్నాము; ఆయన దర్శనార్థమే ఇప్పుడు ప్రయాణిస్తున్నాము.

వేదాధ్యయనం చేసినంతమాత్రాన, తర్కమీమాంసాది శాస్త్రా

లలో ప్రావీణ్యత పొందినంత మాత్రాన, మునివృత్తి నవలంబించినంత మాత్రాన, యజ్ఞ యాగాదులు నిర్వహించినంతమాత్రాన, దర్శనీయుడుకాని ఆ మాధవుడు, భక్తసులభుడని మాకు తెలుసు. అందుకనే, మే మాయన్ని, భక్తిమార్గాన చేరుకోదలచాము; సాక్షాత్కరింపజేసుకోదలచాము. ఇలా జీవిస్తూ ఉన్న మేము, మా జన్మకు అనుగుణమైన వృత్తిని అవలంబిస్తూ ఉన్నా, దోషం కాదనుకుంటాను."

ఆ మాటలు విన్న శ్రీకృష్ణుడు, విస్మితుడయినాడు. అంతలో, ఘంటాకర్ణునకు, అతడు అనుదినం ప్రార్థన చేసుకునే సమయమయింది. ఆ వెంటనే, అతడు, అక్కడే కూర్చున్నాడు. శ్రీహరిని, ప్రార్థించసాగాడు. తన పిశాచజన్మను తొలగించవలసిందనీ, తన్ను భక్తునిగా స్వీకరించవలసిందనీ, శ్రీహరినివేడుకున్నాడు; అలాగే సమాధిస్థితుడయినాడు.

శ్రీకృష్ణుడు, అది గ్రహించాడు. అమితంగా సంతోషించాడు. అది కారణంగానే, అతణ్ణి అనుగ్రహించే ఉద్దేశంతో, అతని హృదయంలో ప్రవేశించి, తనదయిన దివ్యరూపంలో అతనికి దర్శన మిచ్చాడు.

ఆ విధంగా శ్రీ మహావిష్ణువును సందర్శించుకుని, పరమానందం పొందిన ఘంటాకర్ణుడు, కొంతసేపటికి కళ్ళు తెరిచాడు. తన చిత్తాబ్జంలో వీక్షించుకున్న దివ్యరూపాన్ని, తన సముఖాన ఉన్న శ్రీకృష్ణునిలో దర్శించుకున్నాడు. అమితానందంతో ఆయన్ని స్తుతించాడు. తన్ను అనుగ్రహించవలసిందిగా ప్రార్థించాడు.

ఆపైన, శ్రీకృష్ణుడు, అతని శరీరాన్ని స్పృశించాడు. అది కారణంగా, అతనికి దివ్యదేహం లభించింది. అతనికోరికమీద, శ్రీకృష్ణుడు, అతనికి, నితాంత భక్తిని ప్రసాదించటం జరిగింది.

### *161. పౌండ్రక వాసుదేవుడు:*

కరూశదేశాధిపతి అయిన పౌండ్రకుడు, ఒట్టి గర్విష్ఠి. అతని సహచరులైన కొందరు మూఢులు, అతణ్ణి సంతోషపరచే ఉద్దేశంతో,

'నువ్వు వాసుదేవుడవు. ప్రపంచాన్ని ఉద్ధరించటానికే నువ్వు అవతరించావు' అని, పదేపదే పొగడటం మొదలుపెట్టారు.

వారి పలుకులు విన్న పౌండ్రకుడు, యథార్థానికి తనే వాసుదేవుడైనట్టు భావించాడు. అది కారణంగానే, అతడొకసారి, ఒక దూతను పిలిచి, ఇలా ఆదేశించాడు.

"నేను విశ్వేశ్వరుణ్ణి. ప్రపంచాన్ని రక్షించే ఉద్దేశంతోనే నేను అవతరించాను. అందుకనే, నన్ను, అందరూ, వాసుదేవుడని పేర్కొనటం జరుగుతోంది.

కాని, వ్రేపల్లెలో పుట్టి పెరిగిన ఒక యాదవుడు, నా పేరునూ, నా చిహ్నాలనూ ధరించి తిరుగుతున్నట్టు తెలియవస్తోంది. అది, అతనికి శ్రేయస్కరం కాకపోగా, నాకు అవమానకరంగాకూడా ఉంది. అతడు, ఇప్పుడైనా, తన తప్పును తెలుసుకోవటం, నా పేరునూ శంఖచక్రాదులైన నా చిహ్నాలనూ త్యజించటం, నన్నాశ్రయించటం సమంజసం. అతడు అలా చేసిన పక్షంలో, నేను, అతణ్ణి క్షమించటానికి సిద్ధంగా ఉన్నాను. అలా కాదని, అతడు, పంతానికి దిగటమే జరిగితే, నే నతనితో యుద్ధం చేయటం, అందులో అతణ్ణి వధించటం, తథ్యం. ఇది నా నిశ్చితాభిప్రాయం. నువ్వు అతణ్ణి కలుసుకుని, నా మాటలుగా, అతనికి, యీ విషయమంతా చెప్పవలసింది."

తన ప్రభుడైన పౌండ్రకుని ఆదేశాన్ని శిరసావహించి, ఆ దూత, ద్వారావతి చేరుకున్నాడు. నందాదులైన యాదవ ప్రముఖులతో కొలువుదీరి ఉన్న శ్రీకృష్ణుని సమీపించాడు. ఉచితానుచితాలను కూడా పాటించకుండా, అందరి సముఖానా, తన విభుని సందేశాన్ని, ఆయనకు అందచేశాడు.

పౌండ్రకుని గర్వోక్తులువిన్న శ్రీకృష్ణుడు, ఆ దూత నుద్దేశించి...

'వినరా మీ నృపు డన్న చిహ్నములు నే వే వచ్చి ఘోరాజిలో
దనమీదన్ వెసవైవ గంకముఖ గృధ్ర వ్రాతముల్ మూగగా

ననిలో దర్పముదూలి కూలి వికలంబై సారమేయాలికి
న్న నయంబున్ శరణంబవయ్యెదను మే నన్నట్లుగా వానితోన్'

అని, అత్యుద్రేకంతో అన్నాడు.

ఆ వెంటనే, ఆ దూత, శ్రీకృష్ణునివద్ద సెలవు తీసుకుని, తిరిగి వెళ్ళి, పౌండ్రకుని కలుసుకున్నాడు; అతనికి, ఆ ప్రతిసందేశాన్ని అంద చేశాడు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, వివిధాయుధాలనూ ధరించి, తన అద్భుత స్యందనాన్ని అధిరోహించి, రణోత్సాహంతో, కాశికానగరం చేరు కున్నాడు. శ్రీకృష్ణుడలా రావటం గ్రహించిన పౌండ్రకుడు, రెండక్షౌహిణుల బలంతో, శ్రీకృష్ణుని మీదికి వెళ్ళాడు. ఆ సమయంలో అతని మిత్రుడైన కాశీరాజు, తన మూడక్షౌహిణుల బలంతోనూ, అతనికి అండగా నిలబడటం జరిగింది.

ఆ విధంగా, ఐ దక్షౌహిణుల బలంతోనూ, కృత్రిమాలైన శంఖ చక్ర గదా ఖడ్గ శార్ఙ్గాదులతోనూ, శ్రీవత్సంతోనూ, కౌస్తుభమణితోనూ వనమాలికలతోనూ, గరుడధ్వజ మెత్తిన రథంమీద, తనమీదికి వస్తున్న పీతాంబరధారిని, శ్రీకృష్ణుడు చూశాడు. చూసి. పకపకలాడాడు.

అంతలో, పౌండ్రకుడు, శ్రీకృష్ణుని మీద, వివిధాయుధాలను ప్రయోగించటం జరిగింది. అది గ్రహించిన శ్రీకృష్ణుడు ఉగ్రుడైనాడు. ఆ వెంటనే, ఆయన, పాంచజన్యాన్ని పూరించాడు. దివ్యాస్త్రాలను సంధించి వదిలాడు. పౌండ్రకుని సేన నంతనూ కలవరపరచాడు. రణరంగాన్ని రుధిరవాహిని చేశాడు. ఆ తరువాత, అతణ్ణి ఉద్దేశించి...

'మనుజేంద్రాధమ పౌండ్రభూపసుత నీ మానంబు బీరంబు నే
దనిలో మాపుదు నెద్దు క్రొవ్వి పెలుచ న్నాబోతుపై అంకె వై
చిన చందంబున దూతచేత నను నాక్షేపించి వల్దన్న పే
రును జిహ్నంబులు నీపయిన్ విడుతు నర్చుల్ పర్వ నే డాజిలోన్'

అని, భీకరంగా గర్జించాడు. గర్జిస్తూనే, తీవ్రమైన బాణాలను అతని మీద వదిలాడు.

అలా విడువబడిన బాణాలు, పౌండ్రకుని కేతనాన్ని కూల్చినై. రథాన్ని నుగ్గునుగ్గు చేసినై. కాశీపతిని సంహరించినై. ఆ తరువాత ఆయన ప్రయోగించిన చక్రాయుధం, నిర్వక్రపరాక్రమంతో వెళ్ళి, పౌండ్రకుని తలను నరికేసింది.

శ్రీకృష్ణునితో విరోధించిన పౌండ్రక వాసుదేవుడు, ఆ విధంగా కూలిపోయినాడు. అయినా, అతనికి, ముక్తి లభించింది. మాత్సర్యంతో అయినా, అతడు, వాసుదేవుని చిహ్నాలను ధరించి, అనవరతం, తనే ఆయనగా భావించుకుంటూ ఉండటమే దానికి మూలం.

## *162.* సుదర్శనం :

పౌండ్రక వాసుదేవుని కుమారుడైన సుదక్షిణుడు, తన తండ్రిని సంహరించిన శ్రీకృష్ణునిపై పగసాధించే నిమిత్తం, మహేశ్వరుని ఆరాధించాడు. ఆయన్ని ప్రసన్నుని చేసుకున్నాడు. అపైన, ఆయన సూచన మీద, అగ్నిదేవుని ఉపాసించి, భీకర రౌద్రాకారిణి అయిన ఒక కృత్యను కల్పించి, దాన్ని, ద్వారకాపురం మీదికి పంపాడు.

అలా ప్రయోగింపబడిన కృత్యను చూసి, అచటివారు, భయంతో కంపించిపోయినారు. అది కారణంగానే, వారు, దీనులై శ్రీకృష్ణుని సమీపించారు.

సర్వరక్షకుడైన శ్రీకృష్ణుడు, ప్రాణభీతితో తన్ను ఆశ్రయించిన తనవారికి అభయమిచ్చాడు. దవానలం మాదిరి తన దిక్కుగా వస్తున్న కృత్యను నిగ్రహించే నిమిత్తం, ఆ వెంటనే, తన చక్రాయుధాన్ని వదిలాడు.

ఆ చక్రాయుధం, అనంతతేజంతో, రోదసీకుహరాన్నంతనీ వెలిగిస్తూ, విస్ఫులింగాలను విరజిమ్ముకుంటూ వెళ్ళి, కృత్యతో తలపడ్డది. దాని

శక్తిని క్షీణింపజేసింది. ఆ విధంగా, చక్రాయుధంద్వారా నిగ్రహింపబడిన కృత్య, ఆపైన, వారణాసికి పోయి, తన్ను సృజించిన సుదక్షిణునీ, అతని పురోహితులనూ, మ్రింగివేసింది. దాన్ని తరుముకుంటూ వెళ్ళిన సుదర్శనం కూడా, కాశీనగరంలో ప్రవేశించి, ఆ నగరాన్ని అంతనూ భస్మం చేసింది; తిరిగి ద్వారావతి చేరుకుని, శ్రీకృష్ణుని ఆశ్రయించింది.

## 163. సాంసారిక జీవితం :

శ్రీకృష్ణుడు, నరకాసురుని సంహరించి, అతడు చెరపట్టి ఉంచిన పదహారువేలమంది రాజకన్యలనూ విడిపించి, వారినందరినీ వివాహం చేసుకున్నాడని విన్న నారదమహర్షి, ఒకసారి, ఆయన విభవం చూసే ఉద్దేశంతో, ద్వారావతికి వెళ్ళాడు. వెళ్ళి, శ్రీకృష్ణుని పట్టమహిషి అయిన రుక్మిణీదేవి మందిరం చేరుకున్నాడు.

ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, అక్కడ, రుక్మిణీదేవి సేవ లందుకుంటున్నాడు. అయినా, నారదుని ఆగమనవార్త తెలియగానే, ఆయన, ఆమెతోసహా బయటకువచ్చాడు. వచ్చి, మహర్షికి స్వాగతంచెప్పాడు. ఆయనను లోపలకు తీసుకువెళ్ళాడు. విధ్యుక్తంగా ఆయనకు అర్ఘ్య పాద్యాదులు సమర్పించుకున్నాడు. తనదైన ఆసనంమీద, ఆయన్ని ఉపవిష్టుని చేశాడు. ఆయన పాదాలను కడిగాడు. ఆ పాద తీర్థం తన శిరస్సున చల్లుకున్నాడు; రుక్మిణీదేవి శిరాన చల్లాడు. అనంతరం, ఆ మహర్షి నుద్దేశించి, 'స్వామీ ! ఈ దాసుడు, మీకు చేయగల సేవ యేదైనా ఉంటే, సెలవివ్వవలసింది' అన్నాడు.

ఆ పలుకులు విన్న నారదుడు, ఆయనదైన భక్తవాత్సల్యాన్ని ప్రశంసించాడు. ఆయన మాహాత్మ్యాన్ని స్తుతించాడు. ఆపైన, 'మహానుభావా! సంసార సముద్రాన్ని తరింపజేసే మహా నౌకను, నీ పాదద్వయాన్ని, నేను సర్వదా ఆశ్రయించి ఉండేటట్టు అనుగ్రహించవలసింది' అని ప్రార్థించాడు. ఆయన అనుగ్రహాన్ని పొంది, ఆయనవద్ద సెలవు తీసుకుని, అక్కడి నుంచి వెళ్ళిపోయినాడు

ఆ తరువాత, ఆ మహానుభావుని యోగమాయా ప్రభావాన్ని దర్శించుకునే ఉద్దేశంతో, ఆ మహర్షి, శ్రీకృష్ణునిదైన మరొక మందిరంలో ప్రవేశించాడు. అక్కడ సత్యభామతోనూ ఉద్ధవునితోనూ పాచికలాడుతూ ఉన్న శ్రీకృష్ణుడు ఆయనకు కనిపించాడు.

అక్కడ కూడా, ఆయనకు, సర్వవిధ పూజలూ జరిగినై. శ్రీకృష్ణుడు, ఆయిన్ని కలుసుకుని ఎంతో కాలమైనట్టుగా, ఆప్యాయతతో పలుకరించాడు. 'పరమ భాగవతోత్తములైన మీ రాకతో మా భవనం పవిత్రమయింది. మమ్మల్ని ఆశీర్వదించి, మా జీవితాలకు ధన్యత్వం చేకూర్చ వలసింది' అని నివేదించుకున్నాడు; ప్రార్థించాడు.

శ్రీకృష్ణుని పలుకులు, నారదునకు అమితాశ్చర్యం కలిగించినై. ఆ వెంటనే, ఆయన, మందహాసంచేస్తూ, శ్రీకృష్ణునకు నమస్కరించి, ఆయనవద్ద సెలవు తీసుకుని, మాట్లాడకుండా బయటకు వెళ్ళాడు; మరో మందిరంలో ప్రవేశించాడు.

అక్కడ, నారదునకు, తన చిన్నారి బిడ్డలను ఎత్తుకుని ఆడిస్తూ ఉన్న కృష్ణయ్య కనిపించాడు. అలాగే, మరొక మందిరంలో, స్నానానికి సిద్ధమవుతూఉన్న నల్లనయ్య దర్శన మివ్వటం జరిగింది.

అలాఒకేఒకసమయంలో, వివిన్నరూపాలతో, అనేక మందిరాలలో వివిధ క్రీడలు సలుపుతూ ఉండటం మహాద్భుతంగా భావిస్తూ, నారద మహర్షి, ఆ తరువాత, ఎన్నో మందిరాలు సందర్శించుకున్నాడు. అన్ని మందరాలలోనూ కూడా ఆయనకు, శ్రీకృష్ణ దర్శన మయింది. కాని, ఏ మందిరంలో ఆయన్ని కలుసుకున్నా, ఆయన, ఆ మహర్షిని అప్పుడే దర్శించినట్టుగా పలుకరించేవాడు. ప్రవర్తించేవాడు. పూజాదికాలు సలిపే వాడు. తన్ను ఆశీర్వదించవలసిందిగా ప్రార్థించేవాడు.

ఆ మహానుభావుడు, ఒకచోట, అగ్ని కార్యం జరుపుతూ ఉండే వాడు. ఒకచోట, నిత్య కర్మానుష్టానంలో ఉండేవాడు. ఒకచోట, బ్రహ్మ

విదులకు సంతర్పణ చేస్తూ ఉండేవాడు. ఒకచోట, వారి ఉచ్ఛిష్టాన్ని భుజిస్తూ ఉండేవాడు,

అలాగే, ఏకకాలంలో, విభిన్నరూపాలలో, వివిధస్థలాలలో, సంధ్యా వందనంసలుపుతూ, గాయత్రీజపంచేసుకుంటూ, కవచంధరించి తనకున్నఖడ్గ ప్రయోగపాటవాన్ని ప్రదర్శిస్తూ,రథగజాశ్వాదులనారోహించిచరిస్తూ,విశ్రాంతి తీసుకుంటూ, వంది మాగధుల స్తోత్రపాఠాలువింటూ, ఉద్ధవుడు మొదలైన వారితో సంప్రదింపులు జరుపుతూ, జలక్రీడ సలుపుతూ, గోవులను దాన మిస్తూ, ప్రముఖ పురాణేతి హాసాలను శ్రద్ధతో వింటూ, దేవేరులతో సరస సల్లాపాలాడుతూ, విధ్యుక్త కర్మలను నిర్వహిస్తూ, అర్థ సంగ్ర హానికి సంబంధించిన ఆలోచనలుచేస్తూ, గృహస్థాశ్రమ ధర్మాలను పాటిస్తూ, యుద్ధ ప్రయత్నాలుచేస్తూ, సంధిచర్చలుజరుపుతూ, బలరామునితో, సాధు సంరక్షణకు సంబంధించిన విషయాలు చర్చిస్తూ, పిల్లల పెళ్ళిళ్ళు జరుపుతూ, క్రొత్తగా పెళ్ళి అయిన కుమార్తెలను అత్తవారి యిళ్ళకుపంపుతూ, అప్పుడే వచ్చిన కూతుళ్ళనూ అల్లుళ్ళనూ పలుకరిస్తూ, యజ్ఞయాగాదులు జరుపుతూ, దేవాలయాదులు నిర్మిస్తూ, దర్శనమిస్తూవచ్చిన ఆ శ్రీకృష్ణభగవానుని యోగ మాయా ప్రభావాన్ని ప్రత్యక్షంగా వీక్షించి, నారదమహర్షి అంతులేని ఆనందాన్ననుభవించాడు

అది కారణంగానే, ఆయన, శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'దేవా ! నీ పరిచర్యామహిమమూలంగా, యోగమాయా విలాసాన్ని, నే డీ విధంగా దర్శించగలిగాను; ధన్యుడనైనాను. ఇక నీ లీలా విశేషాలను కీర్తిస్తూ, ముల్లోకాలలోనూ సంచరిస్తూ ఉండటానికి, నాకు అనుజ్ఞ నీయవలసింది' అని విన్నవించుకున్నాడు; ఆయనవద్ద సెలవుతీసుకుని వెళ్ళిపోయినాడు.

## *164.* దినచర్య :

శ్రీకృష్ణుడు, బ్రహ్మముహూర్తంలో నిద్ర లేచేవాడు. ఆ వెంటనే, కాళ్ళూ చేతులూ ముఖం కడుక్కొని, ప్రశాంత చిత్తంతో, పరమాత్ముని

ధ్యానించుకునేవాడు. ఆ తరువాత, స్నానంచేసి, శుభ్రవస్త్రాలు ధరించి, సంధ్యావందనాది కర్మానుష్టానం జరిపేవాడు. అనంతరం, గాయత్రీ మంత్ర జపం సలిపేవాడు. సూర్యునకూ పితరులకూ మహర్షులకూ అర్ఘ్య మర్పించు కునేవాడు. ఆ పైన, తన కుటుంబంలోని పెద్దలనూ, బ్రహ్మ విదులనూ యథావిధిగా అర్చించి, దాన ధర్మా లాచరించేవాడు. గోవులకూ విప్రులకూ దేవతలకూ, గురువులకూ, నమస్కరించేవాడు ఆ తరువాత, తాను, స్వయంగా శృంగారించుకునేవాడు. నేతిలోనూ అద్దంలోనూ ముఖం చూసు కునేవాడు. అనంతరం, తన్ను ఆశ్రయించినవా రందరినీ అనుగ్రహించే వాడు

ఆ విధమైన కార్యక్రమం పూర్తి అయే సమయానికి, దారు కుడు, దివ్య రథాన్ని తెచ్చి సిద్ధంగా ఉంచేవాడు. ఆ రథ మెక్కి, సాత్యకి తోనూ ఉద్ధవునితోనూ బయలుదేరి, సభాభవనానికి వెళ్ళేవాడు.

అలా, సుధర్మ అనే సభాభవనంలో ప్రవేశించి, సింహాసనాన్నధి ష్ఠించేవాడు. అప్పుడు, యదువీరు లందరూ ఆయన సముఖాన, ఉపవిష్టులై ఉండేవారు.

అక్కడ, హాస్యగాండ్రు, ఆయననూ సభాసదులనూ పలువిధాల ఆనందపరచేవారు. నాట్యగత్తెలు, సభారంజకంగా నటించేవారు. సూతులూ మాగధులూ వందులూ, వివిధ వాద్య విశేషాల సహాయంతో, ఆడి పాడి సభాస్తారులకు సంతోషం కలిగించేవారు. ఆ తరువాత కొందరు బ్రాహ్మ ణులు, వేదపఠనం జరిపేవారు. మరి కొందరు, పూర్వరాజుల దివ్యచరిత్ర లను వినిపించేవారు; శ్రీకృష్ణునకూ సభాస్తారులకూ మహదానందం కలి గించేవారు.

## 165. రాజసూయ ప్రసక్తి :

అలా, మహదానంద దాయకంగా ఉండే ఆ సభాస్థలికి, ఒక రోజున, ఒక భూసురుడు వచ్చాడు. వచ్చి, శ్రీకృష్ణుని, సభక్తికంగా స్తుతిం

చాడు. ఆ తరువాత, ఆయన్ని ఉద్దేశించి, 'తండ్రీ! జరాసంధుడు, తన్ను ధిక్కరించిన ఇరువదివేల ఎనిమిదివందలమంది రాజులను, గిరివ్రజమనే చోట చెరబెట్టాడు. ఆ రాజులు, సర్వశరణ్యుడవయిన నిన్నే ఆశ్రయించి, తమ బాధలను తొలగించవలసిందిగా నిన్ను వేడుకుంటున్నారు. ఆ అనన్య శరణ్యుల పలుకులు నీకు మనవి చేసుకునే నిమిత్తమే, నే నిలా వచ్చాను' అని, వినయపూర్వకంగా నివేదించుకున్నాడు.

అది విన్న శ్రీకృష్ణుడు, ఒక క్షణకాలం, ఏదో ఆలోచింప సాగాడు. అంతలో, త్రిలోక సంచారి అయిన నారద మహర్షి, అక్కడికి, రావటం జరిగింది.

అలా వచ్చిన నారద మహర్షిని విధ్యుక్తంగా పూజించి, శ్రీకృష్ణుడు, యిలా అన్నాడు :

మహర్షీ! మీరు త్రిలోకసంచారులు. ముల్లోకాలలోనూ, మీకు తెలియని విషయమంటూ ఉండదు అందుకనే, పాండవుల యోగక్షేమాలను గురించి, మీ ద్వారా వినగోరుతున్నాను.'

అది విన్న నారదుడు, ముందుగా, పాండుపుత్రుల క్షేమాన్ని తెలియపరచాడు ఆ తరువాత, ధర్మరాజు, రాజసూయాధ్వరం నిర్వహింప దలచాడనీ, యజ్ఞ రక్షకుడూ యజ్ఞ భోక్తా అయిన శ్రీకృష్ణుడు, మేనబావ అయిన, ఆయనకు, సర్వవిధాలా సాయపడటం సముంజసమనీ, విన్నవించు కున్నాడు. ఆ సందర్భంలోనే...

"కృష్ణా! నువ్వు పరమ పురుషుడవు. భక్తవత్సలుడవు. నిన్ను సేవించినవారికీ, నీ నామాన్ని ఉచ్చరించినవారికీ, నిన్ను దర్శించిన వారికీ, ఇహ పర సుఖాలు లభించి తీరుతై.

అది కారణంగానే, నువ్వా మఖసమయంలో అక్కడ ఉండా లనీ, అక్కడికి వచ్చే రాజులకూ మహర్షులకూ నీ దర్శన భాగ్యాన్ని లభింప జేయాలనీ, కోరుతున్నాను"

అని కూడా విన్నవించుకున్నాడు. అది విన్న శ్రీకృష్ణుడు, ఉద్ధవుని

ఉద్దేశించి, 'మిత్రమా! ఇప్పుడు మా కర్తవ్య మేమిటో తెలుప వలసింది' అని కోరాడు.

అలా శ్రీకృష్ణుడు కోరినమీదట, ఉద్ధవుడు ఇలా సూచించాడు :

"కృష్ణా! దిగ్విజయం చేసినవారు మాత్రమే, రాజసూయ నిర్వహణకు అర్హులవుతారు. ధర్మజుని, దిగ్విజయానికి, జరాసంధుని నిగ్రహించటం అవసరం.

మహానుభావా! నువ్వు కాలస్వరూపుడవు. ప్రపంచసృష్టికీ లయానికీ కూడా, నీదయిన ప్రభావమే ఆధారంగా ఉంటుంది. ఆ యా సందర్భాలలో, చతుర్ముఖుడూ శంకరుడూ కూడా, నిమిత్త మాత్రులుగా వ్యవహరిస్తూ ఉంటారు. అది గ్రహించటంవల్లనే, జరాసంధునివల్ల బంధింపబడిన వారి పుణ్యమూ, జరాసంధుని పాపమూ, పండిఫలించటానికి, ను వ్వీ పనికి పూనుకోవాలనీ, ఒకే ఒక పనితో, రెండు లక్ష్యాలను నువ్వు సాధించాలనీ, నేను కోరుతున్నాను."

ఉద్ధవుని అభిప్రాయం గ్రహించిన శ్రీకృష్ణుడు, నారదుని సూచనకు తన అంగీకారం తెలియపరిచాడు. భూసురుని ఉద్దేశించి, మీ సందేశం త్వరలోనే ఫల ప్రద మౌతుంద' అని తెలియపరచాడు. ఆయనకూ నారదునకూ సెలవిచ్చి పంపాడు.

ఆ తరువాత, ఒక సుముహూర్తం చూసుకుని, శ్రీకృష్ణుడు, తన దేవేరులతోనూ, పుత్ర మిత్రాదులతోనూ, పరివారంతోనూ బయలుదేరి, ఇంద్రప్రస్థం చేరుకున్నాడు.

ఆ విధంగా తన నగరికి విచ్చేసిన యాదవ శ్రేష్ఠునకు, ధర్మరాజాదులు, పురోపకంఠం వద్దనే స్వాగతం చెప్పారు. ఆయన్నీ, ఆయనతో వచ్చిన పెద్దలనూ అర్చించారు. మంగళ తూర్యనాదాలతో, వారందరినీ, పురంలో ప్రవేశింపచేశారు.

నగరంలో ప్రవేశించగానే, శ్రీకృష్ణుడు, తన మేనత్త అయిన

కుంతీదేవి వద్దకు వెళ్ళాడు. ఆమెకు ప్రణామం చేశాడు. ఆమె క్షేమాన్ని విచారించాడు.

అనంతరం, ద్రౌపదీ సుభద్రలు ఆయన్ని దర్శించుకున్నారు. ఆయన ఆశీర్వాదాన్ని పొందారు.

ఆ తరువాత, పాంచాలి, కుంతీదేవి సూచనమీద, శ్రీకృష్ణుని దేవేరులందరినీ, విధ్యుక్తంగా పూజించింది; అమూల్యములైన కానిక లెన్నింటినో వారికి సమర్పించుకుంది.

శ్రీకృష్ణుడు, ఆ మీద, తన ప్రాణస్నేహితుడైన అర్జునునితో, అతని మందిరానికి వెళ్ళాడు; ఆ రోజంతా అక్కడే గడిపాడు

ఆ మరునాడు, ధర్మరాజు, యాదవ ప్రముఖులందరితోనూ తన కొలువుకూటంలో ప్రవేశించి, శ్రీకృష్ణుడు ప్రసన్నుడై ఉన్న సమయం కనిపెట్టి...

'కృష్ణా ! నాకు, రాజసూయం చేయాలన్న అభిలాష కలిగింది. దాన్ని సక్రమంగా నిర్వహింపగలవారు, నా బంధువర్గంలో, నువ్వు తప్ప మరొకరు లేరు. అదీకాక...

ఎవ్వరు నీ పదాంబుజము లెప్పుడు గొల్తురు భక్తినిష్ఠులై
యెవ్వరు నిన్ను బ్రేమ నుతియింతురు భూరి వివేకశాలులై
య వ్విమలాత్ము లందుదు రుదంచిత శోభన నిత్యసౌఖ్యముల్
నివ్వటిలంగ గృష్ణ నిను నేర్చి భజించిన రిత్తవోవునే !'

అని కూడా విన్నవించుకున్నాడు.

ధర్మజునకు తనపట్ల ఉన్న అభిమానాన్ని గ్రహించి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు అది కారణంగానే...

'నయగుణశాలి పాండునృపనందన నీ తల పొప్పు నీ క్రతు
క్రియ ముని దేవతా పితృసుకృత్యమునై నిఖిలోగ్ర శాత్రవ
క్షయమును బాంధవప్రియము సంచిత పుణ్యము నిత్యకీర్తియున్
జయము నొసంగు దీని గురుసత్తమ వేగ యుపక్రమింపవే !'

అని, ఆయన్ని, అభినందన పూర్వకంగా ప్రోత్సహించాడు. అంతే కాదు. అనుపమ దివ్యాస్త్రవేదులైన ఆయన అనుజులను, దిగ్విజయార్థం, నాలుగు దిక్కులకూ వెంటనే పంపవలసిందని కూడా ఆదేశించాడు.

## 166. జరాసంధుడు :

శ్రీకృష్ణుని పలుకులువిన్న ధర్మజునకు, తన రాజసూయాధ్వరం నిర్విఘ్నంగా నెరవేరి తీరుతుందన్న ధైర్యం కలిగింది. ఆ ధైర్యంతోనే, ఆయన, సహదేవుని, సృంజయవీరులతో దక్షిణదిశకూ, నకులుని, మత్స్యులతో పడమటి దిశకూ, అర్జునుని, కేకయులతో ఉత్తర దిక్కుకూ, భీముని, మద్రులతో తూర్పు దిక్కుకూ పంపించాడు. శ్రీకృష్ణుడు, వారందరిలోనూ తన దివ్య తేజాన్ని ప్రసరింపజేసి, వారిని, అజేయులను చేశాడు.

ఆ విధమైన శక్తితో బయలుదేరిన భీమ నకుల సహదేవులు, ఆ యా దిక్కులలో ఉన్న రాజు లందరినీ జయించి, వారి నుంచి, అనేక రత్నరాసులను కప్పంగా తీసుకువచ్చారు; రాజయిన యుధిష్ఠిరునకు సమర్పించుకున్నారు.

అర్జునుడు కూడా, అనేకమంది మహీపతులను జయించాడు. వా రందరినీ ధర్మరాజునకు సామంతులుగా చేశాడు. కాని, జరాసంధుడు మాత్రం, యుధిష్ఠిరుని ఆధిక్యత నంగీకరించలేదు. ఆయనకు కప్పం చెల్లించలేదు. ఆ విషయాన్నే, అర్జునుడు, తన అన్నగారికి నివేదించుకున్నాడు.

అది విన్న యుధిష్ఠిరుడు, అమితంగా వ్యాకులపడసాగాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, మగధేశ్వరుని విషయంలో, ఆయన బాధపడవలసింది యేమీ లేదనీ, అతణ్ణి సంహరించే ఉపాయం ఆలోచించటమయిందనీ చెప్పి, ఆయనకు ధైర్యం కలిగించాడు. ఆ వెంటనే, భీమార్జునులను తీసుకుని, జరాసంధుడున్న గిరివ్రజం చేరుకున్నాడు.

జరాసంధుడు, బ్రాహ్మణులను, దేవతలతో సమానంగా పూజి

స్తాడు. వా రేది కోరితే అది ఇస్తాడు. అది తెలిసిన శ్రీకృష్ణుడు, గిరి వ్రజంలో ప్రవేశిస్తూనే, విప్రవేషం ధరించాడు. భీమార్జునులచేతకూడా విప్ర రూపాలు ధరింపజేసి, తన్ను అనుసరించవలసిందిగా వారి నాదేశించాడు.

ఆ విధంగా బ్రాహ్మణాకృతిలో తన్ను సమీపించిన శ్రీకృష్ణ భీమార్జునులకు, జరాసంధుడు, యథావిధిగా అతిథి పూజాదికాలాచరించాడు. ఆ తరువాత, అతణ్ణి ఉద్దేశించి శ్రీకృష్ణుడు ఇలా అన్నాడు :

"మగధేశ్వరా ! నువ్వు అతిథిపూజాధురంధరుడవని విని, మేము, దూరదేశంనుంచి ఇలా వచ్చాము. ఇక, మా భాగ్యం ఎలా ఉంటే అలా జరుగుతుంది.

> అతిథి జనులను భక్తితో పూజించేవారికి శాశ్వతమయిన కీర్తి లభిస్తుంది. దేహం అస్థిరమైనదని గ్రహించి, చిరతరమైన కీర్తిని ఆసించి జీవించేవారే ధన్యు లవుతారు. దానికి భిన్నంగా ప్రవర్తించేవారు, జీవన్మృతు లనిపించుకుంటారు.

> ప్రపంచంలో, దానశీలురయినవారికి, ఇవ్వరాని పదార్థమంటూ ఏదీ ఉండదు.

దధీచి, తన ఎముకలనే దానం చేశాడు. శిబిచక్రవర్తి, తన శరీరాన్ని కోసి ఇచ్చాడు. అలాగే, రంతిదేవుడు, హరిశ్చంద్రుడు, బలి, మొదలయినవారు, అనిత్యమైన తమ శరీరాలనూ సంపదలనూ ధారపోసి, నిత్యమైన కీర్తి నార్జించుకున్నారు. అది కారణంగానే, వారు, మరణించినా, ఉన్నవారుగానే భావింపబడుతున్నారు. వారి మాదిరిగానే, నువ్వుకూడా, మా కోరికను తీర్చి, మహితయశాన్ని పొందవలసింది."

శ్రీకృష్ణుని పలుకులు విన్న జరాసంధుడు, ఒక్కసారి, ఆ ముప్పురివంకా చూశాడు. చూసి, వారి రూపాలుగాని, కంఠస్వరాలుగాని, అల్లెత్రాటి రాపిడివల్ల కాయలు కాచిన వారి ముంజేతులు గాని, విప్రుల

కుచితమయినవిగాలేవని తేల్చుకున్నాడు. అది కారణంగానే, వారు, విప్ర వేషంలో వచ్చిన రాజులని నిర్ణయించుకున్నాడు. అయినా, వారి కోరిక తీర్చటం తన ధర్మమని భావించాడు. అందుకనే, వారిని ఉద్దేశించి...

'భూరి గుణులార మీ మది
కోరిక యెఱిగింపు డేమి కోరిననైనన్
ధీరత నొసగుటయే కా
దారయ నా శిరము ద్రుంచియైనను నిత్తున్'

అని, అతిథులపట్ల తనకున్న గౌరవాన్ని ప్రకటించుకున్నాడు.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, 'అలా అయిన పక్షంలో, మేము కోరే భిక్షను మాకు ప్రసాదించవలసింది. మేము నీ వద్దకు, క్షుధార్తులమైరాలేదు. ద్వంద్వ యుద్ధాన్ని కోరి వచ్చాము. నువ్వు, ఆకోరికను తీర్చగలిగితే సంతోషిస్తాము' అన్నాడు.

అది విన్న జరాసంధునకు, వారు సామాన్యులు కారన్న అభిప్రాయంధృవపడ్డది. అందుకనే, ఆయన, శ్రీకృష్ణునితో, 'నేను తప్పకుండా మీ కోరిక తీరుస్తాను. కాని, మీ రెవరో, ముమ్ముందుగా తెలుపవలసింది' అన్నాడు.

అతనికి సమాధానంగా, శ్రీకృష్ణుడు, భీమార్జునులను పరిచయ పరచాడు. 'నేను నీ పూర్వవిరోధిని. నన్ను కృష్ణు డంటారు' అని, తన్ను తాను పరిచయ పరచుకున్నాడు.

శ్రీకృష్ణుని పలుకులు విని, జరాసంధుడు, పగలబడి నవ్వాడు. నవ్వుతూనే, 'కృష్ణా ! ఇంతకు పూర్వం, నువ్వు, నాతో అనేకసార్లు పోరాడావు. నా ప్రతాపాన్ని రుచి చూశావు. చివరకు, నాకు భయపడి, మధురా నగరంనుంచి పారిపోయి, సముద్రంలో తలదాచుకున్నావు. ఆ విషయం నువ్వు మరచిపోయినా, నేను మాత్రం ఈ జన్మలో మరచిపోలేను; పిరికి పందవైన నీతో తిరిగి పోరాడబోను.

ఇక, అర్జునుడున్నాడు. అతడు, నాకు, వయసులోగాని, బలపరాక్రమాలలోగాని ఈడు కాడు. అది కారణంగానే, నేను, నాతో సమాన బలుడైన భీమునితో పోరాడటానికీ, అందులోనూ, అతనికి అమిత ప్రావీణ్యం ఉన్న గదాయుద్ధంలో అతణ్ణి యెదిరించటానికి సిద్ధంగా ఉన్నాను;' అన్నాడు. అంటూనే, ఒక ఉద్దండ గదాదండాన్ని, భీమునకందించాడు. ఆ తరువాత, వారితో, పుర బహిః ప్రదేశంలో ఉన్న ఒక సమస్థలం చేరుకున్నాడు.

అలా అక్కడికి వెళ్ళిన భీమసేన జరాసంధులు, ఒకరితో ఒకరు తలపడ్డారు. ఆ సమయంలో, మహోగ్రమైన వారి గదలు, ఒకదాని కొకటి తాకినప్పుడల్లా, రెండు పర్వతాలో, రెండు సముద్రాలో, పరస్పరం ఢీ కొంటున్నట్టు, ఆకాశం, పగిలి పోతున్నట్టు అనిపించేది. వారి పాదఘట్టనలకు, భూమి అదరిపోయేది. వారి గర్జనలు, ఉరుముల మాదిరి వినిపించేవి. అలా కొంతసేపు సాగినతరువాత, వారిరువురి గదలూ నుగ్గునుగ్గు కావటం జరిగింది. ఆ వెంటనే, వారు, ముష్టి యుద్ధానికి దిగారు. ఆ సమయంలో, వారు...

ప్రక్కలు చెక్కులున్ మెడలు పాణితలంబులచే బగుల్చుచున్
ముక్కులు నక్కులుం జెవులు ముష్టిహతిన్ నవియంగ గ్రుద్దుచున్
డొక్కలు బిక్కలున్ ఘన కఠోర పదాహతి నొంచుచున్ నెఱుల్
దక్కక స్రుక్క కొండొరుల దార్కొని పేర్కొని పోరి రుగ్రతన్.

అదంతా చూస్తూఉన్న శ్రీకృష్ణుడు, ఒక సందర్భంలో, భీమసేనుడు జరాసంధునకు చాలడేమో అనుకోవటంకూడా జరిగింది. అందుకనే, ఆయన, జరాసంధుని జన్మవృత్తాంతం తెలిసినవాడు కావటంవల్ల, అతణ్ణి చంపే ఉపాయం భీమసేనునకు సూచిస్తూ, అక్కడ ఉన్న ఒకపుల్లను తీసుకుని, అతడు చూస్తూఉండగా, దాన్ని, మధ్యకు రెండు చీలికలుచేసి, చెరొక ప్రక్కకూ విసరివేశాడు. ఆ సూచనమీద, భీమసేనుడు, వెంటనే, జరాసంధుని క్రిందపడేసి, అతని ఒక కాలు, తన కాలితో త్రొక్కిఉంచి,

రెండుచేతులతోనూ అతని రెండవకాలు పట్టుకుని ఎత్తి, అతణ్ణి, మధ్యకు రెండుగా చీల్చివేశాడు.

అలా చీలిపోయిన జరాసంధునిచూసి, ప్రజలుహాహాకారాలుచేశారు. కృష్ణార్జునులు భీమసేనుని కౌగిలించుకుని, అతణ్ణి అమితంగా అభినందించారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, జరాసంధుని కుమారుడైన సహదేవుని మగధకు అధిపతిగా అభిషేకించాడు. జరాసంధునివల్ల బంధింపబడి ఉన్న రాజులందరినీ, వారికి మాట ఇచ్చిన ప్రకారం, చెఱనుండి విడిపించాడు. ఆ సమయంలో, శ్రీకృష్ణుడు, తన దివ్యరూపంలో, వారికి దర్శన మివ్వటం కూడా జరిగింది.

నీలమేఘం వంటి శరీరచ్ఛాయతో, పట్టు పీతాంబరంతో, చతుర్భుజుడై, శంఖ చక్ర గదాద్యాయుధాలు ధరించి, శ్రీవత్సంతోనూ, కౌస్తుభంతోనూ, కిరీట కుండలాలతోనూ, వనమాలతోనూ, ప్రసన్న వదనంతోనూ విరాజమానుడై తమకు దర్శనమిచ్చిన శ్రీకృష్ణుని చరణాబ్జాలమీద వ్రాలి, ఆ రాజన్యులందరూ, పదేపదే ప్రణామా లాచరించారు; తమ జీవితాలు ధన్యత నందినట్టు భావించారు. అనంతరం, ఆయనకు తమ కృతజ్ఞతను, యిలా తెలియపరచుకున్నారు

"తండ్రీ ! రాజ్యమదం వల్ల, మే మింతవరకూ, ప్రజలను పీడిస్తూ, పరస్పరం కలహించుకుంటూ, దుష్టభావంతో వ్యవహరిస్తూ వచ్చాము. అస్థిరమైన సంపదలే స్థిరమైన వనుకుని, అశాశ్వతమైన భోగాలు శాశ్వతమైన వనుకుని, అనిత్యమైన పదవులు నిత్యమైన వనుకుని, వాటి వెంట, ఎండమావులకు పరుగెత్తే జంతువుల మాదిరి పరుగెడుతూ వచ్చాము. నీ దర్శనంద్వారా, నేడు, మా కా భ్రమ తొలగిపోయింది. ఐహికసుఖాలమీది ఆశ నశించిపోయింది. ఇక, మమ్మల్ని అనుగ్రహించవలసింది; నీ భక్త శ్రేణిలో చేర్చుకోవలసింది."

ఆ విధంగా తన్ను ఆశ్రయించిన మహీపతుల నుద్దేశించి, మాధవు డైన శ్రీకృష్ణుడు...

'మీరలు ధర్మముం దగవు మేరయు దప్పక భూజనాళి బెం
పారయ సౌఖ్య సంపదల నందగ బ్రోచుచు భూరి యజ్ఞముల్
గౌరవ వృత్తి మత్సరముగా నొనరించుచు మామకాంఘ్రి పం
కేరుహముల్ భజించుచు నకిల్బిషులై చరియింపు డిమ్ములన్'

అని ఉపదేశించాడు. వా రందరినీ, వారివారి దేశాలకు, సగౌరవంగా సాగ నంపాడు.

అలా జరాసంధుని వధించి, అతనిచేత చెరపెట్టబడిన రాజు లందరికీ విముక్తి కలిగించి, భీమార్జునులతో ఇంద్రప్రస్థం చేరుకున్న శ్రీకృష్ణుని, యుధిష్ఠిరుడు, యథోచితంగా ప్రస్తుతించాడు. ఆయనకు తమపట్ల ఉన్న అభిమానానికి, మరొకమారు, తనకృతజ్ఞతను తెలియపరచుకున్నాడు.

## 167. శిశుపాలుడు :

ఆ తరువాత, శ్రీకృష్ణుని ఆమోదంపొంది, భీష్మ ద్రోణ కృప ధౌమ్యాదులతోనూ, తదితర ప్రముఖులతోనూ, సంప్రదించి, వ్యాస వశిష్ఠ విశ్వామిత్ర గౌతమ భరద్వాజ కశ్యప వామదేవ పరశురామ గర్గ వైశంపాయనాది మహర్షులను ఋత్విజులుగా వరించి, ధర్మరాజు, రాజసూయ మహాధ్వర నిర్వహణ కుపక్రమించాడు. ఆ సందర్భంలో, ఆయన, తనవా రందరికీ, కొన్ని గురుతర బాధ్యతలను ఒప్పగించటం జరిగింది. అప్పుడు...

సకలావనీశు లిచ్చిన
యకలంక సువర్ణ రత్నహయ ధన వస్త్ర
ప్రకరంబులు మొదలగు కా
నుక లందికొనన్ సుయోధనుని నియమించెన్.

అర్థిజాతము కోరినట్టి వస్తువులెల్ల
దగ బంచియిడగ రాధాతనూజు

సరసాన్న పానాది సకల పదార్థముల్
పాకముల్ సేయింప బవనతనయు
బంకజోదరు నొద్ద బాయక పరిచర్య
దవిలి కావింప వాసవతనూజు
సవన నిమిత్తంబు సంచిత ద్రవ్యంబు
పెంపుతో వేగ దెప్పింప నకులు
దేవ గురు వృద్ధ ధాత్రీసురావలులను
నరసి పూజింప సహదేవు నఖిల జనుల
బొలుచు మృష్టాన్న తతుల దృప్తులను జేయ
ద్రౌపదిని నియోగించెను ధర్మసుతుడు.

అదే విధంగా, సాత్యకి వికర్ణ హార్దిక విదుర భూరిశ్రవాదులకు కూడా, ధర్మజుడు, ఉచిత కార్యాలను ఒప్పచెప్పటంజరిగింది. వా రందరూ, తమతమ పనులను, అమితోత్సాహంతో, నిర్దుష్టంగా, యుధిష్టిరుని మనసుకు నచ్చేటట్టు, నిర్వర్తించుకోవటానికే శ్రమించారు. ఆ సందర్భంలో, యాగ సందర్శనార్థం విచ్చేసిన అతిథులకు పాదపూజ చేసే పనిని, శ్రీకృష్ణుడు, తనకుతానై కోరి స్వీకరించాడు. అలా ప్రారంభమైన రాజసూయ మహా ధ్వరాన్ని దర్శించే నిమిత్తం, బ్రహ్మరుద్రామరేంద్రులూ, లోకపాలురూ, గరుడ గంధర్వ విద్యాధర ప్రముఖులూ, అనేకమంది వచ్చారు. వచ్చి, పరమ విభవంతో, అత్యంతనియమంతో, శాస్త్రోక్త ప్రకారం, లోకోత్తరంగా జరుగుతున్న ఆ క్రతువును నిర్వహించే పాండుపుత్రులను అమితంగా ప్రశంసించారు. శ్రీకృష్ణ భక్తులైనవారు చేయరాని దేముంటుంది' అని, తమలోతాము అబ్బురపడసాగారు.

మహాధ్వరం ముగిసే రోజున, యాజకులనూ, సదస్యులనూ, గురువులనూ, విధ్యుక్తంగా పూజించటానికి, యుధిష్టిరుడు నిర్ణయించు కున్నాడు. అప్పుడు, అగ్రపూజకు అర్హు లెవరా అని ఆయన ఆలోచించ సాగాడు. అది గ్రహించిన సదస్యులు, ఎవరికి తోచినట్లు వారు సూచించారు.

కాని, వారి సూచనలు, సహదేవునకు సంతృప్తికరమైనవి కాలేదు. అందుకనే, అతడు, అగ్రపూజకు అన్ని విధాలా అర్హుడైనవాడు శ్రీకృష్ణుడేనని చెబుతూ...

'ఈ పురుషోత్తమున్, జగదధీశు, ననంతుని, సర్వశక్తు, జి
ద్రూపకు, నగ్రపూజ బరితోషితుజేయ సమస్త లోకముల్
వే పరితుష్టి బొందు, బృథివీవర, కావున, నీవు, కృష్ణునిన్
శ్రీపతి బూజసేయు మెడసేయక, మాటలు వేయునేటికిన్ :'

అని ధర్మజునకు, వినయపూర్వకంగా విన్నవించుకున్నాడు. ఆ పలుకులు విన్న ప్రాజ్ఞులైన మహీపతులూ, మహర్షులూ, సహదేవుని వివేకాన్ని ఎంతగానో అభినందించారు. అతని అభిప్రాయం, అత్యుత్తమమైనదిగా ఉన్నదని ప్రశంసించారు. ఆ వెంటనే, అమితోత్సాహంతో, యుధిష్ఠిరుడు, శ్రీకృష్ణుని సమీపించి, ఆయనకు, భక్తి పూర్వకంగా ప్రథమార్ఘ్యం సమర్పించుకున్నాడు. ఆ పావనోదకాన్ని, తన శిరస్సున చల్లుకున్నాడు. తన సోదరులమీదా, ద్రౌపది మీదా, చల్లాడు. శ్రీకృష్ణునకు దుకూలాలు సమర్పించుకున్నాడు; పరమానందం పొందాడు. అది చూసిన పవిత్రహృదయాలన్నీ అమిత భక్తితో, 'జై జయ వాసుదేవ హరి' అంటూ, ఆ యదుకుల శేఖరుని పట్ల తమకున్న గౌరవాన్ని ప్రకటించుకున్నై. ఆ సందర్భంలో, ఆకసం నుంచి, ఆ మహానుభావునిమీద, పుష్ప వృష్టి కురిసింది.

అదంతా, శిశుపాలునకు, అమితమయిన అసూయ కలిగించింది. శ్రీకృష్ణునకు ప్రథమార్ఘ్య మివ్వటం, అతడు సహించలేకపోయినాడు. అది కారణంగానే, అతడు సభాసదుల నుద్దేశించి ఇలా అన్నాడు :

"ఈ సభలో, బ్రహ్మనిష్ఠులూ జ్ఞానమూర్తులూ తపోధనులూ ఉత్తమ కుల విద్యా గుణ సంపన్నులూ అయిన మహనీయు లెందరో ఉన్నారు. వా రందరినీ కాదని, ఒక్క దాశార్హుని, ప్రప్రథమంగా పూజించటం అవమానకరమైన విషయం. అతడయినా ప్రసిద్ధుడా అంటే, అదీ కాదు.

గురు దేవ శూన్యుండు కుల గోత్ర రహితుండు
దలిదంద్రు లెవ్వరో తడవ గాన
మప్పల బొరలెదు నాది మధ్యావసా
నంబులం దరయ మానంబు లేదు
బహురూపియై పెక్కుభంగుల వర్తించు
వావి వర్తనములు వరుస లేవు
పరికింప విగత సంబంధుండు దలపోయ
మా నిమిత్తంబున మానిసయ్యె
బరగ మున్ను యయాతి శాపమున జేసి
వాని కెక్కడ యీ యదువంశ మెల్ల
బ్రహ్మతేజంబునెల్ల గోల్పడిన యితడు
బ్రహ్మఋషి సేవ్యు డగునె గోపాలకుండు.

యథార్థానికి గోపాలురు, పూజనీయులుకారు. వారు దస్యు ప్రాయులు. అది కారణంగానే, వారు, బ్రహ్మర్షి సేవితమైన భూమిని వదలి, సముద్ర మధ్యంలో నివసించటం జరుగుతోంది. ఇదంతా తెలిసికూడా, యుధిష్టిరుడు, ఇతనికి ప్రథమార్ఘ్య మిచ్చాడు. మనల్ని అందరినీ, కోరి అగౌరవపరచాడు. ఇది సహింపరాని విషయం."

శిశుపాలుని అనుచిత వచనాలు విని, సభాసదులందరూ అమితంగా వ్యాకులపడ్డారు. వారిలో చాలామంది, హరినింద వినలేక అక్కడి నుంచి వెళ్ళిపోయినారు. కాని, మత్స్య కేకయ సృంజయులు మాత్రం, సహదేవుని నాయకత్వాన, శిశుపాలుని శిక్షించే ఉద్దేశంతో, తమ తమ ఆయుధాలను తీసుకుని, అతని మీదికి ఉటికారు. అది గ్రహించి, శిశుపాలుడూ, అతని సహచరులూ, యుద్ధసన్నద్ధులై నిలబడ్డారు. ఆసమయంలో, ఆ సవన సీమ సమర స్థల మవుతుందేమో అన్న భీతి, అక్కడివారికి కలిగింది.

అంతలో, శ్రీకృష్ణుడు, సహదేవాదులను వారించాడు. తన సమ

క్షాన, కత్తి దూసి నుంచున్న శిశుపాలుని వంక రోషంతో చూశాడు. చూసి, మనసారా, తన చక్రాయుధాన్ని స్మరించుకున్నాడు. ఆ వెంటనే, రాక్షసాంతక మయిన ఆ చక్రం వచ్చి, ఆయన హస్తాన్ని అలంకరించింది.

* * *

శిశుపాలుడు, సాత్వతి అని వ్యవహరింపబడే, శ్రీకృష్ణుని మేనత్త అయిన శ్రుతిశ్రవ కుమారుడు. అతనికి, సునీధు డనే వ్యవహార నామం కూడా ఉంది అతని తండ్రి దమఘోషుడు; చేది దేశాధీశ్వరుడు.

శిశుపాలుడు, నాలుగు చేతులతోనూ, మూడు కళ్ళతోనూ, జన్మించాడు. అది చూసిన అతని తల్లిదండ్రులు భయపడిపోయినారు. వా రలా భయపడి, విస్మయావిష్టులై ఉండగా, 'ఎవరు ఎత్తుకున్నప్పుడు, ఇతనికి అదనంగా ఉన్న చేతులూ, కన్నూ హరించి పోతయ్యో, అతని వల్లనే ఇతనికి మరణం ఉంది, అన్న ఒక అశరీరవాణి వినిపించింది.

అది విన్నవా రందరూ ఆశ్చర్యచకితులయినారు. అప్పటినుంచీ, అతనికి మారకుడయినవానిని గ్రహించే ఉద్దేశంతో, అతణ్ణి చూడవచ్చిన వా రందరికీ, అతని తల్లిదండ్రులు, అతణ్ణి అందిస్తూ వచ్చారు.

వికృత రూపధారి అయిన తమ మేనత్త కుమారుని, చూడాలనే ఉద్దేశంతో, బలరామ కృష్ణులు కూడా, ఒకసారి, అక్కడికి వెళ్ళటం జరిగింది. అలా వెళ్ళిన ఆ మహానుభావులకు, ఉచితోపచారాలు జరిగినై. అనంతరం, సాత్వతి, తన కుమారుణ్ణి, ముందుగా, బలరామున కందించింది; ఆ తరువాత, శ్రీకృష్ణుని చేతిలో పెట్టింది.

శ్రీకృష్ణుడు, చేతుల్లోకి తీసుకోగానే, అంతవరకూ ఆ శిశువుకు అదనంగా ఉన్న చేతులూ కన్నూ హరించిపోయినై. అది చూసిన సాత్వతి, అది మహాద్భుత మనుకుంది. తన కుమారునికి, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణునివల్ల మరణం తథ్యమని కూడా నిర్ణయించుకుంది. అది కారణంగానే, శ్రీకృష్ణుని, ఉద్దేశించి, 'కృష్ణా ! వీడు

కాలక్రమాన, దుర్మార్గుడై, నీకు అయిష్టుడు కావచ్చు. అయినా, ఇతడు నీకు బావ. అందుకనే, ఇతని అపరాధాలను, నూరింటివరకూ సహించవలసిందని నిన్ను కోరుతున్నాను' అని విన్నవించుకుంది.

తన కుమారుడు, శ్రీకృష్ణునిపట్ల అన్ని తప్పులు చేయబోడన్న అభిప్రాయం, ఆ మాతృహృదయంలో జనించిఉంటుంది. అది కారణంగానే, ఆమె, అలా కోరి ఉంటుంది.

శ్రీకృష్ణుడు, ఆమె హృదయాన్ని అర్థం చేసుకున్నాడు. ఆమె ప్రార్థన నంగీకరించాడు.

కాలక్రమాన, శిశుపాలుడు, శ్రీకృష్ణునిపట్ల విరోధం వహించటం జరిగింది. ఆయనపట్ల అతడు ఆచరించని అపచారమంటూ లేకుండా పోయింది.

శ్రీకృష్ణుడు, భగదత్తునిమీద దండెత్తి, ప్రాగ్జ్యోతిషపురం వెళ్ళిన సమయంలో, శిశుపాలుడు, ద్వారావతికి వెళ్ళి, ఆ మహానగరాన్ని అగ్నికాహుతి చేయాలని చూశాడు. భోజరాజులు, తమ స్త్రీలతో రైవత మహోత్సవంలో ఉన్న సమయాన, అతడు, వారిని వధించాడు. అలాగే, వసుదేవుడు తలపెట్టిన అశ్వమేధ యాగంలో, యాగాశ్వాన్ని హరించుకుపోయి, యజ్ఞవిఘ్నం చేశాడు. బభ్రువాహనుని భార్యను అపహరించుకుపోయి, వివాహం చేసుకున్నాడు. అలాగే, మరెన్నో అపచారాలు చేశాడు. అయినా, శ్రీకృష్ణుడు, వాటి నన్నిటినీ సహించాడు; కాని, లెక్క పెట్టుకుంటూనే ఉన్నాడు.

* * *

రాజసూయాధ్వర సమయంలో, శిశుపాలుడు, హద్దులు మీరి ప్రవర్తించటంతో, శ్రీకృష్ణుడు తన మేనత్తకు చేసిన వాగ్దానం పూర్తి అయింది. అది కారణంగానే, ఆయన, తన్నాశ్రయించిన చక్రాయుధాన్ని, ఆ వెంటనే, శిశుపాలునిమీద ప్రయోగించటం జరిగింది. అలా ప్రయోగింప

బడిన చక్రాయుధం సూటిగా వెళ్ళి, శిశుపాలుని శిరస్సును ఛేదించింది అంతలో, అతనిలోనుంచి ఒక దివ్య తేజం బయటకు వచ్చి, దానవాంతకుడైన శ్రీకృష్ణునిలో ప్రవేశించింది. ఆ విధంగా...

మధు దైత్యాంతకు మీది మత్సరమునన్ మత్తిల్లి జన్మత్రయా
వధి వైరొద్దు దదీయ రూప గుణ దివ్య ధ్యాన పారీణ ధీ
నిధి యౌటన్ శిశుపాల భూవిభుడు దా నిర్ధూత సర్వాఘుడై
విధి రుద్రాదుల కందరాని పదవిన్ వే పొందె 'నుర్వీస్థలిన్'.

ఆ విధంగా రాజసూయం సమాప్తమయింది. అయినా, అది చూసిన మహర్షులూ మహీసురులూ, ధర్మరాజును, అమితంగా ప్రశంసించారు. అతనికి అండగా ఉన్న శ్రీకృష్ణుని, పరిపరివిధాల ప్రస్తుతించారు. ఆపైన వారివద్ద సెలవుతీసుకుని. తమతమ నిజావాసాలకు వెళ్ళిపోయినారు.

అనంతరం, యుధిష్ఠిరుని కోరికమీద, శ్రీకృష్ణుడూ మరికొందరు సన్నిహితులూ, కొంతకాలం, ఇంద్రప్రస్థంలోనే ఉండిపోయినారు. శ్రీకృష్ణుడు, సాంబునీ, మిగిలిన తన కుమారులనూ, మరికొందరు యాదవ వీరులనూ, ద్వారావతికి పంపించాడు.

*168.* సాల్వభూపతి :

రుక్మిణీ పరిణయ సమయంలో, శ్రీకృష్ణుడు, అనేకమంది రాజులను ఓడించాడు. అలా ఓడింపబడిన వారిలో, శిశుపాలుని స్నేహితుడైన సాల్వు డొకడు. ఆ సమయంలో, అతడు, రాజు లందరి సమక్షానా, 'నేను, యాదవులను నిర్మూలించేవరకూ నిద్రపోను' అని శపథం చేశాడు.

అలా ప్రతినబట్టిన సాల్వుడు, పశుపతిని ప్రసన్నుని చేసుకునే ఉద్దేశంతో, తీవ్రతపశ్చర్యకు పూనుకున్నాడు. ఆ సమయంలో, అతడు, ప్రతి రోజూ, పిడికెడు దుమ్మును మాత్రమే తినేవాడు.

సాల్వుని భక్తికి శంకరుడు అమితంగా ఆనందించాడు. అది

కారణంగానే, ఆయన, అతనికి ప్రత్యక్షమై, 'నీకు సంతోషం కలిగించే వరం ఏదో ఒకటి కోరుకోవలసింది' అన్నాడు. అలా తనపట్ల ప్రసన్నుడైన పరమేశ్వరుని ఉద్దేశించి...

'గరుడ గంధర్వ యక్ష రాక్షస సురేంద్ర
వరులచే సాధ్యపడక నా వలయునెడల
నభ్రపథమున దిరిగెడునట్టి మహిత
వాహనము నాకు దయ సేయు వరద యీశ !'

అని, శాల్వుడు అభ్యర్థించాడు.

హరుడు, అతని కోరిక ననుసరించి, అతి విశాలమైనదీ, లోహమయమైనదీ, కామగమనం గలదీ అయిన ఒక విమానాన్ని, మయుని చేత నిర్మింపచేసి, అతనికి ప్రసాదించాడు. దానికి, సౌభకం అనే పేరు పెట్టాడు.

ఆ సౌభక విమానం మీదనే వెళ్ళి, శాల్వుడు, ద్వారావతిమీద దాడి చేశాడు. పురాన్ని ముట్టడించాడు. తన సేనలచేత, అక్కడి ఉద్యాన వనాలనూ, గోపురాలనూ, ద్వారాలనూ, ప్రాసాదాలనూ పాడుచేయించాడు. ఆ నగరం మీద. శరవర్షం కురిపించ సాగాడు.

శాల్వు డలా దాడిచేసిన సమయంలో, శ్రీకృష్ణుడు అక్కడ లేడు; ఇంద్ర ప్రస్థంనుంచి బయలుదేరి, ద్వారావతికి వస్తూ ఉన్నాడు. అది కారణంగానే, సాత్యకి ప్రభృతుల సహాయంతో, ప్రద్యుమ్నుడు నగర రక్షణ భారాన్ని నిర్వహిస్తూ ఉండటం జరిగింది.

శాల్వ ప్రద్యుమ్నుల మధ్య జరిగిన యుద్ధం, ఇరవై ఏడు రోజుల పాటు సాగింది. అందులో, ఇరుపక్షాలూ, అమితంగా క్షీణించిపోయినై. ఆ సమయాన, మార్గమధ్యంలో ఉన్న శ్రీకృష్ణుడు, తన సారథి నుద్దేశించి...

'కంటే దారుక దుర్నిమిత్తము లనేకంబుల్ మహాభీలముల్
మింటన్ మేదిని దోచుచున్న యవి నెమ్మిన్ ఖాండవప్రస్థ మే

నుంటం జైద్యహిత క్షితీశ్వరులు మాయోపాయులై మత్పురిన్
గ్గెంటింపం జనుదేర టోలుదురు పోనీ తేరు వేగంబునన్'

అని, తన అభిప్రాయాన్ని తెలియపరుస్తూ ఆదేశించాడు. ఆ తరువాత, అనతికాలంలోనే, ద్వారావతిని సమీపించాడు.

అలా ద్వారావతి చేరుకున్న శ్రీకృష్ణుని చూడగానే, యదువీరులకు అమితమైన బలం చేకూరింది. అది కారణంగా, వారు విజృంభించారు.

శ్రీకృష్ణుడు కంటపడగానే, అంతవరకూ అత్యుగ్రంగా పోరాడుతున్న శాల్వుని సేనలు, కలవరపడసాగినై. అది గ్రహించిన శాల్వుడు, ఆ వెంటనే, తన సౌభక విమానంతోసహా, అదృశ్యుడై పోయినాడు.

ఆమీద కొంత సేపటికి, ఒక వార్తాహరు డక్కడకు పరుగు పరుగున వచ్చి, శ్రీకృష్ణునికి మ్రొక్కి, 'ప్రభూ! పాపాత్ముడయిన శాల్వుడు, మీ తండ్రిని బంధించి తీసుకువెళ్ళాడు. ఆ విషయాన్ని మీకు నివేదించుకునే నిమిత్తం, మీ తల్లిగారు న న్నిక్కడికి పంపారు' అని, అతి దీనంగా విన్నవించుకున్నాడు.

అది విన్న శ్రీకృష్ణుడు, అమితంగా వ్యాకులపడ్డాడు. తన తండ్రికే అటువంటి దుర్గతి కలిగించిన విధి ఎంతో బలవత్తరమైనదై ఉండాలనుకున్నాడు. ఆ వెంటనే, అదృశ్యుడై ఉన్న శాల్వుని కోసం, నలు దిక్కులా పరికించి చూశాడు.

అలా చూస్తున్న కృష్ణునకు, బంధితుడై ఉన్న వసుదేవుని, తనవేపుగా తీసుకువస్తున్న శాల్వుడు, గగనమార్గాన కనిపించాడు. అతణ్ణి చూడగానే, శ్రీకృష్ణునకు, అంతులేని కోపంవచ్చింది.

అది గ్రహించిన శాల్వుడు, వికటాట్టహాసం చేశాడు. కత్తిదూశాడు. వసుదేవుని తలను నరకటానికి ఉద్యమించాడు. శ్రీకృష్ణునిఉద్దేశించి, 'ఇది, నా స్నేహితుడైనశిశుపాలుడు వరించిన కన్యను నువ్వు అపహరించిన దానికి ఫలం' అంటూ, కత్తి విసిరాడు.

ఆ మరుక్షణంలోనే, వసుదేవుని శిరస్సు, నెత్తురోడుతూ, శ్రీకృష్ణుని సమీపంలో పడ్డది. అది చూడగానే, ఆయన మూర్ఛితుడైనాడు. కాని, వెంటనే మనసును దిట్టపరచుకుని, సురాసురులకుకూడా అజేయుడైన బలరాముని రక్షణలో ఉన్నతన తండ్రిని, శాల్వుడు బంధించటం, తన్ను కన్నవాడు, ఆ విధంగా దుర్గతిపాలు కావటం, అసంభవమని భావించాడు. అదంతా, శాల్వుని అసుర మాయ మాత్రమే అయివుండాలని నిర్ణయించు కున్నాడు. ఆయన ఆ మాయను అలా గ్రహించగానే, అంతకుముందు తన వద్దకు వచ్చిన వార్తాహరుడూ, తన సముఖాన పడ్డ ఖండితశిరమూ, అతి విచిత్రంగా మాయమై పోవటం జరిగింది. అది కారణంగా, ఆయన, తన గదను గిరగిరాత్రిప్పి, సౌభకం పైకి విసరివేశాడు. ఆ తాకిడికి, ఆవిమానం చూర్ణమైపోయింది.

సౌభకం ఆవిధంగా కూలిపోగానే, అంతవరకూ శాల్వుని ఆశ్ర యించిఉన్న మాయాబలంకాస్తా హరించిపోయింది. ఆవెంటనే, శ్రీకృష్ణుడు, అత దంతకుపూర్వం ఏ చేతితో తన తండ్రిని నరుకుతున్నట్లు భ్రమ కలి గించాడో ఆచేతిని, ఖండించివేశాడు. ఆపైన, తన చక్రాయుధాన్ని వదలి, మణిమయాంచిత కిరీటాన్ని ధరించిన అతని శిరస్సును ఛేదించాడు.

## *169. దంతవక్త్రుడు:*

తన మిత్రులయిన జరాసంధ, శిశుపాల, శాల్వభూపతుల మర ణానికి కారకుడైన శ్రీకృష్ణునిపై పగ సాధించి తీరాలని, కరూశ దేశాధి పతి అయిన దంతవక్త్రుడు నిర్ణయించుకున్నాడు. అది కారణంగానే, అతడు, శ్రీకృష్ణుని మాహాత్మ్యాన్నిగాని, ఆయనతో తనకున్న బాంధ వ్యాన్నిగాని పాటించకుండా, ఆయన్ని అమితంగా దూషిస్తూ, ఒక గద తీసుకుని, ఆయనతో తలపడ్డాడు. అదిచూసిన శ్రీకృష్ణుడు, కౌమోదకి అనే తన గదతో, అతని హృదయంమీద మోదాడు. దాంతో, దంతవక్త్రుడు,

నెత్తురు కక్కుకుంటూ నేలకూలాడు. ఆ వెంటనే, అతనిలోనుంచి ఒక తేజోకిరణం బయటకువచ్చి, శ్రీకృష్ణునిలో లీనమైపోయింది. అది గ్రహించి...

నర ముని యోగి సురాసుర
గరు డోరగ సిద్ధ సాధ్య గంధర్వ నభ
శ్చర కిన్నర కింపురుషులు
హరిమహిమ నుతించి రద్భుతానందమునన్.

* * *

శాపగ్రస్తులైన జయవిజయులు, మూడవమారు, శిశుపాల దంతవక్త్రులై జన్మించారు. వా రిద్దరూ, పినతల్లి పెదతల్లి బిడ్డలు; శ్రీకృష్ణునకు మేనబావలు.

దంతవక్త్రుడు, కరూశ దేశాధిపతి అయిన వృద్ధశర్మ కుమారుడు. అతనితల్లి, వసుదేవుని సోదరి అయిన శ్రుతదేవ.

శిశుపాలుని మాదిరిగానే, దంతవక్త్రుడుకూడా, ప్రద్యుమ్నుని ఎదిరించి పరాజితుడైనాడు. యుధిష్ఠిర రాజసూయంలో, శిశుపాలుని మాదిరిగానే, శ్రీకృష్ణుని ధిక్కరించాడు. అనంతరం, అతడు, శ్రీకృష్ణునితో యుద్ధం చేసి, అతని చేతులో మరణించి, శాపవిముక్తి పొందటం జరిగింది.

* * *

తన అన్నగారైన దంతవక్త్రుడు అలా సంహరింపబడటంచూసి, విదూరథుడు, అమితాగ్రహంతో, శ్రీకృష్ణునిమీదకు ఉరికాడు. కాని, మరు క్షణంలోనే, ఆయన చక్రాయుధానికి బలి అయినాడు.

ఆ విధంగా, శాల్వ దంతవక్త్ర విదూరథులను సంహరించి, శ్రీకృష్ణుడు, జయజయధ్వానాలమధ్య, ద్వారావతిలో ప్రవేశించటం జరిగింది.

***170.*** పాంచాలి:

యుధిష్ఠిరుడు నిర్వహించిన రాజసూయాధ్వర వైభవం, దుర్యో

ధనునిలో, అమితమైన ఈర్ష్యాసూయలను కలిగించింది. పాండు పుత్రుల దైన మయ సభా సౌందర్యం, అతని అల్పత్వాన్ని అతనికి అనుక్షణం స్ఫురణకు తెస్తూ ఉంది. దానికితోడు, అతడు, మయ సభా సౌందర్యాన్ని తిలకిస్తూ ఉన్న సమయంలో, అతనికి, అంతులేని అవమానం కూడా కలిగింది.

ఒకరోజున, దుర్యోధనుడు, ఆ సభను పరికిస్తూ, ఇంద్రనీల మణులతో విరచింపబడ్డ స్థలాన్ని, జలాశయంగా భావించటం జరిగింది. అది కారణంగా, అతడు, కట్టుకున్న పుట్టాన్ని పైకి పట్టుకుని, మెల్లమెల్లగా ముందుకు సాగాడు. అది చూసిన యుధిష్ఠిరభటులు, తమలో తాము నవ్వుకున్నారు. అది దుర్యోధనుడు గ్రహించాడు.

మరొకచోట, స్ఫటిక కమలాలతో కూర్పబడ్డ జలాశయం, అతనికి సమస్థలంగా కనిపించింది. అత డటు పోతూ, అందులో పడ్డాడు; అతని బట్టలన్నీ తడిసిపోయినై. అది గ్రహించిన ధర్మరాజు, అతణ్ణి, సమీపించి, సానుభూతితో పలుకరించి, సరిక్రొత్త వలువ లిచ్చి, వాటిని ధరింపచేశాడు. అది తనకు జరిగిన ఘోరాపమానంగా దుర్యోధనుడు భావించాడు.

అలాగే, మరొకస్థలంలో, మూసిఉన్న ద్వారం, తెరచిఉన్నట్టు అతనికి తోచింది. అతడు, అందులో, ప్రవేశించబోయినాడు; తలుపు తలకు తగలటంవల్ల ఆగి, ప్రక్కకు తప్పుకున్నాడు.

ఆపైన, అతడు, తెరచిఉన్న ద్వారం మూసిఉన్నదని భావించి, తెరవబోవటం, ముందుకు పడటం, జరిగింది. పంచపాళిలో ఉన్న ద్రౌపది, సోరణగండ్ల ద్వారా అది చూసింది. చూసి, పకపకలాడింది. అది, దుర్యోధనుడు, గ్రహించాడు. అతడు అంతవరకూ అనుభవిస్తున్న అవమానానికి అది చరమస్థితిగా అతనికి తోచింది. ఆపైన, అత దక్కడ, నిలబడలేక పోయినాడు. ధర్మజునివద్ద సెలవు తీసుకుని, ఆ వెంటనే, హస్తినాపురం చేరుకున్నాడు.

పాండుపుత్రులమీదా, పాంచాలిమీదా, దుర్యోధనునకున్న ద్వేషం,

పై సంఘటనలతో పరాకాష్ఠ పొందింది. వారిని, ఎప్పుడు ఏ విధంగా, పరాభవించటమా అన్న ఆలోచనలతో, అతడు, రాత్రింబవళ్ళు గడుపసాగాడు.

ఆ ఆలోచనల ఫలితంగానే, అత డొక వినూత్న సభాభవనాన్ని నిర్మించటం, దాన్ని చూడటానికనే మిషతో, యుధిష్ఠిరాదులను ఆహ్వానించటం, వారు వచ్చి, ఆ భవన సౌందర్యాన్ని వీక్షించి ఆనందిస్తూ ఉన్న సమయంలో, సుహృద్ద్యూతం పేరట ఒక మాయాద్యూతాన్ని ఏర్పరచటం, అందులో, అతని మామ అయిన శకుని సహాయంతో, యుధిష్ఠిరుని, అన్యాయంగా ఓడించటం, జరిగింది

ద్యూతప్రియుడయిన యుధిష్ఠిరుడు, ముందు, తన సంపదలను పణంగా పెట్టాడు; ఓడిపోయినాడు. ఆ పైన, రాజ్యాన్ని ఒడ్డాడు; కోలుపోయినాడు అటుమీదట, తన తమ్ములందరినీ, ఒకరొకరినే పందెం పెట్టి ఓడిపోవటం జరిగింది. అలా ఆయన ఎన్ని పందాలు వేసినా, మాయాద్యూత నిపుణుడయిన శకుని, దుర్యోధనుని పక్షాన, వాటి నన్నిటినీ గెలుచుకోవటం సంభవించింది. దుర్యోధనుడు కోరిందికూడా అదే

దుర్యోధను డప్పుడు, తనకు ఓడిపోయిన పాండుపుత్రులు, తన బానిసలని భావించాడు. వారిని పరాభవించటానికి మంచి అవకాశం లభించిందనుకున్నాడు. ఆ అభిప్రాయంతోనే, పాంచాలిని, సభాస్థలికి రప్పించాడు. ఆమె భర్తల అధోగతినీ, ఆమె నిస్సహాయతనూ, ఆమెకు స్ఫురింపచేస్తూ, ఆ మహాసభలో, పంచేంద్రులవంటి పాండుపుత్రుల కట్టెదుట, కురువృద్ధుల సమక్షాన, ఆమెను అవమానపరచాలనుకున్నాడు; ఆమె కట్టుపుట్టాన్ని, దుశ్శాసనుని చేత ఒలిపించటానికి కూడా పూనుకున్నాడు.

ద్రౌపది, పరిస్థితినంతనూ అర్థం చేసుకుంది. తన కళ్ళ ఎదుట ఉన్నవా రెవరూ, తన్ను రక్షించలేరని నిర్ణయించుకుంది. అది కారణంగానే, అమితమైన ఆవేదనతో, అఖిలలోకాధారుడూ, ఆపద్బాంధవుడూ, ఆర్తిహరుడూ, భక్తవత్సలుడూ, ద్వారకావాసుడూ, అయిన శ్రీకృష్ణుని ఆశ్రయించింది. ఆశ్రయించి, "తండ్రీ! కౌరవులు కల్పించిన పరాభవ

మహార్ణవంలో నేను మునిపోకుండా చూడవలసింది. అందులోనుంచి నన్ను ఉద్ధరించవలసింది. అని ప్రార్థిస్తూ, ఆయనమీద పరిపూర్ణ విశ్వాసంతో, ముఖాన్ని చేతులతో కప్పుకుని, మూర్తిదాల్చిన శోకంమాదిరి నిలబడి పోయింది.

అంతలో, దుశ్శాసను డామెను సమీపించాడు. సమీపించి, వికటాట్ట హాసం చేస్తూ, ఏవిధమైన పాపభీతి లేకుండా, ఆమె కట్టుపుట్టాన్ని ఒలవటానికి పూనుకున్నాడు

పాంచాలిదయిన పరాభవాన్ని వారించగలవాడు ఆ పరాత్పరుడొక్కడే అన్న అభిప్రాయంతో, భీష్మాది కురువృద్ధులు, ఆయన్నే స్మరించుకుంటూ, 'పరమసాధ్వి అయిన పాంచాలి, పరాభవంపాలుకాకుండా చూడవలసింది ప్రభూ !' అని ప్రార్థించసాగారు. ధార్తరాష్ట్రులు మాత్రం, ధర్మరాజాదుల కీర్తిశిఖరం కూలిపోయినట్టే భావించారు; ఆనందతాండవం చేయసాగారు.

అంతలో, మహాద్భుతమైన సంఘటన జరిగింది. దుష్టుడైన దుశ్శాసనుడు, ద్రౌపది మీది వలువను ఒలిచాడు. ఓ ప్రక్కకు విసరి వేశాడు. వికటాట్టహాసంచేస్తూ, ఆమెవంక చూశాడు కాని, అతడు భావించినట్టు, ఆమె, వివస్త్రకాలేదు. ఆమె కట్టుకున్న చీర, కట్టుకున్నట్లే ఉంది. అది గ్రహించి, అతడు ఆశ్చర్యచకితుడయినాడు.

తిరిగి ఆ చీరనుకూడా ఒలిచాడు దాన్ని చేత్తో పట్టుకునే, ఆమె వంక చూశాడు. కాని, ఆమె యథాప్రకారంగానే ఉంది ఆమె మీది వలువ, తొలగినట్టుకూడా లేదు. ఆమె, కన్నులు మూసుకుని ఉంది. 'కృష్ణా ! కృష్ణా ! శ్రీహరీ...!' అని అమితమైన ఆవేదనతో ఆక్రందిస్తూ ఉంది.

అది చూసిన దుశ్శాసనుడు, అమితావేశంతో, చేతిలోని చీరను, ఓ ప్రక్కకు విసరివేసి, ఆమెమీది చీరను, తిరిగి లాగాడు అప్పటికీ, ఆమె వివస్త్రకాలేదు. అది గ్రహించిన దుర్యోధనాదులు, తమకళ్లను తామే నమ్మలేకపోయినారు. అంతలో, సభాభవనమంతటా, అదోవిధమైన కలకలం

ప్రతిధ్వనించింది.

ఆ తరువాత, దుశ్శాసనుడు, ద్రౌపదిమీద కనిపించిన చీరలన్నిం టినీ లాగివేయసాగాడు. అత డెంతగా లాగివేసినా, అతని ఆశయం మాత్రం సిద్ధించలేదు. అతడు ఒలిచిన చీరలు, కుప్పలుకుప్పలు కాజొచ్చినై. అక్కడ ఉన్న మహీపతు లందరకూ, అది, మహాద్భుతమనిపించింది. కాని యాజ్ఞసేని, ఆ సమయంలో, ఆ సభాసదుల దిక్కు కన్నెత్తిఅయినా చూడ లేదు. కలవరపడలేదు. పరమాత్మునిపట్ల తనకున్న పరిపూర్ణ విశ్వాసానికి పరమచిహ్నంగా, ఆమె, అలాగే నిలబడి ఉంది.

భీష్మాది కురువృద్ధులు అది గ్రహించారు. గ్రహించి, ఏక కంఠంతో, "ఆపద్బాంధవా ! భక్తవత్సలా ! శ్రీహరీ ! కృష్ణా ! " అంటూ, నినాదాలు చేయసాగారు.

ఆ సమయంలో, ధర్మరాజాదులు పొందిన దివ్యానుభూతికీ, దుర్యోధనాదులు అనుభవించిన అవమానానికీ, అవధిలేకుండాపోయింది. అది గ్రహించిన పూజ్యులు, అదంతా, శ్రీకృష్ణభగవానుని లీలావిశేషంగా భావించారు; పరమానందా న్ననుభవించారు.

ఆ విధంగా, శ్రీకృష్ణుడు, మరొక మహాద్భుత లీలను ప్రదర్శిం చటం సంభవించింది; తన్నే ఆశ్రయించిన పాంచాలి, పరాభవంపాలు కాకుండా చేయటం జరిగింది.

## 171. బాల్యమిత్రుడు కుచేలుడు :

పూర్వం, జితేంద్రియుడూ, ప్రశాంతచిత్తుడూ, బ్రహ్మవిదుడూ ధర్మవత్సలుడూ, అయిన ఒక బ్రాహ్మణు డుండేవాడు. ఆయన్ని, కుచేలుడు అనేవారు. ఆయనకు, పరమ పతివ్రత అయిన భార్య ఉండేది.

ఆ దంపతులు అమిత సంతానవంతులు. అత్యంత దరిద్రులు. వారు అనుభవించని దారిద్ర్యక్లేశమంటూ లేదు. వారి సంతానం, వరుసగా

కొన్ని రోజులపాటు, త్రాగటానికి గంజి కూడా లేక, ఆకటిమంటతో అట మటించిపోయేవారు. వారి బాధలు చూడలేక, వారితల్లి, క్రుంగి కృశించి పోయేది. ఆ పరిస్థితిలో కూడా, మానధనుడైన కుచేలుడు, ఇతరుల నెవ్వరినీ ఏమీ అడిగేవాడు కాదు. ఎప్పు డేది లభిస్తే అది, అత్యల్పమైన దయినా, పరమేశ్వరుని ప్రసాదంగా భావించి, దాన్ని సంతుష్టితో స్వీకరించి, కాలం వెళ్ళదీసుకునేవాడు.

ఆ కుచేలుడు, సాందీపనివద్ద విద్యాభ్యాసం చేసే సమయంలో, శ్రీకృష్ణుడు అతని సహాధ్యాయిగా ఉండేవాడు. సహాధ్యాయిగా మాత్రమే కాదు; అతని ప్రాణానికి ప్రాణంగా కూడా వ్యవహరించేవాడు. అతనిపట్ల అత్యంతాభిమానంతో ప్రవర్తించేవాడు.

అత్యద్భుతమైన శ్రీకృష్ణుని లీలా విలాసాలు విన్నప్పుడల్లా, కుచే లుడు ఉప్పొంగిపోయేవాడు. తన కా మహానుభావునితో లభించిన సాహచర్య భాగ్యాన్ని గురించి, తన భార్యకు వివరిస్తూ ఉండేవాడు. 'శ్రీకృష్ణుడు సాక్షాత్పరమేశ్వరుడే' అని, తన పిల్లలకు చెబుతూ ఉండేవాడు. అంతేకాదు.

'శ్రీకృష్ణుడు ఆర్తత్రాణ పరాయణుడు. ఆయన్ని నమ్మి భజించే వారికి, ఆర్తి అనేదే ఉండదు; ఆపదలనేవి ఎప్పుడూ సంభవించవు విధి వశాత్తు, ఒకవేళ సంభవించినా, ఆయన కటాక్షవీక్షణ ప్రసారం మూలంగా, అవన్నీ అవలీలగా తొలగిపోతై. ఆపద్బాంధవుడన్న బిరుదు, ఆయనపట్ల సార్థకమయింది. యథార్థానికి, ఆయన, నా బాల్య సఖుడుకావటం నా అదృష్టం;' అనికూడా తెలియపరచుకుంటూ ఉండేవాడు. భార్యకూ పిల్ల లకూ, ఆయన దివ్యలీలలను, అనవరతం, అభివర్ణించిచెబుతూ, ఆనందిస్తూ ఉండేవాడు.

అది కారణంగా, అతని భార్య, ఒకసారి అతణ్ణి సమీపించి, తమ సంతానం అప్పుడు అనుభవిస్తున్న దారిద్ర్యబాధను, అతనికి, దీనాతిదీనంగా విశదపరచుకుంది. ఆ సందర్భంలోనే...

"పిల్లలు, ఆకటిమంటతో అటమటించిపోతున్నారు. ఆ పసి

కూనల ప్రాణాన్ని నిలబెట్టటానికి, పట్టెడు మెతుకులు కూడా పుట్టని దురవస్థ నాకు సంప్రాప్తించింది గంజికూడా కఱవైన ఆ పసి ప్రాణాలను చూసినప్పు డల్లా, నా గుండె, చెరువై పోతూ ఉంటుంది. కష్టాలను కట్టపెట్టటానికే, నేను, వారిని కన్నానా అనిపిస్తూ ఉంటుంది.

అదంతా విపరించటంవల్ల, మిమ్మల్ని కూడా బాధపెట్టట మవు తుందని నాకుతెలుసు. కాని, ఉట్టి దౌర్భాగ్యురాలిని. అది కారణంగానే, ఇప్పుడు, ఆ పాపానికి కూడా పాల్పడ తున్నాను. యథార్థానికి, మన కష్టాల నుంచి మనల నుద్ధరించగలవాడు, ద్వారకావాసుడైన ఆ శ్రీకృష్ణ భగవాను డొక్కడే. ఆయన్ని ఆశ్రయించిన వారిని. ఆయనే ఉద్ధరించాలి; రక్షించి తీరాలి. నిజానికి, ఆయన తలుచుకుంటే. కానిదంటూ యేమీ ఉండదు. ఆయన, దయాపయోనిధి. ఆర్తశరణ్యుడు. భక్తవత్సలుడు. అన్నిటికీ మించి, మీకు బాల్యమిత్రుడు. అయినప్పటికీ, మీ రాయనను, యింతవరకూ, ఒక్కసారి అయినా దర్శించుకురాలేదు. నిజానికి, అది. మనం, ఆ మహాను భావునిపట్ల ఆచరించిన ఘోరాపచారమేమో అనికూడా నాకు అప్పుడప్పుడు అనిపిస్తూ ఉంటుంది. ఆయన దర్శనం చేసుకున్న పక్షంలో, మన కష్టాలు తొలగిపోగలవన్న దృఢాభిప్రాయం నాకు ఉంది. యథార్థానికి ఆయన...

కలలోనం దను ము న్నెఱుంగని మహా కష్టాత్ముడైనట్టి దు
ర్బలు డాపత్సమయంబునన్ నిజపదాబ్జాతంబు లుల్లంబులో
దలప న్నంతన మెచ్చి యా హరిహరుడై తన్నైన నిచ్చున్ సుని
శ్చల భక్తిన్ భజియించువారి కిడదే సంపద్విశేషోన్నతుల్"

అని కూడా నివేదించుకుంది.

తన ధర్మపత్నివైన పలుకులను కుచేలుడు, కాదనలేకపోయి నాడు. ఆమె ఆశించిన అదృష్టాన్ని అభిలషించి కాకపోయినా, సంసార సాగ రాన్ని తరించటానికయినా ఆ మహానుభావుని దర్శించటం అవసరమని ఆయన అనుకున్నాడు కాని...

భగవత్సందర్శనానికి రిక్తహస్తాలతో వెళ్ళటం ఉచితం కాదు.

భగవానుడైన శ్రీకృష్ణునకు కానికగా ఇవ్వ దగ్గది, తమదగ్గర ఏమీ లేదు. ఆ విషయాన్నే, ఆయన, తన భార్యకు తెలుపుకున్నాడు.

ఆ పరిస్థితి నర్థం చేసుకుని, ఆమె అమితంగా విచారపడ్డది. కాని, ఆ వెంటనే, పొరుగున ఉన్న ఒక ఇల్లాలి నడిగి, నాలుగు గుప్పెళ్ళ అటుకులు, అప్పుగా తీసుకువచ్చింది వాటిని, శుభ్రమైన ఒక పాత గుడ్డలో మూటకట్టి, శ్రీకృష్ణునకు సమర్పించుకునే నిమిత్తం, తన పెనిమిటికి అందించింది. అది తీసుకుని, కుచేలుడు, ద్వారాపతికి బయలుదేరాడు.

ద్వారకానగరం చేరుకున్న మీదట, శ్రీకృష్ణుని, యెక్కడ యెలా కలుసుకోవటమూ అన్న ఆలోచన, కుచేలునకు కలిగింది. అంతలో, అతని కొక విప్రు డెదురైనాడు. ఆయన, కుచేలుని చూసి, 'స్వామీ ! మీ రెవరి యింటికి వచ్చారు!' అని, ఆదర పూర్వకంగా పలుకరించాడు. ఆయనకు సమాధానంగా, కుచేలుడు ...

''ఇందీవర శ్యాము వందిత సుత్రాము
గరుడాలవాలు భాసుర కపోలు
గౌస్తుభాలంకారు గామిత మందారు
సురుచిర లావణ్యు సుర శరణ్యు
హర్యక్షనిభమధ్యు నఖిలలోకారాధ్యు
ఘన చక్రహస్తు జగత్ప్రశస్తు
ఖగ కులాధిప యాను గౌశేయ పరిధాను
బన్నగ శయను నబ్జాత నయను
మకర కుండల సద్భూషు మంజు భాషు
నిరుపమాకారు దుగ్ధ సాగర విహారు
భూరి గుణ సాంద్రు యదుకులాంభోధి చంద్రు
(జిష్ణునిం గృష్ణు జూడవచ్చితి మహాత్మ!)''

అని, వినయపూర్వకంగా విన్నవించుకున్నాడు.

అది విన్న విప్రుడు, మందహాసం చేశాడు. కుచేలుని, ఒక అమాయకునిగా భావించాడు. అందుకనే, అతనిపట్ల సానుభూతి చూపుతూ...

''అయ్యా ! ఆయన్ని దర్శించటం ఎవరికీ సాధ్యమయే పని కాదు. ఆయనకు, పదహారువేల ఎనిమిదిమంది భార్య లున్నారు. ఆయన, ఎప్పు డెక్కడ ఉండేది ఎవరికీ తెలియదు. అలా అన్నామని, ఆయన, ఎప్పుడికప్పుడు, ఒకే ఒకచోట, ఉంటాడనుకోవటం కూడా భ్రమ కాకపోదు. ఒకే ఒక సమయంలో, ఆయన,అనేకచోట్ల, ఆడుతూ, పాడుతూ, ఉండటం కూడా కద్దు. అదంతా, ఆ మహానుభావుని చిద్విలాసం'' అని, తెలియ బరచాడు.

అది విన్న కుచేలుడు, ఆనంద బాష్పాలు రాల్చాడు. శ్రీకృష్ణుడు తన సమక్షాన కూడా ఉన్నట్టే భావించాడు; భక్తిపూర్వకంగా, చేతులెత్తి, 'ఓం నమో నారాయణాయ' అంటూ, నమస్కరించాడు.

కుచేలుడు, తన నగరంలో ప్రవేశించటం, తన్ను గురించి విచారిస్తూ ఉండటం, అప్పుడు, రుక్మిణీదేవి మందిరంలో ఉన్న శ్రీకృష్ణుడు, గ్రహించాడు. గ్రహించి, వెంటనే, ఆయనకు, ఎదురు వెళ్ళి, స్వాగతం చెప్పాడు; ఆయన్ని ఆలింగనం చేసుకున్నాడు.

ప్రాణస్నేహితుడయిన అతణ్ణి కౌగిలించుకోగానే, పరమానంద స్వరూపుడయిన ఆ మహానుభావుని కళ్ళు కూడా చెమ్మగిలినై. ఆయన, ఆనందాశ్రులు రాల్చాడు. అనంతరం, కుచేలుని, తన మందిరానికి తీసుకు వెళ్ళి, ఆయన కాళ్ళు కడిగి, ఆ జలాన్ని, తన నెత్తిమీద చల్లుకున్నాడు. ఆపైన, ఆయన్ని, తనతోపాటు, తన పాన్పుమీదనే కూర్చోబెట్టుకున్నాడు. ఆయన శరీర మంతటా, చల్లని మైపూతలు పూశాడు. ఆయనకు, అగరు వత్తులతో ధూపం వేశాడు. హారతి నిచ్చాడు. ఫలహారం పెట్టాడు. పరిమళ

ద్రవ్యాలతో కూడిన తాంబూలం సమర్పించుకున్నాడు.

అలా శ్రీకృష్ణుని సరసను కూర్చున్న కుచేలునికి, అంతఃపుర పరిచారిక లందరూ, అమిత గౌరవం చూపారు. రుక్మిణీదేవి, స్వయంగా ఆయనకు, వింజామర వీచింది. అదంతా చూసిన శుద్ధాంత కాంతలు...

'ఏమి తపంబు సేసె నొకొ యీ ధరణీ దివిజోత్తముండు తొల్
బామున, యోగి విస్ఫుర దుపాస్యకుడై తనరారు నీ జగ
త్స్వామి రమాధినాధు నిజతల్పమునన్ వసియించియున్నవా
డీ మహనీయమూర్తి కెనయే మునిపుంగవు లెంతవారలున్'

అని, కుచేలుని అదృష్టానికి, తమలో తాము అబ్బురపడసాగారు.

కుచేలుని, సర్వోత్తమ విధానంలో పూజించిన తరువాత, శ్రీకృష్ణుడు, అతని కుశల మడిగాడు. చిన్ననాటి ముచ్చట లెన్నో అతని స్మరణకు తీసుకువచ్చి, అతనికి ఆనందం కలిగించాడు. ఆ సందర్భం లోనే...

"మనం గురుకులవాసం చేస్తున్న రోజుల్లో, ఒకసారి, సమిధల కోసం అడవికి వెళ్ళాం. ఆ సమయంలో, పెద్ద గాలివాన వచ్చింది. ఉఱుములతో, మెఱుములతో, ఆ వనమంతా అతి భయంకరమయినదిగా తయారయింది. అంతలో, సూర్యుడ స్తమించటం, ఆ ప్రదేశ మంతా అంధకార బంధురమైపోవటం జరిగింది. వన మంతా జలమయం కావటంవల్ల, మిట్ట పల్లాలు తెలుసుకోలేక, మన మెంతో బాధపడ్డాము. కడవపోతగా వర్షం కురుస్తూ ఉండటంవల్లా, పెనుగాలి దానికి తోడు కావటం వల్లా, మనం దిక్కుతోచక, ఆ రాత్రంతా, ఆ వనాంతరంలోనే తిరిగాము. ఎంత సేపు, అలా తిరిగినా, మనం మాత్రం విడిపోకుండా, చేయీ చేయీ కలుపుకుని ఉండటమే జరిగింది.

ఆ రాత్రంతా అలా గడచిపోవటం, మన మా గాలివానలో ఏమైనామో అన్న భయంతో, మన గురుదేవుడు, సాందీపని మహర్షి, మనకోసం

వెతికి వెతికి, ఒకచోట మనల్ని కలుసుకోవటం, మనం, తనకోసం పడ్డ పాట్లు గ్రహించి, జాలిపడి, మనం ఆయనవద్ద నేర్చుకున్న విద్యలన్నీ, మన మనసులో, ఎప్పుడూ నవనవోన్మేషంగా ఉండేటట్టూ, మన వాంఛితార్థాలన్నీ ఈడేరేటట్టూ మనకు వర మివ్వటం మొదలయిన ఘట్టాలు, నువ్వు కూడా మఱచి ఉండవనే అనుకుంటాను. నిజానికి, ఆ రోజులు ఎంత సంతోషంగా గడచిపోయినై ! ఇప్పటికీ, అవి తలచుకుంటే, కలిగే ఆనందానికి, అవధి అనేది ఉండదు. అదంతా గురుదేవుని దయ. అంతే !"

అంటూ, పూర్వగాథ లెన్నింటినో వివరిస్తూ, మధుర స్మృతులను కలిగిస్తూ, అతనితోపాటు, తను కూడా ఆనందా న్ననుభవించసాగాడు. అంతేకాదు.

'నిన్ను చూస్తుంటే, నువ్వు, ప్రపంచంపట్ల పరమ విరక్తిభావంతో ఉన్నా వనిపిస్తోంది. యథార్థానికి, అది, సంతోషించ వలసిన విషయమే.

ఉత్తము లయినవారు, లోక సంగ్రహార్థం, విధ్యుక్తకర్మలన్నింటినీ ఆచరిస్తూనే ఉంటారు; కాని, కామ మోహితులు మాత్రం కారు. నువ్వు కూడా, ఆ విధంగానే, శీలవతి అయిన భార్యతో, గృహస్థ ధర్మాన్ని అవలంబిస్తూ, ప్రకృతి సంబంధాలకు దూరంగా, భవ్యనిష్ఠతో వ్యవహరిస్తున్నా వనే నేను భావిస్తున్నాను;'

అని కూడా అన్నాడు. ఆ తరువాత, అతణ్ణి ఉద్దేశించి, 'ఇంతకూ, నాకేం తీసుకువచ్చావు !' అని, ప్రేమ పూర్వకంగా, అమాయకుని మాదిరి అడిగాడు.

ఆ పలుకులు విన్న కుచేలుడు, అమితమైన లజ్జతో, తలవంచు కున్నాడు. మహానుభావుడయిన మాధవునకు కానికగా, అటుకుల నెలా అర్పించుకునేది ?' అని, అతను, తనలో, తాను బాధపడసాగాడు.

శ్రీకృష్ణుడు, అది, గ్రహించాడు. గ్రహించి, అతని కొంగున ఉన్న అటుకులమూటను, దొంగమాదిరి విప్పసాగాడు. విప్పుతూనే...

"ప్రేమతో పెట్టిన పిడికెడు అటుకుల నయినా, నేను, సంతోషంతో స్వీకరిస్తాను నాకు కావలసింది అభిమానంగాని, ఆడంబరం కాదు. నామీద ప్రేమతో, ఎవరేమిచ్చినా, నేను, పరమానందం పొందుతాను. అది అల్పాతి అల్పమైన పదార్థమైనా, అదే పదివేలుగా భావిస్తాను. దుష్టాత్ములయినవారు, నా మెప్పును పొందేనిమిత్తం, అప్పుడప్పుడు, హేమరాసులను కూడా అర్పిస్తారు. కాని, అది, నాకు, ఆనందం కలిగించదు."

అని, తన హృదయాన్ని తెలియపరచుకున్నాడు ఆ అటుకులలోనుంచి ఒక గుప్పెడు తీసుకుని, 'ఈ నా స్నేహితునికి, సంపదలమీద యే విధమైన అపేక్షా లేదు. కాని, ఈనాడు, పరమ పతివ్రత అయిన తన భార్యను సంతృప్తిపరచే ఉద్దేశంతో, తన బిడ్డలదయిన దారిద్ర్యబాధను తొలగించుకునే నిమిత్తం ఇలా నా వద్దకు వచ్చాడు. ఇతని కోరికను తీర్చటం నా ధర్మం. అందుకనే, దేవతలుకూడా పొందరాని భోగాలు, ఇతణ్ణి ఆశ్రయించాలని నేను కోరుతున్నాను;' అనుకుంటూ, వాటిని ఆరగించాడు. అది గ్రహించిన రుక్మిణీదేవి, కుచేలునివంక ఆదరపూర్వకంగా చూసింది.

ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, మరొక గుప్పెడు అటుకులను తీసుకోబోయినాడు అది చూసిన రుక్మిణీదేవి, ఆయన చేయిపట్టుకుని...

'సొంపారగ నితనికి బహు
సంపద లందింప నివియు చాలును యిక భ
క్షింపగ వలవదు త్రిజగ
త్సంపత్కర దేవదేవ సర్వాత్మ హరీ !'

అని, ఆయన్ని వారించింది. ఆమె అభిప్రాయం గ్రహించి, శ్రీకృష్ణుడు, మందహాసం చేశాడు.

కుచేలుడు, ఆ రాత్రికి అక్కడే ఉండి, మర్నాడు ఉదయాన, శ్రీకృష్ణునివద్దా, రుక్మిణీదేవి వద్దా సెలవు తీసుకుని, గృహోన్ముఖుడై బయలుదేరాడు. ఇలా వెడుతూ...

నా పుణ్య మరయ నెట్టిదొ
యా పుణ్యనిధిం బ్రకాంతు నచ్యుతు నఖిల
వ్యాపకు బ్రహ్మణ్యుని జి
ద్రూపకు బురుషోత్తముని బరుం గనుగొంటిన్'

అని, తనలో తా ననుకున్నాడు. అంతే కాదు.

"సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు, నిరుపేదనైన నన్ను ఆదరించి ఆలింగనం చేసుకోవటం, ఆయనదైన దీనజన వాత్సల్యానికి మాత్రమే తార్కాణం. ఎవని పాదాల నాశ్రయించి, సేవించి, మహర్షులు తరిస్తారో, ఆ మహానుభావుడు, నాకు అర్ఘ్య పాద్యాదు లర్పించటం, ఆయనకు తన భక్తులమీద ఉండే గౌరవానికి నిదర్శనం.

శ్రీనిధి యిట్లు నన్ను బచరించి ఘనంబుగ విత్తమేమియు
న్నీని తెఱంగు గానబడె నెన్న దరిద్రుడు సంపదంధుడై
కానక తన్ను జేరడని కాక శ్రితార్తిహరుండు సత్కృపాం
భోనిధి సర్వవస్తు పరిపూర్ణునిగా నను జేయకుండునే''

అనికూడా అనుకున్నాడు. అంతలోనే, ఊరు చేరుకున్నాడు.

అక్కడ, కుచేలునకు, పూర్వం తన కుటీరం ఉండేచోట, ఒక మహాప్రాసాదం గోచరించింది. అందులో ఉన్న ఉద్యానవనాలనూ, సరస్సులనూ, ఆ ప్రాంతంలో సంచరిస్తూ ఉన్న దాస దాసీజనాన్నీ చూసి, కుచేలుడు తను, దారితప్పి వచ్చినట్టుగా భావించుకున్నాడు. 'ఈ దివ్యభవనంలో నివసించేవారు ఎంతటి పుణ్యాత్ములై ఉంటారో' అని ఆలోచించసాగాడు. అలా ఆలోచిస్తూ ముందుకుపోతున్న అతనికి, కొందరు సుందరీమణులు, విమల గీత వాద్యాదులతో ఎదురైనారు. ఎదురై, స్వాగతంచెప్పి, ఆ విచిత్ర భవనంలోకి, సగౌరవంగా అతణ్ణి తీసుకువెళ్ళారు.

అత డా భవనంలో ప్రవేశించగానే, సాక్షాత్తు శ్రీదేవిమాదిరి ఉన్న అతని భార్య, అతణ్ణి సమీపించింది. పరిచారికల సహాయంతో, ఆయ

నకు, అర్ఘ్యపాద్యాదులు అర్పించుకుంది. ఆయన్ని పుష్పమాలలతో అలంక రించింది. అర్చించింది. పద్మరాగ స్తంభాలతోనూ, పటికపు గోడలతోనూ, రత్నమయ కవాటాలతోనూ, హంసతూలికా తల్పాలతోనూ భాసిస్తున్న దివ్య మందిరంలోకి, ఆయన్ని తీసుకువెళ్ళింది.

అలా అందులో ప్రవేశించిన కుచేలుడు, అదంతా, శ్రీకృష్ణుని కృపా విశేషంగానూ, అనుగ్రహంగానూ భావించాడు. శ్రీకృష్ణ సందర్శనం వల్లనే, అంతవరకూ దుఃఖార్ణవంలో మునిగిఉన్న తన సంసారానికి, ఆ ముహూర్తాన, అటువంటి మహదైశ్వర్యం లభించిందని భావించాడు. అయినా, ఏ విధమైన మనోవికారం పొందకుండా, నిర్మలాంతః కరణంతో, ఆ పర మేశ్వరుని మనసారా ధ్యానించుకున్నాడు. ఆ సమయంలోనే...

"శ్రీకృష్ణుడు సర్వజ్ఞుడు. సర్వాత్ముడు. ఆయనకు తెలియని దేమీ లేదు. అది కారణంగానే, ఆయన, నన్ను చూసి పలుకరించికూడా, నా సంసారానికి సంబంధించిన వృత్తాంతాన్ని అడగనేలేదు. అడగకుండానే, అన్ని విషయాలూ గ్రహించాడు. గ్రహించటమే కాదు; నన్ననుగ్రహించి సర్వసంపదలనూ ప్రసాదించాడు.

> శ్రీకృష్ణుడు కారుణ్యరస ప్రపూర్ణుడు. భక్తవత్సలుడు. తన్ను ఆశ్రయించిన సుహృదులు భక్తితో సమర్పించుకున్న ఫలాన్నిగాని, తృణాన్ని గాని, చివరకు, జలకణాన్నిగాని, ప్రేమపూర్వకంగా స్వీకరిస్తాడు. దానికి ప్రతికృతిగా, వారికి అనంత సౌఖ్యాలను ప్రసాదిస్తాడు.

నేను తీసుకువెళ్ళిన గుప్పెడటుకులను స్వీకరించి, నాకీ గురుతర సౌభాగ్యాన్ని ప్రసాదించటమే దానికి దృష్టాంతం" అనికూడా అనుకున్నాడు; అమితా నందం పొందాడు.

ఆ విధంగా అపూర్వైశ్వర్యం పొందికూడా, కుచేలుడు, అహమి కతో చరించలేదు. పత్నీ పుత్రులతో నిఖిలభోగాలను అనుభవిస్తూకూడా,

అతడు, రాగరహితుడై, నిర్వికారుడై వ్యవహరించాడు. ఎప్పుడు ఏపని చేస్తున్నా, ఆ గోవిందుణ్ణే ధ్యానించుకుంటూ. ఆయన చరణాబ్జాలమీదనే అభిరతి కలిగి ఉండి, జీవితశేషాన్ని వెళ్ళదీసుకున్నాడు దాని ఫలితంగా అఖిల బంధాలనూ తొలగించుకుని, అవసానదశలోకూడా ఆ శ్రీమన్నారాయణునే స్మరించుకుంటూ, సాధువులకూ సత్పురుషులకూ మాత్రమే గమ్యమైన పరమపదాన్ని పొందగలిగాడు.

## 172. సుహృత్సమాగమం :

శ్రీకృష్ణ బలరాములు ద్వారావతిలో ఉన్న సమయంలో, ఒకసారి, పూర్ణ సూర్యగ్రహణం వచ్చింది. అటువంటిది, సామాన్యంగా, యుగాంతాన, ప్రళయకాలాన మాత్రమే సంభవిస్తుంది. అది గ్రహించిన ప్రజలు, కురుక్షేత్రంలోని స్యమంత పంచకానికి, దశదిశలనుంచీ చేరుకున్నారు.

పరాక్రమ సంపన్నుడయిన పరశురాముడు, గర్వాంధులయిన క్షత్రియులను నిర్మూలించి, వారి రుధిరంతో ఏర్పడిన మడుగు లైదింటికీ, స్యమంతపంచకమన్న పేరు వచ్చింది. క్షత్రియులను సంహరించి, భూమిని రుధిరప్లావితం చేసిన పాతకాన్ని తొలగించుకునే నిమిత్తం, ఆ ప్రదేశంలోనే, ఆయన, ఒక మహాయాగాన్ని నిర్వహించాడు. పుణ్యపాపాలకు అతీతుడయిన మహానుభావుడై కూడా, ప్రపంచానికి ఒక ఆదర్శాన్ని చూపించే ఉద్దేశంతో, ఆయన, అలా చేయటం జరిగింది.

అప్పుడు, అక్కడ, సమావేశమైనవారిలో, అక్రూర వసుదేవ ఉగ్రసేనాది వృద్ధులూ, గద ప్రద్యుమ్న సాంబాది యువకులూ, అనిరుద్ధుడూ, యాదవసేనాని అయిన కృతవర్మా కూడా ఉన్నారు.

యాదవులు, అత్యంత వైభవోపేతంగా అక్కడికి తరలి వచ్చారు. వారినీ, వారి వస్త్రాభరణాదులనూ చూసినవారు, తొలుత, వారు దేవతలా అనుకున్నారు వారందరూ, వారివారి సంసారాలతో, విమానాలవంటి శకటాలమీదా, పల్లకీలమీదా, అక్కడకు విచ్చేయటం జరిగింది.

అలా అక్కడ సమావేశమైన యాదవులు, విధ్యుక్తంగా స్నానాది కాలు పూర్తి చేసుకున్నారు. బ్రాహ్మణపూజ సలిపారు. అన్నదానం చేశారు. శ్రీకృష్ణుని పట్ల తమకున్న భక్తిని దృఢతరం చేసుకోవటానికి, యెంతగానో ప్రయత్నించారు.

ఆ తరువాత, భోజనాదికాలు ముగించుకుని, తమతమ బంధుమిత్రులను సందర్శించుకునే ఉద్దేశంతో, వారు, వారి వారి గుడారాలకు వెళ్ళారు.

ఆ సమయంలో, అక్కడ, మత్స్య, ఉశీనర, కోసల, విదర్భ, కురు సృంజయ, కాంభోజ, కేకయ, మద్ర, కుంతి, ఆవర్త, కేరళ మున్నగు దేశాధీశు లెందరో సమావేశమైనారు. వారందరితోనూ, యాదవులకు, యేదో ఒక విధంగా సంబంధం ఉండనే ఉంది.

నందుడూ, తదితర గోపకులూ కూడా, శ్రీకృష్ణుని దర్శించుకోవాలనే ఉత్సుకతతో అక్కడికి వచ్చారు. వారందరూ, ఒకరినొకరు పలుకరించుకున్నారు. పరామర్శించుకున్నారు. కుశల ప్రశ్నలు వేసుకుంటూ, ఉల్లాసంగా కాలం వెళ్ళదీసుకున్నారు. ఆ సమయంలో, వారందరి ప్రసంగాలలోనూ, ఏదో ఒక విధంగా, శ్రీకృష్ణుని ప్రస్తావన వస్తూనే ఉంది. ఆపైన, వారందరూ, ఉగ్రసేనుని సమీపించారు. సమీపించి...

"రాజా! ప్రపంచంలోని మానవు లందరిలోనూ, యాదవులు మాత్రమే ధన్యులు. వారి జన్మలే ధన్యత మైనవి. శ్రీకృష్ణుడు, సర్వవేళలా వారి మధ్య ఉండటమే దానికి మూలం.

శ్రీకృష్ణుడు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే. ఆయనను దర్శించుకోవటం, ఎంతటి యోగులకూ కూడా శక్యం కాదు. ఆయన ఆవిర్భావం వల్లనే, భూమాతకు, శాంతీ పవిత్రతా చేకూరినై.

యాదవులకు, ఆ మహాసుభావునితో, సర్వవిధ సంబంధాలూ ఉన్నై. మీ రాయనను ఎప్పుడూ చూస్తూఉంటారు. ఆయనతో సంభాషిస్తూ ఉంటారు. ఆయనకు సన్నిహితంగా కూర్చుని భుజిస్తూ ఉంటారు. ఆయన ప్రక్కనే శయనిస్తారు.

యథార్థానికి, మీరు, మీమధ్య, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుని నిలుపుకున్నారు. స్వర్గసుఖాన్నీ ముక్తినీ కూడా తిరస్కరింప జేసే ఆయన దివ్య దర్శనభాగ్యాన్ని పొంది జీవిస్తున్నారు" అని ప్రశంసించారు.

శ్రీకృష్ణ సందర్శనాభిలాషతో వచ్చిన నందాది గోపకులకు, యాదవులు స్వాగతం చెప్పారు. పూజాదికాలు జరిపారు.

ఆ సందర్భంలో, శ్రీకృష్ణ బలరాములు కూడా, అక్కడ చేరిన వా రందరినీ సత్కరించారు. ఆపైన, తమ పెంపుడు తల్లిదండ్రులను, యశోదనూ, నందునీ సమీపించి, గౌరవపురస్సరంగా నమస్కరించారు. ప్రేమపూర్వకంగా కౌగిలించుకున్నారు. ఆనందబాష్పాలు రాలుస్తూ, అలాగే మౌనంగా ఉండిపోయినారు.

నంద యశోదలు కూడా పరమానందా న్ననుభవించారు. తమ ముద్దుబిడ్డలను దగ్గరకు తీసుకుని, హృదయానికి హత్తుకున్నారు. వారితో కలిగిన యెడబాటువల్ల, అంతవరకూ తాము అనుభవిస్తూ వచ్చిన వేదన నంతనూ, అప్పుడు, వారు, విస్మరించారు.

ఆ తరువాత, రోహిణీ, దేవకీదేవీ, యశోదను ఆలింగనం చేసుకున్నారు. ఆపైన, ఆమెతో యిలా అన్నారు :

''యశోదా ! ఇంతవరకూ అఖండంగా ఉన్న మన మైత్రి, మాకు చిరస్మరణీయంగా ఉంది. నువ్వు మాకు చేసిన మేలుకు, మే మెంతగానో నీకు ఋణపడి ఉన్నాము. దేవేంద్రుని ఐశ్వర్యమంతా నీకు యిచ్చినా, నీ పట్ల మా ఋణం తీరదు.

శ్రీకృష్ణ బలరాములు, తమ తల్లిదండ్రు లెవరో తెలియని స్థితిలో మిమ్మల్ని చేరారు. మీరు, వారిని, ప్రేమతో పెంచి, పెద్దవారిని చేశారు. యథార్థానికి, తల్లిదండ్రులు చేయవలసిన సంస్కారాల నన్నింటినీ, మీరే చేశారు. మీ రక్షణలో ఉండటం వల్లనే, వారికి, యేవిధమైన అపాయం

లేకుండా పోయింది. నిజంగా, మీ దంపతులు దివ్యులు. ఆది కారణంగానే, మీరు, ఇతరుల బిడ్డలనుకూడా, మీ స్వంత బిడ్డలను చూసుకున్నట్టు చూసుకో గలిగారు."

దేవకీ రోహిణీ, ఆ విధంగా, యశోదపట్ల తమకున్న కృతజ్ఞ తను వెల్లడించుకుంటున్న సమయంలో, గోపికలు, తమ ప్రియతముడయిన శ్రీకృష్ణుని, దూరంనుంచి చూడటం జరిగింది. అలా చూసిన, వారు, ఆయన్ని మానసికంగా చుట్టేసుకున్నారు; ఆయనతో తాదాత్మ్యం పొందారు.

అది గ్రహించిన కృష్ణయ్య, వారికి, పరమానందాన్ని ప్రసాదిం చాడు. ఆపైన, వారందరినీ, ఒక ఏకాంత ప్రదేశానికి తీసుకువెళ్ళాడు. వారితో కొంతసేపు ఆనందంగా గడిపాడు. కుశల ప్రశ్నల అనంతరం, వారితో యిలా అన్నాడు.

"మీరు మా ప్రాణానికి ప్రాణమైన వాళ్ళు. అది మాకు తెలుసు. అయినా, మమ్మల్నే నమ్ముకున్నవారికి, మరికొందరికి, మేలు చేకూర్చే నిమిత్తం, ప్రజా పీడకు పూనుకున్న ప్రభువులను కొందరిని శిక్షించే ఉద్దే శంతో, ఇంతవరకూ, మిమ్మల్ని వదలి ఉండటం జరిగింది. అలా విడిచి ఉన్నా, మమ్మల్ని మీరు మరచిపోలేదు; దూషించలేదు. అదే, మీలో ఉన్న విశేషం.

సంయోగ వియోగా లనేవి, భగవంతుని ఇచ్ఛమీద ఆధారపడిఉంటై. మేఘాలనూ, గడ్డిపరకలనూ, గాలి ఎలా ఒకచోట చేరుస్తూ, విడదీస్తూ ఉంటుందో, అలాగే, భగవం తుడుకూడా ప్రాణులను, కూరుస్తూ దూరం చేస్తూ ఉంటాడు.

ఆ యథార్థాన్ని మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి."

ఆ విధంగా, శ్రీకృష్ణుడు, ఉపదేశించిన మీదట, గోపికలు, అదే విషయాన్ని పదేపదే మననం చేసుకున్నారు. అనంతరం, ఆయన్ని, సభక్తి కంగా పూజించి..

'ఘోర సంసార సాగరోత్తారణంబు
ధీయుత జ్ఞానయోగి హృద్ధ్యేయ వస్తు
వగుచు జెలువొందు నీ చరణాంబుజాత
యుగళమును మా మనంబుల దగులనీవె !'

అని, వేడుకున్నారు; ఆయననుంచి ఆ వరాన్ని పొందారు.

అంతలో, శ్రీకృష్ణుని దర్శించుకునే నిమిత్తం, వ్యాస నారద గౌతమ వశిష్ఠ యాజ్ఞవల్క్యాది మహర్షులు అక్కడకు వచ్చారు. శ్రీకృష్ణుడు, వారికి ప్రత్యుత్థానం చేసి, వారిని విధ్యుక్తంగా పూజించాడు. ఆ తరువాత, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు :

"యోగీశ్వరుల దర్శనం దేవతలకు కూడా దుర్లభమైనదే. అమితమైన అదృష్టవంతులకుగాని, సాధు సందర్శన భాగ్యం లభించదు. తీర్థ సేవనంవల్లగాని, విగ్రహారాధనవల్లగాని ప్రాప్తించని పావనత్వం, సాధువులను సందర్శించినంతలోనే ప్రాప్తిస్తుంది. వారిని, ఏ ఒక ముహూర్తకాలం సేవించినా, అజ్ఞానాంధకారం తొలగిపోతుంది. వారి సేవాభాగ్యాన్ని అభిలషించనివాడు, నరుడై కూడా, పశువులలో గర్దభంవంటివాడుగా ప్రాజ్ఞులచేత పరిగణింపబడతాడు."

ఆ విధంగా, సాధుజన మాహాత్మ్యాన్ని ప్రశంసించిన పరమపురుషుని, ఆ మహర్షులు, అమితంగా అభినందించారు. ఆ తరువాత, వారు, వసుదేవుని కోరికమీద, ఆయనచేత, అక్కడే, ఒక మహాధ్వరాన్ని నిర్వర్తింపచేశారు. ఆయన సమర్పించుకున్న విశేషమైన పారితోషికాలను స్వీకరించారు. ఆ పైన, అక్కడ ఉన్న యాదవ ప్రముఖులవద్దా, ప్రత్యేకించి రామ కృష్ణులవద్దా సెలవు తీసుకుని, తమ తమ ఆశ్రమాలకు బయలుదేరారు.

**173.** మాతృ వాంఛాపూరణం :

ఆ తరువాత, ఒకసారి, దేవకీదేవి, బలరామ కృష్ణుల నుద్దేశించి, వారి మాహాత్మ్యాన్ని ప్రశంసించి, మరణించిన గురుపుత్రుని తీసుకువచ్చిన విధంగానే, కంసునివల్ల పూర్వం సంహరింపబడ్డ తన కుమారులనుకూడా ఒకసారి తెచ్చి చూపించవలసిందిగా కోరింది. ఆ అన్నదమ్ములు, ఆమె కోరిక నాదరించి, ఆ వెంటనే, తమ యోగ మాయా ప్రభావంద్వారా, సుత లానికి వెళ్ళారు.

అలా, అనుకోకుండా దర్శనమిచ్చిన బలరామ కృష్ణులకు, రాక్ష సేశ్వరుడైన బలి, స్వాగతం చెప్పాడు; భక్తిపూర్వకంగా వారిని అర్చిం చాడు. వారికి కానిక లర్పించుకున్నాడు. ఆ తరువాత, శ్రీకృష్ణునకు ఇలా విన్నవించుకున్నాడు;

"మహానుభావా! నువ్వు పరమాత్ముడవు. సర్వాంతర్యామివి. నీ దర్శన భాగ్యం, సామాన్యంగా ఎవరికీ లభించదు.

నువ్వు యోగీశ్వరుడవు. అందుకనే, యోగులుకూడా, నీ యోగ మాయా ప్రభావం 'ఇది' అని, తేల్చుకోలేకుండా ఉంటారు.

నువ్వు శుద్ధసత్త్వధాముడవు. అయినా, రజస్తమస్స్వభావుడనైన నాకు దర్శనమిచ్చావు. ఇక, నన్ననుగ్రహించవలసింది. నీ కేది ఆనంద దాయకమో అది తెలియపరచి, దాన్ని చేయవలసిందిగా, నీ దాసుడనైన నన్ను శాసించవలసింది".

ఆ విధంగా, వినయ విధేయతలతో విన్నవించుకున్న బలిచక్ర వర్తిని చూసి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. అతనిపట్ల ప్రసన్ను డైనాడు. తను వచ్చిన పనిని వివరిస్తూ, ఆయన నుద్దేశించి ఇలా అన్నాడు:

"పూర్వం, స్వాయంభువ మన్వంతరంలో, మరీచికి, ఊర్ణ అనే ఒక భార్య ఉండేది. ఆ దంపతులకు, స్మరుడు, ఉద్గీథుడు, పరిష్వంగుడు, పతంగుడు, క్షుద్రభువు, ఘృణి, అనే, ఆరుగురు కుమారు లుండేవారు. వా రందరూ దేవతలే.

ఆ కుమారు లోకసారి, చతుర్ముఖుని పరిహసించటం జరిగింది. అది కారణంగా, వారు, అసురులై జనించేటట్టు ఆయన శపించాడు.

అలా శపింపబడ్డ ఆరుగురూ, హిరణ్యకశిపునకు జనించవలసిన వారు. కాని, యోగమాయ, వారిని, దేవకీ గర్భాన ఉంచింది. వారే, కాల క్రమాన, దేవకీ సుతులై జనించటం, అచిరకాలంలోనే. కంసునిచేత వధింప బడటం, జరిగింది.

ఆ అన్నదమ్ము లందరూ, ఇప్పుడు, నీ దగ్గర ఉన్నారు. మా తల్లి అయిన దేవకీదేవి, వారిని చూడాలనుకుంటోంది. ఆమె కోరికను తీర్చ టానికే, మే మిప్పుడు ఇలా వచ్చాము. మాతో వారిని తీసుకుపోవటం ద్వారా, వారికి శాప విముక్తి కలుగుతుంది: తిరిగి వారు తమ నిజా వాసం చేరుకోవటం జరుగుతుంది."

శ్రీకృష్ణుని పలుకులువిని, బలిచక్రవర్తి, తన వద్ద ఉన్న బాలు రను, ఆ వెంటనే, ఆయనకు ఒప్పగించాడు. ఆ తరువాత, బలరామ కృష్ణులు, వారిని తీసుకుపోయి, తమ తల్లికి చూపించి, ఆమెకు అమితానందం కలిగించారు. ఆ కుమారులు, ఆలింగనాదులద్వారా శ్రీకృష్ణునిస్పృశించి, తమ పాపాన్ని తొలగించుకున్నారు. చతుర్ముఖుని శాపంనుంచి విముక్తిపొందారు. ఆపైన, తమ తల్లిదండ్రులవద్దా, బలరామ కృష్ణులవద్దా సెలవు తీసుకుని, తమ నిజావాసానికి, దేవలోకానికి, వెళ్ళిపోయినారు.

ఏనాడో మరణించిన తన కుమారులు తిరిగి తన సముఖానికి రావటం, వెంటనే వెళ్ళిపోవటం, దేవకీదేవికి, ఆశ్చర్యాన్నీ విచారాన్నీ కలి గించినై. కాని, అదంతాకూడా, శ్రీకృష్ణుని, లీలావిశేషమే అని గ్రహిం చిన వెంటనే, ఆమె, ఆనంద విషాదాలకు అతీతమైన స్థితిలోకి వెళ్ళిపో గలిగింది.

**174. *బహుళాశ్వుడు—శ్రుతదేవుడు* :**

పూర్వం, మిథిలానగరంలో, శ్రుతదేవుడనే ఒక బ్రాహ్మణు

డుండేవాడు. ఆయనకు, మరాశ అనేది ఉండేదికాదు. న్యాయంగా, ఎప్పుడు ఏది లభిస్తే అది మహద్భాగ్యమనుకుని అనుభవిస్తూ, శాంతచిత్తంతో, సంతుష్టితో, జీవయాత్ర సాగించుకునేవాడు. శ్రీకృష్ణునే ఆశ్రయించి, సర్వ వేళలా ఆయననే స్మరించుకుంటూ, ఆనందంతో కాలం వెళ్ళదీసుకునేవాడు.

ఆ సమయంలో, నిమివంశీయుడు, బహుళాశ్వుడనే ఆయన, మిథిలాధిపతిగా ఉండేవాడు. ఆయన కూడా కృష్ణభక్తుడే.

తనకు ప్రియులయిన ఆఇద్దరినీ అనుగ్రహించేనిమిత్తం, శ్రీకృష్ణు డొకసారి, బలరాముడు మున్నగు యాదవ ప్రముఖులతోనూ, వ్యాస నార దాది మహర్షులతోనూ, మిథిలానగరానికి బయలుదేరాడు. దారి పొడుగునా, ప్రజలు, ఆ మహానుభావునకు స్వాగత సత్కారాలు జరిపారు; తమ జీవి తాలకు ధన్యత్వం చేకూర్చుకున్నారు.

అలా తన సీమలో ప్రవేశించిన బలరామ కృష్ణ ప్రభృతులకు, బహుళాశ్వుడు భక్తిపూర్వకంగా స్వాగతం చెప్పాడు. వారిని, విధ్యుక్తంగా పూజించాడు. ఆ తరువాత, శ్రీకృష్ణుని ఉద్దేశించి, 'జగద్గురువులయిన మీ రీ నాడు, మీ సహచరు లందరితోనూ నా ఆతిథ్యం స్వీకరించవలసింది'; అని, అభ్యర్థించాడు. అతనికి ఆనందం కలిగించే నిమిత్తం, శ్రీకృష్ణుడు, అందుకు అంగీకరించాడు.

అంతలోనే, శ్రుతదేవు డక్కడకు వచ్చి, శ్రీకృష్ణునకు, వినయ విధేయతలతో మ్రొక్కాడు. ఆయన, బహుళాశ్వున కతిథిగా ఉండటానికి మాటయిచ్చిన విషయం తెలియక, వా రందరినీ, తన ఇంటికి రావలసిందిగా వేడుకున్నాడు అతని హృదయం తెలిసిన శ్రీకృష్ణుడు, అందుకు సమ్మ తించాడు.

శ్రీకృష్ణుడు, ముందుగా తనకు మాట ఇచ్చికూడా, శ్రుతదేవుని ఆహ్వానాన్ని అంగీకరించటం, బహుళాశ్వునకు ఆశ్చర్యం కలిగించింది. కాని, 'అదేమి' టని ఆయన్ని అడిగే సాహసం అతనికి లేకపోయింది.

అంతలో, అతిథి పూజా సమయం ఆసన్నమయింది. మహారాజు

మంగళతూర్య నాదాలతో శ్రీకృష్ణుని సమీపించి, సంకోచిస్తూనే, ఆ విషయం విన్నవించుకున్నాడు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తనవారందరితోనూ బయలుదేరి, అతని మందిరం చేరుకున్నాడు. అదంతా చూస్తూ ఉన్న శ్రుత దేవుడు, విస్మితుడయినాడు; అచ్యుతుని అభిప్రాయం అగ్రాహ్యమనుకుంటూ అలాగే నిలబడిపోయినాడు.

అంతలో, శ్రుతదేవుని కుమారు డొకడు, పరుగుపరుగున అక్కడికి వచ్చి, శ్రీకృష్ణుడు, తనవా రందరితోనూ తమ ఇంటికి విచ్చేశాడనీ, అతణ్ణి గురించి విచారించాడనీ తెలుపుకున్నాడు. అది విన్న శ్రుతదేవుడు, ఆశ్చర్యచకితుడయినాడు. ఆ వెంటనే బయలుదేరి, మనోవేగంతో, తన నివాసం చేరుకున్నాడు.

బహుళాశ్వుడు, అతిథు లందరికీ ఉత్తమాసనాలు సమర్పించుకుని, వారి పాదాలు కడిగి, ఆ పావనోదకాన్ని తన శిరాన చల్లుకున్నాడు. తన పత్నుల శిరాన చల్లాడు. ఆ తరువాత, వారందరినీ, గంధమాల్యాంబరాదులతో అర్చించాడు. రసవత్పదార్థాలతో వారికి ఆరగింపు చేశాడు. అనంతరం, వా రందరూ విశ్రమించే యేర్పాట్లు చూడసాగాడు.

అంతలో, ఒక బ్రాహ్మణు డక్కడికి వచ్చి, ఆయన్ని కలుసుకుని, ప్రసంగవశాత్తు, కళ్యాణప్రదుడయిన శ్రీకృష్ణునీ, అతని సోదరునీ, మహనీయులయిన మహర్షులనూ, శ్రుతదేవుని ఇంట్లో దర్శించుకోవటం జరిగిందనీ, అక్కడ, వారితోవిందారగించే అదృష్టంకూడా తనకు లభించిందనీ ఆనందంతో ఆయనకు నివేదించుకున్నాడు. ఆ మహానుభావులకు స్వయంగా సేవలు చేస్తూ ఉన్న శ్రుతదేవుని అదృష్టాన్ని అమితంగా శ్లాఘించాడు.

అది విన్న బహుళాశ్వుడు విస్మితుడయినాడు. ఆ వెంటనే, ఆ లీల దర్శించుకునే నిమిత్తం, ఆయనతోసహ బయలుదేరి, శ్రుతదేవుని యింటికి వెళ్ళాడు.

బహుళాశ్వుడు, శ్రుతదేవునిఇంటికి వెళ్ళేసమయానికి, శ్రీకృష్ణుడు

అక్కడ, ఒక దర్భాసనం మీద కూర్చునిఉన్నాడు. శ్రుతదేవుడూ అతని భార్యా పుత్రులూ, ఆయనకు పాదసేవ చేస్తున్నారు. ఆయన, శ్రుతదేవుని ఉద్దేశించి...

'నామది విప్రులపై గల
ప్రేమము నా తనువునందు బెట్టని కతనన్
భూమీసురు లర్థులు నీ
వీ మునులం బూజసేయు మిద్ధ చరిత్రా !'

అని, ప్రేమపూర్వకంగా ఉపదేశిస్తున్నాడు

అది విన్న బహుళాశ్వుడు, శ్రుతదేవుని అదృష్టాన్ని, తనలో తాను ప్రశంసించుకున్నాడు. అతనిపట్ల గౌరవం చూపుతూ, శ్రీకృష్ణుని సమీపించి, ఆయనకు సాగిలబడి మ్రొక్కాడు. ఆ తరువాత, ఆయన కిలా విన్నవించుకున్నాడు.

"కృష్ణా ! నువ్వు మహానుభావుడవు. నీ లీలలను గ్రహించటం గాని, నీ మాయను తరించటంగాని, నావంటి వారికి సాధ్యం కాదు.

తండ్రీ ! నువ్వు పరమేశ్వరుడవు. సర్వాంతర్యామివి. నీ దర్శనం వల్ల, నీ లీలలను కళ్ళారా చూడగలగటంవల్ల, నీ దాసానుదాసుడనైన నే నీనాడు ధన్యుడనయినాను. నీ చరణాబ్జాల నాశ్రయించినవారు, బ్రహ్మ రుద్రామరేంద్రులకంటె అదృష్టవంతులని గ్రహించగలిగాను. ఇక, నీ యీ మూర్తిమీదా, నీ పాద పద్మాలమీదా, నా మనసు సర్వదా నిలచి ఉండేటట్టు అనుగ్రహించవలసింది."

ఆ విధంగా, బహుళాశ్వుడు, నివేదించుకున్న మీదట, శ్రుత దేవుడు, తన హృదయాన్ని శ్రీకృష్ణునకు ఇలా తెలుపుకున్నాడు.

"శ్రీనాధా ! నువ్వు భక్తవత్సలుడవు. ఎల్లప్పుడూ, నీ కథలు వింటూ, నిన్ను కీర్తిస్తూ, అర్చిస్తూ ఉండే భక్తుల హృదయాంతరాళాలలో, నువ్వు, యెప్పుడూ, ప్రకాశిస్తూనేఉంటావు. రాగ ద్వేషాలు లేనివాడవైకూడా

నిన్ను భజించేవారికి సమీపస్థుడవై ఉంటావు. నీ భక్తులు కానివారికి, అతి దూరంగా చరిస్తూ ఉంటావు. అదంతా, నీ లీలావిలాసమేకాని అన్యం కాదు.

మహానుభావా ! నేను నీ దాసానుదాసుణ్ణి. నీకు నేను ఏవిధమైన సేవచేసి తరించగలనో తెలుపవలసింది. నీకు సంతుష్టిని కలిగించే ఏదో ఒక కార్యాన్ని నాచేత చేయించవలసింది. నా జీవితానికి చరితార్థత చేకూర్చ వలసింది.''

ఆ విధంగా నివేదించుకున్న బహుళాశ్వునివంకా, శ్రుతదేవుని వంకా, శ్రీకృష్ణుడు, మందహాసంచేస్తూ చూశాడు. చూసి, వారిని ఉద్దేశించి ఇలా అన్నాడు :

“ఈ మహర్షులు మిమ్మల్ని అనుగ్రహించటానికే యిలా వచ్చారు. వీరు తమ పాదరజంచేత ప్రపంచాన్నంతనూ పవిత్రంచేస్తూ, నాతో పర్యటిస్తూ ఉంటారు.

పుణ్యక్షేత్ర దర్శనంవల్లా, తీర్థాటనాదులవల్లా, మానవులు, కాలక్రమాన పవిత్రులుకావటం జరుగుతుంది. కాని, మహనీయుల దర్శనం, ఆ ఫలితాన్ని, వెంటనే కలిగిస్తుంది. వారి సందర్శనంవల్లనే, దేవతలకుకూడా పవిత్రత చేకూరుతూ ఉంటుంది.

విగ్రహారాధనంకంటె, వేదవిదులను ఆరాధించటం ఉత్తమ కార్యం.

జ్ఞాని అయిన విప్రుడు, చరాచర జీవరాసి అంతలోనూ నన్ను దర్శించుకుంటూ ఉంటాడు. విశ్వ మంతా నా రూపంగానే భావిస్తూఉంటాడు. అందుకనే, బ్రహ్మవిదులను భక్తితో అర్చించటం అవసరమని నేను మీకు తెలుపుతున్నాను. అలా చేయటం ద్వారా, మీరు, నన్ను ప్రత్యక్షంగా అర్చించినవారవుతారు. అత్యధిక ధనాన్ని వెచ్చించి, వైభవోపేతంగా కార్యాలను నిర్వహించేవారికంటె, సాధులయిన మహనీయులను సభక్తికంగా పూజించినవారు, నా ప్రేమకు, అమితంగా పాత్రులవుతూ ఉంటారు.''

అలా బోధించి, వారి అభ్యర్థనమీద, అక్కడ కొన్నిదినాలుండి, ఆ తరువాత, శ్రీకృష్ణుడు, ద్వారావతికి తిరిగి వెళ్ళటం జరిగింది.

## 175. వైకుంఠయాత్ర :

అర్జునుడు, తన మేనబావా ఆ బాల్యమిత్రుడూఅయిన శ్రీకృష్ణుని వద్ద ఉన్న సమయంలో, ఒకసారి, ఒక బ్రాహ్మణుడు, పుట్టిన వెంటనే మరణించిన తన కుమారుని తీసుకువచ్చి, రాజద్వారంలో ఉంచి, అమితంగా దుఃఖిస్తూ ఉండటం జరిగింది. అది చూసిన అర్జునుడు, ఆ విప్రుని సమీపించి, ఆయన విచారానికి కారణం తెలుపవలసిందిగా కోరాడు. అతనికి సమాధానంగా, ఆ బ్రాహ్మణు డిలా అన్నాడు :

''బ్రహ్మద్వేషీ, శఠుడూ, లుబ్ధుడూ, విషయాసక్తుడూ,
దుశ్శీలుడూ, అజితేంద్రియుడూ అయిన అధిపతి పాలనలో
ఉన్నవారు, నిరుపేదలూ నిత్యదుఃఖితులూ అవుతారు.

ఇప్పుడు, నేను, ఆ పరిస్థితిలో ఉన్నాను. నాకు జనించిన ఎనమండుగురు కుమారులు, నా కళ్ళముందే మరణించటం జరిగింది. ఇది, మా పాలకుని పాప ఫలం కాక మరొకటి కాదు.''

ఆ బ్రాహ్మణుని విచార కారణం గ్రహించిన అర్జునుడు, కొన్ని సాంత్వన వచనాలతో, అతణ్ణి ఊరడించటానికి ప్రయత్నించాడు. 'ఈమాటు నీకు పుట్టే, పుత్రుణ్ణి నేను రక్షించితీరుతాను' అని, అతనికి వాగ్దానం చేశాడు. అంతేకాదు; 'అలా చేయలేనిపక్షంలో, నేను అగ్నిప్రవేశం చేస్తాను' అని కూడా శపథం చేశాడు.

అర్జునుని పలుకులు, ఆ బ్రాహ్మణునకు ఆశ్చర్యం కలిగించినై. అందుకనే, ఆయన అతణ్ణి ఉద్దేశించి, 'ప్రథిత విక్రమశాలురైన బలరామ కృష్ణులూ, వారి కుమారుడైన ప్రద్యుమ్నుడూ, అతని పుత్రుడైన అనిరుద్ధుడూ చేయలేని పనిని నువ్వెలా చేయగలవు?' అని అడిగాడు. 'ఇంతకూ నువ్వెవరవు? అనికూడా ప్రశ్నించాడు. అలా ప్రశ్నించిన బ్రాహ్మణునకు

సమాధానంగా, అర్జునుడు...

బలుడం గాను మురాసురాంతకుడ గా ప్రద్యుమ్నుడం గాను నే
దెలియం దత్తనయుండ గా నని విరోధివ్రాతముం భీషణో
జ్జ్వల గాండీవ ధనుర్విముక్త నిశితాస్త్రశ్రేణిచే బీన్గు బెం
టలు గావించు పరాక్రమప్రకట చండస్ఫూర్తి నే బార్థుడన్'

అని, తన్ను తాను తెలియపరచుకున్నాడు. అతనికి కొంత ధైర్యాన్ని కలిగించాడు.

ఆ తరువాత, కాలక్రమాన, ఆ భూసురుని భార్య తిరిగి గర్భవతి కావటం, ప్రసవించే సమయం సమీపించటం, జరిగింది. ఆ విషయాన్ని, ఆ బ్రాహ్మణుడు, అర్జుననకు నివేదించుకున్నాడు. ఆ వెంటనే, అర్జునుడు, తన గాండీవంతో, ఆ బ్రాహ్మణుని ఇంటికి వెళ్ళాడు. అలావెళ్ళి, తన దివ్యాస్త్రాలతో, ఆ సూతికా భవనాన్ని. అన్ని దిక్కులా బంధించాడు; దాన్ని ఒక శరపంజరం మాదిరి రూపొందించాడు.

అది చూసిన ఆ బ్రాహ్మణుడు, ఆపైన, మృత్యుదేవత ఆ యింట్లో ప్రవేశించటం అసంభవమని నిశ్చయించుకున్నాడు. ఆవిధమైన విశ్వాసంతోనే ఉన్న అర్జునుని సమీపించి, అతని ప్రక్కనే, నిశ్చింతగా కూర్చున్నాడు.

అంతలో, పురిటింటిలోనుంచి, పుట్టిన పిల్లవాడు మింటికెగిరి పోతున్నాడన్న అరుపులు వినిపించినై. అదివిన్న అర్జునుడు, అదరిపడ్డాడు; అవనతవదనుడైనాడు. అదిచూసిన విప్రుడు, అతణ్ణి అమితంగా తూలనాడాడు. ఆ సందర్భంలోనే...

'ఎక్కడి పాండుతనూభవు
డెక్కడి విలుకాడు వీని కెక్కడి సత్యం
బెక్కడి గాండీవము దన
కెక్కడి దివ్యాస్త్ర సమితి యేమనవచ్చున్'

అని కూడా హేళన చేశాడు.

చెవులకు ములుకులై తోచిన ఆ పలుకులు ఆలకించి, అర్జునుడు, ఆ వెంటనే బయలుదేరి, తన యోగ శక్తిద్వారా, యమపురానికి వెళ్ళాడు. కాని, అక్కడ ఆ బాలుడు అతనికి కనిపించలేదు. అది గ్రహించి, అతను, దిక్పాలుర పురాలన్నీ గాలించాడు. అయినా, ఆ బాలుని జాడ అతనికి తెలియలేదు. ఆ తరువాత, స్వర్గ పాతాళాలకు పోయి చూశాడు. అదీ ప్రయోజన శూన్యమే అయింది. అది కారణంగానే, అతడు, తిరిగి కుశస్థలి చేరుకుని, తన శపథా న్ననుసరించి, అగ్ని ప్రవేశం చేయటానికి పూనుకున్నాడు.

అదిగ్రహించిన శ్రీకృష్ణుడు, అతణ్ణి సమీపించి, 'ఆ కుఱ్ఱవాణ్ణి నేను నీకు చూపిస్తాను' అని, మాట ఇచ్చాడు. అతడు అగ్నిప్రవేశం చేయకుండా వారించాడు. ఆ వెంటనే, తన దివ్యరథంమీద అతణ్ణి కూర్చోపెట్టుకుని బయలుదేరాడు.

అలా బయలుదేరిన శ్రీకృష్ణుని రథం, సప్తద్వీపాలూ దాటింది. సప్త సముద్రాలనూ తరించింది. సప్త కులగిరులనూ అధిగమించింది. అంధకార బంధురమైన ఒక సీమలో ప్రవేశించింది.

అక్కడికి చేరుకునేటప్పటికి, ఆ రథాశ్వాలకు, దారికనిపించలేదు. అది కారణంగా, అవి, ముందుకు పోలేకపోయినై. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వేయి సూర్యుల కాంతితో ప్రకాశించే తన చక్రాన్ని ముందుకు వదిలాడు.

ఆ చక్రం కల్పించిన కాంతి మూలంగా, చీకటి అంతా చెదరిపోయింది. మార్గం సుబోధకమయింది. రథం, యథాప్రకారంగా ముందుకు పోసాగింది.

అప్పుడు, నలువంకలా ప్రసరించిన ఆ పరమతేజాన్ని, అర్జునుడు చూడలేకపోయినాడు. కళ్లుమూసుకున్నాడు. అలా ఉన్న అర్జునునితో, ఆ రథం, వెళ్ళి వెళ్ళి, ఒక మహాసముద్రంలో ప్రవేశించింది.

ఆ జలనిధి మధ్యభాగంలో, కోటి సూర్యుల కాంతితో ప్రకాశించే ఒక దివ్యభవనం, కృష్ణార్జునులకు గోచరించింది. అదే, పరమ భాగవతుల నివాసమైన దివ్యధామం.

అక్కడ, వేయి ఫణిమణులతో వెలుగులు చిమ్ముతూ, రెండువేల కళ్ళతో ప్రకాశిస్తూ, విషధూమరేఖల మాదిరి ఉన్న జిహ్వలతో, కైలాసగిరి వంటి దేహంతో ఒప్పారుతున్న భోగికులేంద్రునిమీద సుఖాసీనుడై ఉన్న శ్రీమన్నారాయణుని, కృష్ణార్జునులు సమీపించారు. నీలమేఘచ్ఛాయతో, పూర్ణచంద్రునివంటి ముఖంతో, పద్మపత్రాలవంటి నేత్రాలతో, మృదుమధుర మందహాసంతో, కిరీట కుండలాద్యలంకారాలతో, అష్టబాహువులతో, శంఖ చక్ర గదాది సాధనలతో, కౌస్తుభమణితో, వనమాలతో, విరాజిల్లుతూ, సునం దాది పార్షదులమధ్య, మహర్షి జనసేవితుడై, ప్రకాశమానుడై ఉన్న ఆయ నకు అంజలించారు; భక్తి పూర్వకంగా ఆయన్ని స్తుతించి, ప్రసన్నుని చేసు కున్నారు.

ఆపైన, శ్రీమన్నారాయణుడు, వారినిచూశాడు. పరమానందంతో మందహాసం చేశాడు. అనంతరంవారిని ఉద్దేశించి...

"ధరణికి బ్రేగగు దైత్యుల
బొరిబొరి వధియించి ధర్మమున్ నిలుపుటకై
ధర జనియించితి రిరువురు
నర నారాయణు లనంగ నా యంశమునన్.
ఆరూఢనియతితో బెం
పారిన మిము నిమ్మునీంద్రు లర్థిం జూడం
గోరిన మీ వచ్చుటకై
ధారుణిసురసుతుల నిటకు దగ దేవలసెన్"

అని, వారికి విశదపరచాడు. ఆ కుఱ్ఱవాళ్ళను వారికి అప్పగించాడు.

ఆ తరువాత, ఆ మహానుభావుని దగ్గర సెలవుతీసుకుని, విప్ర

సుతులతోసహా బయలుదేరి, కృష్ణార్జునులు, తిరిగి కుశస్థలి చేరుకున్నారు. ఆ పిల్లలను వారి తండ్రికి ఒప్పజెప్పి, అతని సన్నుతి నందుకున్నారు.

## *176. బృందావన గమనం :*

ఉద్ధవునిద్వారా తనవారి వియోగవ్యథను గ్రహించిన శ్రీకృష్ణునకు, ఒకసారి బృందావనానికిపోయి, వారికి మనశ్శాంతిని చేకూర్చాలన్న అభిప్రాయం కలిగింది. ఆ వెంటనే ఆయన, ఉద్ధవునితోసహా బయలుదేరాడు.

అలా వెడుతూఉండగా, ఆయనకు, మధురాతి మధురమైన పూర్వస్మృతు లెన్నో కలిగినై. పూర్వం, తాను, తన హృదయాన్ని అపహరించిన గోపికలతోనూ గోపకులతోనూ గోవత్సలతోనూ విహరించిన బాటలూ తోటలూ నికుంజాలూ చూసి మురిసిపోయినాడు. గోపకన్యలతో తను జలక్రీడ సలిపిన కాళింది కనిపించగానే, పరమానందం పొందాడు గోవర్ధనగిరి తలపుకురాగానే, పులకించాడు. గోవుల అంభారవం వినిపించగానే, ఆనందాశ్రులు రాల్చాడు.

శ్రీకృష్ణుని రథచక్రాల సవ్వడీ గుఱ్ఱపు గిట్టల చప్పుడూ చెవుల బడగానే, గోకులమంతా, చంద్రోదయపు సమయాన సముద్రం మాదిరి ఉత్సాహంతో ఉప్పొంగిపోయింది. అంతలో, వారికి, మురళీరవం వినిపించింది ఆ వెంటనే, గోవులూ, వాటిని అనుసరించి గోవత్సలూ, ఆ వేణునాదం వినిపించిన దిక్కుగా పరుగెత్తినై.

శ్రీకృష్ణుడు, దూరంనుంచే వాటిని చూశాడు. చూసి, రథగమన వేగాన్ని హెచ్చించి, వాటిని సమీపించాడు.

అంతలో, అవి, అంభారవం చేస్తూ, రథాన్ని చుట్టేసుకున్నై. మోరలెత్తి, కృష్ణయ్య వంకనే చూడసాగినై. కన్నీరుపెట్టుకున్నై. అదంతా గ్రహించిన కృష్ణయ్య, రథం నుంచి క్రిందకి ఉఱికాడు; వాటి నన్నింటినీ, పేరు పేరునా పలుకరించాడు. వాటి మూపులను, ప్రేమతో, మృదువుగా

నిమిరాడు; చరిచాడు.

ఆ సమయానికి, శ్రీకృష్ణుని సఖులు, శ్రీదామాదులు, అక్కడికి చేరుకున్నారు. కృష్ణయ్య, పరమప్రేమతో, వారిని ఆలింగనం చేసుకున్నాడు. ఆ తరువాత, వారు, పరస్పరం కుశలప్రశ్నలు వేసుకున్నారు.

అంతలో, భేరీ మృదంగాది వివిధ వాద్యాలతోనూ, పూర్ణకుంభాలతోనూ, వేదనాదంతోనూ, జయజయధ్వానాలతోనూ, చందనాక్షతలతోనూ, కుసుమ హారాలతోనూ, వ్రజవాసినులయిన సుమంగలులతోనూ, గోపికలతోనూ, దాసదాసీజనంతోనూ, నందాదులు, శ్రీకృష్ణుని సమీపించారు. ఆయనకు నీరాజన లిచ్చారు. ఆలింగన పూర్వకంగా, ఆయనపై తమకున్న ప్రేమను వ్యక్తీకరించుకున్నారు.

శ్రీకృష్ణుడు, ఆపైన, నందాదులకు పాదాభివందనలు చేశాడు. గోప వృద్ధు లందరినీ పరామర్శించాడు. మిగిలిన పిన్న పెద్దలను ఉచితరీతిని, ప్రేమ పురస్సరంగా పలుకరించాడు.

అనంతరం, వారు, నందవ్రజంచేరుకున్నారు. అప్పుడు, యశోదా రోహిణులు, శ్రీకృష్ణుని కౌగిటగుచ్చుకుని, ఆనందబాష్పాలు రాల్చారు. అతనిచేత మంగళ స్నానాలు చేయించి, అతణ్ణి అలంకరించారు.

ఆ తరువాత, గోపికలు, శ్రీకృష్ణుని సమీపించి, వివిధమైన కానికలు సమర్పించుకుని, అతడు, తమ్ము గుర్తు ఉంచుకున్నందుకూ, అతని అనుగ్రహం తమమీద ఉన్నందుకూ, అతనికి, తమ కృతజ్ఞతను తెలుపుకున్నారు.

ఆపైన, శ్రీకృష్ణుడు, అక్కడ, ఎందరు గోపికలు ఉన్నారో అందరికీ, అన్ని రూపాలలోనూ, ఒకే సమయాన, వేరువేరుగా దర్శన మిచ్చాడు. వారితో, ప్రత్యేకంగా సంభాషణలు జరిపాడు. వారికి, పరమానందం కలిగించాడు. అక్కడినుంచి, వారితోసహా గోవర్ధనాద్రికి వెళ్ళి, యథేచ్ఛగా క్రీడించాడు. యమునానదికిపోయి, జలక్రీడ సలిపాడు.

*177*. ఋభు మహర్షి :

ఆ ప్రాంతంలో, అప్పుడు, శ్రీకృష్ణునకు, ఋభుడనే ఒక మహర్షి కనిపించాడు. ఆయన, అక్కడ, అరువదారువేల సంవత్సరాలనుంచీ, నిరాహారదీక్షతో, తీవ్రమైన తపస్సు చేసుకుంటున్నాడు. ఆయన, తన భక్తుడు కావటంవల్ల, శ్రీకృష్ణు డాయన్ని సమీపించి, పరామర్శించాడు. కాని, సమాధిస్థితుడై ఉన్న ఋభుడు పలుకలేదు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, ఆయనలో ప్రవేశించాడు.

తన హృదయంలో అలా దర్శన మిచ్చిన శ్రీకృష్ణుని చూసి, ఋభుడు పరమానందం పొందాడు. ఆ పైన, కళ్ళు తెరచాడు; తన ఎదుట ఉన్న శ్రీకృష్ణుని సందర్శించుకున్నాడు.

అలా అనుకోకుండా దర్శన మిచ్చిన శ్రీకృష్ణునకు, ఋభుడు ప్రణమిల్లాడు. ఆయన్ని అస్తోకంగా స్తుతించాడు. తన తపస్సు ఫలించిందన్న మహదానందంతో, ఆయన పాదాలమీద వ్రాలాడు; ఆయననే హృదయంలో నిలుపుకుని, ప్రాణం వదిలాడు. ఆ వెంటనే, ఆయన జ్యోతి, శ్రీకృష్ణునిలో లయించిపోయింది. అది చూసిన గోపికాజనం, అమితాశ్చర్యంతో, శ్రీకృష్ణుని చుట్టూ చేరారు; ఆయన్ని అమితంగా స్తుతించారు.

అంతలో, శ్రీకృష్ణుడు, ఆ మహర్షిని, పేరుపెట్టి పిలిచాడు. ఆ వెంటనే, ఆయన వచ్చి, శ్రీకృష్ణుని ఎదుట నిలబడ్డాడు.

అలా తిరిగి వచ్చిన ఋభుని, శ్రీకృష్ణుడు ఆలింగనం చేసుకున్నాడు. తన దక్షిణ హస్తంతో ఆయన శిరస్సును నిమిరాడు. ఆ మీద, ఋభుడు, తేజోరూపంలో, గోలోకానికి వెళ్ళిపోవటం జరిగింది.

*178*. సుభద్ర :

శ్రీకృష్ణుని చెల్లెలు సుభద్ర. ఆయన మేనత్త కుమారుడూ ప్రాణమిత్రుడూ అయినవాడు అర్జునుడు. ఆ సుభద్రార్జునులు పరస్పరం

ప్రేమించుకున్నారు అది గ్రహించిన శ్రీకృష్ణుడు, వారు భార్యా భర్తలైతే బాగుండునని యెప్పుడూ అనుకుంటూ ఉండేవాడు.

కాని, సుభద్రను అర్జునున కివ్వటం బలరామున కిష్టం లేదు. అత డామెను, దుర్యోధనున కిచ్చి వివాహం చేయాలని నిర్ణయించుకున్నాడు అది తలచుకున్నప్పుడల్లా, శ్రీకృష్ణుడు బాధపడుతూ ఉండేవాడు. అర్జునుని పట్ల బలరామున కున్న వైముఖ్యాన్ని యెలా తొలగించటమా అని ఆలోచిస్తూ ఉండేవాడు.

ఆ పరిస్థితి అలా ఉండగా, ఇంద్రప్రస్థంలోఉన్న పాండుపుత్రులు, నారదుని సూచనమీద, పాంచాలి విషయంలో, తమ మధ్య ఏర్పరచుకున్న నియమాన్ని, అర్జునుడు, ఒక విషమ పరిస్థితిలో ఉల్లంఘించటం, అది కారణంగా, అతడు, నియమానుసారం, తీర్థయాత్రకు బయలుదేరటం, జరిగింది.

అలా బయలుదేరిన అర్జునుడు, యాత్రావసాన సమయానికి, ప్రభాసతీర్థంలో ఉన్నాడు. అక్కడికి చేరుకోగానే, అతనికి, అచటి కనతి దూరంలో, ఉన్న ద్వారావతీ, అక్కడ ఉన్న తన మేనమామ కూతురు సుభద్రా, స్ఫురణకు వచ్చారు. అది కారణంగా, అతడు, ఒకసారి, అక్కడికి పోయి, తన ప్రాణమిత్రుడయిన శ్రీకృష్ణునీ, అందాలరాసి అయిన ఆయన చెల్లెలినీ చూడా లనుకున్నాడు. ఆ నిర్ణయంతోనే, అతడు, ఒక త్రిదండి సన్న్యాసి రూపంలో అక్కడకు వెళ్ళాడు, వెళ్ళి, అక్కడే, చాతుర్మాస్యదీక్షతో ఉన్నవానిమాదిరి, కాలం వెళ్ళదీయసాగాడు

అర్జును డలా ఉన్న సమయంలో, ద్వారావతిలోని ప్రజలూ, బలరాముడూ కూడా అప్పుడప్పుడు ఆయన్ని సందర్శించుకోవటం, ఆయనకు అతిథిపూజలు చేస్తూ ఉండటం జరిగేది. అయినా, వా రెవరూ, ఆయన్ని గుర్తించలేదు.

ఒకసారి, బలరాముడు, ఆయన్ని తన మందిరానికి ఆహ్వానించి, యతిపూజ చేసి, సభక్తికంగా భిక్షపెట్టాడు. ఆ సమయంలో, అర్జునుడు,

సుభద్రను చూడటం జరిగింది. అమిత సౌందర్యవతీ, నవయౌవనాంగి అయిన మేనమామ కూతుర్ని చూడగానే, అర్జునుని మనస్సు పరవశ మయింది ఎలాగైనా ఆమెను తనదాన్ని చేసుకుతీరాలన్న అభిప్రాయం అతనిలో కలిగింది.

అర్జునుడే ఆ యతి రూపంలో ఉన్నాడని తెలియకపోయినా, సుభద్రకూడా, అతణ్ణి ప్రేమించింది. ఆ క్షణంలోనే, అతనికి, తన హృదయంలో, ఒక పవిత్రస్థానాన్ని కల్పించుకుంది. అప్పటినుంచీ, మృదు మధుర భావాలతో, అతణ్ణి సేవించుకోసాగింది.

కాలక్రమాన, సుభద్రను అపహరించుకు పోవటానికే అర్జునుడు నిర్ణయించుకున్నాడు. దానికి తగిన అవకాశం కోసమే అతడు ఎదురు చూస్తూ ఉన్నాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, ఆ రహస్యాన్ని, దేవకీ వసుదేవులకు తెలియపరచాడు; గాంధర్వపద్ధతిలో, అర్జునుడు, సుభద్రను వివాహం చేసుకోవటానికి వారు అంగీకరించేటట్టు చేశాడు.

ఆ సమయంలో, అక్కడ, రైవతక మహోత్సవాలు జరుగుతున్నై. బలరాముడూ, తదితర యాదవ ప్రముఖులూ ఆ మహోత్సవ నిర్వహణలో నిమగ్నులై ఉన్నారు. దేవకీ వసుదేవులూ, శ్రీకృష్ణుడూ ఆయన అష్ట పత్నులూ, సుభద్రా ఆమె చెలికత్తెలూ, మరికొందరు బంధువులూ మాత్రమే, ద్వారావతిలో ఉన్నారు.

ఆ పరిస్థితినంతనూ, అర్జునుడు, ఎప్పటికప్పుడు గ్రహిస్తూనే ఉన్నాడు. అవకాశం లభించినప్పుడల్లా, తన మేనబావతో సంప్రదింపులు జరుపుతూనే ఉన్నాడు. ఉత్సవ సందర్శనార్థం, వా రెవరెవరు, యెప్పు డెప్పుడు నగరంనుంచి బయలుదేరేదీ, సవివరంగా తెలుసుకుంటూనే ఉన్నాడు.

అంతలో, ఒకరోజున, దేవకీ వసుదేవులు, ఒక దివ్యరథా న్నధిరో

హించి, రైవతకాద్రికి బయలుదేరారు. మరొక రథంలో, శ్రీకృష్ణుడు, తన దేవేరులతో, వారిని అనుసరించాడు. ఆపైన, సుభద్ర యెక్కిన రథం, ఆ రథానికి వెనుక, కొందరు యాదవవీరుల వాహనాలూ, కదలటం జరిగింది.

అది అదనుగా తీసుకుని, అర్జునుడు, మార్గమధ్యంలో, సుభద్ర ఉన్న రథంలోకి అమాంతంగా దూకాడు. రథచోదకుని ఒక ప్రక్కకు నెట్టివేశాడు. అతని స్థానాన్ని ఆక్రమించుకున్నాడు; రథాన్ని ఇంద్రప్రస్థం వేపుగా పరుగెత్తించసాగాడు.

అది చూసిన కొందరు యోధులు, అతని గమనానికి అవరోధం కలిగించాలని ఎంతగానో ప్రయత్నించారు. కాని, ప్రయోజనం లేకపోయింది.

అది జరిగిన కొంతసేపటికి, ఆ వార్త, బలరామున కందింది. అతడు, అమితంగా ఆవేదన పడ్డాడు. ఆవేశపరవశుడైనాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, అతని పాదాలమీదపడి, అర్జునుడు చేసిన దోష మేమీ లేదనీ, దోషమనేది ఏమాత్రమైనా ఉన్న పక్షంలో, అది తనదేననీ, రుక్మిణీహరణ రూపంలో తను చూపిన మార్గాన్నే, తన మిత్రుడు, ఆదర్శంగా ఉంచుకోవటం, అనుసరించటం, జరిగిందనీ, నివేదించుకున్నాడు.

ఆ పరిస్థితినంతనూ అర్థం చేసుకున్న బలరాముడు, ఆ సందర్భంలో, అర్జునునకు అండగా ఉన్నవాడు. తన తమ్ముడేనని తేల్చుకుని, తన ఆవేశాన్ని ఉపశమింప చేసుకున్నాడు. ఆగ్రహాన్ని అనుగ్రహంగా మార్చుకున్నాడు. అది కారణంగానే, ఆ తరువాత, ఆ నూత్నదంపతులకు, అతనివద్దనుంచి అమూల్యమైన కానికలు అశేషంగా చేరటం జరిగింది.

## *179. దుర్వాసుడు :*

పాండుపుత్రులు అరణ్యవాసం చేస్తూ ఉండగా, ఒకసారి, దుర్వాసుడు, వారికి అతిథిగా వెళ్ళాడు. ఆ వెళ్ళటం కూడా, పదివేలమంది శిష్యులతో, అకాలంలో వెళ్ళాడు.

ఆ మహర్షిని అలా కోరి పంపినవాడు దుర్యోధనుడు. పాండు పుత్రులను ధర్మమార్గాన జయించటం దుర్ఘటమని తేల్చుకున్న అతడు, దుర్వాసుని ఆగ్రహానికి వారిని ఆహుతిచేసి, శాంతి పొందాలనుకున్నాడు. అది కారణంగానే, ఆ సమయంలో తనపట్ల ప్రసన్నుడై ఉన్న ఆ మహర్షిని సమీపించి, 'ప్రారబ్ధవశాన పడరాని పాట్లు పడుతున్న పాండుపుత్రులకు, మా అన్నదమ్ములకు కూడా మీ సేవాభాగ్యాన్ని ప్రసాదించి, వారిని తరింపచేయవలసింది' అని కోరాడు. తన కోరికను తీర్చేటట్టు ఆయన దగ్గర మాట తీసుకున్నాడు.

అరణ్యవాసం చేస్తున్న పాండుపుత్రులు, అమితకోపిష్టి అయిన ఆ మహర్షికి తగిన ఆతిథ్యా న్నివ్వటం అసంభవమనీ, అది కారణంగా, ఆ మహర్షి ఆగ్రహించుకోవటం, ఆయన కోపాగ్నికి వారు ఆహుతి కావటం తథ్యమనీ, అతడు భావించాడు. అవిధమైన అభిప్రాయంతోనే, అతడు, ఆ మహర్షి నలా ప్రార్థించి పంపటం జరిగింది.

దుర్వాసమహర్షి తమ్ము సమీపించే సమయానికి, పాండుపుత్రులు, అతిథి పూజాదికాలు పూర్తిచేసుకుని, అభ్యాగతులకూ ఆశ్రితులకూ షడ్రసో పేతంగా భోజనాలు పెట్టి, తమ భోజనాలు ముగించుకుని, విశ్రాంతి తీసు కుంటున్నారు. సూర్యభగవానుడు వారికి ప్రసాదించిన అక్షయపాత్రద్వారా, వారి కానాడు కలుగవలసిన ప్రయోజనమంతా కలిగింది. తిరిగి, మరుసటి దినం మధ్యాహ్నంవరకూ, దానివల్ల వారు పొందగల ప్రయోజనం ఏమీ ఉండదు.

అటువంటి సమయంలో, దుర్వాసమహర్షి అలా ప్రత్యక్షం కావటం తనకూ తనవారికీ భోజనాలు పెట్టేఏర్పాట్లుచేయవలసిందని యుధిష్ఠిరుః ఆదేశించటం జరిగింది. అది కారణంగానే, ఆ మహర్షికి అర్హమైన ఆఃథ్యాన్నిచ్చే అదృష్టం ఆనాటికి తమకు లేక పోయిందే అనీ, అది కారణంగ ఆయన ఆగ్రహానికి గురికావలసి వస్తుందేమోననీ, ధర్మరాజాదులు అః తంగా వేదనపడసాగారు.

పాంచాలి ఆ పరిస్థితి నంతనూ అర్థం చేసుకుంది. ఆ సమయంలో, ఆ ఆపదనుంచి తమ్ము తప్పించగలవాడు, ఆశ్రితజన మందారుడైన ఆ శ్రీకృష్ణు డొక్కడే నన్న విశ్వాసంతో, ఆయన్ని, హృదయపూర్వకంగా స్మరించుకుంది. ఆ సందర్భంలోనే...

'కృష్ణా ! నువ్వు భక్తవత్సలుడవు. మేము నీ భక్తులం; నీ చరణాబ్జాలనే ఆశ్రయించి జీవిస్తున్న ప్రాణులం.

నువ్వు ఆపదోద్ధారకుడవు. మే మిప్పుడు, అంతుతెలియని విపత్సముద్రంలో మునిగి ఉన్నాము. నిన్ను ఆశ్రయించి జీవించేవారికి, యెప్పుడు యే ఆపద సంభవించినా, నువ్వు అండగా నిలబడతావు. వారి ప్రార్థన నంగీకరించి, వారికి రక్షణ నను గ్రహిస్తావు. ఆ విధమైన నీ అనుగ్రహాన్ని, ఇంతకుముందు, మేము. యెన్నిసార్లో అనుభవించాము. మా పట్ల నువ్వు ప్రదర్శిస్తూ వచ్చిన అభిమానానికి, మేము, మా కృతజ్ఞతను. సర్వవేళలా తెలుపుకుంటూనే ఉన్నాము.

అన్నా ! మేము, ఈ రోజున, మరొక మహోపద్రవాన్ని ఎదుర్కోవలసి వచ్చింది. ఈ సమయంలోకూడా, మేము, నిన్నే నమ్ముకుని ఉన్నాము. నీ చరణాబ్జాలనే ఆశ్రయించి ఉన్నాము. నీ అనుగ్రహం కోసమే ఎదురు చూస్తున్నాము. ఇప్పుడు కూడా, నువ్వే మమ్మల్ని రక్షించాలి. అమిత కోపనుడైన ఈ దుర్వాసుని ఆగ్రహానికి, నీ భక్తులైన కౌంతేయులు ఆహుతి కాకుండా చూడాలి;'' అని, దీనాతిదీనంగా ప్రార్థించింది.

పరమ పతివ్రత అయిన పాంచాలి, ఆ విధంగా ప్రార్థించే సమయానికి, శ్రీకృష్ణుడు, రుక్మిణీదేవితో, తన విలాస మందిరంలో ఉన్నాడు. ఆమెదైన దీనాలాపం చెవులబడగానే, ఉన్నవాడున్నట్టుగా, అక్కడినుంచి బయలుదేరి, మనోవేగంతో, కామ్యకవనం చేరుకున్నాడు; యుధిష్ఠిరుని శిబిరంలో ప్రవేశించాడు.

జగన్నాథుడయిన శ్రీకృష్ణుడు, ఆ విధంగా, అనుకోకుండా దర్శన మివ్వటం, ధర్మరాజాదులకు ఆశ్చర్యం కలిగించింది. వారు, ఆయ

నకు స్వాగతం చెప్పబోతూ ఉండగానే, ఆయన, గబగబా, పాంచాలిని సమీపించాడు. సమీపించి, తనకు అమితమైన ఆకలి అవుతున్నదనీ, అప్పుడు ఏది ఉంటే అది పెట్టి, ముందుగా తన క్షుద్బాధను తొలగించవలసిందనీ, అమెను కోరాడు.

ఆపదోద్ధారకుడయిన ఆమహానుభావుని ఆగమనంద్వారా, తమకు సంభవించిన ఆపద తొలగిపోయినట్టే భావిస్తున్న పాంచాలికి, ఆయన పలుకులు అశనిపాతం మాదిరి తోచినై. అయినా, ఆమె, ఆ వెంటనే, మనసును కుదుట పఱచుకుంది. ఆయన ఆపద్బాంధవుడు. తన్ను ఆశ్రయించినవారి ఆపదలను తొలగిస్తాడే కాని, యే పరిస్థితిలోనూ, వారి ఇడుమలను ఇనుమడింపజేయడు. అది, ఆమెదయిన దృఢ విశ్వాసం. ఆ విశ్వాసంతోనే, ఆమె, ఆయన పలుకులను పరిహాస వచనాలుగా భావించి, ఆయన పాదాల మీదనే చూపు నిలిపి, అలాగే నుంచుని ఉంది.

అంతలో, శ్రీకృష్ణుడు, 'అమ్మా ! ఆలస్యం చేయవద్దు. నాకు అమితమయిన ఆకలి అవుతోంది' అని హెచ్చరించాడు. 'ఏదైనాసరే. ఎంత ఉన్నాసరే. వెంటనే తెచ్చిపెట్టవలసింది; ఆ తరువాత యితర విషయాలు చూసుకోవచ్చు' అని కూడా తొందరచేశాడు.

శ్రీకృష్ణుడు, ఆ విధంగా తన్ను తొందరపెట్టడంలో, యేదో నిగూఢమైన భావం ఉండి ఉంటుందని, ద్రౌపదికి అప్పుడు తోచింది. అది కారణంగానే, ఆమె, వంచిన తల యెత్తకుండా, వెంటనే, వంట ఇంట్లోకి వెళ్ళింది. వెళ్ళి, ఆ మహానుభావునకు అర్పించుకోదగ్గది, ఏదైనా దొరుకుతుందేమోనని చూసింది. కాని, ఆమె ప్రయత్నమంతా వ్యర్థమే అయింది. ఎక్కడా ఏమీ కనిపించలేదు. అప్పుడు, ఆమె అనుభవించిన నైరాశ్యానికి అంతనేది లేకుండా పోయింది.

ఆ సమయంలో, ఆమె దృష్టి, ఆ ప్రక్కనే, తొలిచి శుభ్రపరచి ఉంచిన అన్నపుగిన్నె మీద పడ్డది. అందులో ఏమీ ఉండదని ఆమె అభిప్రాయం. అయినా, ఆమె, పరీక్షగా చూసింది. చూసి, ఆశ్చర్యంతో, సంతృ

ప్తితో, తల పంకించింది. మరుక్షణంలోనే, ఆమె, అందులో దొరికిన ఒకే ఒక మెతుకుతో, మాధవుని సమీపించింది. ప్రేమ పూర్వకంగా, దాన్ని, అయన నోటికి అందిస్తూ, 'అనన్య గతికులమైన మా యీ అత్యల్పోపహారం, విశ్వాత్ముడూ యజ్ఞభోక్తా సర్వలోకాధారుడూ అయిన మా అన్నను సంతుష్టి పరచాలి' అనుకుంది. మానసికంగా, ఆయనకు, నమోవాకా లర్పించుకుంది.

అంతే శ్రీకృష్ణు డా మెతుకును సంతోషంతో స్వీకరించాడు. సంతుష్టితో త్రేన్చాడు. సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన ఆయన, ఆ విధంగా, సంతుష్టి చెందటంతో, చతుర్దశభువనాలూ సంతుష్టి చెందినై. జీవరాసి అంతా, పంచ భక్ష్య పరమాన్నాలతో భోజనం చేసినట్టు, సంతృప్తితో త్రేన్చింది. స్నానార్థం నదికి వెళ్ళి వస్తున్న దుర్వాస మహర్షీ ఆయన శిష్యులూ కూడా, అలా ఆకలితీరినవారై, పాండుపుత్రుల మాటనే మఱచి పోయినారు; తమ దారిన తాము వెళ్ళిపోయినారు

శ్రీకృష్ణుడు అదంతా గ్రహించాడు. మందహాసంచేస్తూ, యుధిష్ఠిరాదులను సమీపించాడు. 'మహాసాధ్వి అయిన మా చెల్లెలి తేజం, ఆ మహర్షిని, మళ్ళీ ఇటురాకుండా చేసింది' అని, వారికి తెలియబరచాడు.

అదంతా, విచిత్రంగా భావిస్తూ ఉన్న ధర్మరాజాదులు, దుశ్శాసనుని చేతిలో, ద్రుపదరాజ పుత్రి పరాభవంపాలు కాకుండా అనాడు కాపాడినట్టే, ఈనాడు, దుర్వాసుని దురాగ్రహానికి తాము గురికాకుండా రక్షించిన శ్రీకృష్ణుని, పలువిధాలప్రస్తుతించారు. తమకృతజ్ఞతను, ఆయనకు, హృదయపూర్వకంగా తెలుపుకున్నారు. ఆ మీద, శ్రీకృష్ణుడు, పరమానందంతో ద్వారావతి చేరుకున్నాడు.

## *180.* బాణాసురుడు :

ప్రహ్లాదుని కుమారుడయిన విరోచనుని మనుమడు బాణుడు. అతడు శోణపురాధిపతి. జ్ఞాని. సత్యవ్రతుడు. దానశీలి దృఢ సంకల్పుడు. మహేశ్వర భక్తుడు. అందుకనే, దేవతలుకూడా, మహేశ్వరుని ఆదేశం

ప్రకారం, అతనికి ఊడిగం చేస్తూ ఉండేవారు.

అత డొకసారి, కుబేర శైలానికి వెళ్ళాడు. అలా వెళ్ళిన అతనికి, షణ్ముఖుని లాలిస్తున్న ఆది దంపతుల దర్శన మయింది.

షణ్ముఖుని తేజం చూసి, బాణుడు విస్మితుడయినాడు. ఏ తపస్సుచేసి ఆ చిరంజీవి ఉమాసుతుడై, శంకరుని అలా ప్రేమపాశబద్ధుని చేశాడో, అదే విధమైన తపస్సును, అదేవిధమైన ఫలితాన్ని కోరి, తను కూడా చేయాలనుకున్నాడు. ఆమీద, భక్తియోగంద్వారా, మనోవాక్కాయ కర్మలను ఏకీకృతం చేసి, నిష్ఠతో, మహేశ్వరుని అర్చింపసాగాడు.

ఆ తపస్సు అనేకసంవత్సరాలు జరిగింది. అతనిభక్తికి మెచ్చి, శంకరుడు, పార్వతి నుద్దేశించి, 'ఇతడు నా భక్తుడు. మన కుమారుని తరు వాతివానిగా, ఇతణ్ణి, నువ్వు, ప్రేమతో చూసుకోవలసింది'అని, అతణ్ణి ఆమెకు ఒప్పచెప్పాడు. ఆ పైన, అతడు ఉండటానికి శోణపురా న్నిచ్చాడు. ఆ నగరరక్షణభారాన్ని తను వహించాడు. ఆ సందర్భంలోనే, అతనికి వాహ నంగా ఉండే నిమిత్తం, కుమారస్వామి, ఒక దివ్య మయూరాన్ని అతనికి ప్రసాదించటం జరిగింది.

ఆ గర్వంతో, బాణుడు, దేవ గంధర్వ భుజగాదులనూ, యక్ష భూతాదులనూ, ధిక్కరింపసాగాడు. తన కెవరూ సాటికారన్న అహమికతో ప్రవర్తించ సాగాడు. ఆ సమయంలోనే. అత డొకసారి, మహేశ్వరుని ఉద్దేశించి, 'స్వామీ ! పరమేశ్వరుని భక్తులు కూడా, తీరని కోరికలతో పరి తపించి పోవలసిందేనా !' అని ప్రశ్నించాడు.

బాణుని ఆవేదన, శంకరునకు అవగతం కాలేదు. అందుకనే, ఆయన, అతణ్ణి ఉద్దేశించి, 'నీ అభిప్రాయమేమిటో నివేదించుకోవలసింది' అన్నాడు. అది అదనుగా తీసుకుని, బాణుడు...

'అనిలో నన్ను నెదిర్చి బాహుబల శౌర్య స్ఫూర్తి తోరాడ జా
లిన వీరుం డొకడైన బందెమునకున్ లేడయ్యె భూమండలి

న్న నయంబున్ భవదీయదత్త కరసాహస్రంబు కండూతి వా
యు నుపాయంబును లేద యా భరము నెట్లోర్తు న్నుమానాయకా,

అని, మనవి చేసుకున్నాడు

మహేశ్వరునకు, అది, విపరీతమైన కోరికగా తోచింది. కాని, చేయగల దేమీ లేక...

'విను మూఢ హృదయ నీ కే
తన మెప్పు డ కారణంబ ధారుణిపై గూ
లును నపుడ నీ భుజావలి
తునియగ నాయంతవానితో నని గల్గున్'

అని, అతణ్ణి సమాధానపరచి పంపించాడు.

ఆ క్షణం నుంచీ, బాణుడు, తన కేతన మెప్పుడు కూలుతుందా అనీ, తనకోరిక ఎప్పుడు తీరుతుందా అనీ, నిమిషాలు లెక్కపెట్టుకో సాగాడు.

## *181.* ఉషానిరుద్ధులు :

అత డలా ఉండగా, అతనికుమార్తె అయిన ఉషాకన్య, ఒక రోజున, ప్రద్యుమ్న కుమారుడైన అనిరుద్ధుని, కలలో చూడటం జరిగింది. శ్యామ వర్ణుడూ, కమల లోచనుడూ, పీతాంబర ధారీ, ఆజాను బాహుడూ, మన్మథాకారుడూ అయిన అతణ్ణి చూడగానే, ఆమె మనసు, అతనిమీద లగ్న మయింది; అతడినే వివాహం చేసుకోవాలని ఆమె నిర్ణయించుకుంది.

ఆ రహస్యాన్ని, బాణుని మంత్రి అయిన కుంభాండుని కూతురూ, ఆమె స్నేహితురాలూ అయిన చిత్రరేఖ, గ్రహించింది. గ్రహించి, తన యోగ బలం ద్వారా, అనిరుద్ధుని, అమాంతంగా, యెత్తుకువచ్చి, ఉషాకన్యకు అప్ప గించింది. ఆ రోజునుంచీ, ఉషానిరుద్ధులు, శోణపుర రాజాంతఃపురంలో, అమితానందంతో కాలం గడుపసాగారు.

ఆ విషయం, కాలక్రమాన, అలా అలా వ్యాపించి, బాణుని చెవులో పడ్డది. అది కారణంగా, అతనికి, అంతులేని ఆగ్రహం కలిగింది. ఆ వెంటనే, అతడు, ఉషాకన్య ఉన్న మందిరానికి వెళ్ళాడు.

బాణుడు అలావెళ్ళిన సమయాన, అనిరుద్ధుడు, అక్కడ, ఉషా కన్యతో పాచిక లాడుతున్నాడు. అది చూసిన బాణాసురుడు, తన భటులను అతనిమీదికి పంపాడు; అతణ్ణి బంధించవలసిందిగా వారికి ఆదేశించాడు.

అది గ్రహించిన అనిరుద్ధుడు, ఆ వెంటనే, ఆయుధాలు తీసుకుని, దండధరుని మాదిరి, వారితో తలపడ్డాడు. అప్పుడు జరిగిన పోరులో, బాణుని భటులు చాలామందికూలిపోయినారు. మిగిలినవారు, తీవ్రంగా గాయపడ్డారు. అది గ్రహించిన బాణుడు, అనిరుద్ధునిమీద, నాగపాశాన్ని ప్రయోగించాడు; అతణ్ణి బంధించాడు.

అనిరుద్ధుడు ఆ విధంగా బంధితుడైన ముహూర్తంలోనే, బాణాసురుని కేతనం, ప్రచండధ్వనితో, అకారణంగా ఒరిగిపోయింది. అది గ్రహించిన బాణుడు, మహేశ్వరు డన్నట్టు, ఆయనంతవా డెవడో తనతో తలపడే సమయం సమీపిస్తోం దనుకున్నాడు; ఆ సమయానికే ఎదురుచూడ సాగాడు.

అక్కడ, ద్వారకానగరంలో, అనిరుద్ధుని జాడ తెలియక, యాదవులు, అమితవేదన ననుభవిస్తున్నారు. ఆ సమయంలో, ఒకసారి, నారద మహర్షి, శ్రీకృష్ణ సందర్శనార్థం అక్కడకు వెళ్ళటం జరిగింది.

అలా, అనుకోకుండా దర్శన మిచ్చిన త్రిలోకసంచారికి, బలరామాదులు, అనిరుద్ధుడు అదృశ్యుడయినాడనీ, అతని జాడ తెలియకపోవటం వల్ల, అందరూ ఆవేదనపడుతున్నారనీ, తెలియపరచుకున్నారు. అది విన్న నారదుడు, అనిరుద్ధుడు క్షేమంగానే ఉన్నాడనీ, కాని, ఆ సమయంలో, ఉషాకన్య నిమిత్తంగా, బాణాసురునిచేత బంధితుడై ఉండటం జరిగిందనీ, వారికి విశదపరచాడు; వారి ఆవేదనను కొంతవరకు ఉపశమింపచేశాడు.

అలా, నారదుని ద్వారా అనిరుద్ధుని విషయం గ్రహించిన బల రామ కృష్ణులు, ఆ వెంటనే, పన్నెండక్షౌహిణుల బలంతో బయలుదేరి, శోణ పురం మీద దాడి చేశారు. ఆ దాడిలో, వారు...

సరి దారామ సరోవ రోపవన యజ్ఞస్థానముల్ మాపి వే
పరిఖల్ పూడిచి యంత్రముల్ దునిమి వప్రవ్రాతముల్ 'కూల్చిగో'
పురముల్ గూలగద్రోచి సౌధభవనంబుల్ నూకి ప్రాకారముల్
ధరణిం 'జేర్చి' కవాటముల్ విఱిచి రుద్దండ క్రియాలోలురై.

*182.* విష్ణు విజయం :

ఆ విధంగా తన పురాన్ని ధ్వంసం చేస్తున్న యాదవవీరులను చూసి, బాణాసురుడు ఉగ్రుడయినాడు. తనుకూడా పన్నెండక్షౌహిణుల బలంతోనే, కదనరంగానికి ఉరికాడు. ఆ సమయంలో, అతని నగరరక్షకు డయిన శంకరుడు, సమరోత్సాహంతో, శ్రీకృష్ణుని మీదికివెళ్ళాడు. అత డలా బయలుదేరటం చూసిన ప్రమథులూ, కార్తికేయాదులూ, భూతగణాలతో అతణ్ణి అనుసరించారు.

ఆ తరువాత జరిగిన భీకర సంగ్రామంలో, శ్రీకృష్ణుడు, తన శార్ఙ్గచాపం ద్వారా, వాడి బాణాలను వదలి, బాణునకు సహాయకులుగా వచ్చిన భూత ప్రేత గుహ్యకాదు లందరినీ అమితంగా పీడించాడు. ఆపైన, మహేశ్వరుడు ప్రయోగించిన వాయవ్యాస్త్రానికి ప్రతిగా పార్వతాస్త్రాన్నీ, ఆగ్నేయాస్త్రానికి మారుగా పర్జన్యాస్త్రాన్నీ, పాశుపతాస్త్రంమీదికి నారాయ ణాస్త్రాన్నీ పంపి, ఆ యాదివ్యాస్త్రాలను శాంతింపచేశాడు ఆ వెంటనే, జృంభణాస్త్రాన్ని మంత్రించి వదలి, మహేశ్వరుని సమ్మోహితుని చేశాడు. అనంతరం బాణుని సేనమీద విజృంభించాడు.

అది చూసిన బాణునకు ప్రాణభీతి కలిగింది. అది కారణంగా అతను, అదను చూసుకుని, అక్కడినుంచి పారిపోయినాడు.

తన భక్తు డావిధంగా పరాజయం పొందటం చూసి, మహే

శ్వరుడు, ఆ వెంటనే, మూడు శిరాలతోనూ, మూడు పాదాలతోనూ ఉండే, ఒక భీకర శక్తిని కల్పించి, శ్రీకృష్ణునిమీదికి పంపాడు. అది గ్రహించిన, శ్రీకృష్ణుడు, దానితో తలపడే నిమిత్తం, మరొక ఘోరభీకరశక్తిని సృజించి వదిలాడు.

దివ్యతేజంతో తనమీదికి వచ్చే వైష్ణవశక్తిని చూసి, శివశక్తి, భయపడి, పారిపోవటానికి ప్రయత్నించింది. కాని, వైష్ణవశక్తి, దాన్ని వదల లేదు; తరుముకుంటూ దాని వెంటపడ్డది. అది గ్రహించిన శివశక్తి, గత్యంతరం లేక, అటూ ఇటూ తిరిగి, చివరకు, శ్రీకృష్ణుని చరణాబ్జాలనాశ్రయించింది; ఆయన నిలా స్తుతించింది.

"కృష్ణా ! నువ్వు అనంత శక్తి సంపన్నుడవు. చతుర్ముఖుని కన్న తండ్రివి. మహేంద్రునకు కూడా అధిపతివి. ప్రపంచ సృష్టి లయాలకు కారణభూతుడవు ఆదిమధ్యాంత రహితుడవు

సురలనూ సాధువులనూ ధర్మాన్ని రక్షించేనిమిత్తం, హింసాపరులైన వారిని శిక్షించే ఉద్దేశంతో, భూ భారాన్ని తొలగించటానికని, నువ్వు, నానా విధ లీలావతారాలనూ ధరిస్తూ ఉంటావు.

తండ్రీ ! దుస్సహమైన నీ తేజం నన్ను తపింపజేస్తోంది. నిన్నాశ్రయించిన నన్ను కరుణించవలసింది. నీ చరణాబ్జాలను చేరినవారికి తాపోపశమనం కలిగితీరుతుందన్న నీ నుడిని సార్థకపరచుకోవలసింది."

ఆ విధంగా, శివశక్తి, శ్రీకృష్ణుని ప్రస్తుతిస్తూఉన్న సమయంలో భూదేవి, చతుర్ముఖుని సమీపించి, శివ కేశవుల మధ్య జరిగే సంగ్రామాన్ని వారించవలసిందిగా కోరింది; ప్రళయాన్ని తొలగించవలసిందిగా బ్రతిమాలుకుంది.

ఆ వెంటనే, చతుర్ముఖుడు, శంకరుని సమీపించి, రాక్షసులు వధ్యులనీ, వారికోసం, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణునితో పోరాడటం అసమంజసమనీ, అదీకాక, హరి హరుల అభేదత్వాన్ని, హరుడే విస్మరించటం విపరీతంగా ఉన్నదనీ, తెలుపుకున్నాడు.

చతుర్ముఖుని పలుకులు విని, శంకరుడు, యుద్ధం చేయటం మానుకున్నాడు. అది గ్రహించిన శ్రీకృష్ణుడు, శివశక్తిపట్ల ప్రసన్నుడై, ఆమెకు అభయ మిచ్చి పంపివేశాడు; శంకరుని గాఢంగా ఆలింగనం చేసుకున్నాడు.

అంతలో, బాణుడు, తిరిగి రణరంగంలో ప్రవేశించాడు. ప్రవేశిస్తూనే, భీకరంగా గర్జించటం మొదలుపెట్టాడు.

అలా తిరిగి విజృంభించిన బాణునిమీద, శ్రీకృష్ణుడు, తన నిశితాస్త్రాలను ప్రయోగించసాగాడు. అది చూసిన మహేశ్వరుడు, శ్రీకృష్ణుని ఉద్దేశించి, బాణుడు తన భక్తుడనీ, అతనిపట్ల దయ చూపవలసిందనీ ప్రార్థించాడు.

మహేశ్వరుని ప్రార్థన విన్న మాధవుడు, మందహాసం చేశాడు. అతణ్ణి దగ్గరకు తీసుకున్నాడు. ఆపైన...

''ఉమాపతీ! ఈ బాణుడు నీ కెంతటి ప్రియుడో, నాకూ అంతటి ప్రియుడే. ఇతడు, ప్రహ్లాదుని వంశీయుడు కావటమే దానికిమూలం. అది కారణంగానే, నే నతణ్ణి సంహరించకుండా, భూభారాన్ని తొలగించే ఉద్దేశంతోనూ, ఇతని క్రొవ్వు నడగించే అభిప్రాయంతోనూ ఇతడి సైన్యాన్ని నిర్మూలించాను. ఇతనికి గర్వకారణమైన భుజబలాన్ని మాత్రమే హరించాను. ఇక పైన, ఇతడు, నీ పార్షదులలో ప్రముఖుడై, మాన్యత పొందుతూ ఉంటాడు'' అని తెలియపరచాడు.

ఆ పలుకులు విన్న బాణుడు, అమితానందం పొందాడు. ఆ వెంటనే, అతడు, శ్రీకృష్ణుని, విధ్యుక్తంగా పూజించాడు. ఆయననూ, బలరామునీ, తదితర ప్రముఖులనూ, తన ప్రాసాదానికి తీసుకుపోయి, ఉషానిరుద్ధులను వారికి ఒప్పగించుకున్నాడు. ఆ విధంగా వారితో సంబంధంకలుపుకుని, ఆపైన, అమిత సంతుష్టితో వ్యవహరింపసాగాడు.

## 183. బలరాముని ఆగ్రహం :

కౌరవపతి అయిన సుయోధనునకు లక్షణ అనే ఒక కుమార్తె ఉంది. జాంబవతీ కృష్ణుల పుత్రుడయిన సాంబుడు, ఆమెను ప్రేమించి, అపహరించుకుపోవటానికి ప్రయత్నించాడు.

కౌరవ వీరులు అది తమకు అవమానంగా భావించారు. అది కారణంగానే, వా రతణ్ణి తరుముకుంటూ వెళ్ళారు.

అలా తనమీదికివచ్చిన కర్ణ శల్య సుయోధనాదులను, నిస్సహాయుడై కూడా, సాంబుడు, తీవ్రంగా ఎదిరించాడు. వారిని అమితంగా పీడించాడు. కాని, ఆ వీరు లందరూ, ఒక్కసారిగా అతణ్ణి చుట్టుముట్టి, అతని రథాశ్వాలనూ, సారథినీ కూల్చి, ధనుస్సును త్రుంచివేశారు అతణ్ణి అతి కష్టంమీద బంధించి, కన్యకాయుక్తంగా తమ పురానికి తీసుకువెళ్ళారు.

ఆ వార్త, నారదమహర్షి ద్వారా, యదువీరుల కందింది. ఆ వెంటనే, వారు, కౌరవులతో యుద్ధంచేసి, వారిని జయించి, సాంబుని విడిపించి తీసుకురావటానికి నిశ్చయించుకున్నారు. అందుకు తగిన సర్వసన్నాహాలూ చేశారు. ఉగ్రసేనుని అనుజ్ఞకోసం ఎదురు చూస్తూ ఉన్నారు.

అది గ్రహించిన బలరాముడు, బంధువులైన ధార్తరాష్ట్రిల మీద దాడిచేయటం అసమంజసమని వారికి నచ్చచెప్పి, వారిని వారించాడు. ఆ వెంటనే, ఉద్ధవుడు మొదలైన కొందరు కులవృద్ధులతో, తన కాంచన రథం మీద, హస్తినాపురం వెళ్ళాడు.

అలా హస్తినాపురం చేరిన బలరాముడు, పురం వెలుపలఉన్న వనంలోదిగి, తన రాకను తెలియపరచే నిమిత్తం, కౌరవుల దగ్గరకు, ఉద్ధవుని పంపాడు.

ఉద్ధవుని ద్వారా బలరాముని ఆగమనవార్త విన్న భీష్మాది కురువృద్ధులూ, సుయోధనుడూ, ఆయన్ని సందర్శించే నిమిత్తం, కానికలు తీసుకుని వనానికి వెళ్ళారు. వెళ్ళి, ఆయనకు అర్ఘ్యపాద్యాదులు సమర్పించు

కున్నారు. సన్మానించారు. పరస్పర కుశల ప్రశ్నలు జరుపుకున్నారు. ఆ తరువాత, బలరాముడు వారిని ఉద్దేశించి...

'మా నరనాథునాజ్ఞ నిజమస్తములం ధరియించి కౌరవుల్
మానుగ జేయుటొప్పగు గుమారకునొక్కని బెక్కుయూథపుల్
పూనినలావుమై నెదిరి పోర జయించుట మీది తప్పు త
త్పైనను గాచె బాంధవహితాత్మకుడై మనుజాధినాథుడున్'

అని, తెలియబరచాడు.

ఆ పలుకు, విన్న సుయోధనుడు, అమితంగా ఆగ్రహించు కున్నాడు. ఆ ఆగ్రహావేశంలో, అతడు, బలరాముని ఉద్దేశించి, ఇలా అన్నాడు.

'బంధుత్వాన్ని పాటించి, మేమే, యాదవులకు రాజ్యాసనాన్నిచ్చాం. మాతో సహ భోజనాసనాదులకు అర్హత కల్పించాం. అది కారణంగానే, వారికి, ఛత్ర చామర కిరీటాది రాజలాంఛనాలన్నీ లభించినై. వాటికి అన్నింటికీ, మా అనుగ్రహమే మూలం.

కాని, వా రిప్పుడు, మదోన్మాదులై ఉన్నారు. ఎవరి కృపా విశేషం కారణంగా వా రింతవారయినారో అది కూడా వారు విస్మరించారు. ఎవరు తమ ఉన్నతికి కారణ భూతులో వారినే వా రీనాడు ఆజ్ఞాపించే స్థితికి వచ్చారు. పాదరక్షలు తలపాగలు కావట మంటే ఇదే కాబోలు'.

ఆ విధంగా దుర్భాషలాడుతూ, సుయోధనుడు అక్కడినుంచి వెళ్ళిపోయినాడు. అతని పలుకులు విన్న బలరాముడు, ప్రళయభానుడైనాడు. అది కారణంగానే...

'శ్రీమదాంధులు సామంబుచేత జక్క
బడుదురే యెందు బోయడు పసులదోలు
పగిది నుగ్ర భుజా విజృంభణ సమగ్ర
సుమహితాటోప మనిలోన జూపకున్న'

అనుకున్నాడు. సమరోన్ముఖులైన యాదవవీరులను, అంతకుముందు, వారిం చటంకూడా దోసమయిందని భావించాడు. అంతేకాదు.

'ఏ దేవు భృత్యులై యింద్రాది దిక్పాల
వరులు భజింతురు వరుసతోడ
నే దేవు మందిరం బేపారు దేవతా
తరు సభావిభవసుందరత జెంది
యే దేవు పదయుగం బెప్రొద్దు సేవించు
నిఖిల జగన్మాతయైన లక్ష్మి
యే దేవు చారు సమిద్ధ కళాంశ సం
భవులము పద్మజభవుడు నేను
నట్టి దేవుండు దుష్ట సంహారకుండు
హరి ముకుందుడు పంపు సేయంగ నొప్పు
నుగ్రసేనుని రాజ్య సమగ్రగరిమ
యంతయును దార యిచ్చినదట తలంప!'

అని, దుర్యోధనాదుల మౌఢ్యాన్ని గురించి కూడా విచారించాడు. అంతలో ఆయనకు, దుర్యోధనుడు, యాదవులను పాదుకలకు పోల్చటం భరింపరాని బాధ కలిగించింది. శ్రీకృష్ణుడు ధరించిన రాజలాంఛనాలు అక్రమమైనవని అతడనటం, ఆయనలో ఆరనిమంటను ప్రజ్వలింప చేసింది. అది కారణం గానే ఆయన, ప్రపంచంలో కౌరవులనేవారు లేకుండా చేయాలని నిశ్చ యించుకున్నాడు. ఆ వెంటనే, హస్తినాపురాన్ని తన హలంతో పెకలించి, గంగలో కలపటానికి ఉద్యుక్తుడైనాడు.

అది గ్రహించిన భీష్మాదులు కళవళపడిపోయినారు. హలా యుధుని ప్రసన్నుని చేసుకోవలేనిపక్షంలో, తమ బ్రతుకులు తమకు దక్క వనుకున్నారు, అది కారణంగానే, సాంబుని తీసుకుని, సుయోధనుని ముందుం చుకుని, ఆయనకు మ్రొక్కి, ఇలా విన్నవించుకున్నారు.

"రామా ! నువ్వు అఖిలాధారుడవు. నీ ప్రభావం గ్రహించలేక మూఢుడైన, సుయోధనుడు, నిన్నూ నీ వారినీ అవమాన పరచాడు. అతనికి ఎదురు చెప్పలేక, మేముకూడా, మీ పట్ల, పరోక్షంగా అపచారం చేసిన వారమే అయినాం.

నువ్వు బంధుప్రియుడవు. క్షేమంకరుడవు. అయినా, తామస గుణ ప్రధానులమైన మేము, నీతో విరోధం పెంచుకోవటం జరిగింది. అందుకు అమితంగా పశ్చాత్తాప పడుతున్నాం.

నువ్వు సహస్ర శీర్షుడవు. ఈ భూమండలమంతా, నిన్ను ఆధారం చేసుకునే నిలబడి ఉంది. అయినా, నువ్వు సద్గుణ గరిష్ఠుడవు కావటం వల్ల, భూమికి భారమైన మావంటి దుష్టబుద్ధులను కూడా ఉపేక్షాభావంతో చూస్తూ ఉంటావు ; మమ్మల్ని సన్మార్గాన నడిపించటానికే ఎప్పుడూ ప్రయత్నిస్తూ ఉంటావు. అదే కాని పక్షంలో, ఈ ఒక్క హస్తినాపురాన్నే కాదు. సర్వ ప్రపంచాన్నీ కూడా, ఎప్పుడో ప్రళయార్ణవంలో ముంచి ఉండేవాడివి.

బలరామా ! మే మిప్పుడు ఆపన్నులమై ఉన్నాం. నిన్నే ఆశ్రయించాం. మమ్మల్ని రక్షించవలసింది. మాకు ప్రాణదానం చేయవలసింది.

అలా ప్రార్థించిన కురువృద్ధులకు, బలరాముడు అభయమిచ్చాడు. ఆ తరువాత, సుయోధనుడు ఒప్పగించిన లక్షణనూ సాంబునీ తీసుకుని, ద్వారావతి చేరుకున్నాడు.

*184. రాయబారం :*

పాండుపుత్రులు, పడరాని పాట్లు పడి, అజ్ఞాతవాసం నిర్విఘ్నంగా పూర్తిచేసుకున్నారు. అనంతరం, విరటుడు, తన కుమార్తె అయిన ఉత్తరను, అర్జునకుమారుడైన అభిమన్యునకిచ్చి వివాహం చేయటం జరిగింది. ఆ వివాహానికి, ఆయన ఆహ్వానంమీద, శ్రీకృష్ణుడు, బంధు మిత్రులతోసహా, విరాట నగరానికి విచ్చేశాడు.

వివాహానంతరం, యాదవవీరులూ, వివిధ దేశాధీశ్వరులూ కొలువుదీరి ఉన్న సమయంలో, శ్రీకృష్ణుడు, ఆమీద పాండుపుత్రులదయిన ధర్మాన్ని గురించి ప్రస్తావించాడు. ధర్మం ప్రకారం, వారిదయిన రాజ్యాన్ని వారు తిరిగి పొందాలని సూచించాడు. దానికి, అవసరమైతే, యుద్ధం చేయటం కూడా సమంజసమేనని నిర్ధారించాడు. ఆ సమయంలోనే, కౌరవులకూ పాండవులకూ మధ్య యుద్ధమే అనివార్యమైన పక్షంలో, ధర్మమూర్తులైన పాండుపుత్రులు, ధార్తరాష్ట్రులను జయించటం తథ్యమనీ, దాని ఫలితంగా, కురువంశం నిర్మూలమైనా కావచ్చుననీ, అటువంటి భయానకమైన పరిణామం కలుగకుండా చూడటం, పూజ్యులయినవారి ధర్మమనీ కూడా బోధించాడు.

శ్రీకృష్ణుని ఉపదేశం, అక్కడ సమావేశమైనవారందరినీ ఆకర్షించింది. కాని, బలరాముడు మాత్రం, కౌరవ పాండవుల మధ్య సంధి జరిగేటట్టు చూడటం ఉచితమని తెలియపరచాడు. ఆయన, అభిప్రాయాన్ని, సాత్యకి ప్రభృతులు అంగీకరించలేకపోయినారు. యుద్ధం అనివార్యమనే వారు దృఢంగా విశ్వసించారు.

శ్రీకృష్ణుని అభిప్రాయం కూడా అదే. అయినా, యుద్ధాన్ని నివారించగలశక్తి ఉండికూడా, శ్రీకృష్ణుడు, ఉపేక్షచేశాడన్న అపవాదు రాకుండా చూసుకునే నిమిత్తం, ఆయన, దుర్యోధనాదుల వద్దకు దూతను పంపటం సమంజసమని సూచించాడు.

ఆపైన, ద్రుపదుడు, ఒక విప్రుని పంపటం, దుర్యోధనాదులు ఆయనను అవమానపరచటం, ఇరువర్గాలవారూ యుద్ధానికి సన్నద్ధులు కావటం, జరిగింది. ఆ పరిస్థితిలో, తుది ప్రయత్నంగా, శ్రీకృష్ణుడు, పాండవుల పక్షాన రాయబారిగా వెళ్ళటానికి సమ్మతించాడు.

శ్రీకృష్ణుడు, తమవద్దకు వస్తున్నాడని విన్న ధృతరాష్ట్రుడు అమితానందం పొందాడు. ఆయనకు ఉచితరీతిని స్వాగత సత్కారాలు జరిపించాలనీ, ఎలాగయినా, ఆయన, తన పుత్రుల పక్షాన పోరాడేటట్టు చేయాలనీ, అతడు ఆలోచించాడు. కాని, వాసుదేవుడు, ధర్మమూర్తి అనీ,

ఆ మహానుభావుని సహాయం, అధర్మపరుల కేనాటికీ లభించదనీ, విదురు డాయనకు తెలియపరచాడు. అంతలో, దుర్యోధనుడు, తన తండ్రిని కలుసుకుని, శ్రీకృష్ణుని సన్మానించటం అవమానకరమనీ, అవకాశం కల్పించుకుని ఆయనకు, తమ బలాధిక్యతను విశదపరచటం అవసరమనీ విన్నపించుకోవటం జరిగింది. భీష్మాది కురువృద్ధులు, దుర్యోధనుని విపరీతాభిప్రాయాన్ని గర్హించారు. కాని, వారు చేయగల దేమీ లేకపోవటంవల్ల, తటస్థంగా ఊరుకున్నారు.

అంతలో, శ్రీకృష్ణుడు నగరంలో ప్రవేశించాడు. కురువృద్ధులూ, తదితర ప్రముఖులూ ఆయనను కలుసుకున్నారు; ఉచితరీతిని ఆయనకు స్వాగతం చెప్పారు.

ఆ తరువాత, శ్రీకృష్ణుడు, అక్కడ, సమావేశమైనవా రందరినీ పలుకరించాడు. అనంతరం కుంతీదేవిని కలుసుకున్నాడు; కుశల ప్రశ్నలు వేశాడు ఆమె చెప్పినదంతా విని, ఆమె మనోవ్యథను అర్థం చేసుకుని, ఆమెకు కొంత ఊరట కలిగించాడు. ఆపైన, విశ్రాంతి తీసుకునే నిమిత్తం ఆయన, విదురునింటికి వెళ్ళటం జరిగింది.

ఆ మరునాడు, మహాసభా మధ్యంలో ఉన్న ధృతరాష్ట్రుని ఉద్దేశించి, శ్రీకృష్ణుడు, పాండవుల పక్షాన వాదించాడు. వారి రాజ్యాన్ని వారికి ఇచ్చివేయటం సమంజసమని బోధించాడు. పాండుపుత్రులనుకూడా, ఆయన, తన పుత్రులనుగా చూసుకోవటం ధర్మమనీ, అలా కాని పక్షంలో, ఆయనకు దుఃఖం ప్రాప్తించి తీరుతుందనీ కూడా తెలియపరచాడు.

శ్రీకృష్ణుని అభిప్రాయాన్ని, సభలో ఉన్న మహర్షు లందరూ శ్లాఘించారు. ఆపైన, వారు, దుర్యోధనుని ఉద్దేశించి, 'శ్రీకృష్ణుని హితవచనాలను శిరసావహించవలసింది' అని బోధించారు. కాని, దుర్యోధనుడు, వారి బోధనల నన్నింటినీ పెడచెవిని పెట్టాడు. అంతేకాదు. తాను జీవించి ఉండగా, పాండుపుత్రులకు, సూదిమొన మోపేటంత స్థలమైనా ఇవ్వటం జరగదని, దృఢంగా వారికి తెలియపరచాడు; అదే, శ్రీకృష్ణునకు కూడా

వెల్లడించాడు.

ఆపైన, శ్రీకృష్ణుడు, ధృతరాష్ట్రుని ఉద్దేశించి, సుయోధనుడు, పూర్వం కంసుడు వ్యవహరించినట్టుగా వ్యవహరిస్తున్నాడనీ, అతని మూలంగా, కురు వంశానికే చేటు మూడబోతున్నదనీ, విశదపరచాడు. యాదవులు, కంసుని ఒదులుకుని, తమ వంశాన్ని రక్షించుకున్నట్టుగా, కౌరవులు దుర్యోధనుని పరిత్యజించి, తమ వంగడాన్ని నిలుపుకోవటం సమంజసమని ఉద్బోధించాడు.

అది విన్న దుర్యోధనుడు, అమితంగా ఆగ్రహించుకున్నాడు. అది కారణంగానే, అతనిలోని వివేచనాజ్ఞానం పూర్తిగా నశించి పోయింది. పాండవులు, శ్రీకృష్ణునిమీదనే ఆధారపడి యుద్ధానికి దిగారనీ, ఆయన్ని బంధించి, కారాగారంలో ఉంచిన పక్షంలో, వారు, క్రుంగి కృశించి మర ణించి తీరుతారనీ, అతడు అభిప్రాయపడ్డాడు. ఆ విధమైన అభిప్రాయం తోనే, అతడు, శ్రీకృష్ణుని బంధించటానికి పూనుకున్నాడు.

దుర్యోధనాదుల దుర్మంత్రం, శ్రీకృష్ణుడు గ్రహించాడు. అది కారణంగానే, ఆయన, అటువంటి అత్యాచారమేదీ జరుగకుండా చూడవల సిందని, ధృతరాష్ట్రుని కోరాడు. ఆ సందర్భంలోనే...

'నాపట్ల దుర్యోధనాదులు యే విధమైన దౌర్జన్యానికి పూనుకున్నా, నేను, ఆత్మ రక్షణ కోసం, వారిని ప్రతిఘటించవలసి వస్తుంది. ఆ ప్రతి ఘటనా ఫలితం ఎంత దారుణంగా పరిణమించినా, దాని బాధ్యత, నీ కుమా రులదే అవుతుందన్న యథార్థాన్ని నువ్వు గ్రహించవలసి ఉంటుంది' అని కూడా హెచ్చరించాడు.

అది విన్న ధృతరాష్ట్రుడు, అమితంగా భయపడిపోయినాడు. ఆ వెంటనే, దుర్యోధనాదులను తన దగ్గరకు రప్పించుకుని, వా రందరినీ తీవ్రంగా మందలించాడు. సర్వనాశనాన్ని తలపెట్టని పక్షంలో, శ్రీకృష్ణుని హితోక్తిని శిరసావహించవలసిందనీ, సర్వలోకేశ్వరుడయిన ఆయన చరణా బ్జాల నాశ్రయించవలసిందనీ బోధించాడు కాని, ఆ హితబోధ, దుర్యోధ

నుని మనసును కించిన్మాత్రంగా కూడా మార్చలేకపోయింది అది గ్రహించిన శ్రీకృష్ణుడు, దుర్యోధనుని ఉద్దేశించి ఇలా అన్నాడు :

"రాజా ! నే నిప్పుడు ఏకాకిగా ఉన్నాననీ, నన్ను బంధించటం సులభమనీ, నువ్వు భావిస్తున్నట్టు నేను అభిప్రాయపడుతున్నాను. నా అభిప్రాయమే సరైనదయిన పక్షంలో, నువ్వు, ఉట్టి భ్రమలో ఉన్నావని రూఢిగా చెప్పవలసి ఉంటుంది. ఈ క్షణాన, చతుర్దశ భువనాలలోనూ ఉండే జీవరాశి అంతా నా సమక్షాన ఉంది నన్నే ఆశ్రయించి ఉంది ఆ యథార్థాన్ని గ్రహించి, నువ్వు, నీకు శ్రేయోదాయకమయిన మార్గాన్ని అనుసరించటం సమంజసం''.

ఆ పలుకులు విన్న దుర్యోధనుడు, విరగబడి నవ్వాడు. అది చూసిన అతని సహచరులందరూ, అప్పుడు, అతడినే అనుకరించారు.

శ్రీకృష్ణుడు, అదంతా తనకు జరిగిన ఘోరావమానంగా భావించాడు. అది కారణంగానే, ఆయన, ఆ వెంటనే, వా రందరిలోను భీతి జనించే విధంగా, తన విశ్వరూపాన్ని ప్రదర్శించటం జరిగింది. ఆ సమయంలో అక్కడ ఉన్న అందరకూ, అంగుష్ఠమాత్రమైన శరీరాలతో, భూత జాలమంతా ఆయనలో ద్యోతమయింది. బ్రహ్మరుద్రామరేంద్రులూ, లోకపాలురూ, సిద్ధులూ, సాధ్యులూ, వసువులూ, అశ్వినులూ, మరుద్గణాలూ, విశ్వేదేవతలూ, యక్ష గంధర్వ ఉరగ రాక్షసాదులూ. పాండుపుత్రులూ, వృష్ణ్యంధకాదులూ, ప్రద్యుమ్నాదులూ, అందరూ ఆయనలో గోచరించారు.

అలాగే, శ్రీమన్నారాయణునివయిన మహాయుధాలు, శంఖమూ, చక్రమూ, గదా, శక్తీ, శార్ఙ్గమూ, లాంగలమూ, నందకమూ మొదలయినవన్నీ, అప్పుడు, ఆయన నాశ్రయించి ఉన్నై. అనేక బాహువులతో, అనేక నేత్రాలతో, అనేక శ్రోత్రేంద్రియాలతో ఆయన చూపట్టాడు. ఆయన రూపం మహా రౌద్రమయినదిగా ఉంది. ఆయన రోమకూపాలనుంచి పావకాగ్ని జ్వాలలు పెల్లుబుకసాగినై ఆయనదయిన మూర్తి, కోటి సూర్యులకాంతితో ప్రకాశించింది.

భీతావహమైన ఆ రూపాన్ని దర్శించలేక, దుర్యోధనానుచరులందరూ భయంతో కళ్లు మూసుకున్నారు. నిర్వీణ్ణులైనారు. కాని, తపోధనులైన మహర్షులూ, మహామహులైన ద్రోణ భీష్మ విదుర సంజయాదులూ, మరికొందరు పుణ్యాత్ములూ, ధృతరాష్ట్రుడూ మాత్రం, శ్రీకృష్ణుడు ప్రసాదించిన దివ్యచక్షువుల ద్వారా, ఆ మహాద్భుత రూపాన్ని అవలోకించి, పరమానందం పొందగలిగారు.

ఆ సమయంలో, అక్కడ, దేవదుందుభులు శబ్దించినై. పుష్పవర్షం కురిసింది. దివిజులు, శ్రీకృష్ణునిచుట్టూ చేరారు. ఆయన్ని బహువిధాల స్తుతించారు. ఆయనకు, సాష్టాంగ ప్రణామా లాచరించారు. అనంతరం, ఆ దివ్య రూపాన్ని ఉపసంహరించుకోవలసిందిగా ఆయన్ని ప్రార్థించారు.

దేవతల ప్రార్థనమీద, సాక్షాత్తు శ్రీమన్నారాయణుడే అయిన శ్రీకృష్ణుడు, తన విశ్వరూపాన్ని ఉపసంహరించుకున్నాడు. అంతలో, అక్కడ ఉన్న మహర్షు లందరూ అంతర్హితులు కావటం జరిగింది. ఆపైన, భీష్మాది కురువృద్ధుల ప్రార్థనాదికాలను స్వీకరిస్తూ, శ్రీకృష్ణుడు రథారోహణం చేశాడు. సాత్యకి ప్రభృతులతో బయలుదేరి, యుధిష్ఠిరాదులను చేరుకున్నాడు. వారికి, హస్తినాపుర విశేషాలను సవివరంగా తెలియపరచాడు; ఆ తరువాతనే, ద్వారావతికి బయలుదేరి వెళ్ళాడు.

## *185*. బల విభజనం :

విప్ర దౌత్యం విఫలమైన తరువాత, వాసుదేవుని రాయబారం వ్యర్థమైన మీదట, పాండుపుత్రులు, సమరరంగ ప్రవేశం సమంజసమైనదేనని నిర్ణయించుకున్నారు. ఆ నిర్ణయాన్ననుసరించే, వారు, ద్రుపదునితోనూ విరటునితోనూ సంప్రదింపులు జరిపి, తమపట్ల అభిమానంగల రాజన్యులందరకూ, తమతమ సేనలతో తరలి రావలసిందిగా సందేశాలు పంపారు. ఆ సందేశాలు చాలావరకు సఫలమయినై.

ఆ సందర్భంలో, ఒకసారి, శ్రీకృష్ణుని సందర్శించి, ఆయన

సహాయాన్ని అర్థించి పొందటం అవసరమని, పాండుపుత్రులు భావించారు. అది కారణంగానే, అర్జునుడు, ఆయన వద్దకు వెళ్లటం జరిగింది.

అర్జునుడు మందిరంలో ప్రవేశించే సమయానికి, గోవిందుడు నిద్ర పోతున్నాడు. అంతకుముందే అక్కడికి చేరుకున్న దుర్యోధనుడు, ఆ మహానుభావుని తలవేపున ఉన్న ఒక ఉన్నతాసనంమీద ఉపవిష్టుడై ఉన్నాడు. అది చూసిన అర్జునుడు, శ్రీకృష్ణుని పాదాల వద్ద, వినయ విధేయతలతో నుంచున్నాడు

ఆపైన, కొద్దిసేపట్లో, శ్రీకృష్ణుడు, నిద్రనుంచిలేచాడు. లేస్తూనే, అర్జునుని చూశాడు. మందహాసంతో అతణ్ణి పలుకరించాడు. భక్తిపూర్వకంగా అతడు సలిపిన అభివాదన నందుకున్నాడు. అంతలో, దుర్యోధనుడు ఆయన కంట పడటం జరిగింది.

శ్రీకృష్ణుడు, అతణ్ణి కూడా పలుకరించాడు. అతని యోగక్షేమాలను విచారించాడు. ఆ పైన, అతని ఆగమనకారణం తెలుపవలసిందిగా అతణ్ణి కోరాడు.

ఆయనకు సమాధానంగా, దుర్యోధనుడు, 'కృష్ణా! మాకూ మా జ్ఞాతులకూ మధ్య జరుగబోయే యుద్ధంలో నీ సహాయాన్నర్థించటానికి వచ్చాను'. అన్నాడు. అంతే కాదు.

"వాసుదేవా! పాండవమధ్యముడు కూడా ఇప్పుడదేపనిమీద వచ్చి ఉంటాడు. అయినా, నీ వద్దకు నేను ముందుగా రావటం జరిగింది. అది నువ్వు గ్రహించాలి. ముందుగా ఆశ్రయించినవారిని ఆదరించటం సజ్జనులదైన ఆచారమని, పురుషోత్తముడవూ, సర్వజ్ఞుడవూ అయిన నీకు నేను చెప్పనక్కరలేదు. కాని, యీ సందర్భంలో, ఒక విషయం మాత్రం, నీకు మనవిచేసుకోదలచాను. స్నేహంలో నీకు అర్జును డెంతో నేనూ అంతే. బంధుత్వరీత్యా కూడా, మే మిద్దరం నీకు సమానులమే. అది గుర్తుంచుకుని, యిప్పుడు, ఈ పరిస్థితిలో నీకు యేది ధర్మమనితోస్తే అది చేయవలసింది" అని కూడా నివేదించుకున్నాడు. అది విన్న శ్రీకృష్ణుడు, అతణ్ణి ఉద్దేశించి ఇలా అన్నాడు:

"సుయోధనా ! నువ్వు తొలుదొల్త వచ్చినమాట అయితే నిజమే. కాని, నేను ప్రప్రథమంగా పార్థుని చూడటం సంభవించింది. నీవు ముందుగా వచ్చావు; నేను ముందుగా అతణ్ణి చూశాను. అది కారణంగానే, మీ ఇద్దరికీ సహాయం చేయటం ధర్మమని నేను భావిస్తున్నాను.

కాని, ఏదైనా ఒక విషయాన్ని కోరుకోవలసిన సందర్భంలో, విన్నవారికి ప్రథమావకాశ మివ్వటం ఆచారంగా వస్తూఉంది కాబట్టి ఇప్పుడు ఆ అవకాశం అర్జునుని దొరుతుంది.

శక్తి సామర్థ్యాలలో నాకు ఏ విధంగానూ తీసిపోనివారు, వీరాధి వీరులూ, సంగ్రామ నిపుణులూ అయిన వారు, నారాయణులని పిలువబడే గోపకులు, నా వద్ద, ఒక అర్బుద సంఖ్యలో ఉన్నారు. వా రందరూ ఒకరి పక్షాన ఉంటారు. నే నొంటిణ్ణి ఒక పక్షాన ఉంటాను. నేను ఎవరి పక్షాన ఉన్నా, శస్త్రాస్త్రాలను ధరించేది లేదు. యుద్ధం చేసేది లేదు. ఆ యథార్థాన్ని గ్రహించి,అర్జును డిప్పుడు, తనకు,నేను కావాలో, నా సైన్యం కావాలో కోరుకోవచ్చు. అతడు తీసుకోగా మిగిలిన పక్షాన్ని నువ్వు స్వీకరించవచ్చు."

శ్రీకృష్ణు డలా అనగానే, అస్త్ర శస్త్రాలు ధరించకపోయినా, యుద్ధం చేయకపోయినా, శ్రీకృష్ణుడే తనకు కావాలని అర్జునుడు కోరుకున్నాడు. అది గ్రహించిన దుర్యోధనుడు, ఆపైన, రెండవ పక్షంగా మిగిలిన శ్రీకృష్ణుని సేన నంతనూ స్వీకరించాడు; అమితానందంతో అక్కడి నుంచి వెళ్ళిపోయినాడు.

దుర్యోధను డలా వెళ్ళిన తరువాత, శ్రీకృష్ణుడు, అర్జునుని ఉద్దేశించి, 'పార్థా ! యుద్ధం చేయనివాణ్ణి యుద్ధ సహాయకునిగా కోరుకోవటంలో నీ అభిప్రాయ మేమిటి?' అని అడిగాడు. దానికి సమాధానంగా, అర్జునుడు ఇలా అన్నాడు :

'కృష్ణా ! నువ్వు సర్వ సమర్థుడవు. దుష్ట శిక్షణోద్దేశంతో అవతరించిన మహానుభావుడవు నిన్ను చూసినంత మాత్రంలోనే, నీతో విరోధించినవారి గుండెలు నీరై పోతై. నువ్వు ఎవరి పక్షాన ఉంటే వారి పక్షం

జయించి తీరుతుంది. అది కారణంగానే, నేను, నిన్ను, కోరి స్వీకరించటం జరిగింది.'

అర్జునుని నిశ్చితాభిప్రాయాన్ని గ్రహించి, శ్రీకృష్ణుడు అమితానందం పొందాడు. ఆ తరువాత, రణరంగంలో అతనికి సారథిగా ఉండటానికి అంగీకరించాడు. అతనికోరిక లన్నిటినీ తీర్చటానికి నిశ్చయించుకుని, అతని కలా వాగ్దానం కూడా చేశాడు.

ఆ విధంగా, శ్రీకృష్ణుని అనుగ్రహాన్ని పొందిన అర్జునుడు, ఆ తరువాత, ఆయనతోసహా, ధర్మరాజాదులను కలుసుకోవటం జరిగింది.

*186. విశ్వరూప ప్రదర్శనం :*

కౌరవ వంశం నిర్మూలం కాకుండా చూసే నిమిత్తం, శ్రీకృష్ణుడు ఎన్నో ప్రయత్నాలు చేశాడు. కాని, అవేవీ సఫలం కాలేదు. అది కారణంగానే, ఆయన, పాండుపుత్రుల నుద్దేశించి, ధర్మప్రతిష్ఠాపనకు దండోపాయ మొక్కటే మార్గంగా కనిపిస్తున్నదని తెలియపరచాడు.

శ్రీకృష్ణుని నిశ్చితాభిప్రాయం గ్రహించిన యుధిష్ఠిరుడు, ఆ వెంటనే, తన పక్షాన ఉన్న ఏడ క్షౌహిణుల సైన్యానికీ ఏడుగురు మహావీరులను నాయకులుగా నియమించాడు. సర్వాధ్యక్షునిగా ధృష్టద్యుమ్నుని నిర్ణయించాడు; వా రందరితోనూ సమర రంగంలో ప్రవేశించాడు.

అటు కౌరవులు కూడా, తమదయిన పదకొండు అక్షౌహిణుల సేనకూ, పదకొండుగురు సేనానులను నియమించుకున్నారు. వా రందరికీ అధిపతిగా భీష్మాచార్యుని ఎన్నుకున్నారు. ఆ తరువాత, శ్రీకృష్ణుడు నిర్ణయించిన ముహూర్తానికే, ఆహవభూమిలో అడుగుపెట్టారు.

యుద్ధాభిలాషతో, ఆ విధంగా సంగర రంగం చేరిన కురుపాండవవీరులను, అర్జునుడు పరిశీలించి చూశాడు. అలా చూసిన అతనికి, అందరూ తనవారుగానే కనిపించారు. ఇరువర్గాలుగా, యుద్ధానికి సన్నద్ధులై ఉన్న వా రందరూ, తనతో ఏదోఒక విధంగా సంబంధం కలవారుగానే

అతనికి గోచరించారు. వారిలో చాలామంది అతనికి బంధువులే. మిగిలిన వారు, అతని మిత్రులూ ఆశ్రితులూ పరిచయస్థులూ అయి ఉన్నారు. వా రందరూ, అశాశ్వతమయిన ఏవో కొన్ని ప్రయోజనాలను ఆశించి, ప్రాణ త్యాగానికికూడా సిద్ధపడి ఉన్నవారే. అది గ్రహించిన అర్జునునకు, స్వార్థ పరత్వంలో, అతను, వారికి ఏవిధంగానూ తీసిపోవటంలేదన్న అభిప్రాయం కలిగింది. తనకూ తనవారికీ లభించవచ్చుననుకునే ఒక కొంత భూభాగం కోసం, వా రందరినీ ఇంధనాలుగా ఉపయోగించి, మారణ హోమం జర పడం, మానవత్వానికి విరుద్ధమని, అప్పు డతనికి తోచింది. తనవారిని సంహరించి, తాను పొందగల సుఖంగాని, శాంతిగాని, లేశమాత్రమైనాఉండ దన్న భావం అతనిలో జనించింది. పూజ్యులయిన గురువులను, ప్రేమ పాత్రులయిన బంధువులను, మిత్రులను, వధించటం, పాపానికి పాల్పడటం కాక మరొకటి కా దనిపించింది.

అది కారణంగానే, అతని మనసు వికలమయింది. శక్తి క్షీణిం చింది. యుద్ధాభిలాష అంతరించింది. దాంతో, అతనికి, కర్తవ్య విస్మృతి కలిగింది. అత డప్పుడు, ఉట్టి భీరువైనాడు. అస్త్ర సన్యాసం చేయటానికి కూడా ఉద్యుక్తుడయినాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, సర్వానర్థాలకూ మూల మైన శోక మోహాలకు అర్జునుడంతవాడే వశుడు కావటం శోచనీయ మను కున్నాడు. శత్రు సంహారానికి శపథంచేసిన సవ్యసాచి, సమరవిముఖుడై, విరోధులకు వెన్నుచూపటం జరిగిన పక్షంలో, క్షాత్ర ధర్మమనేది, ఆ పైన, కలికానికి కూడా కనిపించదనుకున్నాడు. అది కారణంగానే, ఆయన, అప్పుడు, అమిత శాంత చిత్తంతో, అర్జునునకు, అతనిదైన కర్తవ్యాన్ని బోధించటం జరిగింది. ఆ సందర్భంలోనే, అర్జునుని ఉద్దేశించి,...

"అర్జునా !

ప్రాణికోటి నంతనూ సృష్టించి పోషించి సంహ రించేవాడు ఒకే ఒక డున్నాడు. ఆయనే పరమాత్ముడు. ప్రపంచంలో ఎప్పుడు ఎక్కడ ఏది ఎలా జరిగినా ఆయన

సంకల్ప మూలంగా మాత్రమే జరుగుతుంది. దాన్ని నిరోధించ గల శక్తి ఎవరికీలేదు.

ఈ ప్రాణులన్నీ ఆ పరమాత్ముని ప్రతిరూపాలే. ఆ పరమాత్మునకు జనన మరణాలు లేవు. వృద్ధి క్షయా లనేవి అస లాయనకు ఉండనే ఉండవు. పుట్టేదీ పెరిగేదీ నశించేదీ అతని తేజోంశకు ఆశ్రయమైన దేహమే కాని, ఆయన కాదు.

దేహం శాశ్వతమైన దనుకోవటం అజ్ఞానం. ఆ అజ్ఞానం కారణంగా, ప్రాణులకు, దేహంపట్ల అభిమానం కలుగు తుంది. అది పొందే వికారాలన్నీ, వారు, తమవిగా భావిస్తారు. ఆ దేహం మీద జనించిన మమకారం కారణంగా, వారు, దానితో కలిగే వియోగానికి విచారపడతారు పుట్టిన ప్రతి జీవీ గిట్టి తీరుతుందనీ, సంయోగ మున్నచోట వియోగమన్నది తథ్యమనీ గ్రహించలేకపోవటమే, ఆ విచారానికి కారణం.

ఏ ప్రాణికైనా, మేలు కీళ్ళను చేకూర్చేవి, ఆ ప్రాణి వైన పూర్వ కర్మలే కాని, ఇతరమైన వేవీ కావు. మనం చేసుకున్న కర్మలే మనకు సుఖ దుఃఖాలనూ, సర్వ విధ బంధాలనూ కలిగిస్తూ ఉంటై.

ఆ బంధాలను తెంచుకోగలవారే, జ్ఞానులు. వారు, మేలు కీళ్ళు, కష్టసుఖాలు, అనే ద్వంద్వాలకు అతీతులుగా ఉంటారు. తమ వర్ణానికీ ఆశ్రమానికీ ఉచితమైన కర్మ లన్నిటినీ ఆచరిస్తూ ఉన్నా, కర్మ ఫలాన్ని మాత్రం వారు ఆసించరు. అంటే, ఫలత్యాగం చేస్తారన్నమాట. అదే వారి బంధమోక్షానికి కారణం.

నువ్వుకూడా ఇప్పుడు ఆ విధమైన స్థితినే పొందాలి. నువ్వు సుక్షత్రియ వంశంలో జన్మించావు. క్షత్రియుల ధర్మం, దుష్ట శత్రు నిర్మూ

లనం. ఆ ధర్మాన్నే, నువ్విప్పుడు, నిర్వర్తించుకోవాలి; నీ జీవితానికి చరితార్థతను చేకూర్చుకోవాలి.

ఇంతకూ, ఇప్పుడు నీ సమక్షాన ఉన్నవా రందరూ, త్వరలో చావ వలసినవారే. వారిని సంహరించే విషయంలో, నువ్వు, నిమిత్తమాత్రుడవు. ఇదికూడా భగవన్నిర్ణయమే."

ఆ విధంగా ఉద్బోధించి, మోహపరవశుడై ఉన్న అర్జునునకు భగవ ద్విభూతిపట్ల అనుభవపూర్వకమైన విశ్వాసం కలిగించే నిమిత్తం, అతణ్ణి అంతవరకూ ఆవరించి ఉన్న మాయను, తద్వారా, తొలగించే ఉద్దేశంతో, ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తనదయిన విరాడ్రూపాన్ని అతనికి సాక్షాత్కరింప చేశాడు; దాన్ని దర్శించగల దివ్య చక్షువులను కూడా అతనికి ప్రసాదించాడు.

అలా దర్శనీయమయిన మహాద్రూపంలో, అర్జునునకు, చతుర్దశ భువనాలూ గోచరమయినై. చరాచర జగత్తంతా ద్యోతకమయింది. బ్రహ్మ రుద్రామరేంద్రులూ, దేవతలూ, మహర్షులూ, తక్షకాదులూ, ద్వాదశాదిత్యులూ, అష్టవసువులూ, మరుద్గణాలూ, గంధర్వ యక్ష రాక్షసాదులూ, సిద్ధులూ, సాధ్యులూ, చారణులూ, అలాగే అందరూ కనిపించారు.

ఆ దివ్యరూపం, వేయిమంది సూర్యుల కాంతితో ప్రకాశిస్తూఉంది. హార కేయూరా ద్యాభరణాలతో భాసిస్తూ ఉంది. ప్రచండమైన వివిధాయుధాలనూ ధరించి, అనేక ముఖాలతో నేత్రాలతో కరచరణాద్యవయవాలతో ఒప్పారుతూ ఉంది. భూనభోంతరాళాలను, అన్నిదిక్కులా, ఆవరించిఉంది.

ఘోరమైన ఆ విశ్వరూపుని ముఖ గహ్వరంలోకి ప్రవేశిస్తున్న ధార్తరాష్ట్రులూ, వారి అనుయాయులూ, భీష్మ ద్రోణ కర్ణాదులూ, ధృష్టద్యుమ్నాది వీరులూ, అలాగే అనేకమంది రాజన్యులూ, ఆ సమయంలో గోచరించారు. అనంతవదనాలతో, ఆ మూర్తి, కనిపించిన వారి నల్లా కబళిస్తూ ఉండటంకూడా అప్పుడు ద్యోతమయింది.

అదంతా చూసిన అర్జునుడు, ఆశ్చర్యచకితుడయినాడు. కలవర పడ్డాడు, కంపించి పోసాగాడు.

అలా కొన్ని క్షణాలు గడచిన తరువాత, అతడు, మనసును కొద్దిగా దిట్టపరచుకుని, శ్రీకృష్ణునకు నమస్కరించాడు. 'నీ ఉగ్రరూపాన్ని ఉపసంహరించుకోవలసింది; నన్ను అనుగ్రహించవలసింది' అని ఆయన్ని ప్రార్థించాడు; ఎంతగానో స్తుతించాడు.

ఆ విధంగా, అర్జునునకు తన విశ్వరూపాన్ని ప్రకటించి, అతని సంశయాలన్నింటినీ తొలగించి, మోహాన్ని విచ్ఛిన్నం చేసి, అతనికి ధైర్యం కలిగించి, శ్రీకృష్ణుడు, ఆపైన, అతణ్ణి, కర్తవ్యోన్ముఖుని చేయటం జరిగింది.

*187.* సైంధవుడు :

పద్మవ్యూహాన్ని నిర్మించటం, ఛేదించటం, అన్నవి, సామాన్యంగా, యోధు లందరికీ తెలియవు. మహాభారత యుద్ధంలో, కౌరవ పక్షాన ఉన్న ద్రోణాచార్యులవారు, ఆ వ్యూహ నిర్మాణం చేశారు.

పాండవులలో, ఆ వ్యూహ నిర్మాణ భేదన చాతుర్యం కలవాడు అర్జును డొక్కడే. ఆ శక్తి, యాదవ శ్రేష్ఠుడైన శ్రీకృష్ణునిలోనూ, ఆయన కుమారుడయిన ప్రద్యుమ్నునిలోనూ కూడా ఉంది.

ద్రోణాచార్యులవారు, పద్మవ్యూహం పన్నిన సమయంలో, కృష్ణార్జునులిద్దరూ ఆ రంగంలోలేరు; వేరొకచోట, సంశప్తకులతో పోట్లాడుతూ ఉన్నారు.

ద్రోణాచార్యుడు, పద్మవ్యూహాన్ని నిర్మించాడని గ్రహించగానే, యుధిష్ఠిరుడు భయపడిపోయినాడు. ఆ వ్యూహాన్ని, ఆ రోజున, ఛేదించలేని పక్షంలో, పాండవ వినాశనం తథ్యమని ఆయన భావించాడు. అందుకనే, అర్జునకుమారుడయిన అభిమన్యుని పిలిచి, ఆ వ్యూహవిషయం అతనికేమైనా తెలుసునేమో అని అడిగాడు.

అభిమన్యునకు, పద్మవ్యూహ నిర్మాణం పూర్తిగా తెలుసు. వ్యూహ భేదనం కూడా కొంతవరకు తెలుసు అంటే, వ్యూహాన్ని ఛేదించు కుంటూ పోవటమేగాని, తిరిగి, క్షేమంగా బయట పడే మార్గం తెలియ దన్న మాట. అప్పటికి అర్జును దతనికి అంతవరకే నేర్పటం జరిగింది. ఆ విష యాన్నే, అభిమన్యుడు, తన పెదతండ్రికి నివేదించుకున్నాడు

అది విన్న యుధిష్ఠిరునకు కొంత ధైర్యం కలిగింది. అది కారణం గానే, ఆయన, అభిమన్యుని ఉద్దేశించి, 'నాయనా! ఆ వ్యూహాన్ని ఛేదించు కుంటూ నువ్వు వెళ్ళవలసింది. మేమందరం నీకు అండగా, నీ వెనుకనే ఉంటాము. నీ కే విధమైన అపాయం కలుగకుండా చూస్తాము', అన్నాడు. భీమసేనుడు కూడా, అతనికి, అదేవిధంగా వాగ్దానం చేశాడు; ధైర్యం కలి గించాడు.

ఆ వెంటనే, అభిమన్యుడు, పద్మవ్యూహంలో ప్రవేశించాడు. యుధిష్ఠిరాదులు అతణ్ణి అనుసరించారు.

వ్యూహంలో ప్రవేశించిన అభిమన్యుడు, కౌరవసేన నంతనూ కలవరపరచాడు. దుశ్శాసన కుమారుని వధించాడు. ప్రళయకాల రుద్రుని మాదిరి వ్యవహరించసాగాడు. ఆ సమయంలో, అతని పురోగమనాన్ని అరి కట్టినవాడు సైంధవు డొక్కడే.

అది గ్రహించిన కురువీరులందరూ సిగ్గుపడ్డారు ఆ వెంటనే, చెల్లాచెదరై పోతున్న తమ సేనల నన్నిండినీ కూడగట్టుకున్నారు. ఒక్కు మ్మడిగా అభిమన్యుని మీదికి ఉరికారు. అందరూ కలిసి, ఏకాకిగా ఉన్న అతణ్ణి, అతికష్టంమీద, సంహరించ గలిగారు.

అభిమన్యుడు అలా దుర్మరణంపాలైనాడని విని, అర్జునుడు అమితంగా దుఃఖించాడు. అత డలా కూలిపోవటానికి మూలం, సైంధవుడు అతణ్ణి ఆ సమయంలో నిలువరించటమే ననుకున్నాడు. అది కారణంగానే, అతని పట్ల పగ వహించి, 'రేపు సూర్యుడు అస్తమించే లోపల సైంధవుని

సంహరించి తీరుతాను. అలా చేయలేని పక్షంలో అగ్ని ప్రవేశం చేస్తాను' అని శపథం చేశాడు

అర్జునుని శపథం విన్న సైంధవుడు అదలిపోయినాడు. అతనికి అమితమైన ప్రాణభీతి కలిగింది. అది కారణంగానే, అతడు, కౌరవ వీరు లను కలుసుకుని, తనను ప్రాణభిక్ష పెట్టవలసిందిగా ప్రార్థించాడు. తను, ఆ మరునాడు, అర్జునునిచేత సంహరింపబడకుండా చూడవలసిందని, వా రందరినీ ప్రతిమాలుకున్నాడు.

అది గ్రహించిన దుర్యోధనుడు, అతణ్ణి కలుసుకుని, అతని ప్రాణభీతిని తొలగించటానికి ఎంతగానో ప్రయత్నించాడు. ఆ మరునాడు జరిగే యుద్ధంలో, కౌరవ వీరు లందరూ అతనికి అండగా నిలబడి, అతను అర్జునుని కంట పడకుండా కాపాడుతారని వాగ్దానం చేశాడు. అంతేకాదు. 'రేపు నిన్ను రక్షించుకోవటం, అర్జునుడు అగ్నిప్రవేశం చేసేటట్టు చూడటం మా ధర్మం. ఆ ధర్మాన్ని మేము అక్షరాలా పాటించి తీరుతాము' అని కూడా అతనికి మాట యిచ్చారు.

ఆ మరునాడు, చాలావరకు, దుర్యోధనుడు కోరినట్టే జరిగింది. రణరంగంలోనే ఉన్న సైంధవుడు, ఆ రోజున, అర్జునునకు అందకుండా ఉండే ఏర్పాట్లన్నిటినీ దుర్యోధనుడు చేశాడు. సైంధవుని దిక్కుగా గమించే అర్జునుని, కర్ణ దుర్యోధనాదులు, అడుగడుగునా అడ్డుకుంటూనే వచ్చారు. సైంధవునకూ అర్జునునకూ మధ్య, తమ తమ సేనలతో నిలబడి ఉన్న మహారథు లెందరో, అర్జునుని పురోగమనాన్ని అరికట్టడానికి ప్రయత్నిస్తూనే ఉన్నారు. అయినా, అర్జునుడు, వారి నందరినీ తొలగించు కుంటూ, ముందుకు సాగిపోసాగాడు.

అంతలో, సూర్యాస్తమయ సమయం సమీపించింది. సూర్యుడు అస్తమించేలోపల, అర్జునుడు, తన సముఖాన ఉన్న వీరాధి వీరుల నందరినీ నిర్జించి, సైంధవుని చేరటం దుర్ఘటమనీ, అలా చేరి, సైంధవుని సంహరించ లేని పక్షంలో, అర్జునుడు, చేసిన శపథాన్ని అనుసరించి, అగ్ని ప్రవేశం

చేయవలసి ఉంటుందనీ, శ్రీకృష్ణుడు భావించాడు. అది కారణంగానే, ఆ పరిస్థితిని చక్కబరచే ఉద్దేశంతో, ఆయన, అర్జునుని ఉద్దేశించి ఇలా అన్నాడు.

"అర్జునా ! సైంధవు డిప్పుడు ఆరుగురు మహారథుల వెనుక దాక్కొని ఉన్నాడు. ఆ ఆరుగురినీ తొలగించనిదే, నీ కతడు కనిపించడు. మన మెంతగా ప్రయత్నించినా, సూర్యుడు అస్తమించే లోపల వారి నందరినీ తొలగించటం, అతణ్ణి సమీపించటం, అసంభవమని నాకు తోస్తోంది. అందుకనే, ఒక ఉపాయం ద్వారా అతణ్ణి వధించటం తప్పదని నేను నిర్ణయించుకున్నాను. ఇప్పుడు, తాత్కాలికంగా, సూర్యుడు మఱుగుపడేటట్టు చేయటం అది చూసిన సైంధవుడు కూడా, సూర్యుడు అస్తమించాడని భ్రమించేటట్టు చూడటం, నా వంతు. సూర్యు డస్తమించాడని నిరాశ చెందకుండా ఉండటం, ఆ సమయంలో, ఇంతవరకూ దాగిఉన్న సైంధవుడు, నిర్భయంగా తలయెత్తి రథంలో నిలబడగానే, నిస్సంకోచంగా అతణ్ణి వధించటం, నీ వంతు. ఈ ఏర్పాటుకు నువ్వు సమ్మతించి తీరాలి."

అది విన్న అర్జునుడు, అందుకు సమ్మతించక తప్పలేదు. ఆ వెంటనే, శ్రీకృష్ణుడు, తన యోగమాయా ప్రభావంద్వారా, సూర్యుని మఱుగుపరచే ఒక మబ్బుతెరను కల్పించాడు. ఆ మాయను గ్రహించరాని కౌరవవీరులు, సూర్యుడు, అస్తమించి ఉంటా డనుకున్నారు. అర్జునుడు, ఆ పైన, అగ్ని ప్రవేశం చేయటం తథ్య మనుకున్నారు; హర్షధ్వానాలు చేశారు.

అది గ్రహించిన సైంధవుడు, అర్జునుని చేతులో తప్పదనుకున్న చావు తప్పిపోయిం దనుకున్నాడు. మృత్యు ముఖంనుంచి ఆనాటికి బయట పడ్డట్టే అతడు భావించుకున్నాడు. తన అభిప్రాయాన్ని ధృవపరచుకునే నిమిత్తం, అతడు కూడా, తనవా రందరితోపాటు తలెత్తి, ఆకసం వంక చూడసాగాడు.

శ్రీకృష్ణుడు అది గ్రహించాడు. గ్రహించి, అర్జుననకు, అతణ్ణి చూపుతూ, వెంటనే అతణ్ణి వధించవలసిందనీ, చేసిన శపథాన్ని నిలుపుకోవలసిందనీ, అతణ్ణి ప్రోత్సహించాడు.

ఆ మరుక్షణంలోనే, అర్జునుడు, తన గాండీవానికి వజ్రాస్త్రాన్ని సంధించాడు. దాన్ని, సైంధవునిపైకి వదిలాడు. అది సూటిగాపోయి, అతని తలను నరికేసింది.

అదలా జరిగేలోపల, శ్రీకృష్ణుడు, అర్జునుని, ఉద్దేశించి ఇలా అన్నాడు :

'ధనంజయా! ఆ తల నేలమీద పడకుండా చూడవలసింది. అది ఎవరిద్వారా నేలమీద పడితే వారి తల నూరు వ్రక్కలై తీరుతుందని, అమోఘ వచనుడైన అతని తండ్రి, వృద్ధక్షత్రుడు పలికాడు.

ఇప్పుడా వృద్ధక్షత్రుడు, స్యమంతపంచకం వద్ద తపస్సు చేసుకుంటున్నాడు. అద్భుతకర్మలు చేయగల నీదివ్యాస్త్రాలద్వారా, నువ్విప్పుడు, ఆ శిరస్సు అతని ఒడిలో పడేటట్లు చేయాలి. అలా చేసిన పక్షంలోనే, నువ్వు. బ్రతికి బయట పడగలుగుతావు."

శ్రీకృష్ణుడు చెప్పినట్టుగానే అర్జునుడు చేశాడు. సైంధవుని తలను, మరికొన్ని దివ్యాస్త్రాలద్వారా పైకి పంపి, అవి, స్యమంత పంచకం వెలుపల సూర్యోపాసన చేసుకుంటున్న వృద్ధక్షత్రుని ఒళ్ళో పడేటట్లు చూశాడు. అదితెలియని వృద్ధక్షత్రుడు, సూర్యోపాసనానంతరం లేవబోతూ ఉండగా, మణిమయాంచితమైన కుండలాలతో ప్రకాశించే ఆ శిరస్సు, అతని ఒడి నుంచి క్రింద పడ్డది ఆ వెంటనే, అతని శిరస్సు, నూరు ముక్కలై పోయింది.

ఆ విధంగా, శ్రీకృష్ణుడు, అర్జునుడు అగ్నిప్రవేశం చేయకుండానూ, వృద్ధక్షత్రుని శాపానికి అర్జునుడు గురికాకుండానూ చూడటం, అభిమన్యుని దుర్మరణానికి మూలమై సైంధవుని వధించి, అర్జునుడు తన పగను సాధించుకునేటట్లు చేయటం, జరిగింది.

*188*. ఘటోత్కచుడు :

సైంధవ సంహారానంతరం, కురు పాండవ సేనలమధ్య తీవ్రతర

మైన పోరాటం జరిగింది. ఆ సమయంలో, రాధేయుని ధాటికి ఆగలేక, పాండవపక్షీయులందరూ ప్రాణభీతితో పారిపోసాగారు. అది గ్రహించిన యుధిష్ఠిరుడు, రాధేయుడలా మరికొంతసేపు రణరంగంలో విహరించిన పక్షంలో, కౌంతేయులుగాని, వారి పక్షీయులుగాని, బ్రతికి బయటపడటం జరుగదని, అర్జునునకు తెలుపుకున్నాడు. ఎలాగైనా, ఆ రోజున, కర్ణుని వధించితీరాలని ఆదేశించాడు.

ధర్మజుని ఆదేశాన్ని శిరసావహించిన ధనంజయుడు, తన రథాన్ని, రాధేయుని దిక్కుగా నడుపవలసిందని, తన సారథి అయిన శ్రీకృష్ణుని, కోరాడు. ఆనాటి పోరాటంలో, అటు కర్ణుడో, ఇటు అర్జునుడో, ఎవరో ఒకరు మాత్రమే సజీవులై ఉండాలన్న తన నిశ్చితాభిప్రాయాన్ని, ఆయనకు తెలుపుకున్నాడు.

శ్రీకృష్ణుడు, అతని పలుకులు సావధానంగా విన్నాడు. విని, ఆ పైన, అతనితో ఇలా అన్నాడు:

"అర్జునా! ఈ రోజున, కర్ణుడు, అతిమానుషమైన విక్రమంతో పోరాడుతున్నాడు. ఇప్పు డతణ్ణి ప్రతిఘటించగల శక్తి పీ అన్నదమ్ము లలో నీకూ, మిగిలిన మనవారిలో, ఘటోత్కచునకూ మాత్రమే ఉంది.

నువ్వు కర్ణునితో తలపడే సమయం ఇంకా రాలేదు. మహేంద్రుడు ప్రసాదించిన వైజయంతి అనే మహాశక్తి అతనివద్ద ఉన్నంతవరకూ, నువ్వు అతని ఎదుటకు పోవటం భావ్యం కాదు.

ఆ వైజయంతి వజ్రాయుధం వంటిది. దాన్ని ప్రతిఘటించ గల ఆయుధం మరొకటి లేదు. ఆ మహాశక్తిని నీ మీద ప్రయోగించి, నిన్ను నిర్జించటానికే అతడు నిశ్చయించుకున్నాడు. ఆ అవకాశం కోసమే అతడింతవరకు ఎదురుచూస్తూ ఉన్నాడు. ఇప్పుడు నువ్వు అతని కంట పడ్డ పక్షంలో, అతడు, దాన్ని నీ మీద ప్రయోగించి తీరుతాడు. అది కారణంగానే, ఇప్పుడు, అతణ్ణి ప్రతిఘటించే నిమిత్తం, బల పరాక్రమాలలో నీకు ఏ విధంగానూ తీసిపోనివాడూ, మాయా యుద్ధంలో అద్వితీయుడూ,

మీ పట్ల అత్యంతమైన భక్తి కలవాడూ అయిన ఘటోత్కచుని పంపటం సమంజసమని నేను భావిస్తున్నాను."

ఆ విధమైన శ్రీకృష్ణుని సూచన మీద, అర్జును డా వెంటనే ఘటోత్కచుని అక్కడకు రప్పించుకున్నాడు. ఆనాటి పరిస్థితి నంతనూ అతనికి విశదపరచుకున్నాడు. 'మహా రథుడైన సాత్యకి సహాయుడుగా, నువ్వీ రాత్రి, రాధేయునితో యుద్ధం చేయాలి' అని ఆదేశించాడు.

ఘటోత్కచుడు, తన పినతండ్రి డైన ఆదేశాన్ని శిరసా వహించాడు. ప్రసన్నతా చిహ్నమైన మందహాసంతో తన వంక చూస్తున్న శ్రీకృష్ణునకు నమస్కరించాడు. ఆ ఇద్దరి వద్దా సెలవు తీసుకున్నాడు; రణ రంగంలో ప్రవేశించాడు.

అలా రణరంగ ప్రవేశం చేసిన ఘటోత్కచునకూ కర్ణునకూ మధ్య, అప్పుడు, ఘోరమైన పోరు జరిగింది ఘటోత్కచుని మాయా బలం ముందు, కౌరవ సేనలు నిలబడలేకపోయినై. కౌరవపక్షంలోని మహావీరులే, అతని యుద్ధ కౌశలం చూసి, విస్మితులు కావటం, చకితులై పోవటం, ప్రాణ భీతినందటం. జరిగింది. ఆ సమయంలో, కర్ణ ఘటోత్కచు లిద్దరూ, ఒకరి కొకరు ఏమాత్రంగానూ తీసిపోకుండా పోరాడసాగారు.

అప్పుడు, ఘటోత్కచుడు, మాయా యుద్ధంలో తనకున్న ప్రావీణ్యత నంతనూ ప్రదర్శించాడు. అది చూసిన దుర్యోధనాదులు, అమితంగా అదలిపోయినారు. అది కారణంగానే, తనవా రందరూ ఆ రాక్షస ప్రముఖుని చేతులో నిర్మూలం కాకుండా చూసేనిమిత్తం, జటాసురపుత్రుడూ, పాండవ విరోధీ, అన్ని విధాలా ఘటోత్కచునకు సముడూ అయిన అలం బుసుని, దుర్యోధనుడు, అతనిపైకి పంపటం జరిగింది.

ఆ రాక్షస వీరు లిద్దరి మధ్యా, అప్పుడు జరిగిన తీవ్ర పోరాటంలో, అలంబుసుడు హతుడై పోయినాడు. ఘటోత్కచుడు, అతనిశిరాన్ని ఖండించి, దాన్ని, దుర్యోధనునిమీదకు విసరివేస్తూ, 'మహారాజా ! నీ అను

చరుడయిన యీ అలంబుసునకు పట్టినదుర్గతి, మరికొన్ని క్షణాల్లో, నీసహ చరుడయిన సూతపుత్రునకు కూడా సంభవించబోతోంది' అన్నాడు. ఆపైన వికటాట్టహాసం చేశాడు. అది గ్రహించిన దుర్యోధనుడు, ఆ రోజుతో, తన వా రందరి ఆయువూ తీరిపోయిందనే భావించాడు. అది కారణంగానే, అతడు వెంటనే ఘటోత్కచుని వధించని పక్షంలో, ఆ మరునాడు, తన పక్షాన పోరాడటానికి, వీరు డొక్కడూ మిగిలి ఉండడన్న తన దృఢాభిప్రాయాన్ని, కర్ణునకు తెలుపుకున్నాడు. ఎంతటి త్యాగానికి సిద్ధపడి అయినా, ఆరోజున అతణ్ణి సంహరించితీరవలసిందిగా ఉద్బోధించాడు.

దుర్యోధనుని దీనావస్థను గ్రహించిన రాధేయుడు, ఆ సమయంలో ఘటోత్కచుని సంహరించటం, కౌరవులను కాపాడటం, తన కర్తవ్య మనుకున్నాడు. ఆపత్సమయంలో, స్వప్రాణసంరక్షణార్థం, అంతకు మించి, తన ఆబాల్య విరోధి అయిన అర్జునుని హతమార్చేనిమిత్తం, అంత వరకూ దాచి ఉంచుకున్న వైజయంతిని ప్రయోగిస్తేనేగాని ఘటోత్కచుని అంతమొందించటం సాధ్యం కాదని నిర్ధారించుకున్నాడు. తన స్వామి అయిన దుర్యోధనునకు, తాత్కాలికంగా అయినా మనశ్శాంతిని కలిగించటానికీ, తనవా రయిన ధార్తరాష్ట్రులను విపత్సాగరం నుంచి ఒడ్డుకు చేర్చటానికీ, అనంతరకాలంలో తన ఆశయ సిద్ధికి తోడ్పడగలదనుకునే వైజయంతిని త్యాగం చేయటం, ఘనమైన విషయ మేమీ కాదని నిర్ణయించుకున్నాడు. ఆ నిర్ణయం ప్రకారమే, ఆ మహాశక్తిని ఘటోత్కచునిమీద ప్రయోగించాడు.

అతి భయంకరమూ, రౌద్రమూ, మృత్యుతుల్యమూ అయిన ఆ మహాశక్తిని చూడగానే, ఘటోత్కచుడు, గజగజలాడిపోయినాడు. తన శరీరాన్ని, ఒక మహాద్రి మాదిరి పెంచుకున్నాడు. ప్రాణభీతితో పరుగెత్త సాగాడు. అలా పరుగెడుతున్న మహాయోధుని తరుముకుంటూ వెళ్ళి, ఆ మహాశక్తి, అతని హృదయాన్ని చీల్చివేసింది. అది కారణంగానే, అతడు, లోకభీకరమైన కేక పెట్టి, కూలిపోవటం జరిగింది.

అలా కొండమాదిరి కూలిపోయిన ఘటోత్కచుని చూసి, భీమ సేనాదులు, అమితంగా దుఃఖించారు. కాని, శ్రీకృష్ణుడు మాత్రం, ఆనంద తాండవం చేయసాగాడు. అర్జునుని ఆలింగనం చేసుకుని, అతని వీపు చరుస్తూ, పదేపదే సింహనాదం చేయసాగాడు.

పాండు పుత్రులు పరితపిస్తున్న సమయంలో, శ్రీకృష్ణుడు, అలా చిందులు త్రొక్కుతూ ఉండటం, అర్జునునకు ఆశ్చర్యం కలిగించింది. అందుకనే, అతడు, ఆ ఆనందానికి కారణ మేమిటో తెలుప వలసిందిగా ఆయన్ని కోరాడు. అతనికి సమాధానంగా, శ్రీకృష్ణుడు యిలా అన్నాడు :

"అర్జునా ! నీకు మృత్యువు కాదగిన మహాశక్తి, నేటితో అంత రించిపోయింది. దానితోపాటు, కర్ణునిదయిన ఆయుర్భాగ్యం కూడా తీరి పోయిందనే చెప్పాలి.

నీ కోసం, ఇంతకుముందు, మహేంద్రు డతణ్ణి కవచహీనుని గానూ, కుండల హీనునిగానూ చేశాడు. దాంతో అతనిశక్తి సగంవరకు క్షీణించిపోయింది. ఇప్పు డీ ఘటోత్కచుడు మరణించి, అతణ్ణి పూర్తిగా శక్తిహీనుణ్ణి చేయటం, ఒక జీవచ్ఛవంగా మార్చటం సంభవించింది. నువ్విప్పుడు అజేయుడవయినావు.

కవచ కుండలాలతో ఉన్న రాధేయుడు, సమరరంగంలో, కుమారస్వామివంటివాడు. అతణ్ణి జయించటం, కుబేర వరుణ యమాదుల కయినా అసాధ్యమే. అంతేకాదు. గాండీవం ధరించిన నువ్వూ, చక్రధారి నయిన నేనూ, ఇద్దరం కలిసి కూడా, అతణ్ణి జయించలేకపోయేవాళ్ళం. కాని, ఇప్పు డా స్థితి అంతా మారిపోయింది. నీకు మరణం తప్పిపోయింది. పాండుపుత్రుల విజయం తథ్యమయింది. అదే నా ఆనందానికి మూలం."

ఆ పలుకులు విన్న అర్జునుడు, శ్రీకృష్ణునకు తనపట్ల ఉన్న ఆదరాభిమానాలు ఎంత ఘనమైనవో, మరొకమారు అర్థం చేసుకున్నాడు. అది కారణంగానే, తనలో తాను సంతోషించాడు. ఆయనపట తన కృతజ్ఞ

తను తెలుపుకుంటూ, మానసికంగా, పదేపదే ప్రణామాలర్పించుకున్నాడు.

## 189. పరీక్షితుని జననం :

అనంతరం జరిగిన మహాసంగ్రామంలో కౌరవవీరు లందరూ సంహరింప బడటం, దుర్యోధనుడొక్కడే మిగిలి ఉండటం, ఆ సమయంలో అతనికి కొంతదిగా అయినా మనశ్శాంతి కలిగించే ఉద్దేశంతో, అశ్వత్థామ, పాండవవంశ నిర్మూలనకుగాను పాండవ పత్నుల గర్భాలమీదకు ఒక అస్త్రాన్ని వదలటం, అది కారణంగా ఒక మృతశిశువు ఉత్తరకు జనించటం జరిగింది. ఆ సందర్భంలో, సుభద్ర, శ్రీకృష్ణుని ఉద్దేశించి, దీనాతిదీనంగా యిలా విన్నవించుకుంది:

"అన్నా ! ఈ పసికూన, మా అందరిప్రాణాలకూ ప్రాణంవంటి వాడు. ఇతని మీదనే మా బ్రతుకులన్నీ ఆధారపడి ఉన్నై.

పాండవ పత్నుల గర్భాలమీదకు, అశ్వత్థామ తన అస్త్రాన్ని వదలినప్పుడు, అది ఉత్తరాగర్భస్థ శిశువును పీడిస్తున్నదని నువ్వుగ్రహించినప్పుడు, 'పాండవ వంశం నిర్మూలం కావటానికి వీలులేదు' అన్నావు. 'పార్థుని పౌత్రునకు నేను ప్రాణదానం చేసి తీరుతాను' అనికూడా శపథం చేశావు. నీ పలుకులు నిలుపుకోవలసిన సమయం ఇప్పు డాసన్నమయింది.

కృష్ణా ! నీ ప్రభావం నాకు తెలుసు. నువ్వు తలుచుకున్న పక్షంలో, ఈ ఒక్క శిశువునేకాదు, ముల్లోకాలలోనూ ఇంతకు ముందు మరణించిన ప్రాణికోటి నంతనూ బ్రతికించగలవు. అది కారణంగానే, నా మనుమనికి ప్రాణదానం చేయవలసిందనీ, నీ ప్రేమకు పాత్రులైన పాండుపుత్రులకు పరితాపం కలుగకుండా చూడవలసిందనీ ప్రార్థేయపడుతున్నాను."

సుభద్రదైన హృదయ వేదనను, శ్రీకృష్ణుడుగ్రహించాడు. ఆమె, అలా దీనంగా బ్రతిమాలటం, ఆయన భరించలేకపోయినాడు. అది కారణంగానే, ఆయనకు, అంతులేని దుఃఖం కలిగింది. ఆ వెంటనే ఆయన

